# కందుకూరి వీరేశలింగకృత గ్రంథములు.

## నాలుగవ సంపుటము

( వచన ప్రబంధములు : పద్యకావ్యములు )



ప్రకాశకులు:

హితకారిణీసమాజము,

రాజమండ్రి.

వెల రు. 6—0—0.

ఈసంపుటంలోఉన్న పదెనిమిది పద్యమూర్తుల్లోనూ, నాలుగు పెద్దకావ్యాలు, ఒకటి ప్రబంధానుకరణం, మూడు ఆంగ్లకావ్యానువాదాలు, అయిదు హేళనలు, రెండు మతప్రమేయాలు, రెండు మహావ్యక్తి ప్రశంసలు, ఒకటి నీతిబోధ. పెద్ద కావ్యాలు నాలుగింటిలో మొదటిది 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచననైషధము.' ఇది మూడు ఆశ్వాసాలు. పెదవీ పెదవీ తగలకుండా (అనగా—ప, ఫ, బ, భ, మ అనే అక్షరాలు వాడకుండా), ఎక్కడా గద్యం రానియ్యకుండా, సంస్కృతపదం దొర్ల నియ్యకుండా అందరూ ఎరుగున్న నలచరిత్ర లలితంగా సుగమంగా ధారాళంగా ఇందులో చెప్పబడింది. దమయంతి అనే మాటలో 'మ' ఉంది గనక, ఋతు పర్ణుడులో 'ప' ఉంది గనక ఆశబ్దాలు లేకుండా నలకథ నడిచిపోవడం చూస్తే తగ్గదే కదా! రెండోకావ్యం 'రసికజనమనోరంజనము' ఇది నాలుగాశ్వాసములు. ఇది మూడుమూర్తులా ప్రబంధము—'ప్రబంధరత్నము' ఆదికాలంనించీ ఆంధ్రంలో ఉండే మహాప్రబంధాల మేలుజాడల మేళగింపు ఇందులో స్ఫురిస్తుంది దీనియందే మరో విశిష్టత ఏమంటే, ఇది కేవలం అచ్చతెలుగేగాని, సంస్కృతభాషా పటా టోపంకాదు. సంపర్కంగాని స్పర్శగాని ఇందులో చూడం. మూడోది 'శుద్ధాంధ్ర భారత సంగ్రహము' అచ్చతెనుగులో మంచిసిక్కప్రాయంగా పద్యరూపంలో ప్రసంగం నడిచి మహాభారతకథ పూర్తిగా మూడాశ్వాసాలలో ముగియడమేకాదు, ఆంధ్రమహాభారతంలోలాగే అపరూపఛందస్సులూ చివరకి ముద్రాదిక్యాలూ కూడా ఇందులో పనిచేశాయి. నాలుగోది 'శుద్ధాంధ్రోత్తరరామాయణము' ఇది ఒకే ఆశ్వా సము, అదేనా అసంపూర్ణం.

మొత్తంమీద నూట పదిహేడు గద్యపద్యాలు గల ఏకాశ్వాసప్రబంధము, 'అభాగ్యోపాఖ్యానము' ఇది సంస్కృతసమాసభూయిష్ఠమై, పదప్రయోగంలోనూ వృత్తగమనంలోనూ పూర్వప్రబంధస్మారకమై, ఆంధ్రప్రబంధసామాన్యోపమానా లకి కేవలం విడ్డోడుగాఉండే ఉపమానాలతో కూడినదై తద్వారా హాస్యప్రధానమై ఒప్పే పద్యరచన.

'పథికవిలాసము' గోల్డ్‌స్మిత్ అనే ఆంగ్లకవియొక్క ట్రావెలర్ అనే కావ్యానికి అనువాదం, యూరప్‌లోని వేర్వేరు ప్రాంతాల స్థితిగతులు అందులో వర్ణింపబడ్డాయి. అనువాదం ఎంతో ప్రౌఢంగా ఉన్నది 'జాన్‌గిల్పిన్' కౌపర్ అనే ఆంగ్లకవి కావ్యానికి పరివర్తనం. ఇది హాస్యప్రధానం. దీనిలోరీతి సుగమం. 'కామెడీ ఆఫ్ ఎర్రర్సు' అనేది షేక్స్పియర్ నాటకానికి ద్విపదరూపంలో అను

సరణం. ఇది రెండో అంక ప్రారంభం ఆగిపోయింది. ఆంగ్లవచనానికి మిక్కిలి చేరువైన బ్లాంక్‌వర్సులో ఆనాటకం పుట్టి ఉండడంవల్ల, తెలుగు వచనానికి మిక్కిలి చేరువుగా ఉండే ద్విపదలోకి దాన్ని దింపడం కర్తవ్యం అని కర్త ఊహించి ఉండవచ్చును. ఈనాటకమూ, మర్చెంట్ ఆఫ్ వెనిస్ అనే నాటకమూ, విక్టోరియారాణి చరిత్రా—ఇవి కర్తకు చాలా ఇష్టం. ఈవిషయాల్ని ఆయన రెండు, మూడు విధాల రూపించడమే అందుకు నిదర్శనం.

తక్కిన పద్యరచనలలో అయిదు హేళనలు. 'సరస్వతీ నారద విలాపము' లో కవులంతా తనకి అలంకారాలు చేయించాం అంటూ మొదలెట్టి తనని సకలహింసా పెడుతున్నారని సరస్వతి అడివిలోకివెళ్ళి అరణ్యరోదనం చేస్తూంటే నారదుడు గానం అంతా వేశ్యల పాలైందని విచారిస్తూ అక్కడికే వెళ్ళి ద్వైవాద్వా ఆవిణ్ణి కలుసుగుని తనెంత దుఃఖంలో ఉన్నా ఆవిడ తనతల్లి గనక ఆవిణ్ణి ఎత్తుగుని అడివి దాటిస్తానంటాడు. 'శ్రీపునర్వివాహ సభానాటకము' లో వీరభద్రుడు గారు పెద్దల్ని సభకి రప్పించే నిమిత్తం స్నేహితుడితో ప్రసంగిస్తాడు. 'వీర' పదం పేరులో ఉన్న ఆపాత్ర, కర్తే: చివరకు ఇద్దరూ కలిసి ఒక కీర్తనలో ఈశ్వర ప్రార్థన చేస్తారు. 'స్త్రీవిద్య' అనే పద్య సంపుటి ఏమిటంటే, స్త్రీవిద్య కూడదనే వారు పద్యరూపంలో వాదనచెయ్యగా, గర్భసీసాలలోనూ బంధకందాలలోనూ వ్యవహరిస్తూ ప్రమాణంకూడా చూపించి స్త్రీవిద్య శాస్త్రసమ్మతం అని 'గద్య తిక్కన' తక్షణం పంపిన సమాధానం: వితంతువివాహాలు జరిగిపోయి, సంఘంలో వితంతువులు దొరక్కుండా పోతే తమరికి చాలా విషయాల్లో తంతునడవక బాధ కలుగుతుంది గదా అని వాపోయేవాళ్ళ వేసబబులు 'కులాచారపూర్వనాగరిక పంచరత్నములు' అనే పద్యసంపుటిలో ఉన్నాయి. 'హితబోధ' అనేది పద్య త్రయం. విమర్శకి ఆగలేక, కాలులు ప్రయోగిస్తూ, చాలామందిచేత పొగిడించు కుంటే మాత్రం ఎవడేనా కవి కాగలడా? లక్షమంది పొగిడినా శునకం సింహం కాగలదా? అని దానిలో బోధ. వీరేశలింగ రచనల్లో ఒకే ఒక విమర్శ ఉండడం నించి ఇది ఎవర్ని ఉద్దేశించి పుట్టిందో తెలుస్తూనే ఉంది.

'చెన్నపురి బ్రహ్మోపాసనమందిర ప్రతిష్ఠాపనము' అనేది బ్రహ్మసమాజ మతస్థాపక పోషక సంస్కర్తల ప్రశంస. తమరి పత్రికని వర్ధిల్లచెయ్యడానికి సర్వరక్షకుణ్ణి వేడుకుంటూ రచించుచున్న పద్యావళి 'దైవప్రార్థన' కర్తకి మిక్కిలి ఇష్టవిషయమైన 'విక్టోరియారాణి' గురించిన మెప్పు—'శ్రీవిక్టోరియాజూబిలీ నవ

రత్నములు.' అప్పట్లో హిందూదేశబంధువైన రిపన్‌ప్రభువు గురించిన పొగడ్త—'శ్రీ రిపన్‌ప్రభు స్వాగతము' అందులో కర్త రిపన్‌నీ ఆయన్ని పంపినవారినీకూడా కీర్తన చేశారు. దేవుడు-తనవారు-మంచి బాలుడు-విద్య-అడకువ-గర్వము-తృప్తి-ధైర్యము-సత్యము-జీవహింస-సర్వజనసమాదరము-పాటుపడుట-శరీరారోగ్యము-స్వతంత్రజీవనము-ధనము-ముఖస్తుతి-పనిబనుచుట-చౌర్యము - పరోపకారము—వివిధ ధర్మములు-అనే ఉపశీర్షికల క్రింద నూఱు గీతాలలో ప్రకాశిస్తూ బాల కంఠాల్లో మెరసిపోవాలని వీక్షిస్తూండే రచన 'నీతిదీపిక.'

రాజమంద్రి,
25-6-1950.

ఖమిడిపాటి కామేశ్వరరావు.

# విషయసూచిక

కీర్తిశేషులు కందుకూరి వీరేశలింగం పంతులుగారు



కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు

శ్రీ

# వివేకచంద్రిక

అను

# రాజశేఖరచరిత్రము

---

## మొదటి ప్రకరణము.

ధవళగిరి - దేవాలయవర్ణనము - గోదావరియొడ్డున నున్న ధర్మశాల మీఁద ప్రాతఃకాలమున రాజశేఖరుఁడుగారు వచ్చి కూర్చుండుట - అప్పు డచ్చటికి వచ్చిన సిద్ధాంతి మొదలగువారి స్తుతివచనములు - అందఱును గలిసి రామపాదములయొద్దకు బైరాగిని చూడఁబోవుట.

శ్రీ నాసికాత్ర్యంబకముకడ కడుదూరమున నెక్కడనో పశ్చిమమున నొక్కయున్నతగోత్రమున జననమొంది ఊర్మికాకంకణాదుల మెఱుంగులు తుఱంగలింపఁ దనజననమునకు స్థానమైన భూభృద్వర పురోభాగముననే పల్లములంబడి జాఱుచు లేచుచుఁ గొంతకాలముండి యక్కడనుండి మెల్లమెల్లగా ముందుముందుకు ప్రాఁకనేర్చి యెల్లవారల చూడ్కులకు వేడ్కలు నింపుచు, సిదప నవ్యక్తమధురస్వరంబులతో ముద్దులు గులుకు శరవేగమునఁ బరుగిడుచు, అపిమ్మట ఘనతరుల చెంతఁజేరి తల్లివేళ్ళనువిడిచి తక్కినవేళ్ళనంటుచు బాఱి జమ్ములోనడఁగి దాఁగుడుమూఁత లాడుచు, వెలువడి విదర్భాదిదేశములగుండఁ బ్రయాణములుచేసి త్రోవపొడుగునను వచ్చి పుచ్చుకొనని వారికి ప్రాకారము స్నానపానంబులకు వలయునంత నిర్మలజలంబొసంగు స్తంభమొకటి యున్నది. మందటి నానంద మొందించుగంటలు గాలికిఁగదలుచు సదా శాఖావ్యలకును ఫలవృక్షములకున్ పులను దనుపుచుండును. ఆ స్తంభమునకు మొదట

చుచు తన చల్లదనము వ్యాపించినంతవఱకు నిరుపార్శ్వములందు భూమి నంతను బచ్చని లేఁబచ్చికతో నలంకరించి పశుగణంబులకు కాహారంబు కల్పించుచు, తనరాక విని దూరమునుండి బయలుదేఱి యడవిపండ్లను నెమలికన్నులను వహించి పొంగి నానాముఖములఁ దన్నుఁ గానవచ్చు వరద, మంజీర, పిన్నగంగ మొదలగువారి నాదరించి లోఁగొనుచు, అంత కంతకుఁ దనగంభీరత గానుపింప నాథుని వెదకికొనుచు వచ్చివచ్చి, యే గిరిని దూరమునుండి విలోకించి గోదావరి రసోత్తరంగముగా ఘోషించుచు పాదమునంబడి శిఖరంబున నధివసించు జనార్దనస్వామి దర్శనము చేసికొని తోడనే యచ్చటనుండి తనశాఖారూపములయిన రెండుచేతులనుజాచి సరసతమిాఱ నాథునింగలియు భాగ్యము గాంచెనో యాధవళగిరి, యాంధ్రదేశమున కలంకారభూతమయి రాజమహేంద్రవరపుర సమీపమున మిక్కిలి వన్నెకెక్కి యుండెను.

ఆపర్వత మంతయున్నతమయినది కాకపోయినను, తెల్లనిపిండిరాళ్ళతో నిండి యుండుటచేఁ జూచుట కెంతేని వింతగా మాత్రముండును; ఆరాళ్లనుబట్టియే దానికి ధవళగిరియను నామము కలిగియుండును. దక్షిణపువైపునఁ గ్రిందినుండి పర్వతాగ్రమువఱకును నల్లరాళ్లతోఁ జక్కనిసోపానములు కట్టబడియున్నవి. ఆసోపానముల కిరుప్రక్కలను కొండపొడుగున నర్చకులయుఁ దదితరులగు వైష్ణవస్వాములయు గృహములు చాలుగానుండి కన్నులపండువు చేయుచుండును. ఆసోపానముల వెంబడిని పైకిఁ జనినచో గొండమీఁద నల్లరాళ్లతోఁ గట్టఁబడిన సుందరమైన చిన్నదేవాలయమొక్కటి కానఁబడును. దానిచుట్టును ...వెడెత్తు ప్రాకారము మూఁడుప్రక్కలను బలిసి... ...ను బదులుగా పర్వతశృం...కయుంప వానిని మించి

యాలయశిఖరమును నిక్కి చూచుచుండును. ప్రాకారములోపల నె
యుత్తరమున నొక చిన్నగుహ కలదు. అందులోఁ గూర్చుండి పాండ
వులు పూర్వమరణ్యవాసము చేయునప్పుడు తపస్సు చేసిరని పెద్దలు
చెప్పుదురు. అందులో నప్పుడు చిన్న రాతివిగ్రహ మొక్కటి యుండెను.
సంవత్సరము పొడుగునను పూజాపురస్కారములు లేక బూజుపట్టియున్న
యా దేవర నుత్సవదినములలో నర్చకుండొకఁడు పైకిఁ బులికాపుచేసి,
ఆ స్వామి సన్నిధానమున దీపము నొకదానిని వెలిగించి గుహాముఖంబునఁ
దాను నిలుచుండి పల్లెలనుండి యాత్రార్థమువచ్చిన మూకలవలనం తల
కొకడబ్బునంతునఁ బుచ్చుకొని లోపలికిం గొనిపోయి దేవతాదర్శనము
చేయించి వారిపెద్దలు ధన్యులయిరని చెప్పి పంపుచుండును. జనార్దన
స్వామి కళ్యాణ దినములు నాలుగును వెళ్ళినతోడనే యెప్పటియట్ల
స్వామిరథము యొక్కపగ్గముల నందుంచి వాని కాచిన్నదేవరను గావలి
యుంచి జీతబత్తెములు లేకపోయినను రాత్రిందివములు కాలుగదలపక
స్థిరవృత్తితోఁ గాచుచుండు నాచిన్నదేవరయెడంగల విశ్వాసముచేత
పూజారులు మఱుచటిసంవత్సర యాత్రలపని మఱలవచ్చువఱకును
ఆగుహాప్రక్క చూడనక్కఱ లేక నిర్విచారముగా నుందురు. ఈప్రకా
రముగ మనుష్యులు భక్తిహీనులయి దేవతాసందర్శనము చేసికొనపోయి
నను పర్వతమును కనిపెట్టుకొనియున్న చిన్న చతుష్పాద జంతువులు
మాత్రము మిక్కిలి భక్తిగలవై నిత్యము నాస్వామిని సందర్శించు
కొనుచు ఉత్సవదినములలో మనుష్యులువచ్చి తమ్ముఁ దఱిమివేయునం
తటిపాపముం గట్టుకొన్నదాఁక రాత్రులు దేవతాసన్నిధానమున గుహాలో
వట్టిభూతలముననే శయనించుచుండును. తూర్పువయిపునఁ బ్రాకారము
లోనే జనార్దనస్వామి కెదురుగా గొప్పధ్వజస్తంభమొకటి యున్నది.
దానిశిఖరమున నున్న చిఱుగంటలు గాలికిఁగదలుచు సదా శ్రావ్య
మయిననాదముతోఁ జెవులను దనుపుచుండును. ఆ స్తంభమునకు మొదట

నాంజనేయ విగ్రహ మొకటి చేతులు జోడించుకొని స్వామి కభిముఖమయి నిలిచి యుండును. ఈశిలావిగ్రహమునకును ధ్వజస్తంభమునకును ఉత్తరముగాఁ గళ్యాణమంటప మొకటియుండెను. స్వామి కళ్యాణదినములలో నుత్సవవిగ్రహములు నందు వేంచేయింపఁజేసి యథావిధిగా వివాహతంత్రమునంతయు మహావైభవముతో నడిపింతురు.

ప్రతిమాసమును రెండుపక్షములయందును ముఖమంటపము మీఁద ఏకాదశినాఁడురాత్రి హరిభజనము జరుగుచుండును. హరిభక్తులు తులసిపూసలతావళములను ధరించుకొని ద్వాదశోర్ధ్వపుండ్రములను స్ఫుటముగాఁ బెట్టుకొని కరతాళములును మృదంగములును మ్రోగుచుండఁగాఁ దంబురలు మీటులు, బిగ్గఱగాఁ దమ యావచ్ఛక్తిని "నవనీతచోరా" "గోపికాజారా" "రాధికాలోలా" "గోపాలబాలా" మొదలగు నామములచే నిష్టదేవతలను సంబోధించుచు మధ్యమధ్య గొంతుకలు బొంగుపోయినప్పుడు మిరియములను బెల్లపుముక్కలను నములుచు కృష్ణలీలలను పాడుచుందురు. తలలు త్రిప్పుచు భక్తులు తమ సత్తువంతయుఁ జూపి చేతికొలఁదిని వాయించుటచే నొకానొకప్పుడు మద్దెలలును తాళములును పగిలిపోవుటయు సంభవించుచుండును. దేవతావేశముచేత తఱుచుగా భక్తులలో నొకడిద్దఱు దేహములు పరవశ మయి రెండుమూడు నిముషములవఱకు వెనుకకు స్తంభముమీఁది కొఱగుచుండుటయుఁ గలదు. ఇట్టి భక్తిమార్గమును బొత్తిగా గురెఱుఁగని యన్యదేశీయులకు మాత్రము వారి యుప్పాటిచేష్టలు పిచ్చిచేష్టలవలెఁ గనపడునుగాని, వేడుకచూడ వచ్చినజనులు వారెంతవికృతముగా కేకలువేయుచు భజనచేయుదురో యంత పరమభాగవతోత్తము లని తలఁతురు.

కొంచెము శ్రమపడి యెవ్వరైన మధ్యాహ్న వేళ నొక్కసారి కొండమీఁది కెక్కి నలుఁగడలఁ జూడ్కి నిగిడించినచో, పన్నెవన్నెల

పిల్లలు చెంగుచెంగునఁ దుముకుచుఁ దుముకులాడుచుండఁ గొండ పాదుగునను ముంగాళ్ళు మీఁదికెత్తి పొదలపయి యాకులను మేయు మేఁకలును, పూర్వపక్షిణములఁ గుప్ప వోసినట్లున్న తాటాకుల యిండ్లనడుమ వానిని వెక్కిరించున ట్లక్కడక్కడ నెత్తుగానొక్కొక్క పెంపుటిల్లును ఉత్తరమున మంచెలపైనుండి పొలముకాపులు కో యని కూఁత లిడుచు నొడిసెలలు ద్రిప్పుచు బెదరింపఁ జేరువ తోపులలో నుండి వెలువడి మధురరుతములు చేయుచు ఆకాశమున కెగయుచు సందయినప్పుడు కంకులనువిఱుచుకొని పఱచి పలువిధములయిన పక్షులు చెట్లకొమ్మలమీఁదఁ బెట్టుకొని తినుచుండ ముచ్చటగా నుండుపలువిధములపచ్చనిపయిరులును, ఆపయిని వృక్షములమీఁదను గూర్చుండి కర్ణరసాయనముగాఁ బిల్లనగ్రోవిని మోవినిబూని పాడెడి గోపబాలకుల గానములకు హృదయములు కరఁగి మేపులు చాలించి క్రేపులతోఁ గూడఁ జెవులు నిక్కించి యెత్తులుచాచి యాలింపుచు నడుమనడుమ గడ్డిపఱకలు కొఱుకుచు బయిళ్ళయందు నిలుచున్న పశుగణములును, పడమటను నీలములవలెనున్న తేఁటనీటిపై సూర్య కిరణములు పడి యెల్లెడలను వజ్రపుతళుకులను బుట్టింపఁ బలుతెఱం గుల జలవిహంగంబులు పుట్టచెండ్లవలె మీఁదఁ బట్టుకొనుటకయి నీటం బడుచు లేచుచుఁ బ్రవాహంబుతోడం బఱచుచుండ నఖండ గౌతమియు నేత్రోత్సవము చేయుచుండును.

ఆ పర్వతపాదమునకు సమీపమున గోదావరియొడ్డుననల్లరాతి బండమీఁదఁ జక్కఁగా మలఁచిన రామపాదములు వెలసి యున్నవి. శ్రీరాములవారు పూర్వకాలమున సీతాలక్ష్మణులతోడఁ గూడఁ బర్ణ శాలకుఁ బోవుచు త్రోవలో ఈ పర్వతసమీపమున నడచిననాటి పాదములచిహ్నాలే యవి యని యెల్లవారును నమ్ముదురు. కాఁబట్టి

యీ రామపాదములను సందర్శింపవలెనను నభిలాషతో దూరదేశముల నుండి సహితము యాత్రికులు వచ్చి రామపాదక్షేత్రమున నఖండ గౌతమీస్నానము చేసికొని, కొండమీఁది యొక్క శ్రీజనార్దనస్వామి వారిదర్శనము చేసికొని, స్వశక్త్యనుసారముగా దక్షిణతాంబూలము లను సమర్పించి కలిగినవారైన స్వామికి భోగముసహితము చేయించి మరలి పోవుచుందురు. అది దివ్యక్షేత్రమగుటచేత జాతిభేదము లేక యెల్లవారును పులిహోరయు దధ్యోదనము మొదలుగాఁ గల స్వామిప్రసాదమును స్వీకరించి కన్నుల కద్దుకొని యున్నంతవఱకు మ్రిం గించి చేతుల నంటుకొన్నదానిని కడుగుకొన్న నపచారమగునని గనుక గరిటెలములు పయికెత్తి చేతుల కంటినంతవఱకు దేవాలయపు స్తంభ ములకును గోడలకును నగ్గము వేయుదురు. కాక తాంబూలముతోఁ దమమీఁది జేతులకును బట్టలకును మఱకలు పట్టుకొనుచుందురు.

ఈకొండకు దక్షిణమునను తూర్పునను కొంతదూరమువఱకు గ్రామము వ్యాపించి యున్నది. పర్వతముపేరే పూర్వము గ్రామ మునకుం గూడఁ గలిగియుండెను. కాని యిప్పుడిప్పుడు గ్రామమును ధవళేశ్వరమని వ్యవహరించుచున్నారు. కొండమీఁదినుండి సోపాన ములు దిగివచ్చినతోడనే రాజవీథియొక్క యావలిప్రక్కను శ్రీఅగ స్త్యేశ్వరస్వామివారి యాలయ మొక్కటి లోచనగోచరం బగును. తొల్లి వింధ్యపర్వతముయొక్క గర్వము నణఁచి దక్షిణాభిముఖుఁడయి చనుచు అగస్త్యుఁ డాస్వామిని అచట ప్రతిష్ఠచేసెనని స్థలపురాణము చెప్పుచున్నది. ఈ దేవాలయమునకును పర్వతమునకును మధ్యను తూర్పునుండి పడమటకు గోదావరివఱకును విశాలమయిన రాజవీథి యొకటి గలదు. ఆవీథిచివరను నల్లరాళ్ళతో నీటివఱకును సోపాన ములు కట్టఁబడి యున్నవి. సోపానములకు సమీపమున వీథికిఁ

తూర్పుప్రక్కను "ధర్మచావడి" అని యొకటి యుండెను. అది పరదేశ బ్రాహ్మణులును మార్గస్థులును రాత్రులు పరుండుటకై మొట్టమొదట కట్టఁబడినది కాని, ఆకాలమం దది యిబుసు పోవుటకై గ్రామము లోని పెద్దమనుష్యులు ప్రతిదినమును ఉదయాస్తమయములయందు ప్రోగై యిష్టకథాగోష్ఠిం గొంతప్రొద్దుపుచ్చి పోవుచుండుటకుమాత్రము వినియోగపడుచుండెను.

ఒకానొకదినమున సూర్యుఁ డుదయించి ప్రాచీముఖంబునఁ గుంకుమబొట్టు నందంబు వహించి వృక్షాగ్రములను బంగారునీరు పూసినట్టు ప్రకాశింపఁజేయుచుండెను; చెట్లమీఁది గూళ్ళనుండి కలకల ధ్వనులతో వెలువడి పక్షులు నానాముఖముల ఎరకయి వెడలు చుండెను; పసులకాపరిబాలురు చలుదులు మూటగట్టుకొని పశువుల మందలను దోలుకొని పచ్చికపట్లు కరుగుచుండ, వెనుక "వెల్లావు కడి నాది" "దోరగేదె కడి నాది" యని గంపలు చేతఁబట్టుకొని, పడుచు లొండొరుల మీఁతే పరుగులిడుచుండిరి. కాపులు ములుకోలలు బుజములమీఁదఁ బెట్టుకొని, కోడెలను దోలుకొని తమతమ పొల ములకుం బోవుచుండిరి; అప్పుడు కాయశరీరముగల యొక పెద్దమను ష్యుఁడు జందెము పేరుగా వేసికొని యెడమచేతిలో నిత్తడిచెంబు నొక దానిం బట్టుకొని, గోదావరిలోఁ గాళ్ళును చేతులును గడుగుకొని, ఒడ్డునకు వచ్చి పుక్కిలించివైచి యజ్ఞోపవీతమును సవ్యముగా వేసికొని వచ్చి, ధర్మశాలమీఁద నొడ్డున గూర్చుండి, వచ్చునప్పుడు చెంబులో వేసి తెచ్చుకొన్న తుమ్మపుడకతో దంతధావనము చేసికొనుచుండెను. ఆయనకు వయస్సు నలువదిసంవత్సరము లుండును; మొగముమీఁద స్ఫోటకపుమచ్చలే లేకపోయెనేని, మొగము సుందరమయిన దనుటకు సందేహింప నక్కఱయుండదు; అట్లని, యీముఖ మాయనను నిత్య

మును దర్శింపవచ్చు; ప్రవర్తకలస్తోత్రములను మాత్ర మెప్పుడును ఖాత్రము కాకపోలేదు; శరీరచ్ఛాయ తెల్లనిది; విగ్రహము కొంచెము స్థూలముగాను పొట్టిగాను ఉండును; నుదురు విశాలముగా చూచువారి కాతఁడు పండితుఁ డని తోఁపఁజేయుచున్నది; అప్పుడు కట్టుకొన్నది గోరంచు నీరుకావి గోవణి; సరిగంచుల చలువ వస్త్ర మొకటి శిరస్సునకు వదులుగా చుట్టఁబడి కొంగు కొంత క్రేలాడ వేయఁబడి యున్నది; చెవుల నున్న గవలయుంగరములును, కర్మిష్ఠుఁ డనుటకు సాక్ష్య మిచ్చుచున్న కుడిచేతి యనామికయందలి బంగారపు దర్భముడి యుంగరమును తర్జనియందలి వెండిబటువులు రెండును దప్ప శరీరమున నాభరణము లేవియు లేవు; ఆయన పేరు రాజశేఖరుఁడు; ఆయన ముఖప్రక్షాళన మగునప్పటికి గ్రామములోని గృహస్థులు నలువురును అక్కడకు వచ్చి, ఆయన వారివారి తారతమ్యముల క్రమముగాఁ దగిన మర్యాదలు చేసి కూర్చుండుఁ డని చేయిచూపఁ, 'చిత్తము' 'చిత్తము' 'మీరు దయచేయుండి' అనుచుఁ జావడిని౦పఁ గిటగిటలాడుచుఁ గూరుచుండిరి.

అప్పుడు రాజశేఖరుఁడుగారు "సిద్ధాంతిగారూ! మీరు నాలుగు దినములనుండి బొత్తిగా దర్శన మిచ్చుట మానివేసినారు! మీయింటఁ జిన్నపెద్ద లందఱును మఱేమియు లేకుండా సుఖముగా నున్నారుగదా?"

సిద్ధాంతి—"చిత్తము, చిత్తము. తమ యనుగ్రహమువల్ల మేమం దఱము సుఖముగానేయున్నాము. ఎన్ని కుటుంబములనైన నన్న వస్త్రాదు లిచ్చి కాపాడఁగల ప్రభురత్నములు తమరు గ్రామములో నుండఁగా మావంటివారి కేమికొదువ? మా గ్రామము చేసికొన్న భాగ్యముచేతను, మా పురాకృతపుణ్యముచేతను, తమవంటి దాన

శిష్యులు మా గ్రామమునకు విజయం చేసినారుగాని మఱియొకటి కాదు."
అని రామశాస్త్రిగారివంకఁ దిరిగి, "మనము వారి ముఖముముందఱ సన్మానించవలసినది కాదు గాని రాజశేఖరుఁడుగారు కేవలము నీశ్వరాంశ సంభూతులు సుండీ."

ఆ మాటల కాంతరమును సూచించెడి మందహాసము చేసి రామశాస్త్రి "అందుకు సందేహమేమి? ఈసంగతి మీరు నాతోఁ జెప్పవలెనా? వారీగ్రామమున నుండఁబట్టి మన మందఱము వారి నీడను నిలువఁగలిగినాముగాని, లేనియెడల నిండ్లను వాఁకిళ్ళను విడిచిపెట్టి మనమీపాటికి దేశములపాలయి లేచిపోవలసినవారము కామా? వారితండ్రిగా రిక్కడకు వచ్చినప్పటినుండి యిది యొక గ్రామముగాఁ గనఁబడుచున్నదిగాని యింతకుఁబూర్వము దీనికి నామరూపము లున్నవా?"

అని, మంచిసమయము తటస్థించినప్పుడు అను పాండిత్యమును దాఁచిపెట్టక, అందుకొని సిద్ధాంతిగారి స్తోత్రపాఠములకు సాయముగాఁ దనవికూడ నాలుగు కలిపెను.

అప్పుడు రాజశేఖరుఁడుగారు మనసులో మిక్కిలి సంతోషించి నన్న పయి కాసంతోషము కానరాకుండ నడఁచికొని "సిద్ధాంతిగారూ! మొన్న మీ రెండవచిన్నదాని కేమో గ్రహబాధ కనఁబడినట్టు విన్నాను. కొంచెము నిమ్మళముగా నున్నదా?"

అని యడిగినతోడనే సిద్ధాంతిగారు మోమున దీనభావము గానిపింపఁ గొంచెమాలోచించి తలయూఁచి "జోస్యుల కామావధానులగారిచేత విభూతి పెట్టించుచున్నాను. కాని దానివల్ల నిప్పటి కేమియు గుణమే కనఁబడదు. జాతకరీతిచే దానికిప్పుడు శని చాలదు. ఎందుకైనను మంచిదని నాతమ్మునిచేత నవగ్రహ జపము

చేయించుచున్నాను. అంతతో నూరకుండక కామావధానులుగారినే "పంచముఖ వీరహనుమంతము" పునశ్చరణ చేయవలసినదనియు, జపశాంతి కేమయినఁ గావలసియున్న యీరాజశేఖరుఁడుగారినైన కాళ్ళాకడుపో పట్టుకొని తెచ్చి నాలుగురూపాయిలసొమ్మిమ్మచ్చుకొన్నైన నిచ్చుకొనియెద మంచి విభూతి పెట్టమనియు ఆయన ననుసరించి బతిమాలుచున్నాను, అందుచేతనే యీ నాలుగుదినములనుండి దర్శనము చేయలేదుగాని లేకపోయిన నేది యెట్లయినను నేను తమ దర్శనము మానుదునా ?"

రాజ—"శాస్త్రిగారూ ! మీరు రూపాయలనిమిత్తము సంశయపడ నక్కరలేదు. కావలసియున్న ఆ నాలుగురూపాయలను నేనిచ్చెదను. మఱి నాలుగురూపాయలు పోయినను మంచివైద్యుని విచారింపవలెను. మనగ్రామములో శా[illegible]లుగారికన్న—" అని [illegible] యాలోచించుచుండెను. సిద్ధాంతిగారు చేసినస్తుతి యమోఘముగాఁ బట్టుకొని కొంచెముగానో గొప్పగానో ధనరూప మైనప్రతిఫలమును దెచ్చుచునే వచ్చుచున్నదిగాని యావఱ కెన్నఁడును రాజశేఖరుఁడుగారివద్ద వ్యర్థముగాఁ బోలేదు.

ధవళేశ్వరమునందును చుట్టుపట్టుల గ్రామములయందును వేఱు సిద్ధాంతి లేఁడు గనుక, ఆయనయింటికి వచ్చి వర్జ్య మెప్పుడని కాని, ప్రయాణమునకు ముహూర్తముపెట్టుమని కాని, క్రొత్తబట్ట చించి కట్టుకొనుట కేదినము మంచిదని కాని, ఇల్లుకట్టుకొన నారంభించుట కేమాస మనుకూల మైనదనికాని, క్షౌరము చేయించుకొనుట కేవారము మంచిదని కాని, వివాహమునకు లగ్నము పెట్టుమని కాని రజస్వల యయినప్పుడు నక్షత్రము చెప్పుమని కాని, సదా యెవ్వరో యొక రాయన నడిగి పోవుచునే యుందురు. దూరబంధువులు పోయి

నప్పుడు మైల యెంతకాలము పట్టవలెనో తెలిసికోవలె నన్నను, జబ్బు నక్షత్రమున నెవ్వరైన మృతినొందినప్పుడు ఇల్లువదలి యెంతకాలము లేచిపోవలెనో కనుఁగొనవలెనన్నను, రోహిణ్యాది నక్షత్రములయందు బిడ్డను గన్నప్పు డేమిశాంతి తగులునో యెఱుఁగవలెనన్నను, సిద్ధాంతి యొద్దకు రాక సరిపడదు. ఏకాపువానిపశువు తప్పిపోయినను, ఎవ నింట నేవస్తువు పోయినను వచ్చి సిద్ధాంతిగారి నడుగక పోరు. ఇటువంటి సమయములయందెల్లను, అతఁడు వీధినడవలో నేలమీఁద ఇసుక పోసి దానిలో పూచికపుడకతో ఏమేమో బీజాక్షరములును అంకె లును వ్రాసి మీఁదివంకచూచి యాలోచించి వచ్చినకార్య మిది యనియు, కార్య మీ ప్రకారముగా నగుననియు చెప్పి పంపుచుండును. అతఁడు బల్లిపాటు మొదలైనవాని ఫలములును, శకునములు చూచి సంతానము కలుగు కాలమును కూడ చెప్పుచుండును. వేయేల? సిద్ధాంతి యాలోచన లేక యాచేరువగ్రామములో నేశుభకార్యము కాని యశుభకార్యముకాని జరుగదు. అతఁడు చెప్పెడిజ్యోతిషము తఱుచుగా అబద్ధమే యగుచు వచ్చినను, అప్పుడప్పుడు కాకతాళీ యముగా కొన్ని సంగతులు నిజ మగుటయుఁ గలదు గనుక జను లాతనిమాట యమోఘ మని నమ్ముచునే యుండిరి.

అప్పు డాచావడిలో నున్నవారిలో నెవరో "బైరాగులు భూతవైద్యమునకు గట్టివా" రని మెల్లగా ననిరి. అంతలో రాజశేఖ రుఁడుగారు సిద్ధాంతిగారివంకఁ జూపు త్రిప్పి "ఔను. బైరాగు లన్న తోడనే జ్ఞప్తికివచ్చినది. పదిదినముల క్రిందట ఈగ్రామమున కెవ్వఁడో యొక బైరాగి వచ్చినాఁడట! అతనికిఁ జూపింపరాదా? గోసాయీలకుఁ బరమహంసక్రియలును వనమూలికలును విశేషముగాఁ దెలసి యుండును. వాండ్రెట్టియసాధ్యమైనపీడలనైనను చిటికెలోఁ బోఁగొట్టు దురు" అనినతోడనే చావడి యంతయు 'చిత్తము' 'వాస్తవము'

అలాగున నవశ్యము చేయవలసినదే యను ధ్వనులతో నిండిపోయెను. మాటలాడువారు ధనవంతులైనచో, వ్యర్థవచనముసహితము సూక్తివాక్యము కాకపోదుసుండీ. ఆమాటలవలన నుత్సాహము కలిగి, రాజశేఖరుఁడుగా రాబైరాగిని తాము గూడకపోయినను బ్రహ్మవర్చస్సు కలవాఁ డని శ్లాఘించిరి.

అంత సిద్ధాంతి యుల్లములో లేని సంతోషమును మోమున దెచ్చిపెట్టుకొని యొక్కచిఱునవ్వు నవ్వి, వినయముతోఁ జేతులు జోడించి రాజశేఖరుఁడుగారి ముఖమున దృష్టి నిలిపి, "తమ మాట చేతనే మా చిన్నదానిబాధ నివారణ మయినది. దానియదృష్టము బాగుండబట్టియే దేవరవారిముఖమునుండి యీమాట వచ్చినది. ఇప్పుడే తమ సెలవుప్రకారము బైరాగియొద్దకు వెళ్ళెదను." అని మనవిచేసి, ప్రయాణోన్ముఖుఁ డయి లేచి నిలువఁబడెను. రాజశేఖరుఁడుగారి యభిప్రాయము కొంచెము తెలిసినతోడనే బైరాగిమహానుభావుఁ డనువారును మహామంత్రవేత్త యనువారును, వాయుభక్షణము చేయుననువారును, మండువేసవిని పంచాగ్నిమధ్యమునఁ దపస్సు చేయు ననువారును అయి సభ యంతయు అతనివిషయమైన స్తుతిపాఠములలో మునిఁగిపోయెను. ఒక్క గొప్పవాఁ డొకనిని మంచివాఁ డన్నచో, ఎవ్వనివాక్కు భిన్నముగా లేచును? ఎవ్వనినోరు స్తుతివాక్యముల కొరకు తడవుకొనును?

అప్పుడు రాజశేఖరుఁడుగారు వీధివంకఁ జూచి: "ఎవ్వరో స్త్రీలు నీళ్ళకువచ్చి మనలఁజూచి సిగ్గుపడి వెనుకకు నాలుగడుగులు పెట్టి నిలుచుండి యొండొరుల మొగములవంకఁ జూచుకొనుచున్నారు. మన మందఱమును లేచి బైరాగిని జూచివత్తము రండి." అను మాటతోడనే యెల్లరును లేచి ప్రయాణోన్ముఖులయి నిలుచుండిరి. వెంటనే యందఱును గలిసి యుత్తరముఖముగా రామపాదములవైపున నడువ నారంభించిరి.

# రెండవ ప్రకరణము

రాజశేఖరుఁడుగారికూఁతురు రుక్మిణి స్నానమునకు వచ్చుట-నదీతీర వర్ణనము - రుక్మిణికిని సిద్ధాంతిగారి భార్యకును జరిగిన సంభాషణ-నీళ్లకు వచ్చిన యమ్మలక్కల ప్రసంగముః - పంచాంగపుబ్రాహ్మణుఁడువచ్చి సంకల్పము చెప్పుట - రుక్మిణి స్నానముచేసి బయలుదేఱుట.

రాజశేఖరుఁడుగారు పౌరబృందముతో నాలు గడుగులు ముం దుకు సాగినతోడనె యొకసుందరి సుందరగమనముతో సోపానముల యందలి యందియలమ్రోత మట్టియలమ్రోఁతతోఁ జెలిమి సేయ, మొలనున్న వెండియొడ్డాణము యొక్కయు, ముంజేతుల పసిడికంకణముల యొక్కయు, గాజులయొక్కయు కాంతులు ప్రతిఫలించి కుడిచేతిలోని తళతళ లాడుచున్న రాగిచెంబునకుఁ జిత్రవర్ణ మొసంగఁ మోమున లజ్జాభయములు నటియింప, పయ్యెద చక్కఁజేర్చుకొనుచు తిన్నగాఁ దలవంచుకొని మెట్లు దిగివచ్చి చెంబును నీటియొడ్డున నుంచి చెంబుమూతి కంటించియున్న పసుపుముద్దను దీసి కొంత రాచుకొని మోదుగాకులోఁజుట్టి తెచ్చుకొన్న కుంకుమపొట్లము నొకబట్టయుతునకు రాతిపయిం బెట్టి, మోఁకాలిబంటి నీటిలో నిలుచుండెను. ఆమె రాజశేఖరుఁడుగారి పెద్దకూఁతు రగురుక్మిణి—ఆహా! ఆమె సౌందర్యమును బ్రత్యక్షమునఁ జూడ నోచినవారికన్నులే కన్నులు. ఆకాలమున హిందూదేశమునందలి సుందరులలో నెల్లఁ దెనుఁగుదేశములోనివారే రూపరేఖవిలాసములచేత నసమానలుగా నుండిరి; వారిలోను బ్రాహ్మణజాతివారలు మిక్కిలి చక్కనివారు. కాని రుక్మిణిరూపమును దలఁచినప్పుడు మాత్రము, ఆ సుందరు లాకసౌందర్యవతు లని చెప్పుట కెల్లవారును సంకోచ పడుచుందురు. జనులందఱును మిక్కిలి

సౌందర్యవతు లని యెప్పుకొన్నవారికిని చక్కనివారి నేఁటి యీమెను చెంత నిలిపినచో గురూపురాండ్రనిపించెడి యీమె మనోజ్ఞత నేమని పిలువవలెనో తెలియకున్నది. అపూర్వవర్ణనాసామర్థ్యము గల కాళిదాసాదికవులలో నొకరినైనను బోలఁ జాలని నేను, ఉన్నంతసౌందర్యమును బోధించుపదములు లేనిభాషతోను, పదములు బోధింపనంతవట్టికైనఁ బూర్ణముగాఁ దెలుపలేని బుద్ధితోను వర్ణింపఁ బూనుట యీమె చక్కఁదనముయొక్క గౌరవమునకుఁ గొంత కొఱంత కలుగఁజేయుటయేగదా! అయినను యోగ్యవస్తువు గౌరవభయమున వర్ణింపక మానుట యుచితము కాదు కాఁబట్టి, యీసృష్టిలోనివస్తువులతో నేదానితోనైనను బోల్చి యీపుస్తకముం జదువువారికి నామె యవయవములయొక్క రూపము నించుక మనస్సునఁ బుట్టింతునన్నను ఆమె యంగముల నంచి యీవస్తువులపేరు చెప్పుటకె సిగ్గు పొడముచున్నది. వేయేల ? చతుర్ముఖుఁడును ఘుణాక్షరన్యాయమునఁ బడిన యీమె రూపమునకుఁ దలయూఁచి, తన యపూర్వవస్తునిర్మాణచాతురిని మెచ్చుకొనకపోఁడని యీమెం జూచినవారెల్లరు నెంచుచుందురు. ఆమె శరీరచ్ఛాయం జూచిన, ఇఁక నీభూమిమీఁద బంగారమున కేమిచాయయొక్కువ గలదని తోఁచును ; నల్లగానుండునేని, విండ్లామెకనుబొమలఁగొంచెము పోలియున్నవని చెప్పవచ్చును; నేత్రములను జూచినభాగ్యదేవత వానియందే కాపురము కుదిరినట్లు కనిపించును; కాని, నిపుణముగాఁ బరిశీలించినచో నేదో స్థిరవిచార మొకటి యీమె హృదయపీఠమున నిలువుకొనియున్నట్టు ముఖలక్షణములు కొంచెము సూచించుచున్నవి. ఆవిచారమునకుఁ గారణము లేకపో లేదు. ఆమె పెనిమిటి సహవాసదోషముచేత నాలుగునెలలక్రిందటఁ దలిదండ్రులతోఁ జెప్పక దేశాంతరము లేచి పోయినాఁడు.

ఇప్పు డామెకుఁ బరిమళ మబ్బినట్లు, ఇప్పు డిప్పుడే యౌవనము తలచూపి యామె మేనిసోయగమునకు మెఱుఁగు దెచ్చుచున్నది. పచ్చని దేహముమీఁద అప్పుడు కట్టుకొన్న తెల్లనిబట్టయు బంగారమునకు పటికె పూసినట్లు లోకవిధమయినయందమునే కలిగించుచుండెను. సుందరాంగుల యంగముం జేరినప్పు డేది యందముగా నుండదు ? ముక్కున నడ్డబాసయు, చెవుల నీలాలబావిలీలును, చేతుల కంకణములును, మెడలో పట్టెసయును, మొలను వెండివడ్డాణమును, కాళ్ళ నందెలును, మట్టెలును, ఆమె యప్పుడు ధరించుకొన్నది. కంకణములకు సాహాయ్యముగా రంగురంగులగాజులును లక్కపట్టెలును ముంజేతుల నలంకరించుచుండెను. ఈ నగలచే నామె యవయవములకేమైన శోభ కలిగినదో లేదో కాని యవయవములచే నగలు కొంత శోభగాంచుటమాత్రము కరతలామలకముగాఁ గనఁబడుచున్నది.

సృష్టిలోని యేపదార్థమునకును బరిపూర్ణత్వమును దయచేయనిరీతినే, సర్వసముఁడగు భగవంతుఁడు రుక్మిణిసౌందర్యమందును గొంతకొఱంతను గలిగించినాఁడు కాని బొత్తిగాఁ గలిగింపక మానినవాఁడు కాఁడు. నిజముగా అది యొకకొఱంతయే యయ్యెనేని యామెకుం గలలోప మెల్లను మెడ మిక్కిలి పొడుగుగా నుండుట. అయినను ముష్టిసర్వశాస్త్రి యాయవారమునకు వచ్చినప్పుడెల్ల నామె మెడను జూచి సంతోషించి, "మిక్కిలి పొడుదగుమెడకామిని! కులవర్ధని దాని నెఱిఁగికొం డనిరి బుధుల్ ॥" అను సాముద్రిక గ్రంథములోని పద్యమును జదివి పోవుచుండును.

అప్పుడొక్కవిధవ మొలలోఁతునీళ్ళలో దూరముగా నిలుచుండి నోటిలో నేమేమో జపించుకొనుచు నడుమనడుమ దలయెత్తి సూర్యుని వంకఁజూచి దండములుపెట్టుచు, దోసిటిలోనీళ్లుపట్టి సూర్యునకర్ఘ్యము

విడుచుచు, అప్పుడప్పుడు ప్రదక్షిణములు చేయుచుండెను. ఆవల కు వచ్చియున్న కొందఱుస్త్రీలు తిరుయి తిడెబిం పలను నీళ్ళలోఁ బెట్టి రేవు నకు సమీపముగానున్న రాళ్ళపయిని నిలుచుండి యొక్కొక్క పెట్టు వేయుచు మధ్యమధ్య నొక్కొక్కమాట చెప్పుకొనుచు బట్టలు నుతుకు కొనుచుండిరి; ఒకవృద్ధాంగన సగముబట్ట కట్టుకొని తక్కినసగము నుతుకుకొన్న తరువాత, ఉతికినభాగమును మార్చికట్టుకొని మిగిలి యున్నభాగము నుదుకుకొనుచుండెను; కొందఱు వయసులోనున్న స్త్రీలును గోప్యముగా నుంచఁదగిన తమ యావయవములు స్నానము చేయుచున్నట్టియు గట్టున నున్నట్టియు పురుషులకుఁ గనఁబడునట్లు సిగ్గువిడిచి తోముకొన్న రవికలనుదీసి యుదుకుటకయి తాము కట్టు కొన్న వస్త్రముల నక్కడనేవిప్పి యీవలకుదికిన చేతులు పిడిబట్టలను చుట్టబెట్టుకొనుచుండిరి. ఆవల పదిబారలదూరమున దాసీజనములు క్రిందఁబడిన మెతుకులకై కావుకావని మూఁగిన కాకులను చేయెత్తి యదలించుచు అంటుతప్పెలలను ఒడ్డునఁ బెట్టుకొని తోముకొనుచుం డిరి. ఆపయిని జెస్తలు పుట్టగోచులతో మొలబంటినీటిలో నిలు చుండి వలత్రాడు మొలత్రాడునం దోపుకొని రెండుచేతులతోను వలను త్రిప్పి లోఁతునీళ్ళలో విసరవైచి మెల్లమెల్లగా లాగుచుండిరి. మఱికొందఱు లాగినవలలను నీళ్ళలోఁ బలుమాఱు జాడించి యంటు కొనియున్నబురద పోయినతరువాత గట్టునకుఁ దీసికొనివచ్చి చివరఁ దగిలించియున్న యినుపగుండ్లు గలగలలాడ వలలను విప్పి రాయిరప్ప క్రిందఁ బారవైచుచు నడుమనడుమ వలకన్నులసందున నుండి మిట్టి మిట్టిపడు చిఱుచేపలను చేతులతో నదిమిపట్టి మీలపుట్టికలను చేతఁ బట్టుకొని నిలుచున్న పిన్నవాండ్రచేతి కందిచ్చుచుండిరి. ఆపయిని నాలుగడుగులు నడచినతరువాత దినమున కాఱణాలపాటు పడఁగలిగిన యొక సోమరిపోతు నీళ్ళలోనున్న నడదోనెమీఁది కెక్కి నల్ల యునఁ

బడు చేరిన నెత్తురుముద్దను త్రాటిచివ నున్న గాలమునకు గ్రుచ్చి, లేచి నిలువంబడి కుడిచేతితో సత్తువకొలందిని త్రాడు గిరగిరత్రిప్పి లోతు నీరు న్విసరివైచి మరల గూర్చుండి చే యెప్పుడు చిక్కునాయని తదేకధ్యానముతో త్రాడునంకనే చూచుచు త్రాడు కదలినప్పుడెల్ల నులికిపడుచు దైవవశమున చేప గాలమును మ్రింగి కొట్టుకొను చుండ మెల్లమెల్లగా లాగుచు, త్రాడు తెంపుకొని పాఱిపోవునో యను భయమున గుడిచేతిలోని త్రాడు వదలుచు మరల లాగి యుండగా జుట్టుచు, చేప కలసట వచ్చినతరువాత నొడ్డునకు లాగి పెన్నిధిగన్న పేదవలెఁ బరమానందము నొందుచు, ఒడ్డుదాఁక వచ్చిన తరువాత గ్రహచారము చాలక మత్స్యము త్రాడు తెంపుకొని పఱ చిన చేతిలోఁబడ్డసొమ్ము పోఁగొట్టుకొన్న వానివలె నిర్వేదించు చేఁప రాకపోఁగా రెండణాలగాలముకూడఁ బోయెనని విచారించుచు వట్టి చేతులతో నింటికి బోయెను. ఆసమీపముననే యొడ్డునఁ జేరి కుఱ్ఱ వాండ్రు వెదురుచువ్వ కొకదారమును గట్టి దానికొననున్న చిన్న గాలమునకు ఎఱ్ఱలను గ్రుచ్చి నీళ్ళలో వైచుచుఁ దటాలునఁ దీయుచు జిన్నచేపలను బట్టుకొని మఱియొక దారమునకు గుదిగ్రుచ్చి 'నాకు బదిజెల్లలు దొరికినవి' 'నాకు నాలుగుపరిగెలు దొరికెను' వని యొం డొరులతోఁ జెప్పుకొనుచు సంతోషించుచుండిరి. అక్కడి జువ్విచెట్టు మీఁదఁ గూర్చుండి చూచుచున్న చెడుగ్రద్దయొకటి యకస్మాత్తుగా వచ్చి యొకటిరెండు పర్యాయములు పిల్లవాండ్రు త్రాడునకు గ్రుచ్చుట కయి చేతఁబట్టుకొన్న చేపఁ నెగరఁదన్నుకొని పోయెను.

అప్పు డొక్క పెద్దముత్తయిదువ మొగమంతయు నొక్కచేఁ బొట్టుపెట్టుకొని, బట్టలతోనున్న బుజముమీఁది బిందెను తీసి చేతఁ బట్టుకొని రుక్మిణియున్న తావునకువచ్చి గౌరవముతోడ "అమ్మాయి గారూ! ఏమి? మీరీవేళ స్నానమునకు దయచేసినారు".

రుక్మిణి—"కార్తికసోమవారము కాదా? నేఁటిపటి సోమవారము గనుక ప్రదోషవేళ మా అమ్మతోఁగూడ శివాలయమునకు వెళ్ళవలెనని గోదావరిస్నానము చేయ వచ్చినాను".

పెద్దముత్తైదువ—మీరు రాత్రిదాఁక భోజనము లేకుండ నుండఁగలరా?

రు—"ఒక్కదినమున కేమి? ఫలాహార మైన నుందును. మొన్న మీ రెండవచిన్నదానికి శరీరములో నిమ్మళముగా లేదని చెప్పినావు. ఇప్పుడు కొంచెము నిమ్మళముగా నున్నదా?"

పె—"ఏమినిమ్మళమో నాకు తెలియదు. మావారు రెణ్ణెళ్ళఁ బట్టి కామావధానులచేత విభూతి పెట్టించుచున్నారు. రాత్రి తెల్లవారినదాఁక నిద్రలేక బాధపడినాము".

రు—"గ్రహబాధా యేమి?"

పె—"అవునమ్మాయీ! ఏమి చెప్పుకోను? మగఁడు"— అని 'యిక్కడ నెవరును లేరుగదా' యని నాలుగు ప్రక్కలనుజూచి మఱింతదగ్గరగా జరిగి చెవిలో మెల్లగా "మగఁడు పట్టుకొని పీకుకొని తింటున్నాఁడు. మీ రెఱుఁగుదురుగదా దానికి పెండ్లియయి మూఁడేండ్లు కాలేదు. అప్పుడే దానిమగఁడు పోయి యాఱునెల లయినది. అప్పటినుండియు దానికి కొన్నాళ్ళు కలలోను కొన్నాళ్ళు రాత్రివేళ ఒంటరిగా నున్నప్పుడును కనఁబడుచునే యున్నాఁడు. పిల్లకి సిగ్గుచేత ఎవ్వరితోను చెప్పక దాఁచినది. నెలదినముల నుండి బాత్రిగా ఎప్పుడును విడువక రేయింపగళ్ళు వెంటవెంటనే యెక్కడికి వెళ్ళిన నక్కడికి కెల్లఁ దిరుగుచున్నాఁడు. ఏమిపాపమో కాని మూఁడుదినముల నుండి మఱింత పీకుకొని తింటున్నాఁడు. ఈమూఁడ్నాళ్ళలోను పిల్లది సగ మయిపోయినది. ఇంతేగదా? మగనితో"—అని కడుపులో

నుండి దుఃఖము బయలుదేఱఁగాఁ గొంచె మాపుకొనుచుఁ గన్నీరు పైటచెఱఁగుతో తుడుచుకొనుచుఁ గొంచెము తాళి గద్గదస్వరముతో, "మగనితో సౌఖ్య మనుభవింపనా? కాపురము చేయునా?" అని కొంచెము బిగ్గరగా నేడ్వఁజొచ్చెను.

రు—(ఆమాటలు మనసుకు నాఁటి యొడలు పులకరింపఁ గొంత తాళి ధైర్యము తెచ్చుకొని) "పెద్దముత్తైదువవు. అలాగుఁగ గంట తడి పెట్టరాదు. ఊరుకో ఊరుకో రోగము మనుష్యులకు రాక మ్రాఁకులకు వచ్చునా?"

పె—ఏడుపు చాలించి—'అమ్మాయీ! దాని కేసౌఖ్యము నక్కఱలేదు. ఈలాగునైన నుండి బ్రతికి బట్టకట్టినఁజాలును. మా ముసలిప్రాణములు రెండును బ్రతికి బాగున్నంతవఱకు దానికి యన్న, వస్త్రముల కేమియు లోపము రాదు.'

రు—కొంచెముసేపేమేమో యాలోచించి—'సోమిదేవమ్మా! మీవారు గ్రామములో పెద్దసిద్ధాంతులుగదా? తెలిసికూడ చిన్న దానిని అంత యర్ధాయుష్మంతున—'

పె—మాట కడ్డమువచ్చి—"ఔనౌను! నీ వడుగఁబోవునది నేను గ్రహించినాను. ఎవరియదృష్టమున కెవరు కర్తలు? దానికి ముండమోయవలసిన వ్రాఁత యుండఁగా నెవరు తప్పింపగలరు? ఎవరైన జాతకము మంచిదిగాఁ జూచి వివాహము జేయుదురుగాని పెండ్లికుమారునకు లేనియాయువును తెచ్చి పోయఁగలరా?"

రు—"అవును. జాతకములో మీయల్లునకు పూర్ణాయుస్సే యున్నది కాఁబోలు!"

పె—కొంచె మనుమానించి—"పూర్ణాయుస్సా!—అవును పూర్ణాయుసే యున్నది. జాతకప్రకారము జరగదా అందు వేమో,

వేళ తిన్నగా కట్టి జాతకము వ్రాసినయెడల, అందులో నెన్ని యరిష్టములున్నను అన్నియు శుభములును జరుగును. శాస్త్రము చక్కఁగా తెలియనివారు తిన్నగా వేళ కట్టలేక పాడుచేయుదురు. పూర్వవారు ఇన్ని ముహూర్తములు పెట్టినారుగదా? నీ వెఱిఁగినంతవఱకు నందు లొకవిధముగా నెక్కడనైన జరిగినదేమో చెప్పు"

రు—"కన్నమ్మగారి బుచ్చమ్మ వివాహముహూర్తము మా దావడిలో మన సిద్ధాంతిగారే పెట్టినారుగాని దాని మగనిజాతకము కూడ సిద్ధాంతిగారే వ్రాసి—"

పె—"అవును ఒకానొకటి తప్పిపోవుటయుఁ గలదు. దోషమునకుఁ బార్వతీశాప మున్నదఁట! మావా రెప్పుడును ఈసంగతినే చెప్పుచుందురు. గట్టుమీఁద నుట్టలచప్పు డగుచున్నది. ఎవ్వరో వచ్చుచున్నట్లున్నారు. ఈపాటికి మన మీసంగతి చాలింతము" అని వెనుక తిరిగి చూచి బిందె యొడ్డుననుంచి స్నానమునకు నీళ్ళలో దిగుచున్నది.

ఇంతలోఁ గొందఱు పుణ్యస్త్రీలును విధవలును మెట్టుదిగుచు ముందున్నవారు వంగి కాళ్ళ వెండిపావడములను కొంచెము పయికిఁ దీసికొనుచు వెనుకఁ దిరిగి దూరముననున్నవారు వచ్చువఱకు దగ్గఱవారితో మాటలాడుచు మెల్లమెల్లగా నీటిసమీపమునకు వచ్చి గృహకృత్యములనుగుఱించి మాటాడుకొనుచు బిందెల నొడ్డునఁ బెట్టిరి. అందఱును నొక్కచోట సమావేశమయి సావకాశముగా మాటాడుకొనుటకు నీళ్ళకు వచ్చినప్పటికన్న మంచిసమయము స్త్రీల కెప్పుడును దొరకదుగదా? అందుచేతనే వారు సాధారణముగా కొంచెము తీఱుబడిచేసికొని మాటాడవలసిన నాలుగు మాటలను నీళ్ళకు వచ్చినప్పుడే మాటాడుకొనిపోవుదురు. అప్పుడు ముప్పదియేండ్ల యీడు

గలపొట్టి దొరకతే ముందుకు వచ్చి ముక్కుమీఁద వ్రేలు వైచికొని "ఓసీ! వెంకమ్మా! రాత్రి శేషమ్మను మగఁడు కొట్టినాఁడట! విన్నావా ?"

వెంకమ్మ—"దానిని మగఁ డెప్పుడును అలాగుననే కొట్టుచుండును. నెలదినముల క్రింద కఱ్ఱపుచ్చుకొని కొట్టినప్పుడు చేతిగాజు లన్నియు పగిలిపోయినవి."

పొట్టి—"దానిని మగఁడు తిన్నగా ఒల్లఁడట." అని బుగ్గను చేయిపెట్టుకొని "ఓసీ! ఓసీ! అతఁడు ముండ నుంచుకొన్నాఁడఁట సుమీ."

బట్టతల ముత్తైదువయొకతె చేతులు త్రిప్పుకొనుచు ముందుకు వచ్చి "సరి సరి! దాని గుణముమాత్రము తిన్ననిదా? మొన్న సుబ్బావధానుల కొడుకుతో మాటాడుచుండఁగా మగనికంటనే పడ్డదఁట! మగవాఁ డేలాగున నున్నను దోషములేదు. ఆఁడుదాని గుణము తిన్నగా నుండనక్కఱలేదా?"

పొట్టి—"దాని కేమిగాని, పాపము! చిన్నమ్మను అత్తగారు లోకములో లేని కోడంట్రికము పెట్టుచున్నది. అంతేకాకుండ మగఁడింటికి వచ్చునప్పటి కేవో నాలుగు లేనిపోని నేరములు కల్పించి చెప్పును. దానిమీఁద అతఁడు ప్రతిదినమును దానిని చావఁగొట్టుచుండును."

పదియాఱుసంవత్సరముల వయస్సుగల యొక చామనచాయది కన్నుల నీరుపెట్టుకొనుచు—"అత్తగారు బ్రతికియున్న చోట్ల నెల్ల సదేకర్మము. లోకములో అత్తలెల్ల ఒకసారి చచ్చిరా"—

పొట్టిది—"శేషమ్మా! నీ అత్తగారుకూడ నిన్ను చాలా బాధ పెట్టు నని విన్నాను. నిజమా?"

శేష—"బాధ నీకేమి తెలియుదు. కోడలనగుటచేత చచ్చి పోవుచున్నాను. జాము తెల్లవారక లేచి యింటిప్రాచి యంతయుఁ జేసి, అంట్లు తోమి, యింటికి కావలసిన నీళ్ళన్నియు తోడి, మడిబట్ట లుదికి, ఆమె లేచువఱకు పనులన్నియు జేయుదును. అప్పుడు నాలుగు గడియల ప్రొద్దెక్కి లేచి కన్నులు నలుపుకొనుచు వచ్చి గరిటెనంటు వదలలేదని, వాకిటలోఁ బెంట యట్టేయున్నదని తిట్ట మొదలుపెట్టును. తరువాత పేడచేసి గోడమీఁద పిడకలుచరచి తెక్కలు విఱుచుకొని జాము ప్రొద్దెక్కి చలిదిభోజనమునకు వచ్చు వఱకు, "ఒకమూల తెల్లవారకమునుపే తిండికి సిద్ధపడుదువు. పని మాత్రము ముట్టుకో" వని వంట చేసికొనుచు సాధించుచుండును. పగలు మగనితో మాటాడితేఁ దప్పుగదా? రాత్రి యందఱిభోజనములు అయినతరువాత, అత్తగారికి కాళ్లుపిసికి యామె నిద్ర పోయిన తరువాత వెళ్ళి పడుకోఁబోవునప్పటికి రాత్రి రెండుయామములగును. పడుకొన్నది మొదలుకొని యెప్పుడు తెల్లవాఱి పోవునో, వేళకు బనిగాకున్న అత్తగారెక్కడకోపపడునో అని నిద్రలోసహితము ఉలికిపడుచుందును; ఎట్లుచేసినను నాకు తిట్లును దెబ్బలును తప్పవుగదా?" అని మొగమునకు కొంగడ్డముపెట్టుకొని నేత్రముల నీరు కార్పఁ జొచ్చెను.

రుక్మి—"అత్తగారికి కోపము తెప్పించకుండ జేసెడుపనిని నీవు తిన్నగానే చేయరాదా?"

శేష—"అయ్యో! రుక్మిణమ్మా! నీకత్తగారు లేనుగనుక నీ కీసంగతు లేమియుఁ దెలియవు. ఎంతపని చేసినను అత్తగారి కెప్పుడును మెప్పు లేదు. కలయంపి చల్లునప్పుడు చిక్కఁగాఁ జల్లిన, "ఇల్లంతయు సముద్రము చేసినావు జాఱిపడిచచ్చిపోనా?" యని

తిట్టును. పలచగాఁజల్లిన "నీళ్ళకు కఱవువచ్చినట్లు వేణ్ణీళ్ళేచల్లినావు కా"వని తిట్టును. అడిగినమాటలకు మాఱు చెప్పిన "నామాట కెదురు చెప్పుచున్నావా" యని కోసి పెట్టును. బదులు చెప్పక యూరకున్న "మొద్దులాగున మాటాడవే" మని తిట్టును. ఆమెముందఱ ఏమి చేసినను తప్పిదమే. "ఆఁ" అన్న అపరాధము? "నారాయణా" అన్న బూతుమాట. నేను కాపురమునకువచ్చిన నాలుగు సంవత్సరముల నుండియు వాడుకొనుచున్న ఓటికుండ నాలుగుదినములక్రింద పగిలి పోయినప్పుడు రాయివంటి క్రొత్తకుండ పగులఁగొట్టినా వని నేటివరకు తిట్టుచున్నది."

పొట్టి—"అత్త పోఁగొట్టినది అడుగోటికుండ, కోడలు పోఁగొట్టినది క్రొత్తకుండ" యన్నసామెతవినలేదా?

శేష—నేను పడుబాధ యిప్పు డేమిచూచినారు? నా విధవ వదినెగారు బ్రతికియున్నప్పుడు చూడవలెను. నిరుడు అమ్మవారి జాడ్యములో—దైవము కడుపుచల్లగా—ఆవిడ పోయినప్పటినుండి మూఁడుపూఁటలును కడుపునకింత తిన్నగా అన్నము నైన దిను చున్నాను. ఆఁడుబిడ్డ జీవించియున్నప్పు డదియునులేదు. ఉన్నమాట చెప్పవలెను. ఎన్నియన్నను ఇప్పుడు నాఅత్తగారు అన్నము తిన్నగా తినవైతివని తిట్టునుగాని తినిపోతినని తిట్టదు.

పొట్టిది—"లోకములో నెటువంటివారును లేకున్న—పిండి బొమ్మను జేసి పీటమీఁదఁబెట్టిన, ఆఁడుబిడ్డతనమున కదిరదరిపడ్డది— అన్నసామెత యూరకేపుట్టినదా ?"

ఇంతలో జపము చేసికొనుచున్న ముసలామె కొంతదూరము వచ్చి చెంబులోనీళ్ళు పాఱఁబోసి "మీకు మాటలసందడిలో కన్నులు కనఁబడునా ? ఈవల స్నానముచేసినవా రున్నారని యయిన

లేదు. ఊరికే నీళ్లు విడుచుకొందురు. మీఁద మయిలనీళ్ళు పడి స్నానము చేసినముంతను చచ్చినట్టు చలిలో మరల మునుఁగుచున్నాను" అని గొణుఁగుకొనుచు లోతు నీళ్ళలోనికి నడిచి బుడుఁగు బుడుఁగున నాలుగు మునకలు వేసి బయలుదేఱి, మాటాడుకొనుచున్న వారివంక కన్ను లెఱ్ఱచేసి చూచుచు "అమ్మలక్కలు క్రిందను మీఁదను తెలియక పొంగిపడుదురు. ఈకాలములో నున్న కోడండ్రికములో ఇప్పుడు సహస్రాంశము లేదు. అత్తమంచియు, నేమి తీపును లేదు. ఎక్కడను అత్తలేని కోడలు ఉత్తమురాలు. కోడలులేని యత్త గుణవంతురాలు" అని సణుఁగుకొనుచు, దోసిళ్ళతో నదిలోని నీళ్ళు మూఁడుసారులు గట్టునపోసి, కొంచెము దూరము పోయిన తరువాత మరల మూఁడుమాఱు లాత్మప్రదక్షిణములు చేసి సుబ్బక్క యదృశ్యురా లయ్యెను.

శేషమ్మ—నాలుగువంకలుఁ జూచి వడవడ వడఁకుచు "అమ్మలారా! నే నీలాగున అన్నానని మీ రెవ్వరితోనైన ననెదరుసుండీ! మా అత్తగారు విన్న నన్ను చంపివేసిపోవును. ఈవఱకే నాకు గతులు లేకుండ నున్నవి. ఇది విన్న బొత్తిగానే యుండవు. వెంకమ్మ తల్లీ! ఈబ్రతుకు బ్రతుకుటకంటె గోదావరిలో పడితే బాగుండు నని తోఁచుచున్నది." అని వలవల నేడ్వఁజొచ్చెను.

వెంకమ్మ—"ఊరుకో! ఊరుకో! అటువంటి అవాచ్యము లెప్పుడును పలుకరాదు. పడ్డవాండ్రెప్పుడును చెడ్డవాండ్రు కారు." అని యూరడించుచున్నది.

శేషమ్మ—ఆమాటలతో దుఃఖము మాని "గోదావరికి వచ్చి చాలసే పయినదమ్మా! ఇంతసే పేమిచేయుచున్నావని అత్తగారు చంపివేయును. వేగిరము పోవలెను." అని వేగముగా నీళ్ళుముంచుకొని బిందె బుజముమీఁద నెత్తుకొని గట్టునకు నడుచుచున్నది.

అప్పుడే నీళ్ళకు వచ్చినవారిలో ఇరువదియేండ్లప్రాయముగల యొకతె చేరువ నున్న మఱియొకతె మెడదగ్గఱకు చేయి పోనిచ్చి "కాంతమ్మా! ఈపట్టెడ క్రొత్తగా చేయించుకొన్నావా? నీ కేమి? నీవు అదృష్టవంతురాలవు. గనుక తల మొదలుకొని పాదములవఱకు నీమగఁడు నీకు నగలు దిగవేయుచున్నాఁడు."

కాంత—నిన్ననే కంసాలిసుబ్బయ్య చేసి తెచ్చినాఁడు. నాలుగు పేటల పలకసరులు కూడ చేయుచున్నాఁడు. వీరమ్మా! నీ మగనికి నీమీఁద బహుదయ అని విన్నాను. నిజమేకదా!

వీర—ఎందుకువచ్చినదయ? సంవత్సరమున కొకపర్యాయ మయినను పట్టుమని పదివరహాలనగ చేయించి పెట్టుట లేదుగదా? పూర్వజన్మమునందు చేసికొన్న పాపముచేత నా కీజన్మమందు ఇటువంటి——

అప్పుడు ప్రక్కనునిలుచున్న మఱియొకతె—వీరమ్మా! నీవు వృథాగా లేనిపోనివ్యసనము తెచ్చిపెట్టుకొనుచున్నావు. నీ కేమయినా అన్నమునకు తక్కువయినదా? బట్టకు తక్కువయినదా? మహారాజువలె మగఁడు తిన్నగా చూచుచున్నప్పుడు నగలు లేకపోయిన నేమి! మగనికి ప్రేమ లేకపోయినతరువాత, దిక్కుమాలిన నగ లెందుకు వట్టి మోతచేటు. చూడు మనగ్రామములో బంగారమ్మకు శరీరము నిండ నన్నినగ లున్నవో! ఆనగలపేళ్లె కొన్ని నేను వినలేదు. దీపములు పెట్టఁగానే వెళ్ళి దానిమగఁడు భోగముదానియింటిలోఁ గూరుచుండును. దాని కేమిసుఖ మున్నది? నీ మగఁడెప్పుడును చీఁకటి పడ్డతరువాత వీధిగుమ్మము దాఁటఁడు.

వీర—నీవు చదువుకొన్నదానవు గనుక, కావలసినన్ని శ్రీరంగనీతులు చెప్పఁగలవు. నీకువలె మా కెవ్వరికిని ఇటువంటి వేదాంతము

తెలియదు. నలుగురును నగలు పెట్టుకొనివచ్చినప్పుడు, పట్టె మోపు లాగున ఎక్కడి కయినను పేరంటమునకు వెళ్ళుటకు నాకు సిగ్గగుచున్నది. జానకమ్మా! నీకు నామగనివంటి బీదవాడు——

జాన——పేరమ్మతల్లీ! నే నేమో తెలియక అన్నాను కోపపడకు అని బిందె ముంచుకొని వెళ్ళిపోవుచున్నది.

తక్కినవా రందఱును నీళ్ళు ముంచుకొని వెనుకనే బయలుదేఱి, "ఓసీ పూజారిపాపమ్మ చెంపకొప్పు పెట్టుచున్నది" "కరణము పెండ్లా మెంతయొయ్యారముగా నడుచునో చూచినావా" "అప్పయ్యగారి గామమ్మ కేమిగర్వమో కాని మనుష్యులతో మాటాడనే మాటాడదే" "పుల్లమ్మ పట్టపగలే మగనితో మాటాడునట!" 'కన్నమ్మది కొంచెము నల్లకన్ను సుమీ' కరణముగారి సీతమ్మకునగ లేవో అని పరులమీఁది దోషముల నెన్నుకొనుచు మెట్లెక్కి యిండ్లకు నడిచిరి. విద్యాగంధమేమియు లేని మూఢవనితలకు మాటాడుకొనుట కంతకన్న మంచివిషయము లేమి దొరకును? అక్కడకు వచ్చెడిస్త్రీలు సాధారణముగా సంభాషించెడి యితర విషయములు సవతుల పోట్లాటలును, మాఱుతల్లుల దుర్మార్గములును, మగల యనాదరణమును, మొదలైనవి తప్ప మఱియేమియు నుండవు.

అప్పుడు కుడిచేతిలో తాటాకులమీఁద వ్రాసిన పంచాంగమును బట్టుకొని, నీర్కావిదోవతి కట్టుకొని, మడత పెట్టిన చిన్న యంగవస్త్ర మొకటి బుజముమీఁద వేసికొని, మొగమునను దేహమునను విభూతిపెండెకట్లు స్పష్టముగా గానుపింప, నిమ్మకాయ లంత లేసి రుద్రాక్షలుగల కంఠమాల ప్రకాశింప, రొండిని బెట్టుకొన్న పొడుముకాయ చిన్నకంతివలె గనఁబడ, గట్టుమీఁదినుండి పోవుచు గోదావరిలో స్నానము చేయువా రెవ్వరోయని కనులకుచేయి యడ్డముపెట్టుకొని నిదానించిచూచి, గిరుక్కున మళ్ళి యొక బ్రాహ్మణుఁడు మెట్లుదిగివచ్చెను.

బ్రాహ్మణుడు—"రుక్మిణమ్మగారూ! సంకల్పముచెప్పెదను స్నానము చేయండి"

రుక్మి—'నేను డబ్బు తీసుకొనిరాలేదే'

బ్రా—డబ్బుకేమి? మధ్యాహ్న మింటివద్ద నిత్తురుగానిలెండి; (అని వంగి నిలుచుండి) ఆచమనము చేయండి. కేశవా—నారాయణా—మాధవా—గోవిందా—పూర్వ మొగముగా తిరుగుండి. సూర్యునికేసి.

రుక్మి—స్నానము చేయవలెనా?

బ్రా—'సంకల్పము చెప్పెనిండి' అని పొడుముబుఱ్ఱను రొంటి నుండి తీసి, మూతతీసి రెండుమూఱులు నేలమీఁద మెల్లగాఁ గొట్టి యెడమచేతిలో కొంత పొడుము వేసికొని మరల నెప్పటియట్ల మూతవేసి దానిని రొండిని దోవతిలో దోపుకొని యెడమచేతిలో నున్న పొడుమును బొటనవ్రేలితోను చూపుడు వ్రేలితోను పట్టగలిగి నంత పెద్దపట్టును పట్టి బుఱ్ఱన పీల్చి రెండుముక్కులలోను ఎక్కించి, మిగిలినదానిని రెండవపట్టు పట్టి చేతిలో నుంచుకొని, ఎడమచేతిని కట్టుకొన్న బట్టకు రాచి ముక్కు నలుపుకొని, 'శుభేశోభనముహూర్తే శ్రీమహావిష్ణువరాజ్ఞయా — ప్రవర్తమానస్య — ఆద్యబ్రహ్మణః— ద్వితీయ ప్రహారార్ధే — శ్వేతవరాహకల్పే — వైవస్వతమన్వంతరే — కలియుగే— ప్రథమపాదే - జంబూద్వీపే- భరతవర్షే — భరతఖండే — అస్మిన్ వర్త మానే వ్యావహారిక చాంద్రమానేన — కాళయుక్తినామసంవత్సరే— దక్షిణాయనే — శరదృతౌ - కార్తికమాసే — కృష్ణపక్షే-ద్వాదశ్యాం. ఇందువాసరే - శుభనక్షత్ర శుభయోగ శుభకరణాద్యనేకగుణ విశిష్టా యాం మాస్యాంశుభతిథౌ — క్షేమస్థైర్యవిజయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం - అఖండగౌతమీస్నానమహం కరిష్యే—మూడుమాఱులు స్నానము చేయుండి'.

రుక్మిణి, తఱచుగా స్నానము చేయునది కానందున లోఁతు నీళ్ళలోనికి వెళ్ళుటకు భయపడి, మునుఁగుటకు చేతఁగాక మోకాలిలోఁతు నీళ్ళలోఁ గూర్చుండి కొప్పువిప్పుకొని దోసిలితో తలమీఁద నీళ్ళు పోసికొనుచుండెను. అప్పుడు సంకల్పము చెప్పిన బ్రాహ్మణుఁడు దబ్బునిమిత్తము తరువాత వచ్చెద నని చెప్పి వెడలిపోయెను. అంతట రుక్మిణి బట్టకొంగుతో తలతుడుచుకొని, శిరోజములు చివర ముడి వైచుకొని గట్టువంకఁ జూచి దూరమునుండి వచ్చుచున్న తండ్రిగారిని జూచి వేగిరము వేగిరము బయలుదేఱి, రాతిమీఁద బెట్టిన కుంకుమ పొట్లమును దీసి నొసట బొట్టుపెట్టుకొని, రెండుమాఱులు చేతితో నీళ్ళు చెంబుమీఁద పోసి తీసికొని, రెండడుగులు నదిలోనికిఁ బోయి నీళ్ళు ముంచుకొని, బట్టతిన్నగా సవరించుకొని, ఉతికిన బట్టలు భుజముమీఁదను వానిపయిని నీళ్ళతో నున్న బిందెయును పెట్టుకొని తనకొఱకయి కనిపెట్టుకొని యున్న సిద్ధాంతిగారిభార్యతోఁ గూడ గృహమునకుఁ బోవ బయలుదేఱెను.



## మూడవ ప్రకరణము

రుక్మిణి యింటికిఁ బోవుట—గృహవర్ణనము—రాజశేఖరుఁడుగారు వచ్చి కచేరిచావడిలోఁ గూర్చుండుట—బంధుదర్శనము—స్వహస్తపాకియైన వైశ్వదేవపరుఁడు.

సిద్ధాంతిగారిభార్యయు రుక్మిణియు బయలుదేఱి సోపానము లెక్కి వీధిపొడుగునను దేవాలయముదాఁక తిన్నగా నడిచి, అక్కడ నుండి కుడిచేతివంక నున్నవీధిలోనికి మళ్ళి కొంతదూరము పోయిన తరువాత, రుక్మిణి తూర్పువైపు సందులోనికి రెండడుగులు పెట్టి నిలుచుండి వెనుక తిరిగి రెండుమాఱులు మెల్లగా దగ్గెను. ఆదగ్గుతో సిద్ధాంతిగారి భార్యకూడ నిలుచుండి 'అమ్మాయీ! నేనుందునా?' అని వెనుక తిరిగి పలికెను.

రుక్మి—'మంచిది. సోమిదేవమ్మగారూ! నాకొఱకయి మీరు చుట్టుతిరిగి యింటికి వెళ్ళవలసి వచ్చినదిగదా?'

సోమి—ఎంతచుట్టు? నిమిషములో వెళ్ళెదను.

రుక్మి—'పోయిరండి'

సోమి—బీదవాండ్రము మామీఁద దయయుంచవలెనుజుండీ.

రుక్మి—'దానికేమి? వెళ్ళిరండి' అని నాలు గడుగులు నడచి మరల వెనుక తిరిగి 'సోమిదేవమ్మగారూ! చెప్ప మఱచిపోయినాను. సాయంకాలము దేవాలయములోనికి వెళ్ళునప్పుడు మీ రొక్కపర్యాయము వచ్చెదరు కాదా?'

సోమి—అవశ్యము, ఆలాగుననే వచ్చెదను. నేను పోయి వస్తునా?

అని సోమిదేవమ్మ నడచినది. సిద్ధాంతిగారు గాని, ఆయన పెద్దలుగాని యెప్పుడును యజ్ఞము చేసినవారు కాకపోయినను, సోమి

దేవమ్మ పుట్టినింటివంక వారిలో నొక్కరును యజ్ఞము చేసినవారు లేకపోలేదు. సాక్షాత్తుగా ఆమె పితామహుఁడే యజ్ఞము చేసి యేఁటేట నొక్కొక్కటిచొప్పున మూఁడుసంవత్సరములమీఁద నాలుగు శ్రావణపశువులను బట్టి మఱి రంభాదులతో స్వర్గసుఖ మనుభవింపఁ బోయెను. సోమిదేవమ్మతండ్రి యజ్ఞము చేయకపోయినను, తండ్రి యింటిలో ధనవ్యయము చేసి సంపాదించుకొన్న పేళ్ళను మాత్రము పోఁగొట్ట నిష్టము లేనివాఁడయి తన కుమారునకు సోమయాజులనియు, కూఁతురైన సోమిదేవమ్మ యనియు, నామకరణములు చేసెను. రుక్మిణియు సందులో నాలుగిండ్లు నడచి, అక్కడనుండి దక్షిణముగా తిరిగి, ఆసందులో రెండుగుమ్మములు దాఁటి పెరటి దారిని మూఁడవయిల్లు ప్రవేశించెను.

రాజశేఖరుఁడుగారి యిల్లు ఆకాలపుటిండ్లలో మిక్కిలి సుందరమైనది. వీధిగుమ్మమునకు రెండుప్రక్కలను రెండు గొప్ప అరుగులు కలవు. ఆ రెండుఅరుగులకును మధ్యనుపల్లముగా లోపలికిఁ బోవునడవ యున్నది. ఆనడవ మొగమున సింహద్వార మున్నది. ద్వారబంధపు పట్టెలకు గడపదాపున ఏనుఁగుతలమీఁద సింహము గూర్చుండి కుంభస్థలములను బద్దలు చేయుచున్నట్టు చిత్రముగా చెక్కఁబడి యున్నది. ఇరుప్రక్కలనుండు నాసింహములయొక్క శిరోభాగములు మొదలుకొని గొడుగుబల్లవఱకును పువ్వులును కాయలును గల లత చెక్కఁబడి యున్నది. ఈకమ్ములకు పయిగా రెండుప్రక్కలను కఱ్ఱగుఱ్ఱములు వీధివైపునకు ముందఱికాళ్ళు చాచి చూచువారిమీఁద దుముకవచ్చునట్లుగాఁ గానిపించును. ఈగుఱ్ఱముల కాళ్ళకే శుభదినములందు మామిడాకులతోరణములు గట్టుచుందురు. గుఱ్ఱముల రెంటికిని నడుమనుండు గొడుగుబల్లమీఁదఁ నడుమను

పద్మమును పద్మముల కిరుపార్శ్వములను గుత్తములవఱకు చిత్రము లయిన యూకులును పువ్వులునుగల తీఁగెయును చెక్కఁబడియున్నవి. ఆతీఁగపైని కాళ్లు మోపి ఫలములను ముక్కుతో పొడుచుచున్నట్లు నడుమనడుమ చిలుకలు చిత్రింపఁబడి యున్నవి. వీధితలుపులకు బల మయినగ్రంధులు చేయఁబడి వానికయినిసహితి మొకవిధ మయిన పుష్పలత మలఁచఁబడి యున్నది.

గుమ్మము దాటి లోపలికి వెళ్ళినతోడనే చావడి యుండెను. ఆచావడి కెదురుగా పెద్ద కుండు ఒకటియుండెను. వర్షము కురియు నప్పుడు నాలుగు వైపులనుండియు చూరు నీళ్ళాకుండులోఁ బడి వీధి చావడి క్రింద నుండు తూముగుండ వీధిలోనికిఁ బోవును. ఆకుండు కుత్తరపువైపునను దక్షిణపువైపునను ఒకదానికొకటియెదురుగా రెండు చావళ్ళుండును. అందు దక్షిణపుది కచేరిచావడి. దానిలో వివా హాదులయందు తాంబూలములకు పిలిచినబంధువులును పెద్దమనుష్యు లును సభచేసి కూర్చుండఁగా, క్రింద భోగముమేళము జరుగు చుండును. ఇతరసమయములలో పెద్దమనుష్యులు చూడ వచ్చినప్పు డును, మధ్యాహ్నభోజన మయినతరువాత పురాణకాలక్షేపము జరుగు నప్పుడును, శిష్యు లప్పుడప్పుడు చదువుకోవచ్చినప్పుడును రాజ శేఖరుఁడుగా రందుకూర్చుందురు. ఆచావడికి రెండుప్రక్కలను రెండు గదులు గలవు. ఆచావడి దక్షిణపువైపుగోడకు పొడుగునను ఱెక్కల తలుపు లుండి, తీసినప్పు డెల్లను సభవారిచెమట లార్ప మలయ మారుతమును లోపలికిఁ బంపుచుండును. ఆతలుపులకు వెనుక పంచ పాళియు, దానివెనుక పలువిధము లయినపూలమొక్కలతో నేత్రము లకు విందుకొలుపు చిన్నదొడ్డి యుండెను. ఆచావడిలో మూడు గోడలకును సిలువె డెత్తునకుపయిని మేకులకు గొప్పపటములు

వేయఁబడియున్నవి. అందు దశావతారములును మాత్రమే కాక, కృష్ణుఁడు గోపికల వలువలు నెత్తికొనివచ్చి పొన్నచెట్టుమీఁదఁ గూర్చుండి వారిచేఁ జేతు లెత్తి మ్రొక్కించుకొనుచున్నట్టును, వెన్నలు దొంగిలినందు కయి తల్లి రోటను గట్టిపెట్టి దాని నీడ్చుకొని పోయి మద్దులఁ గూలఁద్రోచినట్టును, మఱియు ననేకవిధముల కృష్ణ లీలలుగల పటములును, కుమారస్వామి తారకాసురుని జంపుచున్నట్టును, పార్వతి మహిషాసురుని వధించుచున్నట్టును, శివుఁడు త్రిపురసంహారమును చేయుచున్నట్టును నున్న శివసంబంధము లయిన పటములును, విఘ్నేశ్వరుఁడు, సరస్వతి, గజలక్ష్మి, చతుర్ముఖుఁడు మొదలుగాఁగల మఱికొన్ని పటములును, గోడల నలంకరించుచుండును. ఉత్తరపుప్రక్క చావడియు ఈవిధముగానే యుండును. గాని గోడ కొక్కగుమ్మము మాత్రమే యుండి, అది తరుచుగా మూయఁబడి యుండును. ఈచావడిలో రెండుమూఁడు పాతసవారీ లెప్పుడును వ్రేలాడఁ గట్టఁబడి యుండును. రాజశేఖరుఁడుగా రప్పుడప్పుడు గ్రామాంతరములకుఁ బోవునప్పుడును పెద్దమనుష్యు లెవ్వరయినఁ దఱుచుగా నెరు వడుగునప్పుడును ఉపయోగపడుచుండు క్రొత్తసవారిమాత్రము బురకా వేయఁబడి చావడిలో క్రిందనే పడమటిగోడదగ్గఱఁ జేర్పఁబడి యుండును. ఈచావడిగోడ కున్న తలుపు తీసి యుత్తరపు పంచపాళిలోనికి పోయినతోడనే దొడ్డిలో నుయ్యియొకటి కనఁబడును. ఆనూతిపయి నుండుగిలకలు కీచుధ్వని చేయుచుండ నిరుగుపొరుగులవారు సదా నీళ్ళుతోడుకొని పోవుచుందురు. ఆనూతికి పడమటివైన ధాన్యము నిలువచేయు గాదెలు రెండు లోగిలిని చేరక ప్రత్యేకముగాఁ గట్టింపఁబడియున్నవి. నూతికి సమీపముగా వీధిలోనికి పాణిద్వార మొకటి యున్నది. ఇంతకు మునుపు రుక్మిణి వచ్చినదాద్వారముననే. ఆదారినే యిరుగుపొరుగువారు

వచ్చి నీళ్ళుతోడుకొని పోవుచుందురు. మఱియు మధ్యాహ్నసమయమున చుట్టుప్రక్కల నుండుస్త్రీలు వారిని చూడవచ్చునప్పుడును, రాజశేఖరుఁడుగారు కచేరీసావడిలోఁ గూర్చున్నకాలమున లోపలి యాఁడువారు వెలుపలికి వెళ్ళవలసినపుడును, ఆత్రోవనే వచ్చుచుఁ బోవుచుందురు.

లోపలికుండునకు నాలుగుప్రక్కలను పనసకాయలు చెక్కిన నాలుగు స్తంభము లున్నవి. వీధిచావడి కెదురుగానుండు పడమటి చావడిలో లోపలికిపోవు నడిమిగుమ్మ మొకటి యున్నది. ఆ గుమ్మమున లోపలికిఁ బోవఁగానే చావడియొకటి కనిపించును. ఆచావడికి దక్షిణపువైపున గుమ్మ మొకటి యున్నది. ఆద్వారమున లోపలికివెళ్ళిన రాజశేఖరుఁడుగారు పరుండుగదిలోఁ బ్రవేశింతురు. గదిలో నుత్తరపుగోడపొడుగునను దూర్పునుండి పడమటకు పందిరిపట్టెమంచము రాతిదిమ్మలమీఁద నాలుగుగాళ్ళును మోపి వేయఁబడి యున్నది. మంచమునకుచుట్టును దోమతెరయును జాలరును దిగవేయఁబడి యున్నది. పందిరిస్తంభములకు నడుమను లక్కపూసిన కొయ్యపళ్ళెములును బరిణెలు నుండెను. పందిరికిమధ్యగా లక్కకాయలును పువ్వులునుగల చిలుకలపందిరియొక్కటి వ్రేలాడుచుండును. గోడలకు సుద్దతో వెల్ల వేయఁబడియుండెను. గోడలపొడుగునను రుక్మిణియు తల్లియు నోపికచేసికుట్టిన గోడసంచులు తగిలింపఁబడి యుండెను. ఆ గోడసంచులకు కొంచెముమీఁదుగా గుడ్డచిలుకలు దారములతో త్రాళ్ళకు కట్టఁబడి గాలికి సుందరముగా కదలుచుండును. గోడకు పెద్దమేకులు కొట్టి వానిమీఁదఁ బెట్టిన బల్లమీఁద కొండపల్లిబొమ్మలును లక్కపిడతలును గది కలంకారభూతముగా నుండెను. గోడ

పంచులు కొట్టిన మేకులకు దశావతారములు మొదలయిన పటములు చిన్నవి వేయఁబడియున్నవి. దక్షిణపుగోడకు శ్రీరాముని వారి పట్టాభిషేకము తగిలింపఁబడి యున్నది. దానినే రాజశేఖరుఁడుగారు నిద్రలేచినతోడనే చూచి, ఆవల మఱియొకవస్తువును జూతురు. గదికిఁ బయిని అందమయిన బల్లకూర్పు కూర్పఁబడియుండెను. మంచమునకు యెదురుగా దక్షిణపుగోడపొడుగునను గడమంచెమీఁద వరుసగా కావడిపెట్టెలు పెట్టఁబడి యున్నవి. ఆ పెట్టెలలో సాధారణముగా ధరించుకొను వస్త్రములును నాగరలిపితో బంగాళాకాకితములమీఁద వ్రాయఁబడిన రాజశేఖరుఁడుగారి సంస్కృతపు స్తకములును వేయఁబడియుండెను. గదిలో పడమటిగోడతట్టున పెద్దమందస మొకటి గట్టితాళము వేయఁబడి యుండెను. ఆమందసములోపలనున్న చిన్న తాళపుపెట్టెలలో నగలును పండుగుదినములలో ధరించుకొను విలువ బట్టలును రొక్కమును ఉండును. చీఁకటిరాత్రులలో దొంగల భయము విశేషముగా నుండునప్పుడు రాజశేఖరుఁడుగారు ఆమందసముమీఁదనే పఱుపు వేయించుకొని పరుందురు. మందసమునకును కావడిపెట్టెలున్న గడమంచెకును మధ్యను దక్షిణపువైపున గదినుండి దొడ్డిలోనికిఁ బోవుమార్గ మొకటి కలదు. ఆమార్గమున దొడ్డిలో ప్రవేశించినతోడనే విశాలమయిన చేమంతిమడి యొకటి పచ్చని పూవులతోను మొగ్గలతోను నేత్రోత్సవము జేయుచుండెను. దాని కెడమప్రక్కను గొంచెముదూరమున మల్లెతీఁగెలు పందిరిమీఁద నల్లుకొని యకాలమగుటచే నప్పుడు పుష్పింపకపోయినను పచ్చనికాంతుల నీనుచు మనోహరముగా నుండెను.

రాజశేఖరుఁడుగారి పడకగది ముందఱిచావడిలో దూలమునకుఁ జిలుకపంజర మొకటి వ్రేలాడఁగట్టఁబడియుండెను. అందులోనున్న చిలుక సదా "ఎవరువారు" "ఎవరువారు" "పిల్లివచ్చె కొట్టు

కొట్టు" "కూగోయి తోటకూర" మొదలగు మాటలను సహజమధుర స్వరముతో పలుకుచుండును. ఆ దూలమునకే మఱికొంత దూరమున రామాయణము మొదలయిన తాటాకులపుస్తకములు త్రాళ్ళతో వ్రేలాడఁగట్టఁబడి యుండెను. ప్రొద్దుననే నిద్రలేచి రుక్మిణి చిలుకను పంజరమునుండి తీసి చేతిమీఁద నెక్కించుకొని "చేతిలో వెన్న ముద్ద" మొదలుగాఁగల పద్యములను సహితము నిత్యమును నేర్పు చుండును. ఆకాలములోఁ దఱుచుగా స్త్రీలు చదువుకొను నాచారము లేకపోయినను, రాజశేఖరుఁడుగారు తన కుమార్తెమీఁది ముద్దు చేత దానె రుక్మిణికి క్రొత్తపుస్తకమును అన్యసాహాయ్యము లేకుండ నర్థముచేసికొను శక్తిగలుగునంతవఱకు విద్యను చెప్పెను. ఆమె స్వభావముచేతనే తెలివిగలదగుటచే విద్యకూడ దానికి సాధనమయి చిన్నతనములోనే యుక్తాయుక్తవివేకమును జ్ఞానమును గలదియాయెను. తండ్రి యామెకు చదువుచెప్పుటచూచి యసూయచేత నిరుగుపొరుగులవారు చాటున గుసగుసలాడుకొనిరి గాని, రాజశేఖరుఁడుగారు ధనికు లగుటవలన నేమియుఁ బలుక సాహసింపక పోయిరి. అట్లని వారు బొత్తిగా నూరకున్నవారుకారు. పెద్దవాఁడని రాజశేఖరుఁడు గారు గౌరవముతోఁ జూచుచుండెడి యొకయాప్తబంధుని మెల్లఁగా ప్రేరేపించి, ఆయనచేత అందఱును సభలోఁ గూర్చుండియుండఁగా "నాయనా! మనయింట ఆఁడుపిల్లలను జదివించు సంప్రదాయము లేదే, మన రుక్మిణి నేలచదివించెదవు?" అనిపించిరి. రాజశేఖరుఁడు గారు విద్యవలని లాభముల నెఱిఁగినవాఁ డగుటవలనను, స్త్రీవిద్య యేశాస్త్రమునందును నిషేధింపఁబడి యుండకపోవుటయు పూర్వపు పతివ్రత లందఱు విద్యావతు లయి యుండుటయు నెఱిఁగినవాఁ డగుటవలనను ఆవృద్ధునివాక్యములను లక్ష్యము చేయక స్త్రీవిద్యా భ్యాసమున కనుకూలముగాఁ గొన్ని స్మృతివాక్యములను జదివి వినా

యభిప్రాయ మేమని సభలోనున్నవారి నడిగెను. వారందఱును మనసులో స్త్రీవిద్యయన్న నేవగించువారే యయినను రాజశేఖరుఁడు గారి యభిప్రాయము తెలిసినపిమ్మట దానికివ్యతిరిక్తముగా నేమియు జెప్ప నలవాటుపడినవారు కారు గావున స్త్రీవిద్యాభ్యాసమువలన గణనాతీతము లయిన లాభములు గలవని పొగడి రుక్మిణికి విద్యనేర్పు చున్నందున కయి రాజశేఖరుఁడుగారిని శ్లాఘించిరి.

చిలుకపంజర మున్నతావునుండి నాలుగుబారలు నడచిన తరువాత పడమటింటిద్వార మున్నది. పడమటియిల్లు విశాలమయి యేఁబదిమంది బ్రాహ్మణులు భోజనములు చేయుటకుఁ జాలియుం డును. ఇఁకఁ గొంచెముసేపునకు భోజనములకు లేతు రనఁగా వెళ్ళి చూచినయెడల, మూరెడు మూరెడెడముగా రెండుగోడల పొడుగు నను పీటలును పీటలకుముందఱ పిండిముగ్గుతో పెట్టిన పట్లును చాలుగా నుండును. పడమటింటి యీశాన్యమూలను గచ్చుతోఁగట్టిన దేవునరుగు కలదు. ఆయరుగుపయిని 'భువనేశ్వరి' మను దేవతార్చన సామానులును సాలగ్రామాదులును పెట్టు పెట్టె యుండును. ఆపెట్టె మీఁదనే రాజశేఖరుఁడుగారు మడితో నిత్యమును పారాయణచేయు శ్రీమద్రామాయణము సుందరకాండము పెట్టఁబడియుండెను. రాజ శేఖరుఁడుగారు స్నానముచేసి వచ్చి దేవునరుగుముందఱ పీటవేసికొని కూర్చుండి రామాయణమును పంచపూజయు చేసికొందురు. దేవు నరుగున కెదురుగా నున్నతలుపుతీసికొని యావలకు వెళ్ళినచో నొక పెరటిలోనికిఁబోవుదుము. అక్కడనున్నముత్తోను ఇటికలతోను కట్టిన తులసికోటయొకటి నాలుగయిదడుగులయెత్తున నందమై యుండెను. ఆకోటలోపల లక్ష్మీతులసియు కృష్ణతులసియు శ్రద్ధాభక్తులతోఁ బెంపఁ బడుచుండెను. ఆసమీపముననే కొంచెముదూరమున తులసివనమును

ఆవల నిత్యమల్లెచెట్టును వాని చేరువనున్న నందివర్ధనపుచెట్టుమీఁద నల్లుకొన్న కాశీరత్నములును రాజశేఖరుఁడుగారికి నిత్యమును దేవతార్చన కయి పుష్పపత్రాదులను సమకూర్చుచుండును. ఆపైని రుక్మిణియుఁ జెల్లెలును బ్రేమతోఁ బెంచుకొనుచున్న బంతిచెట్లును, బొగడబంతిచెట్లును, జంద్రకాంతపుచెట్లును గోడ పొడుగునను వరుసగా నుండును. పడమటింటి నంటియే దక్షిణపువైపున నున్న వంటయింటి దొడ్డిలోపల నరఁటిబోదెలు పిలకలతో నిండియుండి చూపునందముగా నుండును. రాజశేఖరుఁడుగారు ప్రత్యహమును ఆబోదె మొదలనె స్నానము చేయుదురు.

వెనుక చెప్పినచొప్పున రుక్మిణి స్నానముచేసి వచ్చి గోదావరి నుండి చెంబుతోఁ దెచ్చిననీళ్ళను తులసికోటలోఁ బోసి మ్రొక్కి, తడిబట్టలతోనే చుట్టును మూఁడు ప్రదక్షిణములుచేసి, లోపలికిఁ బోయి తడిబట్ట వదలి పట్టుబట్ట కట్టుకొని యొకచేతిలోఁ గుంకుమబరిణియుఁ రెండవచేతిలో నక్షతలును బసపును బియ్యపుపిండియును గల గిన్నెల పెట్టెయును బట్టుకొని వచ్చి, తులసికోటలో నంటియున్న ముందరివేదిక మీఁద నీళ్ళు చల్లి చేతితో శుభ్రముచేసి బియ్యపుపిండితో పద్మములు మొదలయిన వింతవింతల ముగ్గులను బెట్టుచు నడుమనడుమఁ జిత్రముగాఁ గుంకుమతోను పసపుతోను నలంకరించుచుఁ గూర్చుండి, మధురస్వరముతో మెల్లగా, 'లంకాయోగము'ను పాడుకొనుచుండెను.

ఈలోపుగా రాజశేఖరుఁడుగారు వెంట నున్న వారితో నానా విషయములను ముచ్చటించుచు నడుమనడుమ వారి కిర్రుచెప్పుల జోళ్ళ చప్పుడులలో నడఁగిపోయిన మాటలను మరల నడుగుచుఁ బలువురతోఁ గలసి యింటికి వచ్చి, పాదరక్షలను నడవలో విడిచి యొకరొకరేవచ్చి కచేరిచావడిలో రత్నకంబళములమీఁదఁ గూర్చుం

పట్టుశాటి కట్టుకొని స్వాములవా రెప్పుడును కుంకుమముతో పీఠపూజ చేయుచుందురు. ఆపీఠములో శ్రీ యంత్రముకూడ నున్నదనియు, వారు పూర్వాశ్రమమునందు సహితము శ్రీవిద్యోపాసకులే యనియు విన్నాఁడను. అది సత్యమౌనో కాదో కాని వారిప్పుడు మాత్రము రాత్రులు చీఁకటిలో ముసుఁగు వేసికొని యొక మనుష్యుని వెంటబెట్టు కొని ప్రత్యక్ష మయిన శ్రీయుపాసనము చేయుటకె బయలుదేఱు చుందురని చూచినవారే యొకరు నాతో రహస్యముగాఁ జెప్పినారు. మొన్న నీనడుమ నొక శిష్యుఁ డెత్తుకొని పాఱిపోయినది గాక, యింకను పీఠమునకు రెండువేల రూపాయల వెండిసామగ్రి ఉన్నది.

రాజ—వారు గ్రామములో నున్నకాలములో మతసాంకర్య నివారణముగాని మతవ్యాపనముగాని చేయుట కేమయిన ప్రయత్నము చేసినారా ?

సుబ—అట్టిపను లేమియు చేయలేదుగాని యొక్క ఘనకార్య మును మాత్రము చేసినారు. ఆగ్రామములో ధనవంతురాలయిన యొక బాలవిధవ యున్నది. ఆమెయేమో భ్రూణహత్య చేసినదని గ్రామము లోని సభాపతులు కొందఱామెను జాతినుండి బహిష్కారముచేసిరి. తరు వాత నామెకు జగన్నాథసంతర్పణము చేసినప్పుడు ధనము కాశపడి కొందఱు బ్రాహ్మణులు భోజనములు చేసిరి. అందుచేత నక్కడకు భోజనములకు వెళ్ళినవారందరు నొకకక్షగాను, వెళ్ళనివారందరు నొక కక్షగాను నేర్పడిరి. లోకమున కెల్లను ధనమె మూలమగుటచేతను, ఆమె లక్షవత్తులనోము మొదలయిన వ్రతములుచేసి యప్పుడప్పుడు బ్రాహ్మణసమారాధనలు చేయుచు వచ్చుచుండుటచేతను, క్రమక్రమ ముగా సంఖ్యయం దామె పక్షమువారే బలపడి మొదట వెలివేసిన వారికే యిప్పుడు వెలిగా నుండెను. తరువాత స్వాములవారు విజయం

చేసి యీరెండు పక్షములవారిని సమాధానపఱచి, ఆమెయొద్ద తాము రెండువందల రూపాయలను స్వీకరించి యీమెకు పుస్తెమెట్టెలు తీసి వేయించి, ఆ కేశఖండన మహోత్సవమయిన మఱునాఁడే యామె యింట భిక్షచేసి ముందుగా తాము పాదోదకము పుచ్చుకొని తరువాత బ్రాహ్మణుల కందఱకును నిప్పించి నాటితో నామె వెలి తీర్చివేసిరి.

రాజ—ఆ స్వాములవారు పూర్వాశ్రమములో నేగ్రామ నివాసులు ?

సుబ్ర—వారి నివాసస్థలము ముంగొండయగ్రహారము. ఆయనకు నలుగురు కొమాళ్ళున్నారు. ఆశ్రమమును స్వీకరించిన తరువాతనే స్వాములవారు మునుపు మాన్యములమీఁద నున్న ఋణములను దీర్చివేసి నలుగురు కొమాళ్ళకును వివాహములు చేసి కోడండ్ర కొక్కొక్కరికి రెండేసివందల రూపాయల యాభరణము లుంచినారు. ఇప్పుడీస్వాములవారిపేరు శ్రీ చిదానందశంకర భారతిస్వామి యఁట.

అని మాటాడుకొనుచు వారు రాజసభకుఁ బోవునప్పటికి రాజుగారు కొలువుకూటమునకు విజయంచేసి సింహాసనాధిష్ఠితులై కూరుచుండియుండి మంత్రి తెచ్చియిచ్చిన విజ్ఞాపనపత్రికలను జదివి చూచుకొని పిఠాపురమునుండివచ్చిన దొంగలను తమయెదుటఁ బెట్టుటకు త్వరపుచేసిరి. ఈలోపల రాజశేఖరుఁడుగారును సుబ్రహ్మణ్యమును నృసింహస్వామియు సభ ప్రవేశించి తగినచోటులఁ గూరుచుండిరి; రాజభటులును దొంగలనుగొనివచ్చి ప్రభువునెదుర నిలువఁబెట్టి తాము ప్రక్కలను కత్తులుదూసికొని నిలుచుండిరి. అప్పుడు రాజుగారు సభ కలయఁజూచి 'యీదొంగలను పట్టుకొన్నవా రెవ' రని ప్రశ్న వేసిరి. సుబ్రహ్మణ్యము లేచి నిలువఁబడి 'నేను' అని మనవిచేసెను. తోడనే ప్రభువువారు రాజశేఖరుఁడుగారివంక దృష్టిబరపి "యీతడు

మీకొమారుఁడు కాఁడా ” అని యడిగి “ చిత్రమని ” యాయన బదులుచెప్పఁగా విని యెదమప్రక్కను గూరుచున్నవా రెవరని మరల నడిగిరి. రాజశేఖరుఁడుగారు చేతులు కట్టుకొని నిలుచుండి యీతఁడు తమ యల్లుఁడగుటయు గిట్టనివాఁడొకఁడు ఆతఁడు వారణాసీపురముననున్న కాలములో వచ్చి మృతుఁడయ్యెనని వట్టిప్రవాదము వేయుటయు రుక్మిణి దొంగలచేత దెబ్బతిని మూర్ఛపోయియుండఁగా తన్నందఱును దిగవిడచిపోయిన తరువాత మూర్ఛ తేఱి పురుషవేషము వేసికొని సీతనెత్తుకొనిపోయిన గ్రామమునుండి చెల్లెలితోఁ గూడ వచ్చుటయు సమగ్రముముగా విన్నవించిరి. రాజుగారు హర్షమును దెలుపుచు శిరఃకంపముచేసి, కొంతసే పూరకుండి యావంకఁదిరిగి “ మీరేమి చెప్పుకొనెద ” రని యడిగిరి.

నీలా—సర్వమును దెలిసిన దేవరవారికడ మేము వేఱుగ చెప్పుకోవలసిన దేముండును ? మేము నిరపరాధులమని చెప్పఁబోము. దేవరవారు దయాపూర్ణ హృదయులు గనుక ఆదయారసమును మామీఁదఁ బ్రసరింపజేయ దీనత్వముతో వేడుకొనుచున్నాము.

కృష్ణ—నీది యేదేశము ? చిన్నప్పటినుండియు నీ వెక్కడ నున్నావు ? నీచరిత్రమేమి ?

నీలా—నాచరిత్రము మిక్కిలి యద్భుతమయినది. నేను దానిని చెప్పుకొనుటకు సిగ్గుపడవలసియున్నను దేవరయంతటివారడుగుచున్నారు గాన దాఁచక విన్నవించెదను. ఈవఱకు నేను జేసిన దుష్కృత్యము లన్నిటిని తీఱికగలిగి యున్నప్పుడెల్ల నాకు స్మరణకుఁదెచ్చి నామనస్సు పలువిధముల నన్ను బాధించుచున్నది ; రాత్రులు నన్ను నిద్రపోనీయదు ; కలలోసహితము నేను జేసిన ఘోరకృత్యములకు రాజభటులు నన్నుఁగొనిపోయి శిక్షించుచున్నట్టు

కనఁబడి యులికి పడుచుందును. అంతేకాక నాకిప్పుడు వార్ధికమువచ్చి యున్నది. కాఁబట్టి చిరకాలము బ్రతుకఁబోను. ఆ సంగతిని తలఁచుకొను నప్పుడెల్ల నాకు యమభటులవలన భయముచేత దేహము కంప మెత్తుచున్నది. రాజదండనను పొందినవారికి యమదండన లేదని పెద్దలు చెప్పుదురు. కాఁబట్టి నేను చేసిన పాపమునకు మీవలన శిక్షను బొంది సుఖింపఁగోరుచున్నాను.

కృష్ణ—నీచరిత్రమంత యద్భుతమయిన దయ్యేనేని, సవాకల్యముగా వినిపింపుము. ఇచ్చట నున్నవారందఱును విని యానందించెదరు.

నీలా—నాజన్మస్థానము కాశీపట్టి. నా తల్లిదండ్రులంతగా ధనవంతులు కాకపోయినను శూద్రకులములలో మిక్కిలి గౌరవమును కాంచిన వంశమునందుఁ బుట్టినవారు. నాతల్లిదండ్రులకు నేనొక్కఁడనే పుత్రుఁడను గనుక నన్నువారు మిక్కిలిగా రాబమ్ముతోఁ బెంచుచుండిరి. నేనేది కావలెనన్నను తత్క్షణము తెచ్చిపెట్టుచుండిరి. అయిదేండ్లు వచ్చినతరువాత నన్నొకనాఁడు చదువవేసి, పంతులకు దోవతుల చాపును గట్టఁబెట్టిరి. ఆపంతులేవిధమునను దనకు జీవనము జరగనందున పీనుగులమోతయు వ్యాపారమునఁ బ్రవేశించి ముసలివాఁడయి తాను చిన్నప్పుడైనను చదువుకొన్నవాఁడు కాకపోయినను తుదకు చదువులబడిని జీవనోపాధిగా నేర్పఱచుకొని మాగ్రామమును జేరెను. ఆతఁడుచెప్పెడు చదువొక్కముక్కయైనను లేకపోయినను గొట్టెడిదెబ్బలు మాత్ర మక్షరలక్షగా నుండెను. అయిన నాతఁడు ధనమిచ్చిన వారి యెడ మిక్కిలి ప్రేమ గలవాఁడు గనుక నాతల్లిదండ్రులు చిఱుతిండి నిమిత్తమయి నాకిచ్చెడి సొమ్ములో సగము పండితులకిచ్చి దెబ్బలు తప్పించుకొంటిని. అందుచేత పంతులు నామీఁద నత్యంతప్రేమగల వాఁడై నాకు బడి పెత్తనమిచ్చి, నాతల్లిదండ్రులతో మీకొమారు

సంతతి బుద్ధిమంతుఁడు లేఁడని చెప్పుచుండును. చిన్నప్పటినుండియు నేను నిజముగా సూక్ష్మబుద్ధికలవాఁడను నేర్పుకలవాఁడను అవుదును. నా నేరుపరితనమువలన మావారి కెప్పుడును నష్టమేకాని చిల్లిగవ్వ యైనను లాభముకలుగకపోయినను నాజననీజనకులు నన్ను నేరుపరిని గా నెంచి సంతోషించుచుండిరి. ఏలయనిన, నేను నా నేరుపంతయు నితరులను మోసముచేయుటయందే యుపయోగించుచు వచ్చితిని. నేను మోసములను నేర్చుకొనుటలో నిచ్చినశ్రద్ధలో సగమైనను ఏదో యొకవృత్తిని నేర్చుకొనుటలో నిచ్చియుంటినేని, నేనీపాటి యెంతో భాగ్యవంతుఁడనై యుందును. ఆసంగతి నట్లుండనిండు. నాకు బడి పెత్తనము వచ్చుటచేత పంతులుతో చాడిచెప్పి కొట్టించెద నని పిల్లలను బెదరించి తినుబడి పదార్థములను లంచముపుచ్చుకొనుచుందును. ఇట్లుండఁగా నా దురదృష్టవశమున ఆపంతులు కాలముచేసెను. ఆకాలములో పంతులెంతవిస్తారముగా దెబ్బలుకొట్టుచున్న నంతగట్టివాఁ డనిపించుకొనుచుండును గనుక చదువుకొన్న పంతు లదివఱకే మాయూర బడి పెట్టుకొనియున్నను, అతఁడు పిల్లలయందు ప్రేమగలవాఁడై నిష్కారణముగా కొట్టుటకు పాలుపడనందున, పిల్లల నెవ్వరు నాతనిబడికిఁ బంపకుండిరి. ఇప్పుడు గ్రామములో రెండవపంతులు లేనందున, మాబడిలోని పిల్లలనందఱను విధిలేక యక్కడకే పంపవలసివచ్చెను. ఈకొత్త పంతులవద్ద మునుపటివలె నా యాట లేమియు సాగినవికావు. ఇంతలో మాతండ్రియు నాకస్మికముగా గుండెలలో నొప్పివచ్చి లోకాంతరగతుఁడయ్యెను. అతఁడు తనధనము నెక్కడనో పాతిపెట్టి మరల కాలమునం దెవ్వరితోను చెప్పకయే కాలముచేసినందున పెద్దమ్మవారు మమ్ము మఱింత శీఘ్రముగా వచ్చి యాశ్రయించెను. ధనికుఁడైన మా పొరుగువారి పిల్లవాఁడొకఁడు మాబడిలోనే చదువుకొను

చుండెను ; ఆతఁడు చదువునందు మిక్కిలి యాశక్తి కలవాఁడు; ఆతనితో నేను మైత్రిచేసికొని మిక్కిలి నమ్మకమిచ్చి మెలఁగుచుంటిని. కొందఱు నమ్మకమిచ్చినప్పుడు మనసుకూడనిచ్చి యూరకుందురు; నేను తెలివిగలవాఁడను గనుక ఆలాగున జేయక వేయినమ్మకము లిచ్చినను మనసుమాత్ర మియ్యక దాఁచుకొంటిని. ఈప్రకారముగా నుండి యతనిని పలువిధముల మోసముచేసి ధనమార్జించు చుంటిని. అది యేమి మాయయోకాని నేనెన్నివిధముల మోసముచేసి ధనము సంపాదించుకొనుచున్నను బీదవాఁడనుగాను, అతఁడు ధనవంతుఁడు గాను ఉంటిమి. అతఁడు విద్యయందు వృద్ధిపొందినకొలఁది, నేను ద్యూతవిద్యయందు పాండిత్యమును పొందనారంభించితిని. చెడుపిల్ల వాండ్రతోడి సాంగత్యమువలనఁ జదువు మానివేసి డబ్బుపెట్టి జూద మాడ మొదలుపెట్టి యావ్యసనములోఁ బడి యింటఁగల వస్తువులను దొంగతనముగాను బలవంతముగాను దీసికొనిపోయి జూదగాండ్రకు సమర్పించుచుందును. ఇట్లుండియు మాపొరుగు చిన్నవానితోడి చెలిమిని మాత్రము మానలేదు. ఆతనిపేరు భాస్కరుఁడు, నాపేరు పద్మనాభుఁడు. ఇట్లు జరుగుచుండఁగా నాకు పదియాఱుసంవత్సరములు దాఁటినవి; నామిత్రుఁడు పెద్దవాఁడై గృహ యాజమాన్యమును వహించి విద్యాభిరుచి గలవాఁడై సదాపండితులగోష్ఠిని బ్రొద్దుపుచ్చు చుండెను. నేనొకనాఁ డితనియొద్దకు బోయి నాస్థితిగతులను జెప్పు కొని నాతండ్రియు వర్తకుఁడే గనుక నాకు వ్యాపారము చేయ నిష్టముకలదనియు మూలధనము క్రింద నేమైనఁబెట్టుబడి బెట్టి సాయము చేయవలసినదనియు కోరితిని. అతఁడు తానుగూడ పాలికుండెదనని చెప్పి రెండువందల రూపాయలను నాచేతికిచ్చి నేను పనిచేయుటకును తాను వడ్డి పుచ్చుకొనకుండుటకును వచ్చిన లాభముతో చెటిసగము

చూచుకొనుటకును నన్నొకడ బఱిచి పంపెను. మాకు వచ్చిన లాభము స్వల్పమే యైనను పనిచేయువాఁడను గనుక నాకెక్కువ లాభము కావలెనని నేను నా మిత్రునితో కలహము పెట్టుకొన జొచ్చితిని. రాజు లనుభవించుటకు రాజ్యములున్నను, ఒకరితో నొకరు పోట్లాడిచత్తురు; సన్యాసులకు కౌపీనము కంటె నధిక మేమియు లేకపోయినను పోరులేక సంతుష్టి పొంది యుందురు. దైవము దయచేసినదానితోఁ దృప్తి పొందియున్న నేకలహములును గలుగవు. తృప్తిలేక యాశా పిశాచముచే నావహింపఁబడినచో నెల్ల కలహములును గలుగును. అయినను నాస్నేహితుఁడు మిక్కిలి మంచివాఁడును ఉదారసాహసము కలవాఁడును గనుక, ఒకనాఁడు నన్ను తనదగ్గఱకుఁ బిలిచి యిట్లనియెను.

"నీవు మొదటినుండియు వర్తకుఁడవుగా నున్నావు గనుక నీకుసొమ్మునందే యిష్టము; నాకు విద్యాధనమునందు మాత్ర మిష్టము. త్యాగభోగముల కక్కఱకు రాకపోయినను ధనమునుజూచు కొనుచున్నను నీకు సంతోషము కలుగును. నాకు గౌరవముతో జరగుట కున్నంజాలును. కాఁబట్టి యీ రెండువందల రూపాయలను నీవు పుచ్చుకొమ్ము".

అనియాతఁడు పెట్టుబడి పెట్టిన సొమ్మును నాకు విడిచిపెట్టెను. ఆసొమ్ము చేతికందిన సంతోషముచేత, మఱింత యుల్లాసముతో దుకాణము కట్టిపెట్టి రాత్రియు పగలునుకూడ జూదమాడ సాగించి కొన్ని మాసములలో సొమ్మంతయుఁ బోఁగొట్టుకొని జోగినైతిని. తరు వాత పశ్చాత్తాపపడి, తిండికిసహితము జరగక యిబ్బందిపడుచు నొక నాఁడు మాసికలువేసిన బట్టలతో స్నేహితునియొద్దకుఁ బోయి యాతఁడు చేసిన యుపకారమును బహువిధములఁ గొనియాడి నాకు

సంభవించిన కురవస్థయంతయుఁ జెప్పుకొంటిని. అతఁడు నాస్థితిని విని మిక్కిలి విచారపడి, సొమ్ము చేతనుంచినయెడల పాడుచేయుదు నని యెఱిఁగి, యొకస్నేహితునకు జాబువ్రాసి నన్నచటికిఁ బంపెను. నేనా యుత్తరమును దీసికొనిపోయి చూచినతోడనే యాతఁడు నన్ను మధ్యాహ్నమున రమ్మనిచెప్పి నాకు నెలకు పదిరూపాల జీతముగలపని నొకదాని నిచ్చెను. నేనాపనిలో రెండుమాసము లుండువరకు నాకది యెంతో భారముగా కనఁబడెను. ఒంటిగానున్నప్పుడు నాకంటఁబడిన వస్తువులనెల్లను హస్తలాఘవమునుజూపి నేను మాయముచేయుచు వచ్చినందున, నాయజమానుఁడు వారిమీఁదనుపెట్టి వీరిమీఁదను పెట్టి నన్ను దిట్టుచుండెను. అంతియకాక యొకరికి లోఁబడియుండి వారు చెప్పినట్లెల్ల పనిపాటలు చేయుట నాస్వభావమునకు సరిపడినదికాదు. నాకు స్వభావముగా మహారాజువలె నుండవలెనని యాశో గనుక, ఆపనిని విడిచిపెట్టివచ్చి యింటివద్ద కాలిమీఁద కాలువేసుకొని కూరుచుండి నన్ను నమ్మినవారికడ నెల్లను ఋణములుచేయుచు, అప్పుపుట్టినంతకాలము సులభముగా జీవనము చేయుచుంటిని. ఈప్రకారముగా నిరుద్యోగముగా జీవనముచేయుచున్న కాలములో నేనితరులు చేయు హితబోధ నెప్పుడును వినకపోయినను, అడుగుటయందు మాత్రము విశేషశ్రద్ధ పుచ్చుకొని విశేషనీతివాక్యములను నేర్చుకొంటిని. అటుతరువాత నానీతివాక్యములు నాకేమియుఁ బనికిరాకపోయినను ఇతరులకైనఁ బనికివచ్చునని యెంచి మూఢులకు హితోపదేశములుచేసి గొప్పవాఁడనని పేరుపడి ధనమార్జింప నారంభించితిని. అప్పుడు సహితము నానడత తిన్నగా నుండనందున నొకనాఁడొక భక్తుఁడువచ్చి 'మీరిన్ని నీతులను జెప్పుచున్నారుగాని మీప్రవర్తనము తిన్నగా నున్నదా?' యని నన్నుఁ బ్రశ్నచేసెను. 'నాకుఁ బనికి రావనియేకదా యానీతు

లన్నిటిని మీకు వదలివేయుచున్నాను; నాకే పనికివచ్చిన యెడల నొక్క వాక్యమయిన నాకుక్షిలోనుండి పైకి రానిత్తునా?' యని సమయోచితముగా బ్రత్యుత్తరము నిచ్చి, యిఁక నందు నిలుచుట కార్యము కాదనుకొని శీఘ్రముగా మాగ్రామము వదలివేసి దేశాంతరమునకుఁ బోవలెనని బయలు దేఱితిని. అట్లు బయలుదేఱి గ్రామమైకరాత్రముగా శయనించుచు భోజనము చేసినయూరఁ బరుండక నిత్యప్రయాణములు చేయుచు, ఒకనాఁ డొకగ్రామముపఱగడ గొప్పమేఁకలమంద నొకదానిని జూచి ఇన్ని మేఁకలను వాఁడెట్లు కాపాడఁ గలఁడాయని గొల్లవానియందు మిక్కిలి కనికరము తోఁచి కొంతభారము తగ్గించినను తగ్గించుటయే యని రెండు మేఁకపిల్లలను బుజముమీఁద వేసికొని నడవనారంభించితిని; అప్పుడు వానివెంటనే తల్లియు నఱచుచు రాసాగెను; అదిచూచి తల్లిబిడ్డల నెడఁబాపిన పాపము వచ్చునని కొంతభూతదయ గలవాఁడనై యాపిల్లలతల్లినిగూడ దోలుకొని పోవుచుంటిని. ఆసంగతి నేలాగుననో కనిపెట్టి గొల్లవాఁడు నావెనుక 'దొంగా! ఆగు' మని కేకలువేయుచు నడచివచ్చుచుండెను. అదివరకును పయిగ్రామము నెంతప్రొద్దెక్కి చేరుదునోయని భయపడుచుంటిని గాని, వాని కేకలతో నిమిషములో నూరుచేరి సంతోషించి తిరిగిచూచితిని; వాడు నాపరుగు కలిసికోలేక తక్కినమేఁకల నెవ్వరెత్తుకొని పోదురో యని యప్పుడే వెనుక మరలిపోయెను. నేనా మేఁకను పిల్లలను పొరుగూరులో విక్రయించి యాసొమ్ము దారిబత్తెమున కుంచుకొని, కొన్నిదినములలో కొండవీడుచేరి యచట యోగినైయుండి, నాయొద్ద సీతారామయంత్ర మున్నదనియు దానిని జూచిన వానికి సమస్తసంపదలు గలుగుననియుఁ జెప్పి, యొకబొమ్మరాతిని గదిలోనుంచి రహస్యముగా డబ్బుడబ్బువొప్పునఁ బుచ్చుకొని చూప

నారంభించితిని. ప్రాముఖ్యవస్తువు నయిననుసరే రహస్యముగా నుంచుట వలన దానియందు గౌరవము హెచ్చును. దివ్యక్షేత్రములయందలి దేవాలయములలోని విగ్రహములను పామరులు పూజారులకు దక్షిణ లిచ్చి స్వామి యెంత బాగుండునో యని చూచులాగుననే యెల్లవారును నాకును కానుకలను సమర్పించి యీబొమ్మరాతిని మూఁకలుగా వచ్చి జనులుచూచి పోవుచుండిరి; చూచినతరువాత చేతకాని పని వానిచేతఁ జెక్కఁబడిన యాకురూపముగల విగ్రహములందువలెనే యీరాతియందును వీధిలోఁ గనఁబడెడి బొమ్మరాయియేయని యెల్ల వారికిని ననాదరము కలుగనారంభించెను. నిజముగా నేను సీతారామ యంత్రమని లోపలఁబెట్టిచూపిన శిలను ఒకదినమున వీధిలోఁబెట్టి చూపినచో మఱునాఁడెవ్వరును దాని మొగమువంకనైనఁ జూడఁ గోరరు. నేనాప్రకారముగా యోగినిగా నున్నకాలములో ప్రయోగ విద్యయందును భూతవైద్యమునందును మిక్కిలి ప్రసిద్ధికెక్కినవాఁడను కాఁబట్టి నామహత్త్వము నెల్లవారును చెప్పుకొనుచుందురు. నేను వద లింపఁబూనుకొన్న దయ్యముల కథలనుబోలె నాకథలనుసహితమెల్ల వారును నత్యాదరులై వినుచువచ్చిరి కాని యినియువానివలెనే విను వారిభయమును మఱింత వృద్ధిపఱుచుటకే వినియోగపడుచు వచ్చి నందున, గ్రామములో నందఱును నే నేమిప్రయోగము చేసిపోదు నేమో యని నాకు జడియుచుండిరి.

పయిమిషచేత ధన మార్జించి యీగ్రామములో సుఖజీవనము చేయుచుండఁగా నన్ను వ్యాధి యాశ్రయించినందున, నే నదివర కెందఱికో మరణమున బ్రహ్మైక్యమే కాఁబట్టి సంతోషింపవలయు నని బోధించుచువచ్చినను చచ్చిపోదునని భయపడఁజొచ్చితిని. మీరే యోగిని బిలిచి మీకు మరణ మన్నభయ మేమైనఁ గలదా యని

యడిగినను తడవుకోకుండ లే దని చెప్పనుగాని యాతనికిఁ గొంచెము రోగము వచ్చినప్పుడుమాత్ర మాతనిచర్యవలన మూఢులకుండు దానికంటె నెక్కువభయము కలిగియుండుటను గనిపెట్టవచ్చును. నేనట్లు యోగివేషము వేసికొనియున్న కాలమున నితరులే యోగిని ప్రశంసించినను, నేనాతఁ డెంతవాఁడని తృణీకరించుచుందును. సాధారణముగా యోగ్యులు తాము కీర్తిని బొందవలెనని కోరుచుండఁగా అయోగ్యులు వారికీర్తిని పాడుచేసి తమకీర్తితో సమానమైనదానినిగాఁ జేయఁ జూచుచుందురుగదా ? నే నిట్లనేకవేషములు వేసి కడపట బైరాగినై వీరినిద్దఱిని శిష్యులనుగాఁ గైకొని చిదానందయోగియను పేర ధవళేశ్వరము ప్రవేశించి, యీ రాజశేఖరుఁడుగారినే స్వర్ణము చేసి యిచ్చెద నని మాయచేసి యిప్పుడుతమయొద్దకుఁదెచ్చిన నగలనే యపహరించుకొని పోతిని. అక్కడనుండి పోయినపిమ్మట గడ్డమును మీసమును గొఱిగించుకొని నీలాద్రిరాజు నయి పిఠాపురము ప్రవేశించి, వీండ్రసాయముచేతనే రాజుగారి ధనాగారములోని ధనమును తరలించితిని. ఈరెండుచోట్లను నేను జరిగించిన యద్భుతచర్యలును నానటనమును రాజశేఖరుఁడుగారును కొమారుఁడును చక్కఁగాఁ జెప్పఁగలరు. కనుకను, ఆత్మప్రశంస యనుచిత మగుటచేతను, ఇంతటితోఁ జాలించు చున్నాను. అని యూరకుండెను.

కృష్ణజగపతిమహారాజులుగా రాతనిచరిత్రము విన్నతరువాతను నిమిష మాలోచించి, పద్మనాభునివంకఁ దిరిగి నీవిప్పుడు బుద్ధితెచ్చుకొని నిజముగాఁ బశ్చాత్తప్తుఁడ వైనాఁడవు గనుక నిన్నొక్కసంవత్సరము కారాగృహమునందుఁ బెట్టింప నిశ్చయించినా మని చెప్పి, కారాగృహాధికారి కట్టియుత్తరువును వ్రాసి యాతనిని రాజభటుల వెంబడిని చామర్లకోటకుఁ బంపివేసిరి. తరువాత పిఠాపురపువారిధనము

వచ్చుటకి వెంటనే పంపివేయ మంత్రి కాజ్ఞచేసి, దొంగతనమును పట్టు కొన్నందునకు సుబ్రహ్మణ్యమును శ్లాఘించి, రాజశేఖరుడుగారివంకఁ దిరిగి రాజుగా రిట్లు చెప్పిరి :—

మీ రిదివర కెన్నో కష్టముల ననుభవించి యాయాపదల నన్నిటిని గడచి మరల సుఖము ననుభవించుదశకు వచ్చుచున్నారు. కాఁబట్టి మీకు నేను కొన్నిహితవాక్యములను జెప్పబోవుచున్నాను. మీరు నామాటలను సావకాశముగా వినవలెను. పడినతరువాత లేచుట గొప్పతనముగాని యెప్పుడును పడకుండుట గొప్పతనము కాదు. మీ రీనీతిని మనసునం దుంచుకొని వెనుకపడిన కష్టములకై విచారపడకుండవలయును. ఇతరులుచేయు ముఖస్తుతుల కుబ్బి, ఆదాయమునకంటె నధికమైన ధనము దానము చేయకుండవలయును. ఒక్క కుటుంబములోవారు పలువురు పదిమందిలో నత్యంతమైత్రి కలిగియే యున్నను గృహము చేరినతోడనే గర్భశత్రువులుగా నుందురు. కాఁబట్టి మీకుటుంబమునం దట్టికొఱఁత కలుగకుండఁ గాపాడుచు రావలయును. విరోధమును సాధించుటకు మంచియుపాయము శాంతిని వహించుటయే. మన కెవ్వరిమీఁద నైనను పగతీర్చుకోవలె నని బుద్ధిపుట్టి దానిని మరలించుకో లేనియెడల మనము పగతీర్చుకో శక్తి కలిగియుండియు క్షమింతుమేని, శత్రువులు సహితము మనలను జూచి బుద్ధి తెచ్చుకొని జ్ఞానవంతులగుదురు. కష్ట కలుగవలెనని ప్రయత్నముచేసిన నెంత ప్రయోజనకారియగునో బీదవాఁడు గొప్పవానిని పగసాధింపఁ దలఁపుగొన్న నంతప్రయోజనకారిగానే యుండును. వట్టి బెదరింపులతోనే ముగిసెడుకోపము నెవరు లక్ష్యము చేయుదురు? అట్టికోపమువలన మనకార్యమును సాధించుకోలేకపోవుట యటుండఁగా మీఁదిమిక్కిలి నష్టమునుకూడఁ బొందుదుము. మీరు శోభనాద్రి

రాజుమీఁద తొందరపడి మీకోపమును చూపినందున కేకదా మీకు కారాగృహబంధనము సంభవించినది. కాఁబట్టి యిఁకముం దెప్పుడును మీరు మీకంటె నధికులైన వారిమీఁద మీకోపమును కనఁబఱుప కుండవలయును. కొందఱు మతిహీనులు పూర్వకాలమే మంచిదని పొగడి మీరుచేయుదోషములను కాలమునందారోపించి మిమ్ము నిరుత్సాహులను జేయుదురు; కాని చక్కఁగా నాలోచించి చూడఁగా బూర్వకాలమునకంటె నిప్పటికాలమే మంచిదని నాకుఁ దోఁచు చున్నది. పుణ్యపాపములు మనుష్యుల ప్రవర్తనములో నున్నవికాని కాలములో నేమియు లేవు. కాఁబట్టి మీరు చేసినదోషములకు కాల మునుదూషింపక మీప్రవర్తనము తిన్నపఱచుకొనుటకే ప్రయత్న పడవలయును. మీకు గౌరవముతో జీవనము జరుగుటకు చాలినంత సొమ్మున్నచో విశేషముగా లేదని మీ రెప్పుడును చింత పడకుండ వలయును. ఈరీతిని దెలిపెడి పూర్వకథ నొకదానిని మీకుఁ జెప్పె దను వినుండి. పూర్వ మొకధనవంతుఁడు శరీరమునిండ రత్న ఖచితము లైన స్వర్ణాభరణములను ధరించుకొని వీధినిబడిపోవుచుండఁగా, బీదవాఁ డొకఁ డాతనిని వెంబడించి నగలను జూచి మాటిమాటికి నమస్క రింప నారంభించెను. ఆధనికుఁ డాతనిని జూచి 'నానగలలో నే నేదియు నీకియ్యలేదే. ఎందున కట్లు చేయుచున్నా' వని యడిగెను. ఆనగలు నాకక్కఱలేదు; మీరు నన్ను నగలను చూడనిచ్చినారు గనుక నమస్కారములు చేసినాను; మీరును చూచుకొని సంతో షించుటయే కాని నగలవలన వేఱొక ప్రయోజనమును బొందఁ జాలరు; మీరు నగలను కాపాడుకొనుటకై యెంతయు శ్రమపడు చున్నారు; నాకాశ్రమ యక్కఱలేకయే సంతోషము లభించు చున్నది; మీకును నాకును గలవ్యత్యాస మిదియే' యని వాఁడు

బదులుచెప్పి పోయెను. ఈహేతువునుబట్టియే నేను మీకు విశేష ధనము నియ్యఁగలవాఁడ నయ్యును, ఇయ్యక మీమాన్యములను మాత్రము విడిపించి యిచ్చుచున్నాను వానితో మీరు తృప్తిపొంది సుఖజీవనము చేయుచుండుఁడు.

అని చెప్పి కృష్ణజగపతిమహారాజుగారు మీకు మఱియేదియైన గోరికకలదాయని రాజశేఖరుఁడుగారి నడిగిరి. ఆయన ప్రభువువారి సుగుణసంపత్తిని వేయివిధములఁ గొనియాడి, తన కుటుంబమునకుఁ జేసిన మహోపకారమును స్మరించి తాను చెఱసాలలో నున్నకాలములో విజ్ఞానపత్రికను వ్రాసి పంపుట మొదలగు పనులలోఁ దన కత్యంత సహాయుఁడుగా నున్న మంచిరాజు పాపయ్యను చెఱనుండి విడిపింపుఁడని వేడుకొనెను. తన కపకారముచేసిన శత్రువునందుకూడ దయ గలిగి యుండుటను శ్లాఘించి, రాజుగారప్పుడే యాతనిని విడిచిపెట్ట నాజ్ఞా పత్రికను బంపి తాము కొలువు చాలించి యంతఃపురమునకు విజయం చేసిరి. అంత రాజశేఖరుఁడుగారు మొదలగువారు కొలువుకూటమును విడిచి తమతమ యిండ్లకు బోయిరి.



# పదునేనవ ప్రకరణము.

రాజశేఖరుఁడుగారు స్వగ్రామమునకుఁ బోవుట—సుబ్రహ్మణ్యము వివాహము—సీత వివాహము—రాజశేఖరుఁడుగారు తాముపడిన కష్టములవలన కృత్యమును నేర్చుకొని సుఖముగా జీవనము చేయు చుండుట.

మఱునాఁడు రాజుగారి యుత్తరువుప్రకారము రాజశేఖరుఁడు గారు సభకు వచ్చినప్పుడు, కృష్ణజగపతిమహారాజుగారు తన సభికు లలో నొకరిని బిలిచి రూపాయలసంచులను రెంటిని తెప్పించి ముందుబెట్టి 'మీరీధనమును బట్టుకొని రాజశేఖరుఁడుగారితో ధవళేశ్వ రమునకుఁ బోయి గృహమును మాన్యములను విడిపించి యిచ్చిరం' డని యాజ్ఞాపించి, అవిగాక మఱి నాలుగువందలరూపాయలను రాజ శేఖరుఁడుగారికిచ్చి 'మీరీసొమ్ముతోనే సీతయొక్కయు సుబ్రహ్మణ్యము యొక్కయు వివాహములనుజేసి వచ్చుబడికి మించినవ్యయ మెన్నఁడును జేయక సుఖజీవనము చేయుచుండుఁ' డని హితబోధచేసి వారికి సెల విచ్చి పంపిరి. రాజుగారివద్ద సెలవుపుచ్చుకొని రాజశేఖరుఁడుగారు భీమవరమునకు వెళ్ళునప్పటికి, జగ్గంపేటనుండివచ్చి యింటికడ నెవ్వరో బంధువులు కాచియున్నారని సమాచారము తెలిసెను. ఆమాటవిని వేగిరపడి యిల్లుచేరఁగా వీధియరుగుమీఁద నొక ముసలిబ్రాహ్మణుఁడు కూరుచుండి యుండెను. రాజశేఖరుఁడుగారాయనను జూచి మీరెవరని ప్రశ్న వేయఁగా, తమ యింటిపేరు భావరాజుగా రనియు తనపేరు సూర్యనారాయణ యనియుఁ జెప్పి 'రాజశేఖరుఁడుగారు మీరేకారా' యని ప్రశ్న వేసెను.

రాజ—అవును. మీ రేపనిమీఁద వచ్చినారు ;

సూర్య—మీయింటి కీనడుమ సుబ్బరాయఁడను చిన్నవాఁడు వచ్చినాఁడు. అతఁ డెక్కడనున్నాఁడు?

రాజ—ఆ పేరుగలచిన్నవాఁ డెవ్వఁడును మాయింటికి రాలేదు.

సూర్య—మీ కొమార్తెను దొంగ లెత్తుకొనిపోయినప్పుడు మాగ్రామమునుండి తీసికొని వచ్చినాఁడు. అతఁడు వేంకటేశ్వరుల మ్రొక్కును బట్టి తల పెంచుకొన్నాఁడు. మిక్కిలి చక్కనివాఁడు; ఒక రాజుతోఁడఁగూడ బయలుదేఱి మీయింటికివచ్చెద నని మాతోఁ జెప్పినాఁడు ; చిన్నతనములో మీవద్ద విద్య నేర్చుకొన్నాఁడట !

రాజ—అతనితో మీకేమి పనియున్నది ?

సూర్య—మా యింటియొద్దఁ గొన్నిదినములున్నాఁడు; అతని రూపగుణసంపదను జూచి యతనికి నాకొమార్తె నిచ్చి వివాహముచేసి, నాకు పుత్రసంతానము లేదుగనుక అతని నిల్లఱిక ముంచుకోవలెనని నిశ్చయించుకొన్నాము.

అని తరువాత రాజశేఖరుఁడుగారు రుక్మిణి సుబ్బరాయఁడను పేరున పురుషవేషము వేసికొని యుండుట లోనుగాఁగల వృత్తాంతము నంతను వినిపించి, యాచిన్నదానిని తనకుమారుఁడైన సుబ్రహ్మణ్యమునకుఁ జేసికొనియెదనని వాగ్దానముచేసిరి. అంతట సూర్యనారాయణగారు పెన్నిధి దొరకిన పేదవానివలె పరమానంద భరితుఁడై, రాజశేఖరుఁడుగారి యొద్ద సెలవుపుచ్చుకొని వెంటనే తన గ్రామము నకుఁబోయి భార్యను కుమార్తెను వెంటబెట్టుకొని మఱునాఁడు మధ్యాహ్నమునకు మరల వచ్చెను. అదినముననే రాజశేఖరుఁడు

గారు చల్లపాటువేళ బండ్లు చేసికొని సకుటుంబముగా బయలుదేరి, రెండుమూడు దినములలో సూర్యనారాయణగారితోఁ గూడ రాజమహేంద్రవరము చేరి, అక్కడ రామమూర్తిగారి లోపల రెండు దినములుండి, వారికడ దాచిన పాత్రసామగ్రిని దీసికొని వారినిగూడ వివాహమునకై వెంటఁ బెట్టుకొని సుఖముగాఁ బోయి ధవళేశ్వరము ప్రవేశించిరి.

పెద్దాపురమునుండి వచ్చిన కృష్ణజగపతి మహారాజుగారి సభికుఁడు రాజశేఖరుఁడుగారికి మాన్యములును గృహమును విడిపించి యిచ్చి, మరలఁ దన ప్రభువారియొద్దకు పోఁగోరఁగా రాజశేఖరుఁడు గారాయనను బహువిధముల బతిమాలుకొని కొమారునియొక్కయు కొమార్తెయొక్కయు వివాహములు జరుగువరకు నిలుచునట్లొడఁబఱచిరి. రాజశేఖరుఁడుగారు మరల గ్రామమునకు వచ్చి మాన్యములు వదలించుకొని ధనికులయి యున్నారన్నవార్త విన్నతోడనే బీదతనము వచ్చినప్పుడు మొగము చాటువేసిన పూర్వస్నేహితు లందఱును పెల్లగిలి రాసాగిరి. మున్ను పిలిచినను పలుకని యాత్రితకోటిలోనివారందఱును దినమున కారు పర్యాయము లింటిచుట్టును దిరుగనారంభించిరి; తొల్లి చూడమనసయినను గనఁబడని భృత్యవర్గము జీతబత్తెములు లేకయే సదా గుమ్మమువద్ద నిలువఁజొచ్చెను. రామశాస్త్రియు సిద్ధాంతియు వచ్చి ముఖస్తుతులయందుఁ గమకుఁగల పాండిత్యప్రకర్షమును మునుపటికంటె ద్విగుణముగా బ్రకటించుచు వచ్చిరిగాని, తమవిద్యాసారస్యమును గ్రహించి యత్తరలత్తులిచ్చెడి మునుపటి యౌదార్యమును రసికత్వమును రాజశేఖరుఁడుగారియం దప్పుడున్నట్లు వారికిఁ గనబడలేదు.

వారిలో సిద్ధాంతి తనమీఁద రాజశేఖరుఁడుగారికి కోపమువచ్చిన దేమో యనుకొని తదనుగ్రహమును మరలఁబడయగోరి, నారాయణ మూర్తి తనయొద్ద దాచిపెట్టిన దామోదరయ్యయొక్క నగలపెట్టె నొకకూలివానిచేత మోపించుకొనివచ్చి రాజశేఖరుఁడుగారి కొప్పగించెను; మఱియు రాజశేఖరుఁడుగారికిఁ దెలియవలయునని బంధువుల ముందరను మిత్రులముందరను ఆయనను కొనియాడఁ జొచ్చెను; సుబ్రహ్మణ్యము జాతకమంత జబ్బుది లేదన్న నోటనే యిప్పుడుమరల మారకదశ తొలఁగిపోయినది. కాఁబట్టి దానియంతటి దివ్యజాతకము లోకములో మఱియొకటిలేదని పొగడఁదొడఁగెను. ఆసంగతి తెలిసికొని బీదతనము వచ్చినప్పుడు పిల్లనియ్యమన్నవారే యిప్పుడేలాగునైన, దమకన్యలను సుబ్రహ్మణ్యమునకుఁ జేసికొండనియు నాలుగువందల రూపాయలు వరదక్షిణయిచ్చెదమనియు రాజశేఖరుఁడుగారి చుట్టును దిరిగి యనుసరింప మొదలుపెట్టిరి. వారు భాగ్యవంతులును అల్లునకు కానుకలను కట్నములను పెట్టువారును, అయినను వారిపిల్లల నెవ్వరిని జేసికోక రాజశేఖరుఁడుగారు కొమారునకు సూర్యనారాయణగారి కొమార్తె మహాలక్ష్మినిఁ జేసికొనుటకే నిశ్చయించిరి.

తరువాత నొక సుభముహూర్తమున ముందుగా రాజశేఖరుఁడుగారు కుమారుని వివాహముచేసిరి; భోగముమేళము లేకపోయిన యెడల వివాహము శోభగాంచదని యెందఱుచెప్పినను, వారిమాటల నాదరింపక పాతివ్రత్యమును బోధింపఁదగిన యుత్తమదినములలో లంజలతోడిపొత్తు కూడదని భోగస్త్రీలపాటలకై విశేషధనమును వ్యయపెట్టక, యల్పధనముతో గాయకశిఖామణులచేత కర్ణరసాయముగా వారికీర్తనలు పాడించిరి. సదస్యమునాడు సంభావనసమయ

మున నపాత్రదానమున కొప్పుకొనక యోగ్యులును పండితులునగు కొందఱిని యథాశక్తిని సత్కరింపనెంచి, వచ్చిన బ్రాహ్మణులకంత ఱకిని సంభావన యియ్యకపోయిన సభవారిలోఁ దలవంపుగా నుండునని చెప్పవచ్చిన బంధువులతో వివాహదినములలోఁ దలయెత్తుకొని తిరిగి యప్పులపాలై తరువాత నెల్లకాలమును దలవంచుకొని తిరుగుట కంటె నీయైదుదినములును తలవంచుకొని యావలఁ దలయెత్తుకొని తిరుగుటయే మంచిదనిచెప్పి తమయిష్టప్రకారమే జరిగించిరి; వీథులు గట్టి సత్రములు వేయుట వృథావ్యయమని బంధువులును మిత్రులు నైనవారినిమాత్రమే భోజనమునకుఁ బిలిచి యాదరించిరి; ఈప్రకారముగాఁ జేయుటచేత మొదటనుద్దేశించుకొన్న దానికంటెను వెచ్చము తక్కువ పడినందున, మిగిలిన యాధనముపెట్టి కోడలికాభరణములు చేయించి పెట్టిరి.

కొమారుని వివాహమైన మూఁడవదినముననే సీతను మేనల్లు డైన శంకరయ్యకిచ్చి రాజశేఖరుఁడుగారు పెండ్లిచేసిరి. ఈవివాహమును సమస్తవిషయములయందును ముందుగా జరిగిన వివాహమునే పోలి యున్నది. ఈరెండు వివాహములయందును బూజముబంతులు మొద లగు దురాచారములును మోటుతనముగా నుండు వేడుకలును నాకబలి యైన తరువాత బుక్కాయును వసంతమును చల్లుకొనుచు స్త్రీలుఁ బురుషులు నను భేదమును పాటింపక విచ్చలవిడిగా నల్లరిచేయు చెడు వాడుకయును మాన్పబడినవి; కుంటితనము గ్రుడ్డితనములోనుగాగల యంగవైకల్యముచేతఁ బాటుపడ నసమర్థు లయినవారును స్వదోషము వలనఁగాక దైవకృతమువలననే హీనదశకు వచ్చిన దరిద్రులును సత్ప్రవర్తనముకలిగి సకలవిద్యావిశారదు లయియున్న పండితులును భగవ ద్భక్తులును మాత్రము ధనసత్కారమును బొందిరి. ఈరెండు వివాహ

ములును విధ్యుక్తముగా జరిగిన పిమ్మట నొకదినమున పెద్దాపురమునుండి వచ్చిన సభికుడు రాజశేఖరుఁడుగారి కడకువచ్చి తాను శీఘ్రముగా వెళ్లవలసి యున్నది గనుక సెలవిచ్చి పంపవలయునని యడిగెను.

రాజ—నాముద్దు చెల్లించి యీపదిదినములును మీరున్నందునకు మనుగుడుపు లయినదాఁక కూడ నుండి నామనస్సును సంతోషపెట్టి మఱి వెళ్లవలయును.

సభి—ఇఁక నన్ను మన్నించి విడిచిపెట్టవలయును. మనము బయలుదేఱి యిచ్చటికి వచ్చుటకుముందు మాయూరికి విచ్చేసియున్న యాచార్య స్వాములవారు శ్రీముఖమును బంపినప్పుడు వెంటనే రూపాయలనియ్యక తిరస్కరించినవాఁడని మా మేనల్లునకేమో యాంక్షపత్రిక వ్రాసినారనియు, మూఁడు దినములనుండి మావాని యిల్లెవ్వరును త్రొక్కి చూడకున్నారనియు, మంగలవాఁడు క్షౌరముచేయుటకుఁ గాని చాకలవాఁడు బట్ట లుదుకుటకుఁగాని రాకున్నారనియు, ఇప్పుడే యుత్తరము వచ్చినది. స్వాములవారు వెలివేసినప్పుడు పొరుగువారు నిప్పయినను బెట్టరు; నూతిలో నీళ్ళయినను తోడుకోనియ్యరు.

రాజ—సన్న్యాసు లెప్పుడును కామక్రోధాదులను వర్జించి పరమ శాంతులై యుండవలసినవారే; ఇంత యల్పదోషమున కంత క్రూర శిక్షను విధింతురా?

సభి—సన్న్యాసులన్న పేరేకాని వారికున్నంతకోపము ప్రపంచములో నెవ్వరికి నుండదు. ఇదియేమి చూచినారు? ఈస్వాములవారే క్రిందటి సంవత్సరము శ్రీకాకుళములో భిక్షకువెళ్ళిన యింటి యజమానుని భార్యతో నేమో సరసమాఁడగా మగఁడు విని సన్న్యాసి నేమైన

నన్ను నపరాధమని యూరకుండి భిక్షానంతరము దక్షిణయియ్యకపోఁగా అతనిని మూఁడు మాసములు వెలివేసి నూఁబది రూపాయలు పుచ్చుకొని ప్రాయశ్చిత్తము చేయించి తరువాత మతములో కలుపుకొన్నాఁడు. నేను వెంటనే వెళ్ళి మావానిచేత నపరాధక్షమార్పణము కోరించినంగాని కార్యము సుష్టుపడదు. కాబట్టి నన్ను బలవంతపెట్టక యీపూటనే పంపివేయవలయును.

రాజ—మీరింతగా సెలవిచ్చుచున్నప్పు మిమ్మిఁక నిర్బంధపెట్టఁ గూడదు.

అని రాజశేఖరుఁడుగా రాయనను క్రొత్తబట్టలు కట్టబెట్టి సమస్తవిధముల గౌరవించి, కృతజ్ఞతాసూచకముగా ప్రభువువారితో మనవిచేయవలసిన సంగతులను దెలిపి యాయనను బంపివేసిరి. తరువాత వివాహమునిమిత్తము వచ్చిన బంధువు లెవరియూళ్ళకు వారు పోయిరి. ఆసభికుఁడును పెద్దాపురము చేరినతోడనే తన విషయమై రాజశేఖరుఁడుగారుచేసిన యాదరణమును ఆయనయొక్క యుపకారస్మృతియును సాధువర్తనమును కృష్ణజగపతి మహారాజుగారితో మనవిచేసి, తన్నాయన ప్రభువువారితో చెప్పవేఁడుకొనిన మాటలను విన్నవించెను.

రాజశేఖరుఁడుగారు భాగ్యవంతులై మరల గ్రామమునకు వచ్చియున్నారని విన్న కొన్నిదినములకు నారాయణమూర్తి యొక నాఁడువచ్చి రహస్యముగా రాజశేఖరుఁడుగారితో తానును దామోదరయ్యయుఁ బ్రాణమిత్రులుగా నుండుటయు దామోదరయ్యయొక్క మరణానంతరమున తానాతని చెలికాఁడను ద్వేషముచేత జనులు తనయింటఁగల సొత్తంతయు దోఁపించుటయు అందువలనఁ దానిప్పుడు

అన్నవస్త్రములకే యిబ్బందిపడుచుండుటయుఁ జెప్పి సాహాయ్యము చేయఁ వేఁడుకొనెను.

రాజ—కృతఘ్నుఁడును మిత్రద్రోహియు నగు నీవంటివాని కుప కార మెన్నఁడును జేయరాదు. నేను నీకెంతో మేలుచేసినవాఁడనై నను నాకాపద సంభవించినప్పుడు, శక్తిగలవాఁడవై యుండియు నేను వేఁడుకొన్నను లేశమైనను సాయము చేయకపోతివి. దామోదరయ్య ప్రాణమిత్రుఁడుగానున్నను నీయొద్ద నాతఁడు దాఁచుకొన్న పెట్టెను మిత్రుని పుత్రునికీయక యపహరింపఁ దలఁచితివి.

నారా—ఆసొమ్ము పెట్టెను తనయొద్ద దాచవలసినదనియు దానిని సులభముగా నపహరించవచ్చుననియు సిద్ధాంతిగారే మొదట నాకాలోచన చెప్పినాఁడు. నేను సొమ్ముపెట్టె నాతనియొద్దఁ బెట్టిన తరు వాతఁ దనకంతులో సగముభాగము రావలెనని పోరాడి, స్నేహితుని సొమ్ము పరులపాలగుట కిష్టములేక నేనొప్పుకొననందున మీామొప్పునకై పెట్టెను మీాకుఁ దెచ్చియిచ్చినాఁడు.

రాజ—సిద్ధాంతియే నిన్నుఁ బ్రోత్సాహపఱిచినను నీవుసహి తము దోషివేకాని నిర్దోషివికానేరవు. స్వయంకృతాపరాధమువల ననే నీకిప్పుడీదుర్దశ ప్రాప్తించినది కాఁబట్టి యెఱుఁగక చేసికొన్న దాని ఫలము నీవవశ్యముగా ననుభవింపవలెను.

అని చెప్పి రాజశేఖరుఁడుగా రాతని కేమియుసాయము చేయక సాగనంపిరి. అదిమొదలుకొని రాజశేఖరుఁడుగారు వెనుక సిద్ధాంతి మొదలైనవారి చర్యలవలనఁ దెలివితెచ్చుకొని ముఖస్తుతుల కుబ్బి యొప్పుడును ధనము పాడుచేసికొనకయు, సమీాపమునకువచ్చి మంచి

మాటలు చెప్పువారి నందఱిని మిత్రులని నమ్మకయు మెలఁగఁ జొచ్చిరి. యోగి వెనుకచేసిన కుతంత్రమువలన నాతనికి యోగు లను వారియం దెల్లను కేవల జఠరపూరకు లనునభిప్రాయమును మంత్ర ములయందును సువర్ణకరణాది విద్యలయందును దృఢమైన యవి శ్వాసమును గలిగెను. రుక్మిణికివెనుక పట్టినదయ్యములు భూతవైద్యము శకునములు మొదలగువానివలన నెల్లవారికిని వానియందలి నమ్మకము చెడుటం జేసి మఱియెప్పుడును వారియింట నెవ్వరికిని గ్రహబాధ కాని ప్రయోగలక్షణము కాని దేవత లావహించుటగాని కలుగ లేదు. కుటుంబములోనివారి జాతకములును పెట్టినముహూర్తము లును పలుమాఱు విరుద్ధఫలముల నిచ్చుచు వచ్చినందున, రాజ శేఖరుఁడుగారికిని తత్సంతతివారికిని జ్యోతిషమందు సహిత మప నమ్మకము కలిగెను. రుక్మిణి వివాహకాలమున చేసిన ధర్మములకై చేసిన ఋణములవలని నష్టముల ననుభవించియుండుటం జేసి రాజ శేఖరుఁడుగా రిఁక నెప్పుడును పరులకు ఋణపడకూడ దని నిశ్చ యము చేసికొనిరి. అంతటినుండియు రాజశేఖరుఁడుగారు మితవ్యయ మునే చేయుచు వ్యర్థదంభమునకై ధనము పాడుచేసికోక, తమ కీశ్వరుఁడు దయచేసినదానితోడనే తృప్తినొందుచు, కలకాలఁదిని బీద సాదలకు దానధర్మము చేయుచు, కలలోసహితము సత్యమును భూత దయయును తప్పక, "ధర్మోజయతి" యను నీతివాక్యమును సదా హృదయమునందుంచుకొని సమస్తకార్యములయందును నీతిపథమును నీఁగకాలంతయు దాటక ఋజువుగాఁ బ్రవర్తించుచు మంచివాఁ డని లోకమునఁ బ్రసిద్ధికెక్కి, పెక్కండ్రు మనుమలను మనుమరాండ్ర నెత్తి సిరియు సంపదయుఁ గలిగి చిరకాలము సుఖింపుచుండిరి. ఆయన

జీవితకాలములోనే సుబ్రహ్మణ్యము పిఠాపురసంస్థానములో గొప్ప యుద్యోగములు చేసి కపటమంత్రియై రాజకార్యములయందును సన్మార్గప్రవర్తనమునందును నసమానుఁడని పేరుపొందెను ; అల్లుళ్ళిద్దఱును పెద్దాపురపురాజుగారి యోలగములోఁ గొలువు కుదిరి క్రమక్రమముగా గొప్పదశను బొంది విశేషఖ్యాతిని సంపాదించిరి. రాజశేఖరుఁడుగారి కుటుంబములోనివారే కాక యాయన బంధువర్గములో చేరినవారుకూడ అధర్మవృత్తి కొంతకాల మిహలోకసుఖమునుగలిగించినను సద్ధర్మవృత్తియే శాశ్వతసౌఖ్యమునకు నిదానమని రాజశేఖరుఁడుగారి వర్తనమువలన నెఱిఁగి నిరంతరము ధర్మమార్గప్రవిష్టులై యుండుచు వచ్చిరి. చిన్నప్పు డెప్పుడో చచ్చిపోయిన మగఁడు పట్టుకొని వేధించుచున్నాఁ డన్న సిద్ధాంతి కొమార్తె పెద్దదై బ్రతికియున్న మఱియొక మగఁడు మిక్కిలి మక్కువతో తన్నాశ్రయించి మోహింపఁజేయఁగా నాతనివెంట నింట దొరికినసొత్తు నెత్తుకొని లేచిపోయి చెడి కడపట దాసీయయి తమకన్నులముందఱనే గ్రామములోఁ దిరుగుచుండుటయు, బాల్యదశలోనే భర్తలను బోగొట్టుకొన్న భాగ్యహీనురాండ్రైన ముద్దియలు పడుకష్టములును, అట్టివారు దురతిక్రమణీయమైన కామబాధకు తాళఁజాలక యింద్రియచాపల్యముల దుష్టపురుషుల వలలోఁబడి పాడగుచుండుటయు, కొందఱు కులమువారికి వెరచి గహాస్యముగా శిశుహత్యలు గర్భపాతములు మొదలైన ఘోరపాతకముల కొడిగట్టుచుండుటయు, ప్రతిదినమును కన్నులారఁ జూచి మనసు కరగి యట్టి బాలవితంతువుల దుర్దశను తొలఁగించుటకై మెనఁ జేయవలయునని పలు ప్రయత్నములు చేసియు మూఢశిరోమణులయిన జనులరొక్కయు

నాచారపిశాచావేశ సన్యస్తవివేకులై యున్న పండితులయొక్కయు మనస్సులను మళ్లింప శక్తులుగాక విఫలప్రయత్నులై రాజశేఖరుడుగారు కొంతకాలమునకు లోకాంతరగతు లయిరి రాజశేఖరుడుగారు కాలము చేసి యిప్పటికి రెండువందల సంవత్సరములైనను ఆయనవలన మేలు పొందినవారి సంతతివా రిప్పటికిని ఆయనను ప్రశంసించుచుందురు. రాజశేఖరుడుగారి సంతతివారుకూడ దేశమంతటను వ్యాపించి యిప్పుడు పెక్కుచోట్ల గొప్పస్థితికలవా రయి యున్నారు.

సంపూర్ణము.



# సత్యరాజా పూర్వదేశ యాత్రలు.

## ప్రథమ భాగము

### ఆఁడుమళయాళము



By

**K. VEERESALINGAM**

# సత్యరాజా పూర్వదేశ యాత్రలు.

## ప్రథమ భాగము

## అనుమళయాళము

## మొదటి ప్రకరణము

నేను పరీధావి సంవత్సర చైత్రశుద్ధ నవమి మంగళవారమునాఁడు పుష్యమీనక్షత్రమందు విజయనగరములో పూర్వము శ్రీరాములవారుపుట్టిన దినముననే జన్మించితిని. మాయింటిపేరు పత్రివారు. నేను వ్యాసరాయాచార్యులవారి పుత్రుఁడను. నాతల్లి లక్ష్మీబాయమ్మ. నేను ముందు మహాసత్యసంధుఁడనయి యీసత్యచరిత్రమును వ్రాయుదునని తెలిసియో, తనకుఁగల సత్యప్రియత్వముచేతనో, మఱి యేహేతువుచేతనో మాతండ్రిగారు నాకు తనతండ్రిపేరుపెట్టక దేశాచారమునుతప్పించి చిన్నతనములోనే నాకుసత్యరాజాచార్యులని పేరుపెట్టిరి. మాతండ్రిగారు జ్యోతిశ్శాస్త్రమునందు మహాపండితులయినందున పుణ్యపురుషాగ్రగణ్యులయిన వారు స్వమహిమచేత నాభవిష్యద్యోగ్యతను ముందుగా తెలిసికొనియే తప్పక నాకిట్లు నామకరణము చేసియుందురు. "సుకృతీగతాయుః" అను న్యాయమునుబట్టి వారు నాపసితనములోనే పుణ్యలోకయాత్రకు విజయంచేసినందున నాపేరును గూర్చి వారి నడిగి తెలిసికొనుట కవకాశము లేకపోయినది. నానిజమయినపేరు సత్యరాజాచార్యు లయినను మాగ్రామములోనున్నవారు నన్ను సత్యరామాచార్యులని పిలుచుచుండిరి. 'రాజు'ను 'రాయ'లని వ్యవహరించుట కర్ణాటక సంప్రదాయము. అంతేకాక 'జ'

కార ' య ' కారముల కభేదము. అందుచేతనే వంగము మొదలయిన యుత్తరదేశములయం దయోధ్యకు అజోధ్యయని యకారమునకు మాఱుగా జకారమును వ్రాయుదురు. ఈశాస్త్రచర్చ నింతటు విడిచిపెట్టి కార్యాంశమునకు వత్తము. నాపేరుయొక్క యుచ్చారణక్రమ మెట్టిదయినను నాదిసార్థకనామధేయమని నేనువేఱుగ చెప్పనక్కఱ లేకయే నేను వివరింపఁబోయెడి యీసత్యయాత్రాచరిత్రమే లోకము నకు వేయినోళ్ళ ఘోషింపవచ్చును. ఆత్మస్తుతి నింద్యమయినందున నాసత్యసంధతనుగూర్చి నేనిఁక చెప్పను. నేనవలంబించియున్న సత్య మతముకూడ నాచరిత్రముయొక్క పరమ సత్యత్వమును సాధింప వచ్చును. సత్యప్రియత్వముచేతనేకదా మామతకర్తలయిన శ్రీమధ్వ రాయలవారు మిథ్యాభూతములయిన పూర్వమతసిద్ధాంతములనన్నిటిని తిరస్కరించి, శ్రీమదాంజనేయసహాయముచేతను ముఖ్యప్రాణదేవుని యనుగ్రహముచేతను ఖిలములయిపోయిన యపూర్వశ్రుతిస్మృతి వాక్యరత్నములను బ్రహ్మలోకమునుండి తెప్పించి బ్రహ్మసంప్రదా యానుసారముగా సత్యమయినద్వైతమతసిద్ధాంతమును లోకానుగ్రహా ర్థముస్థాపించియున్నారు ! అటువంటి సత్యమతమున జన్మించి సత్యవ్రత మునుపూనియున్న నేను నాగ్రంథమునందు సత్యముకాని వాక్యము నొక్కదానినయినను చొరనిత్తునా ? ఓచదువరులారా ! నామాటను నమ్మి యిందలిప్రతివాక్యమును వేదవాక్యమునుగా విశ్వసింపుఁడు. నేనిందు తెలుపఁబోయెడు సంగతు లీనడుమ మనుష్యుల కెవ్వరికిని తెలి యనిదేవరహస్యములయినను స్వదేశస్థులయిన మీయందు నాకుఁగల భ్రాతృస్నేహముచేత మర్మమువిడిచి చెప్పివేయుచున్నాను.

మాతండ్రిగారు కర్మిష్ఠులయి, బాల్యమునుండియు వైదికమయి పూజ్యమయిన యాచార్యవృత్తియందే కాలముగడపినవారయినను, వారిపుత్రుఁడనయిన నాకుమాత్రము పూర్వకర్మానుభవముచేత శిష్య

పరంపరలు సేవింపఁగా ఆచార్యపదమునొంది పూజింపఁబడెడు భాగ్యము పట్టినది కాదు. మా తల్లి పుట్టినింటివారు మొదటినుండియు లౌక్యవ్యవహారములలో పుట్టిపెరిగినవారగుటచేత మా మేనమామగారగు కంచి శేషగిరిరావుపంతులుగారు నన్ను వేదపాఠశాలకు పంపక బడిచదువు కాఁగానే హూణపాఠశాలకుఁ బంపిరి. మా గ్రామములో నొక బ్రాహ్మణ బాలుఁ డింగ్లీషుచదివి క్రైస్తవమతములో కలిసినప్పుడు మా తండ్రిగారు నన్ను మాత్రమే గాక మా వంశమునఁ బుట్టినవారి నెవ్వరినికూడ హూణపాఠశాలకు పంపమని ప్రతిజ్ఞ పట్టిరి. నాకు బుద్ధివచ్చువఱకును జీవించియుండిన పక్షమున వారు తమ ప్రతిజ్ఞను తప్పక చెల్లించుకొనియుందురు. తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును గదా? నేను చిన్నవాఁడనయినను పూర్వాచారవిరుద్ధమయిన మాలచదువు చదువుట నాకిష్టము లేకపోయెను. దానికితోడు మా తండ్రిగారిప్పుడు జీవించియున్న పక్షమున వారు నన్ను హూణపాఠశాలకు పంపుటకిష్టపడి యుండరుగదా యన్న విచార మొకటి నా మనస్సును బాధింపఁజొచ్చెను. ఈ రెండు కారణములచేతను నాకింగ్లీషు చదువెప్పుడును సరిపడినది కాదు. అయినను నాకప్పు డింకొక బాధకూడ తటస్థమయ్యెను. నా మేనమామ మాటవిని నా తల్లి ప్రతిదినమును హూణపాఠశాలకు పొమ్మని నన్ను నిర్బంధింప మొదలుపెట్టినది. అప్పుడు నాకు పరస్పర విరుద్ధములయిన రెండు ధర్మములు సంప్రాప్తములయినవి. నేనింగ్లీషు పాఠశాలకు పోవుట నా తండ్రిగారి యభిమతముగాదు; పోకుండుట తల్లిగారి యభిమతము కాదు. ఇందులో నేనెవ్వరి యభిమతమును చెల్లింపను? నా మనస్సు తండ్రిగారి యాజ్ఞనే చెల్లింపవలసినదని బోధించుచున్నను చచ్చిస్వర్గమునందున్న తండ్రిగారి యాజ్ఞనువలెఁ బ్రతికి భూలోకమునందున్న తల్లిగారి యాజ్ఞను మీఱుట నాకసాధ్యముగా కనఁబడలేదు. మన వేదము పితృదేవోభవ యని మాత్రమే కాక మాతృదేవోభవ యనికూడ

చెప్పుచున్నది. అందుచేత పితృనియోగమును మాతృనియోగమును నాకుసమానముగా నే యలంఘ్యములయినవి. నేనిప్పుడు తండ్రియభీష్టమును తీర్చవలెను. తల్లిమనోరథమును తీర్చవలెను. కాఁబట్టి నేను బుద్ధిమంతుఁడనయినందున పితృవాక్య పరిపాలనమును మాతృవాక్యపరిపాలనమును కూడచేసి యుభయఋణవిముక్తుఁడనయి కృతార్థతను పొందుటకొక్కయుపాయము నాలోచించితిని. ఆయుపాయమును విన్నపక్షమున నాబుద్ధికుశలతకు మీరును సంతోషింపకపోరు తల్లి యాజ్ఞానుసారముగా నేనింగ్లీషు పాఠశాలకును పోవుచుంటిని; పోవుచున్నను పాఠములను చదువక తండ్రిగారి యిష్టానుసారముగా పోనట్లేయుంటిని. ఈయుపాయముచేత నే నుభయవాక్య పరిపాలన దక్షుఁడనై ధన్యుఁడనుకాఁగలిగితిని. ఈప్రకారముగా నేను దాదాపుగా పదిసంవత్సరములు హూణపాఠశాలలో చదివినను, గొప్పపరీక్షలో దేనిలోను కృతార్థుఁడను కాలేదు. కాని యెంతోకష్టముమీఁద నేనుసామాన్యపరీక్షలో మాత్రము తేరినాఁడను. నేనింటికడ పాఠములు చదువకపోయినను, ఉపాధ్యాయుల కృషిచేత నాప్రయత్నములేకయే కొన్ని యింగ్లీషు ముక్కలు నాకుతెలీలోదూరినవి. అటుతరువాత వానిని నాహృదయము నుండి పాఱఁదోలుటనాకు సాధ్యమయినదికాదు. ఎవ్వానికయినను మొదట చోటిచ్చిన తరువాత వెడలఁగొట్టుట సులభసాధ్యముకానేర్చునా? అయినను నాచేతనయినపని నేను మనవేదశాస్త్రములకు విరుద్ధముగా మాయుపాధ్యాయులు బోధించిన భూగోళవిషయములను చరిత్రములను హూణశాస్త్రములను సత్యములని నమ్మకుంటిని. ఈచరిత్రమును చదివినకొలఁదిని నామాటలయందలి సత్యము మీకేబోధపడఁగలదు. ఇంగ్లీషుచదువువలన బుద్ధిహీనులైన యిప్పటిబాలురకువలె నాకు మన శాస్త్రములయందును పురాణములయందును నమ్మక మావగింజంతయు తగ్గినదికాదు. ఇంగ్లీషు తిన్నగా చదువకున్నను నేను నిత్యమును

స్నానసంధ్యా ద్యనుష్ఠానములను మాని జపములను తపములను జేయుచు మంత్రతంత్రములను గురుముఖమున నేర్చుకొని సిద్ధాగరిష్ఠుండనయితిని. నా యాచారవ్యవహారములు చూచి నాతల్లియు మేనమామయుఁగూడ సంతోషపడుచుండిరి.

నేను నాలవతరగతిలో చదువుకొనుచుండఁగా నాకు వివాహకార్యము తటస్థమయ్యెను. ఈయాంధ్రదేశములో మాశాఖవారు మిక్కిలి తక్కువగా నున్నందున మాలో కన్యలు దొరుకుట మిక్కిలి కష్టము. అందుచేత సామాన్యస్థితిలో నున్నవారికి వేయిరూపాయలయిన నియ్యక మూఁడేండ్లకన్య యయినను లభింపదు. మా మేనమామగారి కృషిచేత నిప్పాణి నృసింహాచార్యులుగారు తొమ్మిది సంవత్సరముల ప్రాయముగల తమకొమార్తెను వేయిరూపాయలకే నాకిచ్చి వివాహము చేయుట కంగీకరించినారు. ఇటువంటి తరుణము మరల రాదనియెంచి నా మేనమామగారును తల్లిగారునుజేరి నూటికి మూఁడురూపాయలవడ్డికి మాపిత్రార్జితమయిన మాన్యములమీఁద వేయిరూపాయలు ఋణము చేసి, వివాహవ్యయములకై యిన్నూఱు రూపాయలను మఱియొకరి యొద్ద అప్పుచేసి, శుక్లసంవత్సర వైశాఖమాసములో నొక మంచిముహూర్తమున నాకు వివాహముచేసిరి. నాకప్పటికి పదునెనిమిది సంవత్సరములు దాటినవి. నాభార్య రూపవంతురాలు కాకపోయినను, గుణవంతురాలుగా కానఁబడెను. కులకాంతలకు గుణముప్రధానముగాని చక్కఁదనము ప్రధానముకాదు. ఇట్లొకసంవత్సరము గడచిన తరువాత నాభార్యకు స్ఫోటకమువచ్చెను. అప్పుడాచిన్నది జీవించుటయే దుర్ఘటమని యెల్లవారును భావించినను, నేను పునశ్చరణచేసిన వీరహనుమంత మంత్రప్రభావమువలన చిన్నదానికి ప్రాణభయముతప్పి కుడికన్నుమాత్రము పోయెను. మొగమునిండ గోతులుపడి యాచిన్నది మఱింత కురూపిణియయినందున "భార్యారూపవతీశత్రు" వనెడుబాధ నాకు

లేక పోయెను. నేనొక్క పరీక్షయందుఁ జేటి పాఠశాలను విడుచునప్పటికి నాభార్యయెదిగి కాపురమునకువచ్చెను. మాభూస్యములమీఁదవచ్చెడి మాదాయము మేముచేసిన ఋణములవడ్డికే చాలనందున నాకుటుంబ భారముకూడ మామేనమామగారిమీఁదనే పడెను. అందుచేత రెండు కుటుంబములను పోషించుట దుర్భరమయినందున మామేనమామగారు నన్నుచదువుమాన్పించి, విశాఖపట్టణముపోయి యెవ్వరెవ్వరినో యాశ్రయించి విశేషకృషిచేసి దొరతనమువారి కార్యస్థానములో నొకచోట నాకు నెలకు పదునేనురూపాయల జీతముగల యుద్యోగమును చెప్పించిరి. ఆపనిలోనుండఁగానే యప్పులవారు నామీఁద వ్యాజ్యములువేసి ధనద్విగుణమునకు తీర్పులను పొంది నాభూస్యముల నమ్మించిరి. నాభూస్యముల విక్రయమువలన వచ్చినసొమ్ముతో నాఋణము సగముతీరినది. మిగిలినది తీర్చుటకు సాధనముకనఁబడలేదు. అప్పులవారు ప్రతిదినమునువచ్చి నాయిల్లుచుట్టుకొని ఋణముతీర్పుమని నను నానావిధముల చిక్కులుపెట్ట మొదలుపెట్టిరి. ఈచిక్కులలో నుండఁగా నాకుగ్రామముల వెంటతిరిగెడి మఱియొకపనియైనది. ఈక్రొత్తపనిలో జీతమిరువది రూపాయలయినను, ఆయెక్కువజీతము ప్రయాణవ్యయములకే చాలకుండెను. ఇప్పుడింకొక విధమయిన క్రొత్తవ్యయముకూడ నామీఁదపడెను. నాకెప్పుడును గుప్తదానము చేయుటయం దేయిష్టము. ఇప్పుడట్టిదానములు చేయవలసిన నిర్బంధముకూడ నాకుతటస్థమయ్యెను. అట్టిదానములు చేయకపోయినయెడల నాపనికికూడ భంగమువచ్చునట్లు కానఁబడెను. మామండలమునందప్పు డుద్యోగస్థులలో లంచగొండు లధికముగానుండిరి. అప్పుడు మాపై అధికారులు పూర్వపువారుమాఱి క్రొత్తవారు వచ్చుట తటస్థించెను. అందరికంటెను కష్టపడి యెక్కువ పని చేయుచున్నను నేను పనితిన్నగా చేయుచుండలేదని కోపపడుచు వచ్చినందున నాహితుల యుపదేశముచేత శిరస్తాదారుగారికి మూఁడు

సారెలు హిరణ్యదానములుచేసితిని; ఎన్నిసారులో యిప్పుడు సరిగా జ్ఞప్తికిరాలేదుగాని పెక్కుసారులు వస్త్రదానములు చేసితిని; పిల్లలుపాలు కావలసివచ్చినందున రెండుసారులు సవత్సక గోదానములు సహితమాయనకే చేసినాఁడను. చేసినదానములు చెప్పుకోరాదు. ఇటువంటి గుప్తదానములు మఱియెన్నెన్నో నేను చేసితిని. ఈహేతువుచేత దానములు చేయఁగా మిగిలిన సొమ్ము నాకును నాభార్యకును నిత్యైకాదశీ వ్రతములతో భుక్తికయినను చాలకుండెను. ఇట్లుండఁగా నాభార్య జ్వరబాధితురాలై, మాగ్రామములో రెండవ ధన్వంతరియని ప్రసిద్ధికెక్కిన వైద్యశిఖామణిచేత ఇరువదియొక్క లంకణములు కట్టించఁబడి ఆకస్మికముగా స్వర్గస్థురాలయ్యెను. ఆచిన్నదాని చావుతో నాకీలోకముమీఁద విరక్తి కలిగినది. ఈసమయములోనే ఋణప్రదాతలు కత్తినూరై నన్ను తమ యప్పులకై చెఱసాలకు సహితము పంప యత్నించుచుండిరి. ఈయన్ని కారణములచేతను నాకు సంసారము మహారణ్యమువలె తోఁచఁగా నాకప్పుడు సర్వసంగములను పరిత్యజించి ముముక్షుఁడనై యోగిని కావలెనన్న బుద్ధిపుట్టినది. అందుచేత నేను నాతల్లిని మామేనమామగారి యింటికిపంపివేసి, ముందుగా అప్పులవారి బాధను తప్పించుకొనుటకై దేశత్యాగముచేసి దక్షిణదేశయాత్రలు సేవింపవలెనన్న యుద్దేశముతో విశాఖపట్టణమువచ్చి చేరితిని. అప్పు డాపట్టణములోనున్న నాబాల్యమిత్రుఁడొకఁడు నన్నుచూచి నాదురవస్థనిని జాలిపడి నాకు నూరురూపాయలిచ్చెను. మఱునాఁటి యుదయకాలమున నేను సముద్రతీరమునకు పోఁగా ధూమనౌక యొకటి యప్పుడే రేవునకు వచ్చెను. అదియెక్కడకు పోవునని విచారింపఁగా చెన్నపురికి పోవునని యక్కడివారొకరు చెప్పినందున శీఘ్రముగా పోవలెనన్న యభిలాషచేతను, దుస్సహమైన ఋణప్రదాతల బాధ తప్పించుకోవలెనన్న యుద్దేశముచేతను, సముద్రయానము శాస్త్రనిషిద్ధమని తెలిసినవాఁడ

నయినను తరువాత ప్రాయశ్చిత్తము చేయించుకొనవచ్చునని పూటకూటి యింటికిపోయి శీఘ్రముగా భోజనము చేసివచ్చి, ౧౮౭౯ వ సంవత్సరము మార్గశిరమాసములో భానువారము నాఁడొక చిన్నపడవలో పోయి పొగయోడలో నెక్కితిని. ఇరువదియేడవ యేట నాకు దేశాంతరయాత్ర నాజాతకములోనే వ్రాయఁబడియున్నది. ఎక్కినజాములో పొగయోడకదలి నాలవనాఁటి ప్రాతఃకాలమున నన్ను చెన్నపురికిఁ గొనిపోయి విడిచినది. పొగయోడలోని యవస్థ యీకాలమునందు సముద్రయాత్రలు చేయువారి కందఱికిని తెలిసినదే యగుటచేత నేనిక్కడ వివరింప నక్కరలేదు. ఒకవేళ సముద్రయాత్రలుచేయని శిష్టుల లాభమునిమిత్తము వివరింతమన్నను, పొగయోడలో నెక్కిన తరువాత మరల దిగువఱకును నాకు దేహస్మృతియే లేదు. నేనెఱిఁగినదంతయు నాకడుపులో నేదో పెట్టి వికారమారంభమయి నాఁటిదినము తిన్న యన్నముమాత్రమేకాక చిన్నప్పటినుండియు కడుపులోనున్న పసరంతయు వాంతులగుటయు, దేహముతూల లేవశక్తుఁడనుగాక కన్నులు మూసుకొని శవమువలె నొకమూల పడియుండుటయు, మాత్రమే. ఇప్పుడింకొకసంగతికూడ స్మరణకు వచ్చుచున్నది. నేను చిన్నతనములో నుయ్యెలలోనంతగానూఁగలేదు. ఓడలోనున్న మూఁడుదినములలోను నాకు యావజ్జీవమును సరిపోవునంత యుయ్యాలలూఁగుటసంభవించినది. ఆసౌఖ్యమనుభవైక వేద్యమేకాని చెప్ప నలవియైనది కాదు. నేను పడవదిగి మెట్టకుపోయిన తరువాతకూడ కొన్నిదినములవఱకును నేనుయ్యాలలో నూఁగుచున్నట్టే భ్రమ పడుచుంటిని. నా కీడోలికాక్రీడ మొదలయిన వైభవములు కలిగించిన వాఁడు మాముఖ్యప్రాణదేవుఁడే. భక్తవత్సలుఁ డగుటచేత వాయుదేవుఁడు భక్తుఁడనయిన నేనొంటిగా పోవుటచూచి సహింపలేక తన మహాబలత్వము సార్థకమగునట్లుగా సముద్రము పొడుగునను నాకుతోడుగా వెంటవచ్చి నాకీ

క్రీడాసౌఖ్యములను ప్రసాదించెను. వాయు మహిమచేతఁ గలిగిన వికార మును వాంతులును నాకసౌఖ్యమును కలిగించినట్లు మీరెంచు కొందు రేమోకాని నిజము విచారింపఁగా నాకవి మంచివైద్యులవలె లోని కల్మషమును పోఁగొట్టి యారోగ్యమునే కలిగించి నన్ను మహాబలుని వంటి సత్వసంపన్నునిగాఁ జేసినవి. నేనోడలోనున్న మూఁడు దినములును ఉపవాసవ్రతము పూని యుండిన సంగతి బుద్ధిమంతులైన మీరీవఱకే యూహించి యుందురు. నాభాగ్యము నేమనిచెప్పను? అందులో కడ పటిదినము ఏకాదశికూడ నయ్యెను. ఆకడపటినాటి నిరాహారపుణ్యమున కెందైన సాటికలదా? తక్కిన రెండుదినముల యుపవాసఫలమును పొగయోడనెక్కిన పాపమునకు సరిపోయినను హరివాసరమునాటి శుష్కోపవాస పుణ్యఫలము నాకు మిగిలియుండక మానదు. శ్రీహరి కరుణాకటాక్షము గలవారి కెక్కడకు పోయినను పుణ్యమునకు లోప ముండదు. అటుతరువాతి చరిత్రము వినుఁడు.

---

## రెండవ ప్రకరణము

---

నాలవనాఁడు ద్వాదశీపారణమున కనుకూలముగా ప్రాతఃకాలము ననే పొగయోడ చెన్నపురి రేవు చేరెను. ఓడ లంగరు వేసిన తరువాత చిన్నపడవ లనేకము లక్కడకు రాఁగా నేనొకపడవలో నెక్కి యొడ్డు నకు పోతిని. ఒడ్డునుండి నూరుగజముల దూరము నడచునప్పటికి గుఱ్ఱపు బండియొకటి కనఁబడెను.

"వ్రాల్లోకి బండి అద్దెకు తీసుకువస్తావా?" అని నే నాబండివాని నడిగితిని. వాఁడేమో అఱవములో మాటాడఁగా నేను తెలిసికోలేక "నీకు తెలుఁగు తెలుసునా?" అని వాని నడిగితిని. అప్పుడు మాయిద్దఱి కిని యీక్రింది సంభాషణము జరగినది.

బండివాఁడు—యెక్కడికి పోతావు ?

నేను—వంటపూటియింటికి.

బండి—యెక్కడికి ?

నే—వంటపూటియింటికి.

బం—తెలుఁగుత్తో చెప్పు.

నే—పూటకూటియింటికి.

బం—పూటకూటీ ? నీకు తెలుఁగూరాదా ?

నే—పూటకూటియిల్లంటే డబ్బుపుచ్చుకొని అన్నం పెట్టే యిల్లు. అక్కడికి తీసుకుని పోవలెను.

బం—దుడ్డుతీసి అన్నంవేసే యింటికి నిన్ను యెత్తుకుపోయి విడువవలెనా ?

నే—పొగబండి యెక్కేచోటికి చేరువగావుండే యింటికితీసుకుపో. తెలిసిందా ?

బం—తెలిసింది. ముక్కాలురూపాయి వుక్కారుంగో.

నే—ముక్కాలురూపాయిాకాక యింకా వుక్కారుంగో గేమిటి ? తరువాత చిక్కులు పెట్టక బేరం యిప్పుడే తిన్నగా చెప్పు.

బం—అన్నసత్రానికి యెత్తుకుపోయి విడిచి పూడుస్తాను. కూర్చో. ముక్కాలురూపాయి యియ్యి.

అని బండివాఁడు మూఁడువేళ్ళు చూపెను. వానిమాటలు కొన్ని నాకర్థముకాకపోయినను, ఇయ్యవలసిన సొమ్ము స్పష్టముగా తెలిసినందున బండిలో నెక్కి కూరుచుంటిని. వాఁడు బండిని వీధిలోనుండి తోలుకొని పోవుచుండఁగా వీధి కిరుప్రక్కలను మంచి మేడలను దివ్య భవనములును కన్నులకు పండువుగా నుండెను. నడుమనడుమ పలకమీఁద పెద్దయక్షరములతో "—వారి అన్నసత్రం" అని వ్రాయఁబడియుండెను. వాని సంఖ్యనుచూచి ఒక్క వీధిలో నిన్ని యున్నసత్రము లుంచుటకు

చెన్నపురివా రెంతటి ధర్మాత్ములోయని యాశ్చర్యపడఁ జొచ్చితిని. ఇట్లాశ్చర్య పడుచుండఁగానే బండివాఁడు "సుబ్బరామ అయ్యర్ గారి అన్నసత్రం" అని వ్రాసియున్నచోట బండినిలిపి దిగుమని తలుపు తీసెను. అన్నసత్రమునకు కాదు వంటపూటి యింటికని చెప్పుచు నేను దిగక కూరుచుండఁగా బండివాఁడువచ్చి భాషతో నాలుగు కేకలు వేసి నన్ను చేయిపట్టుకొని లాగి నామూటతీసి క్రింద పడవైచెను. పరదేశములో వాఁడు నన్ను కొట్టి పోవునేమోయన్న భయముచేత వెంటనే బండిదిగి మూఁడుపావలాలు చేతిలోఁ బెట్టి వానిని పంపివేసి, పూటకూటి యిల్లెక్కడనో కనుఁగొనవలెనన్న యుద్దేశముతో లోపలికిపోయి "యిది అన్నసత్రమా?" అని వంటచేయుచున్న బ్రాహ్మణు నడిగితిని. "అవును. పూటకు భోజనమునకు కాలురూపాయి. నాలుగణాలు" అని యతఁడు నాలుగువేళ్ళు చూపెను. ఆమాటలతో నాకన్నసత్రముయొక్క అర్థము బోధపడినందున మూటక్రిందదింపి, "నాకు ద్వాదశిపారణకు శుచిగా వంటచేసి పెడతావా?" అని యడిగితిని. "కావలసినంత శుచిగా చేసిపెడతా" నని యతఁడుబదులు చెప్పెను. అందుమీఁద "నేను బ్రాహ్మడికి పెట్టుకోవడాని కెవరైనా దైవ్రతబ్రాహ్మలు దొరుకుతారా?" అని నేనాతనిని నడుగుచుండఁగా వాకిట కూరుచుండియున్న బ్రాహ్మణుఁ డొకఁడువచ్చి తాను ద్వాదశి బ్రాహ్మణుఁడుగా వచ్చెదనని చెప్పెను. నేనందుకు సంతోషించి స్నానము చేసి వచ్చుటకై లేచి యాతఁడు చూపిన 'కొళాయి' లో శిరస్నానము చేసి, తడిబట్ట యూఱవేసి కట్టుకొని శుచినయి, పొగయోడ నెక్కిన పాపము పోవుటకై సహస్ర గాయత్రీ జపముచేసి, ప్రాతజన్నిదములు తీసి క్రొత్తవి వేసికొని, పంచముద్రలును ద్వాదశపుండ్రములును ధరించి గోవిందనామ స్మరణ చేసికొనుచు విస్తరిముందు కూరుచుంటిని. అన్నసత్రాధికారి రెండు విస్తళ్లలో ముందుగా అన్నము వడ్డించెను. అటు

తరువాత పులుసుతెచ్చి నేను ప్రక్కను వడ్డించుమని చెప్పుచుండఁగా నామాటవినక అన్నము మీఁదనే దానిని వడ్డించిపోయెను. అంతట ద్వాదశి పారణమునకు వచ్చెదనన్న బ్రాహ్మణుఁడు విభూతి పెట్టుకొని తానావఱకు కట్టుకొనియున్న బట్టలతోనే వచ్చి రెండవ విస్తరిముందు కూరుచుండెను. "మడికట్టుకొని రావయ్యా" అని నేను చెప్పినను నామాట లక్ష్యముచేయక కొంచెముసేపు కూరుచుండి, లేచి వీథిలోని కల్పశంకకు పోయివచ్చి తనవి మడిబట్టలేయని చెప్పుచు మునుపటి బట్టలతోనే మరలవచ్చి కూరుచుండెను. అప్పుడు నేనతని మొగము పాఱఁజూచి విభూతిరేఖలనుబట్టి స్మార్తబ్రాహ్మణుఁడని తెలిసికొని, వ్రతభంగమునకు శంకించి లేచిపొమ్మని చెప్పవలెనన్న మాట నాలుక చివరకు రాఁగా ఆపుకొని, విస్తరిముందు కూరుచున్న బ్రాహ్మణుని లేచిపొమ్మన్నచో దోషము వచ్చునని యెంచి విష్ణుఁడనయి యూరకుంటిని. పాపము! ఆబ్రాహ్మణుఁడు 'ద్వైతి' యని నేనన్నమాట 'అద్వైతి' యని గ్రహించి యిట్లు చేసియుండును.

"ఇతరులకు వడ్డించవలెను వేగిరము పరివేషణముచేయు" మని మాఅన్నప్రదాత తొందరపెట్టుటచేత విధిలేక యాబ్రాహ్మణునకే యాపోశనము వడ్డించితిని. మాసత్రాధికారి మిక్కిలి దొడ్డవాఁడు. నాకు ద్వాదశీవ్రతము దక్కునట్లుగా నాఁటిదిన మవిసాకు కూరవండెను. మఱియేదోకూర వండెనుగాని దానిపేరు నాకు తెలిసినదికాదు. ఆవండిన కూరలయినను కలుపుకొనుటకు చాలకుండ మనదేశములో నూరుఁగాయలను వడ్డించినట్లు కొంచముకొంచముగా వడ్డించి మరలనడిగినను మాఱు తెచ్చినవాఁడుకాఁడు. పప్పుకావలెనని యడుగఁగా వండనేలేదన్నాఁడు. నెయ్యి కావలెనని యడుగఁగా అన్నమువడ్డించిన చేతితోనే చిన్న గిన్నెతో తెచ్చి యభిఘరించిపోయినాఁడు. అప్పుడు నాకు దేనితో భోజనముచేయుటకును తోఁచక యావఱకన్నముమీఁద వడ్డించిపోయి

నందున పులుసుతోనే యన్నముకలిపి మిరియాలుకంపుచేత రుచిగా లేకపోయినను కన్నులుమూసికొని నాలుగుముద్దలు మ్రింగితిని. ఇంతలో నంబ్రాహ్మణుఁడు పులుసుకుండయు, అన్నపుబిందెయు, వాకిటిలోనికి తీసికొనిపోయి యెవ్వరికో శూద్రులకువడ్డించి మాకు వడ్డించుటకయి మరల తెచ్చెను. శూద్రులు చూచినయన్నము తినుటకునాకు మనసొప్పకపోయినను మా ద్వాదశిబ్రాహ్మణుఁడుమాత్రము మరల వడ్డించుకొని యాపులుసుతోనే తవ్వెడుబియ్యపన్నముతినెను. బిందెలో అన్నము మిక్కిలితక్కువగానుండుటచూచి, అంతయన్నమును శూద్రులే తినిరాయని యడిగిరి. "లేదు. మీరు స్నానానికిపోయినప్పుడు బ్రాహ్మణులకేపెట్టి వకచిన్నపంక్తిలేవదీసి" నని సత్రాధికారి చెప్పెను. ఆమాటలతో నామనసువిఱిగి యేకాదశి నిరాహారఫలమంతయు వ్యర్థమయ్యెనని నాకెంతో విచారము కలిగెను. ఆసంగతినే నేనాలోచించుకొనుచుండఁగా సత్రాధికారి రసముతెచ్చి మిరియాలువేసిన కాగికాగని చింతపండునీళ్లు విస్తరిలో పోసెను. ఆభోజనసౌఖ్యము చెప్పుటకు శక్యముకాదు. నేనొకవేళ చెప్పినను దూరదేశములోనున్న మీరు పూర్ణముగా గ్రహింపలేకపోవచ్చును. కాఁబట్టి యోచదువరులారా! నా సత్యసంధతను పరీక్షించుటకయినను మీరొక్కసారి చెన్నపట్టణము నకువచ్చి, ౧౮౭ గృహసంఖ్యగల సుబ్బరామయ్యగారి అన్నసత్రములో ఒక్కపూట భోజనముచేసి, అనుభవైకవేద్యమయిన యాసౌఖ్యము నొక్కసారి తప్పక యనుభవించిపొండు. నేనిప్పుడు ముందుగానే చెప్పుచున్నాను. అన్నహితముపోయినదనిమాత్రము నన్ను తరువాత దూషింపఁబోకుఁడు. సత్యమును పరీక్షించువారీలోకములో నెన్ని కష్టములనయినను పడవలెను.

భోజనముకాగానే నాకును మాబ్రాహ్మణునకును భోజనమున కియ్యవలసిన యెనిమిదణాలను నేనే యిచ్చివేసితిని. అదిగాక మాబ్రా

హ్మణునకు రెండణాలు దక్షిణయిచ్చి, అక్కడసంగతుల నడుగ నారంభించితిని. కొంతసేపు సంభాషణము జరిగినతరువాత "మీరెక్కడకు పోవుచున్నారు ?" అని నన్నతఁడడిగెను. "ఉడిపి సుబ్రహ్మణ్యము మొదలయిన యాత్రలు సేవింపఁబోవుచున్నాను" అని నేను చెప్పితిని. అప్పుడా బ్రాహ్మణుఁ డెన్నో నీతివాక్యములు చదివి, తన దేశములోని వారినందఱను మోసగాండ్రనియు తోడులేక యొంటిగా ప్రయాణముచేయుట యపాయకరమనియు మళయాళదేశములో చిత్రవిచిత్రము లెన్నియో యున్నవనియు తనతోఁగూడ వచ్చినపక్షమున వానినన్నిటిని నాకుఁజూపి నన్ను సురక్షితముగా మరల తీసికొనివచ్చెదననియు చెప్పి యొప్పించి, నన్ను పొగబండిమీఁద ప్రయాణము చేసెను. పొగయోడఖర్చులు మొదలయినవానిక్రింద నాకీవఱకయిన పదునెనిమిది రూపాయలుపోఁగా నావద్ద ఇప్పుడెనుబదిరెండు రూపాయిలున్నవి. వానిలో నాలుగురూపాయల పదణాలు నాకును మఱినాలుగు రూపాయల పదణాలు బదులుక్రింద తనకును మొత్తము తొమ్మిది రూపాయల రెండణాలు నావద్దపుచ్చుకొని మా బ్రాహ్మణుఁడు తుత్తికూడికి మూఁడవతరగతి టిక్కెట్లు రెండు తెచ్చెను. మఱునాటి యుదయమున ఏడుగంటలపావునకు మేమిద్దరమును జాబులుకొనిపోవు పొగబండిలో నెక్కి యెళంబూరునుండి యిరువదారిమీఁద బయలుదేఱినాము. బయలుదేరునప్పుడు బండిలోకూరుచుండి మా బ్రాహ్మణుఁడు రాహుకాలమెప్పుడని నన్నడిగెను. రాహుకాలమేమో నాకు తెలియదని నేను చెప్పితిని. రాహుకాలములో ప్రయాణము బయలుదేఱరాదని యతఁడనెను. మా దేశములో రాహుకాలమని పట్టింపులేదు వర్జ్యసమయమునమాత్రము బయలుదేఱరని నేనంటిని. మీరాయుత్తరదేశపువాళ్లేమియు తెలియని మూఢులని యతఁడనుచుండెను. ఇంతలో మేమెక్కిన పొగబండి కదలి నడువ నారంభించెను. మా బ్రాహ్మణుఁడు

దేశమెఱిఁగిన యనుభవజ్ఞుఁడగుటచేతను దేశభాష తెలిసినవాఁడగుట చేతను బహుప్రయాణములు చేసినవాఁడగుటచేతను భద్రముగా నుండునని నామాటకూడ నాతనిసంచిలోనే యుంచితిని. నాటిమధ్యాహ్నము మూఁడుగంటలవేళ బండికూడలూరువద్ద పదినిమిషములసేపు నిలువఁగా మేమక్కడ లఘుశంకకు పోవ దిగితిమి. ఈలోపుగా మేమెక్కినబండిలో మాసరసను మఱియెవ్వరో క్రొత్తవారువచ్చి కూరుచుండిరి. మేము మరలవచ్చికూరుచున్న రెండునిమిషములకు బండికదలినది. అప్పుడు మాబ్రాహ్మణుఁడు వారితో అఱవములో ప్రసంగింప నారంభించెను. వారెవ్వరని నేను తెలుఁగుతో నడుగఁగా వారు మాలవాండ్రనియు, పొగబండ్లలో ప్రయాణములు చేయువా రాచారవ్యవహారములను పాటింపరాదనియు, మాబ్రాహ్మణుఁడు నాకు హితబోధ చేసెను. ఈప్రయాణము మూలమున మాలకూడు వచ్చినదని నాలో నేను విసుఁగుకొని, రాత్రి ఆఱుగంటలకు మాయవరము వద్ద బండి యేడునిమిషములు నిలువఁగా దిగి, నేను మఱియొక బండిలోనికి పోయి కూరుచుంటిని. ఏడుగంటల పావుకు బండి మరల కుంభకోణమువద్ద ఇరువదియైదు నిమిషములు నిలిచినప్పుడు మాబ్రాహ్మణుఁడు బండిదిగి నావద్ద కేవో ఫలాహారమును తెచ్చెనుగాని నేను మాలగుడ్డలతో నేమియు తిననందున నావంతు వచ్చినది కూడ నతఁడేతిని బండిలోనికి పోయెను. ఆరాత్రి మేమిద్దఱమును మరలకలిసికోలేదు. స్థల మిఱుకుగానున్నందున పడుకొన చోటుచాలక నాకు తిన్నగా నిద్రపట్టినది కాదు. నాఁటి తెల్లవాఱుజామున అయిదుగంటల పావునకు మేమిద్దఱమును బాహ్యమునకు పోవుటకయి మధురవద్ద దిగినాము. అతఁడే వేళకును మరల రాలేదు. పావుగంట సేపటికి మరల బండికదలుటకు సిద్ధముకాఁగా, అతఁడేబండిలోనో యెక్కియుండునని తొందరలో నేనొకబండిలో నెక్కితిని. ఆదినము పదునొక్క గంటవేళ

బండి తుత్తుకూడి చేరినది. బండివద్ద నిలుచుండి యెంత వెదకినను బ్రాహ్మణునిజాడ కానరాలేదు. బ్రాహ్మణుఁ డెక్కడ తప్పిపోయినాఁడో, నన్నుఁ గానక యెంత పరితపించుచున్నాఁడో అని రెండుదినముల వఱకును బండివచ్చినప్పుడెల్ల మార్గస్థులను పరీక్షించుచు పొగబండి దిగుచోటికివచ్చి చూచుచుంటిని. బ్రాహ్మణుఁడురాలేదు. ఆబ్రాహ్మణుని మధురలో దొంగలుకొట్టిరో ఆలస్యమగుటచేత బండితప్పిపోయెనో, మఱియే ఆపదవచ్చెనో కాని బ్రాహ్మణుఁడు రాకుండెను వాఁడుకాఁడు. ఆతనికి ద్రోహచింతనే యున్నపక్షమున రాత్రియెక్కడనో చీఁకటిలో దిగి పాఱిపోక, తెల్లవాఱి మధురదాఁక ఎందుకు వచ్చును? ఆధనము నాకు ధర్మార్థముగా వచ్చినదే యయినందున పోయినసొమ్ము మరల రాదని నిరాశ కలిగినతరువాత దొంగలచేత పడక బ్రాహ్మణునిచేతిలో పడి సత్పాత్రదానఫలము నాకు లభించెనని సంతోషించితిని.

ఈబ్రాహ్మణుని నిమిత్తము నేను వెదకుచుండఁగా దైవికముగా నాకొక తెలుఁగు బ్రాహ్మణుఁడు కనఁబడి నాసంగతినివిని విచారపడి తన యింటికి తీసికొనిపోయి నాకాదినమున భోజనముపెట్టి, మఱునాఁడు నన్ను తనబండిలో నెక్కించుకొని తీసికొనిపోయి కొన్నిదినములలో దక్షిణ మళయాళమునకు రాజధానియైన తిరువనంతపురమునకు చేర్చెను. ఆపట్టణములో నేను నెలదినము లుంటిని. ఆపట్టణమును చేరినమఱునాఁడే నాకక్కడ నొక తెలుఁగుదేశపు బ్రాహ్మణయోగితో మైత్రి సంభవించెను. అతఁడు మనపూర్వపుఋషులతో సమానమయిన మహిమయు తపశ్శక్తియు కలవాఁడు. అటువంటి మహానుభావులు లోకములో అక్కడక్కడ నుందురుగాని వారి మహాత్త్వమును తెలిసికొనువారుమాత్ర మంతగా లేరు. చూచిచూడఁగానే నాకాయన మహానుభావత్వము జుట్టువలె పెరిగిన గడ్డముచేతనే పొడగట్టినది. కొన్నిదినములాయనకు శుశ్రూషచేసి “ మనవా రాడమళయాళ మంటారే, అది

యేద"ని నేనాయనను రహస్యముగా నడిగితిని. ఆయన మొట్టమొదట మర్మము విడిచి చెప్పక "యిదే ఆడమళయాళ" మని సెలవిచ్చెను. బుద్ధిమంతుఁడను గనుక నే నామాటలంతటితో నమ్మక "యిదే ఆడమళయాళమయితే యిక్కడ మగవాళ్లెందుకున్నారు? ఆడమళయాళంలో మగవాళ్ళుక్కర లేకుండా గాలికి బిడ్డలు పుడుతారని మా దేశంలో తెలిసిన పెద్దలునాతో నమ్మకంగా చెప్పినారు. అది యిక్కడ యెక్కడా కనపడడం లేదు. బ్రాహ్మలలో ఆడవాళ్లకు సమర్తాడిన తరువాత పెళ్లిళ్లు చెయ్యడమూ శూద్రులలో ఆడవాళ్లు పైటవేసుకోకుండా వుండడమూ స్త్రీలలో చాలామంది పెళ్లిళ్లు లేకుండా తమ మనసు వచ్చినవాళ్లను వుంచుకొని మనసువచ్చినప్పుడు వదిలిపెడుతూయుండడమూ పురుషులకు భాగం లేకుండా కుటుంబపుసొత్తంతా స్త్రీలే అనుభవిస్తూవుండడమూ కన్న కొడుకులు రాకుండా రాజ్యానికి తోడఁబుట్టిన దానికొడుకులు వస్తూవుండడమూతప్ప మా దేశానికీ యీ దేశానికీ యేమీ భేదం కనబడకుండలేదు. ఇది ఆడమళయాళంకాదు ఆడమళయాళం యెక్కడవున్నదో చెప్పక తప్పదు" అని ఆయన కాళ్లమీఁద పడి లేచినానుకాను. ఈప్రకారముగా నేనాయనకు పరమభక్తితో మానముదినములు శుశ్రూష చేయునప్పటికి నాయందాయన కపరిమితానుగ్రహమువచ్చి, ఒకనాఁడు ప్రాతఃకాలమునందు నన్నాయన స్త్రీమళయాళమునకు దారిచూపెదను రమ్మని పట్టణమునకు వాయవ్య దిక్కున రెండుక్రోసుల దూరము కొనిపోయి, ఒకయడవిలో ప్రవేశించి కొంచెము దూరము నడిచి యొకచిన్న కొండయెక్కించి దానిలో నున్న గుహ యొక్కటిచూపి ఆడుమళయాళమున కిదేదారి భయపడక పొమ్మని చెప్పెను. ప్రాణాధికు లయిన నా దేశస్థులలో నావలెనే స్త్రీమళయాళమునకు పోవనుద్దేశించుకొన్నవా రున్నపక్షమున వా రితరుల నెవ్వరిని అడిగి తెలిసికోవలసిన పనిలేకుండ వారికి వివరముగా తెలుపుట

కయి నడుచునప్పుడు నేనాదారిని సర్వమునుకొలిచి గుఱుతులుపెట్టుకొని తరువాత పుస్తకములో వ్రాసికొన్నాఁడను. ఒక్క యక్షరమయినను హెచ్చుతగ్గులేకుండ నేనప్పుడు వ్రాసికొన్నట్లు మీకది యిప్పుడు చెప్పెదను శ్రద్ధవహించి వినుఁడు. పట్టణము వెలుపలనున్న పెద్దరావిచెట్టు మొదలుకొని యిసుకలో ముక్కుకు సూటిగా వాయవ్యమూలను మూఁడుమూరలు తక్కువగా ముప్పావుక్రోసుదూరము నడిచిన తరువాత వెలగచెట్టువద్ద మోచేతివంపుగా తిరుగవలెను. అక్కడనుండి యెడమచేతిమీఁదుగా పావుక్రోసునడిచి చిన్న మోదుగుగుప్ప కనబడ్డ తరువాత కుడివైపునకు తిరిగి క్రోసుమీఁద మూఁడుమూరలదూరము పోవునప్పటికి చిట్టడవి కనఁబడును. ఆ యడవిలో దూరి జువ్విచెట్టున కెదురుగానున్న నడదారిని ఎడమవైపునకును కుడివైపునకును ముందుకును వెనుకకును వంకరటింకరగా దారిపోయి నట్లల్లను అరక్రోసుమీఁద తొమ్మిదిబారల మూఁడుమూరల రెండడుగుల నాలుగంగుళములు నడవఁగానే యొకకొండ కానఁబడును. ఆకొండ మీఁదికి తిన్నగా పదినిలువుల బారెడుదూరమెక్కి మూలగా మూఁడు నిలువుల మూరెడుదూరము దిగఁగానే చిట్టీతపొదచాటున గుహయొకటి కానఁబడును. మీరీకొలతలు మఱచిపోయిన పక్షమున దారితప్పి చిక్కులు పడవలసివచ్చునుకనుక దీనిని మీరు సంధ్యావందనము వల్లించినట్లు నిత్యమును త్రికాలములయందును వల్లింపుఁడు. నేనాగుహాప దేశమును భగవద్వాక్యముగా నమ్మికొని, అంధకారబంధురముగా నున్న యాగుహాలో ప్రవేశించి కొంచెముదూరము నడుచునప్పటికి కాలుజారి క్రిందికిపడ నారంభించితిని. ఆప్రకారముగా యోజనదూరము పడువఱకును వేఁడి యంతకంతకెక్కువయి దుస్సహముగా కనఁబడెనుగాని తరువాత వేఁడి యంతకంతకు చల్లారి యెంతో మనోహరముగా నుండెను. క్రిందికి పోయినకొలఁదిని భూమిలోవేఁడి యంతకంతకు

హెచ్చుచుండుననియు, కొంతదూరము పోయినతరువాత అగ్నిమయ మయి భూమధ్యమున సమస్తము కరఁగి ద్రవరూపముగా నుండుననియు, చిన్నప్పుడు పాఠశాలలో మాయుపాధ్యాయుఁడు చెప్పెనుగాని, ప్రకృతి శాస్త్రవేత్తల మనుకొను హూణపండితులు చెప్పిన యీసంగతి యసత్య మనియు మనపురాణములే నిజములనియు నేనిప్పు డనుభవముచేత కని పెట్టితిని. ఈవిషయమునందు సందేహముగలవారు నన్ను వచ్చి యడిగిన పక్షమున నేను సర్వమును సరహస్యకముగాచెప్పి సంశయ నివృత్తిచేసి పంపెదను. ఇట్లు కొంతదూరము పడినతరువాత నాకాలికప్పుడేదో దూది వలెమెత్తగా తగిలినది. ఆయాసపడి యుండుటచేత నేనప్పుడు దాని మీఁద కాలూని కూరుచుండి వీపుమీఁద వెనుక కొరిగినాను. అప్పుడు నేను పఱుపుమీఁదినుండి మెల్లగా జారుచున్నట్లు తోఁచినది. ఇంతవఱకును నేను ప్రత్యక్షముగా చూచినది. ప్రత్యక్షప్రమాణము సర్వోత్కృష్ట మయినదని యెల్లమతములవారు నంగీకరించినదేకదా? అంతట నాకు నిద్రపట్టినది. ఆనిద్ర యెన్నిదినములున్నదో యేయేదారిని జరిగినానో నాకప్పుడు తెలియలేదుగాని నిద్రతెలిసి నేను కన్నులువిచ్చి చూచు నప్పటికి నేనొక గుహాసమీపమున రాతిమీఁద పరుండి యుంటిని. సూర్యుఁడప్పుడే పశ్చిమమున నుదయించుచుండెను. ఇఁక ముందు చెప్పఁబోవు రీతిగా ఆదేశాచారములు మనదేశాచారములకు విరుద్ధ ములయినట్లే యక్కడి సూర్యుఁడును పడమట నుదయించి తూర్పున నస్తమించుచుండును. అంతవరకును నాకాఁకలి కాకుండుటయు, దేహ మున గాయములు తగులకుండుటయు, నిద్రపట్టుటయు, అంతయు మాగురుప్రభావముచేత నయినదేసుండీ! నిద్రలో నున్నంతవఱకును క్షుత్తు లేక లేవఁగానే కలుగుటకు గురుకటాక్షముకాక మఱియేమికారణ ముండును.

# మూఁడవ ప్రకరణము

నేనునిద్రనుండి లేచి కన్నులు తెఱచిచూచినప్పటికిఁ బశ్చిమమున సూర్యుఁడుదయించుచుండెనని వెనుకటి ప్రకరణమునందుఁ జెప్పియుంటినికదా ? ఏమియుఁ దెలియని క్రొత్తదేశములో తూర్పేదో పడమరయేదో తక్కిన దిక్కులేవో సూర్యోదయమును బట్టిగాక మఱి యెట్లు తెలిసికోఁ గలిగితినని మీలోని కొందరు బుద్ధిమంతులకు సందేహము కలుగవచ్చును. దీనిం జదువువారి కిందలి యేవిషయమునందును సందేహముండరాదు గనుక సహేతుముగాను తృప్తికరముగాను తగినసమాధానముజెప్పి యిప్పుడే వారిసంశయనివారణము చేసెదను. "సంశయాత్మా వినశ్యతి" అనుభగవద్గీతా ప్రమాణము మీరెఱిఁగినదే యగుటచేత దాని నెప్పుడును మనస్సులయం దుంచుకొని యాస్తిక శిరోమణులయిన మీరు ప్రమాణబుద్ధితో నావాక్యములను వ్యాస వాక్యములేయని మాఱుమాటాడక విశ్వసించి మేలు పొందవలెనుగాని నాస్తికాధములవలె సందేహపడి చెడిపోరాదుసుండీ. నేను మేల్కాని కన్నులువిచ్చి చూచునప్పటికి నేను వీపుమీఁద వెల్లవెలికలఁ బరుండి యుంటిని; అప్పుడు కన్నులపండువుగా సూర్యబింబము రత్నకుంభము వలె భూమికి మూరెడెత్తున నాయెదుమవైపున దిఙ్మండలమునం దెఱ్ఱగా కానఁబడుచుండెను. అదిచూచి మొట్టమొదట నేను సూర్యుఁడస్తమించుచున్నాఁడని భ్రమించితినిగాని క్రిందికిపోక సూర్యబింబ మంతకంతకు పయికి రా నారంభించుటచేత సూర్యోదయమేకాని యది సూర్యాస్తమానము కాదని కొంచెముసేపటిలోనే భ్రాంతి నివారణము చేసికొంటిని. కర్మభూమియైన భరతఖండమునందు కర్మప్రధానమయిన బ్రాహ్మణవర్ణములో కర్మిష్ఠులయిన వ్యాసరాయాచార్యులవారికి సుపుత్రుఁడనయి కులపవిత్రుఁడ నయిన నేను మఱచియైనను నిద్రలో సహి

తము సదాచారవిరుద్ధముగా శాస్త్రనిషిద్ధమయిన యుత్తరదిక్కు తల యుంపిగా పరుండి యుండెననుట నిశ్చయము. పూర్వము త్తరదిక్కునం దలపెట్టుకొని నిద్రించిన దోషమును బట్టియేకదా తలకోలుపోయిన విఘ్నేశ్వరుని మొండెమున కతుకుటయి యేనుఁగుతల సంఘటింపఁబడినది! కాఁబట్టి యిప్పుడు నాతలయున్నదిక్కు తప్పక దక్షిణదిక్కయి యుండ వలెనుగాని యుత్తరదిక్కయి యుండదు. దక్షిణపుతలగా వెల్లవెలికలఁ బరుండియున్నప్పుడు నా కెడమచేతివైపు పశ్చిమమయియుండవలెనుగనుక కర్మశాస్త్రప్రామాణ్యమునుబట్టి సూర్యుఁడుదయించునది పశ్చిమమే గాని తూర్పుకాదని తత్క్షణమే నిశ్చయించుకొంటిని. ఈప్రకార ముగా సృష్టిలోని యొక్కయపూర్వ సత్యమును మహాద్భుతముగా కనిపెట్టఁగలిగినందుకు నాలోనేనానందించుచు, కన్నులుమూసుకొని యీక్రొత్తదేశములో నేనొంటిగా నెక్కడకుఁ బోవుదునా భగ వంతుఁడాయని యాలోచించుకొను చుండఁగా నింతలో కొంచెము మబ్బుపట్టి చల్లగా నున్నందునను మార్గాయాసముచేతను నాకు హాయిగా నిద్రపట్టినది. ఈశ్వరానుగ్రహమువలన నాకానిద్రలో దివ్యమ యిన స్వప్నమొక్కటివచ్చినది. ఆకలలో నేనువెనుక పఱుపుమీఁద బోలి నిద్రలో జాఱినది మొదలుకొని యిక్కడకు వచ్చువఱకును జర గిన సర్వవృత్తాంతమును కన్నులార నిదర్శనముగాఁ జూచితిని. ఇది పరమరహస్యమయిన యర్థమేయైనను శ్రద్ధాళువులయిన మీకొక్కరికి మాత్రము చెప్పెదను. మీరీమర్మమును కర్మభ్రష్టులకును వేదబా హ్యులకును నాస్తికులకును విశ్వాసహీనులకును జెప్పకగోప్యముగా నుంచుఁడు. నేను వెన్నువాల్చిన యాపఱుపు భూమ్యంతరాళమున హాయంసమయమువఱకును తిన్నగా నధోముఖముగా దక్షిణమునకుజాఱి నది. నావలెనే పాఠశాలలలోని గోడలకు తగిలించియుండు దేశపటము లను జూచియుండిన మీకు పైవైపుత్తరమనియు క్రిందవైపు దక్షిణ

మనియుఁ దెలిసియుండవచ్చును. అటుపిమ్మట చీఁకటిపడినతరువాత రాత్రి రెండుయామములవఱకును భూమిలోపల నడిమిభాగమునందున్న మహావాయుపథములో దేవతావిమానమువలె దశదిశలకును నూఱు యోజనములు పఱచి పిమ్మట మఱియొక గుహాముఖమునందు నేను నాపఱుపుతోఁగూడ వాలితిని. అటుతరువాత నాపఱుపు వెనుకటివలెనే పయికి మెల్లగా జాఱనారంభించినది. ఆపిమ్మట భగవన్మాయచేత పఱుపాకస్మికముగా నదృశ్యమైనది. అప్పుడక్కడనుండి నేను వెనుకటి యట్లే పయికి పడ మొదలుపెట్టితిని. అట్లుకొంతదూరము పడినతరువాత నాశరీరమునకు దుస్సహమయిన వేఁడిసోఁకినది. ఆ వేఁడి యంతకంతకు తక్కువగుచువచ్చి నేను యోజనదూరము పడునప్పటికి నాకాలికి గట్టిగా నేలతగిలినది. ఆ నేలమీఁద కొంచెముదూరమునడిచి నేను గుహాలోనుండి పయికివచ్చి భూమిమీఁద నేనింతకుముందుచెప్పిన రాతి మీఁద పరుండునప్పటికి, తెల్లవాఱి సూర్యోదయమయినది. ఇంతలో నాకాస్వప్నముపోయి మెలఁకువవచ్చినది. ఆ సుమళయాళమునకిదియే సరియైనదారి. ఓధీమంతులారా ! ఇది కలయని భ్రమపడి దీనిసత్య మునుగుఱించి మీరొకవేళ సంశయపడెదరుసుండీ ! అట్లు సంశయపడఁ గూడదు. ప్రమాణబద్ధులైన మీరు దీనిని రెండవ వేదవాక్యమునుగా విశ్వసింపవలెను. ఈస్వప్నమును వేదవాక్యమునుగా నేలవిశ్వసింపవలె నందురేమో చెప్పెదనువినుండి. పూర్వకాలమునందు మంత్రద్రష్ట లైన మన మహర్షులకు వేదములు ప్రత్యక్షమయిన విధమిట్టిదే. వారీ శ్వరధ్యానముచేయుచు కన్నులుమూసుకొని చింతించుచుండినప్పు డీశ్వర ప్రసాదమువలన ఆమహానుభావులకు వేదములు స్వప్నములవలె పొడ గట్టి సర్వజనులకును పరమప్రమాణములయినవి. ఈశ్వరకటాక్ష మాకాలపువారి పైని మాత్రముపడి యీకాలపువారికి లేకపోవునని భావింపకూడదు. మహానుభావులయిన భక్తులకెప్పుడును భగవంతుని

నిర్హేతుకజాయమాన కటాక్షము కలుగుచుండును. కాఁబట్టి వెనుకటి వలెనే యీశ్వరానుగ్రహమువలన నాకిప్పుడు దర్శనమిచ్చిన యీకడ పటివాక్యములను మీరందరును పరమప్రమాణముగా నంగీకరించి గౌరవించవలెను. ఇవి భక్తివిశ్వాసములు గలవారికందరికిని తప్పక వేద ములవలెనే ప్రత్యక్ష దృష్టములకన్నను అధిక ప్రామాణికములగును. మఱియు నేను మొట్టమొదట భూమిమీఁది గుహలో దిగుటయాదిగా పటుపుమీఁదనొఱగి జాఱుటతుదిగా మేలుకొని యున్నంతవరకు నడిచిన దారి ప్రయాణమంతయు నేను కట్టకడపట గుహలోని పటుపును మరల నానుకొనుట మొదలు పయికి భూమిమీఁదికి వచ్చువరకును జరిగిన దారి ప్రయాణముతో సరిగా సరిపోయినందున నాస్వప్న మణుమాత్రమును ప్రత్యక్ష విరుద్ధమయినదియుఁ గాదు. అంతేకాక నాకాకల తెల్లవారు జామునఁ గలిగినదగుటచేత అధిక విశ్వాసార్హమయినది. నేనిప్పుడు చెప్పినదంతయు ఆడమళయాళమునకు సరియైనమార్గము. ఈగురుతులు పట్టుకొని యాదేశమున కెవ్వరేనిమిషమునఁ బోఁదలఁచినను రెండవకంటి వాఁడెఱుఁగకుండ తిన్నగా కన్నులుమూసికొని పోవచ్చును. అక్కడి దేశభాష నేర్చుకొని మరి పోఁదలఁచిన పక్షమున ముందుగా నావద్దకు వచ్చి యారునెలలు శుశ్రూష చేయుఁడు. మిమ్మాభాషలో పండితు లనుజేసి పంపెదను. గురుదక్షిణ తరువాత మీయిష్టమువచ్చినంత సమర్పించుకోవచ్చును. గురుదక్షిణలేక యభ్యసించినవిద్య సఫలము కాదని పెద్దలలో మెలఁగనేర్చిన మీకే విశదమయియుండును. మీరు కాని చీటీమీఁద నాకుత్తరము వ్రాసినపక్షమున నాయిప్పటి వాసస్థానా దులను మీకు వివరముగాఁ దెలిపెదను. ప్రయాణముకథ నింతటితోఁ జాలించి యిఁక దేశవృత్తాంతమున కారంభించెదను సావధానముగా వినుఁడు.

అప్పుడు నేను లేచి కొంచెము దూరము నడిచి యొక చెట్టునీడను గూర్చుండి యేవంకకుఁ బోదునాయని యాలోచించుకొనుచుండఁగా, తూర్పువైపుననుండి రెండు విగ్రహములు నావంకకు నడిచి వచ్చినవి. ఆవచ్చినవారు పురుషులయి యుందురా స్త్రీలయియుందురాయని నామనస్సున కప్పుడొక గొప్పసందేహము తోఁచినది. వారి మొగములు చూడఁగా నించుమించుగా వారు ముప్పదిసంవత్సరముల ప్రాయము కలవారుగాఁ గానఁబడిరి. వారి మూతులకు గడ్డములుగాని మీసములు గాని లేవు. దీనినిబట్టి వారు క్రొత్తగా క్షురకర్మచేయించుకొనిరని మీరు భావింపఁకూడదు. మనస్త్రీలకువలెనే వారికిని మొగములమీఁద గడ్డములును మీసములును భగవంతుఁడే ప్రసాదించలేదు. వారిద్దఱును చామనచాయగలిగి, పొడవునందు నాకంటె పిడికెడెక్కువగా నుండిరి. వారికాభరణము లేవియు లేవు; మొగమున బొట్లు లేవు; కంటఁ గాటుక లేదు. ఏకరీతిగా వారిరువురును నిడుదలయిన నల్లని లాగులును, ఎఱ్ఱనికుఱుచ చొక్కాయలును, తలలకు గడ్డితోనల్లిన తెల్ల కుళ్ళాయిలును ధరించిరి; కాళ్లకు చెప్పులు తొడుగుకొనిరి. వారినడుము చుట్టును పట్టుదట్టీలు బిగింపఁబడి యున్నవి. పట్టుదట్టీలకు ముందువైపున నేవో యక్షరములు చెక్కిన యిత్తడిబిళ్లలున్నవి. వారి చేతులలో రెండేసిమూరల పొడువుగల గుండ్రని రెండు విరుగుడు చేవకఱ్ఱలున్నవి. ఈలక్షణముల నన్నిటినిబట్టి వారెవ్వరో రాజభటులనియు, పేదిమూతి వారనియు నేనప్పటికి నిశ్చయించుకొంటిని. వారు మొట్టమొదట నాతో నేమియు మాటాడక, వయస్సులోనున్న క్రొత్తస్త్రీ యెవ్వతెయైనను వీధిలో కనఁబడినప్పుడు మనదేశములో పురుషులు దానిమొగమువంక నెగాదిగ చూచునట్లుగానే వారును నామొగమువంక పదినిమిషముల వఱకును ఱెప్పవేయక చూచి, తమలో నేమో మెల్లగా గుసగుసలాడు కొని తరువాత వారిలో నొకఁడు నాసమీపమునకువచ్చి "తూమీ

భూభే?" అని యేదో ప్రశ్న వేసినట్లుపలికెను. నాకామాట అర్థమగునదికాదు. అయినను పెద్దమనుష్యుఁడేదోయడిగినప్పుడు ప్రత్యుత్తరము చెప్పకుండుట ధర్మముకాదని తలఁచి అతఁడు నాపేరెవరని యడిగియుండునని యూహించి, తెలుఁగు భాషతో "నాపేరు సత్యరాజాచార్యులు" అని చెప్పితిని. వాఁడు కొంచెముసేపాలోచించి మరల బిగ్గరగా "తూమీభూభే" అని పలికెను. నేనువానికిఁ దెనుఁగు తెలియదనిగ్రహించి, హిందూస్థానిభాష సమస్తదేశములలోను దెలియునుగదా యని నేను విజయనగరములో మహారాజుగారి వెంట కాశీనగరమునకు వెళ్ళివచ్చిన వారితోడి సహవాసమునుబట్టి మాటాడ నేర్చుకొన్న యాభాషతో "మేరానాం సత్యరాజాచార్" అని చెప్పితిని. వాఁడామాటను సహిపము గ్రహింపక "తూమీభూభే" అని మరల మఱింతబిగ్గరగా నఱచెను. అందుమీఁద నేను వానికిభాష తెలియకపోయినను ఈకాలమునందు సర్వత్ర వ్యాపించియున్న యింగ్లీషయినను దెలిసియుండునని "మై నేమ్ ఈజ్ సత్యరాజాచార్య" అని చెప్పితిని. వాఁడాభాషను సహితము తెలిసికోలేక కోపముతో మరల నెప్పటిప్రశ్ననే వేసెను. ఆపయిని నాకేమి చేయుటకును తోఁచక దేశభాషలు తెలియకపోయినను దేవభాష తెలియునేమోయని సంస్కృతముతో "అహం సత్యరాజాచార్యనామక విప్రః" అని స్పష్టముగాఁ జెప్పితిని. ఆమూర్ఖుఁడదియును తెలిసికోలేక రెండవవానికేసి తిరిగి యేదో భాషతో ననెను. ప్రసిద్ధమయిన నాపేరు వారికిఁ దెలియఁబఱుపకుండుట నాకిష్టములేక యఱవదేశమునకు సమీపముననుండుటచేత ద్రావిడభాషయైనను దెలియునేమోయని "ఎన్ పేర్ సత్యరాజాచారిన్" అని చెప్పితిని. ఈయఱవములోఁ దప్పున్నయెడల దీనింజదివెడి యఱవవారు నన్ను మన్నింపవలెను. నేను వెనుక పొగబండిలో యాత్రచేయునప్పుడు నాలుగఱవ ముక్కలు మాబ్రాహ్మణునివలన నేర్చుకొన్నాను. కాఁబట్టి యాతనిచేతిలోఁబడ

నాసొమ్మతఁడు గురుదక్షిణగా గ్రహించినట్లయినను మీరూహింపవచ్చును. వారి కీయఱవగోడును దెలిసినదికాదు. నేనప్పుడు నాస్వభాషయైన కన్నడములోఁ జెప్పిచూతమని "నమ్మ—" అని యారంభించునప్పటికి వారిరువురును నావద్దకువచ్చి చేయిపట్టుకొని నన్ను లెమ్మనిలాగిరి. నేనప్పుడు నాభాషాపాండిత్యము చూపుటకది సమయము కాదని మౌనము ధరించి, మీవెంటవచ్చెదను నన్ను లాగవలదనియు మాయూరు విజయనగరమనియు నాపేరు సత్యరాయాచార్యులనియు నేను సద్బ్రాహ్మణుఁడననియు సమస్తమును చేసైగచేసిచెప్పి, చివాలునలేచి వారివెంట నడువనారంభించితిని. ఊరును పేరును వంశమును గూడ నెట్లుసైగచేసితినని మీలోఁదెలియనివారికిఁ గొంతఱికి సందేహము కలుగవచ్చును గాని యీసంశయము నేను చేసైగచేయుచుండఁగా శ్రద్ధతోఁ జూచినవారికి నివారణము కావలసినదేకాని చెప్పుటవలన విడిపోదు. ఆరాజభటులలో నొకఁడు ముందునడువఁగా మన దేశములోని గొప్పరాజకీయోద్యోగివలెనే వానివెనుక నేనును తలవంచుకొని నడువఁజొచ్చితిని. రెండవవాఁడు నావెనుక నడుచుచుండెను. ఇట్లు కొంచెముదూరము నడుచునప్పటికి మేమొక పట్టణముయొక్క రాజవీథిలోఁ బ్రవేశించితిమి. అప్పుడు వీథిపొడుగునను మనుష్యులు నాకు కనఁబడఁ జొచ్చిరి. వారు ధరించుకొన్న బట్టలు మొదలయినవి వివిధములుగానున్నను వారిలో నొక్కరికిని గడ్డములును మీసములునులేవు. అట్టి విచిత్రమైన సృష్టివలన నాకప్పుడు గలిగిన యద్భుతానందములకు పరిమితిలేదు. అఘటనాఘటన సామర్థ్యముగల సర్వేశ్వరుఁ డాదేశములో మగవారికి మూతికి మీసములులేకుండ నేలచేసెనాయని త్రోవపొడుగునను నాలోనేను వితర్కించుకొనుచుంటిని. ఆసమయమునందు నాకాకస్మికముగా మఱియొక సంగతి స్మరణకువచ్చినది. ఇది యాఁడుమళయాళము గదా యిందుఁ బురుషులెట్లుందురని నా

మనస్సునకుఁ దగులఁగానే నేను జూచిన వారందఱును స్త్రీలేయనియు, ఈదేశమునందుఁ బురుషులు లేరనియు, గాలికే బిడ్డలు పుట్టుదురనియు, స్త్రీమళయాళమునుగూర్చి మనవారు చెప్పినదంతయు సత్యమేయనియు, నేను నిశ్చయించుకొంటిని. నామనస్సులో నీయాలోచన ముగియునప్పటికి మేమొక్క యిల్లుచేరితిమి. ఆయింటిగుమ్మమువద్దను లోపలనుగూడ నన్నుఁ దీసికొనివచ్చిన వారివంటివేషములు ధరించుకొన్న పేడిమూతి రాజభటు లనేకులుండిరి. మొదటి యిద్దఱు రాజభటులును నన్నులోపలికిఁ గొనిపోఁగా లోపలివారందఱును గుంపులుగుంపులుగా వచ్చి యడవిమృగమును జూచినట్టుగా నన్ను తేఱిపాఱఁజూడసాగిరి. అంతట వారిలోవారేమో యాలోచించుకొని నన్ను దూరముగాఁ దీసికొనిపోయి మూలగానున్న యొకకొట్టులోఁబెట్టి పయిని తలుపువేసిరి. అంతట రాజభటులు కొందఱొకరువిడిచి యొకరు తలుపువద్దకువచ్చి దానికి నిలువుగా వేయఁబడిన యినుపకమ్ములసందునుండి బోనులోనున్న యడవిజంతువును జూచినట్లుగా నన్ను తొంగితొంగి చూచుచు నావలకుఁ బోవుచువచ్చిరి. ఇట్లువచ్చుచుఁబోవుచుంటయు వారిలో నేమోయాలోచించుకొనుచుంటయు చూడఁగా మనదేశములోని పోలీసుభటులు సంగతి నాకు జ్ఞప్తికివచ్చి వారికేదో దురుద్దేశముకలిగినట్టు నాకు పొడకట్టినది. కానినేను స్త్రీనిగాక పురుషుఁడనయినందున అట్టియనుమానముతోఁ బనిలేదని మనస్సమాధానము చేసికొంటిని. ఈరీతిగా రాజభటులలో నేదో యాలోచన జరుగుచుండఁగా నింతలో వారి యజమానుఁడక్కడకువచ్చెను. ఆతనిని దూరమునుండిచూచి వారందరును తమతమ యథాస్థానములకుఁ బోయిరి. అటుతరువాత నతఁడు తనపనిని చేసికొని, తాను మొదట వచ్చినప్పుడు నాకొట్టుముందు భటులు గుంపుగూడి పరుగెత్తిపోవుట కనిపెట్టినవాఁ డగుటచేత నందేదోవింతయున్నదని యూహించి, నాకొట్టువద్దకువచ్చి తలుపుతీయించి, రాజభటులు

నామీఁద నేమినేరము మోపుదురోయని భయపడి వజవజ వణకుచున్న నన్నుఁజూచి, నన్నేదో ప్రశ్నవేసి నావలన ప్రత్యుత్తరముగానక తన భటులనేమో యడిగి తెలిసికొని, నాయందు నిర్హేతుక జాయమాన కటాక్షము గలవాఁడయి తనవెంట నన్ను తనయింటికిఁ దీసికొనిపోయెను. ఈశ్వరానుగ్రహముచేత నేనిట్లు గారాగృహ విముక్తుఁడయి మంచి యింటఁ బడఁగలిగితిని. అతఁడు దయారసము గలవాఁడగుటచేత నన్నాదరించి, తనయింటిలో వీధివైపున నాకొకగది యిప్పించి, నాకు పరుండుటకు ఆగదిలో మంచమొకటి వేయించి, తన సేవకునిచేత భోజన పదార్థములు తెప్పించి నాముందు పెట్టించెను. వారేజాతివారో తెలియకపోవుటచేత వారు తాఁకిన పదార్థములను తినుటకు నేను మొట్టమొదట సంకోచించితినిగాని, ఏదైననుసరే తినుమని యాఁకలిదేవత నాకడుపులోదూరి నన్ను బాధించుటచేతను, ఆదేశములో బ్రాహ్మణు లున్నారన్న జాడయే లేకపోవుటచేతను, పూర్వకాలమునందాపత్సమయమున విశ్వామిత్రాదులు చండాలగృహమున శ్వమాంసాదులను దొంగిలించి క్షుత్తు తీర్చుకొనుట పురాణములో చదివి యుండుట చేతను ఆత్మరక్షణము పరమధర్మమని మనశాస్త్రములు చెప్పియుండుట చేతను, స్వదేశముచేరిన తరువాత ప్రాయశ్చిత్తము చేయించుకొని బ్రాహ్మణ సంతర్పణముచేసి శుద్ధుఁడను కావచ్చునని నాటికి భోజనము చేసితిని. ఆదినమున నోటికి తిన్నగా మెతుకులు పోయినవి కావుగాని తరువాత క్రమక్రమముగా నలవాటు పడుటచేత మనుగుడుపు పెండ్లి కొడుకువలె భోజనప్రియుఁడనై తేరభోజనములు చేయసాగితిని. మా గృహయజమానిపేరు 'భాంఢీభంగీ!' అతఁడు బ్రాహ్మణభక్తిచేతఁ గాకపోయినను మంచిహృదయము గలవాఁడగుటచే నాకు సమస్తోపచారములును జరుగునట్లుచేసి, ఆరంభములో తమభాషను నాకు స్వల్పముగానే నేర్పుచువచ్చెను. నేను గోడలు, మేడలు, ఉప్పు, పప్పు

అల్లము, బెల్లము, బట్టలు, తట్టలు, ఆవులు, మేకలు మొదలైన వానినిజూపి వానిపేరులేమని సైగచేయుచురాఁగా నాతఁడు చెప్పుచు వచ్చెను. ఆ పేరులన్నియు నేను వెంటఁగొనిపోయిన తెల్లకాగితముల పుస్తకముమీఁద తెలుఁగుతో వ్రాసికొని వల్లించుచు వచ్చితిని. మొదటి దినమున నేనామాటలను వ్రాయుచుండఁగా నతఁడు చూచి యత్యాశ్చర్యపడెను. ఆ యాశ్చర్యకారణమును మీకు ముందు చెప్పెదను. నేను వారిభాష నభ్యసించిన క్రమమంతయుఁ జెప్పఁబూనుకొన్నచో మీకు విసుగుదలగా నుండును. అంతేకాక యిటువంటి వర్ణనలవలన మీకును నాకును గూడ లాభములేదు. విశేషప్రయాసపడి మూఁడు మాసములలో వారిభాష నొకరీతిగా నేను ధారాళముగా మాటాడుటకు నేర్చుకొన్నాను.

## నాల్గవ ప్రకరణము

ఒకనాఁడు సెలవుదినమున భోజనముచేసి కూరుచున్నతరువాత నాయజమానుఁడైన ఫాంఢీభంగీ నన్నుఁజూచి జాలితో నీపత్నిపోయి నది కాదాయని రండీభాషతో నడిగెను. వారిదేశమును మనము స్త్రీ మళయాళమన్నను స్వదేశస్థులు దానిని రంఢీదేశమని వాడుదురు. అందుచేత వారిభాషయు రంఢీభాష యనఁబడును. నన్నతఁడాప్రశ్న యడుగఁగానే యాతని జ్ఞానమునకు నేనత్యాశ్చర్యపడి, అతనికి జ్యోతిశ్శాస్త్రపరిజ్ఞానమువలననే యీసంగతి తెలిసినదని యెంచుకొని, ఆశాస్త్రమును గ్రహింపవలెనను తలంపుతో "అయ్యా! నాభార్య స్వర్గస్థురాలైనసంగతి మీకెట్లు తెలిసినది?" అని యడిగితిని.

ఫాంఢీ— (చిఱునవ్వుతో) నీపత్ని పోయినసంగమాత్రమేకాక యామె నీచిన్నతనములోనే పోయినదనికూడ నీరూపముచేతనే నేను గ్రహించినాను.

నేను (ఇదిజ్యోతిశ్శాస్త్రము చేతఁగాదు సాముద్రిక శాస్త్రము చేత ననిమనస్సులో భావించుకొని) అయ్యా! నారూపములో నేమి వింతయున్నది ?

ఘాంఢీ— నీవు గడ్డమును మీసములును గొఱిగించుకొన్నందున నీపత్ని పోయినదని తెలిసికొనాను. నీకు ముక్కునందున నీపత్ని నీవు మిక్కిలి బాల్యములో నున్నప్పుడే మృతినొందెనని గ్రహించినాను. ఇంతకంటె నీరూపములో వింత యేమి కావలెను ?

మొట్టమొదట నాకీమాటలకర్థమైనది కాదుగాని తరువాత మాయజమానులతో దీర్ఘసంభాషణచేసి వారిదేశముయొక్క స్థితిగతులను జనులయొక్క యాచారవ్యవహారములను కొంత తెలిసికొన్న పిమ్మట నాకామాటల యర్థము బోధపడి వారిదేశముమీఁద నాకెంతో కోపమువచ్చినది. అసమర్థుఁడు తనకోపమును వెలిపుచ్చుటవలన పరులకు హానిచేయుటకు మారుగా తానే హానిని పొందునని యెఱిఁగి నాకోపమును నామనసులోనే యడఁచుకోవలసిన వాఁడనయితిని. నాకప్పుడా దేశమువిడిచి పాఱిపోవలెనన్న బుద్ధిపుట్టినదిగాని పరులకు దాసుఁడనై యున్నందున నాకదియు సాధ్యముగా కనఁబడలేదు. దైవమేకాలమున కెవ్వరినేమి చేయఁదలఁచునో యెఱుఁగుట యెవ్వరికి శక్యమగును ?

నేనుజేసిన దీర్ఘసంభాషణవలన నాయజమానుఁ డాకస్మికముగా యజమానురాలయ్యెను ; నేను జూచిన రాజభటులు మొదలైన పురుషు లందఱును స్త్రీలైపోయినారు. ఇంతవఱకు నేనూహించినట్లైనదికాని యీదేశములో పురుషులు లేకపోవుటయు గాలికిబిడ్డలు పుట్టుటయుమాత్ర మబద్ధములైపోయినవి. ఆదేశములోను పురుషు లున్నారుకాని, వారున్నను లేనట్టే భావింపవలసియున్నది. అక్కడ యాజమాన్యమంతయు స్త్రీలది. రాజ్యపరిపాలనము చేయువారు

స్త్రీలు; రాజకీయోద్యోగులు స్త్రీలు; మంత్రులు స్త్రీలు; విద్వాంసులు స్త్రీలు; సైనికులు స్త్రీలు. వేయేల? ఆదేశమంతయు స్త్రీమయము. స్త్రీలే సర్వస్వతంత్రులు; పురుషులు వారిదాసులు. ఆహా! లోకములో నింతకంటె దుర్దశ మఱియొకటియుండునా? ఈసంగతివిన్న పురుషాభిమాని యగువానిదేహము భగ్గున మండదా? పురుషులయం దభిమానముగలిగి, పురుషుల యాధిక్యమును నిలుపుటలోఁ బ్రతిష్ఠ నహించి, పౌరుష భూషణులైన యోభరతఖండవాసులారా! మన దేశమునందు పురుషజన్మ మెత్తినవారందఱును ఆయుధహస్తులయి బయలుదేఱి, నేను చెప్పిన గుహామార్గమున ఈదేశమునకు వచ్చి, అన్యాయముగా పురుషులపయి నధికారము చెల్లించుచున్న స్త్రీలనందఱిని ఘోరయుద్ధములో జయించి, ఈపాడుదేశములోఁగూడ పురుషుల స్వాతంత్ర్యమును నిలుపుఁడు. మర్మజ్ఞుఁడనైన నేను మీకు సహాయుఁడనై యుండఁగా మీకపజయ మెప్పుడును గలుగదు. మీరు భయపడఁ బోకుఁడు.

ఇక్కడ స్త్రీలది యాజమాన్య మన్నమాటయే కాని వారిలో నైకమత్యములేదు. వారిలోఁ గొందఱు పురుషులకు విద్యచెప్పించి వారికిఁ గొంతవఱకు స్వాతంత్ర్యము లియ్యవలెననువారు; బహుసంఖ్యాకులైన రెండవతెగవారు పురుషుల కెప్పుడును విద్యచెప్పింపఁగూడదనియు విద్యచెప్పించుటవలన స్వేచ్ఛావిహారులై చెడిపోవుదురనియు భావించి పూర్వాచారమును నిలుపుటకు పాటుపడువారు. ఇది స్వతంత్ర రాష్ట్రము సహితముకాదు. దొరతనమువారికిని ప్రజలకును ఐకమత్యము లేదు. పరిపాలనము చేయువారు స్వదేశస్థులకంటె నెక్కువ నాగరికముగలవారై యాదేశమునకు దక్షిణముననున్న పర్వతములను దాటి వచ్చి దేశమును జయించిరి. వీరు తమ పురుషులకు విద్యచెప్పించి కొన్ని స్వాతంత్ర్యములనిచ్చి వారినిగౌరవముతోఁజూతురు. వారా

దేశములోని పురుషులనిమిత్తమె పాఠశాలలనుబెట్టి పురుషవిద్య వ్యాపింపఁజేయవలెనని ప్రయత్నించుచున్నారుగాని గౌరవముగల కుటుంబములలోని మగపిల్లలెవ్వరును బడికెక్కనందున వారిమనోరథమంతగా కొనసాగకున్నది. ప్రభుత్వమువారిప్పుడు పురుషుల నుపాధ్యాయులనుగా దిద్దుటకయి రాజధానిలో నొకపాఠశాలను క్రొత్తగాఁ బెట్టియున్నారు. దేశాచారవిరుద్ధములయిన యిటువంటి కార్యములు చేయుచుండుట వలన దొరతనమువారియందు జనసామాన్యమున కనురాగము తక్కువగానున్నది. ఓహిందూమహాజనులారా! ఇవియన్నియు మీవిజయమున కనుకూలసూచనలేకదా! నాయజమానురాలయిన ఫాంఢీభంగీగారు పురుషులకు విద్యచెప్పించి దేశమునకుఁ క్రొత్తమార్పులను తెప్పింపఁగోరు తెగలోనివారు. తమ దేశములో పురుషులు చదువుటకును వ్రాయుటకును నేరనివారై యుండుటచేత తనుభాషలోని పదములను నేను మనభాషలో వ్రాసికొనుచుండుటచూచి యితరదేశముల యందు పురుషులు వ్రాయనేర్చియుందురాయని నాయజమానురాలి కప్పుడత్యాశ్చర్యము కలిగినది. అప్పుడామె నా మొగమువంకఁజూచి నీవు మీదేశములో భోగపురుషుఁడవాయని యడిగెను. కాను కుల పురుషుఁడనని నేనుబదులు చెప్పితిని. ఆమె దొరతనమువారు నూతనముగాఁబెట్టించిన పాఠశాల కెదిగినపురుషుల నెవ్వరినైన సంపాదించవలెనని బహుదినములనుండి కృషిచేయుచు విఫలప్రయత్నయయియుండి విద్యాభ్యాసము చేయుటకాసక్తి గలవాఁడనై యున్న నన్నుఁజూచి సంతోషించి నన్నా పాఠశాలకుఁ బంపవలెనని యుద్దేశించుకొనెను. కొంతవఱకు భాషాభివృద్ధి చేసినవారినిగాని యాపాఠశాలలోఁ జేర్చుకొనరుకనుక నాకింటికడ నిత్యమును రెండుగంటలసేపు విద్యచెప్పుటకై భాంగీఫిండీయను పేరుగల యొకవిద్వాంసురాలిని నెల జీతమునకుఁ బెట్టెను. ఫిండీయను పదము మనదేశములోని శాస్త్రిపదముతో సమా

నష్టమేవది. కులపురుషునకు విద్యచెప్పుట వలన కులమువారుతన్ను బహిష్కారము చేయుదురేమో యని యామెకుమనస్సులో భయముకలిగినను, బీదదగుటచేత జీతమున కాశపడియు నాయజమానురాలు గొప్పరాజకీయోద్యోగిని యగుటచేత నామె యనుగ్రహమునుగోరియు నాకుఁ బత్నీవ్రత ధర్మముల నుపదేశించి తనదేశముయొక్క యాధిక్యమును నాకుబోధపరుప నెంచియు ఆపండితురాలు నాకు విద్యచెప్పుట కొప్పుకొనెను. పత్నీవ్రత శబ్దము వినఁగానే మీమనస్సుల కద్భుతముగా నుండవచ్చును. ఆభాషలో భార్యకు 'పంధీ' యనిపేరు. పంధీశబ్దమునకు యజమానురాలని యర్థము. భర్తను 'భూదా' యందురు. భూదాయనఁగా దాసుఁడనియర్థము. ఈరెండుపేరులఁబట్టియే యక్కడ భార్యాభర్తలకుండు సంబంధమును మీరూహించి తెలిసికోవచ్చును. మనదేశములోస్త్రీలకు పతివ్రతాధర్మము లుపదేశించునట్టే, ఆదేశములో పురుషులకు పత్నీవ్రతధర్మములు నేర్పుదురు. మాయుపాధ్యాయిని 'పంధీవేదీభూఢీ' యను గ్రంథములోని నూఱు పద్యములు నాకు నేర్పినది. ఆపుస్తకమును 'పత్నీవ్రత ధర్మబోధిని' యని తెనిఁగింపవచ్చును. వారిభాషలో ఒత్తక్షరము లధికముగానున్నవి. రెండేసియక్షరముల పదములు విస్తారము; పదములు తఱుచుగా అకారాంతములుగాను ఈకారాంతములుగాను ఉండును; ఏకారము ప్రశ్నార్థకము. భాషసంగతి యటుండనిండు, ఫిండీగారు నాకుపదేశించిన పద్యములను మొదట నేనుప్రీతితోవల్లించితినిగాని నాకామెవానియర్థము చెప్పఁగానే నాకెక్కడలేని కోపమునువచ్చి, ఆమెనన్ను విడిచియింటికిపోఁగానే దొడ్డిలోనికిపోయి యెవ్వరును జూడకుండ నిప్పంటించి యాపుస్తకమును తగులఁబెట్టితిని. కాని యిప్పటికిని నాకోపము తీరినది కాదు. ఆపద్యముల యర్థము విన్నపక్షమున నాకంటెను మీకెక్కువ కోపమురావచ్చును. ఆకోపములవలన నైనను మీరీదేశమునకు వచ్చి

యిక్కడిపురుషులను దాస్యమునుండి యుద్ధరింతురేమోయను నమ్మకముతో వానిలోఁగొన్నిటి నిప్పుడు తెలిఁగించుచున్నాను. ఇవిరత్నములని చెప్పఁబడుట కర్హములయినవి కాక పోయినను మనదేశసంప్రదాయమునుబట్టి వీనికి నవరత్నములని పేరుపెట్టుచున్నాను.

## శ్రీ సత్యరాజాచార్య కృతాంధ్రీకృత నవరత్నమంజరి.



క. పురుషునకిమ్మహిఁబత్నియె
పరమంబగు దైవతంబు పత్నీసేవన్
నిరతముచేసెడి పురుషుఁడె
పరమున నిహమున సుఖంబుఁ బడయుంజుమ్మీ. ౧

గీ. ప్రతిదినంబును బురుషుండు పత్నికంటె
ముందుగాలేచి నదిలోనమునిఁగి జలము
కలశమునఁదెచ్చి నిజపత్ని కాళ్ళుకడిగి
తాను శ్రీపాదతీర్థంబు త్రాగవలయు.

క. స్త్రీపాదతీర్థసేవన
మేపురుషుడుచేయు నెన్నియేఁడులు ధరలో
నాపురుషుఁ డన్నియుగములు
పాపములంబాసి మోక్షపదవి సుఖించున్. 3

గీ. కుష్ఠరోగిణియైనను గ్రుడ్డిదైన
భూరివికలాంగియైనను ముసలిదైనఁ
బత్నియెంగిలి భుజియింపవలయుసతము
పుణ్యలోకంబుఁగాంక్షించు పురుషవరుఁడు. ౪

క. ఏపురుషుఁ డతివయెంగిలి
పావపుమతి నేవగించి భక్షింపండో

యాపాపాత్ము(డు నారక
కూపంబున(గూలు(జూవె కోటియుగంబుల్. ౫

క. దూరమున(జూచి పత్నిని
గారవమున లేచి యొంటికాలున(బురుషుం
డోర(గవంగ(గవలయును
గూరిమి(గూర్చుండ నిల్వ(గూడదు సుమ్మీ. ౬

క. పురుషుడును గార్ధభమున్
స్థిరముగ దండనము లేక చెడిపోదురిలన్
గరుణ(దలంపక నెలకొక
పరియైనన్ గొట్టవలయు( బత్ని పురుషునిన్. ౭

గీ. పత్ని గొట్టిన(దిట్టిన బాధయిడిన
భోగపురుషుల( బొందిన( బొందకీర్ష్య
దరుణిసేసె పురుషునకును దైవమనుచు
భక్తినయంబు సేవింపవలయు(జుమ్ము. ౮

గీ. అతివలకు స్వేచ్ఛభూషణమైనయట్లు
పురుషులకు లజ్జయే మహాభూషణంబు
సూర్యచంద్రులు మొగమైన(జూడకుండు
పరమపత్నీవ్రతు(డె పొందు(బరమగతులు. ౯

ఫిండీగారు నాకు బహువిషయములనుగూర్చి నీతులను బోధించుచువచ్చినను చదివి చెడిపోదునేమోయను భీతిచేత నాకు ముఖ్యముగా ప్రతిదినమును తప్పకయెంతో శ్రద్ధతో పత్నీవ్రత ధర్మములనుపదేశించుచుండెను. ఒకనా(డావిద్వాంసురాలు నేను తెని(గించిన నవరత్నములలో నేడవరత్నమయిన "పురుషుండును గార్ధభమున్ స్థిరముగదండనము లేక చెడిపోదురిలన్" అనుదాని మూలశ్లోకమును నాకు త్సాహముతో బోధించి, ఆదండనము పురుషుల మేలుకొఱకే యని

హేతుకల్పనములతో వ్యాఖ్యానముచేసి పురుషదండనము వలనిలాభ ములను తెలుపుచుండఁగా, నామనోగతి నామె కెఱుకపఱుప కుండ వలెనని నేనెంతప్రయత్నము చేసినను నామనస్సులో హాలాహలము వలెపుట్టి పయికి పొంగుచున్న కోపాగ్ని యాగక నాకన్నులవెంట వెడ లఁజొచ్చినందున అసూయతో మొగ మింకొకవంకకు త్రిప్పుకొంటిని. ఆనీతి నాకు రుచింపకున్నదని బుద్ధిమంతురాలయిన యామె గ్రహించి, పురుషులను స్త్రీలుకొట్టక యాదరింపవలెనని బోధించెడు యాదేశపు నవనాగరికుల మతము నాకు సమ్మతమనుకొని, అప్పుడే విద్యాభ్యా సమువలన మతిమాలి నేను చెడిపోవుచున్నానని నానిమిత్తమయి కొంత వ్యసనపడి, ఈవిషయమున మీదేశములో నేమియాచారమని నన్నామె యడిగెను. "బ్రాహ్మణస్య క్షణంకోప" మన్న నీతినిబట్టి శాంతిజలము చేత నేను కోపాగ్నిని నిమిషములో చల్లార్చుకొని నవ్వుమొగముతో "మాదేశమునందు పురుషులే స్త్రీలను కొట్టుదురు." అని సత్యమును జెప్పితిని. నేను నవ్వులకు సహిత మసత్యము పలుకనని యామె తెలి సికోలేక, నావి పరిహాసోక్తు లనిభావించి నామాటలను నామె నమ్మ నదికాదు. ఈరంఢీదేశములో సదాచారసంపన్నలయిన స్త్రీరత్నములు నిత్యమును తమ పురుషులను వేణుదండముతో దండించుచుందు రన్నచో ప్రత్యక్షానుభవము లేక పోవుటచే మాఫింఢీగారి వలెనే మీరును నమ్మకపోవచ్చును. కాని నేనిక్కడ కన్నులార ప్రత్యక్ష ముగాఁజూచిన సత్యములను వేదవాక్యములవలె చెప్పుచుండుటచేత పురాణగాథలను నమ్మ నలవాటుపడిన మీరుమాత్ర మట్టి యవి శ్వాస పాపమును గట్టుకొనరని నేను దృఢముగా నమ్ముచున్నాను.

ఆమె నామాటలను నమ్మక యట్టివైపరీత్య మీశ్వరసృష్టిలో సంభవింప నేరదని వాదించుటచేత నాసత్యసంధతనుగూర్చి సంశయ పడి నందున కెంతయుఁ జింతనొంది, నామాటలనిజ మామెకు తేట

పఱువవలెనని యిచ్చటస్త్రీలు పురుషులను కొట్టుట యెంతసత్యమో మా దేశమునందు పురుషులు స్త్రీలనుకొట్టుట యంతసత్యమేయనియు కావలసినయెడల మీకు నమ్మకముపుట్టునట్లుగా మాశాస్త్రములనుండి కావలసినన్ని ప్రమాణ వచనములను జూపెదననియు, జెప్పి స్మృతు లలోనెల్లను సర్వోత్కృష్టమయిన మనుస్మృతి యెనిమిదవ యధ్యాయ మునుండి యీక్రింది శ్లోకములను జదివితిని.

శ్లో. భార్యా పుత్రశ్చ దాసశ్చ శిష్యో భ్రాతాచ సోదరః
ప్రాప్తాపరాధా స్తాడ్యాః స్యు రజ్జ్వా వేణుదండేనవా.

శ్లో. పృష్ఠతస్తుశరీరస్య నోత్తమాంగే కథంచన
అతోన్యథాతు ప్రహరన్ ప్రాప్తస్స్యా చ్చోరకిల్బిషమ్.

అప్పుడామె వీనియర్థమేమని నన్నడిగినది. భార్యను, పుత్రుని, సేవ కుని, శిష్యుని, భ్రాతను, సోదరుని, తప్పుచేసినప్పుడు త్రాటితోనై నను వెదురుకఱ్ఱతోనై నను కొట్టవలయునని మొదటిశ్లోకమున కర్థ మనియు, శరీరముయొక్క వెనుకటిభాగ మందేకాని నెత్తిమీఁద కొట్ట రాదు మఱియొకచోట కొట్టినవాఁడు చోరపాపమును పొందునని రెం డవశ్లోకమున కర్థమనియు, చెప్పి యీపయిని "ప్రాప్తాపరాధా" యని మూలములోనున్నను కొట్టుటప్రధానముగాని నేరముచేయుట ప్రధా నము కాకపోవుటచేత మా దేశములో పురుషులు నేరములేక యే భా ర్యలను కొట్టుచుండుట శిష్టాచారమైనదనియు, నెత్తిమీఁద కొట్టఁ గూడదనికూడ మూలములోఁ గానఁబడుచున్నను నెత్తికూడ శరీరము లోని భాగమేయైనందున నెత్తిమీఁదకూడ శాస్త్రార్థము ముందుభాగ మందు బెత్తెడు మేరవదలివేసి వెనుకతట్టున కొట్టవచ్చునని వాక్యసమ న్వయముచేసి సిద్ధాంత మేర్పఱిచి కర్మభూమియైన మా దేశమందలి పెద్దలు భార్యలను శిరస్సుమీఁదనే కొట్టుట సదాచారమయిన దనియు, నేను మనుస్మృతికి వ్యాఖ్యానముచేసి యర్థవివరము చేసితిని. అంను

మీఁద ఫింక్షీగారు నాచేత నీశ్లోకములను శ్లోకార్థములను రెండు సారులు విని, కన్నులుమూసికొని కొంతసేపాలోచించి నీమోసమిప్పటికి తెలిసినదని చిటికెవేసి, మొదటిశ్లోకములో "భార్య" యను చోట "భర్త" యనియుండవలె ననియు, "పుత్రుఁడు దాసుఁడు శిష్యుఁడు భ్రాత సోదరుఁడు" అని శ్లోకములో చెప్పఁబడినవా రందఱును పురుషులయి యుండఁగా మొదట "భార్య" యని యొక్క స్త్రీయుండుట సంభవింపదనియు, అందుచేత నిదికూడ "భర్త" యని యుండఁగా నేను పరిహాసార్థముగా "భార్య" యని మార్చి చదివితిననియు, సిద్ధాంతముచేసి యంతటితోనైన నూరకుండక పురుషులకు చదువువచ్చిన యెడల నట్టియనర్థములు సంభవించునని యెఱిఁగియే బుద్ధిమంతులయిన తమపూర్వులు పురుషవిద్యకూడదని సిద్ధాంతముచేసిరని తనయభిప్రాయమును బయలపెట్టినది. అక్కడ నాపక్షమవలంబించి మాటాడువారెవ్వరును లేకపోయినందున నావాదబలమును నేనెఱిఁగియు వివాదముకూడదని యూరకుండవలసినవాఁడనయితిని.

అయినను నేనంతటితో నూరకుండక మనదేశములో పురుషులే స్వతంత్రులనియు, స్త్రీలు పురుషులకు లోఁబడియుందురనియు, మనుస్మృతిలోనుండి నే నుదాహరించిన ప్రమాణములు సత్యమయినవనియు, ఆమె కేలాగునైనను మనమునఁబట్టింపవలెనని నిశ్చయించుకొని పతివ్రతాధర్మములనుగూర్చి మనపురాణాదులలోఁగల విషయము లనేకము లామెకుఁజెప్పితిని. చెప్పినవాని నెల్ల నామె యాదరముతో విన మొదలుపెట్టినందున నాకుఁ గొంతప్రోత్సాహముగలిగి పతివ్రతాధర్మముల నామె మనస్సునకుఁ జక్కఁగా పట్టించనెంచి భర్తయెంగిలి భుజించుట పత్నికి పరమధర్మమని చూపుటకయి నాలాయనికథ నారంభించి యిట్లుచెప్పఁజొచ్చితిని.

"పూర్వకాలమునందు నాలాయనియైన యింద్రసేన మాద్గల్యునకు భార్యయయ్యెను. అతఁడు కుష్ఠరోగపీడితుఁడు. ఆమహాపతివ్రత యాతనియుచ్ఛిష్టమును ప్రతిదినమును అమృతతుల్యముగా భక్షించుచుండును. భోజనముచేయుచున్న కాలమునం దొకనాఁ డతని యంగుష్ఠము తునిగి యన్నములోఁబడెను. అట్లుపడినను పతివ్రతా శిరోమణియైన యామె రోఁతపడక యాబొట్టనవ్రేలిని దీసి భక్తితో దూరముగానుంచి యెంగిలియన్నమును పరమాన్నమువలె తినెను. అదిచూచి——"

ఇంతవఱకుఁ జెప్పినప్పటి కామె చెవులుమూసికొని నామాట కడ్డమువచ్చి, పురుషుఁడనైన నేనిన్నికథ లొక్కనిమిషములో కల్పించుట సంభవింపదని యెంచి మనకు శాస్త్రము లున్నవనియు వానిలో భర్తృశుశ్రూషాదులు చెప్పఁబడియున్నవనియు కొంతవఱకు నమ్మినను నన్నొకథను సొంతముగాఁ జెప్పనీక, దురాగ్రహగ్రస్తురాలయి మన శాస్త్రములు రాక్షసులుచేసిన పాడుకథలని దూషించెను. అప్పుడు నేనును కోపమునుపట్టఁజాలక గురుధిక్కారపాపము వచ్చిననుసరేయని యెదురుకొని మాటకు మాఱుమాటయాడి కొంతసేపు వాక్కలహము నకు డీకొంటిని. నన్నుదూషించినను నేనూరకుందునుగాని శాస్త్రములను దూషించినతరువాత శాస్త్రబద్ధుఁడనైన నేనెట్లూరకుండఁ గలుగుదును ? మావాక్కలహమువలన నాటిసంభాషణ యంతటితో ముగిసినది. అందుమూలమున నేను జెప్పఁదలఁచుకొన్న స్త్రీధర్మముల నామెకుఁ జెప్పలేకపోతినిగదాయని నాకు విచారము గలిగినదిగాని మించినదానికి వగచిన ప్రయోజనముండదు. నాకు పాఠముచెప్పక కోపముతో నాటిదినమామె తనయింటికి పోయినది. అంతటితో నాచదువునకు విఘ్నమువచ్చినట్లు కానఁబడెనుగాని యామె దీర్ఘక్రోధురాలు కానందునను, నేనుపోయి యామెకు క్షమార్పణముచేసి

ప్రార్థించినందునను నాలుగుదినము లయినతరువాత యథాప్రకార ముగా వచ్చి నాకామె మరల విద్యచెప్పనారంభించినది. ఆదినము మొదలుకొని యింక నేనామెతో మన దేశమునుగూర్చి మాటాడకూడ దని యొట్టుపెట్టుకొంటిని. అటుతరువాత జరగిన వృత్తాంతమును మీకు ముందు ప్రకరణములయందుఁ జెప్పెదను.

---

## ఐదవ ప్రకరణము

వెనుకఁజెప్పినట్లు మాకలహాముతీఱి మేమిద్దఱమును సమాధానపడిన తరువాత మా ఫిండీగారికి నామీఁద అపరిమితానుగ్రహము వచ్చినది. ఆయనుగ్రహము వచ్చుటకు కారణము నేనామెకు పరమ భక్తుఁడనయి మనదేశములో శిష్యులు గురువులకు శుశ్రూష చేయు నట్లుగా సమస్తోపచారములను చేయుచు అనువర్తనముకలిగి యుండుట యేకాని మఱియొకటికాదు. స్త్రీలయినను పురుషులయినను విద్య చెప్పినవారు దైవసమానులుగనుక నేను స్త్రీకి దాస్యము చేయుచుంటి నని మీరు నన్ను నిందింపక నాగురుభక్తికి మెచ్చుకొనవలెను. అదిపో నిండు. అటుతరువాత శిష్యవత్సలురాలైన యామె తమదేశజనుల యాచారవ్యవహారములు మొదలయిన వన్నియు నాకు మర్మమువిడిచి చెప్పమొదలుపెట్టెను. ఆమె యొకనాఁడు భోజనముచేసి కూరుచుండి యుత్సాహముతో తాంబూలచర్వణముచేయుచు కూరుచున్నప్పుడు నేనుపోయి గురువందనముచేసి చేతులుజోడించుకొని యెదుట నిలుచుండి భక్తిపూర్వకముగా నిట్లడిగితిని.

అమ్మా! మీరు సర్వమును తెలిసినవారు. స్వభావముచేత పురుషులే యెక్కువ బలముగలవారో స్త్రీలే యెక్కువబలముగలవారో మీరాశిష్యునకు సెలవియ్యవలెను.

పురుషులే యధికబలముగలవారని యామె సెలవిచ్చినది. అప్పుడు మాయిద్దఱికిని సంభాషణ మిట్లుజరిగినది.

అమ్మా! స్త్రీపురుషులలో పురుషులే అధికబలవంతులని మీరు సెలవిచ్చుచున్నారుగదా? అట్లయినపక్షమున, ఈదేశములో బలాధికులయిన పురుషులు బలహీనురాండ్రయిన స్త్రీలకులోఁబడుట యెట్లు సంభవించినది? నా యీసంశయము తీర్పవలెను.

ఓయి వెఱ్ఱివాఁడా! నీవేమియు తెలియని మూఢుఁడవుగదా? పురుషులు స్త్రీలకు లోఁబడవలెననుట యీశ్వరోద్దేశము—(ఈశ్వరుఁడని పుంలింగ ప్రయోగము చేసినందుకు చదువరులు నన్ను మన్నింపవలెను. ఆదేశమునందు దేవుఁడాఁడవాఁడనియే ప్రసిద్ధము. ఆమె యీశ్వరియని యర్థమిచ్చునట్లుగా స్త్రీలింగమునే ప్రయోగించినను మీకు తెలియుటకై నేనే యీశ్వరుఁడనుచున్నాను.)—బలవంతులు గనుక పురుషులు పాటుపడి పనిచేయుటకును, పత్నిసేవచేయుటకును, తగినవారు. అంతేకాని వారు స్త్రీలవలె ఆలోచనతో చేరిన పనులు చేయుటకుఁగాని గ్రంథరచన చేయుటకుఁగాని స్వభావముచేతనే తగరు. పురుషులు బలాధికులే కానిపక్షమున—

మా దేశములో పురుషులు ఆలోచనతో చేరిన పనులు చేయుచు కవిత్వము చెప్పుచున్నారే—

మధ్య నామాటల కడ్డమురాక నేను చెప్పెడిది పాంతముగావిని నీసంశయము పోఁగొట్టుకో. మీది కేవల రాక్షససృష్టి. అందుచేతనే (నీమాటలునమ్మెడు పక్షమున) మీదేశములో సర్వమును దేవతాసృష్టియైన మాదేశమునకు విపరీతముగా నున్నది. ఆసంగతి పోనిమ్ము. పురుషులు బలాధికులే కానిపక్షమున వారుపత్నులకు వంటచేయుటకును ఉపచారములు చేయుటకును, బరువులు మోయుటకును, ఎట్లు సమర్థులగుదురు?

మా దేశములోఁగూడ నలుఁడు భీముఁడు మొదలయినవారు పాకము చేయుటలో పూర్వకాలమునందు బహు సమర్థులు.

అట్లయిన పక్షమున మాదేశమువలెనే మీదేశము పూర్వకాలమునందు మంచిదయియుండి యిప్పుడు చెడిపోయియుండును. స్త్రీలు బలహీనురాండ్రగుటయే దేవుఁడు వారు—

అందుకు సందేహములేదు. పూర్వకాలమందువలెఁగాక మా దేశ మిప్పుడుతప్పక చెడిపోయినది.

స్త్రీలు బలహీనురాండ్రగుటయే దేవుఁడు వారు పనిపాటులు చేయ నక్కఱలేక సుఖముగాకూర్చుండి యాలోచనచేయుచు ప్రభుత్వము చేయవలయునని యుద్దేశించెననుటకు నీకు నిదర్శనముగాఁ గనఁబడుచుండలేదా? ఇంతమాత్రము తెలిసికోలేని పక్షమున నీవు చదివిన చదువులో నేమి ప్రయోజనము? ఇందుచేతనే పురుషు లొకవేళ చదివినను బుద్ధిసంపదలో స్త్రీలతో సమానులు కాఁజాలరని మా పెద్దలు సెలవిచ్చియున్నారు. ఇటువంటి మందబుద్ధివగుటచేతనే బలవంతులయిన పురుషులు బలహీనలయిన స్త్రీల కేల యడఁగియున్నారని నీకు సందేహము కలిగినది.

అవును. ఆసందేహమును మీరు నుంకుగాతీర్చి నన్ను ధన్యుని చేయవలెను.

స్త్రీలు బుద్ధిబలముగలవారు. దేహబల మెంతయున్నను బుద్ధిబలమునకుచాలదు. అందుచేతనే పురుషులు స్త్రీలకులోఁబడుట సంభవించినది. కేవల శరీరబలము గలవారయిన పురుషులు బుద్ధిబలము గలవారయిన స్త్రీలకు లోఁబడుట స్వభావముకాదా? ఈమాత్రపు స్వల్పాంశము నీకు తెలిసినదికాదు. ఇదే స్త్రీబుద్ధికిని పురుషబుద్ధికిని గల తారతమ్యము. పురుషులు స్త్రీలకు లోఁబడియుండుట కింకొక రహస్యముకూడనున్నది.

ఆరహస్యముకూడ నాకు సెలవిచ్చి మూఢుఁడనయిన నన్ను కృతార్థునిఁ జేయవలెను. మీశిష్యుఁడ నయినతరువాత నాకు తెలి యనివిషయ ముండఁగూడదు.

అది పరమరహస్యమే యయినను భక్తిశ్రద్ధలు కలవాఁడవగుట చేత నీకుమర్మమువిడిచి చెప్పెదను. స్త్రీలు పురుషులమీఁద నధికా రము చెల్లించఁ గలుగుటకు ప్రధానకారణము మంత్రబలము. ఎంత బలవంతునినైనను లోఁబఱచుకొని దాసునిజేసికుక్కవలె ఆడింపఁగల శక్తి మావద్దనున్నది.

అదిసత్యము. ఆశక్తి స్త్రీలవద్ద తప్పక యున్నది. సర్వ స్వతం త్రులమని చెప్పుకొనుచున్న మా దేశమునందు సహితము పురుషులు స్త్రీలకు దాసులయి వారు చెప్పినట్లే నడుచుచున్నారు. సంస్కార కర్తలమని పేరుపెట్టుకొని సభలలో పులులవలె నఱచెడు మా దేశము నందలి నవనాగరిక పురుషులు కూడ పౌరుషహీనులయి యింటివద్ద భార్యలముందు నోరెత్తలేక పిల్లులవలె నొదిగియుండి తాము చెప్పినట్లు భార్యలను నడపింపలేక భార్యలు చెప్పినట్లే తాము నడుచుకొను చున్నారు.

ఆలాగుననా ? ఈమాట యింతకుముం దెప్పుడును చెప్పినావు కావేమి ? మీ దేశమునందు పురుషులు స్వతంత్రులన్న నేనేమోయను కొన్నాను. ఇప్పుడు నిజము తెలిసిపోయినది. మొదటినుండియు నీమా టలయందు నాకెప్పుడును నమ్మకములేదు. మా దేశమునందువలెనే మీ దేశమునందును పురుషులే స్త్రీలకు లోఁబడియున్నారు. మేమే స్వతంత్రులమని పయి కెవరెన్ని వేషములు వేసినను, ఈశ్వరసంకల్పమున కెన్నఁడయిన వికల్పము కలుగునా ? ఈనవనాగరికుల మూలమున మా దేశ మిప్పుడు కొంతకొంత చెడిపోవుచున్నది. ఇప్పటి పురుషులకు

పూర్వపు పత్నీభక్తి తగ్గుచున్నది. స్త్రీలిప్పుడు పురుషుల మాటలే విన మొదలుపెట్టినారు.

ఈకపట చెప్పిన వాక్యములచేత నాకు కొంతసంతోషము కలిగినది. ఇక్కడకూడ స్త్రీలిప్పుడు పురుషుల మాటలనే వినుచున్నారు గదా? వినుటయే స్వభావసిద్ధము; వినకుండుటయే స్వభావవిరుద్ధము. ఈయాలోచనలన్నియు నామనస్సులో పుట్టినను, ఆమె మనస్సు నొచ్చునని నేను పలుకలేను. ఈప్రసంగ మయిన తరువాత నేనామెకు భక్తితో నమస్కరించి నాకామంత్రముల నుపదేశింపక తప్పదని పాదములమీఁదపడి లేచినాఁడనుగాను. అప్పు డుపదేశించుటకు సమయము కానందున మఱియొకప్పు డుపదేశించెదనని చెప్పి, కొన్ని దినము లయిన తరువాత నేను మూఁడుపవాసముచేసి స్నానముచేసి శుచినయి యమావాస్యనాఁడు ప్రాతఃకాలమునపోయి సందర్శనము చేసికొని పాదప్రణామము చేయఁగా నాకామె వశీకరణ మంత్రము మొదలైన మహామంత్రములను పెక్కింటిని ఉపదేశించినది. ఆమె నాతో చెప్పకపోయినను నేనీమంత్రములను మనదేశపు స్త్రీలకు చెప్పుదునను భ్రమతో నాకామె మఱింత ప్రీతి పూర్వకముగా నుపదేశించినట్టు నేను కనిపెట్టినాను. కాని నేనట్టిపని యెన్నఁడైనను చేయుదునా? ఈమంత్రముల నిందు ప్రకటించి మీకుపదేశించి యుందునుగాని, ప్రచురపఱిచిన పక్షమున స్త్రీలుకూడ గ్రహించి యీదేశమునందువలెనే మనదేశము నందుఁగూడ వారు పురుషులను తమకు దాసులనుగాఁ జేసికొందు రేమోయను భయముచేత నేనిందు ప్రకటింప సాహసింపకున్నాను. ఓహిందూమహాజనులారా! దీనినిబట్టి నాకు మీయందనురాగము తక్కువ పడినదని మీరెంచఁబోకుఁడు. నాదగ్గఱకువచ్చిన పక్షమున స్త్రీలకు చెప్పమని మీచేత ప్రమాణములు చేయించుకొని మంత్రసిద్ధికొఱకు మీవలన గురుదక్షిణలను స్వీకరించి మీకొక్కరికే సర్వ

మంత్రములను ప్రయోగోపసంహారములతోను అంగన్యాస కరన్యాసములతోను రహస్యముగా నుపదేశించెదను.

అటుతరువాత మంచి పాండిత్యము సంపాదించి మాయజమానురాలిగారి కోరికప్రకారముగా నేను పాఠశాలయందు ప్రవేశించినాను. మఱియొక పురుషుఁడు కూడ పాఠశాలయందుచేరి నాకు సహపాఠియయి మిత్రుఁడయినాఁడు. మేమిద్దఱమును రహస్యముగా నాలోచించుకొని యాదేశమునందలి పురుషుల కేలాగునైనను స్వాతంత్ర్యము కలుగఁజేయుటకు సర్వవిధముల ప్రయత్నము చేయవలెనని యెవ్వరికిని దెలియకుండ మాలోమేము ప్రమాణములు చేసికొన్నాము. స్త్రీలను లోఁబఱుచుకొనెడు సులభోపాయము నాకు తెలియును గనుక, మన కొక్కోకమునందుఁ జెప్పఁబడిన "ఓం—కృష్ణాంగి—కృష్ణముఖి—పుష్పంహాస్యామి—వశ్యమానయాది — నభవతి—బ్రహ్మారుద్రాభవతి—స్వాహా" అను వశీకరణ మంత్రము నేనాతనికి గురుదక్షిణలేకుండ నుపదేశించి, దీనిని పదిలక్షలు జపించి పురశ్చరణచేసి తెల్లని పువ్వులు మంత్రించి స్త్రీలమీఁద చల్లవలెనని చెప్పినాను. గురుదక్షిణ లేకపోవుటచేత కాఁబోలును! ఈమంత్ర మంతగా పనిచేసినది కాదు. ఎట్లయినను మనమంత్రము లాదేశపు మంత్రములకు చాలవు. అందుచేతనే మనవారు మళయాళమంత్రములని గొప్పగా చెప్పుదురు. నేను పాఠశాలలో ప్రవేశించినది మొదలుకొని జరగిన విశేషములను తెలుపుటకు ముందుగా దేశస్థుల యాచార వ్యవహారములను గూర్చి కొంత చెప్పుట యుక్తమని తలఁచుచున్నాను.

ఆదేశమునందు స్త్రీలే సర్వస్వతంత్రురాండ్రనియు, పురుషులు వారి కాజ్ఞానువర్తులయి మెలఁగవలసిన వారనియు, నేనీవఱకే చెప్పియున్నాను. మన దేశమునందాఁడువారికి వలెనే యాదేశమునందు మగవారికి విద్య చెప్పింపరు. మనదేశమునందలి భోగస్త్రీలవలె నాదే

శమునందు భోగపురుషులుమాత్ర మల్లవిద్య నభ్యసింతురుగాన యీవి వారివృత్తి కనుకూలమయినదిగా నుండును. మగవారిని చిన్నపోరాంసిని చెప్పినచో గొప్ప తప్పిదముగా నెంచి వారు కోపపడి ఘోరపాపమును జేయుచున్నవానిని తిట్టునట్లు తిట్టుదురు. విద్య లేకపోవుటచేతనో మరియే హేతువుచేతనో యాదేశమునందు మగవారికి నగలయందాసక్తి నాస్త్రీలకంటెను విశేషముగా నుండును. అక్కడ స్త్రీలకు నగలంతగా నుండవు. నగలనిమిత్తమే కాకపోయిన పక్షమున పురుషులకు మీసములను గడ్డములను భగవంతుఁ డేల కలిగించెనని యచ్చటి వారడుగుదురు. దీనినిబట్టి యక్కడి పురుషులు తలయందుమాత్రమే కాక చక్కగా దువ్వుకొని మీసములకును గడ్డములకునుగూడ నగలు తగిలించుకొందు రని నేను చెప్పనక్కఱలేకయే మీరు గ్రహించియుందురు. పుత్త్రవి యోగము సంభవించిన పురుషుల కక్కడివారు గడ్డములను మీసము లను మాత్రము గొఱిగింతురు. అంతేకాని మనము నితంతువ్రులవిష యమున జరుపునట్లుగా శిరోముండనమును జేయరు. పినురులకు గడ్డము గొఱిగించి తల యేలగొఱిగింపరని నేనొకనాఁడు నామిత్రుని నడు గఁగా, అతఁడు పురుషు లెప్పుడును స్త్రీలకు లోఁబడి వారిచే దండం పఁబడవలసినవారు గనుక జుట్టు వంగఁదీసి గుద్దుట కనుకూలముగా నుం డుటకై తల గొఱిగింపరని యాతఁడు చెప్పెను. ఆ దేశమునం దింకొక విచిత్రమయిన యాచారము గలదు. ఇరువది సంవత్సరములు దాటిన తరువాత భార్యలను పోఁగొట్టుకొన్న భర్తలల కందఱకును పండ్రెండవ నాఁడు ముక్కుయొక్క ముందటిభాగమును కత్తిరింతురు. ఈయాచా రమును బట్టియే వెనుక నాయజమానురాలయిన ఘాంఢీభంగీగారు నాభార్య నాచిన్నతనములోనే పోయినదని గ్రహించినారు. ముక్కు కత్తెరలు ప్రతి గృహమునందును ఒక్కొకటి యుండును. మనదేశము నందీసదాచారమును నెలకొల్పవలెనని యొక కత్తెర సంపాదించి నాతో

తెచ్చినాను. విరూపు లగుటచేతనో యేమోకాని యీముక్కడి పురుషులయం దక్కడ వ్యభిచార మెంతమాత్రమును గానఁబడదు. అట్లు లేకపోవుట కీనాసికాఛేదనమే కారణ మగుటకు సందేహములేదు. పురుషులకు చేయుటచేత నిది దురాచారమయినను స్త్రీల విషయమయి జరిగించినపక్షమున తప్పక సదాచారమే యగును. మన వితంతువుల కిట్లు ముక్కుకోసిన పక్షమున వారిలో వ్యభిచారము సమూలముగా నశించుననుటకు సందేహముండదు. ఇటువంటి సదాచారము మనస్మృతులలో నెక్కడ నైనను జెప్పఁబడి యుండకపోదు కాఁబట్టి యీయాచారమును మనము మనదేశమునందు తప్పక నెలకొల్పవలయును. నేను ధర్మశాస్త్రములను వెదకి దీని కాధారముగా కారిక నెందయినను కనిపెట్టెదను. ఇప్పుడున్న స్మృతులలో దీని కాధార మొకవేళ దొరకకపోయినను ఖిలస్మృతులయందయినను తప్పక యుండును గాని యుండకపోదు. ధర్మజ్ఞసమయముకూడ ప్రమాణమేగనుక మన పండితులందఱును వెంటనే సభచేసి శీఘ్రముగా నిట్టినిబంధనము నొకదాని నేర్పఱుపవలయును.

ఆదేశమునందు సహితము మనదేశమునందువలెనే పత్నులు వయస్సునఁ జిన్నవారుగాను, భర్తలు పెద్దవారుగాను ఉందురు. ఇష్టమున్నయెడల స్త్రీ యనేక భర్తలను చేసికొనవచ్చునుగాని సంస్థానాధీశ్వరులలోఁ దక్క సాధారణముగా స్త్రీలొక్కొక్క భర్తతోనే తృప్తి పొందియుందురు. భర్తలు పుట్టినిండ్లకు వెళ్ళినప్పుడును, రోగాదికముచేత నశక్తులయి యుండినప్పుడును, స్త్రీలు కామాతురలయియున్నవారు భోగపురుషులయొద్దకు పోదురు. పయికారణములు రెండును లేకపోయినను ధనవంతురాండ్రయిన స్త్రీలు భోగపురుషుల నుంచుకొందురు. ఈభోగపురుషు లుగ్గుపాలనాటినుండియు స్త్రీలను వలపించి తమవలలలోఁ బడవేయఁ దగినవిద్యల నభ్యసింతురు. హృదయరంజకము

యిన సంగీతము వారికడనే యుండుటచేత సంగీతము పాడనేర్చిన కుల పురుషునిగాని స్త్రీనిగాని మిక్కిలి నీచముగాఁజూతురు. సంగీతము వృత్తిగాఁగల కుల స్త్రీలను పంక్తిభోజనములకు రానియ్యారు. కామో ద్రేకమును గలిగించెడు గ్రామ్యములయిన పాటలను, సరసోక్తులను, వశ్యౌషధములను, వశీకరణమంత్రములను, హావభావాదులను దెలిపెడు నేత్రహస్తాద్యభినయములను, నేర్చుకొని భోగపురుషులు గడ్డము లను మీసములను తలను దువ్వుకొని నానా విధములయిన యాభరణ ములతోను పుష్పములతోను శరీరము నలంకరించుకొని, చిత్రవర్ణ ములుగల వస్త్రములను ధరించి, మొగములకు తళుకుతళుకు మనెడు వర్ణమేదో వేసికొని, దానిమీఁద సువాసనగల బంగారువర్ణముగల పొడుమేదో చల్లుకొని, అత్తరు మొదలైన సుగంధద్రవ్యములను పూసి కొని, తమ మేలితావులు వీధుల గుబులుకొనఁగా దీపములు పెట్టిన తరువాత రూపమునుధరించిన గృహదేవత లనునట్లుగా దీపములవెలు తురున తళుకుతళుక్కున మెఱయుచు, దారినిపోవు యువతుల హృదయ ములు సంచలించునట్లుగా ప్రతిదినమును తమగుమ్మములో నిలుచుండి స్త్రీలుతారసించినప్పుడెల్లను సిగ్గుపడి లోపలికిపోయి తలుపుచాటునుండి మొగమీవలికిఁబెట్టి తొంగితొంగి చూచుచుందురు. అటువంటి సౌంద ర్యముగల పురుషులు మనదేశమునందులేరు. మణులుచెక్కిన బంగరు బొమ్మలవలె నిలువఁబడి భూమికి దిగిన మెఱుపుతీఁగవలె వారు దీప ములవెలుతురున మెఱయుచున్నప్పుడు నావంటి పురుషులకు సహితము పోయి పయినిబడి కౌఁగిలింపవలెనని బుద్ధిపుట్టుచున్నప్పుడు యువతులు వారినిమోహించి వారివలలోఁబడుట యేమియాశ్చర్యము? ఏఁబది యేండ్లుదాటినవారు సహితము తెల్లపడిన వెండ్రుకలకు నల్లరంగువేసి కొని యలంకరించుకొని పదునాఱేండ్ల బాలకుమారులవలెఁ గానఁబడు దురు. అయినను మనదేశమునందు వివాహములు మొదలయిన శుభ

కార్యములలో వేశ్యలను పాటలకు పిలుచుచున్నుగా వీరిని శుభకార్యములకు పిలువరు; మన దేవదాసులవలె వీరు దేవాలయముల యందును గానరారు. గృహదేవతలవలె నుండెడు వీరికి గృహములే దేవాలయములు; వీరే యందుండెడు దేవతలు. ఈదేవతాసందర్శనము నిమిత్తమయియే ధనవంతురాండ్రయిన స్త్రీలు వారి యాలయములకుఁ బోయి తమదేహములను విత్తములను వారికి సమర్పించి వారి ప్రసాదమును వేఁడుచుందురు. దేవతాభక్తిగలవారు ధనాదులయందు వైరాగ్యముగలవా రగుటచే యీదేవతలను సదా సేవించువారును నిస్పృహత్వముచేత ధనముకొల్లపెట్టి తాము జోగులగుదురు. మనదేవతలకువలెనే యీభోగదేవతలకును పరభార్యలయందే సంతానప్రాప్తి. అయినను మనదేవతలకువలె అమృతత్వములేనివీరికి వంశాభివృద్ధి యెట్లో నాకు తెలిసినదికాదు. విశేషవిత్తమిచ్చి బీదల చక్కని బిడ్డలను గొని వీరు వారిని చిన్నప్పటినుండియు భ్రమరకీట న్యాయముచేత మర్త్యత్వమునుండి దేవతాత్వమునకు లేవఁదీయుదురఁట !

అక్కడ సహితము వివాహములకు కన్యావరులయిష్ట మక్కఱలేదు. తల్లిదండ్రులే ముఖ్యముగా తల్లులే కన్యావరణము చేయుదురు. పురుషులు యుక్తవయస్సు వచ్చినతరువాత వివాహముచేసెడు పక్షమున కురూపిణులయిన పత్నులను చేసికొనుటకంగీకరింపక తల్లిదండ్రులు చెప్పినమాటవినక తిరిస్కరింతురుగనుక పురుషులకు గురుధిక్కారదోషము కలుగకుండఁ జేయుటకయి చిన్నతనములోనే వివాహములు చేయు సదాచారమును వారిధర్మశాస్త్రములు విధించుచున్నవని చెప్పుదురు. వారిధర్మశాస్త్రములనుబట్టి స్త్రీకి పదునాలు సంవత్సరములకు లోపల గర్భాధానము చేయఁగూడదు. పదునెనిమిదవ సంవత్సరమునందు చేయుట శ్రేష్ఠము. గర్భాధానమునాఁటికి పురుషున కిరువది సంవత్సరముల వయస్సుండవలెను. పదునాలేండ్ల ప్రాయముననే స్త్రీకి

గర్భాధానము చేసినను పురుషునకప్పటి కిరువది సంవత్సరముల యీడుండవలెను గనుక, సాధారణముగా పత్నికంటె భర్తనాలుగుసంవత్సరములు పెద్దవాఁడుగానుండవలెను. రెండవపెండ్లి స్త్రీ కీనియమము లేదు. అప్పుడు భర్త యెంతచిన్నవాఁడుగానయిన నుండవచ్చును. అయినను పురుషునకు కిరువదిసంవత్సరములు వచ్చువఱకును మాత్రము పునస్సంధానము చేయఁగూడదు. అందుచేత పురుషుఁ లెదిగి కాపురమునకు వచ్చువఱకును స్త్రీలిష్టమున్న యెడల భోగపురుషుల నుంచుకోవచ్చును. పురుషునకు పంద్రెండవ యేఁడు మొదలుకొని పదునాఱవయేఁడువచ్చు లోపల వివాహముచేయుదురు. భార్యలకన్న భర్తలు పెద్దవారుగా నుండవలసినందుకు వారనేకకారణములు చెప్పుదురు. అందొకకారణము పురుషులకంటె ముందుగా స్త్రీలకు యుక్తవయస్సువచ్చుట. స్త్రీలకు యుక్తవయస్సు వేగిరముగావచ్చుటయే పురుషులకంటె స్త్రీలుశ్రేష్ఠురాండ్రగుటకు గొప్పనిదర్శనమనివారు చెప్పుదురు. భర్తలు భార్యలకంటె పెద్దవారుగా నుండవలెననుట కింకొకకారణము పత్ను లెదిగిన తరువాత కనిపెట్టుకొని యుండకుండుటకును, పురుషులు పత్నీసేవ చేయుటకు సమర్థులుగా నుండుటకు అని యీవఱకే చెప్పఁబడినది ; అక్కడ వంటచేయవలసినవారు పురుషులేయనియు నీవఱకే చెప్పఁబడినది. మన దేశమునందువలె స్త్రీలు వంటచేసెడుపక్షమున, వారు గర్భిణులయి ప్రసవించిన సమయములు మొదలయినవానియందు విఘ్నముకలిగి చిక్కులు కలుగునుగనుక, అటువంటి యాటంకములు కలుగకుండుటకయి భగవంతుఁడే పురుషులను పాకముచేయువారినిగా నిర్మించెనని వారువాదింతురు.

మనదేశమునందు స్త్రీలకు రాణివాసమున్నట్లే యాదేశమునందు పురుషులకును గలదు. మనదేశమునం దట్టియాచారము లేకపోవుటచేత దానికేమని పేరు పెట్టవలయునో నాకు తెలియకున్నది. రంఫీభావ

యందు దానికి "ఘోధా" యని పేరు. అది మనదేశమునందలి ఘోషాపదముతో సమానమయినది. ఒకవేళ నది ఘోషాశబ్దభవమై యుండును. వర్ణవ్యత్యయవిధినిబట్టి తద్భవమునందు "షా" కు "ధా" రావచ్చును. దానిని నేను రాణివాసమునకు ప్రతిగా రాజవాసమని పిలిచెదను. మనదేశమునందలి స్త్రీలకువలె రాణివాసము పన్నెండవయేట నారంభముగాక యీదేశమునందు పురుషులకు రాజవాసము పదునాఱవయేట నారంభమగును. అక్కడి రాజవాసము మనరాణివాసమువలెఁ గాక మిక్కిలి విచిత్రమయినదిగా నుండును. సంస్థానాధీశ్వరులును ధనికురాండ్రును మనమిక్కడ ధననిమిత్తము చేయించినట్టుగా పెద్దయినుపపెట్టెలను చేయింతురు. ఒక్కొక్క పెట్టెయెత్తు ఏడడుగుల ఆఱంగుళములు; నిడివి యేడడుగుల మూఁడంగుళములు; వెడల్పు నాలుగడుగుల రెండంగుళములు. చుట్టునుఅమర్చిన యినుపరేకుదళసరి ముప్పాతిక అంగుళము. దానితలుపు రెండడుగుల వెడల్పును నాలుగడుగులయెత్తునుకలదిగానుండును. దానితాళము మాఱుచెవికిరాక బ్రహ్మభేద్యమయినదిగానుండును. ఈపెట్టెకు గాలివచ్చుటకును వెలుతురువచ్చుటకును రెండువైపులను గోడలకు అడుగు చతురముగల రెండుగవాక్షములుండి వానికడ్డముగా ఇనుపకమ్ములు వేయఁబడియుండును. ఈరాజవాసమునందు పదునాఱు సంవత్సరములు వచ్చినది మొదలుకొని భాగ్యవంతులపురుషులు పగలెల్లను నిర్బంధింపఁబడుదురు. ప్రాతఃకాలమున స్త్రీలభోజనము లగునప్పటికి తొమ్మిదిగంటలగును. తరువాత పదిగంటలకు కోపలభర్తలభోజనములగును. భర్తలభోజనములు కాఁగానే పత్నులు తమపురుషులను పయినివర్ణింపఁబడిన రాజగృహములయందుఁ బెట్టితాళము వేసి తాళముచెవి తమయొద్దనుంచుకొని రాజకీయ కార్యస్థానములు మొదలయినవానికిఁ బోవుదురు. వారు మరల సాయంకాల మయిదుగంటల కింటికివచ్చి తాళముతీయఁగా

పురుషు లీవలకువచ్చి వంట మొదలయినపనులు చేయుదురు. దీనిని బట్టి యనుపగదులలో పురుషులు పగలెల్లను సోమరులయి హాయిగా మహారాజులవలె నిద్రపోదురని మీరనుకొందురేమో మీయూహ సరి యైనదికాదు. పరుండుట కాగదిలో రెండగుగుల వెడల్పును అయిదడుగుల పొడుగునుగల మంచమొకటియున్నను, అందులోనే పిండి మొదలయినవి విసరుటకు తిరుగండ్లును కూరలుతరుగుటకు కత్తిపీటలును తక్కిన పనులుచేయుటకుతగిన సాధన సామగ్రియు నుండును గనుక వారందులోనే పనిపాటులుచేసి కావలసినప్పుడు మంచముమీఁద వెన్నువాల్తురు. ఈయాచారముచేత రంఢీ దేశమునందు కులపురుషులలో వ్యభిచారమన్నమాట లేదు. స్త్రీలకెప్పుడును పురుషులమీఁద అనుమానము విస్తారమగుటచేత ఈపురుషులమీఁదకూడ దోషారోపణములు చేయుదురుగాని నేను చూచినంతవఱకు పురుషులకొక్కరికిని గర్భములురాక పోవుటచేత నేను వారిమాటలు నమ్మను. ఈపెట్టెలనుచేయు స్త్రీలు మారుతాళము చెవులను చేసి తమయొద్దనుంచుకొని విశేషధనమును స్వీకరించి ధనికురాండ్రయిన యితరస్త్రీల కమ్ముదురనియు, అందుమూలమున వ్యభిచారము జరుగుననియు, అసూయగలవారు లేనిపందలు కట్టుదురు. ఇనుపపెట్టెలను కొనుటకు శక్తిలేనివా రీరీతిగా కఱ్ఱపెట్టెలను చేయింతురు. అందుకును సమర్థులుకానివారు తమపతులను గదులలోనేపెట్టి తాళముచేసి దానితోనే తృప్తిపొందియుందురు. ఈయాచారమును మనముతప్పక మనదేశములోకూడ స్థాపింపవలెను. అనుభవజ్ఞుఁడనైన నామాటవిని మీరీ పెట్టెలపద్ధతిని మనదేశములో వ్యాపింపఁజేసి స్త్రీలనందుంచి తాళమువేయుచు వచ్చినపక్షమున, అత్యల్పకాలములోనే మనభరతఖండమునందు జారత్వము రూపుమాసిపోయి మనదేశము మహాపవిత్రమయినదగును. ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటకువీలుగలుగునుగనుక మనపెట్టెలకు మాత్రము గవాక్షములుం

డనియ్యఁగూడదు. మనదేశమునందు పెళ్ళిలుచేయువారు పురుషులగుట చేత తాళము చెవులవిషయమయి యీదేశములో స్త్రీలుజరుపుచు రను మోసపుపనులు మనదేశములో నుండవు. అంతేకాక యీపేటికానిర్మాణమువలన స్త్రీలకు మానరక్షణము కలుగుటయే కాక కమ్మరులకును వడ్రంగులకును క్రొత్తజీవనాధారము కలిగి దేశము భాగ్యసంపన్నమగును. కాఁబట్టి నాహితోపదేశమును మీరశ్రద్ధ చేయఁబోకుఁడు. నాదేశాటనమువలనఁగదా భరతఖండమున కింతమహోపకారము కలుగుచున్నది! దేశాటనము బహులాభప్రదమని పెద్దలన్నమాట వ్యర్థమగునా?

పురుషులకు నలువది సంవత్సరములు దాటఁగానే రాజవాస బంధవిమోచనమగును. ఈనిర్బంధము వితంతుపురుషులకు సహితముండను. అందుచేత పురుషులు స్వేచ్ఛగానుండుటకయి పత్నులకు విష ప్రయోగములు చేసియుందురుగాని, వితంతువులు కాఁగానే ముక్కుకోయుదురన్న భయముచేత నట్టిపనికి సాహసింపక వారు పత్నీభక్తి కల వారయి యుందురు.

## ఆఱవప్రకరణము

నాయజమానురాలైన ఘాంఘీభంగీగారు విద్వాంసురాలైన భాంగీఫిండీగారిని నియమించి నాకింట విద్య చెప్పించుటయు, రంఢీ భాషలో నేను తగినంత పాండిత్యమును సంపాదించినతరువాత దొరతనమువారు క్రొత్తగాస్థాపించిన పురుష పాఠశాలకు నన్ను పంపుటయు అక్కడ సహపాఠియగు మఱియొక పురుషునితో నాకు మైత్రికలుగుటయు మీకీవఱకే తెలిపియున్నానుగదా? మేమిరువురమును తప్ప మఱియెవ్వరును పురుషు లాపాఠశాలలో చేర లేదు. మా కుపాధ్యాయుఁడుగా నియమింపఁబడిన జాతిపురుషునిపేరు చామర్జి. అతఁడు

సంఘీభాషయందు విశేషపాండిత్యము కలవాఁడు కాకపోయినను స్వభాషయందు మహావిద్వాంసుఁడయి సంగీతమునందును చిత్రలేఖనమునందును శిల్పములయందును ప్రకృతిశాస్త్రములయందును నిరుపమానసామర్థ్యముగల నాగరికాగ్రగణ్యుఁడు. అతఁడు మాకిరువురకును నిత్యచెప్పుటయేకాక పురుషులు పొందఁదగిన స్వాతంత్ర్యములనుగూర్చియు విద్యాభ్యాసమువలనఁ గలుగు లాభములనుగూర్చియు గూడ పలుమాఱు బోధించుచుండెను. పురుషవిద్యాస్వాతంత్ర్యములు నాకు క్రొత్తవిగా గానఁబడకపోయినను దేశాచారమునుబట్టి స్త్రీలకు దాస్యము చేయ నలవాటుపడిన నాసహాధ్యాయునికి మాత్రమవి వింతగాఁ గనఁబడి యత్యుత్సాహమును గలిగించుచు వచ్చెను. మాయుపాధ్యాయుఁడుపదేశించిన బోధనలవలనను చేసిన యుపన్యాసములవలనను గాకపోయినను స్త్రీలయధికారమును రూపుమాపి యాదేశమునందు పురుషస్వాతంత్ర్యమును నెలకొల్పవలెనన్న యభిలాషచేత సహజముగానే వారిరువురకన్నను నాకెక్కువ యుత్సాహముండెను. నా సహాధ్యాయుఁ డించుమించుగా నిరువది సంవత్సరముల ప్రాయముగలవాఁడు; అపత్నీకుఁడు; నవనాగరికురాలయిన యప్పగారి ప్రోద్బలమువలన చిన్నప్పటినుండియు కొంచెము విద్యనేర్చినవాఁడు. పూర్వము లక్ష్మణస్వామివారు శూర్పణఖ ముక్కుకోసినట్లుగా, గురువులవా రపత్నీకుఁడయిన యీతని ముక్కు నీవఱకే మొదలంటఁ గోసియుందురుగాని, జాతిభాషచదివి నవనాగరికురాలయి రాజకీయోద్యోగమునందున్న యీతని యప్పగా రావని సాగనిచ్చినదిగాదు. బంధుజనులకు విరోధముగా నిప్పుడాతనిని రాజకీయపాఠశాలకు పంపినదియు ఆయప్పగారె. సహపాఠియైన నామిత్రునిపేరు భాష్కిఫోడ్. నేను క్రమముగా ప్రతిదినమును పాఠశాలకు పోయి పాఠమును చదువుచున్నను, నామిత్రుఁడు మాత్రము నోములు మొదలయినవాని నిమిత్తము వారమునకు మూఁడు నాలుఁగు దినములు బడి మానుచు

వచ్చెను. మనదేశమునందు స్త్రీల కెన్నినోములున్నవో యాదేశము
నందు పురుషుల కంతకంటె రెట్టింపునోములున్నవి. వారాదివారము
నాఁడు ప్రాతఃకాలమునందు కందపిలకను పూజింతురు; సాయంకాలము
నందు పెండలపుగుంపను పూజచేయుదురు; సోమవారమునాఁడు
మధ్యాహ్నము సన్నకంటెని పూజింతురు; సాయంకాలమునందు
రుబ్బురోటిని పూజచేయుదురు. నడుమనడుమవచ్చు విశేషవ్రతములు
గాక యీప్రకారముగా దినమునకు రెండేసిచొప్పున పురుషులు సంవ
త్సరమున కేడువందల ముప్పదినోములు నోతురు. సామాన్యపురుషు
లన్నినోములను నోచరుగాని యుపత్నీకులును విత్తవంతులును విశేష
ముగా నోములను నోచి వారికాలక్షేపము చేయుచు, తమవిత్త
మును గురుతక్కరాచార్యులకు సమర్పించుచుందురు. మాయుపాధ్యాయు
డిన్ని నోములు నోచుచుండుట యప్పగారి కిష్టములేకపోయినను, అప్ప
గారికి తెలియకుండ నతఁడు బడిమాని యామె కొలువునకు పోయి
తరువాత రహస్యముగా ముసలిదయిన తల్లియొక్కయు ఇంటనున్న
యితరపురుషులయొక్కయు ప్రోత్సాహముచేత నోములు నోచుచు
ండును. ఈనోములు నిష్ఫలములని నేనును మా యుపాధ్యాయుఁడయి
చానుర్జిగారునుకూడ పలుమాఱు నామిత్రుఁడయిన ఛాష్టీఫోర్డ్ కి
బోధించుచువచ్చితిమిగాని యాతఁడు మావద్ద నాలాగున సేయనని తలయూ
డించి నోములు మానివేసెదనని యొట్లుపెట్టుకొనుచువచ్చెను మమ్ము
విడిచి యింటికిపోఁగానే యామాటలుమఱచి యథాప్రకారముగా
ప్రవర్తించుచుండెను. ఎంత చదువుకొన్నను చిరకాలమునుండి వచ్చు
చున్న యాచారము నొక్కసారిగా మానుట యెంతటివారికిని కష్టసాధ
ముగా నుండును. అందుచేత నేనాతనిని ప్రతిదినమును పాఠశాలకు
తోడితెచ్చుటకయి యాతని యింటిమార్గముననే పోయి యాతని
నాతోపిలుచుకొనిపోవుచుంటిని.

ఇట్లు కొంతకాలము నడిచినపిమ్మట మేమిద్దఱమును గలిసి యొకనాఁడు పాఠశాలకుఁ బోవుచుండఁగా మార్గములో నాకొకవిచిత్రమును జూపెదను రమ్మని నామిత్రుఁడు నన్నూరిబయటికిఁ దీసికొని పోయెను. అవఱకే వేడుకచూచుటకై స్త్రీలచ్చటికి తీర్థప్రజలవలె వచ్చియుండిరి. ఆగుంపులో నడుమనడుమ పత్నీవియోగము పొందని పుణ్యపురుషులును కొందఱుండిరి. ఆపట్టణములో గతదినమురాత్రి ధనికురాలయిన యొకవృద్ధవణిజస్త్రీ మృతినొందెను. ఆముసలిదాని భర్త మృతురాలయిన తనపత్నితోఁగూడ సహగమనముచేయుటకు నిశ్చయించి శ్మశానవాటికకు పోయినందున వినోదముచూచుటకును పుణ్యమును సంపాదించుకొనుటకును వేలకొలఁదిజను లక్కడఁగూడిరి. మేము వెళ్లునప్పటికే చేయవలసిన కర్మయంతయు జరగినది. మేమువెళ్లిన తరువాత ముసలిదానిశవమును నలుగురు మోసికొని పోయి యావఱకు త్రవ్వియుంచినగోతిలో నిలువుగా బోరగిల పరుండఁబెట్టిరి. అంతట పురోహితస్త్రీలు మంత్రములుచదువుచు భర్తనుచేయి పట్టుకొని యాగోతివద్దకుఁగొనిపోఁగా, అఱువదియేండ్ల ప్రాయముగల యీముసలివాఁడు తనశరీరముననున్న రెండుమూఁడునగలను దీసి చెంతనున్నపురుషులకు దానముచేసి సంతోషపూర్వకముగా సమాధిలోనికిదిగి పత్నియొక్క కుడిప్రక్కను తానునుబోరగిల పరుండెను. అప్పుడు పురోహితస్త్రీలుమనదేశములో వేదఘోషచేసినట్లుగా గడియునేవేవో మంత్రములుచదివి యేవోకర్మలు చేయుచుండిరి. ఈలోపలపన్నిద్దఱుస్త్రీలు పెద్దగంపలనిండ మన్నుపట్టుకొని గోతిచుట్టును నిలుచుండిరి. అప్పుడు మహాధ్వనితో వాద్యములు మ్రోగుచుండెను. ఆసందడిలో ముఖ్యురాలయిన యాజకస్త్రీ యేదోమంత్రము చదివి చేయివిసరఁగానేయొక్కసారిగా పన్నిద్దఱు స్త్రీలును తమగంపలలోని మన్ను మీఁదపోసిరి. అటుతరువాత పుణ్యపురుషులొక్క రొక్కరేవచ్చి తట్టెడుతట్టెడుమన్ను

మీఁదవేసి మొక్కిపోవుచువచ్చిరి. పాఠశాలకు పోవ వేళమించుచున్న దని యాస్థలమునువిడిచి నామిత్రుఁడును నేనును దారిపొడుగునను సహగమనవిషయమై మాటాడుకొనుచు వేగముగా నంతట పాఠశాలకుఁబోయితిమి. ఆదేశములో నేఁబదియేండ్లు దాటినతరువాతఁగాని పురుషుఁడు సహగమనము చేయరాదఁట. ఏఁబదియేండ్ల ప్రాయమువఱకును పత్నితోఁగాపురముచేసిన పురుషుఁ డాదేశములో పుణ్యపురుషుఁ డనఁబడును. అట్టి పుణ్యపురుషుఁడు పత్నీమరణసమయమునందు సహగమనము చేసినపక్షమున ముప్పదిమూఁడు తరములవఱకును తనతల్లివంక వారిని తండ్రివంకవారిని మాత్రమేకాక తనపత్నియొక్క తల్లివంక వారిని తండ్రివంకవారినిగూడ తరింపఁజేసి మహాపాపులను సహితము పుణ్యలోకమునకుఁ బంపునఁట. ఆదేశమునందు శవములను పాతిపెట్టుటయేకాని దహనము చేయుటలేదు. సమాధియందు దంపతులను బోరగిల పరుండఁబెట్టుటకు కారణ మేమయిన నున్నదాయని నామిత్రుని నడిగినాను. పుణ్యలోకములు క్రిందితట్టున నుండునుగనుక వారియాత్మలు తిన్నగా నడుగువంక పోవుటకయి యట్లు చేయుదురని యాతఁడు త్తరముచెప్పెను. పుణ్యలోకములు పయినుండుటచే నూర్ధ్వలోకము లనఁబడుననియు, పాపలోకములు క్రిందనుండుటచే నధోలోకము లనఁబడుననియు మనశాస్త్రములు చెప్పుచున్నవి. ఆదేశమువారు శాస్త్రవిరుద్ధముగా పుణ్యలోకములే క్రిందనుండు ననుచున్నారు. పుణ్యపాపశబ్దముల ప్రయోగమెట్లున్నను వారిప్రకారముగా సమస్తవిషయములలోను పురుషుల నన్యాయము చేయుటచేత వారధోలోకములకేగుట నిశ్చయమని నేననుకొన్నాను. ఈసహగమనమును వారిభాషలో భూతీర్ఘూటీయందురు. స్వర్గయాత్రయని దానికర్థము. ఈసంభాషణ ముగియునప్పటికి మేముపాఠశాల చేరినాము. మాయుపాధ్యాయుఁడు చాలసేపటినుండి మానిమిత్తము వేచియుండి మేముపోఁ

గానే యింతయాలస్య మేలచేసితిరని యడిగెను. ఆలస్య కారణమును మేము "స్వర్గయాత్ర" ను జూడఁబోవుటగాఁ జెప్పితిమి. అందు మీఁద నతఁడాదినము పాఠములుకట్టిపెట్టి నిజముగా నది నరకయాత్ర కాని స్వర్గయాత్రకాదనియు, అటువంటి క్రూరకృత్యమును జనులు వివేకముకలిగి తమంత మానకపోయినను దొరతనమువారు బలవంతము గానైనను మాన్పవలెననియు బహుదూరము చెప్పెను. ఈప్రసంగములో మనదేశాచారము సంగతికూడవచ్చినది. పురుషుల విషయమయి యిట్లుచేయుట దారుణ కృత్యమయినను భర్తృమరణము సంభవించినప్పు డనుగమనముచేయుట పతివ్రతలైన భార్యలకు పరమధర్మమనియు, ఈదేశమునందువలె ముసలివాండ్రు మాత్రమేకాక యేడెనిమిది సంవత్సరముల బాలికలు సహితము భర్తలుపోయినప్పుడు పూర్వకాలమునందు మాదేశములో సహగమనము చేయుచుండి రనియు, మాదేశమున కన్యదేశీయులు ప్రభువులగుటచేత వారీ సదాచారమును మాన్పించి పాపము కట్టుకొనిరనియు చెప్పి సహగమన మాహాత్మ్యమును బోధించితిని. భర్తలు మృతినొందినప్పుడు భార్యలు భర్తలచితిమీఁద నెక్కి నిమిషములో నగ్నిహోత్రజ్వాలల కాహుతులగుదురని నేనుజెప్పినప్పు డతఁడది క్రూరకృత్య మనియు, దొరతనమువారు దానినిమాన్పుట శ్లాఘ్యకార్యమే యనియు, తమ దేశమునందు ప్రభుత్వమువారి కట్టిసాహసము లేకయున్నదనియు, మహావ్యసనముతోఁ బలికెను. పురుషులను ప్రాణములతోఁ బూడ్చిపెట్టెడు దురాచారమును మాన్పుటయవశ్య కర్తవ్యమని నేనాతనితో నేకీభవించినను, మనదేశపు సంగతినిమాత్ర మతఁడు తిన్నఁగా నాలోచించలేదనియు శాస్త్రములున్నసంగతి యతఁ డెఱుఁగఁడనియు భావించి మాది కేవలాచారము కాదనియు, ప్రత్యక్షశాస్త్రసిద్ధమనియు, ఈకలియుగములో పరమప్రమాణమయిన పరాశరస్మృతియందు

శ్లో. తిస్రఃకోట్యర్ధకోటీచ యానిలోమాని మానుషే.
తావత్కాలం వసేత్స్వర్గే భర్తారం యానుగచ్ఛతి.

అని భర్తతోడ సహగమనము చేసినపుణ్యస్త్రీ మనుష్యదేహమున నెన్ని రోమములుండునో యంతకాలమనఁగా మూడుకోట్ల యేఁబదిలక్షల వేలయేండ్లు స్వర్గసుఖమును పొందునని చెప్పఁబడినదనియు, "యాని లోమానిమానుషే తావంత్యబ్దసహస్రాణి" యని హారీతుఁడుకూడ స్పష్టముగాఁ జెప్పినాఁడనియు అంగీరస స్మృతియందు

శ్లో. బ్రహ్మఘ్నోవా కృతఘ్నోవా మిత్రఘ్నోవాపి మానవః
తంవై పునాతి సానారీ ఇత్యంగీరసభాషితమ్.

అని సహగమనముచేసిన స్త్రీ భర్త బ్రహ్మఘ్నుఁడయినను కృతఘ్నుఁడయినను మిత్రఘ్నుఁడయినను కూడ నతనిని పవిత్రునిఁ జేయునని చెప్పఁబడిన దనియు, అందుచేత శాస్త్రవిహితమైన యీ యాచారమును నిషిద్ధమని చెప్పఁగూడదనియు, ఆస్తికు లయిన వారందఱును శాస్త్ర ప్రమాణమును శిరసావహించి యల్పమైన మనుష్యబుద్ధికి గోచరముగా కానఁబడినను తప్పక యనుష్ఠింపవలసినదనియు, నింద్యమైన యాచార మును శిష్టులయిన మావా రంగీకరించియుండరుగనుక తప్పక యిది సదాచారమే యనియు నేను నొక్కి చెప్పినాను. అందుమీఁద నతఁడు కొంచెమునే పాలోచించి స్వప్రయోజనపరులైన మనుష్యు లెవ్వరో యేవోకారణములచేత నట్టి శ్లోకములను కల్పించియుందురని పలికెను. నేనామాటల కొడఁబడక యావిమనుష్య కల్పితములగుట సాధ్యముకాదనియు, మనుష్య కల్పితములైన పక్షమున,

"నమోద్యాముకే మాసి అముకేపక్షేఽముకతిథౌ అముకగోత్రా శ్రీమతీ అముకీదేవీ అరుంధతీసమాచారత్వపూర్వక స్వర్గలోక మహీయమానత్వ మానవాధి కరణక లోమసమ సంఖ్యాబ్దా వచ్ఛిన్న స్వర్గవాస భర్తృసహిత మోదమానత్వ మాతృపితృ

శ్వశురకులత్రయపూతత్వ చతుర్దశేంద్రావచ్ఛిన్న కాలాధికరణకా ప్సరోగణస్తూయమానత్వ పతిసహిత క్రీడమానత్వ బ్రహ్మఘ్న కృతఘ్న మిత్రఘ్న పతిపూతత్వ కామా భర్త్రాజ్వాలచ్ఛితారో హణ మహం కరిష్యే ”

అని సంకల్పమేల పుట్టెననియు, మొట్టమొదట దీనికొక్కదానికి నాకు సమాధానము చెప్పవలసిన దనియు, నేను కోరితిని ఆసంకల్పమున కర్థమేమని యతఁడు నన్నడిగెను. “ నమస్కారము. నేఁడు ఈమాసమున ఈపక్షమున ఈతిథియందు ఈగోత్రముగలట్టియు ఈపేరుగల ట్టియు శ్రీమతినైన నేను అరుంధతివలె నడుచుకొనుటవలనఁ గలిగెడు స్వర్గలోకమహిమను పొందుటకును, మనుష్యశరీరమునం దెన్నిరోమము లుండునో యన్ని సంవత్సరములు భర్తతోఁగూడ స్వర్గవాససుఖ మనుభ వించుటకును, తల్లియొక్కయు తండ్రియొక్కయు మామగారియొ క్కయు మూఁడువంశములను పవిత్రము చేయుటకును, పదునలుగు రింద్రులకాలమువఱకును అప్సరోగణముల స్తుతిని పొందుచు పతి సహిత ముగా క్రీడించుటకును, బ్రహ్మహత్య చేసినవాఁడయినను కృతఘ్నుఁ డయినను, మిత్రద్రోహియయినను భర్తను పవిత్రుని చేయుటకును, కోరి, మండుచున్నభర్తయొక్క చితినెక్కెదను ” అని పైసంకల్పమున కర్థమని నేను వివరముగా బోధించినాను. అర్థము విన్నతరువాత సహి తము మాయుపాధ్యాయుఁడు సహగమనము మంచికార్యమని యొప్పు కొనక యిట్టిసంకల్పమును కొంచెము సంస్కృతము చదువుకొన్నవా రెవ్వరైనను కల్పించ వచ్చునని సమాధానము చెప్పెను. ఇది కల్పన కాదనియు, ధర్మశాస్త్రములలో

“ శ్లో. మృతేభర్తరి యానారీ సమారోహేద్ధుతాశనమ్
సారుంధతీ సమాచార స్వర్గలోకే మహీయత. ”

అనియు,

"శ్లో. యాచ భర్తృపరా నిత్యం స్తూయమానాప్సరోగణైః
క్రీడతే పతినాసార్థం యావదింద్రాశ్చతుర్దశ."

అనియు, ప్రమాణములున్నవనియు, ప్రమాణబద్ధులమయిన మనము శాస్త్రతిరస్కారము చేయఁగూడదనియు, నే నెంత వాదించినను నామాటలయందు గౌరవముంచక మూర్ఖుఁడయి యతఁడు సర్వకారుణ్యుఁడయిన యీశ్వరుఁ డిట్టి క్రూరకృత్యమును విధించి యుండఁడనియు, ఇది యాతియు పితంతువుల ధన మపహరింపఁ గోరియో మఱియెందుచేతనో స్వప్రయోజన పరులయినవారు చేసిన మోసమనియు, యుక్తికిని నీతికిని విరుద్ధముగానున్న శాస్త్రములను నమ్మరాదనియు, అతఁడే వేవో కుయుక్తులను పన్నుట కారంభించెను. ఆమాటలకు నేను చెవులుమూసికొని హరినామస్మరణ చేసికొని శాస్త్ర విశ్వాసములేని నాస్తికులతో సంభాషించినచో దోషము వచ్చునని యెంచి యాప్రసంగము నంతటితో చాలించితిని.

అతఁడుమాత్రము సహగమన విషయము నంతటితో విడువక నాకనిష్టముగా నుండునని దానిని దూషించుటమాత్రము మానివేసి "సహగమనమును దొరతనమువారు మాన్పుటకు పూర్వము మీదేశములో సంవత్సరమున కెన్ని యనుగమనములు జరగుచువచ్చె" ననియు, "ఇప్పుడు మీదేశములో నెందఱువితంతువు లున్నారు" అనియు, నానావిధములయిన ప్రశ్నలువేయ మొదలుపెట్టెను. నాకు విద్యాగురువుగానున్న పెద్దమనుష్యుఁ డడిగినదానికి ప్రత్యుత్తరము చెప్పకుండుట మూర్ఖతగా నుండునని యెంచి నాకు తెలిసినంతవఱకు కాతఁడడిగిన ప్రశ్నల కన్నిటికిని నే నిట్లుత్తరములను చెప్పితిని :—

"మాదేశములో సహగమన సదాచారమును మాన్పుటకయి మొట్టమొదట మతాంతరులయిన క్రైస్తవమతాచార్యులు క్రీస్తుశకము ౧౮౦౪ వ సంవత్సరమున కలకత్తానగరమునందు కొంతప్రయత్నము

చేసిరి. వారాసంవత్సరమునందు పదుగురు మనుష్యులను నియమించి కలకత్తానగరముచుట్టును ముప్పదిమైళ్ల దూరములోఁగల గ్రామముల యందు సహగమనముచేసిన పుణ్యసతుల సంఖ్యను లెక్క వేయింపఁగా, ఆఱుమాసములలోపల మున్నూటయేగురు పతివ్రతలు భర్తల చితులనెక్కి స్వర్గలోక నివాససుఖమును చూఱగొన్నట్టు తెలిసినది. ఆ సంవత్సరము మొదలుకొని సహగమనమును మాన్పఁ గాగితమువారు పాసము కట్టుకొనువఱకునుగల యిరువదియొక సంవత్సరములలోను డెబ్బదివేల విధవలు మా దేశములో భర్తృసహగమనముచేసి పుణ్య లోకములకుఁ బోయినట్టు దొరతనమువారి లెక్కవలనసే తెలియవచ్చుచున్నది. ఆ లెక్కలలో తగులని యిల్లాండ్రెందఱుందురో! దీనినిబట్టి మా దేశము దేశములలోనెల్లఁ బవిత్రమైనదనియు పతివ్రతామయమైన దనియు పుణ్యసతీ భరితమయినదనియు మీకు బోధపడియుండవచ్చును. ఆ సంగతి పోనిండు. మతాంతరులైన క్రైస్తవాచార్యుల యుల్బణకృషి యీశ్వరుఁడు మాయందుండుటవలన నష్టమేమియుఁ గానసాగినది కాదు. అటుతరువాత రామమోహనరాయలను పతితుఁడొకఁడు మాలోనే బయలుదేఱి క్రీస్తుశకము ౧౮౧౮ వ సంవత్సరము మొదలుకొని సహగమనమును రూపుమాపుటకయి మహాకృషి చేయనారంభించెను. ఒక్క కలకత్తా నగరమునందు ౧౮౧౫ వ సంవత్సరములో ౨౫౩ రును, ౧౮౧౬ వ సంవత్సరమునందు ౨౮౯ గురును, ౧౮౧౭ వ సంవత్సరమునందు ౪౪౨ గురును, ౧౮౧౮ వ సంవత్సరమునందు ౫౪౪ గురును, ౧౮౧౯ వ సంవత్సరమున ౪౨౧ గురును, ౧౮౨౦ వ సంవత్సరమున ౩౭౦ గురును, ౧౮౨౧ వ సంవత్సరమున ౩౭౨ గురును, ౧౮౨౨ వ సంవత్సరమున ౩౨౮ గురును, ౧౮౨౩ వ సంవత్సరమున ౩౪౦ రును, ౧౮౨౪ వ సంవత్సరమున ౩౭౩ గురును, ౧౮౨౫ వ సంవత్సరమున ౩౯౮ గురును, ౧౮౨౬ వ సంవత్సరమున ౩౨౪ గురును, ౧౮౨౭ వ

సంవత్సరమున ౩౩౭ గురును, ౧౮౨౮ వ సంవత్సరమున ౩౦౯ గురును, మహాపతివ్రతలు చిత్యారోహణముచేసి పదునలుగురింద్రుల కాలమువఱకును భర్తలతోఁగలసి స్వర్గలోకసుఖ మనుభవించుటకుఁ బోయిరి. 'దైవము దోసకారులకె తోడయివచ్చు' నన్న సన్మతోక్తిప్రకారముగా మతభ్రష్టుల కృషిననుసరించి ౧౮౨౯ వ సంవత్సరమునం దప్పటి పరిపాలకులయిన బెంటింకు ప్రభువుగారు సహగమనమును మాన్పి ప్రతి సంవత్సరమును అంతమంది పతివ్రతలు పుణ్యలోకములకు పోకుండ నిరోధించిన పుణ్యమును కట్టుకొనెను.

"మా దేశములో ౧౮౮౧ వ సంవత్సరమునందు ప్రభుత్వమువారు వేయించిన జనపరిగణనప్రకారముగా స్వదేశప్రభువుల సంస్థానములలోఁ గాక యింగ్లీషు రాష్ట్రములో ౨౦౯౩౮౬౨౬ గురు విధంతువులున్నారు. ఈసంఖ్యవలన మొత్తముమీఁద మాదేశములో నయిదుగురేసి స్త్రీల కొక్కొక్క విధంతువున్నట్టు కాఁబడుచున్నది. ఇఁక బ్రాహ్మణులలోనన్ననో ముగ్గురేసువారిలో నొక్కతె విధవగానున్నది."

ఈవిధముగా నేను చెప్పినసంగతి విన్నతరువాత ౧౮౭౯ వ సంవత్సరములోనే భరతఖండమును విడిచిపోయిననాకు ౧౮౮౧ వ సంవత్సరములో హిందూదేశమునందు దొరతనమువారు వేయించిన జనసంఖ్యను గూర్చి యెట్లు తెలిసెనని నాసత్యచరిత్రమును జదివెడివారిలో గొందఱికి సందేహము కలుగవచ్చును. దానికి సర్వజన సమాధానీయమయిన సమాధానమును చెప్పెదనువినుఁడు. నేను ౧౮౮౧ వ సంవత్సరమునందు రంఘీదేశములో నున్నమాట వాస్తవమే. అయినను ౧౮౮౦ వ సంవత్సరమునందు భరతఖండములో మొట్టమొదట బొంబయినగరములో దివ్యజ్ఞాన సమాజము స్థాపింపఁబడుటయు, అప్పటినుండియు కూటుహూమీ మొదలైన మహాత్ములు దూరదేశవార్తలను తెచ్చుచుండుటయు, మీరందఱు నెఱిఁగియే యున్నారుగదా? అట్టిసంగతిలో బుద్ధి

మంతులైన మీకు వేఱుగఁ దెలుపవలసిన దేమున్నది? మీకిప్పుడు పేరుచెప్పనుగాని దివ్యజ్ఞాన సమాజమువారి మహాత్ములలో నివాఁడే యొక మహానుభావుఁడు నేటివఱకును మన భరతఖండములో జరుగుచున్న సువార్తల నెప్పటికప్పుడు తెచ్చి నాకనుగ్రహించుచున్నాఁడని మాత్రము మీసంశయ నివారణార్థము చెప్పుచున్నాను. ఈసంభాషణ మయిన తరువాత మేము పాఠశాలను విడిచి ఇంటికిఁ బోతిమి.

అటు తరువాత రంఢీనగరములో పూర్వమెప్పుడును లేని పురుష విద్యాభ్యాసమును క్రొత్తగా నెలకొల్పుచున్న విషయమునుయి విద్వాంసు రాండ్రందఱును జేరి సభలు చేయుట కారంభించిరి. ఆసభలలో పూర్వాచార విరుద్ధముగా పురుషులకు విద్య చెప్పించువారిని, అటువంటివారికి తోడ్పడువారిని, అందఱిని వెలివేసి మతగురువులకు వ్రాసి బహిష్కార పత్రికలు తెప్పించుటకు నిశ్చయింపఁబడినది. ఈసంక్షోభమునకు భయపడి నామిత్రుఁడయిన భాఢీఫోడ్ అప్పగారతనిని బడి మాన్పించినందున మాపాఠశాలకెల్ల నేనొక్కఁడనే విద్యార్థినైనాను. నాయజమానురాలయిన ఫాంఢీభంగీగారు మాత్రము జడియక ధైర్యము వహించి నన్ను పాఠశాలకు పంపుట మాననందున, సభాపత్నులును పౌరమహాకాంతలును జేరి సభవారామెను బహిష్కారముచేసిరి. అటు తరువాత జరిగిన చర్యను మఱియొక ప్రకరణమునందు విపరించెదను.

---

## ఏడవ ప్రకరణము

---

బహిష్కారపత్రిక వచ్చినతరువాత ఫాంఢీభంగీగారు తమప్రయత్నమును విడువక తమ మిత్రురాండ్రను రాజకీయ పాఠశాలలోని పయి తరగతులయందుఁ జదువుకొను బాలికలను పోగుచేసి పురుషవిద్యాభ్యాసముయొక్క యావశ్యకమును గూర్చి యుపన్యాసములు చేయుట

కారంభించెను. ఆయుపన్యాసములవలనను రాజభాషాగ్రంథపఠన మహాత్త్వమువలన మనసు కరఁగినవారయి కొందఱు బాలిక లెన్నికష్టముల కయిన నోర్చి పురుషవిద్యాభివృద్ధిని జేయుటకు నిశ్చయించుకొని నాయజమానురాలికి సర్వవిధముల తోడ్పడుచు, వెలివేయఁబడిన వారితోఁ గలిసి రహస్యముగా భోజనములు చేయుటకారంభించిరి. అందుచేత రంఢీనగరములో మఱింత సంక్షోభము కలిగెను. రాజభాషవలన పిల్లలు చెడిపోవుచున్నారనియు, వారినందఱిని రాజకీయపాఠశాలకు బోకుండ మాన్పించి వారికిరంఢీమతమునుబోధించి వారినిపూర్వసదాచార నిష్ఠురాండ్రను జేయవలయుననియు, విద్వాంసురాండ్రచేత వారమునకు రెండుసారులు బాలికలకు మతబోధ చేయింపవలయుననియు, లౌక్యాధికారములలోనున్న పురములోని ప్రముఖురాండ్రు నిశ్చయము చేసి సభలు చేయించుటయేకాక, తమగ్రామమున కొకసారి విజయముచేసి జీర్ణమతోద్ధారణము చేయవలెనని పీఠాధిపత్నియైన మతాచార్యురాలికి విజ్ఞాపనము పంపిరి. నవనాగరికురాండ్రకు మాయజమానురాలు నాయకులయినట్టే పూర్వాచార పరాయణలయిన పూర్వనాగరిక పక్షమువారికి దుండీలండీగారు నాయకురాలయి, తన యావచ్ఛక్తిని వినియోగించి సంస్కారపక్షమువారిని ముఖ్యముగాఁ దత్పక్షానుసారిణు లయిన బాలికలను బాధించి పూర్వాచారస్థాపనము చేయ మొదలుపెట్టెను. దుండీలండీగా రాపట్టణమునకుఁ బ్రాడ్వివాకురాలు. రాజకీయోద్యోగమునం దుండుటవలన నవనాగరికపక్షావలంబకులయిన దొరతనమువారికి విరోధముగాఁ బనిచేయుట కిష్టములేనిదై, తానుచాటున కపటనాటకమునకు సూత్రధారురాలుగానుండి యామె యాగ్రామములో మిక్కిలి కర్మిష్ఠురాలని ప్రసిద్ధిచెందిన గంభీదంభీగారిని నాయకురాలినిగాఁ జేసెను. ఈగంభీదంభీగారు లోకములోని కర్మిష్ఠురాండ్రలో నగ్రగణ్యురాలు ; ప్రాతఃకాలముననే స్నానముచేసి ముక్క-

మూసుకొని కూరుచుండి ప్రతిదినమును పగలు రెండు యామములవఱకును రేగుగింజల జపమాలిక త్రిప్పుచు జపముచేయుచుండును. మన దేశములో రుద్రాక్షలవలెనే యీదేశములో బదరీ బీజములు మిక్కిలి పవిత్రమయినవి. ఇక్కడవలె నక్కడ దేహమున విభూతిధరింపరు. మన దేశమునందువలె మూఁడు రేఖలుఁగాఁగాక యొక్కటే రేఖగా లలాటమునం దంతటను భూరేణువు పూసికొందురు. అందులో శోణమృత్తిక పరమపావనమైనది. తదభావమునందు నదులలోనిదిగాని, తదభావమునందు చెఱువులలోనిదిగాని, తదభావమునందు నూతులలోనిదిగాని నేమృత్తికయైనను ధరింపవచ్చును. మన గంభీదంభీగా రొక్కలలాటమునందు మాత్రమే కాక దేహమునందంతటను జేగురుమట్టినే పూసికొని పూచిన మోదుగువలె కన్నులపండువుగాఁ గానఁబడుదురు. ఆమెకుఁ గల భక్తియు నింతంతయని చెప్పనలవిగాదు. ఆమె దేవతార్పణముగాఁ గాని యేపనియుఁ జేయదు. ఆమె దేవతానివేదనము చేయక కల్లయినను త్రాగదు; మాంసమయినను తినదు; దేవతార్పణము చేయక చౌర్యమునయినను జేయదు. వేయేల? ఆమె తనదేహమును దేవతాసమర్పణము చేసియే వ్యభిచరించును; తనజిహ్వను దేవతాసమర్పణము చేసియే కల్లలాడును. ఆత్మకర్తృత్వముంచుకొనక కర్మనిష్ఠులు మన దేశమునందు "తత్సత్ బ్రహ్మార్పణమస్తు" అని కర్మలనన్నిటిని బ్రహ్మార్పణము చేసినట్లే యీమెయు తనకర్మలనన్నిటిని స్వదేవతకు ధారవోయును. కాఁబట్టి యీమె యీపనియు తన యిష్టదేవతాప్రీతికొఱకే చేయ దీక్షవహించినందున, అభీష్టసిద్ధికయి ప్రతిపక్షులవిషయమున నేదారుణకృత్యమును జేయుటకును పాపభయ మామెకు లేదు. కాని దొరతనమువారి భయముండుటచేత లోలోపల నెన్ని కానిపనులు చేసినను తత్పక్షమువారు ప్రత్యక్షముగా ప్రతిపక్షుల తలలు బద్దలు కొట్టి దౌర్జన్యము చేయుటకు మాత్రము సాహసింపకుండిరి. రాజకీయోద్యో

గినులయిన రంఢీ దేశవాసినులకు పలువుర కింకొక కష్టముకూడ వచ్చినది. వారావల సత్యప్రియులైన నవనాగరికాగ్రగణ్యులయినట్టుగా నటించి తమ పయియధికారిణుల మెప్పుపొందవలయును; ఈవల పూర్వమతాచారాభిమానినీయ లయినట్లు నటించి మూఢప్రజలను సంతోషపెట్టవలయును; మధ్యను తమ హృదయములన్నియు నవనాగరిక పక్షముననే యుండుటచేత సంస్కారములను మెల్లగా నెలకొల్పుట నిమిత్తమే పైకి పూర్వ నాగరికపక్ష మవలంబించినట్లు మెలఁగవలసి వచ్చినదని నవనాగరికురాండ్రను సమాధానపఱుపవలయును. కాఁబట్టి వీరు నాటకములయందలి నటులవలె మూఁడు చోట్ల మూఁడు విధములయిన వేషములు వేసి పరస్పర విరుద్ధములయిన మూఁడు కథలను వినిపింపవలసిన సామర్థ్యమును వహించినవారయినారు. వీరు దేనియందును నమ్మికములేనివారయి దురభిమానదేవుని దుశ్చింతాదేవిని మాత్రమే భక్తితో కొలుచువారగుటచేత తత్ప్రీతికరముగా వారు శ్రద్ధతో చేయునది యంతయు సాధుసంతాపప్రయత్నము తప్ప మఱియొక్కటి కానరాదు.

ఇంత తల్లిదండ్రులు బాలికలను బాధింపుచు పురుష విద్యాభ్యాసము మంచిదన్న పక్షమునను మంచిదన్న పక్షమువారితో చేరిన పక్షమునను గృహములనుండి వెడలఁగొట్టెదమని బెదరించినందున వారిలో పలువురు వాదము చేయుటకును నవనాగరికలతో మాటాడుటకును మానుకొనిరి. కొందఱుతల్లు లంతటితోనైన నూరకుండక పాఠములు మాసివేసి పంచకాలములయందును "మిథా" చేయవలసినని బాలికలను నిర్బంధపఱుప నారంభించిరి. మిథాయనఁగా మనదేశములోని సంధ్యావందనమువంటి నిత్యకర్మ. ఈనిత్యకర్మను ప్రతిస్త్రీయును ప్రాతఃకాలము, పూర్వాహ్నము, మధ్యాహ్నము, అపరాహ్నము, సాయంకాలము అను పంచకాలములయందును తప్పక చేయవలయును. అది చేయని వారికి గతులు లేవు. అయినను పట్టణములయందలివారు మిథాచేయునట్లు

కొందఱు నటించినను నిజముగా చేయువారు మాత్రము లేరు. జననీ జనకుల నిర్బంధ మెక్కువయినప్పుడు బాలికలు తమకు మిథ్యా చెప్ప వలసినదని వారినడుగ మొదలుపెట్టఁగా వారు తమగుట్టు బయలుపడ కుండ మొట్టమొదట కోపపడియు తరువాత తమకు తీరిక లేదనియు నుపేక్షచేసి, చేయకపోయినను మిథ్యా చేయుచున్నామని చెప్పి శోణ స్మృతికాధారణమును మాత్రము చేసిన చాలునని చెప్పిరి. మఱికొందఱు జనులు తాము మిథ్యా నేర్చుకొనవలెనని పురోహితురాలిని పిలిపించి యడిగిరి. పురోహితురాలును కొంచెమునే పాలోచించి తన సమీపమునే పల్లెయందున్న తనచెల్లెలు మిథ్యా చేయుచున్నందున పట్టణములయందు వాడుకలో లేనిదానిని తాను నేర్చుకోవలసిన యావశ్యకము లేక పోయిన దనియు, పట్టణములయందుపయుక్తమయిన యర్థశాస్త్రమును మాత్రమే తా నభ్యసించితి ననియు, తగినంతధన మిచ్చెదమనుపక్షమున పల్లెనుండి తనచెల్లెలిని పిలిపించెదననియు చెప్పెను. సూర్యకరతాపముచేత చెఱువులోని నీరింకినట్లే ధనముపేరు చెప్పఁగానే వారిమనో నరస్సునం దూరిన మిథ్యాభ్యాసాభిలాష ప్రవాహ మింకిపోయెను. అర్థశాస్త్ర మనఁగా నేమో మీలోఁ గొందఱికి తెలియకపోవచ్చును. అపత్నీకులు మొదలయిన వారిచేత నోములు వ్రతములు మొదలయినవి చేయించి వారివలన ధనమును గ్రహించెడిశాస్త్రమే యర్థశాస్త్రము.

పురుష విద్యాభ్యాసమున కాధారముగా గాథాయని చెప్పఁ బడెడు వారి వేదములయందు ప్రమాణ మున్నదని నవనాగరికురాం డ్రొక్కడిదో యొక వచనమును దీసికొనివచ్చిరి. మిథ్యాకువలెనే గాథా కర్థమే లేదనియు, ఉన్నను వేదము దేవభాషయగుటవలన దానియర్థము దేవతలకే కాని మనుష్యులకు తెలియదనియు, అందుచేత పూర్వము పురుషవిద్య గలదని వేదప్రమాణమును జూపినవారిమాట యంగీకా ర్యము కాదనియు, పుణ్యముకొఱకు వేదమంత్రముల నూరక కర్మలు

మొదలైన వానియందుఁ బఠింపవలసినదే కాని వాని యర్థముతో పని లేదనియు, విద్వాంసురాండ్రు వాదింపసాగిరి. ఆవాదములో పండితు రాండ్రలో పండితురాండ్రకు వేదమున కర్థమున్నదా లేదాయన్న మీమాంస యొకటి యవాంతరముగా వచ్చినది. అప్పుడు పండితురాం డ్రలో ముఁడువంతులు వేదమున కర్థమే లేదనియు, అర్థమున్నట్టు తామెప్పుడును పెద్దలవలన విన లేదనియు, అర్థమే యున్నపక్షమున జను లొక్కరైన నేల యభ్యసింపరనియు, అర్థము లేకపోవుటచేతనే వాని కాపూజ్యత వచ్చినదనియు, వాదించి యర్థములేనట్టు సిద్ధాంతముచేసిరి; ఒకవంతుమాత్ర మాకాలమునందు మనుష్యుల కెవ్వరికిని తెలియక పోయినను వేదముల కర్థమున్నదనియు, వేదముల కర్థమున్నదని తమ తాతముత్తాతలు తమతో చెప్పినట్టు తమ తాతలవలన చిన్నప్పుడు విన్నామనియు, వేదార్థములే శాస్త్రములని శాస్త్రములలో జెప్పఁబడి యున్నదనియు, వాదించిరి కాని యధికసంఖ్య గలవారిచేత వారివాదము పూర్వపక్షము చేయఁబడినది. ఆసభలో నవనాగరికులైన యొకతె లేచి నిలిచి దొరతనమువారు మనపూర్వగ్రంథములను సంపాదించుటకు ప్రయత్నము చేయుచున్నారనియు, ఒకపురాతన దేవాలయములో మూలఁబడియున్న జీర్ణతాళపత్ర పుస్తకముల కట్టను విప్పి శోధింపఁగా నందులో వేదమునకు వ్యాఖ్యానమొకటి కనఁబడినదనియు, వారు దానిని పరిశీలించి ముద్రింపించు చున్నారనియు, వేదమునకర్థము కలదనియు చెప్పెను. ఆమె మాటలు విద్వాంసురాండ్రెవ్వరును నమ్మక స్వదేశస్థుల కెవ్వరికిని దొరకనిపుస్తకము వారికి దొరకియుండదనియు, దొరకినను విద్వాంసురాండ్రకు కాని యర్థము వారికగునని నమ్మఁగూడదనియు దేవాలయములోని ప్రాఁతపుస్తకములలోనిదని చెప్పి యేదో యర్థమును కల్పించి ముద్రించు చున్నారనియు, ముద్రితగ్రంథమును ముట్టినను పాపము వచ్చునుగాన దానిని కొన్నవారిని చదివినవారిని బహిష్కారము

చేయుటకు శీఘ్రకాలములోనే గ్రామమునకు విజయము చేయఁబోయెడు జగద్గురువులను ప్రార్థింప వలయుననియు, ఐకకంఠ్యముగా నిశ్చయము చేసికొనిరి.

ఇట్లు సభలు జరుగుచుండఁగానే జగద్గురువులవారు తాము విచ్చే యుచున్నట్టు సభాపత్నులకు శ్రీముఖమును బంపిరి. శ్రీముఖము వెను కనే శ్రీవారును గుఱ్ఱములతోను ఏనుఁగులతోను వాద్యములతోను విజ యంచేసిరి. అప్పుడింటింటను భిక్షలు జరుగుట కారంభించినవి. ఉద్యోగ ములో నున్నవారొక్కరొక్కరు మూఁడేసి నెలల జీతము పాదపూజ సమర్పించుకోవలసి వచ్చినది. అప్పుడింటింటను నాసికామహోత్సవములు జరగ మొదలు పెట్టెను. ఆనాసికోత్సవములో మొట్టమొదట నాసహా ధ్యాయుఁడైన భాష్టీఘోడ్ యొక్క ముక్కు ముక్కలయ్యెను. ఇతర సమయములయందు పట్టుదల లేకపోయినను స్వాములవారు వచ్చి నప్పుడు మన దేశమునందు బాల వితంతువుల శిరోజములు సహితము తీయించి వేయునట్లుగానే యాదేశమునందు జగద్గురువులు వచ్చినప్పు డపత్నీకుల ముక్కు లన్నియు కోసివేయుదురు. జగద్గురువులవా రక్కడ నున్న కాలములో నొక సభచేసి యాసభకు నాయజమానురాలయిన ఘాంఢీభంగీగారినికూడ పిలిపించిరి. అప్పుడు పురుషవిద్యాభ్యాసముకూడ దని యేశాస్త్రములలోఁ జెప్పఁబడియున్నదని ఘాంఢీభంగీగారు జగద్గురు వులను ప్రశ్న వేసిరి. నిత్యమును భిక్ష లధికముగాఁ జేయుచుండుటవలన జగద్గురువులవారికి పిండివంటల నామము లేకాని పుస్తకముల నామములు రానందున, ఆప్రశ్న కుత్తరము చెప్పవలసినదని వారాస్థాన విద్వాంసు రాండ్రయిన శిష్యురాండ్ర కాజ్ఞాపించిరి. ఆమహావిద్వాంసురాండ్రును కొంచెమునేపాలోచించి తాము స్వస్థానమునకు పోయిన తరువాత మూలపీఠమువద్దనున్న యనాదిగ్రంథమును దీసి పుస్తకముల నామము లను వెనుకనుండి పంపెదమని చెప్పి తప్పించుకొనిరి. త్రాగుఁబోతులకును,

మాంసభక్షకులకును, వ్యభిచారులకును వెలిలేక లోకాభివృద్ధి నిమిత్త మయి యత్నించుచున్న తమకు నిష్కారణముగా బహిష్కారము వేయుట యేమిన్యాయమని నాయజమానురాలు భయపడక జగద్గురువులవారి నడిగెను. అప్పుడు తత్స్థానపండితురాండ్రలో నొకవృద్ధాంగన యంగుకొని శాస్త్రోక్తప్రకారముగా నడచుకొనువారి నేల బహిష్కరింప వలయుననియు,

" మాఖే మాఘే మాతే మాధే
మాథే మామే మిమే మిమే "

అను శాస్త్రప్రమాణమునుబట్టి పయిపనులు చేసినవారు దోషులు కారనియు, సమాధానము చెప్పెను. ఆప్రమాణవచనమున కర్థమేమో సెలవియ్య వలసినదని నేను వేడుకొనఁగా, ఆమహాపండితురాలు నాయం దనుగ్రహించి, "మద్యము, మాంసము, మత్స్యము, ముద్ర, మైథునము, అను మకారములు మహాపాపనిరాకరములు" అని చెప్పెను. ఈయొక్క వచనముతోనే

"శ్లో. మద్యం మాంసంచ మత్స్యంచ ముద్రా మైథున మేవచ
మకారపంచకంచైవ మహాపాతక నాశనం "

అను ప్రాణతోషిణి గ్రంథములోని శ్లోకము నాకు స్మరణకువచ్చి రంభీ శాస్త్రములన్నియు హిందూశాస్త్రములలోనుండియే తీసికొనఁబడినవనియు వారి వేదమును మనవేదశాఖయే యనియు నేను నిశ్చయము చేసితిని. అప్పుడు నీతికి విరుద్ధమయిన శాస్త్రమెట్లు ప్రమాణమగునని నాయజమానురాలావిద్వాంసురాలిని నిశ్శంకముగా నడిగెను. అందు మీఁద నామె యత్యాగ్రహావేశము కలదయి శాస్త్రతిరస్కారము జేసినందునకయి మఱియొక బహిష్కారపత్రికను బంపెదనని భయపెట్టి, అట్టి నాస్తికురాలి ముఖముచూచిన పాపమువచ్చునని కోపపడి, ఈయనర్థమంతయు రాజకీయపాఠశాలలోఁ జదువుటవలన వచ్చి

నదిగనుక దొరతనమువారి బడికి పిల్లలను బంపువారికందఱికిని శిక్షా విధిం పవలయునని శ్రీజగద్గురువులవారితో మనవిచేసి, తత్క్షణము నాయజ మానురాలిని గురుసాన్నిధ్యమునుండి గెంటించివేసెను. జగద్గురువుల వారును ధనలక్ష్మిప్రియురాండ్రగుటచేత శిష్యురాలి మాటనుబట్టి దొర తనమువారి పాఠశాలకు పిల్లలనుబంపువారందఱును బదిసువర్ణము లప రాధము చెల్లింపవలయుననియు, చెల్లించువఱకును గ్రామములోనివా రెవ్వరును వారియింట్లకు శుభాశుభకార్యములకు పోఁగూడదనియు, వెంటనే సభాపత్నులపేర శ్రీముఖములనుబంపిరి. అయినను సభాప త్నుల బాలికలు సహితము కొందఱు రాజభాషను చదువుకొనుచున్న వారగుటవలన వారా శ్రీముఖములనంతగా నాదరించినవారుకారు. ఇంత కును రంఢీనగరములో నాజగద్గురువులవారి శిష్యకుటుంబములన్నియు నూఱుమాత్రమే యున్నవి. అయినను తన్మతావలంబులుమాత్రమే మిక్కిలి చదువుకొన్నవారుగాను, ధనికులుగాను, చెల్లుబడికలవారుగాను వున్నారు. ఈజగద్గురుపీఠ స్థాపకురాలయిన శ్రీశ్రీశ్రీ ఆది జంఘాముంఘారంభా దేవిగారు పూర్వకాలమునం దెప్పుడో పదునాఱు మతములనుద్ధరించినందున తత్పీ ఠమునకు వచ్చిన వారికందఱికిని షోడశమతోద్ధారిణీబిరుదము పారంపర్య ముగా వచ్చుచున్నది. అందుచేతనే యాపీఠమువారు జగద్గురువుల మనియు తక్కిన సర్వమతములవారును తమకు శిష్యప్రాయులేయనియు చెప్పుకొందురు. ఆమతములపేరుల నన్నిటిని దెలుపుటవలన నాకు వృథాయాసమేకాని దానివలన మీకేమియు లాభముగలుగదు. ఇటు వంటి బిరుదములా దేవివారికి మూఁడువేల మున్నూట ముప్పదిమూఁడు గలవు. ఆదేవిగారు షోడశమతముల నుద్ధరించినను, వానిలోనెల్లను జంఘా మతమునుసర్వోత్తమమయినదని స్థాపించినారు. ఆమతసిద్ధాంతము లించు మించుగా మనదేశమునందలి శాక్తేయ మతసిద్ధాంతములను బోలియు న్నవి. భేదమంతయు మనలోనున్న స్త్రీనిదీసివేసి వారు దానిస్థానమునఁ

బురుషుని బెట్టుకొన్నారు. అందులోను మద్యపానముగలదు; మాంసభక్షణము గలదు; సంభోగముగలదు; ముద్రలుగలవు. వీనినన్నిటిని బట్టి చూడఁగా వారు తమశాస్త్రమును మనయోగమతంత్రములనుండి దొంగిలించుకొన్నట్టు తోఁచుచున్నది. మనముద్రలలో నొల్లనుబ్రధానమైన "హ" అనుప్రసాదముద్రను శ్రీచక్రమునువారుతీసికొన్నందున వారుతమమతమునంతను మనపంచమామ్నాయమయిన తంత్రమునుండియే తస్కరించిరనుట నిశ్చయము. అప్పుడువచ్చిన యోజగద్గురువులవారికి ముప్పదిసంవత్సరముల వయస్సుగలదు; ఆదేవిగారు రూపముచేతను చక్కనివారనియే చెప్పవచ్చును; ఆమెప్రతిదినమును జంఘాపూజచేయుదురు. ఈయుపాసనము స్త్రీకి బదులుగా బురుషునిబెట్టినయెడల, సమస్తవిషయములలోను మనదేశములో వీరు లనఁబడెడు మహాభక్తాగ్రేసరులు చేసెడి యుపాసనముతో సరిపోలునుగనుక మీకు తేటగా తెలియుటకయి మన దానినిక్కడ ప్రమాణవచనపూర్వకముగా కొంచెమువివరించెదను. శాక్తేయాచారములలోనిదయిన యిది వామాచారము; దీనినాచరించువారు కౌలికు లనఁబడుదురు. కౌలికులనగా నుత్తమకులీనులనియర్థము. ఈపదముచేతనే వీరిశ్రేష్ఠత్వము వెల్లడియగుచున్నను ప్రమాణవాదులయిన మీతృప్తికొఱకు పరమప్రమాణమయినశ్యామారహస్య తంత్రమునుండి వామాచారముయొక్కయు కౌలసిద్ధాంతముయొక్కయు సర్వోత్కృష్టతను స్థాపించు ప్రమాణముల నిందుదాహరించెదను:—

శ్లో. సర్వేభ్యశ్చోత్తమావేదా వేదేభ్యోవైష్ణవంపరం
వైష్ణవాదుత్తమంశైవం శైవాద్దక్షిణముత్తమం
దక్షిణాదుత్తమం వామంవామాత్సిద్ధాంతముత్తమం
సిద్ధాంతాదుత్తమంకౌలం కౌలాత్పరతరంనహి.

"అన్నిటిలోను వేదములుత్తమములు; వేదములకన్న వైష్ణవముత్తమము; వైష్ణవముకన్న శైవముత్తమము; శైవమునకన్న దక్షి

క్షాచారము త్తమము; దక్షిణాచారముకంటె వామాచారము త్తమము; వామాచారముకంటె సిద్ధాంతము త్తమము; సిద్ధాంతమునకంటె కౌల ము త్తమము; కౌలమునకంటె శ్రేష్ఠతరమయినదిలేదు" అను ప్రమాణ వచనముల కర్థము. ఇప్పటి కౌలముయొక్క శ్రేష్ఠత్వము స్థాపనమయి నందున, కౌలాచారమును సప్రమాణముగా శక్తిశోధనతంత్రమునందుఁ జెప్పఁబడిన రీతిగాఁ గొంత వివరించెదను :—

శ్లో. నటీ కాపాలినీ వేశ్యా రజకీ నాపితాంగనా
బ్రాహ్మణీ శూద్రకన్యాచ తథాగోపాల కన్యకా
మాలాకారస్య కన్యాపి నవకన్యాః ప్రకీర్తితాః
ఏతాసుకాంచిదానీయ పూజయేచ్ఛక్తి కౌలికః.
* * * *
మహానిశాయా మానీయ నవకన్యాశ్చ భైరవాన్
* * * *
తదీయం మంత్రమాలిఖ్య తస్మిన్నామేవ పూజయేత్
శ్రీచక్రేస్థాపయేద్వామే కన్యాంభైరవవల్లభామ్.
ముక్తకేశాం వీతలజ్జాం సర్వాభరణభూషితామ్
ఆనందలీనహృదయాం సౌందర్యాతిమనోహరామ్
శోధయేచ్ఛుద్ధిమంత్రేణ సురానందామృతాంబుభిః.
* * * *
ఆనందతర్పితాం కాంతాం వీరః స్వానందవిగ్రహః
రతేన తర్పయేత్తత్ర శ్రీచక్రే వీరసంసది
* * * *
పీత్వా పీత్వా పునఃపీత్వా యావల్లుఠతిభూతలే
ఉత్థాయచ పునఃపీత్వా పునర్జన్మ నవిద్యతే.

మఱికొంత పచ్చిబూతుగా నుండుననని కొన్ని ప్రమాణవచనములను వదలివేసినందుకు చదువరులు నన్ను మన్నింపవలెను. "నటియు, కాపాలినియు, వేశ్యయు, చాకలిదియు, మంగలిదియు, బ్రాహ్మణియు, శూద్రయు, గొల్లదియు, పూలుగూర్చునదియు, నవకన్యలనఁబడుదురు.

వీరిలో నొకతెను దీసికొనివచ్చి కొలికుండు శక్తిపూజచేయవలెను. అర్థ రాత్రమునందు నవకన్యలను దెచ్చి........తత్సంబంధమైన మంత్రమును లిఖించి దానిని పూజింపవలెను. శ్రీచక్రమున వామభాగమునందు తలవిరియంబోసికొన్నదియు దెసమొలదియు సర్వాభరణభూషితయు ఆనందలీసహృదయయు సౌందర్యాతిమనోహరయు అయిన దూతీభైరవి కన్యను నిలువంబెట్టి సురానందామృత జలముతో శుద్ధిమంత్రముచేత శుద్ధురాలిని చేయువలెను. ఆనందవిగ్రహుండయిన వీరుండు ఆనంద తర్పితురాలయిన యోకాంతను శ్రీచక్రమునందు రతిచేత తృప్తినొందించ వలెను. త్రాగి త్రాగి భూమిమీదపడువఱకును మరల త్రాగి లేచిమరల త్రాగి పునర్జన్మము లేనివాండగును" అని పయి ప్రమాణవచనముల తాత్పర్యము. ఈప్రకారముగానే యచ్చటి జగద్గురువులవారు నిశీథసమయమునందు శ్రీచక్రమునందు ప్రాసాదముద్రనుపూని యీశ్వరాత్మకముగా నొక యౌవనపురుషుని పూజించి సంభోగించి సురాపానముచేసి యానందపరవశు లగుచుండురంట! మనదేశమునందువలెనే యాదేశమునందును శాస్త్రవిశ్వాసమును మతధర్మాచరణమును తక్కువగుటవలన జగద్గురువు లీమతధర్మమును స్వాచరణమువలనం జూపువఱకును దాసని జనులు మఱచిపోయినట్టే యున్నదిగాన, నేనున్న కాలములో రంఢీనగరమునం దీయాచారము కనంబడనేలేదు. ఇది కలిమహిమయని గురువుల యభిప్రాయము.

ప్రాసాదమంత్ర మహిమయు మంత్రవిశ్వాసము లేని నవనాగరికులకుం దెలియక పోవచ్చునుగాన వారి యుపయోగము నిమిత్తమిందు సప్రమాణముగా కులార్ణవ తంత్రమునుండి తెలిపెదను. దీనిని బట్టియే నాది యప్రామాణికవాదము కాదనియు, సర్వజన సమాదరణీయమనియు, బుద్ధిమంతులు గ్రహింపవచ్చును.

శ్లో. శ్రీప్రాసాద పరామంత్ర మూర్ధ్వామ్నాయ ప్రతిష్ఠితమ్
ఆవయోః పరమాకారం యోవేత్తి సః శివః స్వయమ్.

శివాదిక్రిమిపర్యంతం ప్రాణినాం ప్రాణవర్తినాం
నిశ్వాసోచ్ఛ్వాసరూపేణ మంత్రోయం వర్తతేప్రియే.

అని కేవల సదాశివుఁడే శ్రీమహాదేవికి "మనయిద్దఱ పరమాకార మయినట్టియు ఊర్ధ్వామ్నాయ (తంత్ర) ప్రతిష్ఠితమయినట్టియు శ్రీ ప్రాసాద పరామంత్రము నెవ్వఁ డెఱుఁగునో వాఁడు తానేశివుఁడు. ఓప్రియురాలా! శివాది క్రిమిపర్యంతమునుఁగల జీవజంతువులలో నిశ్వాసోచ్ఛ్వాసరూపముచేత నీమంత్రము వర్తించుచున్నది" అని యుపదేశించియున్నాఁడు. "హ్స" అను ప్రాసాద మంత్రములో హకారము నిశ్వాస రూపమనియు, సకార ముచ్ఛ్వాస రూపమనియు తెలియవలెను. శాస్త్రప్రమాణము కలిగి యుండుటచేత మన పురుషులలో నిది సదాచారమేయయినను స్త్రీలలోమాత్ర మిదిదురాచారమని నేనుభావించెదను; ఆదేశమునం దేలాగుననో స్త్రీలు స్వతంత్రురాండ్రయి తమ కనుకూలముగా శాస్త్రములను తాఱుమాఱు చేసినందున, ఈయనర్థమంతయుపుట్టినది. ఆసంగతి పోనిచ్చి కథాంశమును వినుఁడు.

సభాపతులు శ్రీజగద్గురువులవారి యాజ్ఞ నంతగా మన్నించక పోవుటయు, అందుచేత మతధర్మము లాచరణములేక చెడిపోవలసినగతి సంభవించుటయు చూచి ఖేదపడి గంభీదంభీగారు జీర్ణమతోద్ధారణమునకును గురుభక్తి నిలుపుటకును సభచేసి పూర్వాచార శాస్త్రమహిమలను భూషించుచు, నవనాగరికురాండ్రను దూషించుచు, గొప్ప యుపన్యాసము చేసిరి. అది మిక్కిలి పెద్దదగుటవలన దానికడపటిభాగమునుమాత్ర మిందు తెలిఁగించెదను :—

"ఓమహాకాంతలారా! నాయుపన్యాసము విన్నారుగదా! ప్రజలెట్లు చెడిపోవుచున్నారో కన్నారుగదా! నవనాగరికురాండ్రవలన దేశమునకుఁ గలుగుచున్న యనర్థములను గనిపెట్టినారుగదా! వారిప్పుడు పురుషులకు విద్యకావలె ననుచున్నారు; రేపు అపత్నీకుల

ముక్కలు కోయఁగూడ దందురు ; ఆపయిని పుణ్యపురుషుల నినుపపెట్టెలలోఁ పెట్టి తాళము వేయఁగూడ దందురు ; అటుపిమ్మట వృద్ధపురుషులు పత్నులతోఁ సహగమనము చేయఁగూడ దందురు ; కట్టకడపట అపత్నీకులయిన పురుషులు మరల వివాహమే చేసికొనవచ్చు నందురు. ఇంతకువచ్చినది మఱియెంతకైనను రాకమానదు. ఆదుష్టురాండ్ర ప్రయత్నాంకురములను వికసింపనియ్యక మనము మొగ్గలలోనే త్రుంచి వేయవలెను. దేశాచారము సంరక్షింపవలయును. శాస్త్రధర్మములను నిలుపవలెను. దేశమతాభిమానములను వహింపవలెను. ఆమూఢురాండ్రు శాస్త్రజ్ఞానము లేనివారయి బుద్ధివాదములు చేయుచున్నారు. శాస్త్రబద్ధులమయిన మనకు మనుష్యబుద్ధి ప్రమాణముకాదు. పయి మతసత్యములు శాస్త్రముచేతఁగాక మఱి యేబుద్ధివలనఁ దెలియును? పాపాత్మురాండ్రయిన నవనాగరికురాండ్రు శాస్త్రప్రసిద్ధమై ద్వాదశ మహాపాతకములలోను ఘోరతమమైన పెండలపు దుంపకూరను రహస్యముగా నెవ్వరు నెఱుఁగకుండ తినుచున్నారఁట ! ఎంతఘోరకృత్యము చేయుచున్నారో చూచినారా? చూచినట్లొక్కరును పలుకరేమి? స్వపక్షస్థాపనము కొఱకును పరపక్ష నిరాకరణము కొఱకును కల్లలాడవచ్చును. మతవిషయమున అసత్యదోషము లేదు. ఇదిసూక్ష్మధర్మము. నామాట నమ్ముఁడు. చూడకపోయినను మీరిప్పుడు చూచినట్లు చెప్పుచున్నారు. నాకిప్పుడు పరమసంతోషముగా నున్నది. మీరు నవనాగరిక బోధను నిర్మూలము చేయుటకును శ్రీజగద్గురువులవారి యధికారమును వ్యాపింపఁజేయుటకును దేశ మతాభిమానములు గలవారయి ప్రాణముల కాశపడక పోరాడుఁడు."

ఈయుపన్యాసమువలన జనుల మనస్సులన్నియు పూర్వాచార పక్షమున తిరిగిపోయినట్టు కానఁబడినవి. మఱునటిదినము మొదలుకొని ప్రజలు నవనాగరికుల విషయమున ననేకాసత్యములను జెప్పుచు, అనేక

దోషారోపణములు చేయుచు, అనేకాపవాదములను వేయుచు, వారిని మూర్ఖమహాజనుల దృష్టియందు హాస్యాస్పదులనుగాఁ జేయునారంభించిరి. ఈపామర మహాజనాభిప్రాయ ప్రవాహము నరికట్టి మరలించుటకయి నాయజమానురాలును నేనునుగూడ పురుష స్వాతంత్ర్య విషయమున నుపన్యసింప నారంభించితిమి. నాయుపన్యాసముయొక్క పర్యవసానమును మీకు పయి ప్రకరణమునందుఁ జెప్పెదను.

---

## ఎనిమిదవ ప్రకరణము

గంభీదంభీగారి యుపన్యాసమయిన మూఁడవనాఁడు "పురుష స్వాతంత్ర్యములనుగూర్చి సత్యరాజాచార్యు డుపన్యసించును గనుక పౌరస్త్రీ మహాజనులందఱును రాజకీయ పాఠశాలామందిరమునకు భానువారమునాఁడు ప్రాతఃకాలమున విజయం చేయఁ బ్రార్థింపఁ బడుచున్నారు" అని యొక ప్రకటన పత్రికను నా యజమానురాలయిన ఘాంఢీభంగీగారు పురజనుల కందరికిని బంపిరి. కాల వైపరీత్యమువలనఁ గలిగిన యీవిడ్డూరమును జూడవలయునని నాఁటి ప్రాతఃకాలమున పురమునందలి సుందరీ బృందమంతయు పాఠశాలామందిరమునకు దయచేసి సభ తీర్చియుండెను. ఆవచ్చినవారిలో దుంఢీలంఢీగారును, గంభీదంభీగారును, వారి పరివారమును ముందుగా వేంచేసి యగ్రపీఠముల నలంకరించిరి. అల్లరిజరగకుండ కాపాడుటకయి మాయజమానురాలిగారి కోరిక ప్రకారముగాఁ గొందఱు రక్షక భటురాండ్రును వేత్రహస్తలై వచ్చిరి. ఉపన్యాససమయము సమీపించునప్పుడు నాయజమానురాలితోఁ గలిసి నేనచ్చటికిఁ బోవునప్పటికి పౌరస్త్రీమహాజనులు "వంటయింట మూలనడఁగి యుండక పురుషభూషణమైన లజ్జనువిడిచి మగవాఁడొకఁడు నేఁడు సభకువచ్చునఁట!" అని యొకతెయు, "ఊరక

సభకు వచ్చుట మాత్రమేకాదు సిగ్గువిడిచి యచ్చట స్త్రీలముందు తగుమనని ముచ్చటింపఁ బూనునఁట!" అని యింకొకతెయు, "కాలమహిమవలన నెట్టి వైపరీత్యములయినను పుట్టుచున్నవి!" అని మఱియొకతెయు, "తెగఁ బడిపురుషుఁడు సభలో ప్రసంగింప వెడలుట దేశారిష్టము!" అని వేరొకతెయు, "ఇట్లు పురుషుల మాటలు సాగనిచ్చుట యవమానకరము!" అని యొండొకతెయు, తమలోఁ దాము ముక్కులమీఁద వ్రేళ్లు వేసికొని యద్భుతపడుచు చెప్పుకొనుమాటలు మాచెవులఁ బడినవి. అంతట నుపన్యాససమయము సమీపించినందున సభవారిచే దుంఖేలంఖీగారగ్రాసనాసీనురాలుగాఁ జేయఁబడిరి. తరువాత నే నుపన్యసింప మొదలు పెట్టితిని:—

"ఓపుణ్యసతులారా! స్త్రీలకు వలెనే పురుషులకును భగవంతుఁడు బుద్ధినిదయచేసి యున్నాఁడు—"

పౌరమహాస్త్రీలు—లేదు లేదు. ఇది సర్వాబద్ధము స్వభావవిరుద్ధము. పురుషులకు బుద్ధి లేనే లేదు. స్త్రీలకు సేవచేసి బ్రదుకవలసిన పురుషులకు దేవుఁడు బుద్ధియిచ్చినాఁడనుట దైవదూషణము; శాస్త్ర దూషణము.

"అమ్మలారా! నామాటలు కొంచెము వినినతరువాత మీ యభిప్రాయమును జెప్పవచ్చును. కొంచెము శాంతివహింపుఁడు. ఈదేశమునందు చదువు లేకపోవుటవలన పురుషులలో బుద్ధివికాసము కానరాకున్నను—"

పౌరమహాకాంతలు—(చెవులుమూసికొని) కటకటా! నేఁడెట్టి పాపపు మాటలు వినుచుంటిమి! పురుషులకఁట! చదువఁట! ఏమి యీకలియుగప్రభావము! ఏమి యీదుష్కాలమహిమ! చదివిన పురుషుని జూచినచో సచేలస్నానము చేయువలెనని శాస్త్రములు చెప్పు

చున్నవి. ఉన్నదుర్గుణములు చాలక పురుషులకు చదువుకూడ చెప్పించి మఱింతమతి చెఱుపవలెనుగా !

"అమ్మలారా! నావాక్యమును కడతేఱవినుఁడు. ఈదేశము నందు విద్య లేకపోవుట వలన పురుషులలో బుద్ధివికాసము కానరాకున్నను, ఈదేశమునందలి స్త్రీలకువలెనే మాదేశమునందు పురుషులకు విద్య చెప్పించుటచేత వారక్కడ బుద్ధిశాలులయి—"

పౌరమహాంగనలు—మీది పాడుదేశము ; పిశాచదేశము; రాక్షసదేశము ; మీపాపిష్ఠిదేశముమాట మాకుచెప్పకు ; మీదిపాపాత్ములుండెడు నరకభూమి.

"మీరు నన్ను దూషించినను దూషింపుఁడు. పరమపావనమైన మాదేశమును మాత్రము దూషింపకుఁడు, మాది మహర్షులుండిన పుణ్యభూమి ; యజ్ఞాదులకు జన్మస్థాన మయిన కర్మభూమి; మాదేశ మనంతములయిన మహిమల కాస్పదమయినది—కుండలోనుండి పుట్టిన యొక మహాపురుషుఁడు సముద్రమును పుడిసిటఁబట్టి త్రాగివేసినాఁడు; గాలికిపుట్టిన యొక మహాపురుషుఁడు సూర్యబింబమును పండని మ్రింగినాఁడు. రెల్లులోఁబుట్టిన యొక మహాపురుషుఁడు క్రౌంచ మహాపర్వతమునకు తూటుచేసినాఁడు—"

పౌరమహానారులు—చాలు ; నోరుమూసికో. నీవసత్యవాదివి ; నీవుదొంగవు ; నీవు కల్లరివి. దైవసృష్టిలో స్త్రీలకుండునుగాని పురుషుల కిట్టిమహిమ లెక్కడను నుండవు. నీవు శుంఠవు ; త్రాగుబోతువు; ఉన్మత్తుఁడవు.

"ఓయగ్రాసనాసీనురాలా ! వీరు నన్నిట్లు దూషించుచున్నారో చీ త్తగించుచున్నారా? "

అగ్రాసనాసీనురాలు — ఓపౌరనారీమణులారా ! ఒక్కనిమిష

మూరకుండుఁడు. ఓయుపన్యాసకా! నీవుపనికిమాలిన మీదేశవర్ణ నమునుమాని చెప్పవలసినసంగతి చెప్పు.

"స్త్రీలకువలెనే పురుషులకును కొన్ని స్వాతంత్ర్యములు గలవు."

ఒకతె—ఏమియు లేవు.

ఇంకొకతె—వారికున్న స్వాతంత్ర్యమంతయు స్త్రీలకు దాస్యము చేయుట.

మఱియొకతె—పత్నీశుశ్రూష చేయుట.

వేఱొకతె—స్త్రీసేవ చేసికొనుచు మూలనడఁగియుండుట.

"నేనిచ్చటిపురుషులకు స్త్రీపరిచర్య ధర్మముకాదనను. శాకపాకములు జిహ్వాకింపుగాఁ జేయుటకు సహితము పురుషుఁడు చదువునేర్చి పాకశాస్త్రము నభ్యసింపవలయును గదా?"

పౌరమహాకామినులు—అక్కఱలేదు. అభ్యాసముచేతనే పాకముచేయు నేర్పుకలుగును. పురుషులకు స్వప్నములోను చదువన్నపేరు చెప్పఁగూడదు.

"అట్లనఁగూడదు. చదువుకొనకపోయినయెడల పురుషులు జ్ఞానహీనులయి పశుసమాను లగుదురుగదా?"

పౌర—పురుషులు చదువులేనప్పుడే పశువులు. కోతికి కొబ్బరికాయవలె వారికి చదువుకూడ నబ్బినపక్షమున, స్వభావదుష్టులయిన పురుషులు పశువులకన్నను తక్కువవారగుదురు. పురుషులకు జ్ఞానముతో పనిలేదు. పురుషులకు సమస్తధర్మములును సమస్తకర్మములునుసమస్తపుణ్యములును సమస్తవ్రతములును పత్నీసేవలోనే యిమిడియున్నవి. పత్నులయుచ్ఛిష్టభోజనమే పురుషులకు మోక్షసాధనము; పత్నులపాదోదకపానమే పురుషులకు పాపవిమోచనము; పత్నులచరణరజోధారణమే పురుషులకు సర్వసుఖదాయకము. పురుషులకు పత్నియొక్కతెయే

పరమదైవతము. పురుషులకు పత్నీసేవయొక్కటియే శాస్త్రవిహిత మయిన సనాతనధర్మము.

"ఓకాంతామతల్లులారా! తల్లులారా! న్యాయబుద్ధితో నాలోచింపుఁడు. శాస్త్రము న్యాయవిరుద్ధముగా నున్నప్పుడు—"

గంభీదంభీ—అదిగో శాస్త్రదూషణ వచ్చుచున్నది. ఈపాపాత్ముఁడు శాస్త్రతిరస్కారము చేయుచున్నాఁడు. శాస్త్రములో నున్నదేదియు న్యాయవిరుద్ధముగాదు. నిత్యమును నూఱుకల్లలాడుమన్నను, వేయిహత్యలు చేయుమన్నను, లక్ష దొంగతనము లాచరించుమన్నను, శాస్త్రములోఁ జెప్పియున్నయెడల నవియన్నియు పరమధర్మములగును. ఓతోఁబుట్టువులారా! ఇట్లు కొఱగాని మగపుట్టువు పుట్టిన వ్యర్థుఁడొకఁడు శాస్త్రనింద చేయుచుండఁగా చెవులుపెట్టుకొని వినుచు నూరకున్నారేమి? మీశాస్త్రాభిమానము చచ్చిపోయినదా? మీరు స్త్రీజన్మమెత్తలేదా?

ఒకతె—ఈపురుషకీటకమును జావఁగొట్టుండి.

ఇంకొకతె—శాస్త్రదూషణచేసిన వీనినాలుకను కోయుండి.

మఱియొకతె—సిగ్గులేక సభకు నడిచివచ్చిన వీనికాళ్లు విఱుగఁగొట్టుండి.

వేఱొకతె—పురుషవిద్యయని కాఱులఱచిన వీనిగొంతు పిసుకుండి.

ఈప్రకారముగా పలువురు పలువిధములుగా నన్ను దూషించుచు పరిహసించుచు నామీఁదపడి నాయజమానురాలు వారించుచున్నను నిలువక కొందఱు నెత్తిమీఁదను కొందఱు వీపుమీఁదను కొందఱు మొగముమీఁదను చేతులతోను మోచేతులతోను కాళ్లతోను చరచియు పొడిచియు తన్నియు నన్ను ప్రాణావశిష్టుని జేసి విడిచిరి. రక్షకభటురాం డ్రాసందడిలో దండపాణులయి యమభటులవలె నన్ను రక్షింపవచ్చినట్లు నాజాపునకు వచ్చిరికాని వారిగుఱి యపూర్వమైన దగుట

చేతనో మఱియే హేతువు చేతనో వారివేత్రప్రహారము లన్నియు నామీఁదనేకాని యల్లరిమూఁకమీఁద నొక్కటియు పడలేదు. కొంతసేపటికి నేను మూర్ఛిల్లితిని. రక్షకభటురాండ్రు నాకు శైత్యోపచారములు జేసి మూర్ఛ తెలిసిన తరువాత నన్ను ధర్మవైద్యశాలకు బండిమీఁదఁ గొనిపోయి యచ్చటి రాజకీయవైద్యురాండ్ర కొప్పగించిరి. నే నిరువది దినములు వారిచికిత్సలో నున్నతరువాత నేనులేచి భూమిమీఁద నడుగుపెట్టి కొంచెము తిరుగుట కారంభించితిని. రాజకీయోద్యోగిను లీదొమ్మిచేసిన వారిని పట్టుకొనవలసిన దని రక్షకభటురాండ్ర కాజ్ఞాపించినను, వారాదొమ్మిసమయమునం దచ్చటనుండి భయముచేత కన్నులు మిరుమిట్లుగొని చూడలేనివారై యందున నొక్కరినైనను పట్టుకో లేకపోయిరి. నేనువైద్యశాలలోనున్న దినములలో ప్రతిదినమును తప్పక ఫాంఢీభంగీగారువచ్చి నన్ను చూచిపోవుచుండిరి. వైద్యశాలాధికారిణియు నాయందు పుత్రవాత్సల్యము కలదై నాపథ్యపానములు స్వయముగా విచారించుచు మంచిమందుల నిచ్చుచువచ్చెను. ఆకాలములో ఫాంఢీభంగీగారి తల్లిగారును రెండుమూఁడు పర్యాయములు వైద్యశాలకువచ్చి నాక్షేమమును విచారించుచు, ఒకనాఁడు నన్నుఁజూచి "నీవిట్లు కానిదేశములో దిక్కుమాలిన పక్షివయి చచ్చుటకంటె సుఖముగా స్వదేశమునకుఁ బోయి హాయిగా నుండరాదా?" అని ప్రశ్న వేసెను. అప్పుడు మాయిరువురకు నిట్లు కొంతసంభాషణ జరిగినది :—

"అమ్మా నాకును స్వదేశమునకుఁ బోవలెననియే యున్నది."

"ఉన్నయెడల శీఘ్రముగాఁ బోరాదా?"

"పోవుటకు నాకు శక్తిలేదు. మాదేశమార్గము నేనెఱుఁగను."

"దారియెఱుఁగకుండ మీదేశమునుండి మాదేశమున కెట్లు వచ్చితివి?"

"గురుప్రభావముచేత."

"ఇప్పుడును మరలగురుప్రభావముచేతనే పొమ్ము."

"ఇప్పుడు దారిచూపుటకు మాగురువిక్కడ లేఁడు."

"గురువునై దారిచూపుటకు నేనిక్కడనున్నాను. నాయుపదేశము గైకొమ్ము. నీవుశీఘ్రముగా పోనియెడల, నిన్నిచ్చటివారు తప్పక చంపివేయుదురు."

అని నాకామె యొకమంత్ర ముపదేశించి యీమంత్రమును మూఁడులక్షలు జపముచేసిన యెడల సిద్ధియగుననియు, అప్పు డామంత్ర ప్రభావముచేత కోరినదేశమునకుపోయి వాలవచ్చుననియు, చెప్పెను. కలదినములకు నేనుపూర్ణముగా స్వస్థుఁడనయి మరల నెప్పటియట్ల వీధిలో తిరుగ సాగితిని. తరువాత వైద్యశాలవారు నాకుబలమైన ఘాతకలిగినట్లు విముక్తిపత్రము నిచ్చిపంపివేసిరి. నేను మరలవచ్చి ఫాంఢీభంగీగారిలోపలఁ బ్రవేశించితిని. నేను వీధిలోనికి బయలువెడలునప్పు డెల్లను స్త్రీలు నన్ను వ్రేలితోఁజూపి యెగతాళిఁ జేయుచు, వీని నీసారిప్రాణములతో విడువగూడదని తమలోననుకొనుచు, నన్నుఁజూచి నవ్వసాగిరి. స్త్రీలకు స్వాతంత్ర్యమున్న యెడల నెట్టికీడులుమూఁడునో కనిపెట్టితిరా? "నస్త్రీస్వాతంత్ర్యమర్హతి" యని చెప్పిన మనశాస్త్రకారుఁడు వెఱ్ఱివాఁడు కాఁడు. సామాన్యులు కనిపెట్టలేరుగాని సర్వజ్ఞులైన మనపూర్వులెంతటిబుద్ధిమంతులైన నౌదురు. మనదేశమునందు మాత్రము మనమెన్నఁడును పురుషనామము భూమిమీఁద నున్నంతవరకు స్త్రీలకు స్వాతంత్ర్య మణుమాత్రము రానియ్యఁగూడదు.

అప్పుడు నా కాదేశమువిడిచి శీఘ్రముగా పోవలెనన్న బుద్ధి పుట్టినది. ఇట్లుచెప్పఁగానే మీరు నన్నాదేశమునందలి యాఁడువారికి వెఱచి పాఱిపోవుచున్న భీరునిగా భావింతురేమో! మీరట్లెంతమాత్రమును తలఁపఁగూడదు. మహాభారత యోధుల జన్మభూమియైన భరత

ఖండమునందుఁ బుట్టి, యందులోను ముఖ్యముగా పిఱికికళంకలేని బ్రాహ్మణకులమునం దుద్భవించిన నాకు పౌరుషము కొఱఁతవడునా? ముమ్మాటికిని పడదు. సమయమువచ్చినయెడల నేను ప్రాణములను తృణప్రాయముగా విడువఁగలను. అయినను నేనాదేశములో మృతుఁడనయ్యెడుపక్షమున నాకు వీరస్వర్గము సిద్ధమేయయినను, మీకీవార్తలు చెప్పి మిమ్మానందింపఁజేయువారు మఱియొకరు దొరకరని మీమీఁది యవ్యాజానుగ్రహముచేతనే నేను కరస్థమైన యింద్రుని యర్ధాసనమును రంభాసంభోగమును మానుకొన్నానుగాని మఱియొక కారణముచేతఁ గాదు. నానిమిత్తమయి కష్టపడుచున్న ఫాంఢీభంగీగారిని విడిచి కృతఘ్నుఁడనయి స్వార్థపరత్వముచేత పోవుచున్నాఁడననియు మీరనుకొనఁ గూడదు. నామూలమున ఫాంఢీభంగీగారికి విపత్తులువచ్చినమాట సత్యమే. ఆయాపదలను దలఁచియే నేను తమదేశమునుండి వెడలిపోయినయెడల తనపుత్రికకు కష్టములు తొలఁగునని ఫాంఢీభంగీగారి మాత నాకామంత్రము నుపదేశించినదిగాని నాయందలి యొక్కనిర్వ్యాజానుగ్రహముచేతనే కాదు. ఆమాటపోనిండు. నే నాదేశమును విడువ యత్నించుట కింకొక ముఖ్యకారణముకూడఁ గలదు. హిందువులు దేశాటనముచేసి క్రొత్తదేశములను కనిపెట్టువారు కారనియు, నూతనముగా శోధించి చరిత్రములను వ్రాయ సమర్థులుకారనియు, పశ్చిమఖండవాసులు మనమీఁద రెండునిందలు మోపియున్నారు. ఈరెండునిందలను కల్లచేసి మనదేశమునకు ఖ్యాతితెప్పింపవలెనన్న సచ్చింతతో నాయమూల్యములైన ప్రాణముల నాపాడుదేశమునకు బలిపెట్టక లేచిపోయినాడను. నేను గనిపెట్టిన యీదేశములను, నేనువ్రాసిన యీచరిత్రమును, విన్నవారును కన్నవారును హిందువులయం దీకముందీ రెండునిందల నారోపింప నవకాశము లేనివారయి హిందువు లెంతటికైన సమర్థులేయని యొప్పుకొని మనలను వేయినోళ్ళ శ్లాఘించి

ప్రాజింపవలసినవా రనుచుఁ దురుగదా ? ఓచదువరులారా ! మన దేశమునకు నేను సంపాదించిన యీకీర్తితో మీరు కొంతకాలమువఱకును తృప్తి పొందియుందురు.

పరదేశయాత్ర త్వరితముగా నెరవేర్చవలెనన్న బుద్ధితో నే నొంటిగా రండీనగర ప్రాంతమునందలి యరణ్యమునకుఁ బోయి నాయజమానురాలితల్లి యుపదేశించిన మంత్రమును పునశ్చరణము చేయుచుండఁగా, ఒక సిద్ధుఁడాకస్మికముగా నాకాశమునుండిదిగి నాయెదుట నిలిచెను. నేనామహాత్మునకు భక్తిపూర్వకముగా నమస్కారముచేసి చేతులుజోడించుకొని నిలువఁబడితిని. ఆసిద్ధాగ్రగణ్యుఁడు నాయందు నకారణకరుణ గలవాఁడయి, పూర్వము ప్రవరాఖ్యునికాలికి పసరు రాచిన సిద్ధేంద్రుఁడను తానేయనియు, మంత్రసిద్ధి చిరకాలమునకుఁగాని కాదని దివ్యజ్ఞానముచే నెఱిఁగి నాకాపసరియ్యవచ్చితిననియు, చెప్పి యామూలికపేరుకూడ నాకనుగ్రహించి యదృశ్యుఁడయ్యెను. ఆయోషధిపేరు దుత్తూరవర్ణి. దానియాకులు నల్లయుమ్మెత్తాకులవలె నుండును. పువ్వులు కొండతంగేడు పువ్వులవలెనుండును. కాడలు కలువకాడలువలె నుండును. ఆచెట్టు సమూలముగాఁ దెచ్చినూఱి పసరుదీసి కాలికి రాచుకొన్నయెడల మనము కోరినచోటికెల్లను మనోవేగమునఁ బోవచ్చును. ఈచెట్లు విశాఖపట్టణములోని యల్లికొండమీఁదఁ గావలసినన్నియున్నవి. నేనాచెట్టుపసరుకాలికిపూసికొని లంకాద్వీపమునకుఁ బోవలెనని మనస్సులో సంకల్పించుకొనఁగానే క్షణకాలములో నేనా లంకను జేరితిని. ఈప్రయాణకథ మొదలగు వానినిగూర్చి మీకు ముందు తెలిపెదను. నేను బయలుదేఱిన దినముతో రండీదేశమునందు మూఁడుసంవత్సరముల రెండుమాసముల పందొమ్మిదిదినములుంటిని.

ప్రథమభాగము సంపూర్ణము.

# సత్యరాజాపూర్వదేశ యాత్రలు.

## ద్వితీయ భాగము

### లంకాద్వీపము



By

K. VEERESALINGAM

# సత్యరాజా పూర్వదేశయాత్రలు.



## ద్వితీయభాగము

## లంకాద్వీపము.



## మొదటి ప్రకరణము.



ఆఁడుమళయాళములో నాకు సిద్ధుఁ డనుగ్రహించిన పసరు యొక్క మహిమచేత నడవవలసిన ప్రయాసములేక మనోవేగమున గగనమార్గమునఁ బోయి క్షణకాలములో నేను లంకాద్వీపమున వాలితినని చెప్పియున్నానుగదా! హనుమద్దేవుని తరువాత నీకలికాలములో మన పెద్దలెవ్వరును పురాణములలోఁ దక్క దర్శింపనోచుకోని లంకాద్వీపమును వాయుపథమునఁ బోయి చేరఁ గలుగుటకు మన భరతఖండవాసులలోనెల్ల నేనే ప్రథముఁడ నగుటచేత, ఇంతటి ఘనకార్యమును నిర్వహించిన యీయుత్తమోత్తమదినమును మహాపుణ్యదినమును గా భావించి యేటేట మీ రుత్సవముచేసికోక మానరన్న దృఢవిశ్వాసమునుబట్టి నేనక్కడ నడుగిడినదినమును మీకు సరిగా త్రుటిలవలతో చెప్పుచున్నాను. సావధానచిత్తులరై గ్రహింపుఁడు. నే నాదేశములో కుడికాలు మోపినపుణ్యకాలము హూణశకము ౧౮౮౩ వ సంవత్సరము మార్చినెల ౨౩ వ తేదీ మధ్యాహ్నము మూఁడుగంటల రెండుమినిట్లు నాలుగు సెకనుల ముప్పాతికమీఁద మూఁడువీసములకాలము. నేనా దేశమునందు వాలెడునప్పుడు సహితము మనదేశమందలి కాలజ్ఞులు తప్పుపట్టుట కవకాశములేకుండ

త్రోవలోనే మొదమొదాలుముడుచుకొని కుడికాలొక్కటియే భూమి మీఁదఁ బెట్టినాను. హూణపంచాంగములు లేని యాదేశములో సంవత్సరమును మాసమును తిథియు సరిగా నెట్లు తెలిసికోఁ గలిగితి వని సూక్ష్మబుద్ధి లేనివారు కొందరడుగవచ్చును. ఆఁడుమళయాళ దేశములో మూఁడు సంవత్సరముల రెండుమాసముల పందొమ్మిది దినము లుండుటచేత దానినిబట్టి లెక్కవేసి చూడఁగా, నేనక్కడ ప్రవేశించినదినము సరిగా నేనిప్పుడు చెప్పినదే యయినట్లు తేలినది. అంతేకాక లంకానగరమునందు జ్యోతిశ్శాస్త్ర విద్వాంసు లనేకు లున్నందున వారి నాశ్రయించి తరువాత కొంతకాలమునకు వారిచేత చేయించిన లెక్కను బట్టికూడ రెండుమూఁడుదినము లెక్కువ తక్కువగా నేను జెప్పిన తిథి సరియైనట్టు సిద్ధాంతమయినది. ఆ రెండుమూఁడు దినముల వ్యత్యాసమును లంకాద్వీపమునకును మనదేశమునకును గల కాలవ్యత్యాసమువలనను జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంత భేదములవలనను వచ్చినదగుటచేత మీరా యల్పభేదమును పాటింపక కర్మానుష్ఠానమునకు నేను చెప్పిన దినమే సిద్ధాంతము చేసికొనుఁడు. శాలివాహన శకాది హిందూశకముల నన్నంటిని విడిచిపెట్టి హూణశకప్రకారముగా సంవత్సర పరిగణన మేలచేసితివని కొందఱుబుద్ధిమంతులు శంక చేయవచ్చును. దానికిని సమాధానమువినుఁడు. ఇప్పుడు మన భరత ఖండమునం దంతటను వ్యాపించియున్న యింగ్లీషుపాఠశాలల మహత్త్వమువలన ముఖ్య పట్టణములయం దెల్లవారును తెలుఁగు సంవత్సరములును తెలుఁగు తిథులును మఱచి యున్నారనియు, ఇప్పుడించు మించుగా కలిసిద్ధముగా నంగీకరింపఁబడుచున్న సంధ్యావందనమును జేయుచుండెడు లక్కడక్కడఁ గొందఱున్నను వారుసహితము "అస్మిన్ వర్తమాన వ్యావహారిక హూణమానేన ౧౮౭౩ సంవత్సరే, మార్చిమాసే ౨౩ తిథౌ" అని సంధ్యావందనములో నింగ్లీషుతిథు

లనే వాడుచున్నారనియు, నేనక్కడి జ్యోతిష్కులవలననే యెఱిఁగిన వాఁడ నగుటచేత మీకు సుబోధము గాకుండుటకయి యింగ్లీషు తిథులను వాడితినేకాని నాకు తెలియకకాదు. ఈకలికాలమునందు సహితము జ్యోతిషమిట్లు ప్రత్యక్ష నిదర్శనముగా నున్నదికదా! లంకాద్వీపమునందు జ్యోతిశ్శాస్త్రమే ప్రబలియుండని పక్షమున ద్వీపాంతరమునం దేకాకినయియున్న నేను దూరదేశమునందలి మీ స్థితిగతుల నెఱుఁగక తిథి మాస సంవత్సరాదులను మీకు దురవగాహముగనట్లు వ్రాస్తున్నట్లు ప్రత్యమాన ప్రకారముగా తెలిపియుండును. నాకింతటి దివ్యజ్ఞానము ప్రసాదించిన యోజ్యోతిశ్శాస్త్రరాజమా! నీకు పదివేల నమస్కారములు. పశ్చిమ ఖండమునుండి హూణులు తెచ్చి విడుచుటచేత నిప్పుడు భరతఖండమునం దెల్ల యెడలను పిశాచములవలె సంచరించుచున్న ప్రకృతిశాస్త్రములకు భయపడక నీవ మాదేశము నెప్పుడును విడువక మావారి హృదయపీఠముల నధిష్ఠించి రాజ్యము చేయుచుండుము. సంధ్యావందన విసర్జనకథనముచేత శాస్త్రోల్లంఘనము చేసినట్లు పామరులు భావింతురన్న భీతిచేత జ్యోతిశ్శాస్త్రమునుబట్టి నేనెఱిఁగిన ఈసత్యమును మనవారు కొందఱు పయికొప్పుకోక పోయినను, మనస్సులలో నయిన సత్యమును గ్రహించి జ్యోతిషమును మునుపటికంటె నెక్కువగా గౌరవింతురని నమ్ముచున్నాను.

నేను లంకాద్వీపమును జేరినతరువాత నెటుపోదునాయని యాలోచించుచు క్షణకాల మొక మఱ్ఱిచెట్టు నీడను గూర్చున్నాను. మఱ్ఱిచెట్టని చెప్పఁగానే యది మనదేశపుమఱ్ఱిచెట్టు వంటిదే యని మీరనుకోవచ్చును. కాని యది యాకారమునందు మన మఱ్ఱిచెట్లనే పోలినను పరిమాణమునందు మాత్రము శతగుణములు లధికమైనదిగా నున్నది. దాని యాకులు మనదేశమునందలి తామరాకు లంతలేసి యున్నవి; దానిపండ్లు పెద్దతాటికాయలంతలేసి యున్నవి; చిన్న

యూకలు నాకొఁగిటి కడగినవికావు ; కొమ్మలారంభమైన ప్రమాని ప్రకాండముయొక్క యెత్తినూఱడుగుల కంటె హెచ్చుగానున్నది ; ప్రమానియొక్క వైవారము సరిగా కొలవలేదుగాని నూఱడుగులకంటె నెక్కువగానే యున్నట్టు తోఁచినది ; కొమ్మలు రెండుమూఁడు యోజనములదూరము వ్యాపించియున్నవి. చెట్టెంతయెత్తుండునోయని యాకాశమువంకఁ జూచితినిగాని నాదృష్టి వ్యాపించినతవఱకుఁ కొన కనఁబడలేదు. పయివంకఁ జూచుచుండఁగా నొకకాకి కొమ్మలలోఁ గూరుమండి కావుమని కూసినది. ఉరుమువలెనున్న దానికూత వినఁ బడఁగానే నాగుండెలు పగిలిపోయినవి ; దాని రూపమును జూచినను నాభయము తక్కువకాలేదు. అది రూపమునందు గేదెదూడంత యున్నది. దానినిజూచి యేపక్షినన్నెగ నెత్తుకొనిపోవునోయని భయపడి ప్రాణరక్షణార్థమయి యొక యూడచాటునకుఁ బోయితిని. ఆవంక చూడఁగానే యూడమీఁదఁ బ్రాఁకుచు రెండు కండచీమలు నాకంటఁ బడినవి. అవి మనదేశమునందలి యెలుకలంతలేసి యున్నవి. అవి కుట్టినపక్షమున యేనుఁగువంటి దృఢకాయుఁడు సహితము నిమిషములో పీనుఁగగుటకు సందేహముండదు. శివునాజ్ఞ లేనిది చీమకుట్టదన్న లోకోక్తి యథార్థముగా నేను సమీపమునకుఁ బోయినను నన్నొక చీమయు కుట్టలేదు. అయినను వానిదర్శనమువలన నైనభీతిచేతనే నాదేహమంతయు గాలిలోపెట్టిన దీపమువలె కంపింప మొదలుపెట్టినది. అప్పటి నాదురవస్థ నేమని చెప్పుకోను ! దుత్తూరపర్ణి పసరు కొంచె మక్కడ దొరకినపక్షమున మరల కాలికి రాచుకొని శీఘ్రముగా స్వదేశముచేరి ప్రాణరక్షణము చేసికోవలెనన్న బుద్ధి పుట్టినది. నే నేవైపునఁ జూడ్కినిగిడ్చినను దుత్తూరపర్ణి యొక్కమొక్కయి నను చుట్టుపట్ల నెక్కడను చూపుమేర దూరములో నాదృష్టికి గోచరముగాలేదు. అప్పుడు మనపూర్వులు మహాబుద్ధిమంతులయి దూర

దేశయాత్రలు నిషేధించిన దూరదృష్టియొక్క మహిమ నామనస్సు నకు బోధపడి వారిసర్వజ్ఞత స్పష్టపడినది. ఆహా! మనపూర్వులను బోలిన ధీమంతు లిప్పుడున్న వారిలోను ముందు పుట్టఁబోవువారిలోను కూడ నుండరు. అప్పుడు మనపెద్దలబుద్ధిని మెచ్చుకొనుచు వారి యందు ప్రాజ్యతాబుద్ధి కలవాఁడనయి నాభాగ్యమింతేయని యెంచు కొని పెద్దలు నిషేధించిన ద్వీపాంతరయానమునకు పూనినపాపఫల మనుభవింపక తీఱదని నిశ్చయము చేసికొని, వడవడ వడఁకుచు ప్రాణ ములమీఁది యాశ వదలుకొని ఈశ్వరనామస్మరణము చేసికొనుచు చెట్టుక్రింద నిలువఁబడి యుంటిని. ఇట్లుండఁగా గాలిచేత మఱ్ఱిపండొ కటి నాకాలిసమీపమున రాలి కుండపగిలినట్లు బళ్ళున పగిలినది. ఈశ్వరకటాక్షముచేత పండు కొంచెము దూరముగా పడినదికాని నాన త్తిమీఁదనే పడినపక్షమున తల రెండు వ్రక్కలయి మీకీవృత్తాం తమును చెప్పువారు లేక నేనీపాటికి స్వర్గలోకమున ప్రాఁతికాపునయి యుండియుందును. ఈనాయాపదల కన్నిటికిని హూణులు చేసిన భూగోళశాస్త్రము మూలము. వారిశాస్త్రములను వేనిని నమ్మనివాఁ డనయినను వారు దేశములను తిరిగి చూచివచ్చి సత్యము వ్రాసినా రన్న విశ్వాసముచేత లంక యనఁగా నాకుచెప్పినట్లు సింహళద్వీపము నియు, అక్కడ మనవంటి మనుష్యులే యున్నారనియు, వారు వ్రాసిన వ్రాఁతలు నమ్మి భ్రమపడి మోసపోయి యీయాపదలను తెచ్చుకొ న్నాను. కాని సత్యమునకు లంకయనఁగా సింహళద్వీపముకాదు సుండీ. అదివేఱు ; ఇదివేఱు. ఈరెంటికినిగల భేదమునుగూర్చి మీకు ముందు ప్రకరణమునందుఁ దెలిపెదను. మహారణ్యమధ్యమున నేనిట్లు భయభ్రాంతుఁడనయి యున్న సమయములో గోరుచుట్టుమీఁద రోకటి పోటు పడ్డట్టు మఱియొకవిత్తుకూడ సంప్రాప్తమైనది. దిగ్భ్రమనొంది నేను దిక్కులు చూచుచుండగా నిరువదిముప్పది యడుగుల యెత్తు

గల నల్లని దిగంబరపురుషవిగ్రహ మొకటి నావంక నడిచి రా నారం భించెను. ఆ ఘోరరూపము నాకంటఁబడఁగానే పురాణములలో వర్ణింపబడిన రాక్షసుల రూపములును కథలును స్మరణకువచ్చి యది తప్పక రాక్షసదేశమని ఆక్రూర రాక్షసుని నాఁటిసాయంకాల భోజనమునకు నేనే ప్రథమకబళము నగుదుననియు తోఁచి నామన స్సులో నానావిధములైన యూహలుత్పన్నములు కానారంభించినవి. నేను కన్నులెత్తియా వికృతవిగ్రహమువంకఁజూచునప్పటికి ముందుగా పెద్దగోడుగంతయున్న యాభీకరముఖమునందు నిప్పుబంతులవలెనున్న వెలగపండ్లంతలేసి మిడిగ్రుడ్లు రెండు నిప్పులుగ్రక్కుచుఁ గానఁబడినవి ; అటుతరువాత మొసలినోరంత నోటిలో పులిగోళ్లను మించియున్న తెల్లని వ్రేలెడేసిమునిపండ్లు భయంకరముగా గానఁబడి నాదృష్టిని మిఱుమిట్లు కొల్పినవి. అంతట నే నాఘోరాకారమును జూడలేక కన్నులు మూసికొన్నాను. కాటుక కొండవలె నడిచివచ్చుచున్న యావి గ్రహము సమీపింపఁగానే నాదేహము నిలువునచెమర్చి కంపమెత్తి నది ; నాలుకతడఁబడి నోట మాట రాకపోయినది ; భయపడి ప్రాణ ములెక్కడకు లేచిపోయినవోకాని దేహస్మృతి సహితము తప్పిపో యినది. ఆ క్షణముననే నేను మూర్ఛలోమునిఁగి శవమువలెనయి మొదలునఱికిన వృక్షమువలె క్రిందపడిపోయినాను. అటుపిమ్మట నక్కడ నేమిజరగినదో నాకు తెలియదు.

నాప్రాణము లెంతసేపటికి మరల వచ్చి నాబొందిలో చేరుకొ న్నవో నేను నిశ్చయముగా చెప్పలేనుగాని యవి చేరినపిమ్మట నేను కన్నులువిచ్చి చూచునప్పటికి నేను మునుపున్నచోట లేక భూమి కిరు వదియడుగుల యెత్తున చెట్టుక్రింద నాకగపడిన రాక్షసునియొక్క యొకయఱచేతిలో నున్నాను. వానియొక్క రెండవచేతి వ్రేళ్ళు రెండు నావడుమును చుట్టుకొనియున్నవి. నాతొడలకంటెను నెక్కువలావుగా

చున్న యావ్రేళ్ళసందుమ నడకొత్తులోని ప్రోకలాగున నిఱుకుకొని బాధపడుచు పయివంకఁ జూచునప్పటికి వానిముఖమప్పుడు సమీపమున నాకు మఱింత స్పష్టముగాఁ గానఁబడినది. తెఱచియున్న వాని నోరు పర్వతగుహావలె నున్నది; నాలుక గుహాలోనుండి పయికివెడలుచున్న కొండచిలువవలెనున్నది; దంతము లా కొండ చిలువను పట్టుకొనుటకయి చాలుపుగావచ్చి ముక్కులుచాచి క్రిందను మీఁదను గుహాముఖమున నిలుచున్న గరుడపక్షులవలె నున్నవి. ఆస్థితిచూచి నప్పుడా రాక్షసుఁడు గుటుక్కున మ్రింగుటకయి నోర వేసికొనఁ బోవుచున్నాఁడని భావించి, ఆక్రూరకృత్యమును చూడలేక మొగము వెనుక ప్రక్కకు త్రిప్పుకొన్నాను. అట్లు మొగము త్రిప్పు కొనఁగానే ముల్లుపుచ్చి కొఱ్ఱుడచినట్లు కొంటికంటెను ఘోరతరమైన వికృతరూపమొకటి నాకన్నులను వెఱపుగొలుపుచు నావెనుకతట్టున నిలువఁబడియున్నది. ఈక్రొత్తవిగ్రహము నాకంటఁబడఁగానే నన్ను చేతిలోఁ బెట్టుకొనియున్న యారాక్షసవిగ్రహము దానిముందు కేవలశిశుప్రాయమయినది. మొదటి రాక్షసవిగ్రహ మీనూతన రాక్షసవిగ్రహము మొలవద్దకయినను రాలేదు. మొదటి విగ్రహముకంటె మూఁడంతలున్న యీవిగ్రహ మెంతపెద్దదిగా నుండునో దీనిని చదివెడివారే యూహించుకోవచ్చును. సమస్తావయవములును మొదటిగ్రహమునకున్న దానికంటె మూఁడేసిరెట్లున్నవి. ఆవిగ్రహముయొక్క మొగము చూడవలెనని నేను తలయెత్తినిగాని దేవాలయములోని గాలిగోపురముయొక్క శిఖరమువలె నున్న యాతనిశిరస్సు తిన్నగా కంటికి కనఁబడినదిగాదు. అడవిపందియొక్క వెన్నుమీఁది నిడుదవెండ్రుకలవలె నున్న యాతని కడుపుమీఁద నూగారు నడుమ నాదృష్టి కడ్డమువచ్చి బెదరింపఁగా క్షణకాలము తొలఁగిపోయిన భయదేవత మరలవచ్చి నాహృదయములోఁ బ్రవేశించి నాకన్నులను మూఁతవేసినది; అంగ

ముల నల్లలనాడించినది ; మొగమును వెలవెలఁబాఱించినది; ప్రాణములను బాఱఁద్రోలి శరీరమునంతను మరల వివశముచేసినది. ఇట్లు కొంతసేపు మరలమూర్ఛపోయి రెండవసారి తెలివి తెచ్చుకొని కన్నులు విచ్చి చూచునప్పటికి నేను మొదట ననుకొన్నట్లుగా పయికి పిన్న రాక్షసుని నోటిలోనికిఁబోక క్రిందికి భూమిమీఁదికి వచ్చి యున్నాను. అప్పుడు భూమిమీఁదనున్న నన్నాయిరువురు రాక్షసులును మోఁకాళ్ళమీఁద గూరుచుండి వంగి నాయవయవములను శోధించి చూచుచున్నారు. ఆసమయమునందు నేను కదలి భూమిమీఁద నడువనారంభింపఁగా వారు సంతోషించి తమలోతామేమో చెప్పుకొని నన్ను మరల చేతులతోఁబట్టి మనదేశమునందు పిల్లలు పక్షిపిల్లలను బట్టలలోఁ బెట్టుకొని తీసికొనిపోవునట్లు నన్ను తమ బట్టలలోఁ బెట్టుకొని మఱి యొక యింటికిఁ గొనిపోయి వాకిట బల్లమీఁదఁ గూరుచుండి చదువుకొనుచున్న మఱియొక రాక్షసుని జూచి నమస్కరించి యాతనితో నేమేమోచెప్పి మెల్లగా నన్నాతని బల్లమీఁదఁ బెట్టిరి. ఆతఁడును నన్ను మొట్టమొదట తన చేతిలోనున్న పుస్తకముతో మెల్లగా కదల్చిచూచి, కొంతసేపు నా మొగమువంకను చేతులవంకను వంగిచూచి యాశ్చర్యపడి, పురుగును కఱచిపోవునేమోయని భయపడి మనము నేర్పుతో పట్టుకొనునట్లు మెల్లగా తనచేయి నా వెనుకకుఁ బోనిచ్చి సాహసించి చటుక్కున ముందఱి వ్రేళ్ళతో నానడుము పట్టుకొని పయికెత్తి, వెల్లవెలికిలఁబట్టి మొగముచేరువను బెట్టుకొని కొంతసేపు నన్ను నిదానించిచూచి చిఱునవ్వునవ్వి, నన్ను మెల్లగా మరల బల్లమీఁదఁ బెట్టెను. కఱతునో కుట్టుదునోయన్న భయముచేత నన్నతఁడు గట్టిగా పట్టుకొన్నందున వ్రేళ్ళమొత్తదనముచేత నానడుము నలిగి తరువాత మూఁడు దినములవఱకును నా నడుమునొప్పి పోయినదికాదు.

నన్ను మొట్టమొదట మఱ్ఱిచెట్టుక్రిందచూచినవాఁడు నాలుగేండ్ల ప్రాయముగల బాలుఁడు. బాలుఁడైన హేతువుచేతనే యాపిల్లవాఁడు దిగంబరుఁడుగా నున్నాఁడుగాని యీలంకలోని కాఁపులందఱును దేశములవారు కారు. అక్కడ పెద్దవాండ్రందఱును మనవలెనే తమకు తగిన వస్త్రములను ధరించుకొందురు. ఆబాలుఁడాడుకొనుటకయి యూరివెలుపలనున్న మఱ్ఱిచెట్టువద్దకువచ్చి నన్నుచూచి మూర్ఛపోయి యున్నప్పుడు పసివాఁడగుటచేత నన్ను నిర్భయముగా పిల్లికూనవలె తన యింటికిఁ బట్టుకొనిపోయి నేను మూర్ఛతేఱునప్పటికి నన్ను తన తండ్రికి చూపుచుండెను. అతఁడును నన్నాశ్చర్యపడిచూచి మనుష్యరూపమున నంతచిన్న జంతువున్నవార్త యెప్పుడును విననందున, ఇటువంటి యద్భుతవస్తువును గొనిపోయి తన యజమానునికి కానుకిచ్చుట యుక్తమనిభావించి తక్షణమేకొనిపోయి యాతనికి సమర్పించెను. అతఁడును నారూపమును జూచి వింతపడి, అంతచిన్నదిగా నున్నను మనుష్యరూపమగుటకు సందేహము లేదని నిశ్చయించి అయినను లంకాద్వీపము జ్యోతిష భూమియగుట చేత జ్యోతిష్కుల నడిగి మఱి సిద్ధాంతముచేయుట మంచిదని యెంచి, జ్యోస్యుల నిమిత్తము సేవకులను బంపెను. ముహూర్తగ్రంథములను జాతక గ్రంథములను, సాముద్రిక గ్రంథములను చేతఁబట్టుకొని కొంచెము సేపటికి నలుగురు సిద్ధాంతు లక్కడకువచ్చిరి. అప్పుడతఁడు నన్నా కాలజ్ఞులకు చూపఁగా వారు నేనేజాతి జంతువునో నిర్ధారణము చేయుటకై గ్రహగతులను విచారించియు శ్వాసలు పరీక్షించియు శకునములను జూచియు గణనవేయుట కారంభించిరి. ఆజ్యోతిష్కులలో నిద్దఱు మంచి పురాణవేత్తలు. మనదేశమునందువలెనే యీదేశమునందును పురాణములున్నవి. వారిలోనొకపురాణవేత్త కొంచెముసేపాలోచించి యొకచోట కలియుగములో నేల ము

లగచెట్లకు నిచ్చెనలు వేయునంతటి హ్రస్వాంగులుపుట్టుదురని చెప్పియున్నందున నట్టివారిలో నేను ప్రథముఁడనని చెప్పెను. ఇంకొక పురాణవేత్త తనవ్రేలితో నన్ను గొలిచి వాలఖిల్యాదులను యోగిశ్రేష్ఠులు అంగుష్ఠమాత్రశరీరు లుందురని పురాణములలోఁ జెప్పియున్నందున నేను వాలఖిల్యాదులసంతతివాఁడ నని చెప్పెను. ఇట్లు పురాణమార్గమున మాత్రమేకాక తరువాత నలుగురు సిద్ధాంతులును జ్యోతిషమార్గమునకూడ నాలోచించి నేను మనుష్యుఁడనని యేకవాక్యముగాఁ బలికిరి. క్రొత్తగాఁ బోయినవానికి నీకునారిసిద్ధాంతములన్నియు నెట్లు తెలిసినవని కొందఱుప్రశ్న వేయవచ్చును. నాకప్పుడా సంగతు లేవియు తెలియనేలేదు. తరువాత. కొంతకాలము వారిదేశములోనుండి నేను వారిభాష నేర్చుకొన్న తరువాత నాకీసంగతు లన్నియు వారు చెప్పఁగా బోధపడినవి. వారిభాష కొన్ని దేశ్యపదములతోఁ గలిసియున్నను విశేషభాగము సంస్కృతపదములతో నిండియున్నది. అందుచేత మన భరతఖండనివాసులకు వారిభాష నేర్చుకొనుట మిక్కిలి సులభము. నేను వారిభాష నేర్చుకొన్న క్రమము చెప్పబూనుకొన్నచో మీకింపుగా నుండకపోవచ్చునని యెంచి మీకావివరములు చెప్పక నేను మూఁడుమాసములలో వారిభాష నొకవిధముగా మాటాడుటకు నేర్చుకొన్నానని మాత్రము విన్నవించుచున్నాను. ఇట్టి స్వల్పాంశములనుగూర్చికూడ వివరములు వినవలెనని వేడుకపడువారు కొందఱున్న పక్షమున, వారు శ్రద్ధాళువులయి నాయొద్దకు వత్తురేని నేను మర్మము విడిచి వారికి సమస్తమును తనివిదీఱ వినిపించెదను.

## రెండవ ప్రకరణము.

---

మొదటి ప్రకరణములో నేను జెప్పిన సత్యములను విన్నవారు నా సత్యసంధతనుగూర్చి సంశయపడక పోయినను మనుష్యాశనుల దేశమునకుఁబోయి వారిచేతి భక్షింపఁబడక యొక్కమనుష్యుఁ డెట్లు మనకీ కథలను జెప్పుటకు జీవింపఁ గలిగినాఁడని యాశ్చర్యపడకపోరు. నేను రాక్షసులచే భక్షింపఁబడక పోవుటకుఁ గారణము లనేకములు కలవు. అందు ప్రధానమయినది నే నాఁడుమనస్కూళములో నేర్చుకొన్న మంత్రమహిమ. రెండవది యీకాలమునందు రాక్షసులు మనుష్య భక్షణమును మానుకొనుట. "వ్యాఘ్రము లెప్పుడయిన మాంసాశనము మానివేయునా ? స్వభావముచేత మర్త్యాశనులయిన దనుజులు మనుజ భోజనము త్యజించుట యెట్లుసంభవించును ? ఈవార్త నమ్మదగియుండ లేదు." అని మనకర్మ జ్యేష్ఠులయిన శ్రోత్రియులొకవేళ నామాటలు పూర్వపక్షముచేయఁ జూడవచ్చును. అయినను సత్యమెప్పుడును సత్యమే యగును. సూర్యచంద్రాదుల గతులు తప్పినను తప్పవచ్చును. గాని నానోటినుండి మాత్ర మసత్య మెప్పుడును రాదు. నేను సూర్యుఁడు పశ్చిమమున నుదయించి దక్షిణమున నస్తమించునన్నను నామాట సత్యముకావలసినదే. నాయథార్థమును పరీక్షించుటకయి మీలో నెవ్వరయిన నీదేశమున కొక్కసారి నావెంట వచ్చినపక్షమున మీకు నాసత్యవాక్య ధురీణత బట్టబయలగును. దానవులు మానవాశనతను మానుటకును కారణము లేకపోలేదు. దానికిని రెండు కారణములున్నవి. అందొకటి మనుష్యులు క్రమక్రమముగా హ్రస్వశరీరులగుచు వచ్చుట చేత నెందఱినిభక్షించినను నొక్క ముద్దకయినను చాలకపోవుట. రెండవది విభీషణుఁడు లంకాధిపత్యము వహించి రాక్షసరాజయిన

తరువాత శ్రీరాములవారి మీఁదఁగల భక్తిచేత నింకముందు రాక్షసు లెవ్వరును మనుష్యభక్షణము చేయఁగూడదని శాసనముచేయుట. ఇప్పటి కిని లంకారాజ్యమును విభీషణుఁడే యేలుచుండుటచేత రాజశాస నమునుబట్టి రాక్షసులు మనుష్యాశనత్వమును విడిచిపెట్టి కొమపాపు లైనను మనుష్యసంచారముగల దేశములకు బోవుట పూర్తిగా మాను కొన్నారు. నామాటయొక్క సత్యమును సిద్ధాంతపఱుచుటకయి మన దేశమునకిప్పుడు రాక్షసులు రాకుండుటయే ప్రత్యక్షనిదర్శనముకదా? విభీషణుఁ డిప్పుడు లంకారాజ్యము చేయుచున్నాఁడన్న మాట విన్న వారు "త్రేతాయుగమునందు రాముని పరిజనుఁడైన విభీషణుని కాల మెక్కడ? ఈకలికాలమెక్కడ? అతఁడిప్పుడు లంక నేలుచుండుట యెక్కడ?" అని తెలియనివారు సందేహపడుదురేమో! తెలియనివా రు తమ మనస్సులలో నేమనుకొన్నను తెలిసినవారు మాత్రము విభీష ణుఁడు చిరకాలజీవులలో నగ్రగణ్యుఁడని పురాణములవలన నెఱిఁగి యుండుటచేత నేను చూచివచ్చి చెప్పిన యీసంగతిని గూర్చి యణు మాత్రమును సందేహపడరు. ఈవిభీషణుఁడు రాజయియున్న హేతు వును బట్టియే లంకాద్వీపము సింహళము కాదని వెనుకటి ప్రకరణము నందు వ్యాఖ్యానము చేసియున్న ప్రకారముగా నేనిప్పుడు సిద్ధాంతము చేయఁబోవుచున్నాను. పట్టాభిషేక కాలమందు శ్రీరాములవారే యా చంద్రతారార్కముగా లంక నేలుమని విభీషణునితో నానతిచ్చినందున, యిప్పుడింగ్లీషువా రేలుచున్న సింహళద్వీప మెప్పుడును లంకాద్వీపము కాఁజాలదు. అంతే కాక యీరెండు ద్వీపములకునుగల వైశాల్యాది భేదములనుగూడ విచారింపుఁడు. శ్రీమద్రామాయణములో వాల్మీకు లవారు కిష్కింధాకాండములో

"కో వీరో యోజనశతం లంఘయేచ్ఛ ప్లవంగమః"

అని యేవానరవీరుఁడు లంకకు నూఱుయోజనముల సముద్రమును

దాటునని యంగదుఁ డడిగినట్లు చెప్పియున్నారు. శ్రీవాల్మీకులవారే యుద్ధకాండమునందు

శ్లో. "దశయోజనవిస్తీర్ణం శతయోజనమాయతం
దదృశుర్దేవగంధర్వా నలసేతుం సుదుష్కరం."

అని నలుఁడు నూఱుయోజనముల పొడుగును పదియోజనముల వెడల్పుగల సేతువును కట్టినట్లు సెలవిచ్చియున్నారు. సింహాళమే లంక యైనపక్షమున, రామేశ్వరమునకును లంకకును మధ్యనున్న సముద్రము నూఱుయోజనముల వెడల్పు గలదయి యుండవలెనుగదా ? నూఱుయోజనములనగా వేయిమైళ్ళు ; వేయిమైళ్ళమాటయటుండఁగా నూఱుమైళ్ళయినను లేక రామేశ్వరమునకును సింహాళద్వీపమునకును మధ్యనున్న సముద్ర మింగ్లీషువారి లెక్కప్రకారమే అఱువదిమైళ్ళున్నది. రామేశ్వరమున కఱువదిమైళ్ళదూరములోనుండి మిక్కిలి సడుపైనచోట ౨౭౦ మైళ్ళును, మిక్కిలి వెడల్పయినచోట ౧౩౦ మైళ్ళును గల చిన్న సింహాళద్వీప మెన్నఁడయిన లంకాద్వీపము కానేర్చునా ? సింహాళమునకును రామేశ్వరమునకును నడుమనున్న యిసుకతిన్నెలే సేతువయినపక్షమున, పూర్వ మాంజనేయాదివానరవీరులు హిమవత్పర్వతాదులనుండి విఱిచి తెచ్చి పడవేసిన పర్వతశిఖరములన్నియు నేమయిపోయినవి ? సింహాళమే లంకయైన పక్షమున అందు మహాసత్త్వులయిన రాక్షససత్త్వములుండక దుర్బలులైన యఱవవాండ్రును సింగాలీవాండ్రును కాపురమేలయుందురు ? కాఁబట్టి యిట్టిహేతులను చక్కగా పరిశీలించి హూణులు వ్రాసిన గ్రంథములను విశ్వసింపక, సింహాళద్వీపము లంక కాదనియు నేనిప్పుడుపోయి చూచినదియే రావణలంక యనియు మీరు దృఢముగా నమ్ముఁడు.

మనమిఁక భూగోళశాస్త్ర ప్రసంగమును కొంచెముసేపు చాలించి ప్రస్తుతకార్యాంశమునకు వత్తము. నాక్రొత్త యజమానుని పేరు

మహాకాయుఁడు. ఆనామధేయముచేతనే యతఁడు రాజబంధువుఁడయినట్లు మీరూహింపవచ్చును. అతఁడు నాయందు పుత్రవాత్సల్యము కలవాఁడయి నాయన్నపానాదులను గూర్చి ప్రతిదినమును తానే విచారించుచు, మూషికమార్జాలాది జంతువులవలన నాకేవిధమయిన యపాయమును గలుగకుండ రక్షించుచుండుటకయి యెనిమిదేండ్ల ప్రాయముగల తనపుత్రికకు నన్నొప్పగించెను. మూషికమార్జాలాదుల వలన మనుష్యునకు భయమేమని మీరనుకొనఁగూడదు. అక్కడి యెలుకలు మనదేశపు కుక్కలంత లేసియుండును. ఇఁక పిల్లులన్ననో మన గోవులకంటె కొంచెముపెద్దవి. కాఁబట్టి యిట్టి పెద్దజంతువులవలన నావంటి యల్పశరీరికపాయము సంభవించుట యేమియాశ్చర్యము? నేనక్కడకుపోయిన మూఁడవనాఁడే నాకొక్క గొప్పగండము తప్పిపోయినది. మీరాకథవిన్నచో నాసమయోచిత బుద్ధికిని నిరుపమానధైర్యసాహసములకును మహాశ్చర్యనిమగ్న మానసులు కాకమానరు. నేనిప్పుడు చెప్పఁబోవు చిన్నదాని వేడుకకొఱకయి యింటివారు రెండు కంచిమేఁకలను పెంచినారు. అందొకటి వారముదినములక్రిందట రెండు పిల్లలనుపెట్టినది. వానినొకటితల్లి పాలుత్రాగి యాటలకయి చెంగుచెంగున గంతులువేయుచు నేను నిలుచున్న వైపునకు పరుగెత్తుకొని రా మొదలుపెట్టెను. అటువంటి మహాజంతువు మృత్యుదేవతవలె నామీఁదికిపరుగెత్తుకొనివచ్చుచున్నప్పుడు బ్రాహ్మణుఁడనయ్యును నేనణుమాత్రమును జంకక వెనుకంజవేయక, వ్యాఘ్రములు మొదలయిన క్రూరజంతువులు సహితముప్రతిఘటించి నిలువఁబడినవారిమీఁదికి వచ్చుటకుభయపడునని వేఁటకాండ్రవలన మనదేశమునందు విన్నమాటనుబట్టి వీరభటునివలె ధైర్యముతో దానికెదురుగా నిలువఁబడితిని. అయినను మనదేశపు పులులకంటెను నధికసాహసము గలదయి యామేకపిల్ల నాశూరగుణమును ప్రత్యక్షముగాఁజూచియు వెఱచి వెనుకదీయక తలవంచుకొని నా

మీఁది కొక్కుదుముకు దుమికెను. నేనప్పుడు సమయోచితబుద్ధిగల వాఁడనయి ప్రక్కకు తొలఁగి తప్పించుకొని యమపాశములవంటి నా బాహుపాశములను దాని మెడకు తగిలించియుండనిపక్షమున, వజ్రాయుధములవంటి దానిముందటికాళ్ళగిట్టలు రెండును నాఱొమ్ముమీఁదఁబడి ప్రాణాపాయము చేయలేక పోయినను బలమయినగాయమునైనఁ జేసియుండును. అది మెడపట్టు వదల్చుకొనవలెనని పెనఁగులాడఁగా, పట్టువదలినపక్షమున నన్నది కాళ్ళక్రింద నలగఁద్రొక్కునని నేను భల్లూకపుపట్టుపట్టి వదలకపోఁగా, అంతటమాయిరువురకును భారతయోధులకువలె ఘోరమయిన ద్వంద్వయుద్ధ మారంభమయినది. బాహాబాహిని దంతాదంతిని నఖానఖిని నేనుజేసిన యామహాయుద్ధములో నేనక్షతశరీరుఁడనయి నాశత్రువును రెండుమూఁడుచోట్ల గాయపఱచి విజయోన్ముఖుఁడనయి యుండఁగా, ఆమేఁకపిల్ల ప్రాణరక్షణార్థమయి కడపటిప్రయత్నముచేసి పర్వతగుహలు మాఱు మ్రోయునట్లు మావుమని యొక్కసింహనాదముచేసె తనబలమంతను జూపి నన్ను బీరపాదు మొదటికీడ్చెను. నాబలశౌర్యము లేమనిచెప్పను! అంతచేసినను నాపట్టు నేను విడువలేదు. అది రాక్షసభూమి యగుటచేత దేవతలు రావెఱచిరిగాని ఆరణరంగమే మనపుణ్యభూమియైనపక్షమున నాశౌర్యవీర్యధైర్యములకు నామీఁద తప్పక దివినుండి సురలు విరులవాన కురిసి యుందురు. నాశౌర్యకీర్తనలను విద్యాధరకాంతలు దిగంతములయందు తమనూతనగీతములతో గానముచేసియున్న పక్షమున, బ్రాహ్మణులు రణభీరువులని లోకములో నీవఱకు క్రమముగా వ్యాపించియున్న యపవాద మొక్కనిమిషములో పటాపంచలయి పోయియుండును. అయినను నాకంటెముందు భారతయుద్ధమునందు ద్రోణకృపాశ్వత్థామాది బ్రాహ్మణోత్తములుచూపిన శౌర్యమువలననే యీ యపనింద కొంతవఱకు తొలఁగిపోయినది. ఆసంగతి యటుండే

నిండు. ఇట్లు యోధానుయోధుల మయి మేమిరువురమును బీరపాదు మొదలు చేరునప్పటికిమా కాలు నేలమీఁదనిలువక జారఁగా పట్టు వదలి మే ముభయపేరులమును చుట్టచుట్టుకొని క్రొత్తగా సేవకులు పేరుపోయుటచే మహార్ణవమువలె నిండియున్న యాపాదులోఁ బడితిమి. దైవికముగా నింతలో లోపలినుండి నాయజమానునికూఁతు రేదో పనిమీఁద మాయుద్ధభూమికి వచ్చి మమ్మిద్దఱను పయికిఁదీసి విడిపించెను. ఈశ్వరానుగ్రహమువలన నాకిప్పుడు స్థలగండ మొకటియు జలగండ మొకటియు రెండు గండములు తొలఁగిపోయినవి. "మనిషి కాటుకు మందులేదు." అని మన దేశమునందు పామరు లూరక పలుకుదురు గాని నేను దయాగుణప్రధానులగు బ్రాహ్మణకోటిలోఁ జేరినవాఁడనగుటచేతనో మఱి యేహేతువుచేతనో నాకాట్లాఛాగశిశువున కేవిధమయిన యపాయమును జేయలేదు; తుదకు దానిచర్మము నైనను ఛేదించలేదు. ఛాగశాబక బ్రాహ్మణకుమారసమరోపాఖ్యానం బను నీపుణ్యకథను విన్నవారును భక్తితోఁ జదివినవారును స్థల జలగండములనుండి విముక్తులయి సర్వకార్యములయందును విజయము నొందుదురు. దీనికి సందేహించినవా రథోగతులగుదురు. ఈప్రథమయుద్ధ మయినతరువాత నొకనాఁడు నాయీచతుష్పాద శత్రువు మరల నామీఁదికి రాఁజూచినదిగాని, నేను ముందుగానే జాగరూకతపడి పూర్వానుభవమువలన ద్వంద్వయుద్ధముమాని దూరము నుండియే శిలాయుద్ధముచేసి దానిని తఱిమివేసి శత్రువిజయము పొందినాను. ఇటువంటి యపాయములు మరలమరల వచ్చుచుండునని భయపడి యాచిన్నది తనతండ్రిగారితోఁ జెప్పి తనబొమ్మరింట నొక మూలను చిలుకపంజరము నొకదానిని బెట్టించి నాకు నిరపాయమయినగది నమర్చుటయేకాక, ఒకగిన్నెలో నీరుపోసి నన్నందుఁ బడవేసి మునిగిపోకుండ తనచేతులతోఁ బట్టుకొని దినమునకు రెండేసి మా

ఉలుచొప్పున నా కీతసేర్చి కొన్ని దినములలో జలమునకు భయపడ వలసిన యావశ్యకము లేకుండఁ జేసెను. ఇట్లు సుభోపాయములుచేసి నాప్రాణరక్షణముచేసిన పుణ్యాత్మురాలయిన యాబాలికపేరు మందోదరి. ఆదేశమునందు నడచిన నాయద్భుతచర్య లిట్టి వసంతములు గలవుగాని, నేనే వాని నన్నిటిని బ్రశంసింపఁ బూనినచో నాత్మస్తుతి గానుండునని యావర్ణన నింక మానివేయుచున్నాను. దివ్యజ్ఞాన మానసీయులయిన మహాత్ము లెవ్వరైనఁ బనిపూని యీయమానుష చర్యలు నశింపనీక లోకోపకారార్థముగా మహావాయువులో ముద్రితమయియున్న లిపిని జూచి ప్రచురింతురుగాక!

మందోదరియొద్ద నొక నాఁటిప్రాతఃకాలమున నే నొంటిగాఁ గూరుచుండి మనదేశవిశేషములనుగూర్చి ముచ్చటించుచుండఁగా లోపలినుండి యొకక్రొత్తపురుషుఁడు వచ్చి నన్ను "సత్యా!" అని పిలిచి పలుకరించెను. సత్యరాజాచార్యులని నాపేరంతయు నుచ్చరించుట కష్టముగా నున్నందున, ఇంటివారు నన్ను సత్యుఁడన్న సంగ్రహనామముతో పిలుచుచుండిరి. నా మొగమెన్నఁడును జూడని యీక్రొత్తవాఁడు నాపేరెట్లెఱుఁగఁ గలిగెనని నాలో నే నాశ్చర్యపడుచు మాఱుమాట చెప్పక తెల్లపోయి చూచుచుండఁగా, ఆపురుషుఁడంతలో తన రూపమును మార్చి నాయజమానుఁడయిన మహాకాయుఁడయి "యిప్పుడయిన నన్నెఱుఁగుదువా?" అని మరల నడిగెను. ఇది యేమో యింద్రజాలమయి యుండునని నాయద్భుతమప్పుడు మఱింత యెక్కువకాఁగా నానోటినుండి బొత్తిగానే మాటవచ్చినదికాదు. వినోదముకొఱకు కామరూపమును జూపిన నన్నుఁజూచి యిట్లేల యింత యాశ్చర్యపడుచున్నావని నాయజమానుఁ డడుగఁగా నేనప్పుడు మన పురాణములలోని రాక్షసమాయలును కామరూపములును స్మరణకుఁ దెచ్చుకొని, పూర్వము మారీచుఁడు మాయలేడి యగుటయు

వాతాపి మేకయగుటయు శూర్పణఖ మనుష్యస్త్రీ యగుటయుఁ దలఁచుకొని మనస్సు సమాధాన పఱచుకొని, ఇప్పుడు తెలిసినదని గద్గదస్వరముతో నుత్తరము చెప్పితినిగాని నామాట యాతనికి వినఁబడినదికాదు. ఆదేశమునందు మాసంభాషణములో నాకొక్క పెద్ద కష్టమువచ్చినది. నేనెంత బిగ్గరగా నఱచినను వారిరాకాసిచెవులకు నామాటలు గుసగుసలకంటె నెక్కువ స్పష్టముగా వినఁబడకుండెను. వారెంతమెల్లగా నేకాంతమాడినను వారి మాటలు నాసూక్ష్మ శ్రవణములకు పిడుగులవలె కర్ణకఠోరములుగా వినబడుచుండెను. అందుచేత నచ్చటి నిరంతరశబ్దములచేత నాచెవులు చెవుడుపడకుండ నేను కర్ణరంధ్రములలో గుడ్డలు క్రుక్కుకోవలసివచ్చినది. వారు నాతో మాటాడవలసినప్పుడెల్ల నన్ను చేతులతోఁ బయికెత్తి చెవులచెంతఁ బెట్టుకొని గట్టిగా మాటాడుమనుచుండిరి. దీనినిబట్టి మనుష్యులమయిన మన కున్న శ్రవణేంద్రియపటుత్వమును సూక్ష్మశబ్దగ్రహణశక్తియు రాక్షసులకు లేవనుట స్పష్టమేకదా! అయినను మనకంటె వారియొద్ద కామరూపమొకటి విశేషముగా నున్నది. సర్వసముఁడయిన యీశ్వరుఁ డొక్కొక్కసృష్టి యం దొక్కొక్క విశేషమును బెట్టుచుండును. కామరూపు లగుటచేత రాక్షసులు తామేరూపమును పొందఁగోరినను సంకల్పమాత్రమునఁ దా మారూపము ననాయాసముగా పొందఁగలుగుదురు. అయినను వారు సూక్ష్మరూపములను ధరింపఁ గోరినప్పుడు చీమలవలెను దోమలవలెను కాఁజాలుదురేగాని నావంటి సూక్ష్మమనుష్య రూపమును ధరింపవలెనన్న యూహ యీవఱకెన్నఁడును వారిలో నెవ్వరికిని కలుగలేదు. అందుచేతనే నారూపమును జూచుటచేత నాదేశమునం దెల్లవారికిని నత్యాశ్చర్యము కలిగెను.

ఆదినము నాయజమానుఁడు మనస్సులో నొక్కింత యుల్లాసముగా నున్నందున నానావిషయములనుగూర్చి నాతో సల్లాపించుచు తన పెద్దల ప్రసంగము తెచ్చెను. అప్పుడు నేనందుకొని పూర్వచరిత్రమును తెలిసికొనవలెనన్న యభిలాషతో రామాయణమునందు వర్ణింపఁబడిన రావణుని మంత్రియైన మహాకాయుఁడు మీకేమికావలెనని యడిగితిని. అతఁడు పయివంకఁజూచి ప్రేళ్ళుమడిచి లెక్కవేసి యాతఁడు తన వంశమునకు మూలపురుషుఁడగుటయు, తానాతనికి పండ్రెండవ పురుషుఁడగుటయు, చెప్పి వెచ్చనూర్చెను. నేను ప్రేళ్ళు మడచి యుగప్రమాణమునుబట్టి రామరావణ యుద్ధము జరిగిన త్రేతాయుగమునుండి లెక్కవేసి, ద్వాపరయుగ ప్రమాణ సౌరసంవత్సరములు ౮౬౪౦౦౦ లతోను కలియుగమునం దిప్పటికి భుక్తమయిన ౪౯౯౨ సంవత్సరములను జేర్చి ౮౬౮౯౯౨ మొత్తము తేల్చి, దానిని పండ్రెంటిచేత భాగించి యొక్కొక్క తరమువారి జీవితకాలము ౭౨౪౧౬ సంవత్సరముల రెండుమాసములని రాక్షసుల యాయుఃప్రమాణమును నిర్ణయముచేసి, మీరు వెచ్చనూర్చిన కారణమేమని నాయజమాను నడిగితిని.

మహాకాయుఁడు—మాపెద్దలస్థితిని దలఁచుకొని యిప్పటివారి యల్పాయుష్కతయు నల్పశక్తియు నల్పకాయత్వమును విచారింపఁగా దేశాభిమానము గలవారి మనస్సులో దుఃఖమెట్లు కలుగకుండును?

సత్య—మీమాటలు నాకు వింతగానున్నవి.

మహా—ఏమివింత? మాపూర్వుఁ డొకఁడు భూమిని చాపగా చుట్టి చంకక్రింద పెట్టుకొని పరుగెత్తెనుగదా! ఆతని శక్తి యెందఱు నిప్పటివారిశక్తియెంత? ఏదీ యిప్పుడొక్కరిని భూమిని కాదుగదా, యీద్వీపమును చాపగాచుట్టుమను చూతము. పూర్వమొక మహాపురుషుఁడు సముద్రము మోకాలిబంటిగా తిరుగుచుండఁగానాతని మేద

స్వత్రోఁగదా యీభూమిచేయఁబడినది! ఇప్పుడు భూమండలమంత కాదుగదా శిరస్సులో మాద్వీపమంత మెదడున్నవాని నొక్కని జూపుము. జనులంతకంత కల్పకాయులగుచున్నందున కీరెయొక్క నిదర్శనము చాలదా? అల్పకాయులు నల్పశక్తులు నగుటచేతనే మావారంతకంత కల్పాయుష్కులుకూడ నగుచున్నారు.

సత్య—త్రేతాయుగమునుండి నేఁటివఱ కొక్క పురుషుఁడే మీలంకను రాజ్యము చేయుచుండఁగా మీవా రల్పాయుష్క లనెద రేమి ?

మహా—చిరకాలజీవి గనుక విభీషణుఁ డొక్కఁడు మాత్ర మింతకాలము రాజ్యము చేసినాఁడు. అప్పుడే రెండు యుగములలో నాతని రాజ్యకాలములోనే పండ్రెండు తరములు చెల్లిపోయినవి. ఆతని కిప్పుడు పండ్రెండవతరమువారు మంత్రులయినారు. తానొక్కఁడు బ్రతికియున్నను భార్యాపుత్రాదులు మృతులగుటచేతనే కదా విరక్తుఁడయి విభీషణుఁ డిప్పుడురాజ్యము మంత్రులకొప్పగించి సువేలాద్రియందు తపస్సుచేయుచున్నాఁడు! ఇట్టిదుష్కాలమును జూచి నేనెట్లు చింతిల్లకుందును ?

సత్య—ఓమహాకాయా! మాదేశస్థితిని దలఁచుకొనఁగా మీకు కలుగుచున్న విచారమే నాకును కలుగుచున్నది. మావారంతకంత కల్పాయుష్కు లగుచున్నారు. పూర్వము దశరథుఁ డఱువది వేల యేండ్లు రాజ్యముచేసినాఁడు. ఇప్పుడాఱునూఱేండ్లు బ్రతికినవాఁడయి నను లేఁడు. అగస్త్యుఁడు సముద్రోదకమునంతను పానముచేసెను. ఇప్పు డొక్క చెఱువెడు నీళ్ళు త్రాగువాఁడయినను లేఁడు.

మహా—పూర్వము మీవా రంతటి స్థూలకాయులుగానుండి నందుననే మాపెద్దలు మనుష్యాశనులయి కడుపునిండ తృప్తిగా భోజనము చేయుచుండెడివారు. నిన్నుఁబట్టిచూడఁగా మీమనుష్యులిప్పుడు

మాకొక్క ముద్దకయినను చాలనట్లు కనఁబడుచున్నారు. అయినను పూర్వాచారము విడిచిపెట్టరాదు. శిష్టాచారమును మీఱుటకంటె లోకములో పాపము మఱొక్కటి లేదు. కలిమహిమచేత చండశాసనుఁడైన మహావిభీషణమహారాజు మనుష్యభక్షణము నిషేధించి పాపము కట్టుకొన్నాఁడు గాని రాక్షసుల కులధర్మమయిన మనుష్యాశనతను మాన్పించి శిష్టాచారము చెడఁగొట్టుట నీతి కాదు. నేనీసంగతి శిష్టాచారము మీఱరాదని చెప్పుచున్నాను గాని యల్పాంగులయిన మనుష్యకీటకములను తినుటచేత మాకడుపులు నిండునని చెప్పుచుండ లేదు.

ఓ భరతఖండ నివాసులారా! ఈతఁడు విభీషణునిపరిపాలనలో నున్నను మనస్సులో తన రాక్షసస్వభావము నెట్లు విడువకున్నాఁడో చూచినారా? నే నధికముగా మాటాడినచో నాపాపాత్ముఁడు నన్నెక్కడ నోరవేసుకొనునో యన్న భీతిచేత మఱేమియు మాటాడక, జీవహింసయు నందులో నరవధయు నంతకంటెను ముఖ్యముగా బ్రహ్మహత్యయు పాపములని చెప్పవలెనని నాలుక చివరకు వచ్చినను బలవంతముగా నాపుకొని యూరకున్నాను. ఇప్పుడు లంకలోఁగూడ రాజభక్తులనఁబడెడు విభీషణ పక్షమువారైన నవనాగరికులు కొందఱు బయలుదేరుచున్నను, మహాకాయుఁడు పూర్వాచారపరాయణులయిన శిష్టాగ్రగణ్యులలోనివాఁడు. ఈకథ సాగినకొలఁదిని లంకలోనున్న యిరుతెగలవారి చరిత్రములును గొంతకొంత వచ్చును గనుక ప్రస్తుతమావిషయమును విడిచిపెట్టుచున్నాను.

## మూఁడవ ప్రకరణము.

కొందఱక్కడక్కడ శాస్త్రవిశ్వాసములేని నాస్తికవాదు లిప్పుడిప్పుడుద్భవిల్లు చున్నను మనదేశమునందువలెనే లంకాద్వీపమునందును సాధారణముగా జనులు శాస్త్రబద్ధులయి పూర్వాచారపరాయణులయిన శిష్టులుగానే యున్నారు. అందులోను వారికి పరమప్రామాణికమయిన జ్యోతిషశాస్త్రమునందు విశ్వాసమత్యధికము. ఒక్క జ్యోతిశ్శాస్త్రమే లేకయుండినయెడల ఆదేశమునం దేవ్యవహారమునందును సత్యము గనుఁగొనుటయే దుర్లభముగానుండి యుండును. అక్కడి జనులందఱును కామరూపులగుటనుబట్టి తమ తమ యిచ్ఛవచ్చిన రూపములను ధరించి చౌర్యము మొదలయిన నేరములను జేయ సమర్థులగుటచేత సాక్షులను విమర్శించి వారినిదండించుట సాధ్యముకాదు. వృశ్చికరోముఁడు సర్పరోమునిరూపమును ధరించి వచ్చి దొంగతనము చేసినప్పుడును, సర్పరోముఁడు వృశ్చికరోమునిరూపమును ధరించి వచ్చివాని భార్యతో వ్యభిచరించినప్పుడును, దీర్ఘనాసుఁడు హ్రస్వనాసుని రూపము ధరించివచ్చి హత్యచేసినప్పుడును, హ్రస్వనాసుఁడు దీర్ఘనాసుని రూపమునుధరించివచ్చి యొరునియింటికి నిప్పంటించినప్పుడును, చూచినవారిని పరీక్షచేసి యపరాధులను శిక్షింపఁబూనినచో దోషులు తప్పించుకొనిపోవుటయు నిష్కారణముగా నిర్దోషులకు శిక్షలగుటయు తటస్థించునుగదా! కాఁబట్టియే యక్కడివారు నేరములను విమర్శించుటకయి సాక్ష్యమును మానివేసి న్యాయసభలలో నెల్ల సత్యమును గనుఁగొనుటకై యయిదుగురేసి చొప్పున జ్యోతిషపండితులనుబెట్టి యున్నారు. వారు సత్యమును గనిపెట్టుటలో తఱుచుగా భిన్నాభిప్రాయులుగా నున్నను వారిలో నధికసంఖ్యాకుల యభిప్రాయము ననుసరించి ధర్మాధికారి దోషులకు దండనము విధించు

చుండును. అక్కడి వారికి దివ్యజ్ఞానమాత్రము లేదు. భగవంతుఁడు వారికి దివ్యజ్ఞానమనుగ్రహించకపోయినందుకు కారణములేకపోలేదు. కామరూపమును ప్రసాదించిన దేశమునందు దివ్యజ్ఞానమునుగూడ ప్రసాదించినపక్షమున, దివ్యజ్ఞానముచేత మాయ బట్టబయలయి కామరూపములవలని ప్రయోజనమే లేకపోవునని యోచించియే యపరిమితబుద్ధిమంతుఁడయిన యీశ్వరుఁడు వారికి లోకోపకారార్థముగా దివ్యజ్ఞానము లేకుండఁ జేసినాఁడు. వారికింతకాలమునుండి కామరూపమును వహించు శక్తియున్నను వారేదైన సూక్ష్మరూపమును బొందవలెనన్న బుద్ధిపుట్టినప్పుడు చీమగానో దోమగానో పిల్లిగానో బల్లిగానో మాఱుచుండుటయే కాని నావంటి యంగుష్ఠమాత్రశరీరముగల పురుషుఁడు కావలెనన్న బుద్ధి నేటివఱకును వారిలో నొక్కనికి నుదయించకపోవుటచేత నారూపముచూడఁగానే యెల్లవారికి నద్భుతమును గౌరవమును గలిగెనని చెప్పితినిగదా! నన్ను శోధించిచూచి వాలఖిల్యమహర్షినిగా నిశ్చయించిన పౌరాణికులును జ్యోతిశ్శాస్త్రవేత్తలు నారాకను గ్రామమునందంతటను ప్రకటించినందున జనులు తీర్థప్రజవలె వచ్చి నన్ను దర్శించిపోవ మొదలుపెట్టిరి. అక్కడి వారు నాస్తికులుగాక యవతారములను మహామహిమలను నమ్మెడు ప్రమాణబుద్ధిగలభక్తిపరులగుటంజేసి నన్ను దర్శింపవచ్చువారందఱును నాయందు భక్తిగలవారయి ఫలములను కానుకలను దెచ్చుచు వచ్చుటచేత మాయింట ప్రతిదినమును ఫలరాసులు పర్వతోపమానములగుచు వచ్చెను. నాయజమానుఁడు వానినన్నిటి నంగడికిఁ బంపి యమ్మించుచు వచ్చుటచేత తద్విక్రయము కొంతవఱకాతనికిని లాభకరముగానే యుండెను. నానూలమున తనయప్పులుకూడ తీఱుమార్గ మేర్పడినందున నాయజమానుఁడు తనహృదయములో సంతోషించి కొంతకాలమయిన తరువాత దక్షిణలుకూడ నేర్పఱచి యాత్రాపరులను ప్రోత్సాహపఱచుచు

వచ్చెను. ఈప్రకారముగా నేనాదేశమునం దల్పకాలములోనే చిఱు దేవతనయిపోయినాను. నామహిమలు శీఘ్రకాలములోనే చుట్టుపట్ల గ్రామములోను దూరదేశములోనుగూడ వ్యాపించినందున యాత్రాపరులు రేయింబగళ్ళు విరామములేక దూరదేశములనుండి సహితము మహోపహారములను సువర్ణమంత్రపుష్పములను ధరించి యినుకచల్లిన రాలకుండునట్లు తీర్థప్రజలవలె రాఁదొడఁగిరి. నేను జంగమదేవతను గాఁగానే నాయజమానుఁడు తన మందిరమునందుఁగల యొక విశాలమయినగదిని దేవాలయమునుగా మార్చి యొకమూలఁ పీఠమమర్చి మూలవిగ్రహమువలె నందు నన్నెత్తుగాఁ గూరుచుండఁబెట్టి జనులు తెచ్చుకానుకలు మొదలయినవానిని గ్రహించుటకయి నాపై నొకయర్చకుని నేర్పఱిచి తాను ధర్మకర్తయయి వచ్చిన ధనమునంతను యథేచ్ఛముగా తననిమిత్త ముపయోగించుకొనుచుండెను. నాయందు జనుల కింతపూజ్యతాబుద్ధి కలిగినందున కింకొక కారణము చెప్పమఱచిపోయినాను. మన్నించి వినుఁడు. నేనక్కడకుఁ బోయిన నాలవనాఁ డొకవృద్ధకాంత నావద్దకు వచ్చి, వాలఖిల్యాది మహాఋషులకు దివ్యజ్ఞానమును మహిమలును గలవని పురాణశ్రవణాగాలవలనఁ దెలిసికొన్నదగుటచేత భక్తిపూర్వకముగా నాకు నమస్కరించి, ప్రసవవేదనపడుచున్న తన కోడలికి కొడుకుపుట్టునో కూఁతురుపుట్టునో చెప్పవలసినదని ప్రార్థించెను.

ఆమె ప్రశ్నయడిగిన కాలమునందులగ్నమురవి; గురుచంద్రులు విషమరాశి నవాంశములయందుండుటచేత.

శ్లో. ఓజర్క్షే పురుషాంశకేషు బలిభిర్లగ్నార్కగుర్విందుభిః
పుంజన్మప్రవదేత్సమాంశకగతైర్యుగ్మేషు తైర్యోషితః
గుర్వర్కౌ విషమేనరం శశిసితౌ వక్రశ్చయుగ్మే స్త్రియం
ద్వ్యంగస్థా బుధవీక్షణాచ్చయమలౌ కుర్వంతి పక్షే స్వకే.

అను బృహజ్జాతకవచనమునుబట్టి కుమారుఁడు కలుగునని చెప్పి నారు. శాస్త్రము లెక్కకు నబద్ధములు కావు గనుక వృద్ధాంగన యింటికిఁ బోయిన జాములోపల కోడలికి నేను జెప్పినట్లు పురుషశిశువు కలిగెను. అక్కడి జ్యోతిష్కులు మాత్రము లెక్కవేసి తమ శాస్త్ర ప్రకారముగా తప్పక స్త్రీశిశువు కలుగునని చెప్పిరఁట! చూచినారా? వారి శాస్త్రములకంటె మనశాస్త్రములయం దెంత యాధిక్యమున్నదో ఆవృద్ధాంగన నేను జెప్పిన సంగతి జ్యోతిష్కులకుఁ జెప్పఁగానే వారందఱు నావద్దకు మహాకోపముతో పరుగెత్తుకొని వచ్చి నీవేశాస్త్ర ప్రకారముగా కొడుకుపుట్టునని చెప్పినావో చెప్పుమని పట్టుకొనిరి. వారిశాస్త్రములకు విరుద్ధముగానున్నందున శాస్త్ర ప్రమాణమును జెప్పిన స్వదేశాభిమానముచేత శాస్త్రబద్ధులగునవారు నాకేమి హాని చేయుదురోయని జడిసియు సత్యము పలుకుట కిష్టములేనివాఁడనయి వారిప్రశ్నలకు నుత్తరముచెప్పక మౌనముధరించి యూరకుంటిని. అందు చేత వారు నే నాఫలములను జ్యోతిశ్శాస్త్రముచేతఁ గాక మునుల కుఁగల యాంతరదృష్టిచేతనే చెప్పితినని తమలోఁ దాము సిద్ధాంతము చేసికొని యాసిద్ధాంతులు గ్రామములో నాదివ్యజ్ఞానమునుగూర్చి గొప్ప వారితో నెల్లఁ బ్రశంసించిరి. అందుమీఁదనన్ను ప్రశ్నలడుగుటకయి గొప్పవారందఱును రా మొదలుపెట్టిరి. బుద్ధిమంతుఁడను గనుక నాలో నే నాలోచించుకొని జ్యోతిషభూమియైన యీదేశములో నేమియుత్త రము చెప్పిన జ్యోతిష్కులవలన నేమి చిక్కువచ్చునోయని భయపడి యేమియు నుత్తరముచెప్పక యెవ్వరేప్రశ్న వేసినను తలయూచి యూర కుండుచు వచ్చితిని. తరువాత నావద్దఁజేరిన జ్యోతిష్కులు తమ శాస్త్ర ములనుబట్టి నాశిరఃకంపమున కర్థముచేసి యడిగిన ప్రశ్నల కన్నిటికి నుత్తరములు చెప్పి భక్తులను సమాధానపఱిచి పంపుచువచ్చిరి.

నాయొద్ద నుంచఁబడిన యర్చకులు మన దేశములోని పూజారు

లవలెనే ధనార్జనోపాయములయందు మహాబుద్ధిమంతులు లగుటచేత నాప్రసాదము సర్వాభీష్టప్రదమని ప్రశ్నలడుగవచ్చిన వారితోఁ జెప్పి యరఁటిపండ్లు మొదలయినవి విద్యచేత చెడిపోని భక్తులచేతులలోఁ బెట్టి ధనాకర్షణము చేయసాగిరి. ఇట్లుండఁగా నొకనాఁడు చేరువ పల్లెనుండి చాకలివాఁ డొకఁడువచ్చి నాకు సాష్టాంగనమస్కారము చేసి తప్పిపోయిన క్రొత్తగాకొన్న తనగాడిద కనఁబడునట్లనుగ్రహించ వలసినదని ప్రార్థించి దక్షిణయును పండ్లను పళ్ళెములోఁ బెట్టి యర్చకు లకు సమర్పించెను. ఆయర్చకు లాదక్షిణను స్వీకరించి తిన్నగాఁ నుండని యరటిపండొకటి వానిచేతిలోఁ బెట్టి యీదేవతా ప్రసాదమును దేవతా సన్నిధానమునందే పరిగ్రహించి మ్రొక్కిపొమ్మని వానికాజ్ఞయిచ్చిరి. వాఁ డాప్రకారముగా ప్రసాదము స్వీకరించి భక్షించి తన యూరికి పోవుచుండఁగా త్రోవలోనే యీప్రసాదము వరదానముగాను, భక్తి పరిశోధనార్థమయి వానికడుపులో శూలనుపుట్టించి వివేచన మిష మీఁద వానిని చెఱువు గట్టుమీఁదికి పరుగెత్తించి యక్కడ తుమ్మ చెట్టుక్రింద మేయుచున్న వాని గాడిదను జూపెను. వాఁడు నాప్రసాద మహిమ కత్యద్భుతపడి తన గాడిదను తిన్నగా తన యింటికిఁ దోలు కొనిపోయి తన బంధువులకెల్లను జూపి నామహిమలను గాథలుగా పొగడెను. ఇట్లు నామహాత్మ్యములు దేశమంతటను వ్యాపించినందున, గాడిదలు, గేదెలు, ఆవులు మొదలయినవి తప్పిపోయినవారందఱును, చుట్టుపట్ల గ్రామములనుండి ప్రసాద స్వీకారార్థమయి నాదర్శనము నకు రాఁదొడఁగిరి. ఆమఱునాఁడే యీచాకలివాని గ్రామమునుండి తనగాడిద తప్పిపోయిన దని వాని చుట్టమొకఁడును, తనదొడ్డు తప్పి పోయిన దని కాపువాఁ డొకఁడును రాఁగా, మాయర్చకులు వారివలన విధ్యుక్తములయిన దక్షిణలను గ్రహించి యరఁటిపండ్ల ప్రసాదమును వారిచేతిలోఁ బెట్టి నాయెదుటనే వారిచేతఁ దినిపించి పంపివేసిరి. అయి

నను చాకలివానిగాడిదగాని, కాఁపువాని యెద్దుగాని త్రోవలో వారికి కనఁబడలేదఁట! గాడిదమాత్రము మఱియెప్పుడును కనఁబడనేలేదఁట గాని తరువాత గొన్నిదినముల కెద్దు పొరుగూరి బందెలదొడ్డిలో నుండఁగా కాపువాఁడు బందెయిచ్చి దానివిడదల్చి తెచ్చుకొనెనఁట! ఈవార్త నా చెవిని బడఁగానే యొకరి విషయమున వెంటనే ఫలించిన నాప్రసాద మింకొకరివిషయములో నేల ఫలింపక పోవలెనని నాలో నేనాలోచించుకొన మొదలుపెట్టితిని. తరువాత వచ్చినవారికి నాయెడల నిజమయిన భక్తి దేమోయని సంశయించి లేభక్తియే లేకపోయి నయెడల వారంతదూరము శ్రమపడివచ్చి భూరిదక్షిణలు సమర్పించుట తటస్థింపదుగాన వారికార్యవైఫల్యమునకు భక్తిహీనత కారణము కాదని నిశ్చయించి యావిషయమున వారిని నిర్దోషులనుగా నిర్ణయించినాను. భక్తిహీనత కారణము కాకపోయి పక్షమున నా యమోఘప్రసాదము విఫలమగుట కేమికారణమై యుండునని నాలో నేను తలపోయుచు కన్నులు మూసికొని యీశ్వరధ్యానము చేయుచుండగా మంత్రద్రష్టలైన మహర్షులకు వేదమంత్రములు ప్రత్యక్ష మయినట్టే నాకును స్వప్నములోఁ గొన్నియూహాలు సాక్షాత్కారముకాఁగా, శాస్త్రజన్మముయొక్క క్రమమిట్టిదేకదా యని తెలిసికొని శ్రీఘ్రమే నేనొకయభినవశాస్త్ర నిర్మాణమున కారంభించినాను. మేలుకొన్నప్పుడును నిద్రపోవుచున్న ఇప్పుడును స్వప్నరూపమున నీశ్వరాదేశముచేత సన్నిధి చేసినయూహాలను బట్టియు నాయనుదిన ప్రత్యక్షానుభవమును బట్టియు మూఁడుమాసములలో మహత్తరమయిన ప్రసాద జ్యోతిశ్శాస్త్రము నొకదానిని సాంగోపాంగముగా సాంతముచేసితిని. ఆశాస్త్రమంతయు వినిపించినచో గురూపదేశము లేనివారికి దురవగాహ మగుట యాలోచించి పూర్వోత్తరహస్యకథనమునుబట్టి మీరు గ్రహింపఁ గలిగిన మూఁల సూత్రములను ముఖ్యముగా నిందుదాహరించుచున్నాను:—

గీ. క్రొత్తగాడిదఁ బోఁగొట్టుకొన్నవాఁడు
వాలఖిల్యప్రసాదంబు వచ్చియరఁటి
పండ్లు దక్షిణ యిచ్చి సాపడియె నేని,
దొరకు గార్దభంబది యింటిత్రోవలోనె. ౧

గీ. గోవృషంబులఁ బోఁగొట్టుకొన్నవాఁడు
వచ్చి కదళీఫలంబుల వాలఖిల్య
సన్నిధినిబుచ్చుకొన్నఁ బక్షంబులోన
దొరకు గోవది బందెలదొడ్డిలోన. ౨

గీ. తనదుగాడిదఁ బోఁగొట్టుకొనినవాఁడు
వచ్చి రాహుకాలంబున భక్తితోడ
వాలఖిల్యప్రసాదంబుఁ బడసెనేని,
కంటఁబడ దెప్పుడును వానిగార్దభంబు. 3

మూలసూత్రములు దేవభాషయందే యున్నను స్త్రీశూద్రులు వానిని పఠింప రాదని సర్వజనోపయోగార్థముగా వానినిట్లు తెనిఁగించినాను. ఈయభినవ మహాశాస్త్రమునకు ప్రసాదజ్యోతిశ్శాస్త్రమన్న పేరెట్లు సార్థక మగునో మీరేయూహించి తెలిసికోవచ్చును. వాలఖిల్య ప్రసాదమువలనఁ గలుగు ఫలములను దెలుపుశాస్త్రమగుటచేత ప్రసాదశాస్త్రమును, ఆ యాఫలములకు జ్యోతిశ్శాస్త్ర సంబంధముఁ గల్పించుటచేతఁ గొంతవఱకు జ్యోతిశ్శాస్త్రమును అయి యీపేరీయపూర్వ శాస్త్రమున కన్వర్థమయినది. ప్రసాదమును స్వీకరించుకాలమునుబట్టి వారదోషములు, తిథిదోషములు, నక్షత్రదోషములు, రాహుకాల దోషములు, మొదలయిన కాలదోషములన్నియు నీయపూర్వశాస్త్రము నందు జొప్పింపఁబడియున్నవి. మొట్టమొదటవచ్చినచాకలివాఁడుతనగాడిద తప్పిపోయినందునకయి ప్రశ్నయడుగుటకు శుక్రవారమునాఁడు పదిగడియల ప్రొద్దెక్కివచ్చి ప్రసాదస్వీకారము చేసినందున, నాఁడు

రాహుకాలము ౧౧ గడియల కగుటచేత వానికార్యము సఫలమయినది. మఱునాఁడు శనివారమునాఁడు వచ్చిన చాకలివాఁడును పదిగడియల ప్రొద్దెక్కియేవచ్చి ప్రసాదస్వీకారము చేసినను నాఁడు రాహుకాలము ౭౼ గడియలకే వచ్చినందున వాని కార్యము విఫలమయినది.

"సూ॥ విధు సౌరీ భృగుసుతజ జీవభౌమార్క॥ త్రిపాద త్రిణి వృద్ధిః॥" అను ముహూర్తదీపికా సిద్ధాంతమునుబట్టి రాహుకాలము సోమవారము ౩౼ గడియలకును, శనివారము ౭౼ గడియలకును శుక్రవారము ౧౦౹ గడియలకును, బుధవారము ౧౩౼ గడియలకును, గురువారము ౧౬౺ గడియలకును, మంగళవారము ౨౦౼ గడియల కును, ఆదివారము ౨౩౹ గడియలకును, మూఁడుగడియల ముప్పావు వృద్ధినొప్పునవచ్చుచుండును. ఈప్రసాదజ్యోతిశ్శాస్త్రములోని జ్యోతి శ్శాస్త్రమునకు యంతిమ శబ్దసారస్యమువలన, అభినవ వాలఖిల్య మహ ర్షియయిన నాసిద్ధాంతమననుసరించి మా పూర్వమహర్షులును మన దేశము లోని జాతక ముహూర్త భాగముల నేర్పఱిచిరన్న పరమరహస్యమును గూడ బుద్ధిమంతులూహించి తెలిసికోవచ్చును. ఈప్రసాదజ్యోతి శ్శాస్త్రము బహుఫల ప్రదమయినదగుటచేత శాస్త్రవిశ్వాస మహనీయు లయిన మన దేశపు పెద్దలు దీనిని గురుముఖమున నుపదేశము నొంది భరతఖండమునందు వ్యాపింపఁజేసి యాసేతు హిమాచలమున సర్వజనులకును దానివలని యనంతములైన ఫలములను శీఘ్రకాలము లోనే కలిగింతురనుటకు సందేహము లేదు. అయినను వాలఖిల్య మూర్తి ప్రస్తుతమున మనదేశమునందు లేకపోవుటయొక ప్రతిబంధకము గాఁగనఁబడి దూరాలోచన లేనివారికి వాలఖిల్య ప్రసాదశాస్త్రము వ్యాపింపఁజేయుట దుస్సాధ్యమని తోఁచవచ్చును; గాని, రామకృష్ణా దుల విగ్రహములను ప్రతిగ్రామమునందును నెలకొల్పి పూజింపఁగలిగిన మహాపురుషులకు వాలఖిల్యమూర్తిని ప్రతిగ్రామమునందును ప్రతి

ష్టించి యనంత ఫలప్రదమయిన తత్ప్రసాదశాస్త్రమును వ్యాపింపం జేయుట పరమసాధ్యమే యని స్ఫురించక పోదు. నేను వ్రాయుటకుఁ దగిన కాకితలు గాని గంటములు గాని యీదేశములో లేనందున నా ప్రసాదశాస్త్రమున కధిక గౌరవము కలుగుటకయి నేను దానిని వాగ్రూపకముగానే యుంచి మన మహర్షులు వేదమును కాపాడినట్లు కాపాడుచున్నాను. ఆదేశమునందలి గంటములు మన గునపముల కంటె మూడురెట్లు పొడుగును రెండురెట్లు లావును గలిగియుండుటచేత వాని నెత్తుటకే నాకు సాధ్యముకాదు. ఇఁకనక్కడి తాటాకన్ననో మనపెద్ద పరుపులంత చేసి వెడల్పు కలవయి వానికంటె దశగుణములు నిడివి కలవిగా నుండును.

నాధర్మకర్త యైన మహాకాయుఁ డొకనాఁడు నావద్ద నియమింపఁబడిన యర్చకులు నాకు మ్రొక్కుకొనువారు చెల్లించు ముడుపులు కానుకలు దక్షిణలు నిలువుదోపులు మొదలయిన వానినిగూర్చి క్రమమయినలెక్కలుంచి వచ్చినసొమ్మంతయు ప్రతిదినమును సరిగా ధర్మకర్తకుఁ బంపుచున్నారో లేదో విచారించుటకయి నన్నుంచిన యాలయమునకువచ్చి నాయాదాయవ్యయములను విమర్శించి వారినిండ్లకుఁ బంపివేసి తరువాత వారు స్వామిసొమ్ము నేమయిన నపహరించుచున్నా రాయని నన్నడిగెను. నేను చిఱునవ్వునవ్వి యడిగినదానికి తగిన సమాధానమియ్యక జ్యోతిషభూమిలోఁ దమకు విశదముగాని దేమున్నదని పలికి, జ్యోతిశ్శాస్త్ర ప్రశంసచేసి మొదటిసంగతి మఱపించి మెల్లగా నతనిని శాస్త్రచర్చకు దింపితిని. తిరుమలకు మొదలయిన దివ్యస్థలములలో భక్తులు సమర్పించు దేవుని సొమ్ములో పూజారులు మొదలయినవారు నిత్యకృత్యముగా చేసెడు కైంకర్యరహస్యములు మీకు కొట్టినపిండియగుటచేత మీకా దేవరహస్యములను తెలపవలసిన యావశ్యకము మొదలే లేదుగదా ? నేను శాస్త్రచర్యకు దింపినతరువాత మహాకాయుఁడు జ్యోతిశ్శాస్త్రమునందు మహాభిమానమును సంపూ

క్షణవిశ్వాసమును గలవాఁడయ్యును, తమదేశమునందిప్పుడు గ్రహగతి యనుకూలముగా లేనందున కొంత సంతాపపడి యిట్లు సంభాషణ మారంభించెను:—

మహా—పూర్వమునందు మా రావణమహారాజుకాలములో గ్రహములన్నియు సదా మంచి స్థలములయందుండి యెల్లవారికిని సత్ఫలములనే యిచ్చుచుండెను. ఆమహారాజుపోయి విభీషణుఁడు రాజ్యమునకు వచ్చినతరువాత గ్రహములు కొంటిభయమువిడిచి యథేచ్ఛముగా సంచరించుచు తమ యిచ్చవచ్చిన ఫలములనే యిచ్చుచున్నవి. అయినను జ్యోతిశ్శాస్త్రమునం దఖండపాండిత్యముగల మహానుభావుల యనుగ్రహమువలన గ్రహగతులవలని ఫలాఫలములుమాత్రము మాకిప్పుడు తెలియుచున్నవి.

సత్య—గ్రహముల గతిదోషములను తప్పించుకొనుటకయి యీదేశమునందు సాధనములున్నవా?

మహా—ప్రయాణాదులయందు మంచి ముహూర్తములు పెట్టించుకొని పని యారంభించుట యొక్కటే సాధనముగుపడుచున్నది. అంతకంటె వేఱుగతి లేదు.

సత్య—ఈదేశస్థులు ప్రయాణాది సమస్తకార్యములయందును మంచి ముహూర్తములు పెట్టించుకొని శుభలగ్నమునందే కార్యారంభము చేయుచున్నారా?

మహా—సాధ్యమయినంతవఱకు చేయుచునే యున్నారు. మఱి మీదేశమునందో?

సత్య—మాదేశమునందును జనులు శాస్త్రబద్ధులయి నడుచుకొనుచున్నారు కాని—

మహా—ఏమో "కాని" యనుచున్నావు. మీవారు శాస్త్రవి

జ్ఞాపకము లేనివారయి కొందఱు విహితధర్మములను మీఱి నడుచుచున్నారా?

సత్య—మావా రెప్పుడును బుద్ధిపూర్వకముగా శాస్త్రమర్యాదలను మీఱువారు కారు. అయినను మా దేశమునం దిప్పుడు ప్రభుత్వముచేయుచున్న హూణులు క్రొత్తగానావిరియంత్రములను కల్పించి, సెటి యావిరియొక్క బలముచేత సినుపదారులమీఁద తిథి వార నక్షత్రహోరాత్రనియమమును పాటింపక నిర్ణీత సమయమునందు ప్రతిదినముపొగబండ్లను వాయువేగమున నడిపించుచు జనులశాస్త్రచోదితాచారములకు భంగము చేయుచున్నారు. అందుచేత జనులిప్పుడు శాస్త్ర మర్యాదల నంతగా పాటింపక ప్రయాణసౌలభ్యమునుబట్టి పొగబండ్లలో నెక్కి జ్యోతిష్కులు పెట్టినముహూర్తములనుమాని జాతివా రేర్పఱిచిన వేళలలోనే యాత్రలుచేయ మొదలు పెట్టినారు.

మహా—ప్రయాణసౌలభ్యమును బట్టి శాస్త్రవిధుల నతిక్రమించుట మహాదోషము. అందులోను జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతములను మీఱిన పాపమును మించిన మహాపాతకము లోకములో మఱియొకటి యుండదు. మఱియేపాపమునకైనను నిష్కృతికలదుగాని యీపాపమునకు నిష్కృతి లేదు. దేశాభిమానులందఱును జేరి పొగబండ్లలో పోయినవారిని జాతినుండి బహిష్కారము చేసెదమని దోషజ్ఞసమయము చేయరాదా?

సత్య—శిష్టాచార సంపన్నులయిన శ్రోత్రియశిఖామణు లనేకులు పొగబండ్లలో ప్రయాణము చేయుట పాపమని బోధించినారు గాని జనుల యనాదరమువలనను ధర్మ సంస్థాపకులయిన ప్రభువులు లేని లోపమువలనను వారి యుపదేశములన్నియు నరణ్య రోదనము లయిపోయినవి. ప్రయాణములకు ముహూర్తములు పెట్టించువారు

లేక విధినిహితమయిన తమ వృత్తికే భంగము రానారంభించినందున జ్యోతిష్కులందఱును జేరి ముహూర్తములు పెట్టించుకొనకుండ యాత్రలు చేయుట పాతకములలో నెల్ల ఘోరపాతకమనియు కాలజ్ఞులయిన విప్రోత్తముల జీవనాధారమును మూలచ్ఛేదము చేయుట దోషములలో నెల్ల మహాదోషమనియు ఘోషపెట్టిరి. రాజావలంబము లేకపోవుటచే వారిఘోషము లన్నియు చెవిటివానిముందటి శంఖ ఘోషములే యయినవి.

మహా—ఆహాహా! మీదేశమున కిప్పుడెంత కష్టము వచ్చినది! అయ్యో! శాస్త్రమన్యాయముగా చెడిపోవుచున్నదే! జనులను సన్మార్గమునడిపించుటకు మీదేశములో మతగురువులు లేరా? పీఠాధిపతులు లేరా? ఎవ్వరును లేకపోయినను మతాభిమానులందఱును జేరి పొగబండ్లను ప్రతిస్థలమునుండియు రాహుకాలములను వర్జ్యములను వారశూలలను గ్రహవేధలను నక్షత్రదోషములను తారాబలములను చంద్రబలములను విచారించి మఱి బయలుదేఱదీయునట్లు శాసన మేర్పఱుప వలసినదని ప్రభుత్వమువారికి సంఘవిజ్ఞాపనములు పంపుకొనరాదా?

సత్య—ఈ యాలోచన సర్వోత్తమముగానున్నది. ఇటువంటి మంచి యాలోచన యీవఱకు మావారలబుద్ధులకు గోచరము కాలేదు. మాదేశము చేరఁగానే యీసంఘవిజ్ఞాపనల విషయమయి నేను కృషిచేసి దొరతనమువా రొకవేళ నామొఱ్ఱ వినకపోయినను నాదేశాభిమానమాననీయతను గనఁబఱిచి దేశమునకు మహోపకారము చేసెదను.

మహా—అట్లుచేయుము. అక్కడ మీకేగాని మీప్రభుత్వము వారికి జ్యోతిశ్శాస్త్రవిశ్వాసము లేనట్టున్నది.

సత్య—లేదు. వారికి ముహూర్తములు లేవు; జాతకములు లేవు; ఏమియు లేవు.

మహా—గ్రహములు వారిని బాధించవా ?

సత్య—బాధించవు. అమావాస్యనాఁడు బయలుదేఱినను వారికి కార్యసిద్ధి యగుచున్నది. శూన్యమాసములో శనివారమునాడు దుర్ముహూర్తపువేళ లగ్నముపెట్టి వివాహము చేసికొన్నను దంపతులు సంతానవంతులయి వర్ధిల్లుచున్నారు. గ్రహములుకూడ వారికి భయపడి నట్లు తోఁచుచున్నది.

మహా—నీకు తోఁచుచున్నది సత్యమే. పంచభూతములను లోఁబఱుచుకొని నిప్పుచేతను నీళ్ళచేతను బంట్లులాగించువారికి గ్రహములు భయపడి లోపడుట యాశ్చర్యముకాదు. ఏమియు భయము చేత కార్యసిద్ధిచేసినట్లు భక్తిచేత చేయవు. వెనుక మా రావణునికిని భయముచేతనే కదా సూర్య చంద్రాది గ్రహములును వాయువైశ్వానరాది భూతములును చెప్పినచోట్లనుండి సేవచేయుచు వచ్చినవి.

సత్య—అది సత్యము. ఆహా ! ఏమి మీబుద్ధివిశేషము ! మీకుఁ గల వర్ణనీయమయిన శాస్త్రాభిమానము మీబుద్ధి విశేషము నకు వన్నె తెచ్చుచున్నది !

మహా—దేనిని విడిచినను శాస్త్రాభిమానమును మాత్రము విడువరాదు. శాస్త్రవిశ్వాసముచేత నేను విధ్యుక్తముగా వివాహము చేసికొన్న ధర్మపత్నిని సహితము తృణప్రాయముగా విడిచిపెట్టినాను.

సత్య—ఓహో ! మీరు త్రిలోకపూజ్యులుగా కనఁబడుచున్నారు. మీచిత్రచరిత్రమును నాశ్రోత్రపేయముచేసి నన్ను చరితార్థుని జేయుఁడు.

మహా—నాప్రథమభార్య వృషభలగ్నమున లగ్నమందు చంద్రుఁడును సింహమందు సూర్యుఁడును వృశ్చికమందు గురుఁడును కుంభమందు శనైశ్చరుఁడును ఉండఁగా ప్రథమకుమారుని గన్నది. ఇట్టి లగ్నమందుఁ బుట్టినవాఁడు జారజాతుఁడని శాస్త్రదృష్టిచేతఁ జూచినవాఁడనయి గుణవతియైన యాభార్యను తత్క్షణము త్యజించినాను.

సత్య—"వృషస్కందాలగ్నే సవితృగురుతీక్ష్ణాంశుతనయై స్సుహృ ద్దాయాఖస్త్రైః ఖ్యాతిరియమసూనాస్తగవపతి" అను వరాహమిహిరవాక్య మునుబట్టి మీరుచెప్పిన రాజయోగమునందుఁ బుట్టినవాఁడు జారజుఁడు గాక మానవపతికావలెను...

మహా—ఆవిషయమయి చర్చ యక్కఱలేదు. జారజుఁడు మానవపతియైనను విసర్జింపవలసినదే.

సత్య—మీ భార్యయందు జారత్వదోష మున్నట్టు మీరావఱ కెన్నఁడయిన విన్నారా?

మహా—పుత్రజన్మముచేత శాస్త్రము చెప్పువఱకును నాభా ర్యయట్టిదని నేను స్వప్నావస్థయందును ననుకోలేదు. అది మహాపతి వ్రతయనియే యెల్లవారును నేఁటివఱకును విశ్వసించి, నేను దానిని నిష్కారణుఁడనయి నిష్కారణముగా పరిత్యజించితినని నన్నూరక నిందిం చుచున్నారు. జారత్వ మెప్పుడును గూఢముగా జరుగునదిగాని యొకరికిఁ దెలియునదికాదు. సర్వజ్ఞకృతమయిన శాస్త్రము చెప్పుదా నికంటె జనుల కెక్కువ తెలియునాయని శాస్త్రవిశ్వాసము గలవాఁడ నయి, జనులనిందలను లక్ష్యముచేయక ప్రత్యక్షసాక్షియైన శాస్త్ర మును బట్టి భార్యాపరిత్యాగముచేసి నేను మావంశపరిశుద్ధతను నిలుపు కొన్నాను.

సత్య—పాపము! ఆ మెగతి యేమయినది?

మహా—దానికేమిలోపము? దానికితగిన భరణమేర్పఱిచి నేను మఱియొక కన్యను పాణిగ్రహణము చేసికొన్నాను. నాద్వితీయ భార్యకు నిర్దోషమయిన సుముహూర్తమునందు ప్రథమపుత్రజనన మయినది. ఆశిశుజన్మమైనది యెంత మంచిలగ్నమో యెఱుఁగుదువా? వాని జననసమయమునందు బృహస్పతి యేకరాశిగతులయిన సూర్య చంద్రులను చూడక చక్కగానున్నాఁడు.

సత్య—ఆహా! ఏమి మీశాస్త్రవిశ్వాసము!

మహా—ఏమి? నాశాస్త్రవిశ్వాసమున కంత యాశ్చర్య పడు చున్నావు! మీదేశమునందు శాస్త్రవిశ్వాసములేదా?

సత్య—కావలసినంత యున్నది. మాతుల మరణ యోగము నందు శిశువులు పుట్టినపక్షమున తమగండములను తప్పించుకొనుటకయి మేనమామలు మొదలయినవారు శాస్త్రవిశ్వాసముచేతనే మంత్రసానులకు లంచమిచ్చి శిశువులను చంపించివేయుదురు. అయినను మాదేశమునం దింగ్లీషు చదువుచేత నట్టి సత్యములనునమ్మని నాస్తికులు కొందఱిప్పుడు బయలుదేఱుచున్నారు.

మహా—కలికాలమహిమచేత నట్టిబౌద్ధులు మాద్వీపమునందును కొందఱు వెలసి జ్యోతిష మబద్ధమని కుత్సితబుద్ధి వాదములుచేయు చున్నారు. ఈసారి నిన్ను వారిసభలకుఁ దీసికొనిపోయెదనులే.

సత్య—ఆనాస్తికాథముల సభలకు నన్నుఁ గొనిపోవుటకంటె ముందుగా మీరీవఱకు వాగ్దానముచేసియున్న ప్రకారముగా నన్నొక సారి శాస్త్రవిశ్వాసము గల పండితసభకుఁ దీసికొనిపోయి జ్యోతిష్కులు న్యాయముతీర్చు విధమును జూపుఁడు.

మహా—మంచిది. ఈమాటలసందడిలో నీకు శివపూజాసమయము మించిపోయినట్టున్నది. ఆఁకలిచేత నీకన్నులు గుంటలు పడిపోయినవి. నేను లోపలికిఁ బోయి మందోదరిచేత నీకు నైవేద్యము పంపెదను. భక్తులు దేవతాదర్శనమునకు వచ్చెడువేళకూడ నగుచున్నది. (అని లోపలికిఁ బోయెను.)

ఆమహాకాయుఁడు చెప్పినదానినిబట్టి యాతని రెండవభార్యకు పుట్టినకొడుకు జారజాతుఁడని యెఱిఁగినవాఁడనయి,

శ్లో॥ స్వలగ్నమిందుంచగురుర్నిరీక్షతే నవా శశాంకంరవిణాసమాగతమ్
 సపాప కోర్కేణ యుతోధవాశశీ పరేణజాతంప్రవదంతి నిశ్చయాత్.

అని యేకరాశి గతులయిన సూర్యచంద్రులను బృహస్పతి చూడకున్న కాలమునఁ బుట్టినవాఁడు నిశ్చయముగా జారజుఁడన్న బృహజ్జాతక వచనమునకు ప్రత్యక్ష విరుద్ధముగానున్న వారిశాస్త్రము సత్యము కాదని నాలో నేననుకొని, అతనికిఁ గోపము వచ్చునన్న భయముచేత నతనితో నేతద్విషయమును గూర్చి ప్రస్తావింపక వారిది రాక్షస శాస్త్రమగుటచేత నట్లు వ్యత్యస్తముగా నున్నదని నిశ్చయము చేసికొని యప్పటి కూరకుంటిని.

---

## నాలవ ప్రకరణము.

---

వెనుకటి ప్రకరణమునందుఁ జెప్పిన ప్రసంగము నడిచిన నాలుగు దినముల కొకనాఁటి మధ్యాహ్న సమయమునందు నా యజమానుఁడయిన మహాకాయుఁడుగారు నాయొద్దకువచ్చి, నేఁడు రాజసభ జరుగఁబోవుచున్నది గనుక జ్యోతిషవిద్వాంసులు చెప్పు తీర్పులయొక్క రీతిని జూచి యానందించుటకయి నీకోరిక ప్రకారముగా నిన్నక్కడకుఁ గొనిపోవ వచ్చినానని సెలవిచ్చెను. నేనాయన యాజ్ఞను శిరసావహించి తత్క్షణమే యుచిత వస్త్రాదులను ధరించి యరగడియు లోపలనే ప్రయాణమునకు సంసిద్ధుఁడను కాఁగా నాయజమానుఁడు నా యాలయముయొక్క తలుపులు మూయించి నన్నుఁ గొనిపోయి తన గుఱ్ఱపుబండిలో తానుఁ గూరుచున్న మెత్తమీఁద నన్ను తన కుడివైపునఁ గూర్చుండఁబెట్టుకొనెను. నేనెక్కిన బండి రాక్షసిబండి యనియు, దానికిఁ గట్టఁబడిన గుఱ్ఱములు రాక్షసి గుఱ్ఱములనియు, నేనిప్పుడు వేఱుగఁ జెప్పనక్కఱలేదుగదా ! ఆబండి ధవళశైలపు కొండంతయున్నది ; దానికిఁ గట్టఁబడిన గుఱ్ఱములును ఒక్కొక్కటి పది యేనుఁగు

లంతలేసియుండి నాదృష్టికి నడగొండలవలెఁ గానఁబడినవి. ఉత్సవ విగ్రహములను దేవాలయములలోని యర్చకులు మోసికొని పోవునట్లుగా నాయజమానుని సేవకులు నన్ను తమచేతులలోఁ గొనిపోయి యాశకటమునందుఁ గూరుచుండఁ బెట్టఁగా, భయముచేత నిశ్చేష్టుఁడనయి దేవాలయములోని పీఠముమీఁద దేవుఁడు కూర్చున్నట్లుగా భూదేవుఁడనైన నేనును కదలమెదలక యందలి మెత్తమీఁద గూరుచున్నాను. కొంతసేపటికి తెలివి తెచ్చుకొని నేను ముందు చూచునప్పటికి గుఱ్ఱములు బండి నీడ్చుకొని వాయువేగమున బరుగెత్తుచుండినవి; బండిచక్రముల చప్పుడు మేఘగర్జనమువలె చెవులు చిల్లులు వోవునట్లు కర్ణకఠోరముగా వినఁబడఁ జొచ్చినది. ఈయవస్థలో గాలిలోఁబెట్టిన దీపమువలె వెనుకకును ముందునకును బండికుదుపుచేత నూఁగులాడుచు ప్రాణములు బిగఁబట్టుకొని మెత్తకుఁ గుట్టిన పగ్గములవంటి దారములను రెండుచేతులతోను గట్టిగాఁ బట్టుకొని యరగంటసేపు గూరుచుండునప్పటికి సభామందిరము సమీపించినందున బండినిలిచినది. అప్పుడు మహాకాయుఁడుగారు బండిదిగి సభాగృహద్వారమువద్దకి నడవఁగా వెనుకనుండి భృత్యులు తదాజ్ఞానుసారముగా నన్నుఁ గొనివచ్చి యాయనచేతి కందిచ్చిరి. నావంటి యల్పునిఁ దమవంటి ఘనులు మోచుట ధర్మముకాదని నేనాయనతో నా వినయవిధేయతలు తేటపడునట్లుగా మనవిచేసి నన్ను మఱియొకరి చేతికియ్యవలసినదని ప్రార్థించినను, ఆయన నాప్రార్థన నంగీకరింపక నీచసేవకులు సభాభవనములోనికిఁ బోఁగూడదను హేతువుచేతఁ గాఁబోలును నన్ను స్వయముగానే చేతులలో నెత్తుకొనిపోయి ధర్మాధికారిగారు చూపిన పీఠముమీఁదఁ దాను గూరుచుండి నన్ను తన ప్రక్కను గూరుచుండఁ బెట్టుకొనెను. మేమక్కడకుఁ బోవునప్పటికే సభాస్తారులందఱును వచ్చి తమ కర్హములయిన పీఠములమీఁద నాసీనులయి యుండఁగా,

సభ యంతయు వ్యవహారమును జూడవచ్చిన మహాజనులతో నిండిపోయి నది. వారిలో ధర్మాధికారియగు ఖరుఁడు దక్షిణముఖముగా నొక్క యున్న తాసనముమీఁదఁ గూరుచుండి యుండెను. ఆయనకు కుడి ప్రక్కను రెండుమూఁడు బారల దూరములో వరుసగా వేసియున్న పీఠములపయిని పంచామరతరువులవలె జ్యోతిషవిద్వాంసు లయిదు గురు తలలకు శాలువులు చుట్టుకొని చెవులను కుండలములు ల్లలనాడ గంభీరముగాఁ గూరుచుండి యుండిరి. వారి నామములు వరుసగా వృశ్చికరోముఁడు, సర్పరోముఁడు, ఖడ్గరోముఁడు అగ్నిరోముఁడు, కంటకరోముఁడు అని తరువాత నేను మాయజ మానునివలనఁ దెలిసికొన్నాను. రోమకసిద్ధాంతము నభ్యసించుట చేతనో మఱియే హేతువుచేతనో కాని యాదేశమునందు సామాన్యముగా జ్యోతిషసిద్ధాంతులు నామముల చివరను రోమశబ్దము చేర్పఁ బడుచున్నది. ఆమహావిద్వాంసులకును ధర్మాధికారికిని నడుమగా లేఖ నోద్యోగి యొకఁడు నిలువఁబడియుండెను. అప్పుడు నిలువఁబడియున్న యాలేఖకుని పేరతికాయుఁడు. రాజభటులు చేతు లాడించుచు మాటాడుచున్నవారి నూరకుండుఁడని కేకలు వేయుచుండఁగా, ధర్మాధికారి తలయెత్తి చూచి లేఖకుని వైపునకుఁ దిరిగి వ్యభిచార వ్యవహారమును విమర్శించుటకు ముందుగా నందలి వాది ప్రతివాదుల నెదుటఁ బెట్టింపుమని యుత్తరువు చేసెను. అతఁడు రాజభటులను జూచి ప్రహస్తుని వజ్రహస్తుని కైకసిని దీసికొనిరండని చెప్పెను. వారు వెంటనే పోయి యుద్దఱు ప్రహస్తులను కైకసిని దీసికొనివచ్చి యెదుట నిలిపిరి.

లేఖ—భటులారా! మీరిద్దఱు ప్రహస్తులను దెచ్చినారేమి? వీరిలో వజ్రహస్తుఁడెవరు? ప్రహస్తుఁడెవరు?

భటు—మేము వాదిప్రతివాదులను గొనిపోయి యొకగదిలోఁ బెట్టి యీవలఁ గూరుచుండఁగా ప్రభువువారు పిలిచెడిలోపల వారిలో.

వజ్రహస్తుఁడు తన కామరూప ప్రభావముచేత ప్రహస్తుఁడుగా మాఱి పోయినాఁడు

ఇట్లేకరూపమును బొందినవారిరువురిలో నెవ్వఁడు ప్రహస్తుఁడో యెవ్వఁడు వజ్రహస్తుఁడో నిర్ణయించుటకు శక్యముకానందున వారిలో నొకనిని మొదటి ప్రహస్తుఁడనియు నింకొకనిని రెండవప్రహస్తుఁడనియు నిజము తెలియువఱకును జెప్పవలసి యున్నది.

ధర్మా—నిష్కారణముగా మాకు శ్రమకలుగఁజేయక మీలో నిజమైన ప్రహస్తుఁ డెవఁడో శీఘ్రముగాఁ జెప్పుఁడు.

మొ—ప్రహ—నేనే నిజమయిన ప్రహస్తుఁడను. ఇతఁడు మాయప్రహస్తుఁడు.

రెం—ప్రహ—నేను నిజమయిన ప్రహస్తుఁడను. ఇతఁడుమాయ ప్రహస్తుఁడు.

ధర్మా—మీరబద్ధము లాడఁగూడదు. మీలో వజ్రహస్తు డెవఁడు ?

మొ-ప్రహ—అతఁడు వజ్రహస్తుఁడు.

రెం-ప్రహ—అతఁడు వజ్రహస్తుఁడు.

లేఖ—ఈ వ్యవహారము చక్కఁగానే యున్నది. సత్యముతెలిసినను గాని శిక్షించువఱకును వీరిలో నొక్కరును నిజముచెప్పరు. ఈసత్యా సత్యముల నిప్పుడీవిద్వాంసులే నిర్ణయము చేయవలెను.

ధర్మా—ఆసంగతి తరువాత చూచుకొందము గాని ముందుగా మీయభియోగమేదో వాది సభవారితో మనవిచేయవలెను.

మొ-ప్రహ—కైకసియను నీకామిని నాభార్య. నేనింట లేనప్పుడీ వజ్రహస్తుఁడు నావేషము వేసికొనివచ్చి—

రెం-ప్రహ—ఛీ ! ఛీ ! అబద్ధములాడకు—ప్రహస్తుఁడవు నీవా? నేనా ?—ఓ మహాప్రభూ ! న్యాయప్రభువులు నామొఱ్ఱ యాలకింప

పలెను. కైకసియును నీ కామిని నాభార్య. నేనింటలేనప్పుడీ ప్రహస్తుండు నావేషము వేసికొనివచ్చి—

ధర్మా—ఇంక వీరివలన సత్యము బయలుపడదు.—ఓకైకసీ! వీరిలో నీభర్త యెవ్వఁడో నీవు చెప్పుము.

కైక—(ఇరువురి మొగములవంకఁ జూచి) ఓమహాప్రభూ! నేను గదిలోనున్నప్పుడు నాభర్తకు కుడివైపునఁ గూరుచున్నాను. అప్పుడు కూరుచున్నట్లు కూర్చుండఁబెట్టినపక్షమున నాభర్త యెవ్వరో నేను జెప్పఁగలను. రాజభటులు వారి నొక్కెడకుఁ దీసికొనివచ్చినప్పుడు తమతమ స్థానములను వదలి వారిద్దఱును గలసి పోయినారు. ఇప్పుడు నేనెవ్వరివంకఁజూచిన నతఁడే నాభర్తగాఁ గనబడుచున్నాఁడు.

మొ-ప్రహ—ఓప్రాణేశ్వరీ! నావంక తిన్నఁగా జూడు. నేను నీభర్తను కానా?

రెం-ప్రహ—ఓప్రాణేశ్వరీ! అతనివంకఁ జూడక నావంకఁ జూడు. నేనే నీకుభర్తనుకానా?—ఓకిరాతుఁడా? నీవు మాయ చేసినంతమాత్రమున పెండ్లినాఁటినుండియు నన్నెఱిఁగిన నాధర్మపత్ని నిన్ను భర్తయనుకొను ననుకొన్నావురా?—ఓప్రాణేశ్వరీ! నిజము చెప్పవేమి?

కైక—మీారే నాప్రాణవల్లభులలాగున నున్నారు.

మొ-ప్రహ—ఓప్రాణేశ్వరీ! యీామోసగాని మాయమాటలను నమ్మి మోసపోకు, నీవిందాక నాకుడిప్రక్కను గూరుచుండలేదా? యింతలోనే నన్ను గుఱుతుపట్టలేక పోయినావా? నేనే నీకు నిజమయిన భర్తనగుదునో, కానో నా మొగముచూచి చెప్పుము.

కైక—మీారును నాప్రాణవల్లభులలాగుననే యున్నారు.

ధర్మా—ఈయంశమిాలాగున తేలదు. నీభర్తయెవ్వరో యామాట యటుండనిచ్చి నేరముజరిగినదో లేదో నిజము చెప్పుము.

రైక—నాభర్తగానుదప్ప నేను పరపురుషుని కన్నెత్తి చూడ లేను.

ధర్మా—అదికాదు. ఈయభియోగ పత్రికలోఁ జెప్పఁబడిన కాలమున నొకపురుషుఁడు శయనగృహమున నీయొద్దనున్నాఁడా ?

రైక— నాభర్త నాయొద్దనున్నాఁడు

మొ-ప్రహ—అక్కడున్నవాఁడు నీభర్తగాఁడు. నీభర్తయొక్క రూపమును ధరించివచ్చిన వజ్రహస్తుఁడు.

రెం-ప్రహ—ఆమాట పరమసత్యము. ఆవేషము వేసికొని వచ్చి నీతో నున్నవాఁడు వంచకుఁడయిన వజ్రహస్తుఁడే.

ధర్మా—ఇటువంటి వ్యవహారములలో పెద్దమనుష్యులు సభల కెక్కరాదు. ఎక్కినపక్షమున నుభయుల గౌరవమును బోవుటయే కాక యిల్లాండ్రకుఁగూడ నపఖ్యాతివచ్చును. ఈవిషయములో వాది ప్రతివాదు లిద్దఱును సఖ్యపడి సమాధాన పడవలెను.

మొ-ప్రహ—సభ కెక్కిన యీవ్యవహారములో నిఁక సఖ్యము కుదురదు. ధర్మాధికారులు సత్యము కనిపెట్టి దోషిని క్రూరముగా శిక్షింపవలెను.

రెం-ప్రహ—ఈ వజ్రహస్తుఁడు చెప్పినమాట సర్వజనశ్లాఘా పాత్రముగా నున్నది. ఏలినవారు దోషికి క్రూరదండనము విధింప వలెను.

మొ-ప్రహ—ఓరీద్రోహీ ! వజ్రహస్తుఁడవు నీవా ! నేనా ?

రెం-ప్రహ—ఓరివంచకుఁడా ! నీవు వజ్రహస్తుఁడవుగాక మఱి యెవ్వఁడవురా ? నీవు లోకమును వంచింపఁదలఁచుకొన్నను శ్రీమహేశ్వ రుని పంచముఖములవలెఁ గూరుచున్న యీ పండితపంచకమైనను నీమోసము తెలిసికోలేదనుకొన్నావురా ? ఓరిపాపాత్ముఁడా ! ఓరి క్రూర—

ధర్మా—మీలో మీరు పోట్లాడక యూరకుండుఁడు.—ఓ విద్వదగ్రగణ్యులారా! మీరే యిప్పుడు శాస్త్రసిద్ధాంతానుసారముగా ధర్మనిర్ణయము చేయవలెను. నిజముచెప్పక యింతసేపు మాకు నిష్కారణముగా నాయాసము కలుగఁజేసినందునకయి యీసారి యపరాధికి మే మతిఘోరశిక్ష విధింపఁదలఁచుకొన్నాము. మీరిప్పుడు సిద్ధాంతీకరింపవలసిన యంశములు—౧. వీరిలో వజ్రహస్తుఁడెవఁడు; ౨. వజ్రహస్తుఁడు నేరము చేసినాఁడా, లేదా? ౩. ఈమె నిజమయిన కైకసి యగునా! కాదా?—ముఖ్యముగా నీమూఁడంశములను మీరు శాస్త్రపద్ధతిని నిర్ధారణము చేయవలెను.

అని ఖరాసురుఁడు సెలవియ్యఁగానే సిద్ధాంతులాకాశమువంకఁ జూచియు వ్రేళ్ళు మడచియు నేలమీఁద నంకెలు వేసియు ముకుపుటముల వ్రేళ్ళు చొనిపియు నొండొరులతో గుసగుసలాడియు లెక్కలు వేసి తలపోఁతలకుఁ జొచ్చిరి. ఈలోపల ధర్మాధికారి పీఠముమీఁద వెనుక కొఱిగి యొక్క కునుకు కునికెను. సభలో నిలిచియున్న యుభయవాదుల పక్షములవారును విద్వాంసు లేమి సెలవిత్తురో యని వినవుత్సుకులై వేచియుండిరి. చూడవచ్చినవారందఱును వివిధవిషయములనుగూర్చి తమలోఁదాము సంభాషించుకొనుచుండిరి. ఈప్రకారముగా రెండుగడియలసేపు నడచునప్పటికి సిద్ధాంతులలో నొకరు లేఖకునిఁ బిలిచి తమయభిప్రాయములను వ్రాయవలసినదని చెప్పెను. మనదేశమునందు వలెనే యీదేశమునందును విద్వాంసులకు శాస్త్రజ్ఞానమేకాని యక్షరజ్ఞాన ముండదు. అందుచేతనే యీదేశమునందు వైయాకరణుఁడు తన చుట్టముల కుత్తరము వ్రాయవలసివచ్చినను లౌకికుల కొద్దకుఁబోయి వ్రాయించుకోవలసినవాఁడే కాని స్వయముగా వ్రాసికోనేర్చినవాఁడు కాఁడు. ఆసంగతి యటుండనిచ్చి కార్యాంశమును చిత్తగింపుఁడు. లేఖకుఁడు ధర్మా

ధికారిని లేపినపిమ్మట జ్యోతిష్కులు తమ సిద్ధాంతములను దెలిపిరి. వారిలో వృశ్చికరోముఁడును కంటకరోముఁడును రెండవ ప్రహస్తుఁడే వజ్రహస్తుఁడనిచెప్పిరి. తక్కిన ముగ్గురును మొదటిప్రహస్తుఁడే వజ్రహస్తుఁడనిరి. ఇఁక రెండవసారాంశములో వృశ్చికరోముఁడునుకంటకరోముఁడునువజ్రహస్తుఁడు నేరముచేసినాఁడనిరి. అగ్నిరోముఁడును, సర్పరోముఁడును వజ్రహస్తుఁడు నేరము చేయలేదనియు నతనియందలి ద్వేషముచేత భార్యాభర్తలేకమయి యీదోషారోపణముచేసినారనియు పలికిరి. మూఁడవసారాంశమును గూర్చి యేవురుసిద్ధాంతులును నైకకంఠ్యముతో నామె నిజమయినకైకసి యనియే సిద్ధాంతము చేసిరి. అప్పుడు వాదిబంధువు లగ్నిరోమ సర్పరోములు వజ్రహస్తునివలన లంచముగొనిరని కేకలు వేయఁజొచ్చిరి; ప్రతివాదిబంధువులు వృశ్చికరోమాదులు ప్రహస్తునివలన లంచములు గైకొనిరని కేకలువేయ నారంభించిరి. ధర్మాధికారి వారికలకలములువారించి సిద్ధాంతులలో నధికసంఖ్యగలవారి యభిప్రాయాను సారముగా వజ్రహస్తునికి రెండు సంవత్సరములు గారాగృహవాసశిక్ష విధించినట్లు తీర్పు వ్రాసి వినిపించెను. సిద్ధాంతుల యభిప్రాయము ననుసరించి తనకు శిక్షయగునని మొదటిప్రహస్తుఁడు వడవడ వడఁకుచు భూమిమీఁదఁబడి మూర్ఛపోయెను. అందఱును మూఁగి చన్నీళ్ళు చల్లి యాతనిని మూర్ఛ తేర్చునప్పటి కా సందడిలో రెండవ ప్రహస్తుఁడు కనఁబడక యదృశ్యుఁడయ్యెను. అప్పుడా యంతర్ధానము నొందివాఁడే నిజమయిన వజ్రహస్తుఁడని యెల్లవారికిని బోధపడెను. ధర్మాధికారి రాజభటులను జూచి యీఁగయయి యతఁ డెగిరిపోయి యుండును. పట్టుకొండని రాజభటుల కాజ్ఞాపించెను. వారు నానాముఖముల నరచుచు పరుగెత్తిరికాని వారికంటి కెవ్వరును నక్షత్రమండలము లోపలఁ గాన బడలేదు. ఈప్రకారముగా మొదటి వ్యవహారము

తీర్పుఁబడిన తరువాత దొంగతనపు వ్యవహారమును తీర్చుటకయి నేరము మోపినవానిని మోపఁబడినవానిని పిలిపింపుమని మరల ధర్మాధికారి లేఖకుని కుత్తరువు చేసెను.

అంతట లేఖకుని యొక్క యాజ్ఞాప్రకారముగా రాజభటులు దూషణుఁడు ధూమ్రమాక్షుని గొనివచ్చి ధర్మాధికారిముందట నిలువఁ బెట్టిరి.

ధర్మా—ఓ దూషణా! నీవు తెచ్చిన యభియోగమేమి?

దూష—ఈ ధూమ్రమాక్షుఁడు మాబంధువర్గములోనివాఁడు. దుస్సహవాసము చేత నితఁడు చిన్ననాఁటినుండియు దుష్టవర్తనుఁడయి జూదములాడుచు పూర్వు లార్జించియుంచిన ధనమునంతను పాడుచేసి విచ్చలవిడిగాఁ దిరుగుచున్నాఁడు. ఇతఁడు తన తల్లిదండ్రులు విధ్యుక్తముగా వివాహము చేసిన భార్యను విడనాడి జారవృత్తి నవలంబించి యొకవేశ్య నుంచుకొని యున్నాఁడు. విత్తములేనిదే వేశ్యచిత్తమును గొనుట యెప్పుడును సంభవింపనేరదు గనుక, విత్తహీనుఁడయిన ప్పుడు జారత్వమును చోరత్వ మనుసరించి యుండకమానదు. ఇతఁడు కొంతకాలము క్రిందట మాయింటికి చుట్టపుఁజూపుగావచ్చి చావడిలో నాడుకొనుచున్న మాచిన్నదానినగయొకటి త్రెంపుకొనిపోయి వేశ్య కిచ్చినాఁడు. రక్తస్పర్శ గలవాఁడగుటచేత మేమప్పుడీతనిని రచ్చకీడ్వక చీవాట్లుపెట్టి క్షమించి యూరకున్నాము. నిన్నటిదినము మాయింటికి మరల వచ్చి నా భార్యనగలపెట్టె యెత్తుకొని పాఱిపోయినాఁడు. పిల్లది చూచి యఱవఁగానే మేము వెంటఁబడితిమిగాని యితఁడు వీధిసబడి యేదో సందులోదూఱి యదృశ్యుఁడయినాఁడు.

ధర్మా—తరువాత నగలపెట్టె దొరకినదా?

దూష—దొరకలేదు. నేను వెంటనే రాజభటులను గొని

యితనియింటికిఁ బోయినాము. అప్పుడితఁడింటలేఁడు. ఇల్లు శోధించినాము గాని పెట్టె దొరకలేదు.

ధర్మా—ఇతఁడింటికే రానప్పుడు పెట్టె యెట్లు దొరకును? మీరు మొట్టమొదట వేశ్యయింటికిఁ బోవలసినది.

ధూమ—ఆపనియుఁ జేసినాము. పెట్టె కాని యితఁడు కాని యింట దొరకకపోఁగా మేమక్కడనుండి తిన్నగా వేశ్యయింటికిఁబోయి దాని యిల్లు శోధింపఁగా నొక మూలగదిలో నితఁడు దొరకెనుగాని పెట్టె మాత్రము దొరకలేదు. రాజభటు లితనిఁ బట్టుకొని దేవగసన్నిధికిఁ దెచ్చినారు. ఇతఁడు నగలపెట్టెను చంకక్రిందఁ బెట్టుకొని పరుగెత్తు చుండఁగా మేమందఱమును గన్నులారఁ జూచినాము.

ధర్మా—ధూమ్రమాతా! నీవేమి చెప్పుకొనెదవు? నీవు రాజ బంధుఁడవయ్యును నీదుష్ప్రవర్తనముచేత బంధులమగుమా కందఱి కిని తలవంపులు తెచ్చుచున్నావు.

ధూమా—నావెనుకటి నడతనుబట్టి నేనేమి చెప్పినను నా మాట యెవ్వరును నమ్మరు. మొదట చిన్నదాని నగయెత్తుకొని పోయి నమాట వాస్తవమేకాని యీసారిమాత్రము నగలపెట్టెను నేను దొంగిలింపలేదు. నగలపెట్టె పోయినదన్న సమయమున నేను వేశ్య యింటనే యున్నాను.

ధర్మా—జార చోరులమాట నమ్మరాదు.—ఓవిద్వచ్ఛిఖామణు లారా! నగలపెట్టె పోయినదో లేదో, ఆపెట్టె నితఁడపహరించినాఁడో లేదో, ఆపెట్టె యిప్పుడెక్కడనున్నదో, మీరే శాస్త్రదృష్టిచేతఁ జూచి సత్యము చెప్పుఁడు.

న్యాయస్థానమునకు వచ్చిన ప్రత్యభియోగమునందును మూఁడు సారాంశముల నేర్పఱుచుట యచ్చటి శాస్త్రమర్యాద. ధర్మాధికారి యీప్రకారముగా సారాంశముల నేర్పఱిచి వ్యవహారనిర్ణయ

ము చేయఁ గోరఁగా వెనుకఁ జెప్పినప్రకారముగానే సిద్ధాంతులు యథావిధిగా చేయవలసిన తంతునంతను నడపి యాలోచించి యీసారి యభిప్రాయభేదము లేకుండ పాపాశయముల మూఁటిని శాస్త్రదృష్టితో సావధానముగాఁ జూచి యేకవాక్యముగా సిద్ధాంతీకరించి సత్యమును జెప్పిరి. నగలపెట్టె పోవుట సత్యమేయనియు, దానిని తస్కరించినవాఁడే ధూమ్రాక్షుఁడేయనియు, ఇతఁడాపెట్టెను తానుంచుకొన్న వేశ్యకీయ్యగా నావేశ్య యాపెట్టెను తానుంచుకొన్న విటపురుషుని చేతికిచ్చి యిల్లు దాటించెననియు, వారేర్పఱచిన నిష్కృష్టాశయమును లేఖకుఁడు వ్రాసి ధర్మాధికారి చేతికిచ్చెను. అది చూచుకొని ధర్మాధికారి యాకాశమువంకఁ జూచి కొంతసే పాలోచించి, రాజబంధుని నీచతస్కరునివలె చెఱసాలకుఁ బంపుట యుచితము కాదని నిశ్చయించి, ధూమ్రాక్షునకు నూఱు సువర్ణములు ధనదండనము విధించి, ఆ మొత్తమును నెలదినములలోపల చెల్లించునట్లు తీర్పు చెప్పెను. ఆతీర్పు వినిపింపఁగానే సభలోనుండి త్రిశిరుఁడను రాజకుమారుఁడు ధర్మాధికారివద్దకు నడిచివచ్చి దొంగిలింపఁబడిన నగలపెట్టెను దెచ్చి యాతని పీఠముమీఁదఁ బెట్టి, ఆపెట్టెను ధూమ్రాక్షునిరూపముతో తానే దొంగిలించితినని చెప్పి, శిక్షగా విధించిన నూఱుసువర్ణములును చెల్లించి ధూమ్రాక్షుని విడిపించెను. అంతట ధర్మాధికారి మఱియొక్క వ్యవహారమును పరిష్కరించుటకయి వాది ప్రతివాదులను పిలిపింపుమని లేఖకుని కుత్తరు విచ్చెను. అప్పటికి నాపూజాసమయమును భక్తులు నాయాలయమునకు వచ్చు సమయమును సమీపించినందున, మహాకాయుఁడుగారు సభ ముగియువఱకు నుండక నన్ను వెంటఁబెట్టుకొని బండియెక్కి యింటికివచ్చిరి.

బండికుదుపుచేతఁగలిగిన యాయాసముకొంత శాంతిపొందినపిమ్మట నేను నాయజమానునితో నాఁటి సభావ్యవహారములను గూర్చి

ము జ్యోతిష్కుల సిద్ధాంతనిర్ణయమునుగూర్చియుమాటాడ నారంభించి తిని. నాయజమానుఁడు కొంతసేపు తానావిషయమయి నాతో మాటా డుట కిష్టములేని వానివలెఁ గనబడినను నేను విడిచిపెట్టక వేసిన ప్రశ్ననే మరలవేయుచు వచ్చుటచేత తుదకిష్టములేకయే నాప్రశ్నల కుత్తరము చెప్పవలసినవాఁడయినందున మాయిరువురకు నీక్రిందిరీతి సంభాషణముజరిగినది—

సత్య—ఓమహాప్రభూ! ఈజ్యోతిష్కుల వ్యవహారనిర్ణయ మెల్ల ప్పుడు నీప్రకారముగానే యుండునా? వేఱువిధముగా నుండునా?

మహా—ఎప్పుడు నిదేప్రకారముగా నుండును.

సత్య—ఏకశాస్త్రమువలననే సిద్ధాంతనిర్ణయము చేయవలసి నప్పుడు వీరిలోవీరి కభిప్రాయభేదము లేలకలుగును?

మహా—శాస్త్ర మొక్కటికాదు; శాస్త్రములనంతములు.

సత్య—శాస్త్రము లనంతములయినను, అన్నియు నే కవిధముగా ఫలమును జెప్పకపోయిన పక్షమున వానిలో కొన్ని యసత్యములు కావలసివచ్చును.

మహా—శాస్త్రము లసత్యము లెన్నటికినిగావు. ఈభేదమునకుఁ గారణము శాస్త్రార్థముచేయువారి బుద్ధివిశేషములో నుండును. ఫలము లను జెప్పువారు తమతమ బుద్ధ్యనుసారముగా నూహించి చెప్పుట వలన నిట్టి భిన్నాభిప్రాయములుకలుగుచుండును.

సత్య—నియమములేక యెవరిబుద్ధికి తోఁచినట్టు వా రర్థము చేయుచువచ్చినచో శాస్త్రములవలన ప్రయోజనమేమి?

మహా—శాస్త్రము లెవరిబుద్ధికి తోఁచినట్లు వారి కర్థమిచ్చు నవికావు. అవి యందఱికి నేకార్థమునే యిచ్చును. అయినను శాస్త్రార్థ నిర్ణయముచేయువారు ముహూర్తము తిన్నగా కట్టలేక పోవుటవలనను గణన తిన్నగా చేయలేకపోవుటవలనను ఫలములోఁ గొన్ని వ్యత్యాస ములుకలుగుచుండును.

సత్య—జనుల ధనప్రాణములతో సంబంధించిన వ్యవహారములలో సత్య నిర్ణయముచేయుట కేర్పాటుచేయఁబడిన పండితోత్తములైనను చక్కగా కాలము కట్టఁగలవారిని, సరిగా, లెక్కవేయఁగలవారిని విచారించి చేర్చుకొనరా?

మహా—పండితోద్యోగమునకు దేశములోఁ గల జ్యోతిష విద్వాంసులలో శ్రేష్ఠతములనే యేరి చేర్చుకొందురుగాని యిది గుప్త శాస్త్రమగుటచేత నెవ్వరు గట్టివారో యెవ్వరు కారో చెప్పుటయు దుస్సాధ్యము. ఇటువంటి శాస్త్రములు రహస్యముగా నుంచఁబడినంత కాలమే తమమహిమలను గలిగి యుండును గాని యందఱికిని వెల్లడించినచో మహిమలను గోల్పోయి పాటితప్పిపోవును. కాఁబట్టి శాస్త్రమన్నది యెవరికిని దెలియకుండ సదా గోప్యముగా నుండవలెను.

సత్య—తమరు సెలవిచ్చినది కొంతవఱకు సత్యమేకాని—

మహా—కాని యని నీవేమో సంశయపడుచున్నావేమి? నేను చెప్పినది సత్యముగునా? కాదా?

సత్య—తమరు సెలవిచ్చినది నిస్సందేహముగా సత్యము. అంతసత్యము అణుమాత్రమును లేదు. నాకు వేదవాక్యమునకంటెను తమవాక్యమునం దెక్కువ గౌరవము. సూర్యచంద్రులు గతులుతప్పినను తమ నోటినుండి యసత్యవాక్కు బయలువెడలునా? శాస్త్రమర్మము లెప్పుడును సర్వజనులకును వెల్లడిచేయఁగూడదు. అందులో ముఖ్యముగా మూఁడుశాస్త్రములు పరమగుహ్యములు. అందుచేతనే మాదేశము నందుగూడ చదువెఱుఁగనివారు సహితము జ్యోతిశ్శాస్త్రములోను, వైద్యశాస్త్రములోను, మంత్రశాస్త్రములోను, మహావిద్వాంసులయి జనసమ్మానముపొంది కోటీశ్వరు లగుచున్నారు.

మహా—ఈసంభాషణమునుబట్టి నీవు రహస్యోపదేశమునకు పాత్రుఁడవయినట్టు నాబుద్ధికి పొడకట్టినది కాఁబట్టి నేనిప్పుడు మర్మము

నిజిచి సిద్ధాంతులు చెప్పు ఫలములలో వ్యత్యాసము కలుగుటకుఁగల నిజమయిన కారణమును తెలిపెదను. నీవిది విశ్వాసహీనులతోఁ జెప్పక మహారహస్యముగా నుంచవలెను. ఇట్టి జ్ఞానదానమునకెల్ల వారును నర్హులుకారుసుమా!

సత్యా—తమరు సెలవిచ్చినది పరమసత్యము. జ్ఞానోపదేశమున కందఱును యోగ్యులుకారు. నేను యోగ్యుఁడనని తమచిత్తమునకు తోఁచిన పక్షమున—

మహా—నీయోగ్యతావిషయమై మాకణుమాత్రమును సందేహములేదు. జ్యోతిషము తప్పిపోవుటకు నిజమైన కారణము పరమేశ్వర శాపము. నీవు భక్తాగ్రేసరుఁడవగుటచేత పరమరహస్యమైనను దాచక నీకిది నేను సమగ్రముగా నుపదేశించినాను. నీ విది భక్తిహీనుల కెప్పుడును చెవిని వేయఁగూడదు. ఇప్పుడు నీకు తృప్తికలిగినదా?

సత్యా—నిజమైనకారణమును గ్రహించుటచేత నే నిప్పుడు పరమ సంతుష్టాంతరంగుడ నయినాను. ఇది యత్యంతగుహ్యమైన పరమ రహస్య మనుటకు సందేహము లేదు. ఇది దేవరహస్యమే కాకపోయిన పక్షమున, పురాణములనురచించిన మా దేశములోని సర్వజ్ఞులయిన మహా ర్షులకొక్కరికైన దెలిసియుండకపోవునా? నేను మా దేశము చేరిన తోడనే దీని పద్మపురాణముయొక్క యుత్తరభాగములోని యష్టోత్తర శతసహస్రాధ్యాయమునందుఁ జేర్చి వ్యాసప్రోక్తము చేయించెదను. తమరీ శాపకారణము నామూలాగ్రముగా సెలవియ్యవలెను.

మహా—పూర్వకాలమునందు శ్రీసాంబమూర్తివారు త్రిపురాసుర సంహారము చేయఁబూని యుద్ధసన్నద్ధులయియున్న ప్పుడు ముందుగా శుక్రాచార్యులవారా వృత్తాంతమును తమ జ్యోతిశ్శాస్త్ర మహిమచేఁ దెలిసికొని శిష్యులకు తెలుపగా, వారు శివుఁడు వచ్చులోపల తమ పురములతో పాతాళలోకము

రకు యాత్రవెడలిరి. తరువాత సమస్తసన్నాహములతోను శివుఁడు వచ్చి త్రిపురములను గాసక తనదివ్యదృష్టిచేత నిది యంతయు శుక్రాచార్యుల కృత్యమని తెలిసికొని జ్యోతిషమెల్లప్పుడును యథార్థము కాకపోవును గాకయని శపించెను. దీనిమర్మ మిది.

సత్య—నేను ధన్యుఁడనయినాను. తమరు మర్మమువిడిచి యీ రహస్యమును నాకానతిచ్చినందున, సెలవయినయెడల నాకు తెలిసిన రహస్యము నొకదానిని దేవర వారితో మనవిచేసెదను. జ్యోతిషమునకు పార్వతీశాపమున్నమాట మీరాపురాణములయం దెచ్చటనైనఁ జూచియున్నారా ?

మహా—లేదు. జ్యోతిశ్శాస్త్రమున కొక్క యీశ్వరశాపమే గాక పార్వతీశాపముకూడ నున్నదా ? ఏమి యీవింత !

సత్య—జ్యోతిశ్శాస్త్రము సందిగ్ధఫలముల నిచ్చుటకు ముఖ్యకారణము పార్వతీశాపమే. పూర్వము సాంబశివులవారు సభలోనుండి జ్యోతిశ్శాస్త్రముయొక్క సత్యమును పరీక్షింపవలెనని యెంచి బృహస్పతినిజూచి యిప్పుడు పార్వతీదేవి యేమి చేయుచున్నదో చెప్పుమనియడిగెను. అతఁడు శాస్త్రదృష్టిచేతఁజూచి పార్వతీదేవి వస్త్రహీనయై యభ్యంజనస్నానము చేయుచున్నదని చెప్పెను. ఆవాక్యముయొక్క యథార్థతను కన్నులార చూడవలెనని శివుఁడు తత్క్షణమే కొలువు విడిచి లేచి తిన్నగా నంతఃపురమునకుఁబోయి. నలుగుపిండితోఁజేసి ప్రాణప్రతిష్ఠ చేసి కావలియుంచిన విఘ్నేశ్వరుఁడు లోపలికి పోనీకపోఁగా నతనిశిరస్సు ఖండించి పోయి చూచి జ్యోతిశ్శాస్త్రముయొక్క సత్యమున కత్యాశ్చర్యపడెను. జ్యోతిశ్శాస్త్రమువలన స్త్రీలగుట్టు మగవారికి తెలిసిపోవుచున్నదిగదా యని పార్వతీదేవి యాగ్రహముతో జ్యోతిశ్శాస్త్రము ఫలింపక పోవునుగాక యని ఘోరశాపమిచ్చెను. జ్యోతిష్కులు చెప్పినఫలము తప్పిపోవుట కీశాపములే కారణములుగాని శాస్త్రమెంత మాత్రము నబద్ధముకాదు.

మహా—దేవతలంతయును మహాదుర్మార్గులు. అందులోను దేవగురువైన బృహస్పతి పరమదుర్మార్గుఁడు. కాకపోయినపక్షమున సమూల్యమైన జ్యోతిశ్శాస్త్రమునకు నిష్కారణముగా శాపము తెచ్చి పెట్టునా? ఇటువంటి దుష్కార్యమును జేసినందుకు మా రావణ మహా రాజుగారు శేకపోఁబట్టి బ్రతికిపోయినాఁడు. పాపీ చిరాయు వనుట చేత నెల్ల కాలము నాతనినే బ్రతుకనిమ్ము. సత్యమిప్పుడు నాకు పూర్ణ ముగా బోధపడినది. జగత్తునకు తల్లిదండ్రులయిన పార్వతీ పరమేశ్వరు లిద్దఱును శాపములు పెట్టిన తరువాత సిద్ధాంతులు చెప్పినఫలము తప్పి పోవుటలో నాశ్చర్య మేమున్నది? సిద్ధాంతులు లంచములు పుచ్చు కొని తప్పుఫలములను చెప్పుదు రంకరుగాని చెప్పినఫలములు తప్పిపోవు టకు లంచము లక్కఱలేక యీశాపములే చాలును.

ఇంతవఱకు సంభాషణ జరుగునప్పటికి నాపూజాసమయమును భక్తులు దర్శింపవచ్చు సమయమును సమీపించినందున నాయర్చకులు రాఁగా మహాకాయుఁడుగారు నన్ను విడిచి లోపలికిఁ బోయిరి. అంతట నేనిదివఱకు వర్ణించినప్రకారముగా నానిత్యకృత్యములు యథావిధిగా జరుగ నారంభించెను.

---

## అయిదవ ప్రకరణము.

---

సభాసందర్శనము చేసి వచ్చిన తరువాత మూఁడవనాఁడు మధ్యాహ్నము మూఁడు గంటలవేళ మహాకాయుఁడుగారువచ్చి, నేఁడు జ్యోతిశ్శాస్త్రమునుగూర్చి సభ జరుగఁబోవుచున్నది గనుక తనవెంటఁ జూడ రమ్మని నన్ను పిలిచిరి. మొన్న బండిలో తగిలిన కుదుపువలన గలిగిననొప్పి యింకను తిన్నగా పోకపోయినను, ఆయనమాటకు మాఱు

పలుక వెఱచి ప్రమాణమై యాయనవెంట బయలుదేరితిని. బండిలో నెక్కినది మొదలుకొని సభామందిరము చేరువఱకును జరిగినకథ యంతయు నించుమించుగా వెనుక వర్ణించినరీతిగానే యున్నది; గాని బండి దిగినతరువాత వెనుకటివలె మాయజమానుఁడు గాక సేవకుఁడే నన్ను లోపలికిఁ దీసికొనిపోయి యొక యున్నతాసనముమీఁదఁ గూరుచుండఁబెట్టెను. మేము వీథిగుమ్మము చేరఁగానే నాఁటిదినము సభలో తాను ధూమ్రమాత్రవేషముతో నగలపెట్టెను దొంగిలించితినని చెప్పియిచ్చిన త్రిశిరుఁడు మాకెదురుగా వచ్చి ప్రత్యుత్థానముచేసి నన్ను లోపలికిఁ గొనిపోయి యుచితాసనముమీఁదఁ గూరుచుండఁబెట్టెను. మేము పోవునప్పటికే సభాభవనము మహాజనులతో నిండి యుండెను. అందులోఁ గొందఱు పాశ్చాత్యశాస్త్రానుబద్ధమని వాదించుటకయి యక్కడకు వచ్చిరి; మఱికొందఱు వారివాదమును ఖండించి పూర్వసిద్ధాంతమును స్థాపించుటకయి వచ్చిరి; తక్కినవా రుభయవాదములను విని వేడుక చూచుటకొఱకును నవనాగరికులను గేలిచేయుటకొఱకును వచ్చిరి. అప్పు డుపన్యాససమయ మయినందున పూర్వపక్షులలో నొకరు లేచి త్రిశిరుఁడుగారి నగ్రాసనాసీనునిగా నేర్పఱుపఁగోరెను; వెంటనే సిద్ధాంతులలో నొకరు లేచి నవనాగరికాగ్రగణ్యుఁడయిన యాయన నాపనికి నియమించుట కాక్షేపించి మహాకాయుఁడుగారి నగ్రాసనాసీనునిగా నేర్పఱుపఁగోరెను. అట్టి పూర్వనాగరికాగ్రగణ్యుఁ డగ్రపీఠమున కనర్హుఁడని మఱియొకఁడు లేచి నిషేధించెను. ఈ ప్రకారముగా వీరు నియమించినవారిని వారు పనికిరారనియు, వారు నియమించినవారిని వీరు పనికిరారనియు, ఉభయపక్షములవారును రెండుగడియలు తగవులాడినపిమ్మట నుభయపక్షములవారు నంగీకరించినవా రొక్కరును దొరకకపోవుటచేత నాఁటికి సభ ముగియునట్లు కనఁబడెను. ఇంతలో నొక బుద్ధిమంతుఁడు లేచి లంకానగరవాసులందఱు

నేదో యొకపక్షములోఁ జేరినవారగుటచేత వారిని విడిచి విదేశీయు డయి నిష్పక్షపాతబుద్ధి గలవాఁడనయిన వాలఖిల్యమహర్షిని అగ్రాసనసీనునిజేసి సభసాగింపవచ్చునని యాలోచన చెప్పెను. ముల్లోకములన గ్రాసింగఁజాలిన దేవాంతక నరాంతకులవంటి మహాసముఘులంతమంది స్వదేశస్థులుండఁగా వ్రేలికణుపెను లేని యంగుష్ఠమాత్రశరీరుని పరదేశస్థుని కగ్రపీఠమిచ్చుట యవమానకరమని దేశాభిమానులు కొందఱాక్షేపించినను అర్వాతరులు మఱియెవ్వరును దొరకనందున పరస్పరజయకాంక్షులయియున్న యుభయపక్షములవారిలో ప్రధాన పురుషులు నాఁడే తమవిజయమును లోకవిశ్రుతము చేయవలెనన్న యపేక్షచేత నన్నగ్రాసనాసీనునిగా నంగీకరించిరి. నేను సూక్ష్మకాయుఁడనగుటచేత కుర్చీలోఁ గూర్చున్నపక్షమున నన్ను సభికులు చూడఁజాలరని యుపన్యాసకుని ముందుంచిన బల్లమీఁద నన్నుఁ గూరుచుండఁబెట్టిరి. ఉపన్యాసకునిపేరు దీర్ఘరోముఁడని సభవారిలో నొకరు నాతోఁజెప్పిరి. అతఁడు వచ్చి బల్లముందు నిలుఁవబడినప్పుడు మన దేశపునరపరిమాణమునుబట్టి నీలిపగ్గములవలె మూఁడునాలుగు నిలువుల పొడవుగలిగి నేను గూరుచున్న బల్లనంటుచున్న యాతని గడ్డపు వెండ్రుకల దీర్ఘత్వమునుబట్టి దీర్ఘరోముఁడన్నది సార్థకనామధేయమని నేను భావించితిని. ఉపన్యాసవిషయమయి నేను సభవారికి విన్నవించినపిమ్మట నుపన్యాసకుఁడు తనయుపన్యాసము నుపక్రమించెను. మనవారు గ్రంథములలో మేఘగంభీరభాషణము లని వర్ణింపఁగా వినుటయేకాని పిడుగులుపడినట్లు కర్ణకఠోరముగా నాఁడాతని మాటలు చెవినిబడువఱకును మేఘగంభీరభాషణముల యర్థము నాకనుభవమునకు రాలేదు. ఆదుస్సహమయిన శ్రవణవిదారణదారుణశబ్దములకు తాళలేక నేను నాచెవులలో గుడ్డలు దూనుకొంటి

నియాయుపాయముచేత సద్దణఁగినందునను బండికుదుపుచేతఁ గలిగిన యాయాసముచేత నిద్రవచ్చినందునను నావెనుకనుంచిన దిండునకుఁ జేరగిలఁబడి నేను హాయిగా నిద్రపోయినాను. సభికులుమాత్రము నాగుట్టు తెలిసికోలేక నేను యోగముపట్టి యోగనిద్ర నవలంబించి దివ్యదృష్టిచేతను దివ్యజ్ఞానముచేతను నాఁటియుపన్యాసమును మాత్రమే గాక జ్యోతిశ్శాస్త్రముయొక్క సత్యమునుగూడ గ్రహించుచున్నా నని తలఁచిరి. అందుచేత నుపన్యాసముయొక్క ప్రథమభాగమును మీకుఁ దెలుపకపోయిన తప్పిదమును దీనిని జదువువారు మన్నిం తురని నమ్మెదను. ఆవిషయమును తరువాత నితరులనడిగి తెలిసికొని మీకు తెలిపియుందునుగాని అట్లుచేసినచో నాయోగమహిమకే భంగ ముకలిగి జనులలో శాస్త్రమునం దవిశ్వాసము కలుగునన్న భీతిచేత నేనితరుల నడుగక శాస్త్రమర్యాదను కాపాడుటకు కంకణము కట్టుకొన్న మీరు నాసమయోచితబుద్ధిని శ్లాఘింతురన్న పూర్ణ విశ్వాసముచేత శాస్త్రగౌరవమును నిలువఁబెట్టినాను. నేను గాఢ నిద్రలోనుండగా నుపన్యాసకుఁ డేదో ముఖ్యాంశమును జెప్పుచు బల్లమీఁద నొక దుద్దుగుద్దెను. ఆగుద్దుతో నన్నావఱకాశ్రయించి యున్న నిద్రాదేవి భయపడి నన్ను ముందుకుఁ బడద్రోచి క్షణకాల ములో నన్నువిడిచి పాఱిపోయెను. నేనును కన్నులు తెఱచిచూచి మెల్లగాలేచి మరల యథాస్థానముచేరి దిండునానుకొని సావధానచిత్తుం డనై కూరుచుంటిని. అప్పుడు నన్నుఁజూచిన సభాస్తారు లీమహా మునియొక్క యోగనిష్ఠకు నడుమ భంగముచ్చినదని కొందఱును; ఈమహర్షి తనంత తానే లేచినాఁడుకాని సమాధి చెడలేదని కొంద ఱును, సమాధి చేసినపక్షమున మౌనముద్రపూని ప్రాణాయామము పట్టి మరల యోగనిద్ర వహించునని కొందఱును, నానావిధములఁ జెప్పుకొనసాగిరి. ఇంతలో నుపన్యాసకుఁ డితరులమాటలు చెవిచొర

కుండ తానే యుచ్చైస్స్వరముతో మాటాడఁజొచ్చినందున వారిమాటలు పూర్ణముగా వినుటకు నాకవకాశము లేకపోయినది.

ఉపన్యాసకుఁడు—ఈపాడుజ్యోతిశ్శాస్త్రము వివేకమును పాఱఁద్రోసి బుద్ధిని మ్రింగివేసి యాలోచన నడఁగఁద్రొక్కి తెలివిగలవారిని సహితము సమస్త విషయములయందును వంచకులయినమూఢులకు దాసులను జేయుచున్నది. శాస్త్రనామము ధరించిన యీపిశాచముయొక్క సమ్మోహనయంత్రములోఁ జిక్కి భ్రమపడి మనుష్యప్రకృతి కలంకారమయిన స్వాతంత్ర్యమును పోఁగొట్టుకొని మనమందఱమును నిష్కారణముగా బుద్ధిపూర్వకముగాఁ దెచ్చుకొన్న కష్టములపాలయి బాధపడుచున్నాము. మనమొకయిల్లు కట్టుకోవలెనన్నచో మనకిష్టమయిన తావునను సమయమునను కట్టుకొనక మూర్ఖసిద్ధాంతిచెప్పిన తావునను ముహూర్తమునను కట్టుకొనవలసినవారమగుచున్నాము; నుయ్యి త్రవ్వించుకోఁ దలఁచుకొన్నచో మన మనస్సునవచ్చిన యనుకూలమైన తావున త్రవ్వించుకొనక మూర్ఖసిద్ధాంతి చూపిన మూలను త్రవ్వించుకొనవలసినవారమగుచున్నాము; మన బిడ్డకు పెండ్లిచేయుఁదలఁచుకొన్నచో మనకనుకూలుఁడుగా కనఁబడు వరుని నిర్ణయించి వీలయినకాలమునందు వివాహముచేయక మూర్ఖసిద్ధాంతి పెట్టిన నిశాముహూర్తమునందో యెప్పుడో ప్రవర్తనచేతఁగాకపోయినను జన్మపత్రముచేత నతఁడు మంచివాఁడన్న వరుని కిచ్చి పెండ్లిచేయ వలసినవార మగుచున్నాము. మనమొక యూరికి పోఁదలఁచుకొన్నచో మనకు తీఱికయైన సమయమున బయలుదేఱక మూర్ఖసిద్ధాంతిచెప్పిన దినమునందును వారమునందును కాలమునందును ప్రయాణము కావలసిన వారమగుచున్నాము; మనము క్షౌరము చేయించుకోఁ దలఁచుకొన్నచో మన కవకాశముగా నున్ననాఁడు చేయించుకొనక మూర్ఖసిద్ధాంతి చెప్పిన తిథివారముల

యంచే తల గొఱిగించుకోవలసిన వారమగుచున్నాము. మనము క్రొత్తబట్టను కట్టుకోఁదలచినచో కావలసినప్పుడు కట్టుకొనక మూర్ఖసిద్ధాంతి తెలిపిన దినమును వారమును వచ్చువఱకును వేచియుండ వలసినవారమగుచున్నాము. వేయేల? మనము క్రొత్తగా భార్య వద్ద పరుండఁ దలఁచుకొన్నను, గృహమునఁ బ్రవేశింపఁదలఁచుకొన్నను, క్షౌరమునకు మందు పుచ్చుకోఁదలఁచుకొన్నను, మూర్ఖసిద్ధాంతియే మనకు కాలనిర్ణయము చేయవలెను. ఇట్టి నిత్యకృత్యములలోనే మనకు స్వాతంత్ర్యము లేనిచో లోకములో నింతకంటె క్రూరదాస్యము మఱియేముండును? మూర్ఖసిద్ధాంతి—;

వృశ్చికరోముఁడు—మీరు మూర్ఖసిద్ధాంతియని లోకోపకారులయి మహావిద్వాంసులయిన జ్యోతిష్కులను నిర్హేతుకముగా దూషించి మహాదోషము కట్టుకొనుచున్నారు. ఈసిద్ధాంతులే యుండి వివాహాదికార్యములయందు మంచిముహూర్తములు పెట్టి లోకమున కుపకారము చేయనిచో లోకమెట్టి దురవస్థల పాలగునో—

ఉప—మీరుపన్యాసమధ్యమున మాటాడరాదు—

మహాకాయుఁడు—మీరు సిద్ధాంతులను మూర్ఖులని దూషింపరాదు.

త్రిశిరుఁడు—మీరింకముందు సిద్ధాంతికిముందు మూర్ఖశబ్దము పెట్టక మాటాడుఁడు.

ఉప—సిద్ధాంతులు లోకమునకుఁ జేయుచున్న యుపకారము చెప్పనక్కఱలేదు. లోకములోనున్న జాతకపత్రికలలో నెల్ల నుత్తమమైనదని చెప్పి యొకవరుని నిర్ణయించి మంచిముహూర్తము పెట్టి వివాహముచేయించి యీసిద్ధాంతి మంచిదోవతులచాపు కట్టుకొని పోయిన మూఁడుమాసముల పదిదినములలో జాతకపత్రికలలోని నూరేండ్లును ముహూర్తబలముచేత నూఱుదినములుగా మాఱఁగా

ఇల్లాలు వైధవ్యదుఃఖ మనుభవింపవలసినదైనది. ఈ సిద్ధాంతి చెప్పిన ముహూర్తమునందు కట్టించి, పెట్టిన సుముహూర్తమునందు గృహప్రవేశమయిన మాపొరుగువారు నెలదినములలోపల గృహయజమానులు స్వర్గస్థులు కాఁగా తా మారుమాసము లిల్లుపాడుపెట్టిచి పొరుగువారికప్పగించక చేరవలసినవారైరి. నా మిత్రుని తండ్రి యొన్నియో దినములుగా నీ సిద్ధాంతిచెప్పిన ముహూర్తమునందు గ్రామాంతరమునకు బయలుదేఱినను త్రోవలో దొంగలు కొట్టఁగా బండి పిఱుఁగబడి కాలువిఱుగఁగొట్టుకొని యర్ధరాత్రమునందు మరల స్వగృహమును జేరవలసినవాఁ డయినాఁడు.

పృచ్ఛ—అయ్యలారా! చిత్తగించినారా? ఈయన నన్నెట్లు దూషించుచున్నాఁడో! మూర్ఖపదము ప్రయోగించినప్పటికన్నను, ఈదూషణభాషణము లధికకర్ణకఠోరములుగా నున్నవి. పెద్దమనుష్యు లింతమందియుండి పండితదూషణ జరుగుచుండఁగా చూచి యూరకుండుట మీకు ధర్మమా! వారిగ్రహచారము చాలక యాపదలు తటస్థమయినప్పుడు నేనేమిచేయఁగలను? ముహూర్తములు పెట్టుట నాపనికాని యాపదలు తప్పించుట నాపనికాదుకదా?

త్రిశి—మీరు మంచిముహూర్తములు పెట్టుటచేత విపత్తులు తొలఁగనిపక్షమున మీముహూర్తములతో నేమిప్రయోజనము?

మహా—మధ్య మీరు మాటాడుట యుక్తముకాదు. సామాన్యముగాఁ జెప్పక వక్కాణించి యొక్కరినిగూర్చి చెప్పుట యుపన్యాసకునికి మంచిపనికాదు. జ్యోతిషమువలన లాభమే లేకపోయిన పక్షమున నింతకాలమునుండి సర్వజ్ఞులయిన మనపెద్దలందఱును జన్మపత్రములు వ్రాయించుకొని సమస్తకార్యములకును శుభముహూర్తములు పెట్టించికొనుచుందురా? వ్యవహారదక్షులయిన ప్రభుత్వమువారు వ్యవహారనిమిత్తము జ్యోతిషవిద్వాంసులను నియమించుచుందురా?

త్రిశి—వీరి వ్యవహార నిర్ణయమునందలి సత్యము మొన్ననే కదా సభలో బయలఁబడినది? కల్పవృక్షములవలె పండితు లయిదు గురుచేరి సభలోఁగూరుచుండి నేను గొనిపోయిన నగలపెట్టెను ధూమ్రాక్షుఁడు దొంగిలినట్లు సిద్ధాంతముచేసినారు.

మహా—అదియంతయు మోసము. నిజమైన వ్యవహారములో నిజము తెలియును గాని పరీక్షింపవలెనని మోసముచేసిన వ్యవహార ములో సత్యమెట్లు బయలఁబడును?

ఉప—నాయుపన్యాసము ముగియనిత్తురా?

మహా—కానిండి.

ఉప—లోకమునకుఁ గలిగెడియుపకారము లోకములోనివా రైన యీసిద్ధాంతులకేకాని యితరలోకమున కణుమాత్రము గలు గదు. మనయింట కన్య రజస్వలయైనచో శాంతికావలెనో లేదో తెలిసికొనుటకయి ముందుగా సిద్ధాంతిగారికి దక్షిణముట్టవలెను; మన యింట నెవ్వరయిన పుట్టినపక్షమున పితృగండమున్నదో లేదో తెలిసి కొనుటకయి ముందుగా సిద్ధాంతిగారికి దక్షిణముట్టవలెను; మనయింట నెవ్వరయిన చచ్చిరేని యిల్లు విడిచిపెట్టి లేచిపోవలయునో లేదో తెలిసికొనుటకయి ముందుగా సిద్ధాంతిగారికి దక్షిణముట్టవలెను. ఈప్రకారముగా పుట్టినది మొదలుకొని చచ్చువఱకును చెవులు కుట్టి నను, పుట్టువెండ్రుకలు తీయించినను, అన్నము ముట్టించినను, చదువ వేసినను, మఱియేపనిచేసినను సిద్ధాంతిగారిచేత ముహూర్తము పెట్టించుకొని యాయనకు ముట్టవలసినముడుపు నెప్పుడో యొకప్పుడు చెల్లింపక తప్పదు.

మహా—మీరు సిద్ధాంతులను వారివృత్తిని నిందింపఁగూడదు. వారు జనులకు ఫలములు చెప్పియు ముహూర్తములు పెట్టియు పడిన ప్రయాసమునకు ప్రతిఫలముగా ధనస్వీకారము చేయుచున్నారు. కాని

యూరక చిల్లిగవ్వయైనను గ్రహించుచుండలేదు. చేతనైన పక్ష మున మీరు జ్యోతిశ్శాస్త్రము బద్ధమనుటకు చాలిన యుక్తులను చెప్పుఁడు అప్పుడు మీ హేత్వాభాసములను ఖండించుటకు మేము పూను కొందుము.

ఉప—ముహూర్తజాతకభాగము లసత్యమనుట కణుమాత్ర మును సందేహము లేదు. ఈగ్రామమునం దిద్దఱు రాజపుత్రు లొక స్త్రీనిమిత్తమున గర్భశత్రువులయి యొకరి నొకరు చంపవలెనని నిశ్చ యించుకొని యిద్దఱును వెఱియొక జ్యోతిష్కునియొద్దకుఁబోయి యుద్ధ విజయమునకు ముహూర్తము పెట్టుమని యడిగిరి. ఇద్దఱు జ్యోస్యు లును శాస్త్రవిచారముచేసి నాఁటిసాయంకాలము నాలుగు గడియల ప్రొద్దుండఁగా శత్రువిజయమునకు మంచి సమయమని ముహూర్తము పెట్టిరి. తనకే విజయము కలుగునని మొదటివాఁడును తనకే గెలుపు కలుగునని రెండవవాఁడును మనస్సులలో నమ్మి తాము జ్యోతిష్కుల నాలోచించిన మాట యొండొరులకు తెలియ నీయక రహస్యముగానుంచి యుద్ధాహ్వానములు మాత్రము చేసి కొని యిద్దఱును బయలుదేఱి ముహూర్తసమయమున కూరిబైలికి పోయి ఘటికాయంత్రములు ముందుంచుకొని సరిగా యుక్తసమయ మున దుష్టకత్తులతో యుద్ధమారంభించిరి. ఇద్దఱును పరస్పర జయకాం క్షచేత చావమోఁదుకొనఁగా నందొకఁ డప్పుడే దెబ్బలచేత కాలధర్మ మునొందెను. రెండవవాఁడు కంటికిదెబ్బతగిలించుకొని చావుతప్పి కన్నులొట్టబడి యొంటికంటితో బ్రతికెను. ఆమహాశూరులెవ్వరో, వారికి ముహూర్తము పెట్టిన మహాసూరు లెవ్వరో మీరందఱు నెఱు గుదురు. శాస్త్రమే యసత్యము కానిపక్షమున, ఏకముహూర్త మునందే యుద్ధ మారంభించినయొక్కరి కపజయమును నొక్కరికి జయ మును నేల కలుగవలెను? ఇంకొక్క నిదర్శనము చూడుఁడు.

మా పెద్దతమ్ముఁడును మా పాలికాఁపువాని పెద్దకొడుకును త్రుటికాల
మైనను భేదములేక సరిగా నేక ముహూర్తమునందే జనన మొందిరి.
జనన సమయమునం దిరువురకును గ్రహము లేకస్థానమునందే యున్నం
దున సమాన ఫలమునే యియ్యవలసినను, మా వాఁడు చదువుకొని పరీ
క్షల నిచ్చి గొప్ప యుద్యోగము చేయుచుండఁగా మా పాలికాపుకొడుకు
చదువ వెలుఁగక పొలము దున్నుచు నీచదశయందే యున్నాఁడు. శాస్త్ర
మబద్ధము కానిపక్షమున, ఏకసమయముననే జనన మొందిన యిరువుర
కును గ్రహములు విరుద్ధఫలముల నేల కలుగఁజేయవలెను? సిద్ధాం
తులు చెప్పిన ఫలములు కొందఱికి సరిగా కలుగ వచ్చును. అప్పుడు
సహిత మాఫలములు దైవికముగా కలిగినవే కాని సిద్ధాంతి యెఱిఁగి
చెప్పుటవలనఁగలిగినవి కావు. ఏఁబదియేండ్లు బ్రతుకుదురని జన్మపత్రములలో
వ్రాయఁబడియున్నవారు కొందఱంతకాలము జీవించినను, పలువు రంతకు
లోపలను ముగ్గురు నలుగు రటు తరువాతనుగూడ మృతులగుదురు.
ఈప్రకారముగానే కష్టములును సుఖములును దైవికముగా కొందఱికి
చెప్పినట్లు కలిగినను పలువురకు కలుగవు. కార్యసాఫల్య మెప్పుడును
యుక్తసమయమున తగినపని చేయుటవలనఁ గలుగునుగాని ముహూ
ర్తమువలనఁ గలుగదు. ఇల్లు కాలుచున్నప్పుడు వెంటనే నీరు
పోసినచల్లాఱును గాని ముహూర్తము నిమిత్తము వేచియుండినచో
చల్లాఱదు. పాముకఱచినప్పుడు తత్క్షణమే విషవైద్యునికొఱకు పరుగెత్తి
చికిత్స చేయించిన విషము దిగునుగాని ముహూర్తము నిమిత్తము
వేచియుండినచో విషబాధ తగ్గదు. ఈవిధముగానే వ్యవసాయమునం
దైనను, వాణిజ్యమునం దైనను, మఱియేయితరవ్యాపారమునం దైన
ను ముహూర్తముల నిమిత్తము వేచియుండక యుక్తసమయమునందు
కృషిచేసినప్పుడు మాత్రమే కార్యసాఫల్యమగును. మంచిముహూర్త
మును నిరీక్షించుచు పనిచేయక యోగ్యసమయమును వ్యర్థపుచ్చి

నచో మేలు కలుగుటకు మాఱుగా కార్యవిఘాతము గలిగి కీడు మూడును.

మహా—మీరు చెప్పెడు మాటలు యుక్తికిని లోకానుభవము నకును శాస్త్రమునకు విరుద్ధముగా నున్నవి. మంచిసిద్ధాంతి శాస్త్రముచూచి యాలోచించి చెప్పినప్పుడొక్క యక్షర మైనను హెచ్చుతగ్గులు లేక ఫలములు సరిగా కలుగును. నాతమ్ముని జన్మపత్రమును మొన్న నేనొక సిద్ధాంతికి చూపఁగా వెనుక జరిగిన దంతయు పూస గ్రుచ్చినట్లు సరిగా నతఁడేకరువు పెట్టినాఁడు. శనిమహాదశలో నాకు ప్రాణాంతకరమైన రోగము వచ్చునని ముందుగానే యొకసిద్ధాంతి చెప్పి తప్పించుకొనుటకు ప్రతిక్రియ చేసికొమ్మని యుపదేశింపఁగా, నేను మెలఁకువపడి యుక్తసమయములో శనిగ్రహజపముచేయించి గ్రహ శాంతినిమిత్తము సంతర్పణము చేయించునప్పటికి నాకు రోగము రానేలేదు. జ్యోతిశ్శాస్త్రము నిజమనుట కింతకంటెను ప్రబల నిదర్శన ములు మఱేమి కావలెను?

ఉప—మీరు సెలవిచ్చినవానిలో నొక్కటియు నిదర్శన మని చెప్పుటకు వీలుపడదు. గతము చెప్పుట యొకగొప్పకాదు. అట్లు చెప్పిన దంతయు శాస్త్రజ్ఞానము వలననే చెప్పఁబడిన దనుటకును వలనుపడదు. ఈజ్యోతిష్కులవద్ద సాధారణముగా లోకులసంగతులను తెలిసికొనివచ్చి గ్రహములకంటెను సూటిగా రహస్యముగా గురువులకు తెలుపఁగలశిష్యు లుందురు. అంతేకాక వారు తఱుచుగా మాయోపాయ ముల చేతను కొన్ని సమయములయందు ధనదానముచేతను కుటుం బములయందలి పరమ రహస్యములను సహిత మాకుటుంబములోని స్త్రీలవలనను పిల్లలవలనను సేవకులవలనను గ్రహించి యవి తమకు ప్రాణములేనిగ్రహములు చెప్పినట్టుగా చెప్పి వివర్శ లేనివారి కాశ్చ ర్యము కలిగింతురు. గ్రహపూజవలన మీకు రావలసినరోగ మేమో

రాక తప్పిపోయినట్లు మీరు సెలవిచ్చుచున్నారు. శాస్త్రమే నిజమయి దానివలన తప్పక రోగము రావలసియుండినపక్షమున రోగము వచ్చి తీఱవలెనుగదా? గ్రహశాంతికయి సంతర్పణములు సమారాధనములు చేయుటవలన రావలసినయుపాయము తప్పెననుట జ్యోతిష్కులును పురోహితులును చేరి స్వోదరపూరణార్థమయి పన్నిన మాయోపాయము. నిజముగా రోగము వచ్చినపక్షమున, గ్రహచారము తిన్నగా లేక శాస్త్ర ప్రకారము వచ్చెనందురు. రోగము రాకపోయినపక్షమున, నవగ్రహజపాదులవలనను సంతర్పణములవలనను తప్పిపోయిన దందురు. ఈకపటోపాయమువలన జ్యోతిష్కులు చెప్పిన ఫలము తప్పిపోయినయెడల తమమీఁద నింద లేకుండ తప్పించుకొనుటకును, పురోహితులు మొదలయినవారి కండజికి నుదరపోషణము జరుగుటకును మార్గము కలుగుచున్నది. అంతేకాక యాకాశమందలి యచేతనములైన గ్రహము లెక్కడ? సచేతనులైన జీవులకు ఫలములిచ్చు టెక్కడ?

మహా—మీకు యుక్తు లెంతమాత్రమును విశ్వాసార్హమయినవి కావు. గ్రహములు జీవకోట్లకు తప్పక ఫలములిచ్చును. గ్రహములకును మనకును సంబంధము కలదనుటకు మీకు నేను కొన్ని ప్రత్యక్ష నిదర్శనములు చూపెదను. చంద్రోదయాస్తమానములను బట్టి సముద్రమునకు పోటును పాటును వచ్చుచుండుట మనకు ప్రత్యక్షమే కదా? దీనికి మీరేమి చెప్పఁగలరు? అదిగాక పూర్ణిమ మొదలయిన పర్వదినములయందు వెఱ్ఱి మొదలయినరోగములు ప్రబలుచుండుట యనుభవసిద్ధము. గ్రహములకే మనరోగాదికమునువృద్ధి చేయుట మొదలైన శక్తులు లేకపోయిన పక్షమున, అట్లేల జరగును. దుర్ముహూర్తమునం దారంభించిన పనులు చెడుట నేను స్వానుభవముచేత నెఱుఁగుదును. నేను కొన్ని దినములక్రిందట బృహస్పతికాల

మునందు బయలుదేఱి దేవతాదర్శనమునకు వెళ్ళి పూజారులు దేవాలయముయొక్కతలుపులు తీయకపోఁగా దేవతాదర్శనము చేయకనే యెండలో మరల నింటికి రానలసినవాఁడనయినాను.

బృహస్పతికాలమనఁగా నేమో మనభరతఖండవాసులకు తెలియకపోవచ్చును. లంకలోఁ బుట్టినవారెల్లరును రాక్షసులగుటచేత రాక్షసుఁడైన రాహుగ్రహము వారికి శుభగ్రహము; దేవతా గురువగుటచేత బృహస్పతి వారికి పాపగ్రహము. ఈదేశమునందు మనము రాహుకాల మశుభసూచకమని యెట్లెంతుమో యట్లే యీదేశమునందు వారు ప్రతిదినమును కొన్నిగడియలకాలమును బృహస్పతికాలమని చెప్పి యాకాల మశుభసూచకముగా పరిగణించి యేకార్యమును జేయక విడుతురు.

ఉప—వేఁడియెండ కాచినప్పుడు తీక్ష్ణములయిన సూర్యకిరణములచేత నేయి మొదలయినవి కరఁగునట్లును మనదేహములకు తాపమెక్కునట్లును మొత్తముమీఁద చంద్రాదిగ్రహములు పదార్థములకు కొన్నిమార్పులను గలుగఁజేయఁ గలుగును; గాని యొకపదార్థమున కొకవిధముగాను మఱియొకపదార్థమునకు మఱియొకవిధముగాను మార్పులను గలుగఁజేయఁజాలవు. ఎండలోఁ బెట్టినప్పు డన్నిగిన్నెలలోని నేయి కరుఁగవలసినదే కాని యొకగిన్నెలోని నేయి కరఁగుటయు, నొకగిన్నెలోని నేయి కరగక పోవుటయు తటస్థింపదు. చంద్రోదయాదులనుబట్టి పోటో పాటో సమస్త సముద్రములకును నేకరీతిగా కలుగునే కాని చంద్రోదయముచేత నొక సముద్రమునకు పోటును మఱియొకసముద్రమునకు పాటును గలుగవు. ఆవిధముగానే గ్రహగతుల వలనను గ్రహస్థితులవలనను ఫలము గలిగెడుపక్షమున సమస్త జనులకు నేకఫలము కలుగవలెనే కాని వివిధజనులకు వివిధఫలములు కలుగుట యెన్నఁడును తటస్థింప నేరదు. కాఁబట్టి వివిధజనులకు వివిధ

ఫలముల నిచ్చునని చెప్పెడు జ్యోతిశ్శాస్త్రము విశ్వాసార్హ మయినది కాదు. బృహస్పతికాలమునందు వెళ్ళువారికి కొందఱికి దైవికముగా కొన్ని సమయములయందు కార్యవిఘాతము కలిగినను కొందఱికి కొన్ని సమయములయందు కార్యసిద్ధి యగుటయుఁ గలదు. నే ననేక పర్యాయములు బృహస్పతికాలములో బయలుదేఱినను నాకు కార్య సిద్ధి యగుచునే వచ్చినది కాఁబట్టి కార్యసాఫల్యమునకుఁగాని కార్య వైఫల్యమునకుఁగాని, బృహస్పతికాలాదులు కారణములు కావు. కొన్ని కాలములు మంచివని కొన్ని కాలములు మంచివికావని భావించి యుక్తకాలమునఁ బనికిఁబూనక వృధా కాలహరణమును జేసెడు మౌఢ్యమునుబట్టి పెక్కు కార్యములు చెడుచున్నవి. ప్రతిసంవత్సర మును శూన్యమాసములని కొన్ని మాసములు వ్యర్థపఱుపఁబడు చున్నవి; మిగిలినమాసములలో శుభదినములు కావని కొన్ని దిన ములు వ్యర్థపఱుపఁ బడుచున్నవి. శేషించిన తిథులలో మంచివార ములు కావని కొన్నివారములు వ్యర్థపఱుపఁబడుచున్నవి; ఆ యు న్న కొన్ని వారములలో సహితము దుర్ముహూర్తమని, వర్జ్యసమయ మని, బృహస్పతికాలమని, నక్షత్రము మంచిదికాదని, విశేష కాలము వ్యర్థపఱుపఁబడు చున్నది. ఈప్రకారముగా మూఢవిశ్వాసము చేత మంచి కాలమును వృధాగాఁ బోఁగొట్టక యనుకూలకాలము నందెల్లను పనులు చేయుచు వచ్చినచో దేశమున కెంతక్షేమము కలుగును ?

వృశ్చి——ఇది యంతయు శాస్త్రదూషణము శాస్త్రనిందచేత నెంతయైనపాపమున్నది. ఏమయ్యా ? వాలఖిల్యా ! అగ్రాసనాధిప త్యము వహించి శాస్త్రతిరస్కారము జరుగుచుండఁగా చూచుచు నూరకున్నావేమి ?

మహా—అగ్రాసనాసీనుఁడు తనయభిప్రాయమును జెప్పి దూషణ మాన్పవలెను. ఇప్పుడు నాకు గొప్పచిక్కు తటస్థమయినది ఇఁక మాటాడక యూరకుండుటకు వలనుపడదు. మాటాడినచో నెవ్వరి పక్షమున నేమిచెప్పినను క్రోధావేశముచేత మూర్ఖరాక్షసు లెవ్వ రేమిచేయుదురో! అయినను నేను బుద్ధిమంతుఁడ నగుటచేతను, పరమ ప్రమాణములైన మనశాస్త్రములు వచ్చి సమయములో నాకు తోడుపడుటచేతను, ధైర్యము తెచ్చికొని యెవ్వరిమనన్నను నొవ్వ కుండ సమయోచితముగా నిట్లంటిని—

"ఓ సజ్జనాగ్రగణ్యులారా! దూషణ యెవ్వరికిని కూడదు. అందులోను ముఖ్యముగా జ్యోతిశ్శాస్త్ర దూషణ కూడదని మీశాస్త్ర ములుమాత్రమేకాక మాశాస్త్రములును భేరీధ్వనితో ఘోషించు చున్నవి. జ్యోతిష్కులమాటలను గాని జ్యోతిశాస్త్రమునుగాని పరిహ సించినవారు తామిస్రనరకములో పడుదురని వరాహ మిహిరుల వారు బృహత్సంహిత రెండవ యధ్యాయములో సెలవిచ్చియు న్నారు. అయినను దీర్ఘరోములవా రిప్పుడు చెప్పుచున్నది పరిశు ద్ధముకానందున శాస్త్రదూషణమని చెప్పుటకు వలనుపడదు. చెప్పెడి దంతయు పూర్ణముగావినక యిది యిట్టిదని నిర్ధారణము చేయు టయు మంచిదికాదు. కాఁబట్టి సభవారు దయచేసి వారు చెప్పెడి దంతయు పూర్ణముగా విని తరువాత వారివాదమును ఖండించి తమ పక్షమును సిద్ధాంతము చేయఁబూనవలెను."

వృశ్చి—ఇవి తప్పక దూషణ వాక్యములే. ఇటువంటి మాటలు మనము విననుకూడదు; ఇతరులను చెప్పనియ్యనుకూడదు.

మహా—ఈవఱకు కొంత విన్నాముగనుక కడమముట్టవిని యీ యుక్త్యాభాసములను ఖండించి యెల్లవారికిని భ్రాంతినివారణముచేయు దము. జ్యోతిశ్శాస్త్ర మబద్ధమని యిటువంటివారు లక్షమంది లక్ష

యుపన్యాసము లిచ్చినను, ఎవ్వరును నమ్మరు. జ్యోతిశ్శాస్త్రములో చెప్పినట్లు సంతానము కలుగుచుండలేదా? కలిగిన సంతానమునకు విద్యాబుద్ధులు వచ్చుచుండలేదా?

ఉప.—మీరు సంతానమనుచున్నారుగనుక చెప్పెదను వినుఁడి. మా పెద్దన్నగారి జన్మపత్రములో నాతని కాఱుగురు పుత్రులు కలుగునట్లున్నది; ఆయన భార్య జన్మపత్రములో బిడ్డలు కొడుకులును ముగ్గురు కూఁతులును కలుగునట్లున్నది. ఆయన వృద్ధుఁడయినను భార్యకు ముట్లుడిగినను వారి కీవఱకును సంతానయోగ్యత కలుగు చిహ్నములేవియుఁ గానరాకున్నవి. ఈప్రకారముగానే నామిత్రుల జన్మపత్రముల ననేకములను శోధించి చూడఁగా సంతానవిషయమున వానిలోఁ జెప్పఁబడినదానికిని సరిగా జరిగినదానికిని మిక్కిలి వ్యత్యాసము కనఁబడుచున్నది. ఇఁక విద్యావిషయ మన్ననో యంతకంటెను తాఱుమాఱుగా నున్నది. ఈవఱకు నేను జెప్పినప్రకారముగా నాచిన్నన్నగారికుమారుఁడును పాలికాఁపువాని కుమారుఁడును సరిగా నేక లగ్నమందును, ఏకముహూర్తమునందును, ఏతారయందును, పుట్టినవారయినను మాయన్నగారి కుమారుఁడు పండితుఁ డగుటయు పాలికాఁపువాని కుమారుఁడు నిరక్షరకుక్షి యగుటయు మీరందఱు నెఱుఁగుదురు. దీనికి మీరేమి సమాధానము చెప్పఁగలరు? ఇదంతయు నేల? మనకు సమీపమునందే హిరణ్యాక్షద్వీప మున్నదిగదా? అక్కడ వసించువారందఱును మూఢులయి మనుష్యభక్షకులయి యనాగరికులుగా నున్నారు. అక్కడివా రనేకులు విద్వాంసులు కావలసినముహూర్తములలోఁ బుట్టినను వారిలో నొక్కరికిని విద్యయన్న వాసనయే లేక యందఱును జ్ఞానశూన్యులుగా నున్నారు. నేనీపని నిమిత్తమయి యక్కడకుఁ బోయి యనేకులజన్మపత్రములను వ్రాసికొని వచ్చి చూచినాను. చేతనైనపక్షమున నీవైపరీత్యమునకు కారణమేమో జ్యోతిష్కులను చెప్పుమనుఁడు.

వృశ్చి—జ్యోతిశ్శాస్త్ర మాద్వీపమునకు చెల్లదు.

మహా—విశ్వాసహీనులకును నిరక్షరకుక్షులకును గ్రహములు సహితము ఫలములను కలిగింపవు.

ఉప—ప్రత్యక్షవిరోధము చూపినను చూడనొల్లక కన్నులు మూసికొని జ్యోతిశ్శాస్త్రము సత్యమని చెప్ప నిశ్చయించుకొని వచ్చిన వారిముందఱ యుక్తివాదమువలన కంఠశోషణము కలుగుటతప్ప వేఱు ప్రయోజనము కలుగదు. ఈపాడు జ్యోతిశ్శాస్త్రము మనదేశమున కెంతహానినైనను జేయుచున్నది. కొందఱు సిద్ధాంతులు చెప్పినయాయుఃపరిమాణమును నమ్మి తమకు చావుసమీపించినదనుకొని బెంగపెట్టుకొని నిష్కారణముగా దీర్ఘవిచారమును కొన్నిసమయములందు మరణమునుకూడ పొందుచున్నారు. కొందఱు సిద్ధాంతులు రోగాదికము వచ్చునని చెప్పినమాటలునమ్మి రోగములు వచ్చినప్పుడు బాధపడుటకు మాఱుగా రానిరోగములనిమిత్తము మనోవ్యథ చెంది వానిని తప్పించుకొనుటకయి తమవిత్తమును వంచకులపాలు చేయుచున్నారు. శిశువులు పుట్టిననక్షత్రములనుబట్టి సిద్ధాంతులు చెప్పిన మాతృగండములను పితృగండములను మాతులగండములను భ్రాతృగండములను విశ్వసించి శిశుహత్యలను గూడఁ జేయించుచున్నారు. అనేకులు సిద్ధాంతులు చెప్పినయోగములు నమ్మికొని దుర్భ్రమలు పడి కాలము వ్యర్థపుచ్చి తుద కాశాభంగము పొంది వ్యాకులపడుచున్నారు. ఒకజ్యోతిష్కుఁడు మనయూరిలో నొక కాపువానివద్ద ధనము స్వీకరించి వానికి తోఁటలో చెట్టుమొదట పాఁతు దొరకునని చెప్పఁగా వాఁ డొకటితరువాత నొకటిగా చెట్లమొదళ్ళెల్లను త్రవ్వి యెంతను ధననిక్షేపమును గానక చెట్లు చచ్చుటచేత దరిద్రుఁడయి మున్నున్నది సహితము పోఁగొట్టుకొని కలకాలము దుఃఖపడవలసినవాఁ డయ్యెను. ఇట్లనేకనిదర్శనములు కనఁబడుచున్నను

జనులు తమమూఢ విశ్వాసమును విడువఁజాలక సూర్యచంద్రాదిజడపదార్థములవలనఁ దెలిసికొని ఫలములను జెప్పెదను మన్న మహాత్ములకు బానిస లయి బుద్ధిపూర్వకముగా కష్టములకు తలయొగ్గుచున్నారు. మనమనసువచ్చినప్పుడు కన్నబిడ్డకు పేరుపెట్టుకొనుటకును, క్రొత్త తలగుడ్డ ధరించుకొనుటకును, క్రొత్తనగ పెట్టుకొనుటకును పొలమును దున్నుకొనుటకును విత్తనములు చల్లుకొనుటకును, పండిన పంట కోసికొనుటకును, గుఱ్ఱమునో గోవునో కొనుటకును, మందు పుచ్చుకొనుటకును, ప్రభుదర్శనము చేయుటకును విజ్ఞాపనపత్రికను పంపుకొనుటకును, ఇటువంటి మఱియేయల్పకార్యమును చేయుటకును కూడ స్వతంత్రులముకాక మనము సమస్తమునకును, మింటనుండు గోళాకారము గల నోరులేని జడపదార్థములు చెప్పినట్లే నడుచుకోవలసినయెడల లోకములో నింతకంటె బానిసతనము మఱియేముండును? ఓయగ్రాసనాసీనా! ఇది మనము కోరి తెచ్చుకొన్న బానిసతన మగునో కాదో నీవు చెప్పుము. దురభిమానముచేత మావారు తెలిసియు తెలియనట్లు నటించినను పక్షపాతమును దురభిమానమును లేని నీవైన సత్యముచెప్పుము. ఈపాడునమ్మకము మనుష్యులహృదయములలో ననావశ్యకము లయినభయములను, విచారములను, బాధలను తెచ్చిపెట్టుచుండలేదా? ఇది పలుమాఱు దురాశలను కలిగించి క్రమమైనప్రయత్నమును మాన్పుచుండలేదా? ఇది ప్రజలయొక్క పండువంటి బుద్ధిని మంటఁగలిపి వారిని జడవస్తువులను నమ్మి పొట్టపోసికొనువారికి దాసులనుగాఁ జేయుచుండలేదా? ఓమహర్షీ! నీమానము చాలించి యీప్రశ్నలకు సదుత్తరము చెప్పుము.

వెనుక సభవారు నన్ను హెచ్చరించినప్పుడు నేను తనకనుకూలముగాఁ జెప్పుట చూచి యీదీర్ఘరోముఁడు నేను శాస్త్రప్రమాణబద్ధుఁడ నై నశిష్టాచారపరాయణుఁడ నన్నసత్యము తెలిసికోక నేనేమో

తన కనుకూలముగా నుత్తరము లిత్తునని భ్రమపడి యిప్పుడీప్రశ్నలు వేసెను. అప్పుడీదీర్ఘరోముఁడు చెప్పినదానిలో శాస్త్రదూషణ మంతగా లేదని చెప్పినదానిని బట్టియే ప్రాచీనాచారపరాయణు లయిన సభవారందఱును మనసులో నామీఁద కొఱకొఱగా నుండుట బుద్ధిమదగ్రగణ్యుఁడ నగుటచేత నేనావఱకే కనిపెట్టి యున్నవాఁడను గాన మహాజనుల యనుగ్రహమునకు మరల పాత్రుఁడ నగునట్లుగా— "ఓయి దీర్ఘరోమా! త్రికాలవేదినైన నేను సత్యము పలికెదను వినుము. నేనిప్పుడు డాంతరదృష్టిచేతఁ జూచి యథార్థమును కరతలామలకముగా గనిపెట్టినాను. శాస్త్రమెప్పుడును లవలేశమైన నబద్ధము కాదు. జ్యోతిశ్శాస్త్రము పరమసత్యము. సత్యమునం దాదరముగల శాస్త్రబద్ధులయిన యాస్తికులందఱును శాస్త్రవిశ్వాసముచేత నీవిప్పుడు చెప్పినవిగాక యింక వేయిరెట్లునష్టములు వచ్చినను వానికన్నిటికి సహింపవలెను. మనకు శాస్త్రము ప్రమాణము గాని బుద్ధి ప్రమాణముకాదు. ఈ సత్యమును శిష్టులందఱు—" అని చెప్పుచుండఁగా దీర్ఘరోముఁడు నావంక కన్ను లెఱ్ఱ చేసి చూచి నానోటనున్న వాక్యమైనను ముగియకమునుపే తనముందు బల్లమీఁదనున్న నన్ను కుడిచేతితోఁ బట్టుకొని పయికెత్తి నోట వేసికొని గుటుక్కున మ్రింగెను. చూచితిరా? ఆక్రూరరాక్షసుఁ డెంతపనిచేసినాఁడో! ఎంతచదువుకొన్నను రాక్షసులకు మనుష్యభక్షణముచేయు స్వభావగుణము విడువదుగదా? మహోపాయసంపన్నుఁడ నగుటచేత నాతనినోటఁబడి నేనుకాఁబట్టి బ్రతికి బయలఁబడితిని గాని సామాన్యమానవుఁడైనపక్షమున నంగుష్ఠ ప్రమాణముగల వాని జఠరాగ్ని కాహుతి కావలసినవాఁడే. నేను సూక్ష్మబుద్ధి నగుట చేత వాఁడు నన్ను తనగొంతుక్రోవి చొప్పింపఁగానే తిన్నగా లోపలికి పోవక యందుండి యేమిచేయుదునా యని యాలోచింపఁ జొచ్చితిని

అప్పుడు నాకు గరుత్మంతుఁడు మ్రింగిన కిరాతకాంతనుంచుకొన్న బ్రాహ్మణోత్తమునివలె గొంతుకలోనుండి మండి పయికి వత్తునాయని యొకయాలోచన కలిగినది. రామరావణయుద్ధమునందు కుంభకర్ణుఁడు కపులను మ్రింగినప్పుడు వారు నవరంధ్రములలోనుండియు వెడలి వచ్చినట్లు వెడలి వత్తునాయని యొకయాలోచన కలిగినది. కంఠనాళమునుండి గర్భములో ప్రవేశించి యక్కడ జరుగుచుండు విశేషముల నెల్లను కన్నులార చూచివచ్చి జీవించియున్న పురుషుని యుదరములో నేమేమి విచిత్రములు నడుచుచుండునో తెలిసి సత్యము తెలియక చిక్కులు పడుచున్న యిప్పటి శారీరశాస్త్రజ్ఞులకు జ్ఞానోపదేశము చేయుదునా యని యొకయాలోచన కలిగినది. ఇట్లు నాకప్పు డనేకములైన యూహ లుత్పన్నములు కాఁగా దీర్ఘవిచారముచేయక వేగిరపడి కార్యనిశ్చయము చేయుట బుద్ధిమంతుల లక్షణము కాదని యెఱిఁగినవాఁడనయి దీర్ఘముగా నాలోచించి, గర్భకుహరము ప్రవేశించిన పక్షమున నపవిత్రమైన మలద్వారమున పయికి వెడలవలసి యుండునుగాన బ్రాహ్మణుఁడనైన నాకది తగదని శారీరశాస్త్రజ్ఞుల కుపకారము చేయుటనిని విడిచిపెట్టి, శ్వాసకోశములను శోధించి వైద్యశాస్త్రజ్ఞుల కుపకారముచేయవలెనని నిశ్చయించి గొంతుక్రోవిలో నున్న పాణిద్వారమునఁబోయి తిన్నగా నూపిరితిత్తులలోఁ బ్రవేశించితిని. అక్కడ నాయిష్టదైవమైన ముఖ్యప్రాణదేవుఁడు నాకు దర్శనమిచ్చి తనభక్తుని నిట్లు చేసినందునకయి కోపముచేతనో యన నన్ను తత్క్షణమే తనబలముకొలఁదిని బయికిఁ బంపివేసెను. వాయుబలముచేత నేనప్పు డాకాశబాణమువలె పయికెగసి బయలఁబడి యేప్రకారముగానో క్షణకాలములో నాతని శ్మశ్రువుల నడుమఁ జిక్కుకొని యక్కడనుండి యుట్టిచేరులలోనుండి యెలుక క్రిందికి ప్రాఁకినట్లుగా నీలిపగ్గములవంటి గడ్డపువెండ్రుకలు పట్టుకొని మెల్లగా క్రిందికి

దిగజాఱి బల్లమీఁద నాయథాస్థానముచేరి మరల నగ్రాసనాసీనత్వము వహించి కూరుచుంటిని. నేనప్పు డారాక్షసుని నోటినుండి వయికి వెడలితినో ముక్కునుండి వయికి వెడలితినో చెప్పలేనుగాని మఱి యే యితర మార్గమునుండియు వెలువడలేదని మాత్రము దృఢముగాఁ జెప్పఁగలను. నేను వయికి వచ్చునప్పటి కాదుష్టరాక్షసుఁడు మెతుకు గొంతుకఁబడి పలకఁ బాఱినప్పుడు మన కగునట్లుగా క్రిందిగ్రుడ్లు మీఁదికిని మీఁదిగ్రుడ్లు క్రిందికిని వచ్చినవాఁ డయి యుక్కిరిబిక్కిరి యయి దగ్గుచు నెంతోసే పాయాసపడెను. నిష్కారణముగా సజ్జన సంతాపము చేసినవారి కాపదలు ఘటింపక యీశ్వరుఁడు సహించి యూరకుండునా? నేను సురక్షితముగా వయికి వెడలివచ్చుట చూచి సభాస్తారు లందఱును నామహిమ కత్యద్భుతపడి నేను నిజమయిన మహర్షినని నమ్మిరి. సూక్ష్మరూపుఁడనయిన నేను హనుమానునివలె తపోమహిమచేత స్థూలరూపము నొంది యాదుష్టరాక్షసుని పొట్ట చీల్చుకొని వయికి రానందునకయి సభవారిలో ననేకులు నాదయాగుణమును వేయినోళ్ళ శ్లాఘించిరి. నాయజమానుఁడు నావద్దకు పరుగెత్తుకొనివచ్చి వాత్సల్యముతో నాదేహము తడియొత్తి నాతడిబట్టలు తీసివేసెను. నామహత్త్వముచేత నాద్వీపమునందు నాఁటినుండియు జ్యోతిశ్శాస్త్రము నిరపాయముగా స్థిరపడినది. జ్యోతిశ్శాస్త్రమే సత్యము కానిపక్షమున, కాదన్న వానిగర్భములోఁ జొచ్చి వానిని ప్రాణావశిష్టునిజేసి నిరపాయముగా వయికి రాఁగలుగుట మనుష్యమాత్రునకు సాధ్యమగునా యని యెల్లవారును సంతుష్టులయిరి. మాపక్షమువారు తమవాదము గెలిచినదని జయజయధ్వనులతో బయలు వెడలఁగా నాఁటికి సభ ముగిసినది. ఇప్పటివలె గుటుక్కున మ్రింగక యేక్రూరరాక్షసుఁడయినను నన్ను పండ్లసందునఁ బెట్టుకొని నమలివేయు నేమోయన్న భయముచేత మహాకాయుఁడుగా రటు

తరువాత నెప్పుడును నన్నే సభకును దీసికొని పోలేదు. ఓ హిందూ మహాజనులారా! మీలోనొకఁడు బయలుదేఱి దేశదేశముల వెంటఁ బోయి యిక్కడ మీకు ప్రియతమమైన జ్యోతిశ్శాస్త్రమును స్థిరప్రతిష్ఠ మాచంద్రార్కమైన శాశ్వతకీర్తిని పొందఁగలిగినందునకు మీరును నమందానందము పొందుఁడు.

---

## ఆఱవ ప్రకరణము.

ఆనుటు నాఁటినుండియు నాకీర్తి లంకాద్వీపమునందు దిగంత విశ్రాంతముగా వ్యాపించినది. పడిపోవుచున్న జ్యోతిశ్శాస్త్రమును నిలువఁ బెట్టితినని విద్వాంసులు వేయినోళ్ళ శ్లాఘింపఁ జొచ్చిరి. జ్యోతిషమును పునరుద్ధారణముచేసి దేశమునకు మహోపకారము చేసినకతమునకయి కవీశ్వరులు నామీఁద పాటలను పద్యములను జేసి ఈశ్వరుని యపరావతారమునని నన్ను స్తుతింపఁ జొచ్చిరి. ఇఁక నామ హిమలను విని యానందించి యింటింటను నా చిత్రచరిత్రమును కథగాఁ జెప్పుకొనుచు పామరులు చేసిన స్తోత్రపాఠములకు పరిమితియే లేదు. పామరుల నోళ్ళనుండి స్త్రీల చెవులలోఁకి నూతులవద్దను నీళ్ళ రేవులవద్దను జరగు మహా సభలలో చిత్రవిచిత్రముగా పెరిఁగి స్త్రీలనోళ్ళలోనుండి శాఖోపశాఖలుగా వ్యాపించి యంతఃపురములు చేరునప్పటికి నామహిమలు నిజముగా కోటిగుణితము లయినవి. కొందఱు నేను సింహికగర్భములోఁ జొచ్చి కాయముపెంచిన హను మద్దేవునివలె నాకాయమును పెంచితినని చెప్పుకొనఁ జొచ్చిరి కొందఱు నేను సురసగర్భములోఁ జొచ్చి యంగుష్ఠమాత్రశరీరుఁడై బయలువెడలిన హనుమద్దేవునివలె సూక్ష్మాతిసూక్ష్మమగు రూపమును

ధరించితినని చెప్పుకొనఁ జొచ్చిరి; కొందఱు నేను శుక్రాచార్యుల గర్భమును చీల్చుకొని వెలువడిన కచునివలె దీర్ఘరోముని గర్భగోళ మును భేదించుకొని వచ్చి యాతని మృతసంజీవనీవిద్యచేత మరల బ్రతికించితినని చెప్పుకొనజొచ్చిరి; కొందఱు నేను దీర్ఘరోముని పాదములు మొదలుకొని శిరస్సువఱకును నడిమికి రెండు చీలికలుగా చీల్చి తరువాత జర యనురాక్షసి జరాసంధునియర్ధదేహముల నొక టిగా సంధించినట్లుగా రెండు ఖండములను మరల నతికించి మంత్ర ప్రభావముచేత పునర్జీవితుని జేసితినని చెప్పుకొనఁ జొచ్చిరి. ఇట్టి కథల నన్నిటిని పూర్ణముగా వివరించినచో నొక్క పెద్దపురాణము కావచ్చునుగాని స్వోత్కర్షమును జెప్పుకొనుట యిష్టము లేనివాఁడ నగుటచే వానిని నే నభివర్ణించుట మాని నాయపూర్వమహిమలను లోకోపకారార్థముగా పురాణరూపమున రచియించి యాచంద్రార్క ముగా లోకమున వ్యాపింపఁజేసి మనమహర్షులవలె శాశ్వత కీర్తిని సంపాదించుకొనెడు పుణ్యమును భక్తాగ్రేసరులకు విడిచి పెట్టు చున్నాను. నాఁటినుండియు నన్ను దర్శింపవచ్చు భక్తులయొక్కయు భక్తురాండ్రయొక్కయుసంఖ్య దినదినాభివృద్ధియగుచువచ్చినదన్న సత్య మును బుద్ధిమదగ్రగణ్యులయిన మీతో నేను విన్నవింపవలసినయావశ్యక మే లేదుగదా ? అయినను మీకింకొక సత్యమును మాత్ర మిప్పుడు వినిపింపవలసి యున్నది. లోకములో మనుష్యుఁడు గొప్పవాఁడయిన కొలఁదిని గొప్పతనముతోడఁ గూడ కష్టములును పెరుఁగుచుండును. భక్తులయిన వారు స్వప్రయోజనపరు లయి స్వలాభముకొఱ కాశ్ర యించి పీడించుచుందురు; అసూయాపరులయినవారు పరోత్కర్ష మును సహింపలేక యపవాదములను వేసి బాధించుచుందురు.

లంకాద్వీపమునందు ప్రాచీనాచారనిష్ఠాగరిష్ఠులయిన శిష్టులం దఱును నన్ను సనాతన సదాచారములను స్థాపింప నవతరించిన

ఈశ్వరాంశ సంభూతునిగా భావించి బహూకరింపఁ జొచ్చినను, జ్యోతిశ్శాస్త్రమును రూపుమాప దీక్ష వహించి బద్ధకంకణులయివిఫల మనోరథులయిన నవనాగరికులు నన్ను ద్వేషించి నాయశస్సునకు భంగమకలిగించుటకును నాకపాయము కలిగించుటకును నానావిధములఁ బ్రయత్నించుచుండిరి. ఆరాక్షసుల క్రౌర్యము నెఱిఁగి నాయజమానుఁడఁయిన మహాకాయుఁడుగారు నాఁటినుండియు నన్ను సభలకుఁ దీసికొని పోవుట మానివేసిరని యీవఱకే చెప్పియున్నాను గదా! ఆపదలు రానున్నకాలమునం దంతఃపురములలో దాఁచి సహస్రభటులను కావలియుంచినను రాక మానవు. ఆపదలు రారానికాలమునందు సముద్రమధ్యమునందుఁ బడవైచినను రావు. నాయజమానుఁడు తన యింట నన్నెంత సురక్షితముగా నుంచి కాపాడుచుండినను, ఒక నాఁటిరాత్రి నాకొక్క ఘోరవిపత్తు సంప్రాప్తమయినది. ఓచదువరులారా! విధివిధాన మప్రతివిధానముగుట తెలిసికొని నావిషయమయి మీరు చింతిలఁబోకుఁడు.

ఒకనాఁటియర్ధరాత్రమునందు నేను నాపాన్పుమీఁద సుఖనిద్ర చేయుచుండఁగా నానడుమెవ్వరో పట్టుకొని నొక్కుచున్నట్టయి యులికిపడి లేచితిని. లేచి కన్నులు తెఱచి చూచునప్పటి కేదో జంతువు నన్ను నడుము మొదలుకొని మెడవఱకును నోటఁ గఱచుకొని పోవుచున్నట్టు దీపమువెలుతురున కనఁబడినది కాని యాజంతు వేదో యానవాలు తెలిసినదికాదు. ఆభయములో నన్ను వ్యాఘ్రము మీడ్చుకొని పోవుచున్నదని భ్రమకలిగినదికాని ప్రక్కలనుండి దాని కాళ్ళు నల్లగా కనఁబడినందున వెంటనే యాభ్రమ నివారణమయినది. అటుతరువాత నది భల్లూకమో వరాహమోయని తలఁచి యరణ్యములో నుండఁదగిన యాజంతువులు నట్టింటి కెట్లువచ్చునాయని వితర్కింప నారంభింపఁగా నింతలో నీటెత్తో పొడిచి నట్లుగా వీపునకు కోఱయొకటి

గ్రుచ్చుకొని తీవ్రవేదనను కలిగించినది. ఆవేదనకు భయము తోడ్పడి నన్ను కొంతసేపు మూర్ఛలో ముంచినందున నావల నేమి జరగి నదో నేను చెప్పలేను. మూర్ఛతేఱి నేను మరల కన్నులువిచ్చి చూచునప్పటికి చుట్టును నంధకారబంధురముగా నుండెను; ప్రక్కఁ జూచినను నాకంటి కేదియు కనఁబడ లేదుగాని నా ముక్కునకు మాత్రము ముఱికికాల్వలలోనుండి వచ్చునట్టి దుర్గంధము గుప్పున కొట్టుచుండెను. దానినిబట్టి నన్నాజంతువు మాయింటిదారితూము కాల్వలోనుండి యీడ్చుకొని పోవుచున్నదని నేనూహించినాను. ఇట్లను కొనుచుండఁగానే నాకాదుర్గంధవిముక్తి కలిగినదికాని యాసౌఖ్య మును చిరకాలముండినదికాదు. జంతువు నన్ను నోటఁగఱచుకొని మాయింటివారి తూముకాల్వలోనుండి వీధిలోని కీడ్చికొనివచ్చి కొంత దూరము నడచినతరువాత మరల నధికదుర్వాసన గల మఱియొకరి తూము కాల్వలోనుండి మఱియొకరియింటిలోనికిఁ గొనిపోయి దీపము వెలుఁగున్న యొకగదిలో నన్ను క్రింద దింపినది. ఇదియంతయుఁ జూచి యీకపటకృత్యమంతయు నాకు శత్రువులుగానున్న కామరూ పులయిన యానవనాగరికులపని యని నేను మనస్సులో నిశ్చయించు కొన్నాను. దీపము వెలుఁగున నన్నీడ్చుకొని వచ్చిన జంతువును నల్లగా నాకంటికి స్పష్టముగాఁ గనఁబడినది. దానిని జూచునప్పటికి నామేను నిలువునను జెమిర్చి కంపమొందఁ జొచ్చినది. అది మనదేశ మందలి యెలుఁగుబంటియంత యున్నది; ఎలుఁగుగొడ్డునకువలె దాని శరీరమందంతటను బొచ్చులేదు గాని వరాహమునకున్నట్లుగా మెడ మీఁదమాత్రము దబ్బనములవలెఁ బయికి నిక్కఁబొడుచుకొనియున్న దీర్ఘరోమములున్నవి. మీరయిన పక్షమున దానిని పెద్ద యడవి పందియని భ్రమించియుందురుగాని యాదేశపుజంతువుల పరిమాణ ముల నెఱిఁగియున్న నేనప్పుడొక్క నిమిషములో నది పందికొక్కని

యది మాంసభక్షకజంతువు కాదని యంతరంగమునఁ గొంత సంతోషించినాను. అప్పుడొక్క మూలుగు మూలిగి నన్నుఁ గొనివచ్చినజంతువు నన్ను నట్టింట దిగవిడిచి తానొక కన్నములోనుండి యావలికిఁ బోయెను. అంతట సమస్తాభరణభూషితురా లయియున్న యొక కాంత మంచముమీఁదినుండి దిగి వచ్చి మునివ్రేళ్లు చందనపు బొమ్మను పయి కెత్తినట్లుగా నన్ను తనకుడిచేతితో పయి కెత్తి రెండవ చేతిలోని యంగవస్త్రముతో నాశరీరమంతయు తుడిచి నన్ను తన మంచముమీఁదఁ గూరుచుండఁ బెట్టి తానును నా యెదురుగాఁ గూరుచుండెను. కాళికాశక్తివలె నెదురఁ గూరుచున్న యామె మొగమును జూడఁగానే నామనస్సులో పరిపరిలాగుల నాలోచనలు పుట్టఁ జొచ్చినవి. నాశత్రువు లెవ్వరైన నన్ను బాధించి చంపుటకయి యిట్లు తెప్పించి యుందురని మొట్టమొదట తోఁచినది. తరువాత నొకటి తరువాత నొకటిగా ననేకాలోచనలు కలిగిన పిమ్మట కట్టకడపట రాక్షసాంగనయైనయీయామె నన్ను మోహించి బాణాసురుని కూఁతురైన యుషాకన్య యనిరుద్ధుని చిత్రలేఖచేతఁ దెప్పించుకొన్నట్లుగా నన్ని మూషకరాజుచేతఁ దనయొద్దకు రప్పించుకొని యుండునాయని సంశయము తోఁచినది. తరువాత మాయిరువురకును నడిచిన సంభాషణమును బట్టి నాయీకడపటియూహయే సిద్ధాంతమయినట్టు మీ రిప్పుడే తెలిసికొనఁగలరు. ఆకాంత యద్భుతపడి చూచుచున్న నాకు తన్ను తెలుపుకొని, తనపేరు త్రిజటయగుట చెప్పి యిట్లనియెను—

త్రిజ—ఓరుషివర్యా! నావంక వెఱఁగుపడిచూడకు. ముల్లోకములను జయించిన సార్వభౌముని వంశములోని రాజకన్యకు జీవితేశ్వరుని గావించి ధన్యుని చేయుతలంపున నిన్నిటకు రావించితిగాని హానిచేయుతలంపున రప్పింప లేదు. ఇంద్రుని జయించి యింద్రజిత్తని పేరొందిన మేఘనాదుఁడను రావణపుత్రునకు నేను మునిమనుమరాలను.

సత్య—అమ్మా! నీకు నామీఁదఁగల యనుగ్రహముచేత నేను నిజముగానే ధన్యుఁడనయినాను. నాపేరు సత్యరాజాచార్యులు. నేను ఋషివర్యుఁడను పేరునకర్హుఁడనుగాను.

త్రిజ—నీపేరేదియైనను గానిమ్ము; నీవొక్కఋషివరిమాత్రమే కాక యంగుష్ఠమాత్ర శరీరులయి నిరంతరమును సూర్యునిరథముచుట్టును తిరుగుచుండెడు క్రతుపుత్రులైన యఱువదివేల వాలఖిల్యులలో నొక్కఁడవనికూడ నేనెఱుఁగుదును. ఇఁక నావద్ద నేమియు దాఁచఁబోకు.

సత్య—మీరట్లన్న నేనేమి చెప్పఁగలను?

త్రిజ—ఏమియుఁ జెప్పనక్కఱలేదు. ఇఁక రాత్రియెంతోలేదు. మాటలతో వృథాకాలహరణము చేయక కార్యాంశమును వినుము. నీయొక్క మహామహిమలను నాచెలికత్తెలవలన విని నీకు వలచి చిక్కినదానను. గాంధర్వవిధిని వరించి యిప్పుడే నన్ను చరితార్థురాలిని జేయుము.

సత్య—అటువంటిమాటలు మీరు సెలవియ్యకూడదు.

త్రిజ—దీనురాలనయి ప్రార్థించుచున్న నాకోరిక వృథ పుచ్చుట మీకు ధర్మముకాదు. మీఋషులయొక్కయు దేవతలయొక్కయు గుట్టంతయు నేనెఱుఁగుదును. రాక్షసస్త్రీలమాట యటుండఁగా తిర్యగ్జంతువులతో సంభోగించుటకు సహితము సంశయింపలేదు.

సత్య—సంశయింపనివారెవ్వరు? మహాత్ములా?

త్రిజ—ఒక్క మహాత్ములుమాత్రమేకాక వారి దేవతలును సంశయపడలేదు. మందపాల మహాత్ముఁడు లావుకపిట్టతో సంభోగించి సంతానము కనెను. విభండకమహాత్ముఁడు లేడిని పొంది ఋశ్యశృంగుడను కొడుకును గనెను మీవాయుదేవుఁడు కేసరియను వానరుని భార్యవలన హనుమంతుని గనెను. సూర్యుఁ డశ్వమునుజేర యశ్వినులను

గనెను, శ్రీకృష్ణుఁడు జాంబవంతుఁడను భల్లూకరాజుయొక్క పుత్రికను వరించెను. దేవేంద్రుఁడును సూర్యుఁడును ఋక్షవిరజుఁడను మర్కట మును కామించి వాలిసుగ్రీవులను గనిరి. మీవారికెట్లు నాకు తెలి యదనుకొన్నావా ?

ఈమాట లనునప్పటి కారాక్షసియొక్క పురాణపరిజ్ఞానమునకు నాకత్యాశ్చర్యము కలిగినది. మన పురాణములలోని రహస్యములిన్ని మీయాఁడుదాని కెట్లు తెలిసినవో ! శ్రీరాములవారికి తరువాత నే నొక్కఁడను దక్క భరతఖండవాసులు మఱియెవ్వరును లంకాద్వీపము నకు వచ్చియున్నట్లు నేను వినియుండలేదు. ఇఁక నెవ్వరీమెకీగాథను జెప్పియుందురు ? ప్రపంచమునం దంతటను లోకానుగ్రహార్థముగా తిరుగుచుండెడు హిమాలయయాత్ర లయిన మహాత్ములెవ్వరో యీ మెను శిష్యురాలినిగా నంగీకరించి గుప్తవిద్య నీమె కుపదేశించి యుందురు. ఇది నిశ్చయము కాకపోయినయెడల లంకాద్వీపములో నంతగపురములయం దుండెడు రాజకన్యకిట్టి శాస్త్రమర్మము లెట్లు తెలియును ? ఎటువంటి మహాత్ములు చెప్పినను పరదేశస్థులకు మన వారి మహిమలు సవిస్తరముగాఁ దెలియవు. ఈమెచెప్పిన విషయ ములలో నెన్నో ప్రమాదవచనము లున్నవి. ఊర్వశిని జూచుట చేత స్నానము చేయుచున్న విభాండకమహర్షికి జలములో వీర్యపతన మగుటయు లేఁడి యానీరు త్రాగి గర్భముధరించి ఋశ్యశృంగుని కనుటయు తెలిసికొలేక విభండకుఁడు లేఁడిని పొందినట్లు చెప్పినది. ఋక్షవిరజుఁడు నీటిలో మునిఁగి వానరస్త్రీయైనప్పు డింద్రసూర్యులు కామించినకథ తెలియక వారు పురుషరూపముతో నున్న ఋక్షవిర జునినే కామించినట్లు చెప్పినది. ఇట్టి వ్యత్యాసములనుగూర్చి నాలో నే నాలోచించుకొనుచుండఁగా నారాక్షసాంగన కొంతసేపూరకుండి మరల ప్రశ్నలువేయుట కారంభించినది.

త్రిజ—ఓమునీంద్రా ! నేనడిగినదానికి ప్రత్యుత్తరము చెప్పక వరాననముఘరించి యూరకున్నావేమి ? శీఘ్రముగా సమ్మతిని తెలుపు నదుత్తరమును జెప్పుము.

సత్య—నేనేమని యుత్తరము చెప్పగలను ? వారు మహాత్ము లును దేవతలునయినందున వారికెట్టి పనికయినను సామర్థ్యము కలిగి నది. మనుష్యమాత్రుండ నయిన నాకెట్లుకలుగును ?

త్రిజ—నీవు నిజముగా మనుష్యుండవయినను సందేహింప వల సినపని లేదు. రాక్షసస్త్రీలను వివాహము చేసికొన్నమనుష్యులును మీలో ననేకులున్నారు. భీముఁడు హిడింబ యనురాక్షసితో సంభో గించి ఘటోత్కచుని గనెను. ప్రద్యుమ్నుఁడు వజ్రనాభదైత్యుని కూఁతురైన ప్రభావతిని బొంది పుత్రునిగనెను. అనిరుద్ధుఁడు బాణా సురపుత్రియైన యుషాకన్యను వరించెను. ఇఁక మాటుమాటాడక స్థూలరూపమును ధరించి నన్ను కృతార్థురాలిని జేయుము. కామ రూపములను ధరించి యిష్టకామోపభోగములను పొందిన మీఋషుల మహిమలు నాకపారముగాఁ దెలియును.

సత్య—పూర్వకాలపు మహర్షులవద్దనేకాని యిప్పటివారి కటువంటి శక్తులులేవు. కామరూపమును వహించు సామర్థ్యము నావద్ద లేదు.

త్రిజ—నీమాట నేను నమ్మను; ఆలస్యముచేసి స్త్రీహత్య కొడిగట్టక స్థూలరూపమును పొందుము. తెల్లవాఱఁబోవుచున్నది. మంచిమాటలచేత నాప్రార్థనను వినవిపక్షమున బలాత్కారముగా నైన నామనోరథము తీర్చుకొనెదను కొన్నిదినములక్రిందట నీవు దీర్ఘ రోమునిగర్భములోఁ జొచ్చి వెకసముగా పెరిగి పొట్టచీల్చుకొని వయికి వచ్చినకథ నేను వినలేదనుకొన్నావా ? ఇఁక నావద్ద నీమాయ మాటలు మాని నీకామరూపమహిమచేత స్థూలాకారమును ధరింపుము.

అపడు నాకేమిచేయుటకును తోఁచలేదు. బ్రాహ్మణులకు రాక్షసస్త్రీని గాంధర్వవివాహమున కలియుగమునందు స్వీకరింప వచ్చునా యన్నధర్మసందేహ మొక్కటి నామనస్సును బాధింపఁజొచ్చినది; రాక్షస స్త్రీలను వరించినభీమాదులు క్షత్రియులు; అది ద్వాపరయుగము. ఈధర్మసందేహమును విడిచి లంకాద్వీపమునందు మనధర్మశాస్త్రములతో పనిలేదని యంగీకరించి యొప్పుకొన్నను, మనదేశము నందలి గ్రామదేవతలను సహితము పొత్తుల లోఁసి చంటిపిల్లలనుగా గణింపఁదగినంత మహాకాయము గల యీ రాక్షసికి వరుఁడు కాఁదగినంత పొడుగు నేనెట్లుండఁగలను? ఆచిన్నది యిది గాంధర్వవివాహమని చెప్పుచున్నను నాదృష్టికిది కేవలరాక్షసవివాహముగాఁ బొడకట్టుచున్నది. మనదేశములో కన్యను వరుఁడెత్తుకొని పోవుటధర్మము; ఈ రాక్షసవివాహమున కన్యయే వరుడెత్తుకొని వచ్చుట తటస్థించినది. హా! దైవమా! నే నేమి చేయుదును? కామదేవుఁడు కల్పించిన యీయాపద నెట్లు తప్పించుకొందును? ఎంతచదువుకొన్నను స్త్రీలబుద్ధి యెప్పుడును పెడదారినే పోవునుగదా? మహావిద్వాంసులారా! ఈచిన్నదానికి నన్ను తనంత స్థూలరూపము వహింపుమని నిర్బంధించుటయేకాని తాను నాకుఁదగిన సూక్ష్మరూపము ధరింపవలెనన్న యాలోచన తోఁచినదికాదు. ఇక్కడ నింకొక ధర్మసూక్ష్మత యున్నది. రతిసమయమునందు స్త్రీలు నిజరూపమును పొందుదురని పెద్దలు చెప్పుదురు. అది యాలోచించియే యీమె నన్ను స్థూలరూపము పొందుమని నిర్బంధించుచున్నదేమో! రాక్షసవిగ్రహములుగల హిడింబాదులను పొందునప్పుడు భీమాదు లేమిచేసిరో! ఓభరతఖండవాసులారా! మనుష్యులైన భీమాదులే పెరిగి రాక్షసరూపమును ధరించిరో, రాక్షసులైన హిడింబాదులే చిక్కి మనుష్యరూపమును ధరించిరో, పురాణములను శోధించి నాకు తెలుపుఁడు;

నేసీమాట లనుకొనుచుండఁగా త్రిజట నామీఁద చేయివేసి వేగి
రము స్థూలరూపము పొందుమని నన్ను నొక్కెను. అప్పుడు నాబ్రతుకు
సింహపుపెండ్లికొడుకు కాలిక్రిందఁ బడి నలిగిన యెలుక పెండ్లికూ
తురుబ్రతుకు కాఁగా, ఆనఖక్షతమునకు సహింపలేక నేను బావురని
పెద్దపెట్టున నేడ్చితిని. ఆకూఁత విని వెలుపలినుండి యెవ్వరో "అమ్మా
యీ! ఆపిల్లికూఁత యెక్కడిది?" అనియడిగిరి. ఏమియులేదని చెప్పి
త్రిజట యెవ్వరైనను వచ్చిచూచిపోదు రన్నభయముచేతఁ గాఁబోలును
నన్ను మంచముమీఁదినుండి దింపి గోడమూలనున్న మందసము తాళ
ముతీసి నన్నందులోఁబెట్టి మరల తాళమువేసెను. ఆమందసము చిన్న
గదియంత యున్నది. తాళముచెవి పెట్టు రంధ్రము గవాక్షమంత
యున్నందున లోపలికి తగినగాలి వచ్చుచుండుటచేత నే నాయాస
పడక యొకబట్టమడతమీఁద నొరిగి కొంచెముసేపు నిద్రపోయినాను.
ఆనిద్రలో మహాకాయముగల వానర మొకటివచ్చి నన్నెత్తుకొని పోవు
చున్నట్లు కలగని యులికిపడిలేచితిని. స్వప్నములో కోఁతినిగాని వరాహ
మునుగాని చూచినపక్షమున భయముకలుగునని స్వప్నశాస్త్రాభిజ్ఞు
లగు పెద్దలు చెప్పుదురు గదా! ఈ కల వేకువజామున వచ్చినదగుటచే
నెలదినములలోనే దానిఫలము కలుగునని నేను మఱింత భయపడఁ
జొచ్చితిని. "దుస్స్వప్నే దుర్జనస్పర్శే స్నానమేవ విధీయతే" యన్న
శాస్త్రప్రకారముగా స్నానము చేయవలెనన్నను పెట్టెలో మూయఁబడి
యుండుటచే నాకదియు సాధ్యమైనదికాదు.

శ్లో. రామం స్కందం హనూమంతం వైనతేయం వృకోదరం
శయనే యః స్మరే న్నిత్యం దుస్స్వప్నం తస్య నశ్యతి.

అన్నశ్లోకమును నేను రాత్రి పరుండఁబోవునప్పుడు పఠింప మఱచి
పోయిన దోషముచేత నాకీదుస్స్వప్నము సంప్రాప్తమయినది. కామ
రూపులయిన రాక్షసులయొక్క యీదేశమునందు దీనికేమి ప్రతిక్రియ

చేయవలెనో తెలియకున్నది; ఈపెట్టెలోనుండి ముందుగా నీవలనఁ బడినఁగదా తరువాత ప్రతిక్రియమాట యాలోచింపవలెను ? నాశత్రువు లెవ్వరేరూపమును ధరించివచ్చి నా కేయపాయమును సేయుదురో యని నాయుల్లము తల్లడిల్లుచున్నది. హా ! దైవమా ! ఏమిచేయుదును ? కామరూపమునుపొందు శక్తిని మాభరతఖండవాసుల కెప్పుడును ప్రసాదింపకుము. ఈకామరూపధారణము దుష్టులకు మాయవేషములు వేసికొనివచ్చి సాధువులకు హానిచేయుట కొఱకేకాని మంచివారి కేసత్కార్యములు చేయుటకొఱకును నావశ్యకమైనది కాదని నాకిప్పు డనుభవము వలనఁ దెలియుచున్నది.

---

## ఏడవ ప్రకరణము.

ఆపెట్టెలో నే నొకబట్టమడతమీఁదఁ గూరుచుండి పైని చెప్పినట్లు నాలో నే నాలోచించుకొనుచుండఁగా నేదో తేలుకుట్టినట్లు నా నడ్డిమీఁద నొకపోటుపొడిచినది. ఆపోటుతో నాధ్యానమంతయు చెడినందున నిప్పుత్రొక్కిన క్రోఁతివలె నొక్క యెగురెగిరి యులికిపడి లేచి నాలుగుమూలలను గంతులువైచుచు నిది యేదుస్స్వప్నఫలమని భయపడుచు ముందుకు తిరిగిచూచునప్పటికి నాకన్నులయెదుట మన మూషకమంత జంతువొకటి మహాభయంకరముగా కానఁబడెను. అది యెలుకవలెనున్నను దానికి తోఁకగాని వెనుకవైపునకాళ్ళుగాని యేమియు లేవు, అవయవరహితమై తోలుకప్పిన యెముకలులేని నల్లనిమాంసపుముద్దవలె నున్న యీచరమకాయమే దానిశరీరములో నాలుగింట మూఁడువంతులున్నది ; ద్రాక్షసారాయము పోసిన తోలుతిత్తివలె

నుబ్బి మెత్తగానున్న, యీచరమకాయమునకంటె దానిలో చతురాంశమంతియున్న పూర్వకాయమున్నది ; ఆపూర్వకాయమునకు ప్రక్కను మూఁడేసి చొప్పున రావణాసురుని భుజములవలె నాఱుకాళ్ళున్నవి ; దక్షప్రజాపతిమెడ కతికించిన మేషశిరస్సువలె చిన్నదిగా నున్న దానిశిరస్సున కిరుపార్శ్వములయందును పట్టుకారులవలె రెండుడెక్కలున్నవి; దాని దేహచ్ఛాయ యమవాహనమైన మహిషచ్ఛాయను బోలి నామనస్సున కప్పు డంధకాసురుని స్మరణకు తెచ్చినది. నాకన్నులయెదుట నట్లు నిర్భయముగా నిలువఁబడిన యీజంతువు పయికి మత్కుణమువలె కానఁబడినను అది కామరూపప్రభావముచేత నట్టి రూపమును వహించిన ఘోరరాక్షసుఁ డయినందునకు సందేహము లేదు. విద్వన్మహాసభలో నేనట్లు ప్రతిపక్షుల నోడించి జ్యోతిశ్శాస్త్రము నాచంద్రార్కముగా నిలువఁబెట్టిన నాఁటినుండియు పరాజితులయిన క్రూరరాక్షసులు నామీఁద పగపట్టి నానావిధమాయావేషములచేత నాకపాయముచేయఁ జూచుచున్నారు. ఆదేశమునందలి జ్యోతిశ్శాస్త్రమహిమచేత నేఁటిరాత్రి నేనీపెట్టెలోనుందునని ముందుగాఁ తెలిసికొని నాకు హానిచేయవలెనన్న ద్రోహబుద్ధితో వచ్చి యెవ్వఁడో యొక రాక్షసుఁడు నాకంటె ముందుగానే పెట్టెచొచ్చి దాఁగియున్నాఁడు. అట్లు కానియెడల తాళము వేసిన పెట్టెలోని కాజంతు వెట్లు వచ్చును ? వచ్చినను మత్కుణరూపము నేల ధరించును ? ధరించినను నేనువచ్చినదాఁక దాఁగియుండి దొంగవలె నేమఱుపాటున మీఁదఁబడి నన్నేల కఱచును ? ఇన్ని హేతువులనుబట్టి యీజంతువు రాక్షసుఁడగుట నిశ్చయము. అయినను నాకిప్పు డీరాక్షసునిపేరు తెలియనందున నిజమైనపేరు బయలఁబడువఱకును మన కథాంశము నిమిత్తము నేనాతని మత్కుణాసురుఁడని పిలిచెదను. నేను భూదేవుఁడ నన్నయంశము మీకు తెలిసినదే కదా. దేవతలు రాక్షసులను తారసిల్లి నప్పుడు

మహాయుద్ధము సంభవించుననియు మీ రెఱుఁగుదురు. మనుష్యాశను దగుటచేత నన్ను మ్రింగవలెనని యారాక్షసుఁడే మొట్టమొదట నా మీఁద నడచెనో దుష్టశిక్షణము చేయవలెనని నేనే మొట్టమొదట రాక్షస సంహారమునకు పూనితినో వీరావేశపరవశుఁడ నయి యుండుటచేత నేను నిశ్చయముగాఁ జెప్పలేనుగాని మాయిరువురకును జరిగిన యుద్ధము దేవాసురయుద్ధమును మించినదనిమాత్రము దృఢముగాఁ జెప్పఁగలను. ఆరంభదశలో కొంతసేపు మాయిరువురకును బాహాబాహిని నఖానఖిని దంతాదంతిని ఘోరయుద్ధము జరగినది. నాగకుమారుని మీఁదికి దుముకు గరుత్మంతునివలె నే నారాక్షసునిమీఁదికి కుప్పించి యుఱికి నా రెండు బాహువులతోను వానిబాహు వొకటి యొడిసిపట్టి శ్రీకృష్ణులవారు గోవర్ధనగిరి నెత్తినట్టు పయి కెత్తి గిరగిర త్రిప్పి నేల మీఁద వేసి కొట్టఁబోయితిని. కాని యారాక్షసుఁడు క్రిందఁబడక మాయచేసి తనబాహులతో నా చేయిఁ గట్టిగాపట్టుకొని వదలక కత్తుల వంటి తన ఱెక్కలతో నాకుత్తుక కత్తిరించ వలెననియో యమపాశములవంటి తనబాహుపాశముల నాఱింటిని నామెడ కొక్కసారిగా చుట్టి బిగించి యూపిరివెడలనీయక ప్రాణములు గొనవలెననియో దక్షిణ భుజముమీఁదుగా నాకంఠసమీపమునకు ప్రాకఁ జొచ్చెను గాని నేనింతలో మెలఁకువపడి మోచేతివద్దికి పరుగెత్తునప్పటికే యెడమచేతితో నే నారాక్షసుని కాలుపట్టుకొని నేలమీఁదమోఁపి సింహనాదము చేసితిని. నాసింహనాదముయొక్క దారుణధ్వనిచేత దిగ్గజముల చెవులకు చెవుడు పట్టియుండును ; ఆకాశమునుండి గవ్వలవలె నక్షత్రములన్నియు నేలమీఁద రాలియుండును. నేనప్పు డాపెట్టెలో నిర్బంధింపఁబడి యుండుటచేత పయికివచ్చి చూడలేకపోయితినిగాని లేనియెడల క్రిందరాలిన నక్షత్రములను కొన్నిటి నేఱి మూటకట్టి తెచ్చి నామాటకు నిదర్శనముగాను నాపౌరుషప్రకటన మగునట్లుగాను మీ

కుఁజూపి మీ కన్నులకు కలిగించియుందును. నేను విసరివైచినప్పు డా రాక్షసుఁడు పర్వతమువలె నేలఁగూలియు చావక బట్టమడత మీఁదపడి మరలలేచి మహావేగముతో నావంక పరుగెత్తుకొని రాఁజొచ్చెను. నే నెదురుగాఁ బోయి కుంజరముమీఁదికి కుప్పించు సింహమువలె రాక్షసునిమీఁదికి లంఘించి కాలఁదిని నొక్కతన్ను తన్నితిని. ఆతన్ను తగిలియున్నయెడల వాఁడు పొట్ట పగిలి చావవలసినవాఁడే కాని యారాక్షసుఁడు తన మాయాబలముచేత నాపాదఘాతమును తప్పించుకొని ప్రక్కకు తొలఁగెను. ఆపదతలాఘాతముచేత పెట్టెయంతయు నదిరి పర్వతగుహవలె మాఱుమ్రోసెను. నాకాలితాఁకున పెట్టె క్రిందికిదిగి పెట్టెతోఁగూడ భూమి పాతాళమంట క్రుంగుటచేత నాఁడు శేషునితలల కెంతో నొప్పికలిగి యుండును. అతఁడా దుర్భర వేదనచేత శిరసు కదల్చినప్పుడు భూకంపము కలుగక మానదు. ఓభరతఖండ వాసులారా! హూణశకము ౧౮౯౭ వ సంవత్సరము మార్చి నెల ఏఁడవ తేదినిగాని దానికి కొన్నిదినము లివలావలనుగాని భూకంపము కలిగినదేమో స్మరణకుఁ దెచ్చుకొనుఁడు. ఆకాలమునం దెక్కడనైనను భూకంపము కలిగినట్లు మీకు జ్ఞప్తికి వచ్చినను వార్తాపత్రికలయందు చదివినను పెద్దలవలన వినినను స్వప్నములయందు జూచినను, అది నాపాదతాడనముచేతనే యైనదని గ్రహింపుఁడు. ఎన్నివిధములచేత విచారించినను మీకాభూకంపవార్త గోచరము కానిపక్షమున, మీరు మన పంచాంగములను జదివి వానియందైనను జూచి జ్యోతిషశాస్త్ర మహిమకు సంతోషింపుఁడు. ప్రక్కకు తొలఁగిన యారాక్షసుఁడు బట్టమడత చివరవఱకును పరుగెత్తి యక్కడనుండి మరలి మరల నావంకకు నడువ నారంభింపఁగా నేను వెనుకకుఁబోయి పార్శ్వభాగమునకువచ్చి యొక్క కాలొడిసిపట్టి ద్వంద్వయుద్ధము కారంభించితిని. భీమదుర్యోధనులకు జరిగిన ద్వంద్వయుద్ధమువలె మాపోరాట

ము మహాఘోరముగాఁ రాక్షసుఁడు ధర్మయుద్ధమున నన్ను గెలువ లేక యధర్మయుద్ధమున కారంభించి నా [illegible]. నేను కాలునకు భయపడక ధైర్యము విడువక [illegible] గదలక విష్ణుమూర్తి [illegible] జల్పి వాని వజ్రకాయమును ఛేదింపలేక తుదకు [illegible] మార్గమునే యవలంబించి దంతములుపయోగించి [illegible] మును సుయోధనుని [illegible]డలు విరుగఁగొట్టినట్లు [illegible] నాముని పంక్తితో [illegible] రెండు ఖండములు చేసి తిని. ఈప్రకారముగా యుద్ధమునంతను వర్ణించిన పక్షమున భారత రామాయణములంత గ్రంథము పెరుగునని భయపడి యీపనిని పురాణకర్తలకు విడిచి నేనిక్కడ మాసమరపర్యవసానమును మాత్రము చెప్పెదను. శ్రీరాములవారు రావణాసురుని వింశతిబాహువులను నఱికినట్లును శ్రీకృష్ణులవారు బాణాసురుని సహస్రబాహువులను నఱికినట్లును నేనామత్కుణాసురుని యీఆఱుబాహువులను దంతాదంతిని నఖానఖిని యుద్ధముచేసి నఱికి నాయసహాయ శూరత్వమును జూపితిని. అప్పుడు రాక్షసుఁడు దేవేంద్రుని వజ్రాయుధముచేత ఱెక్కలు తెగిపడిన పర్వతమువలె కదల మెదల నేరక కూలఁబడెను. ఈలోపల ప్రభాతసమయ మగుచుండెను. అది రాక్షసులకు మంచి సమయము కాదని యెఱిఁగినవాఁడనయి వెంటనే మీఁదబడి కాలికొలఁదిని పొట్ట మీఁద త్రొక్కితిని. ఆదెబ్బతో మనుష్యరక్తపానముచేసి బలిసియున్న వానిపొట్ట పగిలి చిమ్మనగొట్టములలోఁ గొట్టినట్లు బుస్సుమని రక్తధారలు పయికెగసి నా మొగమునఁబడెను. పరశురామునివలె ధాత్రిమును పూని శత్రుసంహారముచేసి పెట్టెలో నెత్తురుమడుగులు చేసినను, ఆరక్తము కంటఁబడఁగానే బ్రాహ్మణధర్మమైన దయాగుణము మరలవచ్చి నన్ను క్షణకాలము మూర్ఛలో ముంచెనుగాని నేనంతలో

తెలిసి చెప్పుకొని మరల శత్రువువంకఁ జూచితిని. శత్రువప్పటికిని జావక యిక డెక్కల నాడించుచుండెను. అగ్నిశేషమును ఋణశేషమును శత్రుశేషమును నుంచఁగూడదని రాజనీతివేత్తలు చెప్పుట స్మరణకుఁ దెచ్చుకొని నేనప్పుడు నా రెండు చేతులతోను రాక్షసుని రెండు డెక్కలను బట్టుకొని శ్రీకృష్ణులవారు బకాసురుని చీల్చినట్లు నిలువునఁ జీలఁజూచితినిగాని యాలోపలనే నాభుజబలాతిశయముచేత వాని డెక్కలు నడిమికి విఱిగిపోయినవి. అంతట రాక్షసుఁడు విగతాసుఁడయినాఁడు. అప్పుడు దేవతలు నామీఁద పుష్పవర్షము కురిసియుందురుగాని పెట్టెలోనుండుటచే దానిని జూచి యనుభవించు భాగ్యము నాకన్నులకు కలిగినదికాదు. మహాపుణ్యప్రదమైన యీమత్కుణాసురవిజయకథను శ్రద్ధతోఁ జదివినవారును భక్తితో విన్నవారును పద్యకావ్యమునుగా రచించి లోకమున ప్రసిద్ధిపఱిచినవారును మూఁడులోకములయందును మత్కుణబాధనుండి విముక్తులగుదురు.

శ్లో. మవర్ణాది మకారాంతమ్ నతమ్ కవర్ణ సంయుతమ్
అదంతణకారోపేతమ్ ఏతన్మంత్రం విదుర్బుధాః.

పరమగోప్యమైన యీమత్కుణమహామంత్రమును పరమవిశ్వాసముతో నిత్యమును జపించువారికి సమస్తవిషబాధలును తొలఁగును.

మత్కుణాసురవధానంతర మారాక్షసుని దేహమునుండి యొక విధమయిన దుర్గంధము బయలువెడలి నాఘ్రాణేంద్రియమునకు దుస్సహము కాఁజొచ్చెను. ఆదుర్గంధసముద్రమునుండి వెలువడుసాధన మెట్లాయని నాలో నేనాలోచించుచుండఁగా నింతలో మారణకోలాహలముచేత మేలుకొనవచ్చిరో పెట్టెలోని బట్టను దేనినైన తీసికొనవలసి వచ్చిరో మఱి యేహేతువుచేతనో త్రిజట మంచము దిగివచ్చి పెట్టె తాళముతీసి మూఁతపయి కెత్తెను. అందువలన పయినున్న వాయుదే

వృక్షము లోపలికివచ్చి దుర్వాసనను కొంతకాలఁకెంచి భక్తుఁడనైన నాకు పరిమితసుఖప్రదాయకుఁ డయ్యెను. ఇంతలో త్రిజట పెట్టెవద్దఁ గూరు చుండి లోపల తొంగిచూచి బట్టముమీఁద ముసుగు కట్టియున్న రాక్షసుపరక్తప్రవాహమును గని యీయెద్దుమడక యెట్లయినదని వానిని చూచి యీవలిపోతుఁడని పలుకుచు మత్కుణాసురుని కళేబరముతీసి దూరముగా విసరివైచెను. ఆనిమిగ్రహమును జూచి భయపడి యొక మూల నొదిగియున్న నన్ను చేతితో బట్టుకొని కొంచెము పయికెత్తి "ఓవాలఖిల్యా! ఇంతటనైనను నీవు స్థూలరూపమును ధరించి నామనోరథమును సఫలముచేయుము. రాక్షసాంగనాపరిగ్రహము వలన నీకు పాపములేదు. పూర్వము మీభూలోకములో చంద్రవంశపురాజయిన యయాతి వృషపర్వుఁడను రాక్షసరాజపుత్రుడైన శర్మిష్ఠను వరించి వంశకర్తయైన పూరుఁడులోనుగాఁగల కొడుకులను గన్నవార్త మీపురాణములయందువినలేదా ? మాటుపలుకవేమి ?" అని తనవ్రేళ్ళతో నాప్రక్కలు నొక్కెను. నే నాబాధకు తాళలేక యింతకుముందే మత్కుణాసురునితోడి సంగరమునందు నఖానఖిదంతాదంతిని పోరాడి గడిదేఱియున్న రసికుఁడ నగుటచేత నాకన్య యొక్క పాణిగ్రహణముచేసి యీమృదుహస్తముమీఁద నఖక్షతదంతక్షతములనుజేసితిని. నవోఢయగుటచే నాసుందరినారసికత్వమును గ్రహింపలేక కెవ్వునకేక వేసి చేతిలోనున్న నన్ను క్రిందవిడిచి పెట్టెను. భాగ్యముచేత నేను బట్టమీఁదపడఁబట్టిగాని యంతయెత్తునుండి పెట్టెకొయ్యమీఁదనేపడుట తటస్థించినపక్షమున నాతల రెండువ్రక్కలయియుండును. ఆ చిన్నది కెవ్వున కేక వేయఁగానే లోపలనుండి యెవ్వరో "అమ్మాయీ! అట్లు కేక వేసితివేమి ?" అని యడిగిరి. "మఱేమియు లేదు ఎలుక" అని త్రిజట యుత్తరమిచ్చెను. "ఎలుక నిన్ను కఱచినదా యేమి ? ఎలుకకాటువలన విష మెక్కును. ఎక్కడ కఱ

పెట్టి?" అని పలుకుచు నొకయంగన లోపలికివచ్చెను. ఆమె వచ్చుటచూచి వెంటనే పెట్టెమూఁత వైచి తాళమువేసి త్రిజట "అమ్మా! యెలుక నన్ను కఱువలేదు. నాచీరనిమిత్తము పెట్టె మూతతీయఁగా పెట్టెమీఁదనున్న యెలుక నాచేతిమీఁదినుండి ప్రాఁకి యీ పెట్టెలో నుఱికినది. నేను భయపడి కేక వేసి పెట్టెమూఁతవేసినాను." అని చెప్పెను. "మంచిపని చేసినావు. ఎలుకలబాధ మనయింటవిస్తారముగా నున్నది. ఎక్కడినో చూరెలుక యొకటి మనగదిలో ప్రవేశించి పండెముమీఁది బట్టలన్నియు కొట్టివేయుచున్నది. నేఁటికి దానికాయువు మూఁడి పెట్టెలో దూఱినది. పాఱిపోవునేమో పెట్టెతలుపుతీయకు. పెట్టె నెత్తిమీఁదబెట్టి మన తాటకచేత నావలికిఁబంపెదను." అని యా కెంపవసుందరి చెప్పెను. వారిసంభాషణమువలన నేనా కాంత త్రిజటతల్లియని గ్రహించితిని. అప్పుడు తల్లిబిడ్డలకు మఱియు నీ క్రిందిరీతిని ప్రసంగముజరగెను.

బిడ్డ—అమ్మా! ఈపెట్టె తాటకచేత పంపరాదు. అది యిందులోని యెలుకను చంపివేయును.

తల్లి—అమ్మాయీ! నీకిష్టములేనియెడల చంపక దీనిని దూరముగాఁగొనిపోయి యూరిబైట విడిచిరమ్మని నేను తాటకతో గట్టిగా చెప్పెదనులే.

బిడ్డ—నీవెన్ని చెప్పినను తాటక దీనిని చంపకమానదు. అది క్రూరురాలు. దానిమాట నేను నమ్మను. నాసఖియైనహిడింబిని కూడ వెంటఁబంపి దూరముగా వదలిపెట్టించెదను—ఓహిడింబీ! ఓహిడింబీ! వేగిరమురా.

తల్లి—ఇష్టమున్నయెడల హిడింబినికూడఁ బంపవచ్చును—ఓతాటకా! నీ చీపురుగట్టవిడిచి యిటురా. వీధియరుగులు తరువాత తుడుచవచ్చునులే.

"అమ్మా! వచ్చుచున్నాను" అని దూరమునుండి యొకధ్వని వినవచ్చినది.

"ముందుగా నీవిటురా. నీపని తరువాత చేసికోవచ్చునులే." అని మరల త్రిజటతల్లి దాసిని పిలిచెను. "పని కావచ్చినది. చేసికొని వచ్చెదను." అని దూరమునుండి మరల ధ్వని వినవచ్చెను. "అది యెంతసేపటికిని రాకున్నది. నేను పోయి తీసికొనివచ్చెదను." అని త్రిజట తల్లి నడిచెను. ఆమె కాలిచప్పుడు వినబడఁగానే నాకు భయ మధికము కాఁజొచ్చినది. ఇంతలో నెవ్వరో లోపలికి వచ్చుచున్నట్లు మరల కాళ్ల చప్పుడయినది. ఆయడుగులచప్పుడు చెవినిబడఁగానే నాపాలిటికి మృత్యుదేవత్యైయున తాటకయే వచ్చుచున్నదని నాగుండెలు తటతట కొట్టుకొన నారంభించినవి. అప్పుడెవ్వరో యిద్దఱు గుసగుస లాడుచున్నట్టు మాటలు వినఁబడఁజొచ్చినవి. అది రాక్షసుల కేకాంత మైనను వారి గుసగుసలు సూక్ష్మశబ్దగ్రహణశక్తిగల మనుష్యుల శ్రవణేంద్రియములకు స్పష్టముగా వినఁబడుచునే యుండును. అందుచేత చెవియొగ్గి వారిమాటల నాలకింప మొదలుపెట్టితిని.

"ఓహిడింబీ! రాత్రి నీవుతెచ్చిన వాలఖిల్యుఁడీపెట్టెలో నున్నాఁడు. అమ్మతో నిందున్నది యెలుకయని నేను బొంకినాను."

"ఇప్పుడు నేనేమి చేయవలెను?"

"ఇతని కపాయము కలుగకుండ కాపాడి యేలాగుననైనను నీవీతనిని నాకడ మరలఁ జేర్పవలెను. నాఁటి రాత్రితెచ్చుట తెచ్చుట గాదు. నేఁటిపగలు తెచ్చి నీప్రాణసఖియైన త్రిజట ప్రాణములు నిలుపవలెను.

"ఓత్రిజటా! నీనిమిత్తమయి నాప్రాణములయిన నిచ్చెదను. ఆరాక్షసిముండ కన్నులు గప్పి మరలతెచ్చి నీప్రియవల్లభుని నీకెట్లు సమర్పింపఁగలుగుదునో నాకు తోఁచకున్నది."

"అమ్మ తాటకను తీసికొనివచ్చుచున్నది. ఇఁకమాటల కవకాశము లేదు. ఇదిగో పెట్టె తాళముచెవి. ఇది నీవు దానిచేతి కియ్యక పదిలముగా నీయొద్ద నుంచుకొని యేదో మాయోపాయముచేత దానిని దూరముగా పంపివేసి పెట్టెతీసి యీవాలఖిల్యుని నీయొడిలో వేసికొని తీసికొనిరా."

"త్రోవలో నేదో యుపాయ మాలోచించెదను."

అనుచుండఁగానే మరల పాదముల చప్పుడు వినఁబడినది. ఇఁక నాకు ప్రాణభయము లేదని నాగుండెలు కొంత కుదుటపడినవి. "ఈపెట్టె దీని నెత్తిమీఁది కెత్తు" అను శబ్దముతోనే పెట్టె కదల నారంభించెను. ఆపెట్టెలో నాకప్పుడు కలిగిన యనుభవైకవేద్యమయిన సౌఖ్యము మనదేశమునందలి మోటుబండ్లలో నెక్కి యెత్తుమెత్తుల పల్లములు గల దారులలో ప్రయాణములుచేసి మోకాళ్ళకును మోచేతులకును శిరస్సులకును దెబ్బలు తగిలించుకొన్నవారికిఁ దక్క మఱియెవ్వరికిని దెలియదు. హృదయైకవేద్యమయిన యాభోగమును గొంతసేపనుభవించిన తరువాత పెట్టె భూదమీఁద మోపినట్టయి యాకాంతలసంభాషణ మారంభమయ్యెను.

"ఓహిడింబీ! ఈయెలుక నేమిచేయుదము?"

"ఓతాటకా! చేయుట కేమున్నది? ఈపాదలచేరువను విడిచి పెట్టుదము. దీనిని చంపవలదని త్రిజట చెప్పినమాట నీవు వినలేదా?"

త్రిజటమాటల కేమి లే. మనము దీనిని చంపక విడువరాదు. మొన్న నాయలుకఁగుడ్డకన్నములోనికీడ్చుకొనిపోయినది యీయెలుకే."

"మంచిది. అలాగుననే చేయుదము. నీవాశ్మశానమువద్దకిఁ బోయి యొకకత్తి తీసికొనిరా. నేను పెట్టెమూఁతతీయఁగానే కత్తితో నీవీ యెలుకను చావమోఁదుదువుగాని లే."

"ఈయాలోచన దివ్యముగా నున్నది. కాలుచున్న కాష్ఠములో నుండి యొకకఱ్ఱనుగాని యిక్కడ నున్నట్టె వచ్చెదను."

ఈమాటలు చెవినిబడఁగానే నేనావఱకను పెట్టెకుదుపువలనఁ గలిగిన గాయములబాధను మఱచిపోయి ప్రాణభీతిచేత మానసికమైన మరణవేదనను పొంద నారంభించినాను. ఈమనోవేదనముందఱ నాశరీర వేదన పర్వతములో పరమాణువంతగానైనను తోఁచలేదు. ఏమియు పాలుపోక యిట్లారాటపడుచున్న సమయములో హిడింబి పెట్టెమూఁత తీసి నన్ను పైకితీసినది. ఇంతలో నెవ్వరో దూరమునుండి "హిడింబీ! హిడింబీ!" అని పిలువఁజొచ్చిరి. "అయ్యో! ఈవాలఖిల్యుని నాయొడిలోఁ బెట్టుకొని నాబట్ట సవరించుకొనుటకైన నవకాశము లేకపోయినది! కానీ! ఇతని నిప్పటి కీపొదలో దాఁచి వారిని సాగనంపి మరలవచ్చి యొడిలోఁ బెట్టుకొనిపోయి నా చెలికి సమర్పించెదను. ఈలోపల తాటక వచ్చి యడిగినయెడల పెట్టెతీయఁగానే యెలుక పాఱిపోయి యేదో కలుఁగులోదూఱినదనిబొంకెదను." అని తాననుకొనుచు నన్ను చేరువ పొదలోఁబెట్టి తానా వచ్చెడివారి కెదురుగాఁ బోయెను. నేను దూర ముగానున్నను వారిమాటలు నాకు వినఁబడుచునే యుండెను.

ఆవచ్చినపురుషులలో నొక్కఁడు—ఓహిడింబీ! రాత్రి వాల ఖిల్యమహర్షి నెవ్వరో యెత్తుకొనిపోయినారఁట! ఆతనిని వెదకుట కయి మహాకాయుఁడుగారు మమ్ముఁబంపినారు. ఆతనిజాడ నీకేమియు తెలియ లేదుగదా?

హిడిం—తెలియలేదుగాని నేనొక్కమాటవిన్నాను. ఎవ్వఁడో యంగుష్ఠమాత్ర శరీరుఁడైన పురుషుఁ డొక్కఁడు జ్యోతిశ్శాస్త్ర ప్రతి పక్షులైన నవనాగరికులసభలో నున్నాఁడని విన్నాను.

పురు—ఆసభయెక్కడనో మాకు కొంచెము మానవాలు చెప్పఁ గలవా?

హిడిం.— ఇక్కడకు నాలుగుయోజనముల దూరములోనున్న తోటలోనున్నది. దానిచూపెదను రండి.

అని వారిని తీసికొని హిడింబి ప్రక్కకుంజమునకుతిరిగి యదృశ్యమైనది "మీరనుకొన్న నాలుబల్లుగడను నేనే! నాపేరు సత్యరాజాచార్యులు." అని నేనుమహాకాయుని భృత్యులను పేరులుపెట్టిపిలిచి గొంతుకపలుకులుపట్టుగా నఱచితినిగాని నామాట వారు వినిపించుకొన్నవారుకారు. పొదనుండివెడలి వారివెంబడి పరుగెత్తుటకు తాటక కఱ్ఱగొనివచ్చి యెక్కడచావమోదునో యన్నభీతిచేత నాకు సాహసము లేకపోయినది.

---

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము.

హిడింబి నన్ను పొదలోఁగూరుచుండఁబెట్టి పోయినతరువాత మనస్సులో పరిపరిలాగున నాలోచనలు కలుగఁజొచ్చినవి. తాటక కఱ్ఱగొనివచ్చి చావఁగొట్టునేమోయన్న భయము మొట్టమొదట పుట్టినది. గాని యారక్కసి పెట్టెలోనున్నది యెలుక యనుకొని యెలుకను చావమోఁదునిమిత్తము కఱ్ఱకొఱకు వెళ్ళినదన్నమాట స్మరణకువచ్చిన తరువాత భయనివారణమయినది. ఇంతలో హిడింబివచ్చి నన్ను పట్టుకొని యేమిచేయునో యన్నభయము మఱియొకటివచ్చి నామనస్సును మఱింత బాధింపఁజొచ్చినది. హిడింబి చేతిలో మరలఁ జిక్కకొన్నపక్షమున నాకు మరణవేదనకన్నను క్రూరతరమయినబాధ సంభవించును. అది నన్నొడిలోఁ బెట్టుకొనిపోయి తనచెలియైన త్రిజటకు మరల సమర్పించినపక్షమున, త్రిజట నన్నేమి బాములఁబెట్టునో!

మరల నేపెట్టెలోనో పటపుక్రిందనో పెట్టి త్రిజట నన్ను దాఁచినపక్షమున నేనీసారి యాపిరివెడలక యజ్ఞపశువువలె చావవలసి వచ్చును. అని యాలోచించుకొని హిడింబివచ్చులోపలనే పాఱవిడిచి పాఱిపోవలెనని నిశ్చయించుకొని నేను మెల్లగా పయికివెడలివచ్చి యొక చెట్టు చాటునకు నడిచితిని. ఇట్లొక చెట్టుమొదలుచేరి నలుదిక్కులకును చూడ్కి నిగిడించునప్పటి కొకదిక్కునుండి తాటక చేతకత్తిధరించి మృత్యుదేవతవలె నావంకకే వచ్చుచుండెను. మఱియొకదిక్కునుండి శ్మశానములుదాటి పెద్దవానరమొకటి నావంకకే వచ్చుచుండెను. ఇంకొక దిక్కునుండి యాపురుషులను విడిచి హిడింబి యొక్కతెయు నావంకకే పరుగెత్తుకొని వచ్చుచుండెను. త్రేతాగ్నులవలె మూఁడు రూపములును నాకంటఁ బడఁగానే నాకప్పుడు ముగ్గురు మృత్యుదేవతలాసన్నమయినంత భయము వేసినది. చెట్టున కెగఁబ్రాకుఁదమన్న దాని ప్రకాండము నాకౌఁగిటి కొదఁగదు. తొఱ్ఱలో దూఱుదమన్న నెందు వెదకినను తొఱ్ఱ గానరాలేదు. ఏమిచేయుటకును దోఁచక నేనుదిగ్భ్రమ నొంది దిక్కులు చూచుచుండఁగా ముందుగా హిడింబి వచ్చి పొదచేరి నన్నే కాఁబోలును వెదక నారంభించెను. ఇంతలో తాటకవచ్చి పెట్టె చేరి మూఁత తెఱచి యాశ్చర్యపడ నారంభించెను. అప్పుడు తాటక హిడింబిని జూచి నీవాపొదలో నేమి వెదకుచున్నావని యడిగెను. నీవు కట్టెకొఱకు పోయిన తరువాత నెలుక యెంతయున్నదో చూడవలెనన్న చపలత్వముచేత పెట్టెమూఁత యెట్టెతీయఁగా నొక్క యెగురెగిరి యావలబడి యెలుక యీపొదలో దూరినందున దానిని వెదకుచున్నానని హిడింబి యుత్తరము చెప్పెను. నేనామాట లాలకించుచు నేమఱి యున్న సమయమునందు మెల్లగా వానరము, నావద్దకువచ్చి నన్ను చంకఁ బెట్టుకొని చెట్టుమీఁది కెగఁబ్రాకెను. నాదుస్స్వప్న ఫలమిపుడు నాకు పూర్ణముగా ననుభవమునకు వచ్చినది. నాకు కలలోఁ

గనఁబడిన కోఁతియే యిప్పుడు ప్రత్యక్షమయి నన్ను వృక్షాగ్రమునఁ బెట్టినది. అక్కడనుండి క్రిందికి జాఱిపడితినా చట్రాతిమీఁదఁబడిన గాజుకాయవలె నాతల వేయివ్రక్కలు కాకమానదు. ఏకొమ్మనైన నను గట్టిగా కౌఁగిటఁబట్టుకొనవలెనన్నను పట్టుకోనీయక యీపాడుకోతి మెడమచేతితో భల్లూకపు పట్టుపట్టి నన్నొడిలోఁ బెట్టుకొని కదల నియ్యకున్నది. చెట్టుపయిని నేనిట్టియవస్థలోనుండఁగా క్రింద హిడింబియు తాటకయు నన్ను వెదకుచు నేనున్న చెట్టుమొదటికి వచ్చిరి.

తాట—అయ్యో! చేతఁజిక్కిన యెలుకను నిష్కారణముగాఁ బోఁగొట్టితివిగదా!

హిడిం—నీవు కల్లునిమిత్తమయిపోయి యెంతసేపటికిని రాక పోఁగా నెంతపెద్ద యెలుకో చూడవలెనని మూతకొంచెము తీయఁగానే యెలుక పైకుఱికి పాఱిపోయినది.

తాట—మహాకాయునియింటనున్న వాలఖిల్యమహర్షి నెవ్వరో యెత్తుకొని పోయినారని చెప్పుచుండగా వినుచు నిలుచుండుటచేత కల్లుతెచ్చుటకు కొంచె మాలస్యమయినది. ఎలుక పైకిరాఁగానే తఱుముకొనిపోయి పట్టుకోలేక పోయినావా?

హిడిం—ఇంతలో మహాకాయుని భృత్యులిద్ద ఱక్కడకు వచ్చి యుండనియెడల దానిని నేను పోనిత్తునా? వాలఖిల్యమహర్షి రాత్రి యంతర్ధానమయినమాట చెప్పుచు వారు నన్ను కొంతదూరము తమ వెంటఁ గొనిపోయినారు.

తాట—ఇక్కడ కలుగులు లేవు. ఎలుక యీచెట్టుపైకి ప్రాఁకలేదుగదా?

హిడిం—ఎలుకలు చెట్లెక్కునా?

తాట—చూచితివా చెట్టుమీఁద నెంతపెద్ద వానరమున్నదో?

హిడిం—ఏది? అదా? అవునవును. దానియొడిలో నేమో యున్నట్టున్నది.

తాట — అదృశ్యుఁడయిన వాలఖిల్యునివలెకనబడుచున్నాఁడు. అవునవును. అతఁడే. మా కోడిపిల్ల పోయినప్పుడు ప్రశ్నయడుగఁబోయిన వాలఖిల్యుఁడితఁడే.

హిడిం — ఈ వాలఖిల్యుఁడు మనకుదొరికిన బాగుండును. మన త్రిజట వాలఖిల్యుని జూడవలెనని యెన్నోసారులు నాతోఁ జెప్పినది. మనమితని దీసికొనిపోయి యామెచేతికిచ్చి రెండుమూఁడు దినములు మనయింట నుంచుకొందము.

తాట — నీవన్నయాలోచన బాగున్నది. ఈకోఁతిని జెదరించి మన మావాలఖిల్యుని పట్టుకొంటిమా వేయిసువర్ణములు సంపాదించి మనము ధనికురాండ్రము కావచ్చును. మహాకాయుఁ డెంత సొమ్మిచ్చియైన నీతనిని వదలుకొని పోకమానఁడు.

హిండి — అట్లయిన మన మీవాలఖిల్యుని పట్టుకొందము. నీవు చెట్టెక్కఁగలవా ?

తాట — ఎలుకను బట్టుకొనుటకయి దుమికెడుపిల్లివలె నేనీ చెట్టుమీఁదికొక్క గంతువేసి వాలఖిల్యుని బట్టుకొనెదను. నీవీకఱ్ఱచేతఁ బట్టుకొని క్రోఁతి క్రిందకుఱికి పాఱిపోకుండ జాగరూకతతో కాచి చూచుచుండుము.

ఆమాటలు వినునప్పుడు నాబ్రతుకు ముందఱికివచ్చిన నోయియు వెనుకకుఁబోయిన నూయియు వలెనుండెను. ఈముగ్గురిలో నెవ్వరిచేతిలోఁ బడినను నాకు ప్రాణసంశయస్థితియే సంభవించును. ఆముగ్గురును త్రేతాగ్నులనుగా నేనీవఱకే పోల్చియున్నానుగదా! నన్నుఁ గొనిపోయి దక్షిణస్వీకరించి విడువఁదలఁచినందున తాటకను దక్షిణాగ్ని యనవచ్చును. నన్నుఁగొనిపోయి తనచెలికత్తె కర్పించి నన్ను గృహపతినిగాఁ జేయఁదలఁచినందున హిడింబిని గార్హపత్యాగ్ని యనవచ్చును. నానోటిలోనేదో ప్రక్కియో తోఁక నామెడకుఁ జుట్టఁ

క్షత్రియో హోమము నిమిత్తమై బ్రాహ్మణులు పశువును బట్టి కట్టుగా పట్టిరి వెనుకనియ్యక నా ప్రాణములు గొనఁదలఁచినందున మర్కటము నాపాలిటి మూర్తి యని చెప్పవచ్చును. ఈ మూఁడుగన్నుల లో నాకన్నును దక్షిణాక్షి మేలుగ తోఁచినందున నా యజమానుఁడైన మహాకాయునిదగ్గఱఁజేరి సుఖింపవచ్చునన్న యాశచేత నేను తాటకచేతులలోఁ జిక్కఁదలఁచుకొని వానరముయొక్క యొడిలోనుండి దుమికి యా రాక్షసిని కౌఁగిలించుకొనుటకయి చేతులు చాఁచుకొని సంసిద్ధుఁడనయి కూరుచుండియుంటిని. తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచునుగదా! తాటక వృక్షమారోహించుట చూచి యా దుష్టవానరము నన్ను విడిచి పాఱిపోక తన తోఁకను నేను మొదట ననుకొన్నట్లుగా నా మెడకుఁగాక నా పొట్టకు చుట్టఁబెట్టి నన్ను తనవీపుమీఁద బదిమిపెట్టి యా చెట్టుమీఁదినుండి మఱియొక చెట్టుమీఁదికి దుమికెను. అంతట తాటక చెట్టు దిగివచ్చి హిడింబితో నేమో యాలోచించి వానరమును రాళ్ళతో విసరనారంభించెను. దానికి సహాయురాలయి హిడింబియు మామీఁద శిలలు రువ్వసాగెను. ఆ శిలాయుద్ధమునకు తాళఁజాలక వానరరాజు చెట్టుమీఁదినుండి యుఱికి నన్ను వీపుమీఁద వేసికొని పాఱిపోవఁజొచ్చెను. వెనుకనుండి యఱచుచు నారాక్షసాంగన లిరువురును మమ్ము తఱుముకొని వచ్చిరి. ఇట్లు కొంత దూరము పరుగెత్తునప్పటికి వెనుకఁ జెప్పిన మహాకాయుని భృత్యులిద్దఱును ప్రక్కదారినివచ్చి వారిని గలిసికొని యేలపరుగెత్తుచున్నారని యడిగిరి. ఆ చెడుకోఁతి వాలఖిల్యుని నెత్తుకొని పాఱిపోవుచుండగా విడిపించుటకయి పరుగెత్తుచున్నామని వారుత్తరము చెప్పిరి. ఇట్లు నలుగురును నొక్కచోటఁ జేరునప్పటికి పూర్వము నన్ను మందోదరి యప్పుడప్పుడు తీసికొని వచ్చెడి యుద్యానవనముకడకు మేము వచ్చితిమి. అంత నలుగురును గలిసి తన వెంటఁబడు మర్కటరాజును మాత్ర

మును భయపడక నన్ను విడువక యక్కడనుండి యొక్కయంగ వేసి యెగిరి సువేలాద్రిమీఁదికి దుమికెను. ఆవానరుఁడు గంతువేసినస్థలమునకు సువేలాద్రి నాలుగు యోజనములదూరములో నున్నదని నేనంతకుముందే మందోదరివలన నెఱిఁగియున్నాను. మర్కటమునన్ను వెన్నునఁ బెట్టుకొని కుప్పించి యెగురఁబోవునప్పుడు దైవమాయ చేత నాకొక్కయావులింతవచ్చినది. పూర్వాచారపరాయణుఁడ నగుట చేత పెద్దలయాచారమును మీఱరాదని నేనప్పుడు కొండంతయాపదలో నున్నను నాయావులింత పోవునంతకును చిటికలు వేయుచుంటిని ఆకోఁతితో నేను సువేలాద్రిశిఖరమున వాలునప్పటికి లెక్కవేయఁగా నాచిటికలు సరిగా పదియైనవి. ఆలెక్కనుబట్టి పదిచిటికల కాలములో వానరము నాలుగు యోజనముల దూరము దుముకునని నేను తెలిసికొంటిని. అప్పుడు నేను ముందువంకఁ జూచునప్పటికి నా యెదుట లవణసముద్రము మేఘమండలములనంటు తరంగములతోను మేఘనాదములతో విద్యున్మందు సంతతధ్వనితోను భయంకరముగాఁ గానఁబడెను. వానర మింక ముందువంకకు పాఱిపోవుట కవకాశము లేనందున నలుగురువచ్చి చుట్టువేసి నన్ను దక్కించుకొని మహారాయున కియ్యవచ్చునని నాలో నేను సంతోషపడుచుంటిని. ఇట్లు నేను మనోరథసామ్రాజ్యానందము నొందుచుండఁగానే వానరము కుప్పించి ముందువంక కుఱుకుట కుద్యుక్తమయి యున్నట్లు కనఁబడెను. అందుచేత నే నీసారి యెంతదూరము దుముకునో చూడవలె నన్నయుత్సాహముచేత ముందు సముద్రమున్నమాట మఱచిపోయి చిటికలు వేయుటకు మొదలుపెట్టితిని. ఇన్నూటయేఁబది చిటికలు లెక్కపెట్టునప్పటికి వానరము నన్ను గొని సముద్రమున కావలి యొడ్డునను న్న యొక విశాలమయిన యిసుకతిప్పలో వ్రాలినది. అప్పుడు నేను గణితశాస్త్రప్రకారముగా లెక్కవేసి యిన్నూటయేఁబదింటిని పదింటిచేత

భావించుచునా పట్టునట్లు యిరువదియైదుకాఁగా, పదిచిటికల కాలములో నేఁబోఁగలదూరము నాలుగుయోజనములగుటచేత నిరువదియైదును నాలుగుచేత గుణించి సముద్రముయొక్క వెడలుపు సరిగా నూఱుయోజనములని తెలిసికొని నేనత్యాశ్చర్యపడితిని. ఆహా! మనపూర్వులసామర్థ్యము నేమని శ్లాఘింతును! వారునిజముగా సర్వజ్ఞులేసుండీ. అణుమాత్రమయినను హెచ్చుతగ్గులు లేక నూఱుయోజనములని రామాయణములోఁ జెప్పఁబడినదానికిని నేను కన్నులారాఁ గొలిచి లెక్కచేసినదానికిని సరిగా సరిపోయినది. లంకకును మనదేశమునకును నడుమనున్న సముద్రమిదియేకదా? నేను సముద్రమును దాఁటునప్పుడు శ్రీరాములవారు కట్టిన వారావధిని స్పష్టముగా జూచినాను. మనుష్యులు లంకకుఁ బోవకుండుటకయి మరలివచ్చునప్పుడు శ్రీరాములవారు కట్టను నడుమనడుమ తెగఁగొట్టిన సందులును నాకంటికి కరతలామలకముగాఁ గనఁబడినవి. మన పూర్వులను గురించి యాలోచించుచు నేనుకొంచె మేమఱియుండఁగా వానరమునన్ను వెన్నుమీఁదినుండి త్రోఁకతో పైకెత్తి మఱియొక్కదుముకు దుమికినది. ఈసారి నేను వీపుమీఁదనానుకొని దృఢముగా నుండక వాలమున త్రేలుచు భయభ్రాంతుఁడయిన యుండుటచేత చిటికలువేసి దూరమును కనుఁగొనలేకపోయినాను. నేనిట్లు దిగ్భ్రమ నొందియుండఁగానే యావానరము నన్ను నట్టడవిలో విడిచి యదృశ్యమయినది. అప్పటికి సూర్యగతినిబట్టి నాలుగయిదు గడియల ప్రొద్దెక్కినట్టు తోఁచినది. కన్నులువిచ్చి చూడఁగా నక్కడిచెట్లు మొదలయినవి లంకలోనివానివలె నత్యున్నతములుగాక మనదేశములోని సామాన్యవస్తుజాలమువలెనే యున్నవి. ఆవానరముయొక్క వీపునానుకొని సముద్రమును దాఁటునప్పుడు నాకు తోఁచలేదు గాని నన్నిక్కడకుఁ గొనివచ్చి విడిచిన యా మహానుభావుఁడెవ్వఁడో యన్నయాలోచన నా మనస్సునకిప్పుడు కలిగినది. అతఁడు వాయు

పుత్రుఁడైన హనుమంతుఁడయినందుకు సందేహము లేదు. అతఁడు హనుమంతుఁడే కాకపోయినచో శతయోజనాయామమయిన సముద్రము నొక్కయంగను దాఁటుటకు మఱియొక్కనికి సాధ్యమగునా? కాదు మనపెద్దలు చెప్పినట్లుగా నతఁడు రావణాసురుని కాష్ఠమారిపోకుండు నట్లుగా ప్రతిదినమును తాను దంతధావనము చేసికొన్న పుడకల నందు వేయుటకయి పోవుచుండును గాన నేఁటి యుదయమున నన్నుఁజూచి జాలి దలఁచి పాదలేపము లేని నేను రాక్షసుల దేశమునుండి రాలేనని యిక్కడ తెచ్చి విడిచినాఁడు. నేనీ యడవిలోని ఘాతుకమృగముల వాఁతబడక బ్రతికి యిచ్చటివారి యండఁజేరఁ గలిగినపక్షమున, రెండుమూఁడు మాసములలో వారిభాష నేర్చుకొని తరువాత నా కథను మీకు మహాత్ములచేతఁ బంపెదను.

సంపూర్ణము.



# శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము.



By

**K. VEERESALINGAM**

శ్రీ

# శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము.

## ప్రథమాశ్వాసము.

క. సిరియెదఁగలదొరజేజే
దొరయును నెలఁతదొర నుండుదొర జేజేలె
ల్లరుఁగొలుచుఱేఁడ ట్రాచుల
సరులుగలుగు జక్కులదొరసంగడికాఁడా.

క. కడఁకం దెనుఁగున నొనరుతుఁ
గడుకొని నలుఁడను నొడయనికతయెల్లను నే
నుడుగక నాసేర్చుకొలఁది
నెడద న్నిన్నునిచి కొలిచియెంతయునిచ్చక్. 2

క. దుడుకున నింతకుఁగయితె
న్నఁడు నెఱుఁగని కుఱ్ఱఁగాన నచ్చతెనుంగన్
గడలిని నొంటిఁగ నీఁదఁగ
గడఁగితి నీయండఁజూచి కదలనికడఁకన్. 3

గీ. తాతఁగొనియాడి తరిగట్టువారిఁగొలిచి
గట్టురాకన్నె నగ్గించి దిట్టయైన
తెల్లచానకు జోహారులల్ల జేసి
లగ్గులొసఁగ నెలుకరౌతు నుగ్గడించి. 4

క. నన్నయఁదలంచి యెదనె
ఱ్ఱన్నను సారెకును నెంచి యలతిక్కన్నం
జెన్నుగ లోనిడుకొని సూ
రన్నఁగొలిచి యుగ్గడింతు నాశ్రీనాథున్. 5

సీ. నేర్చుకోఁడిని సేఁజేయదారఁగొన్న
యీసలుకతతెఱం గెట్టిదనినఁ
జాల్లి కానలలోన నెల్లెడఁదిరుగుచు
నాగిగొంటిత్రాలిగాఁడు కొక్కనాఁడు
నైదోఁడులనుగూడి చక్కఁగాఁగూర్చుండి
జడదారియొక్కండు సరసకరుగు
దెంచినఁ గనిలేచి యించుకయెదురేగి
కొని తెచ్చిజోహారులొనరఁజేసి
యొకకసానిగద్దియఁగూరుచుండననిచి
తనకుఁగూళ్ళలో దాయలు కినుకతోడ
నెఱిఁగిచేసిన కడగండ్లనెల్లనోలి
నెఱుఁగఁజేయుచు నాతని కిట్టులనియె. 6

ఉ. ఓజడదారిరాయ యొరుఁడొక్కఁడు నాసరిగాఁగఁగానలోఁ
దేజుతో ఱంగి యంగదలఁదేలుచు లచ్చిని నేలఁజుట్టలం
దాజతకూడు నెయ్యునిని దద్దయుఁగూడుట లేకనిచ్చలీ
యోజనుదూలి హెచ్చుడిగియుండఁగఁ జూచితె తొల్లియెచ్చటన్. 7

గీ. అనుచుఁగన్నులనీరొల్కనాడియూర
కున్న జడదారియూరార్చి చెన్నుదలిగి
సరసఁగూర్చుండియున్న యాదారనుగూర్చి
యెట్టకేలకు నల్లననిట్టులనియె. 8

గీ. నేలజేజేలఁగూడి జేజేలకద్ది
యైన నైదోడులును చేరులలరఁగాన
నుండనరుగుదెంచితిగా దెయూరకిచట
కెక్కడైనయట్టియొలుకయొడఁదఁదనర 9

సీ. త్రొల్లి జూదాననలుఁడోఁడితూలియకట
తనకుఁగలసిరులన్నియుదాయగొనఁగ
నొక్కరుఁడెచేటులొందఁడేయుక్కడక్కి
కానలోఁజక్కనితనచానఁదొఱఁగి. 10

సీ. అనినఁగట్టియున్న యాకతయొఱుఁగంగఁ
గోరుటయునుగోర్కికొనలుసాఁగఁ
జదురుగులుకనిట్లు జడదారిరాయంచు
తెలియఁజేయఁదొడఁగె దేటగాఁగ. 11

సీ. ఎసఁగునలుఁడనుఱేఁడొక్కఁడెన్నరాని
దండుతెచ్చుటఁగనుఁగొన్నసిండియుండ
నేలునతఁడునిషధయనునేలఁదనరు
చేఁతలొరులెల్లనగ్గించి చెలఁగుచుండ. 12

క. ఇంతయుఁగొదలేకుండఁగ
నెంతయుఁదాజన్నిగట్లకిచ్చునునిచ్చల్
కొంతయుజాలిగొనక తన
చెంతఁదిఱుగునతనినైనఁ జెడుగుంద్రుంచున్. 13

క. ఓలిన్నలుఁగొనియాడఁగఁ
దేలికఁ దాతయును గాలితిండుల ఱేఁడుం
జాలుదురే యొకరొకరికి
నాలుగుజంటయిదునూళ్లునొదలలున్నన్. 14

గీ. అట్టిచక్కనయ్యకునుద్దియైనరాచ
యెనుఁగులగొంగయొక్కనాఁడేగుదెంచి
తోఁటలోనికొలఁకుచెంతఁదోడులేక
యొక్కరుఁడెయిట్టటుతిరుగుచున్నతఱిని. 15

క. అంచలరాయఁడొక్కఁడు
కొంచక తనయునకుఁ జెలులుకొండఱతోనే
తెంచి యెదుటనేలకుడిగి
యించుకనడయాడఁజూచి యిచ్చనలరుచున్. 16

క. ఒకయంచ తటసంచల
నడల తెఱంగెల్లఁగాంచి నగుచుఁగడంకన్
గడుకొసరియొకరాయంచను
దడయక చిక్కించుకొనియెఁ దనకెంగేలన్. 17

ఉ. దానిఁదొలంగియేగుటకుఁ దాళకయంచలు కొంతచెంగటన్
జానుగనుండికన్గొనుచుఁ జయ్యననేగుచు జాలిఁదూలుచుం
గానఁగనేగుదెంచుచును గ్రక్కునవాతని నిక్కిచూచుచున్
దానినిజేరుచుం దుదకుఁదద్దయు డస్సితొలంగె నచ్చటుల్. 18

గీ. అట్లుచిక్కియంచ యారాచరేఁడు
తనకుఁగీడునేయునని తలంచి
యొలికకుడిచేత నాలుకతడియాఱ
నిలిచికన్నుఁగొనల నీరుగ్రార్చంగ. 19

గీ. అళుకుగదిరియొడలు దడదడలాడంగ
నోరురాక కొంతయూరకుండి
యెట్టకేలకింత యెదగట్టిచేసికొం
చెలుఁగుసన్నగిలఁగ నిట్టులనియె. 20

క. ఏటికినరుదెంచితివీ
తోఁటకునిందేలచెలుల తోడదిగితి న
న్నేటికి నేలికలోఁగొన
నేఁటికి నేగితలఁగ నయ్యాదితెఱఁగో. 21

క. అనితనలో ననుకొనికడు
నెనరుగలుగు నట్టుగాఁగ నెట్టననలునిం
గనుఁగొనుచునీరెలుంగున
ననియెం దనతెల్ల తెక్కులార్చుచుఁగణఁకన్. 22

సీ. ఎల్లచోనారాక కెదురుచు చూచున్నండు
నెలంతుకయెదనెంత తలఁకెనొక్కొ
యేకేయినన్నింటి నిలుదాఁటనీకుండు
కన్నతల్లియదెంత కలఁగెనొక్కొ
తోడునీడలలాగు తొలఁగనిచెలికాండ్రు
సోలినన్ గవకెంతతూలిరొక్కొ
నేఁజేరుటయెఱింగి నెనరునఁజనుదెంచు
కొడుకులుతారెంతో కుందిరొక్కొ
కూడియెల్లరిది తెలిసికొన్నయంత
గటకటా తాతనీచేతఁ గడకునేఁడు
చిక్కఁగాఁజేసె నేనెద్ది సేయుదింకఁ
బాళినన్నెలు తేఁడనేననదనై తి. 23

మ. అనినందద్దయు జాలినొందుచునతండాయంచఁ జుట్టాలతోఁ
జనఁగా నానతియిచ్చె దాననళుకుం జాలించిరాయంచయుం
దనకాతేఁడొనరించు లగ్గునకుఁగాఁ దానొండుసేయంగలో
ననయెత్తంగడునంతసిల్లి దొరచెంతంజేరి తానిట్లనున్. 24

గీ. ఆయనీయట్టిచాగికి నగునటంచు
నేనుజేసెడు లగ్గించుకై నఁగలదె
యైననానేర్చు నట్లుగనేనునొక్క
లగ్గుసేయంగ నెడఁదఁదలంచినాఁడ. 25

క. ఆ యడిచేకొనఁదగునని
యీయెడ నేలికకుఁ దోఁచెనేని యింకన్
నాయెడ చెనకొలయఁగని
కాయాలించెదరుగాక కొనకొనియనుచున్. 26

గీ. కత్తి నెచ్చెలి తొలియాలిఁ గన్నతండ్రి
చెలియుంటను సిరులచేనెసఁగినట్టి
యూరుచెన్నారు సరిసాటియొకటిలేక
తఱచుకోటల నెఱయఁగ డ్రలఁజెలంగి 27

గీ. అట్టియూరేలు నెంతయుదిట్టయైన
యట్టిక్రథకైశికుం డనునట్టిజెట్టి
కడఁగియాతండుకట్టలఁగనుటలేక
కొన్నినాళులురాయిడిఁగుందికుంది. 28

*గీ. దాకుఁగుడితట్టునఁ గుఱుచయాకదిసిన
యయిదయిదులనాల్గగు తెనుఁగక్కరానఁ
దనరుదనుఁడను నొకజడదారిచేని
నాలుదానును నిచ్చలుఁజాలఁగొలిచి. 29

◆గీ. ఒనరఁగానేడునాల్గులయొక్కటగుచుఁ
దనరుతెనుఁగచ్చరానదయలసందు
కూడినదయంతియనఁజెల్లుకూఁతునోర్తుఁ
దనరుకొడుకులనిద్దఱగనియెనతఁడు 30

---

*గీ. వేలఁగలయూళ్ళనేళ్ళునవెఱవిదిరిగి । యెందుగోర్కెయీడేరకయుండికడకు
దమనుఁడనియెడు నొకజడదారిచేని । నాలుఁదానునువిచ్చలుఁజాలఁగొలిచి.

◆గీ. అతనివెనవరింతగడియించియలరుకతన। గోరిదమయంతియనఁజెల్లుకూఁతునోర్తు
దమునుదమదాంతుఁడువనఁదనరువట్టి। యమఁగుగొడుకులవిద్దఱగనియెతేఁడు.

గీ. అందుఁగన్నియ తనరారుఁజందురల్లు
నలరుచిలుకన జక్కుల చెలులునచ్చు
రలునుగాలికూడుబ్రౌఢలకలుకలునుద
లంచిచూడదానికెనయెయించుకైన. 31

సీ. కలికినెన్నడకోడి కలయుంగనంచలు
కొలఁకులకడనుండెఁ గోర్కిఁ దక్కి
చెలియడుగులకోడి చెందొగల్ దలలోతు
నీటిలోదిగజాఱె నీటుదక్కి
నెలతకౌనునకోడి నెఱవాత్తి సూడులు
కాననుండఁగఁజొచ్చెఁగడఁకదక్కి
కన్నెయొడలికోడిక్రొన్ననలెల్లెడ
నలిగి యెండఁగఁజొచ్చెనాసదక్కి
యాఱయాచాన సొగసెల్లనాలకించఁ
గలిగిననుగానఁదిరుగుచు గాలిసీరు
నాకులునుగుడిచెమజోగులైనఁదాళ
లేకతొఁగలతే నల్లునికాఁకగొనరె. 32

క. కన్నులుజిగితొగతేకులు
సన్ననినూగారుతేటి చాల్తొడలరఁటుల్
నెన్నఁడశేనుఁగునడకలు
నెన్నుదురరచందురుండు నెఱులెన్నిరుల్. 33

సీ. చిగురులఁగఱకుగాఁ జేసినయాఱడి
తేఁటులఁ జెల్లఁజెందించురట్టు
జిగితొగలేఖులఁజేరఁజేసిననేగి
యంచలఁ గొలకులనుంచునగడు

క్రొన్ననగుత్తులఁ గూలఁజేయుకొ యంత
యనఁటులఁజోదతోడ నొనరుచుపడి
నేఁడుఁగు గొంగలఁగాననుం దినయెగ్గు
తరఁగలఁ గ్రుంగంగ దార్చుకీడు
కలికిచేతులుఁగురులునుగన్నుదోయి
నడలసాగసునుజనుకట్టుఁదొడలుఁ గోనుఁ
దటులు నొనరించి కాదె తాఁ దాత తోడరి
చేసికొనె లేకయుండంగఁ జెలఁగితనకు. 34

గీ. అట్టిసాగసులగనియైన యాసెలంత
దండకేనేఁగితటియైన దండినగుచు
సరగసీచేతలెల్లను సారెకచట
నోటికొలఁదిని నగ్గింతునోట లేక. 35

గీ. అట్లుకొనియాడి నినుఁగోరునట్లుగాఁగఁ
గలికిసేకొన నొనరించిగడియలోన
నిన్నుఁజెలిత్రోడఁగూర్చెద నేనకడఁగి
యానతియొయన్న నాఁగాక యనియతండు 36

క. తలయూఁచెనంతనంచయు
నలుఁడుండినచోటుదాటి నడచిచదలునన్
నిలకయెగసిచనిదిగ్గున
నలత్రొయ్యలియూరునేరి యందొకచోటన్. 37

గీ. చెలులసందునఁదోఁటలోఁ జెలఁగితిరుగు
నంచయానను గాంచియాయంచతటియు
నరిగి క్రాల్గంటిచేఁ జిక్కనళుకుదక్క
యెడఁదనెంతయుఁగోర్కులుగదలుకొనఁగ 38

గీ. అట్లుచేరియుంచ యారెమెలనాగకై
యించుకంతచూచి యిట్టులనియె
నోనెలంతనలుని యొద్దనుండియరుగు
దెంచితినిట కేనుదెలియనరయ. 39

క. రిక్కలరాయనిఁగందుని
జక్కలుదొరయనుఁగుఁగొడుకుఁ జక్కఁదనానం
జిక్కఁగఁజేసెడునేలిక
నొక్కింతయు నెన్నఁగలఁడె యొకఁడీనేలన్. 40

క. ఒడలెఱుఁగని సిరికొడుకుం
గడునడలుచు నుండునట్టి కడలియుసరియే
యొడయనికిన్ సొగసునన
క్కడులోఁతున నెంచి చూడఁగులుకులదొంతీ. 41

గీ. చందురనిసాటియా రాచచందురోడ
నల్లరోహిణికిని నెనరైననీకుఁ
గోర్కులిగురొత్తఁగూడుటకూడదేని
నీమసొగసెల్ల రిత్తయా నెంచి చూడ. 42

మ. అనుమందొయ్యలి దానికై తిరిగి యోయంచాతటింజూచియా
యననాదగ్గర నెట్లుగాఁదెలియనొయ్యంజాటి తాలాగునే
చని యామేలికయొద్దనున్ననుదగం జాటించినీనేర్పున
ట్లననుంగోరఁగఁ జేసియిద్దఱను జల్కంగూర్చియేలంగదే 43

క. నాచదురు సొగసునుంజని
చూచినదెఱఁగించినన్ను నూడిచయిడినా
నీచేసినలగ్గెన్నఁడు
నాచకమెదఁదలంచుకొందు నంచాయనుడున్. 44

ఉ. అంచయు నచ్చటుం గదలి యంతయు నొంటిగ జేనితో నెఱిం
గించితి నంతటం జనియె నిచ్చట నంతనలుండు లోఁగియొ
క్కించుక చిల్కతేజదొర హెచ్చువాళాహాళికిన్నలంగ తే
కంచయెఱుంగఁ జేసిన యొయారిని లోఁదలంచి యిట్లనున్. 45

ఉ. ఎన్నఁడు చూడఁగల్గునొకొ యింతిని జెన్నసలారఁ జూచి నే
నెన్నఁడు సంకుకౌఁగిటను హెచ్చుగఁ జేరుతునొక్కొ చేర్చి యిం
కెన్నఁడు దాని సెజ్జనిడి యించుక కూడుదు నొక్కొ కూడియా
కన్నియ కోర్కితో నగుట కన్నుల నెన్నఁడు చూడఁగందునో. 46

క. చెలినటు తలఁచుచు నలరుం
జిలుకుల సెగలం గలంగుఁ జిలుకల కులుకుం
జలిగాలి కలయఁ గోయిల
కొలకొల రొదలకు నెదఁ దలఁకును గడు నళుకున్. 47

ఉ. నాయనుఁ గన్నులంత తగు నాయను నన్నదనుంచి యేలు చా
నాయను నింకఁ దాళఁగల నాయనుఁ జక్కని క్రొత్తహత్తిగు
న్నాయను జాలియేదనగు నాయను రంగులుగుల్కు నంచయా
నాయను నగ్గలంచ నదనాయను నేఁచఁగ దాయ నాయనున్. 48

క. అచ్చటఁ జందురునల్లుని
చిచ్చున గ్రాఁగుచును దూలి చెలులు తలంకన్
నిచ్చలు నలుఁ దలఁచుచుఁ జెలి
హెచ్చుగ నిద్దురయుఁ గూడు నెఱుఁగక యుండెన్. 49

చ. చిలుకలఁ గొట్టు నచ్చెలులఁ జీటికిదిట్టుఁ గలంచుఁ దేఁటులం
దలఁకఁగఁ జేయుఁ గోయిలలఁ దద్దయుఁ జందురునల్లుదూఱుఁ జా
క్కలదొర కాయ మెండనగు కాఁకకుఁ దాళఁగలేక చొక్కునం
చలవలఁ జుం దలంపు నెదఁ జల్లనిగాలికిఁ జూచుచున్ జెవల్. 50

చ. చిలుకలు దాయలయ్యె నగుచిన్నెలు చూడవాలిక్కియయ్యె నె
చ్చెలులసణుంగుటయ్యెఁ గడుఁజేఁదట కన్గొనసయ్యె నెల్లచో
నలజడిచూడనయ్యె నలయించలఁ దిట్టఁగనయ్యెఁ గ్రొన్ననల్
తలనుగడంగి తాలుచుటలాయరుజయ్యె నెంతకయ్యెడన్. 51

క. ఒడలెల్లఁ దెల్లనయ్యెను
సడలెనునిద్దురయుఁ దిండిచాయ యడంగెన్
దొడరెంగాలికినడలఁగఁ
గడురోఁతగఁదోఁచెనగలు కదలనికాఁకన్. 52

గీ. తఱచునాటుచు దరిగట్టుదారికొడుకు
చెలియయిఱుకుజన్నులసందుచిరుగురుగోల
లొక్కటగురిచేసిచికాకునొందజేయఁ
దాళలేకసెజ్జనొఱగి సోలుటయును. 53

గీ. చెలులుచాలఁదలఁకి చిగురులులోనుగాఁ
గలుగుకొన్ని తెచ్చికడఁగినేద
తేర్చితండ్రికి నది తెలియఁజేయ దలంచి
యేగియతనిఁగాంచి యిట్టులనిరి. 54

క. ఎచ్చటినుండియొ జోగడ
నిచ్చటికొక యించసరగ నేతెంచినలుం
జెచ్చెరనగ్గించిచనియె
నిచ్చిందనచోటుఁజేర నెంతయుఁగోర్కెన్. 55

గీ. నాఁటనుండియు నలుఁగోరినాతినీరు
త్రాగదునిదురయునుగూడు తలచదయ్యె
యెట్టులాతనిఁదోడ్కొని యోగుదేర
ననిచెదో తగుజాణల నతనికడకు. 56

గీ. అనుచు నెచ్చెలు లెల్లను నరుగుదెంచి
కలికి యునికిట్లు తద్దయు నలుకతోడఁ
గనిన దంతయుఁ దనతోడఁ గనుల నీరు
గాఱ నెఱిఁగించి చనఁ గ్రథకైశికంబు. 57

శా. హా తల్లీ యని లోఁగలంగి తుషశాయాయాళ్ళ యందెల్లరుం
జేతుల్ త్రోసుగఁ జేర్చి యెన్నఁగఁ గడుం జెన్నారు రాహత్తులం
గూతుం గైకొనఁ గట్టి యూసలెడలం గొంజంతగాఁ జేసి తా
నేత్రేరంగ నొనర్చె జేనిఁ జెలి తానే కోరుచన్ సాకునన్. 58

క. ఎచ్చటఁ జూచిన నేనుఁగు
లెచ్చటఁ గనుఁగొన్న దేరు లెచ్చటఁ గన్నం
జిచ్చునకోడని శాలలు
లెచ్చట కేగినను దేజులెల్ల డనూరణ్. 59

క. నేలయదరంగ రిక్కలు
రాలఁగ నలుఁ జేగుదెంచె గ్రక్కున నటకున్
నాలుగు తెఱఁగుల దండులు
గ్రాలఁగ నెదలోన నాతిఁ గైకొనునిచ్చన్. 60

క. ఆరయఁగ నేలయంతయుఁ
గోరికతోఁ దిరిగి తిరిగి గొనకొని యచ్చో
నారదుఁడును నింకొకజడ
దారియు జేజేలయూరు దఱియఁగఁ జనుడున్. 61

క. కనుఁగొని యెంతయు నెదురుగఁ
జనికాళుల కెఱఁగి గద్దెఁ జయ్యన నిడి నే
లనుగల కత లెల్ల నడిగి
యునియెం జేజేలతేఁడు నాజోగులతోన్. 62

మ. అనిఁ గ్రొవ్విళ్ళిన రాచమొత్తులిట కయ్యాళ్య చాలనాళ్ళుల్ చనెం
జను దేరంగన నాఁటనుండియుననిం జాకుండిరేతెండ్లు చ
య్యన నాకంతయు నానతించనుచు నొయ్యన్ గట్లదాయందగం
గనిరాకన్నియసుద్దియెల్ల నెఱుఁగంగాఁజేసియాయ్యలున్. 63

గీ. తిరిగి యిట్టులనిరి తెఱఁగంటిదొరతోడఁ
దనదుకూఁతుఁ గోనఁగఁదగినతేఁడ్లఁ
గదలిరాగననిచెఁ గ్రథకైశికుఁడు నిన్నఁ
గోరుకొను నెలఁతయొకొరుని నెల్లి. 64

క. అందున నేలంగలదొర
లందఱులోఁ గలనుత్తొఱఁగి యాదటనటకుణ్
దండడి నేగిరి మొదలం
గ్రందుగ నాయంచయానఁ గైకొనునిచ్ఛన్. 65

క. చన్నులు కొండలసీయనుఁ
గన్నులు నెన్నంగ లేళ్ళఁగలకలనగు నా
కన్నియకున్నరి జేజే
యన్నులయందైనఁ గలరె యారసి చూడన్. 66

గీ. అనుచు జడదారు లెఱిఁగించునంతనచటి
గట్లసూడును లోనుగాఁగలుగునట్టి
దెసల యేలికలొకకొంద అసఁగుకోర్కె
తెదల నెంతయు నిగుర్తొత్తనింతిఁజూడ. 67

గీ. తేరులెక్కి తరలి తిన్నగాఁ నేలకు
నింగినుండి డిగ్గి నిక్కిచూచి
చుక్కతెగలలోన సొగసగు నెలలాగు
నలరుచున్నయట్టి వలునిఁగాంచి. 68

క. నీయానతిఁ గలుగుటచేఁ
జేయుదు నెద్దానినైనఁ జెప్పర జేజే
రాయఁడ నేనింక సరకు
సేయుదునే నింగియొఱగి సిగఁగూలినయేన్. 75

గీ. అనిన నట్టిదిట్ట యగాక్షి జేఁగియకాదె
యూరునిన్నాకనిననుగ నొల్లకిటకు
నిట్లు నిన్నుఁ గోర సింపఁజు జేజేలు
నరుగుదెంచియుంట యరసిచూడ. 76

గీ. సరగ నీయూరి రాకన్న సరసకరిగి
యచట నీనలుగురఁ గొనియాడి నేర్చి
నట్లు నోరోడకన్నయు ననఁగఁ దగిన
యట్లయాడి యొక్కనిఁ గోరునట్లు సేయు. 77

మ. అని జేజేదొరయన్న నన్నలుఁడు నాహా యింతజేజేలకుం
జనునే కాదన కేనెకోరికను చానంగూర్చి యేత్తెరఁ జ
క్కననన్నే చన నానతిచ్చుట యెదం గ్రాల్గంటినేఁ గోరియుం
టనునే నెట్లు చనంగ నేర్తునిఁకఁ గట్టా కల్ల కెట్లోర్చెదన్. 78

క. అనిజేజేరాయనిగనుఁ
గొనియెదయుఃరి యాడుచుండఁ గుందుచునయ్యా
ననుసేఁగోరిన చెలికడ
కనుచుటనీయట్టిదిట్ట కగు నేయనిన౯. 78

గీ. తొలుతఁ జేసెదననియాడి తుదకుఁ జేయ
నంచుఁగల్లలాడఁగ నానెయకటనీకు
తెస్సగాదె జేజేలకు తెస్పచేయు
టాడిప్రాఁటిన నేరికినానెలగ్గు. 80

గీ. కత్తులనుదూసి దండులుకలికినగరు
కాచికొనియుండఁ జొరనెట్లుకలుగుననక
కదియఁజనసాను నాయానకతననీకు
నడ్డుకొనలేరు నిన్నెరుఁనచట జేఁడ. 81

గీ. అనినఁదోఁచినయక్కల్ల నతఁడుఁగడఁగి
యెన్నియడిగిన నన్నిటికన్నియాడి
తనదుచదురెల్లఁ గానరాదగినకరణిఁ
దిరుగజేజేలరాయందు తెలియఁజేసె. 82

గీ. అంతనెమరాడజాలక యతఁడుకదలి
యచ్చటచ్చటి సొగసులనిచ్చఁగనుచు
దండులనుదాఁటి నట్టిళ్లుదఱియఁజొచ్చి
యింతియున్నట్టి నెలతాలయిల్లుచేరి. 83

సీ. అంచయెఱింగించి నంతటికన్నను
నెక్కుడుసొగసుననెసఁగుదానిఁ
చెఱఁగంటియన్నులఁ దెగడెడు చెలికత్తె
లొక్కటఁ జుట్టునునొసరుదాని
నెదలోననిచ్చలు నెంతయుఁగోర్కెతో
నలునింతయుడుగక తలంచుదాని
సిరిచెల్లకడఁజల్లు చిక్కనిచూడ్కుల
సొగసుగా నిటునటుఁజూచుదానిఁ
జెన్నుగులుకంగగద్దియనున్నదాని
హంయలుగాఁగుచ్చెలుల్కాళ్ళనొరయుదాని
నందియలుగజ్జెలును గ్రాలనలరుదాని
నచటఁగన్గొనెఁగనులార్చియంచరయాన 84

అట్లునాతిఁగన్న యంతటనాతండు
జిచ్చుఁజెందికోర్కె హెచ్చుఁజెంద
నొడలు తెలియలేక యొక్కింతతడిసోలి
యలరుఁగోలలకును గలుగుచుండ. 85

ఉ. అద్దిర యీఁతఁడీడఁ దనయూఱనితేజున నెల్లచోటులం
దద్దయుఁ గ్రాలఁజేసెకు నితండలచందుఁడొ యాతనల్లుఁడో
సుద్దులికేల యెల్లరును జూడుఁడు కన్నులనంచునానతో
గద్దియలొక్కటండిగిరి గ్రక్కననంప నెలంత నెచ్చెలుల్. 86

ఉ. కనియెనెలంతయున్నలునిఁ గంతునిఁగేరఁగఁజాలునట్టి చ
క్కనినెఱసీటుగాని నటుకాంచి యెదంగల నానయంతయుం
జననొనరించి కోర్కెలొదనందడిసేయఁగ నాస హెచ్చఁగాఁ
దనదుచెఱంగుదిద్దుచును దద్దయుఁదేనియలొల్క నిట్లనున్. 87

ఉ. ఎచ్చటనుండిరాకయొకొ యెట్టులుదండులఁ దాఁటఁగల్గెనో
యెచ్చటనున్కియో యిటకు నీకరణింజనుదేర నేలయో
హెచ్చినకోర్కినీదు తెఱఁగెల్లను దాఁచకయున్న యట్లుగా
నిచ్చట నానతీయఁదగు నించుకనాకయి సైఁచి క్రన్ననన్. 88

క. నిన్నుఁగనినంతనుండియు
నన్నెంతయు నేచెఁదోడఁగె నలనెలయల్లుం
డెన్నఁడు నినుఁగనియెఱుఁగను
జెన్నగునీ తెఱఁగెఱుంగఁజేయంగఁగదే. 89

చ. అనుటయు నీటిమేలికయు నగ్గియుఁ దెల్లనిహాత్తి నెక్కకా
తును నెఱదున్నయెక్కుడును దొయ్యలిరో యిటకేగుదెంచి యొ
య్యన నిముఁగ్గె కొనందలఁచి యయ్యది నీకెఱుఁగంగఁజేయ న
న్ననిచిరికానఁ గోరుకొను నాతిరొ నల్గురిలోన నొక్కనిన్. 90

క. దండులనెల్ల నగడచితి
నిండగు జేజేలయాన నేనిచ్చటికిఁ
దండిగ నేతెంచుటలా
నొండొకఁడింతయు నెఱుంగకుండఁగఁగలికీ. 91

గీ. అనినఁజాననీతెఱఁగేది యనుచునడుగ
నిచట నెద్దిరియెఱిఁగించితింతదనుక
నింకనైనను నీజాడయింతనాకుఁ
దెలియజేయంగఁదగునన్నఁగలికికతఁడు. 92

గీ. నెలఁతనేనునలుండను నేలతేఁడ
నెట్టులైనను జేజేలగట్టిగాను
నెడఁదఁగోరునట్లేను నిన్నడుగుకొనఁగ
నేగుదెంచినాఁడనునాతియట్లుచేయు. 93

క. నెనరున జేజేలఁగొనుట
నను నేలుటగానఁగల్గె నాయెడలంగ
ల్గినగాదిలితో నొక్కనిఁ
గనుఁగొన్ననుజాలు గట్టిగానలుగురిలోఁ. 94

గీ. చేడనాచేఁతలనురిత్త సేయనగునె
యనిననిగ్గునఁ దలకుంచి యంచచేత
నతనినెఱిఁగియున్నదికాన నలరియిచ్చ
నెట్టకేలకు నల్లననిట్లనియె. 95

సీ. జేజేలకునుజోత సేయంగఁదగుఁగాక
కోరంగఁజనునయ్య కొంకులేక
కోరనేర్చునె లేడి కొండంత యేనుఁగుఁ
జెల్లునే నాకు జేజేలఁగోరఁ

పగునయ్యాయి త్రిషి నగఁగోరదారలకు
జేజేలనుగోరఁ జెల్లునయ్యా
నీకై గదాయెల్ల నేలకేఁడ్లనిటకుఁ
జనుదేర నాతండ్రి చాటనిచె
నంచనీచేతఁ బెజీఁగించి నంతనుండి
చేరినాయెదనీయంద చిక్కుకొనియె
నిదిగొ చేతులుజోడింతు నెల్లనేఁట
నేలికొనునన్ను రాచ జేజేలఱేఁడ. 96

గీ. ఇందునాయానయొండాడ నింకఁదగదు
నీకునన్నుఁగైకొన నిచ్చలేకయున్న
నురినినీటఁజేఁదున నగ్నిఁజికియైనఁ
దొడరియెట్లును నునురులుతొఱఁగుదాన.

క. అనినంజిలుకలకొలికిఁ
దనయెడలం గలిగినట్టి తగునెనరునకుం
దనలోనలరియుఁగలికిం
గనికోరికలేని యట్టుగానిట్లనియెన్. 98

ఉ. అయ్యారెయొప్పెల యుబ్బెలుక యంతయుఁ దూలి కలంకఁ జెంద నా
యయ్యలకాలిగోరుఁ గయినంటను జాలనినన్నుఁ గోరఁగాఁ
దొయ్యలిచన్నెనీకు నెదఁదూలకయొక్కని నందుఁగోరు తే
నయ్యకు లచ్చికల్గినను నాతలకించుగ పోఁగనిచ్చునే. 99

గీ. చెలియజేజేలకునుగీడు సేయఁజనదు
చేసినునుగోర్కులెల్లను జెడునుగాన
నెనరుతోనందొకనిఁగోరుకొనుటలెస్స
సిరులనందెదు నానుడిచేసితేని. 100

సీ. అనిశనాతనిఁజూచి నెనరునఁగ్రాల్గంటి
కన్నుఁగొనలనీరు గడలుకొనఁగ
సద్దయునెదలోన నెద్దియుఁదోఁచక
యొకకొంత తడియట్టె యూరకుండి
యోజేఁచకంటి నేనొక్కటిచేయంగఁ
దగినట్టి తెఱఁగది తలఁచిచూడ
జేజేలులోనుగాఁ జేరినన్నుఁగొనంగఁ
జనుదెంచినందఱుఁ గనుచునుండ
నిన్నె కోరుదునట్లయిన నీకులెస్స
యగునని నెలంతయాడిన నతఁడుకదలి
కనియెఱింగించెనంతయుఁగడలదొరల
కోరిఁజెలియంతదొరగోరనున్నవాఁడు 101

క. నలుగురుజేజేలునొగి
నలుని తెఱఁగె సరిగఁదాల్చినగుచచటచటం
గలయఁగఁగూర్చుండిరియా
కలికినలునినెఱుఁగకుండఁగాఁచేయుటకున్. 102

చ. అలరులదండ చేతఁగొని యాయొలనాగయు నేగుదేరఁగా
నలుని తెఱంగుదాల్చి యటనల్గురురక్కసిసూండ్లు నుండ లోఁ
దలఁకక కేలుదోయి నెఱితగ్గక జోడుగఁజేర్చిజాణయై
యలత్రొలితీరులందఁ గొనియాడిన నట్లొనరించిరందఱున్. 103

గీ. అంతనాయింతిగ్రక్కున నలరుబొత్తు
కాచుకొనియెల్లరునుదన్నె చూచుచుండ
నలునికుత్తుకఁ దగిలించెనలరియంత
నేలజేజేలనొదలును నిండెదెసల. 104

క. అలరులు జేజేల్ కురిసెఁ
చెలఁగిరిమొదజన్నిగట్లుఁ జెచ్చెరసచ్ఛో
నొలసెను జల్లనిగాలియు
నలరారిరి తల్లిదండ్రులందలి చుట్టల్. 105

క. ఆరఁగ జేజేలందఱుఁ
గోరికలోకకొన్నిదొరకుఁ గూర్చిచదలునన్
దేరుల నెక్కిచనుచునడు
దారింగనుఁగొనిరి కలిని దద్దయుఁగలఁకన్. 106

చ. కనుఁగొని గట్లనూడతని గ్రక్కున నెచ్చటికింతతొందరం
జనియెదు నేఁడనంగఁగలి చయ్యననాతనిఁ జూచియెందు నీ
డనఁ జనరాని చెన్నుగల యాత్రకై శికు కన్నకూఁతుఁ గై
కొనఁజనుచుంటి నిన్నుఁగనుఁగొంటిని జేకుఱె నెల్లకోరికల్. 107

క. ఆనతియొనఁగందగునీ
లోననయానాతుక నోరులు గొనకయుండం
గానేగంజను ననుడున్
లోనగిజేజేలతేఁడు లోఁగకయునియెన్. 108

క. నలుఁడనియెడు నొడయుని నా
మెలనాగయెకోరుకొనియె నెల్లరుఁజూడం
దోలఁగితిరిగిచనఁదగునీ
యిలుసేరఁగ సరగననుఁడు నిట్లనెఁగినుకన్. 109

ఉ. చేరినలున్నలంత నెడచేసెదఁ గూల్చెదలచ్చియంతయున్
గోరినకోర్కులెల్లఁ జెడఁగొట్టెదఁ గానలఁ గుందఁజేసెదన్
సారెకు నేను గోరికొనుచానను జేకొనఁజెల్లునే యొకం
డారయనంచుఁ గట్టలుక నచ్చటికేగెఁ గడిందియానునన్. 110

గీ. అంతలోన నలుండునునింతిఁగొనుచుఁ
దగినచుట్టలఁదోడ్కొని తనదునగరు
కొన్నినాళులకెల్లరఁగూడిచొచ్చి
యెన్నరానితేజన నేలయేలుచుండె. 111

సీ. కలియునుజనుదెంచి కడఁకతోనలునకుఁ
గీడుసేయనదను గూడుకొలుచు
దద్దయురోయుచు నద్దియుఁగానక
యెదలోనఁగుందుచు నెడరుసేయఁ
దఱిగాకనిచ్చలుఁ దఱిఁజేరియాతండు
చేసెడునీగిని జేరకుండి
యొకనాఁడెఱుంగక యొడయండు నీరుతాఁ
కఁగఁగడకేగి తాఁగాళ్ళుకడుగ
నెఱుఁగకుండినతఱిఁజొచ్చి యిచ్చనలరి
యొక్కడాయుచక్కటికేగి యుక్క గలిగి
నలునిసిరియెల్లజూడాన నళుకుడక్కి
యొదుచుకొననీకుఁ దోడొదుఁ దడయకనుచు. 112

ఉ. తానొకజన్నిగట్టగుచు దారినిదోడయి యేగుదెంచి న
న్నానినగోర్కి నేలుదొరయక్కున నేఁడరుదెంచె నిన్నుఁజూ
దానఁగడంగిగెల్చి సిరితద్దయుఁగైగొన నంచునాడినన్
లోనరుదందియంతట నలుండుకలింగని యల్లనిట్లనున్. 113

క. జూదతికెగ్గగునై నం
గాదనఁదగునయ్యెనాకుఁ గడుకొనియాడం
గాఁదలఁచినన్నుఁగన్గొన
నీదార యిటకేగుదెంచి నిన్ననిచినచోఁ. 114

చ. అనుచుఁగడంగి పాడిపిరియంతయు నొష్టుచునోడివోడి యు
క్కునఁదననేలనుంబొరలఁ గొంకకమోదుచునుండె నంతయున్
జనదని చుట్టలుం బొరలుసంగడికాండ్రును గుయ్యిడంగఁ గై
కొనకతఁడక్కలింబెనకఁ గూడకయూరక కిన్కహెచ్చఁగన్. 115

గీ. ఇట్లుకొన్ని నెలలు హెచ్చుగనాడుచు
నున్నతజ్జనినేగి జన్నిగట్లు
చేరియతని నుక్కుగఁ జేయలేక చసరి
కలికడంగి రేచుఁకతనసంత. 116

ఉ. ఇంతియుదీనఁదగ్గయును నెగ్గునఁ గాంచుఁ దలంచితేని నో
క్కింతయునాఁచుదారి గనకెంతయు లోనగులోఁ దుచుండి తా
నంతటఁ దొల్లి నేలదొరయానతిఁ గైకొనియున్కినంచెలోఁ
గొంతచెలంగి కూఁతుఁగొనుకుం దగుతేరునఁ దంద్రియూరికిన్. 117

గీ. ఇట్లుక్రొల్గంటితేరునవింద్రసేనుఁ
డనుకొడుకు నింద్రసేననాఁజనెడుకూఁతు
నెయ్యురును జుట్టలును నానతియ్యసరగఁ
దండ్రికడకంచి లోలోనఁదలఁకుచుండె. 118

క. సారెలుదోర్లఁగనేయుచు
సారెకునలుఁడాడి నేలచొకగనోడెఁ
దీరునఁగై కొనకుండఁగ
నేరికినిందాతగీఁత యిందునునందున్. 119

గీ. అనిననంతయునాలించి యరుదుగాంచి
చెంతజడదారిఁ బిలకించిగొంతికొడుకు
నతఁడుజూదాన నోడినయంతనద్ది
జరగనెఱిఁగించు నెనరుంచి సరగననుడు 120

క. కానుననల్ల నితోలుం
జానగుజింకగలకేలుఁ జక్కనిహాలుం
గానవితలజాలున్ జిగు
లీనెఱతలకాయచాలు నెసఁగెడుదంటా. 121

మాలిని. తిగకొటికలదాయా తెల్లయేఱున్నరాయా
సెగకనుగలడంటా చేదుఁగొన్నట్టి జంటా
సొగసులతలకట్టా సూడులంగొట్టుదిట్టా
జిగియరచెలిఱేఁడా చిల్కరాకౌతు సూడా. 122

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర కందుకూరివంశపయః
పారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర
సుజనవిధేయ వీరేశలింగ నామధేయ ప్రణీతంబైన
శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన నైషధంబు
నందుఁ బ్రథమాశ్వాసము.



# ద్వితీయాశ్వాసము.

క. చుక్కలఁజేనిని దాలిచి
యెక్కుడుగన్నునను నగ్గియెగయఁగఁగోటికల్
చక్కడఁచి సిరులఁజెలఁగెడు
జక్కులరాయని యనుంగు సంగడికాఁడా. 1

గీ. అల్లజడదారి యాక్రీడియన్నతోడ
నిట్టులనెనట్టు దొరనేలయెల్లనోడి
కట్టుగుడ్డలతోలేచి కదలినంత
జరిగినదియెల్ల నెఱిఁగింతు జాలిగదుర. 2

ఉ. అంతనలుందునాగడియ నచ్చటనుండక యూరుదాఁటియొ
క్కంతయునల్కలేక నగరెల్లఁగనందిగ నాళులుండి యా
చెంతకునేరునుందఱియుఁ జేరకయుండుట చూచి కానకా
యింతిని దోడుకొంచుఁ జనియెంగల చుట్టలు గుంపుచుండఁగన్. 3

గీ. ఊరిదరికానవింతితో నుండియతఁడు
తాళఁగారాని యాకఁటఁ దలఁపుచుండి
కనుఁగొనెఁగడానిడాలు తెక్కలజెలంగు
తెక్కదారుల రెంటిని నొక్కచోట. 4

గీ. అట్లుగనియాతఁడెదలోన నాసఁజెంది
కలికి తననెలుకఁదొరంగికట్టుచీర
తెక్కదారులుతనచేతఁ జిక్కనుచు
నెగరవేసిన నదిగొంచునెగసెఁ జదల. 5

క. కోరిక వింగిబిజనుచుం
దారేసేలయును సిరియుఁ దరలనడచి యా
తీరునవిటకేతెంచిన
సారెలగుట తెలియఁజేసి చయ్యనసరిగెన్. 6

చ. ఇటుతనచీరయెత్తుకొని యేగనలుండును లోఁదలంకియం
తటనెదలోనఁ దేఱి చెలిదాల్చినచీరచెఱంగుతానునుం
దటుకుననట్టె చుట్టుకొని తద్దయుఁగుందుచు నుండికొంతచెం
గట నలుతెన్నులున్నఁగని కల్కిరొ చూచితె యంచునిట్లనున్. 7

క. అరుగుగుదెదారిదెసకిది
యరుగున్నీతండ్రి యూరికల్లదికలికీ
యరుగునదియునుజ్జయనికి
నరుగంగోసలకు నద్దియన్నిటిలోనన్. 8

ఉ. ఎద్దియొ తెన్ను నాకుఁ జనసత్తఱిఁ జానలుకారుకానలం
దద్దయుసంగడల్ గుడిచి తాళఁగఁ జాలరుకాననింటిలో
నొద్దికఁజుట్టలంగలసియుండుట లెస్సగఁదోఁచె నాకునేఁ
డెద్దియునడ్డుగానకటయేఁగఁదగుం దలిదండ్రులొద్దకున్. 9

మ. అనినంగన్నుల నీరుగాఱఁజెలియొయ్యన్ దేనికై చూచియ
ల్లనఁదానిట్లనుఁ గాననీకరణి నేలాకందఁగాఁగోరికల్
దనరన్నాదగుతండ్రి సంతసిల నాతండేలు నన్నేలకుం
జనియందుండఁగఁ జెల్లదేకలిసియిచ్చన్నీకునున్నాకునున్. 10

సీ. అనిననలుండును నాదలయొక్కింత
యొరగించియించుక యూరకుండి
నీయాడినట్టుల నీదినాదియుఁగాదె
నీతండ్రియేలెడు నేలయెల్ల
నేఁదొల్లిసిరులచే నెసఁగుచునటకేఁగి
యీలాగునేలాగు నేగనేర్తు
నేలయులచ్చియు నెఱిఁదూలియటఁజేర
నాతిరోననుఁజూచి నగరెయొర్జులు

ఉసురులైనను దొఱఁగంగనోర్తుఁగాని
యిట్టిపడినొందఁగలనైన నింతిచాలఁ
గానని దితక్క నొక్కటికలిగెనేని
చేయఁదగునన్న నతనితోఁ జెడెయనియె. 11

గీ. ఎన్నికడగండ్లుతొడఁగియు నెల్లరకును
నన్నుఁటెనిదోలికాచెడి దాలుగాడె
యాలుతోఁగూడియుండెను నాతఁడెన్ని
యిక్కటుల్ గుడిచియును దానెఱుఁగకుండు. 12

క. అలయునెడల దగయునునాఁ
కలియునునగుతటిని నాలుగాదేనేగుల్
తొలఁచునుదననెయ్యునికిం
గలఁగుచునిక్కరణి జాలిఁగైకొననేలా. 13

గీ. ఎట్టులైనను నన్నునెచటికేగఁ
దలఁచితటకును నీతోడఁ దనరఁగొంచు
నేగఁదగుఁగాక నన్నొంటి నిచటడించి
యఱుకఁదలఁచిన నుసులు తొఱఁగుదాన. 14

చ. అనిననలుండు చానఁగనియల్లన నిట్లనునొంటినిన్నుఁగా
ననునెనరేదిడించి మెలనాగరొ యేగుదునేకడిందికిం
డెనయఁగనీవ నిన్నునిచి యేఁగఁ దలంచినఁ దొల్లి నిన్నుఁ నేఁ
గొనిచనుదెంతునేయుటకుఁ గుందకు నీమొదనించుకేనియున్. 15

క. అనియూరార్పుచునొక్కటఁ
జనియాతఁడుకానను నడుచక్కనినొకచోఁ
దనరెడిలోఁగిలి యొక్కటి
కనుఁగొనిచేరంగఁజనియెఁ గలికియుఁదానున్. 16

గీ. చేరఁజనియందు నిద్దురఁజెందఁదలఁచి
కటికినేలను నొడలల్లఁగదియఁజేర్చి
కన్నుదోయికినిద్దురసున్నయైన
లేచినలుకెలంకులు నట్టెచూచియంత. 17

క. కాలిదరినిదురఁ జెందిన
యాలింగనికన్నుఁగొనల నటసీరొలుకన్.
జాలిఁ దలంకుచుఁ దనలో
జాలిగొనియతండు సారెసారెకుననియెన్. 18

ఉ. ఓడితినేలయంతయును నోడితిలచ్చిని నీడులొందితిం
జేడెలుకాళులొత్తఁగను జెన్నగుజెందలి రాకుసెజ్జనీ
చేడియయుండఁదొల్లికని చిక్కనినల్లనిజాలనుండఁగాఁ
జూడఁగఁ జాలనొండెడకు స్రుక్కకయేగద నింకఁ జెచ్చెరన్. 19

గీ. నన్నుఁగైకొనికాదె యిన్నాతియిట్టి
యొడరులకు నెల్లలోనయ్యెనింక నిచట
దీసిదిగ నాడి యెండేని నేనుఁజనినఁ
దనదుచుట్టాలకడఁజేరి తనరుచుండు. 20

గీ. అనుచుఁజెలి చీర నడుచక్కి కల్లజించి
కట్టుకొని లేచిచయ్యనఁ గదలికొంత
దారినడయాడి చెలిడించితరల లేక
తిరిగియరుదెంచి యొద్దియుఁ దెలియలేక. 21

ఉ. అయ్యొలనాగడించిచన నక్కలిరేచఁగ లేచులేచి యా
తొయ్యలినొంటిఁజేసి చనఁదోచక క్రన్ననఁగూరుచుండుఁ దా
నయ్యొలతీరుగా నెడఁదయాఁగఁగ నాఁగకయెట్టికేలకుం
జయ్యనఁగానడించిచనెఁ జానను లోనరేది యొక్కతెన్. 22

సీ. ఇట్టులతఁడేగఁ గ్రాల్గంటి గట్టినిదుర
తెలిసి లేచి నలుఁగడలుకలయఁజూచి
తేనిఁగానంగ నేరక లోనఁగలఁగి
చించియుండినతనచీర చెఱఁగుఁజూచి. 23

క. గుండెను ఱాయిడినట్లయి
దండనునున్నట్టి చెట్లతట్టునఁబాలం
గొండలనారసికనకా
యండను వెలుఁగెత్తి యిట్టులడలం దొడఁగెన్. 24

సీ. ఱేఁడతగునయ్యా తొల్లి నాతోడనోడ
కనుచునటులాడి నెనకేది యక్కటకట
కల్లలాడంగ నేనొంటిఁ గానలోన
నెట్టులుండుదు నిన్ను నేనెచటఁ గందు. 25

గీ. ఉసుఱులాడిన నిక్కటులొందుచున్నఁ
జుట్టెల్లను నొక్కటగిట్టుచున్న
దోసఁగులడరిన నాఁకటఁదూగుచున్నఁ
గల్లలాడక యుండుటగాదె లెస్స. 26

క. అలయుచుఁ గాకులకూఁతల
కులుకుచుఁ గడునెండ సెగల నుడుకుచుఁ బాలం
దలఁకుచుఁ జెట్టులనీడల
నిలుచుచు వెలుఁగులకదరుచు నెలఁతుక యడలెన్. 27

క. ఇట్టులు తూలుచుఁ ద్రెళ్లుచు
నట్టనలేచుచునుగాన నెఱఁదిరుగంగాఁ
గట్టలుకతోడఁ ద్రాఁచుల
దిట్టయొకఁడు నెలఁత కాలుదిగ్గనఁ గఱచెన్. 28

క. కాలూడఁదీసికొనఁగాఁ
జాలకయుఁక నైన నిచటఁ జయ్యనదీనిం
గూలిచి రోజొడయఁడ నను
నేలఁగదయ్యాయని కలికిచేష్టనుండెన్. 29

క. అక్కరణిం గుయ్యిడ నెఱు
గొక్కండాలించి దానినక్కనురియాం
జక్కఁజికాయలనొసఁగి
యక్కలికిని సేదదేర్చి యంతటననియెన్. 30

క. ఏటికి నొంటిఁగ నేఁడీ
కాటికి నరుదెంచితిచటఁ గడునడలంగా
నేటికి నీ తెఱఁగెల్లను
జోటిరో యెఱుఁగంగఁజేయు సూటిగ నాకున్. 31

గీ. అనిననల్లుత్తోడఁగానల కరుగుదెంచి
కొండ లెఱుంగక నిదురించి యుండుటయును
నచట దనుడించి యేలిక యరుగుటయును
నిచటరోయుచుంటయు నింతియెఱుఁగఁజేయ. 32

క. నెలయుల్లుఁడు కడుఁగ్రొన్నన
చిలుకు తెదంగాఁడ నేసి చిక్కించినలోఁ
గలఁగక తనకోరిక యా
కలికికి నెఱిఁగించె నెఱుకుకట్టెఁడియగుచున్. 33

గీ. కనలయందుక కయ్యెంతికన్నుఁగొనల
నగ్గియురులంగఁ జూచిన యంతలోనఁ
గూలెనాతండు నీఱయి నేలనార
తలఁచిచూడ నరిదియె క్రొత్తడుల తెఱఁగు. 34

చ. ఎలుఁగులు జేఁచుతేనుఁగులు సింగములుం గోఁతులుఁ గారుమన్నులున్
సలుగులు నక్కలుం గిటిసి సారెకు డాయఁగరాని కానలోఁ
గలయఁగ నెల్లెడం దిరిగి గాసిలి సొమ్మసిలుచు డస్సి నేఁ డిప్పుడుం
దలఁకుచు జేనిఁ జీరుచును దాళఁగలేక నెలంతయుట్టినన్. 35

సీ. కానరే యోరులు జేని నెచ్చటనైన
నంచలార కడింది క్రౌంచలార
కనుఁగొనరే యోరు కానలో నోడయని
జింకలార యులరుడొంకలార
చూడరే యోరులు సొగసుకానిని నెందుఁ
గోలఁకులార తుటారివిలుకలార
తిలకించరే యోరు నలుని నెందునుఁ జెంచు
చేడెలార చిఱుతయాఁడెలార
తిన్నెలార యోగేదఁగిగున్నలార
తేఁటులార యోజడదారిజోటులార
పొత్తులార యో క్రొన్ననగుత్తులార
చెట్టులార యోచదలంటుగట్టులార. 36

గీ. అనుచుఁ జెట్టుచెట్టు కరుగునరిగియొండ
నడుగుదోయికాల నడలునడలి
నీడనీడనిలుచు నిలిచినూతులుగాంచి
త్రొంగిత్రొంగిచూచుఁ దొడరినాతి. 37

గీ. ఇట్టులెచ్చటనలుఁ గాన కింతియొంటిఁ
గానవరుగుచునొక మేటి కడనుగాంచె
గాలినీరునాకులుఁదిండిగాఁగఁగొనుచు
నుండుకొండదబుజడదారులుండుచోటు. 38

గీ. కాంచి సంతసించి గ్రక్కునఁ గదియంగ
నేగి జోతచేసి యిట్టులనియెఁ
గనులనిండఁ దఱి నిటుఁగంటి నోజడదారు
లార నేను నలుని యాలి నతఁడు. 39

క. నన్నొడసి చనిన నాతనిఁ
గన్నారంగాన లేక కలఁగుచు నిటకుఁ
గన్నారో యని యడుగఁగ
నెన్నుచు నేతెంచి తతని నెచ్చట నైనన్. 40

గీ. కనిన నెఱుఁగంగఁ జేయుఁడింక నునతండు
కానరాకున్నఁ గొన్నాళ్ళలోన నొడల
నుసురు లెడలింతు ననియేడ్చుచున్నఁ గనిక
రించి దాని కాజడదారు లిట్టులనిరి. 41

క. తలఁకకు నీ యేలికసలుఁ
గలసెదు గొన్నాళ్ళలోన గలికిరో యాతం
డలరుచుఁ దొల్లిఁటి యట్టుల
కలనేలయు నేలు నిన్నుఁ గలసి నెలంతా. 42

చ. అని జడదారు లాడుచుచె యుండఁగ నాఁగ రాక యేగఁగాఁ
గనుఁగొని కల్లయో కలయొ కాకని లోఁదలంచుచే గిచ
య్యనవము కానదారిఁ జనునట్టిరిఁ గొండతెఁ గాంచి నేనుగ్ర
క్కున నగరొండుచేరెదను గోరిక నీజతత్రోడనొక్కటన్. 43

చ. అనుచుఁ దలంచుచున్న తఱి నందలి యయ్యలు కాంచి రెంతయుం
దనరుచు తేని లోఁదలఁచు దానిని గూడును నీరు లేక కా
ననుఁ దొరఁగానకూరక యె నల్గడ లారయుచున్న దానిఁ దాఁ
జినిఁగిన గుడ్డ కట్టుకొని చీటికి నేడ్చెడు దానిఁ జేడియన్. 44

క. కనుఁగొని కావలఁ గొంక
లెనయుటకుంగాయగసురు లేఱుఁగొనితగం
డనియెడి జడదారికలికి
యనుచుఁదలఁచికొక్క కొందఱందఱదిట్టల్. 45

ఉ. కొందఱుగాలిఁగాఁదలఁచి కుందిరి నక్కిరిచెట్టుచెట్టునం
గొందఱు తద్దయున్నగిరి కొందఱుకేకనగొట్టి కొక్కటం
గొందఱు రోసెదెద్దయని కొందఱుచేరిరి చెంతకొయ్యనం
గొందఱు కన్నతల్లియని కూడి జోహారులొనర్చిరింతికిన్. 46

గీ. అట్టియెడనాతికదియంగ నరుగుదెంచి
యన్నలార నన్నిటుచూచియళుకనేల
నిలిచిచూడుఁడు రాచకన్నియనుగాని
నేనుజడియంగ గాలినిగానుజుండు. 47

క. పనలునాలిని నతనిం
గానకనీతీరుగాఁగఁ గడు నలసటతో
నేనడయాడెద నిచ్చటఁ
గానరెయొండైన నలునిఁగానలలోనన్. 48

క. అనియడిగిననాసాతున
కునువారయ్యెనట్టి శుచియు గునగునఁదఱియం
జనుదెంచి కాంచియిట్లని
యె నెలఁతతోఁ గన్నుఁగొనల నించుకనగుచున్. 49

క. నలుఁగననెచ్చటనిందుల
నెలుఁగులమున్నల నలుగులనేనుఁగులను ని
చ్చలుఁగనుఁగొందునుదూఱదు
చెలియరొయొండయునునిందుఁజెట్లతఱచునన్. 50

క. ఈసాతునాకుఁదోఁడుగ
నేనేగియులేకయుందు నెలనాగరో నే
గాసిలకరిగెదఁ ద్రాచుల
కోసరిలుచునేఁడు నైద్యునారికిసరగన్. 51

సీ. వాఁడోఁడనచ్చుటకేతెంచెదేనియు
నేనిన్నుఁదోడ్కొని యేగుదు నన
నింతియాకొనెనంత నెంతయునెనరునఁ
దోడిసెట్టులతోడ జేడెఁగొనుచు
నేగుచు నాయయ్యలెండనుగడుడస్సి
యొకచోటఁగూర్చుండి యున్నతఱిని
జీఁకటికదిసినఁ జెంగటికొల నల్లఁ
జేరి యోర నిదురఁ గూరియుండ
నచటికొక్కటనడగొండలట్లతనరు
కొన్ని యేనుఁగుల్ దగఁదీఱ్చుకొనఁదలంచి
యరుగుదెంచెనునడిరేయియళుకులేక
సాతునిదురించుకడఁజెట్లు చదిసికూల. 52

గీ. కటికిచీఁకటిలోఁ చెన్నుగానలేక
చచ్చిరరుగంగ నేరకచదిసికొంద
ఱొడలెఱుంగక నిదురించుచున్నకతన
గొందఱడఁగిరెఱుంగకకొలనుదరని. 53

ఉ. కొందఱు కాలిత్రొక్కుడులఁ గొందఱుకోఱలొడళ్ళుగాఁడుటన్
గొందఱుచేతియేటులనుగూలినఁదొయ్యలి చూచియక్కటా
యిందఱుకాన నేఁడునుఱులిట్లు తొఱంగిరి కీడులంగడుం
గుందుచునుండు నేఁజదిసికూలక యుండితి నద్దినేయుదుర్. 54

క. ఈపాతుపై ద్యునూరికిఁ
దీసుకపోఁ గాను నన్ను దిన్నఁగ ననువో
నీసునవందఱఁ గూలిచి
గాసిలఁ గాఁజేసెఁ దాత కడుకట్టఁడియై. 55

క. లోఁగడ జేజేలను నే
డాఁగనగుచు నొల్లకునికి ఆట్టడిసేయన్
సేగులొనర్చికినుక నీ
లాగున నన్నింటి నిటఁ గలంచిరొ జేజేల్. 56

క. అనిపాత్రొక్కటఁ గెడయుట
కునుగన్నులనీరునించుఁ గోరికఁ ద్రెంచున్
దనయెదలో నలునుంచున్
గనలునఁ దిలకించు నాల్గుకడలునుగాంచున్. 57

క. అడలుచుఁ దక్కినరాతిరి
కడచి తొగలదాయ కానఁగా నైనయెడన్
దడయకచని తొయ్యలి య
య్యెడఁ జైద్యునియూరుసొచ్చి నల్లరుఁ జూడన్ 58

శా. ఆయూరేలెడు తేనితల్లి నలునొయ్యారిందగంగాంచినే
నీయింతిం గనుఁగొన్ననుండియెదలో హెచ్చెంగడున్ వాళి దా
దీ యంచొక్కతెఁ జేరఁజీరి యదిగో నీదారిసింగారి యో
త్రాయోరం జనుదెంచుచున్నయది యొయ్యంజేరి యక్కన్నియన్.

క. కొనినాకడ కొకయించుక
యునునెడసేయక యిచటనె యున్నట్లేతెం
చునదియని యానతిచ్చినఁ
జనిదాదియు నట్లచేసెఁ జయ్యనవాకన్. 60

గీ. ఇట్లుతోడ్తెచ్చి చెలినాకెయెదురనిడిన
దానిసొగసున కొక్కింత తల గదల్చి
యల్లనల్లన నిట్లనియానతిచ్చె
దనరిమెదలోనఁ గోర్కులు కొనలుసాగ. 61

చ. చిఱిఁగినచీరఁగట్టుకొని చెక్కులుకన్నుల కాటుకంటిడాల్
తఱిఁగిచెడంగ నెండ కడుఁదాఁకి యొడల్ కసుగంద నొంటిఁ జి
న్నఱిచెరలాడనేల నినునాదట నేలెడునాతఁడేఁడు నీ
తెఱఁగుఁగొఱంత యుంచకిఁకఁ దేటగనంతయు నానతీఁదగున్. 62

క. అని కడునెనరొలయంగా
ననిననెలంతంగని నలునాలునుజాలిం
గొననికఱకుగుండెయతఁడుఁ
గనిఁ గనికరించునట్లుగా నిట్లనియెన్. 63

క. నేనొకరొడయనియాలను
దానొకఁడొకఁడేగుదెంచి తక్కినతేఁడుల్
కానుకలిచ్చినఁ గైకొను
చేనునునాతండు నేలయేలుచునుండన్. 64

క. కల్లరిదాయరొకఁడతనిఁ
దల్లిరొజూదాన నోడిచి తగుసిరియెల్లన్
గొల్లఁగొననతఁడు నేనును
నిల్లునుగొడుకులనుడించి యెల్లరుఁజూడన్. 65

ఉ. కానలకేగి యాకులును గాయలుగడ్డలు నారగించి క్రొం
దేనెలె కొన్నినాళ్ళచటఁ దిండిగనుండఁగ నంతనంచత్రే
జీనెఱిరొతు కిన్కనెడచేసెను తేనిని నన్నుఁగూళయై
యేనిటకేగుదెంచి తెటకేగనొ తేఁడెఱుఁగన్నెలంతుకా. 66

గీ. కానననుడించి యతఁడొందుకడపునేగ
నతనిఁగానక యడలుచు నరసికొనుచు
గడ్డలాకులుఁ గుడుచుచుఁ గానలోనఁ
జీకటిగదుర నిక్కురింతుఁ జెట్లక్రింద. 67

గీ. ఇట్టులాతనిఁగానలో నెల్లయెడల
నరసికానక కట్టెఁడినగుచుఁదల్లి
యిచటికే తెంచితి నటంచు నెఱుఁగనాడి
యేడ్చెనెలుఁగెత్తి కోయిలలేగుదేర. 68

క. అనికన్నీరొలుకఁగఁ నే
డ్చినఁగని యాజేనితల్లి చెలిజేరంగాఁ
జనియోదార్చుచుఁ దాని
ట్లనియె నెదందిగులు కొంతయడఁగఁగనోయ్యన్ 69

క. నాకడనిటనుండందగు
నీ కొకకొఱఁతయును లేదు నీకేకీడున్
లేకుండఁగఁదగఁగాచెద
నాకూఁతులతోడసరిగ నరసెదనిన్నున్ 70

క. నీయేలిక నెల్లెడలను
రోయుననుతుజన్నిగట్ల స్రుక్కుకులోనన్
నీయిచ్ఛయయినతీరున
నాయొద్దనె నిలిచియుండు నాతుకయనినన్. 71

గీ. త్రాంటికంటె నెనరు తోఁచునట్లుగఁజూడ్కి
జేనితల్లియుండె యానఁజేసి
హాళియుళుకుఁగదుర నన్నెలంతుకయట్టె
యొలుఁగుసన్నగించి యిట్టులనియె. 72

గీ. తల్లినీయొద్ద నన్నుంచఁ దలఁచితేని
కడఁగినా నేర్చునట్లు రాకన్నియలకు
ననలుగై సేయు నింతినై నగళులందు
నుండుదాననొండైన సేయఁగనిచట. 73

క. ఒడయనికోయంగాఁ జనఁ
దొడఁగిన యాజన్నిగల్లతోఁ దక్కఁగనీ
యడుగాన లాఁతులంగని
నుడియొక్కటియైన నాడనొల్లనుదల్లీ. 74

గీ. కాళ్ళగడుగ నెంగిలియంటఁగాదు నాకు
నట్టులైనను నీయొద్ద గుట్టుచెడక
యుందుననినసీకొని తనయొద్దికూఁతు
రగునునందచెంగటనుండనానతిచ్చె. 75

క. నిచ్చలునలునెదఁ దలఁచుచు
నిచ్చటనెలనాఁగయుండ నెడసిచని నలుఁ
డచ్చటఁగానలఁ దిరుగుచుఁ
జెచ్చెరఁదిలకించె నొక్కచెంతనుగానన్. 76

మత్తకోకిల. కొండదాఁకుచుఁ జెట్లఁగాల్చుచుఁ గూడితద్దయుఁగారుచి
చ్చెండగాయుచు నుండఁగాఁగను హెచ్చిచుట్టుకొనంగలో
నుండునాగులఱేఁడొకండిదె యోనలుండ యొకింతనే
గండడంగకయుండ గ్రక్కునఁ గాచిసోలఁగదేయనన్. 77

చ. ఒనరఁగనాలకించి యతఁడొయ్యన డాయఁగ నేగి యందులోఁ
గనుఁగొనెఁజుట్టుచుట్టుకొని కన్నులనీరొలుకంగ నేడ్చుచున్
నెనరునఁజిచ్చులోనడఁగి నీల్గకయుండఁగ నన్నుఁదీయ గ్ర
క్కుననిటురాఁగదయ్య యనిఘుయ్యిడు త్రాఁచులతేసి నొక్కనిన్. 78

గీ. అతఁడును నలునకు శ్రోహరోనర్ప్రియనియె
నేనొక జడదారి కెగ్గుచేసి
కదలనేరకుంటిఁ గర్కోటకుండండ్రు
నన్ను నగ్గదిసె నాల్గుదెసల. 79

క. ఇందుండి కెడయజాలను
సందిట నన్నెత్తికొనుచు సాఁగిచనికొలం
కెందున్న నచటనూఱట
చెందఁగ నన్నుంచ లగ్గు సేయుదునీకున్. 80

గీ. అనిననింతంతయనరాని నెనరుతోడఁ
దన్నుఁగొని యేగఁగనొకలతందుకుంచి
చులకనై యుండఁ దఱిఁజేరి యళుకులేక
యెత్తుకొనికారుకానలోసేగి వేఁగి. 81

సీ. కొంతకుఱుంగటఁ గొలఁకొండుగనిదాని
గట్టునడించంగఁ గడఁగఁజూచి
యింతతొందరయేల యింకనన్నోజేఁడ
యారైదడుగులు గొంచేగియచట
డించిననీకుఁగడించెదలగ్గొనరింతు
ననుచునడుగులెన్ని కొనుచునరుగఁ
గర్కోటకుఁడు జేనిఁ గఱచియిట్లనెనన్ను
నిన్నెనుగఱుచుట యెన్నరాని
కీడుగఁదలంచి యెదలోననోడకింకఁ
దొంటిసిరిచెడికాన నిట్లుంటనిన్ను
నొరులెఱింగిన నగ్గునోయటంచు
నీసొగసుదూలఁగఱచితి నీసులేక. 82

క. నాకోటలచేఁ దెన్నా
ళ్ళీకానిసిరియొడలనుండు నిఁకనన్నాళ్ళున్
నీకేళకఁ జేచేఁదును
దాఁకమునినుఁ జెనకలేరు దాయలునింకన్ 83

గీ. కొన్నినాళ్ళకుఁదొల్లింటిచెన్నుగలిగి
యాలుత్రోఁగూడుకొనిసిరుల్ చాలఁగుడుతు
తొంటిసొగసూని తిరుగనీకుంటయిచ్చ
నైనసన్నుఁదలఁచునదియంతలోన. 84

గీ. చీరయొకటినిన్నుఁ జెచ్చెరఁజేరును
దానిఁగట్టఁజక్కనౌనునోడలు
తగునయోధ్య యనఁగఁ దనరునూరొక్కటి
యొంచిచూడ నెందు నీడు లేక. 85

*క. తగునైదైదులరెండయి
సొగసగు తెనుఁగచ్చరాన నూటియెసంగన్
దగియెడుతుర్ణులనందు గ
లిగిన ఋతుర్ణుఁడను తేఁడు లెస్సగనచటన్. 86

గీ. అతనిఁగొలిచియుండి యతనికిగుఱ్ఱాల
దోలుజాడయెల్లఁ దొలుతనొసఁగఁ
జెట్లమూకలలరుఁ జేరకలెక్కించు
తెలుఁగునీకతండు తెలియఁజేయు. 87

*క. ఓయవనోదయండొక్కఁడు । నేయెడలమదనకులాఁతియేలికలేరున్
రోయఁగపరిదాతుండఁగ । వాయూరేలు ఋతుపర్ణుఁడనఁగమనచటన్.

*గీ. నాలుగాములవాలుగై క్రాలుచుండ
యానుగలయచ్చతెలుఁగచ్చరానఁ బోలుత
నలరియుండెనవాహుకుఁడనసతనియొద్ద
నుండునదియనియానతియొసఁగిచవిన. 88

చ. నలుఁడునయోధ్యకేగియట నల్గడలుం బలకించియొక్కచోఁ
దళతళలాడురాచయిలు దగ్గఱఁగన్గొని చొచ్చి జేనితోఁ
గలయుది యంతయుం దెలియఁగా నెఱిఁగించి కలంకఁదేఱి జ
క్కులనడంగోలిఁదిద్దఁగను గూరలుఁగూడును జక్కఁజేయఁగాన్. 89

క. తానేర్చు పెల్ల నెఱుఁగం
గానాడి నిపుఁగడునచ్చికం గొలుచుటకై
నేనరుదెంచితి ననుడున్
లోనంగడుసంతసిల్లి లోఁగకదారయున్. 90

క. నాయొద్దనుండఁగాఁదను । నీయిచ్చకుఁదగినయట్లు నెఱగుఱ్ఱాలం
జేయిడి నెనరునఁజక్కం । జేయుచు నీకోర్కులెల్లఁ జేకుఱునిచ్చల్. 91

మ. అనఁ నం గూరలుఁగాయలెల్లరుచులో నానానఁ జేయుచా
తనిచెంతంగలయట్టి త్రుళ్ళుగల యందారైన తేజీలఁ జ
క్కనఁగా దిద్దుచు తనియొద్దఁ దనరంగానుండిలోనొక్కనాఁ
డనఁగుందొయ్యలిఁగావడిం ది యిటుతానంతుండియే తెంచుటల్. 92

క. తలఁచుకొనిచాలఁ దలఁకుచుఁ
గలఁగుండై కుడిదరఁ గనుదోయి న్నీ
రొలుకఁగఁ దుడిచికొనుచున
య్యొలనాఁగం గూర్చియిట్లు తెలుఁగైత్తియనెన్. 93

---

*గీ. తేరిగుఱ్ఱాల నడకలఁదిద్దుచుండుఁ । జక్కఁగాఁగూడ నొవ్వుచు పాటిలేక
యలరుచునుబాహుకుండనసతనియొద్ద । నుండునదియనియానతియొసఁగిచవిన.

శా. ఎచ్చోట న్ననుఁగాన కారయుచు నేనేతేరఁగాఁ గానలో
నచ్చోనొంటిఁగనుండి యొంతలుకుత్రో నానాఁడెవంగుందితో
నిచ్చ ల్నన్నుఁదలంచి కానలఁగడుఁనీకాకుతోనుండితో
హెచ్చారాయిడి నొందఁజాల కకటా యెందైననందీల్గితో. 94

క. తలిదండ్రులఁజేరితో లే
కెలనాగరో కానలేక యెందైనం జి
క్కులుగుడుచుచుంటొయెట్లీ
యలజడినేనీఁగగందు నక్కట నెలఁతా. 95

గీ. ఇరులఁగనుఁగొన్న నీసోగకురులతీరుఁ
దొగలఁజూచిన నీకనుదోయిడాలు
నింగిఁగాంచిన నీకొనునిండుహొయలు
నెదకుఁదోఁచెడు నింక నేనెట్టులోర్తు. 96

చ. అనుచుఁ దలంచు చున్నతఱి నందలి లెంకయొకండు కొంత చెం
తనిలిచియాలకించి నలుఁదారసిలం జనుదెంచి చూచి యీ
చినిఁగినగుడ్డలుం గుఱుచచేతులు గూనును సొట్ట కాళ్లుఁ గ
ల్గినయితనాలు నీతనిని గెల్చినచక్కన దంచుఁ దద్దయున్. 97

గీ. గేలిసేయుచు నగుచుఁ జాల్చాలునితనిఁ
గనులనేరైన నొకసారి కనిరయేని
రేయికలలోన నేతెంచు నీయనసాగ
నట్టులయ్యునునింతికై యడలఁదొడఁగె. 98

సీ. అనియెదననుకొని యరిదెంచియాతనిఁ
గనుఁగొనియిట్లనె నెనరుతోడ
నీతలంచినయట్టి నెలతకునీకును
నెడయాట కటకటా యేలకలిగె.

నన సిగ్గుపాలఁగాఁజ నాలోనఁ గొండొక
క్రొత్తయాశత యల్లుకొనికడంగి
నాతుక నాకేల నాతుకకేసల
నన్నుఁగన్గొనిచెవి నగరె చెలులు
తొల్లి యొకలెంక తనయింతిఁబోలఁగియుండి
తల్లడిల్లిన తెఱఁగేనుదలఁచుకొంటి
నంతనేఁగాక చేసేదయింతియొక
యనుచుఁదనగుట్టులోలోన నడఁచెనతఁడు. 99

క. అక్కరణి న్నలుఁడుండఁగ
నిక్కడ నల్లుఁడునుగూఁతు రెండులఁ జనిరో
యక్కటయనియెడఁ దలకుఁచు
గ్రక్కునఁగ్రక్కై శికుంచు కదునెనపడరన్. 100

గీ. సరగనిద్దఱరోయుంగ జన్నిగట్ల
నద్దెశలకంచెఁ దెచ్చిన నగలునూళ్ళ;
గొల్లగానొసంగుడు నంచు నెల్లరకును
దెలియఁగాఁజేసి యాసలు చెలఁగఁజేసి. 101

క. నేలంగల యూళ్ళన్నియుఁ
జాలంగా రోసియొందుఁ జాననుసలునిం
గాలించికొందఱు కనం
జాలక యరుదెంచి రిండ్ల చక్కికిఁదిరుగన్. 102

క. తక్కటికొందఱు నలుఁజెలి
నెక్కడనుంగానకూర కిండ్లకురా లో
నొక్కింతయునొల్లక కడు
నక్కఱతోఁ దిరుగుచుండి రందందుఁదగన్. 103

ఉ. అంచొకజన్నెగట్టరిగి యల్లననాతుక యున్నయూరికిం
గొందఱతోడఁగూడిచని కొల్లగ నీగియొసంగురాచయిల్
సందడిఁగోనఁ జొచ్చి యొకచక్కనిగాంచె సునందలోనుగా
నందులనున్న రాచయెలనాగలలోన నొయారి నచ్చటన్. 104

గీ. సీఱుగదిసియున్న నెఱచిచ్చునచ్చున
గూటనున్న చిలుక జోటిసాటిఁ
జెన్నుదఱిగియున్న యన్నుఁగనుంగొని
తొలుతఁగలతెఱంగు తెలియలేక. 105

చ. నుదటనుగాననయ్యును గనుంగొనఁగూడని నల్లచుక్క యొం
డెదుటను జూచిసంతసిలి యింతిని నన్నులుక్రాలుగంటిఁగా
నెదను నెఱింగి యీకరణి నింకినయేటితెఱంగునం గడుం
జెదరినచెన్నునందనరెఁ జేడె నలుండెడయైననంచలోఁ. 106

క. కడునశలుచుఁ జేరంజని
జడిగొని కన్గొనలనీరు జాఱఁగఁదల్లీ
కడఁకన్నిన్నరయఁగ ని
య్యెడనేనరుదెంచినాఁడ నెక్కటినిటకున్. 107

క. నీతల్లియు నైదోడులు
నీతండ్రియుఁ గుఱ్ఱలచట నెఱ్ఱోనున్నా
రోఱొయ్యాలి సన్నను తేఁ
డైతగునలు నరసికాంచి యరుదేరంగన్. 108

గీ. నన్నునీతండ్రియనిచిన నిన్నునిటకు
నరుగుదెంచి యీయూరెల్ల నరసియరసి
నిన్నుఁగనఁగంటినిచ్చట నేఁడునాఁడు
గోర్కెలెల్లఁ గొనసాగెఁ గొదలుడాఁగె. 109

క. ఎన్నఁడు చెలులంగలసెదొ
యెన్నఁడు త్రొల్లింటియట్లు లెనలేనిసిరుల్
చెన్నుగ నందెదొ యెన్నం
డన్నలుతోఁగూడఁదండ్రియలరుచుఁగనునో 110

క. నీయెదఁగో నించుకయును
నాయానకలకయుఁడుఁ నన్నెఱుఁగుదె త
ల్లీ యేనుజన్నిగట్టను
జేయొషయని నీతండ్రి చెలికాఁడనన్. 111

క. తనకొఁడుకుఁగూతుఁదలఁచుక
కనుదోయిన్నీరునించి కలచుట్టల నె
ల్లనడిగియేడ్చుచునున్నం
గనుంగొనిసునందలోనఁగాఁగలకలుకల్. 112

ఉ. ఏలొకొ యింతియిక్కరణి నేడ్చుచునున్నది చూచిరాఁదగుఁ
జేడియలార రండనుచుఁ జెచ్చెర డగ్గఱఁజేరి రంపులో
జాలిని దల్లిచెంగటికిఁ జయ్యననేగి సునందచక్కఁగాఁ
జేలనుజేర్చుచుం దెలియఁజేసిన నాయెలనాగక్రచ్చఱన్. 113

క. చనుదెంచి తద్దయును నెన
రెనయంగాఁ గూరుచుండి యొద్దియెచెలితో
ననుచుండునేలజేజేఁ
గనియురుదంది కడుతియ్యఁగా నిట్లనియెన్. 114

ఉ. తొంటితెఱంగ దెట్టియది తొయ్యలితండ్రియు నెందునుండు నే
యింటనుజొచ్చె నిక్కరణి నిచ్చటకుం జనుదెంచి యొంటిఁగా
నుంటకు నెద్దికీలె చటనుందురు చుట్టలు తల్లిదండ్రు ల
న్నింటను జాలియుండుదురె నెట్టన దాఁచక యానతీయరే. 115

క. అని యంతయుఁ దెలిసికొనం
జనయెడఁగోరికలు క్రేపుదాఁటంగానా
తనినన్నిలంతయడిగిన
నొనరఁగ నెఱిఁగించె నిట్టులున్న తెఱంగున్. 116

క. ఇదిక్రథకైశికసూఁతురు
చనుదెంచగు నలునిరాణి సరిజోడానన్
జనుఁడడఁగి నేలయెల్లను
దుదకాయన యోడియాలుతోఁ గానలకున్. 117

చ. చని ననుటాలకించి యెదజల్లని యాక్రథకైశికుండు న
ల్లునిఁదనకూఁతుఁ జయ్యన నలుంగడ లారసి యెందునున్నఁ గై
కొని చనుదేరఁగా ననిచెఁ గొందఱు సాదుల జన్నిగట్ల నే
నును నరుదెంచి చేడియఁగనుంగొనియుం దొలుతం దటాలునన్. 118

గీ. గుఱుతిడంగలేక కొంతనిలిచి తాత
సిరులుదొరకుకొఱకు చేసినట్టి
చిన్నెనుదుటఁగాంచి చెలరేఁగి తుదకేను
నిన్నెలంతయాటయెఱిఁగికొంటి. 119

మ. అనినన్నీళ్లులు తేరఁగాననిచి యొయ్యన్నెన్నెసల్ తానిలో
నెనరారం దనచేతులంగడిగి చిన్నంగాంచి రాకన్నియల్
కని యెంతో యరుదందఁ గౌఁగిటను జక్కంజేర్చియాత్రొయ్యలిం
దనయోరంజెయిసాఁచి రాఁదిగిచి కన్నీరొల్కఁగానిట్లనున్ 120

సీ. ననుగన్నతల్లి నేనునునీకుతల్లియుఁ
జేదిదశార్ణుని చెలికిఁగలిగి
నేనెతానుగనుండ నానెలంతయుఁదొల్లి
యలక్రథకైశికు నాలియయ్యె

చేనునీచినతండ్రి కిక్కడనాలనై
యెన్నండు నినుఁజూడకున్న దాన
నాకుఁగూఁతురగుదు నాకడనింకనుఁ
గొన్నినాళ్ళుండఁగాఁగూడియుండి
తల్లిదండ్రులఁజూడంగఁ దల్లి నీకుఁ
గోర్కెయయ్యాతటి నేగెదుకూడియుంత
దనుకనిచ్చటనే యుండఁదగునునీకు
నడ్డులాడిననింక నాయడుగులాన. 121

గీ. అనినఁదల్లికిజోహారులొనరఁజేసి
దరిసునందనెత్తుకొని యాతల్లి యనిన
దాని కీకానికొన్నాళ్ళు దండనుండి
యింతియుల్లసనొక్కనాఁ డిట్టులనియె. 122

క. ఈయిల్లునునారయఁగా
నాయిలునాకొక్క సరియె యైననుదల్లీ
నాయనుఁగుఁగూఁత్రులంగన
నీయెడనెంతయునుగోర్కె యెసఁగెడు నాకున్. 123

శా. కానన్నేనట కేగనానతియొసంగం జెల్లునా నాకియున్
లోనింతంతనరాని జాలిగదురన్ దొత్తుల్తగందోడరా
పానందీర్చినయీవాడు లేనిరతనాల్ చాలంగఁజెక్కంగఁ జె
న్నైనసీటొందుసరుల్ కడానినగలొయ్యన్నాన్కగానింతికిఁ. 124

గీ. ఒసఁగియడ్డలయందలానసకినుంచి
తల్లిదండ్రులయొద్దకుఁ దగినయట్లు
తోలఁజెలిరాక యారనందోలునెఱిఁగి
చూడనేత్రేరఁ దనయిల్లు చొచ్చెఁగలికి. 125

గీ. అనినసంతయు నాలించియరుదుగాంచి
చెంతజడదారిఁదిలకించిగొంతిక్రొదుకు
నింతితనయిల్లుచేరినయంతసద్ది
జరగినానతిఁ జనునిఁక సరగననుడు. 126

క. రక్కసులును జేజేలును
జక్కఁగఁగడలితరుచు తతిజాలయిరయొడళుల్
చెక్కలుచేసినచేఁదును
గ్రుక్కంగొన్నట్టిఱేఁడక్రొట్టికసూడా. 127

పంచచామరము. కలంగితోఁడిరక్కసీంద్రుకాలిక్రొల్దిదూటఁగాఁ
జెలంగుచుం దిగంచుక త్రిచేతఁ దళ్కులీనఁగాఁ
గొలందిలేనికిన్కతోఁడగ్రుడ్డులెఱ్ఱఁజేసియా
తొలంగుహ త్రిసోఁకుఱేనిఁద్రుంచినట్టిరాయఁడా. 128

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర కందుకూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర సుజనవిధేయ వీరేశలింగనామధేయ ప్రణీతంబైన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధంబునందు ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.

క. సెలయొత్తేరుఁగఁబాతయె
తోలునతఁడుగాఁగ నెలయుఁ బోగడాయుయుఁగం
ఫ్లలలిసిరిబారచిలుకుఁగఁ
గ్రాలుచుఁదిగకొట్టికలను గాల్చినదిట్టా. 1

గీ. అల్లజనదారి యాక్రీడియన్నతోడ
నిట్టులనె నట్టు లెలనాగయిల్లుచేరి
తల్లిదండ్రులయొద్దను దనరినంత
జరిగినదియెల్ల నెఱిఁగింతుజాలిగదుర. 2

చ. చిలుకలకొల్కి యక్కరణిఁజెన్నుగఁ జుట్టలయొద్దనుండియుఙ్
నలునెదలోఁదలంచుచు నసల్ దలఁదాల్చక నేలసెజ్జగా
నలయురచీరతోనొడల నంటికొఱంగని దూళిత్రోఁ గనుం
గొలుకులనీటితో నెసఁగెఁ గూరుకు చెందనికన్నుదోయిత్రోఙ్. 3

క. అటులుండినాతియొక నాఁ
డటునిటుఁ గలయంగఁజూచి యంతటఁదల్లిం
దటుకునఁగనుఁగొనియిట్లనెఁ
జిటుకునఁ గన్నీరుజాఱి చెక్కులుకడుగన్. 4

క. నలునారసిచనుఁదేరఁగ
సిలుగులెడలఁగొట్టు నేల జేజేలనిఁకఙ్
నెలఁతరాయనిచినసిచ్చట
నిలిచెదనదిలేనినాఁడు నెట్టనసుఖుల్. 5

ఆ. త్రొఱఁగుబానననుఁదొయ్యాలియదియెల్ల
దండ్రికెఱుఁగఁజేయఁదగినయట్టి
జన్నిగట్లనలునిఁ జయ్యనరోయంగఁ
గట్టడలొనరించి కడలకనిచె. 6

గీ. అట్లునలురోయఁ జనుజన్నిగట్లతోడ । నల్లనల్లననిట్లన నన్నెలంత
యెన్నిరేకీడులందుచునున్నకతన । నలుఁడుతాఁ నొంటితీరున నలరకుండు

గీ. కానఁగోరికలీడేర్పఁగాఁగడంగి
చనుచున్నట్టి యారలుసరగనేగి
కనుగలిగియెల్లచోటులఁ గలయనరసి
తగఁగనిట్టులనుఁడు రాచనగరులందు. 8

సీ. కల్లలెన్నఁడునాడఁ గడఁగనినీయట్టి దిట్టయుఁగానలో దిగులులేక
యాలుకట్టినచీర యరచించికట్టుక యింతి నొంటిగడించి యేగనగునె
యాలునుదనలోన నరయన్నకట్టడ యరిగనే యెందైన నాసలేక
యిఁకనైననించుక యింతికుయ్యాలించి నెనరడరంగఁ జేకొనఁగఁదగదె
యనినసిగ్గునలోఁగుంది యంతనిలక
తగిననుడులను దిరుగంగఁదళుకియాడు
నతఁడెనలుఁడని యెదలోననరసి తెలిసి
నన్నునాతనికెఱిఁగించినచ్చికడర. 9

క. కైకొనిరండది చులకఁగఁ
జేకుఱకున్నను నెఱింగి చెచ్చెరరండీ
నాకడకని యనిచిననాఁ
గాకనిచనియెల్లయూళ్ళఁ గలయఁదిరుగుచున్. 10

ఉ. అందఱునింతిచే నెఱఁగినన్నియు నెల్లెడనాడియాడి తా
రెందును జేనిఁగన్గొనఁగ నించుకయేనియు నేరకూరకే
యందులనిందులందిరిగి యాసలురిత్తయి చన్నెనింద్లకున్
గ్రందుగనేగుదెంచి రిదనానలఁ జేతులనూఁచుకొంచొగిన్. 11

ఉ. అందొకజన్నిగట్టు చెలియంగని యిట్లనునేనయోధ్యకుం
గొందఱితోడనేగి యటఁగొంకక యేలికరచ్చసాలలో

సంపడిగాఁగనున్నయెకఁ జానుగఁజొచ్చితలంక కన్నియుః
సందయియాడ నొక్కరుఁడు చక్కఁగనక్కడనుండి దండియై. 12

సీ. చెంతకరుదెంచి చేసైఁగచేసినన్నుఁ
జెనసిచాటునకల్లనఁ జేరఁజేరి
కుఱుచచేతులతఁడు తేనిఁగొలుచునతఁడు
నల్లనతఁడుశ్రేరులఁబోలునాతఁడనియె. 13

గీ. త్రాడుకట్టినయాతనితఁజినొకింత । నేఁగియైనతజినిగానిచేఁతలైనఁ
జూచిసైరించునింతియె చులకగాను।నిమనంచును సిరులంచు నీకులేక.

క. అనియింకనెద్దియునసక । చనియొందవదారినతఁడు చక్కంగాఁ గూ
డొనరించునంటనిచ్చలుఁ। గనుఁగొనియెదలోన తేఁడుగడుసంతసిలన్.

మ. అనినందద్దయులోన నారసినలుండో నాతఁడొండొక్కఁడై
ననునేలాతిరుగంగనిట్టికరణిం దానాడు నేఁడింకనుం
జనిజాడల్ తగఁదీసి తీసికొనిరాఁ జక్కంగ నాయూరికే
ననుతుందొల్లిటి జన్నిగట్టునె యటంచాయింతి యల్లంతటన్. 16

క. చనితలిదండ్రులనిద్దఱఁ । గనుఁగొనియెటఁగించి తొంటికరణినిదన్నుం
గనియిటకుందోడ్కొని తె । చ్చినయన్నెఱజాణ నేల జేజేతేనిన్. 17

క. క్రచ్చఱనలునారసిరా । నచ్చుగని త్రతి వయోధ్యకనుచుటలెస్సాఁ
జెచ్చినవాతనిఁదోడ్కొనిఁ । తెచ్చునదియటన్న నట్లతేనానతిడన్.

గీ. అంతసరగఁ గొందఱులెంక లరిగియతనిఁ
దోడుకొనితెచ్చి యెలనాగత్రోడనొయ్య
నెఱుకచేయునతనిఁ జేరియిట్టులనియెఁ
గేలుజోడించి కోర్కులు క్రేళ్లుదాఁట. 19

శా. నన్నిట్లచ్చటకేగి తోడుకొని యన్నా తెచ్చి తల్లన్నలుం
జెన్నారంగ నయోధ్యకుంజని యటంజేకూఱఁగా రోసి యెం

దున్నన్నె నెఱనీటుసూటిగన నియ్యార్యరింకఁ దోడ్తేఁగదే
కన్నారంగనుఁగొందుఁ గోరిక లెసంగన్నేలజేజేదొరా. 20

సీ. సరగనయోధ్యకుఁ జనితేనిఁగనుఁగొని యందఱు నాలించునట్లుగాఁగ
నచ్చట నోరోడకాయనరచ్చలో నుదిరిగద్దియఁ గూరుచున్నతఱిని
గ్రథకైశికుఁడు జన్నిగట్ల నొక్కటనంచి నలురోసియెందుఁ గానంగలేక
తనకూఁతునకునొక్క తగినయేలికఁగట్ట దిరుగఁజాటించినఁ దేరులెక్కి
నేలఁగలయట్టిదొరలెల్ల నెలఁతఁగొనఁగ
నేగుదెంచుచునున్నారు నేఁటికింకఁ
గనఁగనానాఁడు నెడలేదుగానసరగఁ
జనఁగఁజెల్లునని దొరత్రోనఁగదయ్యా. 21

గీ. నలుఁడుదక్కంగ నొండొక్కఁడలసినిలక
యొక్కనాటికెయిక్కడ కుక్కత్రోడఁ
దేరుదోలుక యరుదేర నేరఁడగుట
నందెనలుఁడున్న దొరత్రోడ నరుగుదెంచు. 22

క. అనియానతిచ్చియనిచినఁ
జనియటఁగ్రథకైశికుండు చయ్యనఁదిరుగం
దనకూఁతునోసఁగు నొకనికిఁ
గనుఁగొనసెల్లిచనుదేరఁ గాఁదగుననియెన్. 23

ఉ. అంతనయోధ్యఱేఁడు నలుఁడచ్చటనుండఁగఁ జూచియెల్లినే
గంతునఁజేరఁజెల్లుఁ గ్రథకైశికునూరటుగాన నొక్కనాఁ
డెంతయుఁదేరుఁదోలుకొని యేగఁగఁగల్గుదెనా నతండు నేఁ
డింతటిలోనఁజేరునని యూకొని కన్నుల నీరునించుచున్. 24

గీ. నేలతెఱగంటి దంటయానేలికకడ
నిట్టులంటకు నరుదంది యెదఁగలంగి

తిరుగఁగడిదేఱినలుఁగడల్ తెలియఁజూచి
యెట్టకేలకుఁ దనలోననిట్టులనియె. 25

ఆ. కానఁదన్నుడించి కడచన్నకతనఁగా
కలికియిట్లుచేయుఁ గడఁగెనేఁడు
గోతియెంతయు నెదఁగూర్చునాకంచు
నచ్చియుండునతఁడె హెచ్చుచెనఁటి. 26

ఆ. గోలనాకుఁగూర్చుఁ గొడుకులుగలయది
యిట్టులేలచేయు నింతియైన
నెఱిఁగియరుగుదెంతు నీతేనితోఁగూడి
యేగియచటికంచు నెదఁదలంచి. 27

గీ. తొల్లి తనకత్తలానులఁ దోలునతఁడు
తెచ్చియిచ్చుటనుంచిన తెల్లజిగిని
దవరుచుఱుకైన తనతేరి తత్తడులను
రెంటిఁగొని తెచ్చితద్దయుదంటయగుచు. 28

ఉ. తేరికిఁగట్టుచోనొఱఁగి తేజులుతూలుటఁగాంచి తేఁకుఁగో
దారినిపోలకీయసదుతత్తడు లెట్టుగ నేగనేర్చు నీ
కోరికదీఱ నొండుజతఁ గూరిచికట్టుట లెస్సయన్న లో
నీరికలెత్తుహెచ్చరిక నిట్లనియె న్నలుఁడోరఁ జూచుచున్. 29

క. ఈతేజీలించుకలో । నీతేరీడ్చుకొని యలుఁగు నింకెఱనరుగుం
జూతలరి యయోధ్యకునేఁ । డేతొగదాయ కడలితతి కేగెడుతఱికిన్.

గీ. అనిననిటులైనఁ గడులెస్స యరిగిసరగ
నూరుచేరిన యంతటనొక్కపారి
కోరికలుదీఱునని తేరుసేరిమెక్కి
నలుఁడునింకొక్కఁడునుదోడనరుగుదేర. 31

క. చను నెడఁ దేరిక రుసునడ
కనుఁగొని యాతండు నలుఁడుగాఁ దగుఁగాక
న్న నలాఁతిరియొక్కఁడిలా
గునఁ దత్తడుల తెఱఁగు లెఱుఁగు నెయనియెంచెన్ 32

క. కను దెఱచి చూచునంతకుఁ
జెనయుచు నెత్తియనగట్ల చెట్లకొన లెడన్
గనుఁగొన నై తఱిసితిరుగఁ
గనుఁగొనఁగా రాక యెదుటి కడనడఁగుఁగడున్ 33

సీ. ఈడుజాడలు నూడ నీతండు నలుసాటిగాఁగ నించుకయంతకాననయ్యె
నీలాటిరియొడ లేల తాలిచెనో లెస్సఁ దెలియనగు నె కల తెఱఁగునాకు
నట్టియయ్యలు చాలనంగ దలౌతటి దాఁగియుందురుగాదె తగినచోట్ల
నితఁడెనలుండైన నెట్లుండునిచ్చటఁ దొల్లి యెకానలఁ దూఱెఁగాదె
యనుచుఁ జనుచున్న తఱిఁ జీరయించు తాఁకి
జాఱి నేలఁ గూలిన నలు చక్కఁ జూచి
యితఁడు దిగి చీర గైకొని యేగు దెంచు
నంతకును దేరు కడుఁ దోలక నిననతఁడు 34

క. ఏలిక యాచోటిచటికి । నాలుగుకోసులయియుండు నడుచు నెయితఁడా
నేలకుఁ దేనేరండిదె । తోలెద దేరంచునాడి తొల్లిటికంటెన్. 35

క. తొందరగాఁ జననిచ్చుచు
నందందుల యూళ్ళు దాఁటి యరుగుచునుండన్
నందున నయోధ్య యేలిక
చెందొగకొలఁకుకడఁ దాడిచెట్టును గనియెన్. 36

చ. కనినలుఁ జూచి యిట్లనియెఁ గన్గొనికాని యెఱుంగ రెల్లరున్
దనరఁగ నన్ని యెన్నిక యొనర్చు తెఱంగది యే నెఱుంగుదుం

జని తెలియంగఁ జూపు చెయిచాయను జెన్నగు నల్లతాడిక్రొ
న్ననలునుఁ గాయలాకులును నాకవిక్లిష్టుఁగఁగఁ జేసెదన్. 37

సీ. నాఱునూఱ్లయొకంపు నాల్కానికొనలందు
నలరులుఁ గాయలు నలరుచుండు
నీకేనకొఱఁతగా నేను నన్నూఱులు
కాయలాకులుఁ గ్రింద గ్రాలుచుండు
ననుచునాడిననుడు లాలించియటకేగి
యన్నింటిఁ జక్కఁగా నెన్నికాని
యున్నియని తెలియనెఱుఁ గంగరాదని
యొడలోనగట్టిగా నెంచినలుఁడు
తత్తడులత్రాడు లొక్కటఁ దనదుచేతఁ
దిగిచినాఁగల నొయ్యనఁగట్టి తేరుడిగ్గి
చీరయొక్కింత చక్కఁగా జేర్చికొనుచుఁ
జెట్టుకడకేగి నెట్టనచెట్టుయెక్కి 38

క. ఎన్నికయొనర్చి యాతం
డన్నట్టుల హెచ్చుతగ్గులన్నను లేకా
క్రొన్ననలుఁ గాయలాకులు
నున్నఁగనుఁ గొనియరుదందిరొయ్యనఁ దిరుగన్ 39

క. ఛనుదెంచినాకుదీనిని । నెనరున నీతేఁడొసంగ నీకొనసేలా
గున నై నను నేఁ జేసెద । ననితనయొదలోఁ దలంచి యాదారత్తోడన్. 40

క. నిను నేనీనాఁడేతగఁ । గొనిచేర్చెదనాతి యూరుకోరిక దీఱం
గనునిది వాకిడికోరిక । కొనసాగించినను నేలికొనఁగదె యిచటన్. 41

క. అనియడిగికొన్నదార గై । కొనునీకిచ్చెదనుదీనిఁ గోరికతీఱం
గననిరొయొసంగిననింతం । తనదాని నెనరునకునెవ నలరుచునలుఁడున్. 42

క. నాకిచ్చితిదియుఁగానఁ । నీకిచ్చెదనయ్య నేను సేర్చినదీనిం
గైకొనఁదగునొండాడక । చేకొనితత్తఱులఁదోలఁ జేకుఱుచదురున్. 43

చ. అనియొసఁగంగరానతఁడు నల్లనలోనగుకొంచుఁ జెచ్చెరం
గొనియెదనయ్యనాకెదను గోరికయాతఱి సంతదాఁక యెం
దెనయనరానిదీని నెఱిఁగించుటకంటెను నీదుచెంతనే
యునుచుటలెస్సయాననుఁడు నొయ్యననియ్యకొ నెన్నలుండటన్. 44

ఉ. అంతటఁదోంటినుండియొడలందునుండి నలుంగడంగి తా
నెంతయునేఁచుచున్న కలియెచ్చుగ నోరనుజేఁదుగ్రక్కుచుం
గొంతకుఱాఁగటన్నిలిచి కూర్చెనల్లనికేలుదోయితోఁ
జెంతనుదిట్టఁగానలుక చేసెడునన్నలుఁజూచి యిట్లనున్. 45

క. కర్కోటకుచేఁదొడలం
గార్కొనిదరికొంచుఁ గ్రాఁచెఁగావఁగినుకెదం
దార్కొనఁజేయక తిట్టక
కోర్కులుచేకూఱనేలు కొనఁగదెనన్నున్. 46

ఉ. ఇంతటినుండియేనచటికేగక యీనెఱతాడిఁజేరెదన్
జెంతలనైననింతయెదనిన్నుఁ దలంచినయట్టి యయ్యలం
జెంతలఁజేరియుంగదలు చేయకయే చక యుండుఁగాననేఁ
డంతయునోర్చి నేనిడినయంగదసైరణసేయుఁగాఁదగున్. 47

క. అనఁగనతఁడంచెనలుఁడును
గనుఁగొనఁగాఁదాడిఁజేరెఁగలియునునలుఁడుం
దనతేరికిఁ దిరుగనరిగి
చనుదెంచెన్నరగ నూఱుచక్కికిదారతోన్. 48

గీ. ఒడలుచక్కనై యుండుటయొకటితక్కఁ
దక్కుఁగలచేటులెల్లనుజక్కఁచేసి

సంజయాత్తజకోట్టిక సరసకట్లు
తేరికబ్రోవవాలుగు జెసలునింప. 49

గీ. అరిగి క్షత్రై శికుండెదురరుగఁ జెంచి
తోడుకొనియేగు నెలికత్తోడనేగి
యోడయుఁడచ్చుటఁగట్టించియునిచినట్టి
యిల్లొసఁగనందుదిగియుండెనల్ల నలుఁడు 50

సీ. ఆ తేరియలు కుడునాలించినలుఁడ దెయరుజెంచఁ గాఁజాలుననుచు నెలఁత
యెంతటిదాననో యిన్నినాళ్ళకు జేనిఁ జూడంగఁగంటిని నేఁడు కనుల
నిండనంచు నలరి నేవాతనిని నిందు నొక్కటఁగనఁజాలకుంటినేని
కనియెడ నునినిండు కౌగిటఁజక్కఁగా నుంచుటకించుక నోచనేని
యసువులంతలుఁజూడంగనొక్కసారి
ప్రాణఁగుదాననని తలంచి తొయ్యలియును
దేరినిన మోధ్యతేనినిఁ దేఁజిచూచి
కోరికలుడించి యెదలోనఁగుందుచుండె. 51

క. ఆదొరయునూర నెచ్చట
జోదులయినదొరలరాకఁ జూడక యెదలో
నేదియుఁదోఁచక తొయ్యలి
యాదటనొక్కనిఁ గయికొనుచున్నదియెందుఁ 52

సీ. ఆలించుటయె లేక యక్కట యేలిక యొక్కఁడైన నీనెలంతుకఁగొనంగ
నే తేరఁగాఁగాన నేమదక్కంగను నరుదయ్యెనెంతయు వరసిమాడ
నాకల్కియొరు నేల గైకొనఁగాఁగోరు నలుసఁగాదని రిత్తయలిగి నేఁడు
కొడుకులుగలయది యెడఁదనెల్ల తటిదినలుని నేడుగడఁగఁదలఁచుచుండు
జెంత యేయంత యొరుని ట్టిచేకొనంగ
ననుచునాననొదిగియుండెనంత నలుఁడు

తత్తడుల సాలలోఁ గట్టిరయి త్రిగిల్లి
తేరిడఁజినొక్కచో నేద దేఱనొఱఁగ. 53

క. ఆయేలికత్రోనుండిన । యాయయ్యలఁజూచి తెల్లనై యంతటితో
నాయింతియునాసనుదెగఁ । గోయంగాలేకయానగొనుచుందిరుగన్. 54

క. తనచెలికత్తియకేశిని । యనుదానింజేరఁజేరి యాయిద్దలోఁ
గనుగొనిమెఱిగిత్తినొక్కని । దనుఁగుఱొనలుఁజేరుతోలునాతనిఁగాగన్.

క. తక్కినయాతని సుద్దియు । నక్కఱొనీచదురునేఁడ యారసిచూతుం
జక్కఁగ నెఱింగిరాఁగదె । యిక్కడనున్నట్టియేగియుంచుకలోనన్.

ఆ. ఇతనియందుఁజిక్కినెదనాకుఁజూడంగ । నల్లనాఁడయోధ్యకరిగినట్టి
జన్నిగట్టుతోడఁజెన్నుగఁనాడిన । దిట్టయాతఁడొక్కొ తెలిసిసరగ. 57

సీ. చనుదెంచునదియనియని చినఁగేశియుగదలిచెచ్చెరనలుఁగాంచియనియె
నన్ననీచెంతకునలురాణియనిచె నెయ్యుఁడునీరులెస్సగాఁనున్న తెఱఁగు
కనుఁగొనిరాఁదగునఁగాననడిగెదఁ దెలియనొక్కటియానతీయఁగదగు
నెందునకై యారతేతెంచితిరిచటి కేయూరఁదగనుందురింతదనుక
దాఁచకన్నియుఁజానుగుల్ తనియునట్లు
సరగనెఱిఁగించియెలనాగసరసకనిచి
యేలగాదగునన్నఁదానడ్డదలోన
నింతయుంకించి దానితో నిట్టులనియె. 58

క. నీయేలికసానికినో । ధీయత్నారిన్ యెల్లనేఁట నారునొక్కరునిన్
రోయకకట్టుదురనుచును । నీయేలికయేగుదేర నేనునుదోడన్. 59

క. చనుదెంచితినాతుకఁజే । కొనఁగాదే నేలయె త్రికోనదారల్లం
జనుదెంచిరన్నిదెసలను । దనరుచునాలుగు తెఱఁగులదండులతోడన్.

గీ. సకియయోధ్యకేతెంచినజన్నిగట్టు । తత్తలిమ్చుటికల్లి రాఁదగునటన్న
నొకటనన్నాఱుకోసులనొక్కనాఁట । జేరుదోలుచుఁదోడనేతెంచినాఁడ.

గీ. అనిఁ గేశియు నెదలోన నళుకు లేక
యంతకంతకుఁ గోరికలల్లుకొనఁగఁ
దిరిగి కూర్చున్న జతకాని దెసను జూచి
యితని తెఱఁ గెద్దియన నలుఁ డిట్టు లనియె. 62

క. కలికిరో తొల్లి యితండా । నలు తేరును ద్రోలునతఁడు నా సంగడికాఁ
డలయక యిప్పుడ నాతోఁ । గలసి ప్రొరకు దాశ్యోక్షగాసరు డెంచెన్.

క. అనఁ దొయ్యలి యితఁ డన్నలుఁ । డౌనకొంగా నేఁగి యొండు నాఁ డాయెపెం
గినవడు గందగునను ఘుం । గను గొన నలు నగుచు జాడగా నిట్లనియెన్. 64

క. నలు నింగిలుని నెఱుంగఁడు । నలుకుత్సలనిద్దఱుఁ గొని నాఁడిచ్చుటకుం
దలఁకుచు నే తెంచితి రుగ । నలు నూరికి నేగి యచట నలుఁగురి చేతన్. 65

క. నెత్తాననోడి కానల । కత్తఱి నేగుటయె త్రింగి యనలుచుఁ దమదకుం
ద త్తడులఁ గొంచు నెడలో । న త్తెఱఁగుం బెల్లఁ దీఱి యాహారఁ జేసెన్. 66

క. నలుని తెఱంగింతయు నా
నలుఁడె యెఱుంగు నొక యింత నచ్చికగాఁ దా
నలుతోడఁ గూడి యరిగిన
యెలనాగయె యెఱుఁగుఁ గాక యెఱుఁగుదురె యితుల్. 67

సీ. అనఁ గేశి యిట్లను నన్న యాయింతికి నూరక కోలయేల యొకటి కట్టఁ
గా కలుదాఁ అని కాఱుకానల లోన నెన రేది దొరయట్లు నెలఁత నొంటి
డించి యేగిన నాఁటి చించిన చీరయె నేఁడును దాల్చుచు నెగడుచుండు
నొడలనంటిన యసల్ కడుగ దించుక యైన నిచ్చలు నేల నెనిమరఁ జెందుఁ
గనులనీ రెల్ల తఱిజడి గొనుచునుండు
పొగదిద్దదు చెదరిన సోగకురుల
నెందు నలు రాక యే యెడ నెంచుచుండు
నెల్ల దెంత చక్కని కాపునొక్క వాఁడు 68

చ. అఱయెఱ్ఱఁగించుచున్న తఱి నంతకునంతకు జాలుఁ గొంచుఁగ
న్గొనలను జాఱునీరడఁచి కొంచుఁ దెఱంగెఱుఁగంగనీక క్ర
న్ననఁ దలయించుకుంచి యెద నాఁటినజాలిని నేలఁజూచుచుం
గనుఁగొనకూరకున్నఁ గని నాతుక చెంగటికేఁగి కేశియున్ 69

క. ఆతం డాడిన తెఱఁగును । జేతలఁ దాఁ గన్న తెఱఁగుఁ జెచ్చెర నొంటి
న్నాతుక కెఱ్ఱఁగించిన నెడ । నాతని నలుఁగాఁ దలంచి యనియెం జెలితోన్.

ఉ. ఇంకను నొక్కసారి యటకేచని యాతఁడ యోధ్యజేనికిం
డెంకినిఁ గూఁడ నర్చ్యనట టెక్కుఁగఁ జూచి యసడ్డ లేక లో
జంకక యంతయుం దెలిసి చయ్యన రాఁదగునన్న గ్రక్కునం
గొంకక యేఁగి కన్గొనియెఁ గోరిక లీరిక లెత్తనంతయున్. 71

క. కనుఁగొని యరుదందుచు ది । గ్గునఁ జనుదెంచి యెలనాఁగ గోరినకరణిం
దన కన్నదియెల్లను ని । ట్లనియెఱ్ఱఁగించె నెదలోని యడలడఁగంగన్. 72

ఉ. ఆయన జాడలెల్లఁ దగ నారయ నేలకు డిగ్గినట్టి జే
జేయనఁ దోఁచె నట్టి నెఱచేతలు తొల్లియు నెన్నఁడైన నే
నే యెఱనాలకించియును నించుక కాంచియుఁ గ్రాలుగంటిరో
నీయడుగాన కాన నలు నింగనినట్టుల యయ్యె నాయెదన్. 73

సీ. కట్టెయొక్కటిగొని నట్టింట రాచినఁ
జిచ్చందుఁగలుగును జిటికెలోనఁ
గూడుఁడికెడునంతకును గట్టెలిడక యె
యంటుక సురసురలాడుచుండు
నంజుళ్ళు కడుగుకొనఁగ నీరుకొరుడుఁ
గ్రాఁగులు నిండంగఁగలుగుచుండుఁ
గై తాఁకియలరులు కందియుఁ దొల్లింటి
చెన్నెకించుకయును జెసకయుండుఁ

గూరగాయలనుడికించి కూర్పుతఱిని
గడలనెల్లను దియ్యనిగా నైమొలసి
నెడలెఱుంగనియట్లయ్యె నొక్కయింత
యతనికఱుదులుతఱుచేలయరుకులయ్యె 74

గీ. సారెసారెకుఁ జెలినంచి చక్కఁగాను
జిన్నెలన్నియు నెఱిఁగియుఁ జేరి కేళి
తెచ్చియిచ్చిననంజుళ్ళు తినియునతనిఁ
జేడెనలుసిఁగా నెదగట్టి చేసికొనియె. 75

గీ. అట్టులెఱిఁగియు నూరడకరసిచూడఁ
గొడుకుఁగూఁతును గేళితోఁగూడనిచ్చి
యతనిదగ్గఱకనిచినసల్లఁజూచి
చుట్టలందఱఁచూచిన యట్టులైన. 76

గీ. చెక్కలోయ్యననంటుచుఁ జేరఁదీసి
క్రొత్తనెనరునసుద్దఱనెత్తుకొంచు
డించిగ్రుచ్చికౌఁగిటఁ జేర్చినించుచుండెఁ
దొడలనిడుకొనికన్నిరుత్తోడుత్రోడ 77

చ. ఒడయఁడు నంతనింతిఁగని యోచెలి హెచ్చును దగ్గులేక నా
యెడఁదఱు నేలయోయెఱుఁగ నిద్దఱు నీచిటికుఱ్ఱలల్ల నా
కొడుకునుగూఁతు నచ్చునను గుద్దినయట్లుగనున్ననిట్లు నే
నడలితిఁజాలఁజూచితిఁ గదా యనియొండు తెఱంగుగా ననెఁ. 78

క. నాతిరొతఱు చుగనిచ్చుటి । కే తెంచుచునరుగుచుంట యించుకకనినన్
లాఁతి తెఱంగున నెదలం । జూతురు చనదిందురాఁగఁ జులకఁగనింకన్.79

గీ. ఏనులాఁతిచోటుననుండి యేగుదెంచి
నాఁడ నీకునిచ్చోట నాతోడిదెద్ది

కలమతలమె త్రిచూడక క్రన్ననఁజను
నదియటన్న నఁజిన్ననై యదియుసరిగి 80

క. చనియదియంతయు నెఱిఁగిం । చిన నెంతయు సంతసించి చేడియ సరగన్
దనతల్లి యండ కుంజని । కనికాళ్ళ కెఱఁగి వనరొలుకఁగ నిట్లనియెన్.

చ. తఱుచలిఁ గేల యల్ల దొరదగ్గఱఁ గూడొనరించు నాతఁడం
డఱు నెఱుఁగంగ నేరరిట దాఁచఁగ నేలనలుండు గేశిచే
నెఱిఁగితి జాడగా నతని నిచ్చటి కాయనఁ దోడితెచ్చెదో
తఱి గని నన్ను యచ్చటికిఁ దల్లి కొ యేగఁగ వానతిచ్చెదో. 82

క. అనఁదండ్రియానతింగై । కొని యొంటరినొకని నేగి కొనితేరంగా
ననిచిననాతఁడు త్రోడ్కొని । చను దెంచెను నింతి కొంత సంతసిలంగన్ 83

క. కౌతుకము సళ్ళుకొందుచు నా । కృతకంటందడిసియెసంగఁగడునడలంగా
జతకత్తియ లేనియెడను । నతఁడచ్చటఁ గాంచెనోలి నాలిన్ జాలిన్.

గీ. కనులనొకసారి యొంటిగాఁ గాంచెనేని
రేయికలలోన నేతెంచుచాయనున్న
తేనిఁ జూచియు నొందుగా లోననెంచ
కింతిజాణగాన నతనికిట్టులనియె. 85

సీ. ఏఁనాడు నేఱును నేగుదెంచనికాన
సోలినిద్దురఁ జెందు గోలనొంటి
నట్లుడించి చనంగ నెట్లుకాళ్ళాడెనో
నలునకుజాలి యన్నదియె లేక
తెఱగంటిదంటల దెనఁ జూడనొల్లక
తన్నుదొరఁగఁగోరుకొన్న దానిఁ
గొడుకులతల్లినిఁ గొఱగానిచోడించఁ
జేడియయొగ్గెది చేసెనొక్కొ

విన్నఁడించి నేనెట కేగుదున్న యట్టి
నుడుగులెల్లను నట్టేటఁ గలసెనొక్కొ
యనుచు నెదచిల్లు లగునట్టులాడుచున్న
యింతిఁజూచి దగ్గుత్రిక నిట్టులనియె. 86

మ. కలిపన్నంటి చెనంటి యక్కరణిఁ దాఁ గాసిల్లఁగాఁ జేయుటం
దెలియంజాలక యట్లొనర్చితిని సంతే దాని నా తెన్నెఱు
ద్దులచేఁగల్చితి నింక నాకొడలికం దొక్కందుదక్కంగఁగా
య్యాలిరో యొండుకలంకు లేదదియు నోయ్యెందీఱుఁ గోవాళ్లకున్. 87

సీ. నీకొఱకునుగాదె నేనునిచ్చోటికిఁ
దిరిగితిరిగి యరుదెంచినాఁడ
నదియెల్ల నట్లుండె నక్కటగరితకుఁ
గూడు నెయ్యెరునిట్లు గోరుకొనఁగ
నొంటులకై గాదె క్రింపుగ దొరలెల్ల
నరుదెంచుచుండ నీయనయుఁగ కలి
యొక్కనాఁటనె తనయుక్కన నే తెంచె
ననిన నెంతయు నెదనళుకుఁ జెంది
కలికిచేదోయిజోడించి కలఁతనొంది
యెలుఁగు కుత్తుక దగులంగ నిట్టులనియెఁ
దొల్లి జన్నిగట్టులరిగి దొరలరచ్చ
పాలలం దెల్ల నెంతయుఁ జాఁణలగుచు. 88

క. నాచేఁగఱచినలాగున
నేచెచ్చెరనాడి యూడి యీదొర చెంతన్
నీచేరికయె ఱెఁగనొకం
డౌ చక్కనినీను నుడులయందలి జాడన్. 89

ఆ. ఆతఁడేగుదెంచి యాతయు నెఱిఁగించి
చనినయంతనతని సకియ నెల్లి
చేకొనరు దేరఁ జెల్లునంచాడంగఁ
దడయకటకనిచిన దాన ఱేఁడ. 90

క. నలుఁడొక్కఁడుఁ దక్కఁగఁ జె
న్నొలయఁగ నన్నూఱుకోసు లొక నాఁట నరాఁ
గలఁడే యొరుఁడని యెడఁగోఁ
దలంచిదీసి నొనరిచిన దాననుగంటే. 91

క. కొంకక యీదారయొద్దకె
యంకిలెడలి జన్నిగట్టునంచితినింతే
యింకొక్కఁడైన నిక్కడ
కింకొక్కఁడె రాఁడె ఱేఁడు లిందఱిలోనన్. 92

ఉ. అందఱఁ జూడ నీయడుగులంటెద నాయెడ నొక్కకీడునం
జెందదటంచు నొండొకటి చేసెదఁ గుట్టల నెత్తికొట్టెదన్
దందనలేక యీత్రోగల దాయయు నీనెఱజింక రాతు నీ
చందురుఁ డీల్గఁజేయుదురు జానుచెడం జెడుచేఁతలుండినన్. 93

క. అనుచున్న తఱినిజదలునఁ
గనుఁగొనఁగారాకయుండి గాలియునియె ది
గ్గున నందఱునూకొనఁగా
నెనలేనిగులుకు టెలుఁగున నేలికతోడన్. 94

క. ఇటులనఁదగు నేగరితను
గటగటతోగచూడ నేనుఁ గడలికొడుకు నొ
క్కటనొక్కక యేఁడొగిఁగా
చుటరొఱుఁగకయున్కినంటి చులకనినుడులన్. 95

గీ. అప్పుడైకొనునదియని యూనయుడిన
నంతఁగురిసె జేజేపట్లయులరుసొన
లలరి చల్లనిచిఱుగాలి యొలసె నెసల
నీడతెఱఁగంటి యునునంత నెమటనిలిచి. 96

సీ. ఎల్లరకునుదన్ను నెఱిఁగించి యెల నాగ
క్రొత్తడిసుద్దులుఁ గొఱఁతలేక
నలునియందున్న గాదిలియు నెఱింగించి
కొనియాడ నాలించి తనరినలుఁడు
కర్కోటకుఁదలంచి కోర్కులుచేకూఱ
నాతఁడిచ్చినచేలఁజేతనంది
తాల్చినయంతనె తనతొంటిసొగసూనఁ
జక్కనైనక డాని చాయగలిగి
నూఱురాచిల్కకొాతుల నోంచుసొగసుఁ
దఱుచుసిరాఱు చీకఁటిబాయలనగు
తేజఁదులకించునలుఁగాంచి తెలిసికలికి
సంతసిల్లెను నెయ్యురుసంతసిలిరి. 97

ఆ. ఇట్లుకూడునలునకింతికి నెలయల్లు
కాఁకతొడనేగెఁ గసటునోడల
నగలతెగలతోడ నవలెత్తెఁగోర్కులు
తొంటియునికితోడదోసఁగులడఁగె. 98

ఉ. అంతయునాలకించి నెనరారఁగ నాత్రథకైశికుండు తా
నెంతయుఁ జీఁకటింగడచి నిండగుచందురుఁ గూడియున్నచే
యింతితెఱంగునందవరు నింతినిగన్నుల నిండఁగాంచిలో
నొంతయుసంతసిల్లి నగరెల్లెడలం గయిసేయజేసెనన్. 99

క. గొజ్జంగిసిటసరిశిరి
యజ్జగతులు కస్తురియిడి యందఱియిండ్లన్
గుజ్జుటనంటులు, గట్టిరి
రొజ్జలుసేసలొగి జల్లిరొక్కటఁదలలన్. 100

క. ఉల్లెడలెల్లెడఁగట్టిరి
చల్లిరి సెలకాలదారి చక్కని తెలిరా
తెల్లనియిసుకలుగుండెలు
తల్లడిలన్ డక్కలడరెఁదఱుచుగ గాణల్. 101

క. కొదలొనరించిరియన్నియుఁ
జదలంటిననాలకించి చయ్యననలునిం
గదియఁగనేతెంచియయో
ధ్యదొరయుఁడఱియైఁగాంచి తద్దయునానన్. 102

క. నిన్నెఱుఁగక యున్నాళ్ళను
గొన్ని దలకచేఁతలేనుగొంటిని నీచే
నన్నియు నెదఁజొరనీయక
క్రన్ననసైఁచునదియించుఁ గడునడుగుకొనక్. 103

గీ. అట్లుచేసెదనని దొరయానతీయ
నలరినలుచేతఁ దుదయంటునట్లుగాఁగఁ
దత్తడులఁదొలు నెఱగట్టుఁదానెఱింగి
యతఁడయోధ్యదారిజనియెనంతనిచట. 104

క. నలుఁడొకనెలనాళ్ళోగిఁదొలు
దొలుతందానచటనుండి త్రొయ్యలినఁగుం
దలిదంట్రులయొద్దనునిచి
కలఁగని నెఱగట్టిగుండె కలుగుటకతనన్. 105

క. ఆ తత్తిన్ గ్రక్కున నెఱ
హత్తులుతగఁ గవిసివచ్చి యలమని సొగసా
తత్తఱలీ కైదులు
కత్తులుగలయాఱునూఱు కాలరులోకటన్. 106

సీ. తనకుఁదోడయిచను దేరఁదరలియతఁడు
నిషధకేతెంచితన దాయ నెరయఁగాంచి
యంచదొరకొతుత్రాల్గంటియం దెదారల
నెనయుగులుకు బెలుఁగునట్టులనియె. 107

క. నాయిల్లాలినిరోయిగ
నీయెడఁజూదాన నిడుదు నేలెడు నేలన్
రోయిగనీకుంచఁగఁదగు
నీయెదకదితెన్స్వమేని నెఱిచిగురొత్తన్. 108

క. అరయంగానీకయ్యది
సరిగాదనిత్రోఁచెనేని చక్కంగా జె
చ్చెరఁగలనంగెలిచెద ని
న్నరుదగు తేరెక్కి నిలిచి యనికింజోరా. 109

ఆ. గండుగలయతనిదికాదె యెందును నేల
కలన నేఁడు నిన్నుఁగండడంచి
నేలయెల్ల నేనె యేలెద నీకేది
తెఱఁగొయిందుసరగఁ దెలియఁజేయు. 110

చ. కలనికిడాయరాదె యనఁగా నతఁడించుక యూరకుండి యా
నలువనిలోన గెల్తుననుచ్చిక నాకిఁక లేదు లేదు నేఁ
దొలుతటియట్ల యీయెడను దొయ్యలిఁగెల్చెద నక్షసాళ్ళచే
నఖిఁకిక నేలయంచు దరనారసి యాయనతోడ నిట్లనున్. 111

క. నేనోడితి నేనిండఁగ
నీనేలయొయిత్తునీకునిదియట్టిద చేఁ
డా నీకోడుటగల్గిన
యేనిన్నిరాణిచాకు నీఁజనునెట్టులున్. 112

క. అనియొకకొంటరిచే సా
ఖ్యనుఁగాయలుఁ దేనొనర్చి లొడలొడ నెదలోఁ
దనచదురున నెలఁతవొరకె
ననుకొంచును నాడియోడె నందఱుజూడన్. 113

గీ. తిరుగజూదాననందఱుఁ దెలియఁ జూడ
గెలిచితననేలయంతయునలుఁడుగొనియెఁ
దనదుతేజెల్లకడలనుదనరినిండ
సాదులెదలందుఁ దద్దయుసంతసిల్ల. 114

ఆ. అట్లుదాయనోడిచి యాతనిఁదనజెంత
కల్లఁజీరియిట్టులనియెనలుఁడు
చేరినిన్నునాదు చినతండ్రికొడుకంచుఁ
గాచినాఁడనొండుకడకునేగు. 115

క. కలియుల్లోఁ జినకతనం
గలంగియోడితివిగాక కన్నెత్తికనం
గలరే నన్నెరులయ్యెది
తొలుతటి నీగండటంచుఁ ద్రుళ్ళుంజనునే. 116

క. అనియనిచిన నతఁడిచ్చం
జనియెనలుండు నిటనేలనరి జూదానం
గొనియుండుటదెసలెల్లను
దనియంగదిసిననలరుచుఁదటుకొననిచటిన్. 117

సీ. తల్లిదండ్రులయానతి నల్లఁగాంచి
యచటిచుట్టాలనందఱ నలరఁజేసి
లెక్కలేనట్టిక్రొత్తులు లెంకదండు
తోడనరుదేరజిగిచాయదొలఁకుచుండ. 118

క. కొడుకును గూతుందోడ్కొని
యుడుగరలిల్లాం డ్రొసంగనొకచేఁగొంచుం
గడుచక్కని తేరునను
కడకేతెంచె నెలనాగ కలకల నగుచున్. 119

ఉ. ఆకరణి న్నలుండు తనయాలును గుఱ్ఱలగూడి హాయిగా
నేకడఁజూచెనేనిఁదన యేత్తఱియెల్లరు నూఱునోళ్ళతోఁ
గైకొనికోర్కి క్రేళ్ళుఱుకఁగాఁగొనియాడఁగ సేంఫ్లు చాలఁ దా
నీకొని నేలయేలె నొకఁడేనియుతేఁడెనగాకయుండఁగన్. 120

క. అనినలుకత యీతెఱఁగున
నొనరంగొంతి తొలిచూలి కొయ్యననెఱిఁగిం
చినలునియట్టులెయతఁడును
జెవసినకడగండ్లకోర్చిసిరులొందంగన్. 121

గీ. ఆడి జడదారితనదారి నరిగినంత
నిచట గుదెదారికొడుకును నెపదలోన
నదియెతలఁచుచుఁదలయూచియచ్చెరయనుచు
సారెగొనియాడితద్దయుసంతసించె 122

క. ఈవలుకలయుడుగునతఁడు
దానాలించెడునతండుఁదగఁగనునతఁడున్
జానగు కొడుకులఁగూఁతుల
తోను సిరులఁ గొల్లలాడుదురు లగ్గనయన్. 123

క. నునుగుత్తుకఁ జేదిడుకొని
తనరుచునున్న తెఱగంటి తలకట్టా లోఁ
గనలెనయహా త్రిరక్కసు
ననిలోఁ సంగూల్చి క్రచ్చులందినదిట్టా. ! 124

మణిగణనికరము. నెలతల నలరుగ నెలకొనునతఁడా
త్రొలికడదారకలు దొరకుతుకదారా
కొలిచెడుసిరిదొరకొలలడఁచులీ
కలననెదిరి యెదఁగలఁచు నొడయుఁడా ! 125

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర కందుకూరివంశపయః
పారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర సుజన
విధేయ వీరేశలింగనామధేయ ప్రణీతంబైన శుద్ధాంధ్ర
నిరోష్ఠ్య నిర్వచన నైషధంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము.

సంపూర్ణము.

# రసికజనమనోరంజనము.

## ప్రథమాశ్వాసము.

చ. సిరివిరిబోఁడిఁగూడి యొకచేతను నాతుకచేతులూఁతగా
గరుడిని నెక్కుచోఁగలికి కమ్మవికీల్జడ సంచుగాంచి యు
గ్గరుడియు నల్లత్రాఁచనుచు గ్రక్కున ముక్కున నొక్కనొక్కఁ దాఁ
జురచురఁజూచి కేలుఁగవఁ జుల్కనదల్చెడు వెన్ను నెన్నెదన్. 1

సీ. పక్కిగుజ్జుపురౌతుఁ బక్కిగుజ్జుపురౌతు
దాయయుఁగొడుకునై తళుకుగులుక
కొండకానుపుఁ బ్రోడ కొండకానుపుఁబ్రోడ
బావయునాలునై బలసివెలుఁగ
కడలిపుట్టువయును గడలిపుట్టువయును
మేఁతయునగయునై మెఱపునెఱప
కందునితండ్రియుఁ గందునితండ్రియుఁ
దూపునుగన్నునై యేపుమాప
పత్తిజవరాలుకూళల మొత్తుకేలు
హత్తితోలును దోరంపుమిత్తిఁదోలు
క్రొత్తవాలును నల్లనికత్తుకయును
గలుగు గిత్తతత్తడిరౌతుఁ గొలుతునెపుడు. 2

చ. పలుకులచానవేనలిని బాఱఁగనుంగొని నల్లమబ్బుగాఁ
దలఁచికలంగిపాఱఁ జనుదానిని జెల్వపుటంచఁగాంచి నే
ర్పలవడఁ జేయి దామరలనల్లన చేరఁగఁబిల్చి మవ్వన
న్నలువ యొసంగుఁగాత విడనాడక నాకుఁగడింది కోరికల్. 3

కం. కొబ్బెరకాయల మెక్కుచు
నిబ్బరముగఁ గొల్చువారి నెటఁ బ్రోచెడియా
గిబ్బవజీరుకొమారుఁడు
గొబ్బున నొడఁగూర్చుగాతఁ గోరికలెలమిన్. 4

చ. కలుములచేడెకోడలు నిగారపుఁ జెల్లని మేనిచాన క
ల్కులసిరికాటపట్టు బలుకోరికఁ బెన్మిటిమోముదమ్ములం
దలరెడుకొమ్మ సోయగపుటుంచపయిన్నడయాడుచామ యా
నలువవెలంది నిచ్చలును వాలుకఁగాపురముంచుఁ గావుతన్. 5

వ. అని వేల్పులనెల్లం గొనియాడి. 6

గీ. నన్నయఁదలంచి తిక్కననెన్ని పిదప
నెఱ్ఱప్రగ్గడఁ గొనియాడి యెల్ల తెలుఁగు
కబ్బపుంగూర్పరుల మదిగారవించి
యొక్కటను బెద్దలను నెల్ల మ్రొక్కిడుదు. 7

గీ. నిండునెమ్మను విశనాడి పుండులకును
నిక్కనీఁగలవగమారి నీరువిడిచి
పాలుగొనునంచ తెఱఁగూని వట్రులుమీరు
తప్పులఁ దొఱంగి నెనరుంచి మెప్పుగొనుఁడు. 8

వ. ఇట్లు వేల్పులం దొల్లింటి తెనుంగు కబ్బంపుఁగూర్పరుల వేర్వేరఁ బేర్కొని నానేర్పుకొలంది నొక్కయబ్బురంపుఁ దెలుంగుకబ్బం బొనఁగూర్పం దలంచి మొదల నాకొలంబు తెఱంగించుక వక్కాణించెద. 9

సీ. జగములఁ గలిగింప నెగడింపఁ బొలియింపఁ
గల వెన్నుఁడే వేల్పు కన్నతండ్రి
యొలమి నెల్లరకును గలుములు కలిగించు
సిరిచెలియే వేల్పు చెలఁగుతల్లి

చెలరేఁగియంజలి వలపించి స్రుక్కించు
నసమనేత్రుఁడే వేల్పు నరుఁగుఁడోసు
చదువులకెల్లను గుదురగుచు వెలుఁగు
వెలిచానపేఁ వేల్పు వెలఁదిమిన్న
యట్టినలువ వంగడమున నమరఁబుట్టె
రాజలింగమనంగను రహిఁ దనర్చి
యతఁడు బేసికన్నులవేల్పు నందుఁగలుగు
బత్తికలిమిని సరిలేకవన్నెమీఱె. 10

గీ. ఊళ్ళుఁబల్లెలు నేలుచు నుండియాతఁ
డెల్లవారలఁ దనుపుచు సిగిచేత
వాసిగనిగాంచెను గొలంబువన్నె కెక్కఁ
జంద్రమౌళియను కొమారు సాటిమీఱ. 11

క. అక్కమయను నెలనాగన్
మక్కువతోఁ బెండ్లియాడె మఱియాతఁడు మున్
ముక్కంటి గట్టుకన్నియ
నక్కఱతోఁ దాను బెండ్లియాడినకరణిన్ 12

క. వీరేశలింగమను కొడు
కారయఁగాఁ జంద్రమౌళి కరుదుగఁబుట్టెన్
జేరి మును పాలకడలికి
గారాబపుఁజందురుండు కలిగినమాడ్కిన్. 13

ఉ. ఆతఁడు విద్దెలంగరము నందఱచేతను మెప్పుపొందె మే
ల్నేతల నెందునున్నవతులేక చెలంగి కరంబుమేటియై
ప్రాతిగ నేల తెండ్లకషఁ బ్రగ్గడయై కడుఁ బేరుపొంది తా
నేతఱి మేటిదేవరని యెంచుచు లింగనిమానెఁ గొల్వఁగన్. 14

గీ. కొమరులనుగాంచె నాకందుకూరి కొలఁపుఁ
బెద్ద వేంకటరత్నమన్ పెద్దకొడుకు
వెనుకఁ జిన్నిసుబ్రహ్మణ్యమను కొమారు
నలరుశనచానయైన కామమ్మయందు. 15

క. అందల సుబ్రహ్మణ్యుఁడు
పొందుగ నెల్లరును దన్నుఁ బొగడఁగసిరులం
జెంది వెలిఁగెఁ దనసరివా
రందఱిలో మిగుల నన్నయానకుఁగోనై. 16

గీ. మున్నుకడలి రాకన్నియఁ జెన్నుమీఱ
వలచి వెన్నుండుగైకొన్న చెలువునోపఁ
బున్నమయనంగఁ దనరారు పొలతిమిన్న
నబ్బురంబుగఁ బెండిలియాడెనతఁడు. 17

క. అయ్యిరువురకును సంతస
మొయ్యనఁజేకూఱ నేను నొడవితి మదిలో
నెయ్యమున న్నిలుపుము మరు
నయ్యను వీరేశలింగమనఁ జనుచుందున్. 18

సీ. ఏమేటియనుగుఁ బొందామరల్ తొలివేల్పు
మొదలగువారలు పొందఁజాల
రేవేలుపులవేల్పు నెదయందుఁ బాయక
కలుములకొమ్మ నిచ్చలునునుండు
నేదిట్ట బొజ్జలో నెల్లజగంబులు
నొకమూలఁబొందుగా నొదిగియుండు
నేపెనుదంటపేళ్ళై దురపుటొరెంపుఁ
దపసిలోనగువాఁడు తలఁతురెపుడు

సట్టివెన్నుండు కనికరముట్టిపడఁగ
నాదు డెందంపుఁ దమ్మిలోఁ బాదుకొలిపి
నాదుకబ్బంబుఁ దనకప్పనంబు సేయు
తలఁపు పెఱవేలుపుల సేరిఁదఱియకుండ. 19

క. అట్టి కనికరపుగనికిన్
గట్టిగ వేలుపులనెల్లఁ గాచుచుమదిలోఁ
బుట్టినకినుకన్ రక్కసి
జెట్టులఁదునుమాడు సిరుల చేడెమగనికిన్. 20

క. నెట్టనగొల్లపడంతుల
బట్టలుదొంగిలిన చుట్టువాల్దాల్పునకున్
బొట్టెలఁ జంపఁగడంగిన
కట్టిఁడిముద్దియఁ దునిమిన కఱివేల్పునకున్. 21

క. క్రాలెడునాలున్ బంగరు
పాలున్నఆచుట్టువాలుఁ జాలఁగ నలుపౌ
డాలుం బాలకడలినడి
ప్రోఁలుక సరిమాలు మేలుఁబొనఁగెడు దొరకున్. 22

క. మేటికిసిరియెద తామర
తేఁటికిగరువంపుఁ బొలసుదిండుల దళవుం
గాటపుఁ దెమ్మెర నెచ్చెలి
నీటికిఁ దెఱగంటి పక్కినెఱగూటికొగిన్. 23

క. ఎన్నికగను కవ్వడియా
లన్నకుఁ దొల్వేల్పు పొగరుటావుల మొకపుం
గున్నకుఁ జెన్నగుజేజే
మిన్నకు బలుగొల్లకొలవుఁ బిన్నకునెమ్మిన్. 24

తే. గీ. అప్పనంబుగ నానేర్చినట్లొనర్పఁ
బూను చిత్రాంగదయసంగఁ బొలుచునట్టి
మొలఁత పెండ్లి తెఱఁగు జనమేజయుండు
వినెడు వేడుక మదిలోనఁ గొనలుసాగ. 25

వ. వైశంపాయనుం గనుఁగొని. 26

తే. గీ. పెద్దయును మాకొలంబునఁ జేరువడిన
క్రీడియెట్లు చిత్రాంగద కేలువట్టె
వేడుకలుమీఱ నాలింతు వీనులలర
దాఁచకానతీవయ్య యోతపసిరాయ. 27

క. అనజడదాఁగియు జేనిం
గనుఁగొని సందియముతీఱ గౌరవమారన్
వినిపింపదొడఁగెఁ గవ్వడి
మునుముద్దియఁ బెండ్లియైన ముచ్చటయెల్లన్. 28

సీ. మగఱాల జిగితూల నగఁజాలు వగఁగ్రాలు
తెలిడాలుగలమేలుతిన్నెలమరఁ
జెనుగట్టులనరట్టు లనుబెట్టునునుగట్టుఁ
గొనితిట్టఁ గనుపట్టు కోటలడర
సలరమ్ముచెలువమ్ము లలిఁగ్రమ్మవెలిగ్రుమ్మ
మురిపెమ్మునెరనమ్ముముగుదలలర
నెన లేనిగొనబూని పెనుకోనలనుదేనె
తెరలానుదారలేని తేఁటులోలయ
నెచటఁగనుఁగొన్న నేనుంగులేపుచూప
నెల్లచోటులగుజ్జంబు లెసక మెసఁగ
ముజ్జగంబులఁగలప్రోళ్ళ మురువునవ్వ
యలరుచుండు నింద్రప్రస్థమనెడువీడు. 29

తే.గీ. ప్రోలిపొంబట్టు టెక్కెంపుగాలియడరి
ప్రాద్దుతేజీలనవ్వాలఁ బోవకుండ
నాపఁగాఁగాదె తనత్రేరికతఁడుకట్టెఁ
బాముగుంపులఁ జెలువంపుఁ బగ్గములుగ. 30

ఉ. చొక్కపుఁబైడిమేడలను సొంపగు పచ్చలమారుపట్టెలం
జెక్కినకప్పుటాలపని చిత్తరువ్రాఁతల పారువంబులన్
దక్కనటంచుఁ బట్టుకొన దగ్గరవ్రాఁకుల నుండుడేగచాల్
నిక్కుచు నంతదవ్వొగయు నేరక క్రమ్మఱివచ్చు నిచ్చలున్. 31

ఉ. ప్రోలికడాని మేడగమిఁ బొందుగఁ జెక్కినయట్టి పుల్గురా
ఱాలమెఱుంగు రంగులతెఱంగుఁ గనుంగొని త్రోవకడ్డుగాఁ
జాలెడుపచ్చికంచు నదఁజందురుఁడెంచియె దానిమేయఁగాఁ
దాలిచెసిత్తిఁగానియెడఁ దాల్పఁగ నాతనికిత్తియేటికిన్. 32

చ. నెలయరుదెంచి యుప్పరిగ నిద్దపుసోరణగండ్లు సొచ్చినన్
వెలఁదులు లేచిచూచి కడువేడ్కమెయిం దమకేలుదమ్ములం
దలుపులుమూయఁగట్టువడి తద్దయునేపట నేలనుండఁగాఁ
గలుగుటఁజుమ్ముపొల్చె నెలకట్టులనంగను నేలలెంతయున్. 33

గీ. తద్దయును వేలుపులతేని దాడికోడి
గుంపులనుగూడి పఱతెంచి కోర్కులలరఁ
గడలిడాగవచ్చిన కొండగమియనంగఁ
గదిసితిరుగు నేనుంగులగత్తయందు. 34

క. వీటనుగలగుఱ్ఱంబుల
గాటపువడికోడిగడ్డి కఱిచెనులేడుల్
మాటికివడఁకుచు గాలియుఁ
బోటరితనముడిగి యొక్కమూలంబడియెన్. 35

క. ఎప్పుడుఁబూవుందోఁటల
నొప్పగుతావులకుఁ జిక్కి యొగిఁ జలిగాడ్పుల్
తప్పక కాపురముండఁగ
మెప్పొదవఁగఁ జలువలచట మేకొనియుండున్. 36

చ. వలపులుమీఱనీఱములఁ బ్రాఁకుచుఁ దమ్ముల మొత్తపున్నిఱుల్
తొలుతను వెచ్చపెట్టి పువుఁదోఁటను మోవులుతావులాని పె
క్కులు గలిగింతలందనరి కొమ్మలనిమ్ములఁ గూడిపీటికిం
దెలదెలవాఱువేళఁ జనుదెంచును దెమ్మెరదంటయల్లనన్. 37

ఉ. వేలుపుమ్రాని క్రొవ్విరుల పెన్వలపుల్ గొని విన్ను వాఁకపైఁ
దేలుచు దానిచల్వయును దెమ్మెర తెచ్చియొసంగి చెమ్మటల్
దూలఁగఁజేయునిద్దురను దోఁగిమగల్ జవరాండ్రువేకువన్
హాళినిమేలుకాంతురట నచ్చరబోటుల వీణెపాటలన్. 38

చ. అలమెలదోఁట మొత్తముల యందలిమ్రాఁకుల పూవుఁదేనియల్
వెలువడి చేలకాలువల వెంబడిఁబాఱుచు నూరిపైరులం
బలువిడిఁ బండఁజేయఁగని మబ్బులుసిబ్బితి డాగనిచ్చలుం
బొలుపగుతావితో నగళునున్ బాగ లాడఁగఁజేయునెమ్ములన్. 39

చ. ఎనమఱిలేక ప్రాఁజదువులెల్లను నేర్చుటెకాని లాఁతిచే
తను దలకొట్లనొందెనని తామరచూలిని దూఱి వేయునో
ళ్ళను దుదముట్టఁగాఁ జదువులంగనుటొక్కటె రెండు నాల్కలం
జొనరఁగఁబాపతేని నగియుందురు ప్రోలిని నేలవేలుపుల్. 40

సీ. చెవులెకన్నులుగాక దవునేలదాల్చరుల్
పలునాలుకలులేని పజదొరలోక
పగవానిఁగనిపాఱి బలుకొండకలుగున
డాగనిపసిఁడిపుట్టంపుదాల్పు

లోఁగిఁబగల్ సేయని జగముమట్టంబులు
నడకఁదప్పనియట్టి పుడమిదాల్పు
లోక్కనిఁజేరని రొక్కంపుటొడయండ్లు
స్రుక్కి మైమఱవని చక్కనయ్య
లౌరయని యెల్లవారును నలరుచుండ
నలరుచుందురు తద్దయు బలిమికలిమి
నాఁడితప్పక సరిలేనిపాడిగలిగి
కొమరుపాయంపు నెఱరాచకొమరులచట. 41

చ. కలచెలి బిచ్చమెత్తుకొనఁగాఁగని యోరిచియున్నయూరునం
గులికెడు దాయపాల్వఱిచి కొండలపాలయి మూలఁబడ్డ జ
క్కుల దొరదూఱి వీటఁగల కోమటులొప్పుదు రెల్లనెప్పలుల్
కలుములనొప్ప నిల్లుకదలంబని లేక కడిందివేడుకన్. 42

చ. తెలతెలవోయి కట్టుకొనఁ దెల్లనిబట్టయె లేక మంచులోఁ
పలఁ దగుత్రాసుఁబోతనుచుఁ బల్మఱువెన్నునియున్న నవ్వియై
చెలువము జీరలున్ సిరులుఁ జెన్నెసఁగన్మరిమాదకల్గియ
గ్గలమగు వేడ్కఁబొల్తురటఁ గాపుకొమారులు పాఁడిపంటలన్. 43

తే. గీ. మేలిమి పసిండి నిద్దంపు మేడకొనల
నలరుఁబోఁడులు నిచ్చలు నాటలాడఁ
జూడనడ్డని నెత్తమ్మిచూలి చెప్ప
పాటు పెట్టఁడయ్యెను వేల్పుకూటువులకు. 44

ఉ. క్రొన్నెలతాలయుప్పరిగ కొప్పులనొప్పులు గుల్కుపాయపుం
గన్నెలముద్దుమోములను గ్రాలెడు మేడల దారినేగునా
వెన్నెలతేని నేర్పఱుప వేఱొకనేరుపుఁ దోఁచమింగ దా
వెన్నెలతేసలోనలువు వేలుపుపెద్దయొనర్చె గుత్తుగన్. 45

సీ. పసుఁగుత్తలలఁ బాలిండ్లుసొంపుగఁజేసి
యానల్పు కొప్పులనలవరించి
చిందమ్ములనుగొంతు లందమ్ముగాఁజేసి
యాతెల్పు నవ్వులయందుఁబెట్టి
మల్లెమొగ్గలచాలు మఱిపల్వరుసచేసి
యామెత్తన పెదివులందిమిడ్చి
మఱ్ఱిపండులఁ జిన్నిమడిమలు కావించి
యాయెఱు పడుగులయందమర్చి
నలువ యవ్వీటిబోటుల నలువుమీఱఁ
జేయఁబోలుఁగాకున్న నాసోయగంబు
వీసమంతైనఁగలుగదే వెతకిచూడ
ముజ్జగములందుఁగల పువ్వుబోండ్లయందు. 46

వ. మఱియు నవ్వీడు నేడ నీడులేని వేడుకలగూడిమాడి ప్రోడలయి జేనిఁగాన నేతెంచిన లాఁతివిలాతుల యొడయండ్ల కడవన్నె బెడంగు బంగరు మగఱానగల తెగలు ఱాపిడిందగిలి నాగిలి నిగనిగ జిగ మిగుల దిగువఁబోడియైకడుఁ బుడమింబడి యదరు కడిందియిసుక తెసక మెసఁగు తెరువులును నింతంతనరాని సంతసంబున బంతులుగట్టి రంతులుసేయుచు నొంతయువింతగాఁ బంతంబునఁ జేమంతిపూబంతుల షొంతకు గంతులిడు మేటితేఁటిదాఁటుల తేటపాటలనాటంబయి యురఁగెలంకుల బింకంపు గొఱవంక తెగలుగల కొలంకులును నీలిడాలు చేలలంగ్రాలు మేలిజెండాలచాలు గాలింగదలంబాదలు తగులున మొగిలుతెగలని నిగిడి మిగుల పొగరున మగిడి నెట్టనఁ గట్టిఁడి పుట్టనట్టులం జుట్టుముట్టి కిట్టి పట్టిబెట్టుగ నిట్టూర్పు లెడలం గట్టిగఁగొట్టి పట్టరాని కట్టలుకంబొట్టలు పగులంగొట్టు బెట్టిదంపుఁ బని కట్టిపెట్టి నట్టువంబుసలుపుదిట్టనెమ్మిపిట్టల నొప్పియొప్పులుగుల్కు—

రాచిల్కపల్కులం జెలువుగులుకు సింగారంపుఁ బోఁటులును హెచ్చుగ నిచ్చలు మెచ్చులుగుల్క నచ్చంపుఁ బచ్చలతిన్నెలఁ జెన్నుగనెన్న రాని తిన్నని పగడంపుఁ గంబంబు గుంపుల సొంపులునింపు పెంపగు కొలువుకూటంబులునుం గలిగి మావులుం దావులుంగలిగి యెల దోఁట పాటిని ముత్తెసరులు బంగారుతీఁగెలునుంగలిగి వరిచేలపొలిక సిరికాటపట్టయి పాల్కడలివడువునఁ దగవుకలిగియుం దగవులేక గోతులచే నొప్పియు గోతులు లేకయొప్పి కొల్లుండియుఁ గొల్లలేక కరంబు దంబుమీఱు. 47

. అప్పుడు యుధిష్ఠిరుఁడను
పువ్విలుతునిఁ బోలుఱేఁడు పొందుగ నేలున్
జవ్వనము బలిమికలిమిని
దవ్వులవారెల్లఁ దన్నుఁ దద్దయుఁ గొలువన్. 48

. కమనొప్పుతనదు బాగవుసిరి పేటికిఁ
గడలికొండొక పిల్లకాల్వగాఁగ
గ్రాలుతనయసంపుఁ బాలవెల్లికి ముజ్జ
గంబులు దీవులకంబుసూపఁ
దనదుమార్తురకును దట్టంపుటవిచా
లిఱుకైనచాలని యిండ్లుగాఁగఁ
దనదునిండారైన తలవాకిలియెచూడ
నేతెంచుదొరలకు నిమ్ముగాఁగ
నొప్పుఁ గాఁపులకెల్లను నోముపంట
పాఱులకు సాదులకు గొప్పపట్టుకొమ్మ
బీదసాదలపాలిటి వేల్పుచెట్టు
జగములందెల్ల మేటి యజ్ఞమునికొడుకు. 49

గీ. అడుగువెట్టిన మారుతుం డడుగుపట్టు
మైమఱువిడినఁ జగతుండు మై మఱువిడుఁ
గోమరు దళుకొత్తు నారాచకోమరుఁబోలు
జేఁడుగలఁడె యెందును వలజేఁడుదక్క. 50

ఉ. వెండియుఁ బైడియుం బుడమివేల్పుల కెన్నికమీఱఁ దెచ్చి కై
కొండని జేఁడొసంగఁగని కుందుమది న్వలికొండవేలుపుం
గొండలుగట్టువిల్తుఁ గడుఁగొల్చిన నిల్లును విల్లుఁగాఁగొనెన్
మెంతుగఁగొల్చిరే నతఁడు మేకొనియేలఁడె యెట్టివారలన్. 51

చ. జగమునఁబుట్టి పుట్టకయె సారెకనుంగొన నెఱ్ఱవాఱుచుం
బగ లొనరించుచుం బయలుప్రాఁకుచు నిల్కడలేక యెప్పుడుం
దగఁజెరలాడుచుంబుడమిఁదద్దయు వేఁడిమిచూపి త్రాగనీ
రగపడకుండఁజేయు జమునయ్య యహో సరియౌనె తేజునన్. 52

చ. అతనియసంబు ముజ్జగములందును దానయి యెల్లవారలం
జతనముమీఱ లిబ్బిదొరసంగడికాండ్రను వెన్నునన్నలం
గొతుకకచేయమాఱ్పడుటకుం గుఱుతుల్ తగనఱ్ఱున న్మొలన్
సతమును వారుదాల్చిరి విసంబును వల్వయున న్నెపంబునన్. 53

క. కలిమియు నడఁకువపెంపును
బలిమియు నోరిమియుఁగల్గి వఱలెడు దిట్టల్
నలుగురతనికిం దమ్ములు
గలరు వడముడియును గ్రీడి కవలు ననంగన్ 54

తే.గీ. అన్నయానతి జవదాఁట కనుఁగుఁదమ్ము
లనువుపఱుపఁ దమ్ములతలం పన్న నెఱపఁ
బాలునీరునుఁ గలసినబాతి వార
లొకరొకరిముద్దు చెల్లింపుచుందురందు. 55

చల్లఁదనంబును జెల్లివిగల్గుట
జాబిల్లికోలవమాట సాటుచుండఁ
జక్కఁదనంబును మిక్కిలి పరువంబు
వేఁగంటికొనుకొల వెల్లడింప
నక్కటికంబును ననదలఁగాచుట
వెన్నుని చెలిమాట విన్నవింప
ననమునువడిఁగల్గి యలరుటమిన్నేటి
ముమ్మనుమండౌట వ్రాని తెలుప
నన్నమాటయన్న నగుదాఁటక పిన్న
పెద్దయంతరువుల పెంపుదెలియ
మేటి క్రీడికెవరు సాటి ముజ్జగముల
నతనికతఁడె సాటియగునుగాక. 56

ఆతనిసోయగంబు చెవులార వినంగనుఁబట్టి ముద్దియల్
చేఁతలఁదొట్రుపాటెనయఁ జెల్వునివాతనిగాఁగ నెమ్మదిన్
బ్రాఁతిగనెంచి కూడుదురు బాపురె నిచ్చలుమాచికేని యా
నాతుల చేఁతలంగలుగు నానలుకందుఁడు కొల్లవెట్టఁడే. 57

ఆతండొక్కఁడు ప్రొద్దువోక యొకనాఁడందంపుఁ బూఁదోఁటలోఁ
జేతుల్ చేతులు సేర్చికొందఱుచెలుల్ సేమంబునన్వెంటరా
లాఁతుల్బారులుగట్టి చెంగలువ కేళాకూళి లోద్రోవలన్
వాతోడై చనుదేరఁ గ్రుమ్మరితగన్ జాబిల్లిఱాతిన్నెపై. 58

కలయంగఁబన్నీరు చిలికినకురువేళ్ళ
వీవనలొక్కండు వీచుచుండఁ
బచ్చకప్రపుఁబావి మెచ్చుగుబులొక్కను
పండాకుమడుపు లొక్కండొసంగ

ముత్యాలకుచ్చులఁ బొదలుచిత్తరువ్రాఁత
కెంబట్టుగొడుగొక్కఁ డెమ్మెఁ బట్ట
జిలుగుజరీచెల్ల తలగడతోడక్రిందఁ
బదిలంబుగనొకండు కుదురుపఱుప
వలపుగొలిపెడు చిఱుగాడ్పు లొలయుచుండఁ
గెలనికొలఁకుల తేఁటులు పలుకుచుండఁ
జెలులతో ముచ్చటల్ సల్పు చెలమితోడఁ
జెన్నుమీఱంగఁ గూర్చుండి యున్నయెడను. 59

సీ. వేల్పురాయఁడు తనబిడ్డయొద్దికిఁ బంపు
పొలుపొందు పచ్చలబొమ్మలనఁగఁ
బ్రోలిపెక్కువుఁ జేలగాలిని నేలపై
గూలు జేజేచెట్లకొమ్మలనఁగఁ
బ్రొద్దుమాపులు మేయఁబోజాతి పుడమిపైఁ
బడు పచ్చిగడ్డిజొంపంబులనఁగఁ
బువుఁదోఁటగవ్వడిఁ బొడఁగాంచి మరుఁడంచుఁ
జేరుపూవిల్తు తేజీలనంగఁ
జిలుకలొకరెండు ముద్దులుచిలుకుచుండ
దిన్నెపై నున్న యెకిమీని కన్నుదోయి
విందుచెందంగ ముందఱ నందమొందు
పొన్నగున్నకు మిన్నునఁదిన్నడిగియె. 60

క. ఆకై వడిడిగి కొండొక
ప్రాఁకునఁ గూర్చుండిలేచి మగుడని మదితో
నాకవ్వడికన సొగసుల
ప్రోకలనం జిల్కలల్లఁ బుడమికి డిగుచున్. 61

చ. ఈమగని పేర్కొటోడ మనమోహితి యింతకుముందు త్రోవలో
నెడసనుకొన్నదాని కిత్రఁజేతగుఁ గన్గొని ముచ్చటాడి తే
వెడలుట మంచిమేలుగ జవేయని యాఁడొకచిల్క పంతసం
బడరఁగఁబల్కెఁ గవ్వడికి నల్లవిసంబడఁ దోడిచిల్కతోన్. 62

సీ. అట్లు నేలకుడిగ్గి యాతండు గన్గొన
మురువుఁజూపుచుఁ గొంతపొంతెమెలఁగి
త్రోలసంపఁగిచెట్టు వాలుగొమ్మను వ్రాలి
చూడ్కికింపును సొంపుఁజూపుచుండె
నంతవివ్వచ్చుండు చెంతఁజిల్కలఁగాంచి
రాచిల్కలార మీరలనుకొన్న
దెయ్యది త్రోవలో నెవ్వనితో ముచ్చ
టింపఁగావలెనిందు నెందులకును
మీరలేపని కరుగుచున్నారలిప్పుడు
పయన మొకయింత గుదియించి పలుకరైన
నదియుమాకుఁ జెప్పఁగవచ్చు నదియొయైన
నించుకంతనిలిచి వినిపింపవలయు. 63

క. ఇందఱుముందఱ నిందది
పొందుగఁ జెప్పంగమీకుఁ బోలనిదైనన్
సందడిడిందఁగ నాతని
నెందైనఁ గొనిచని ముచ్చటింపఁగఁ జెల్లున్. 64

క. మీయుందడము చందము కం
దోయికి విందు గొలుపుచును దొందరనొందం
జేయుచునున్నది మీపొం
దేమొడ నెడఁ బాయజాఁతురే యెవరైనన్. 65

గీ. తడయ మీకునియ్యెమైనఁ జెడునొయనుచు
నిపుడు మిమ్మింతగా వేగిరింపవలసెఁ
గాని మీచెల్వ కన్నారఁగాంచుచున్న
నెంతసేపైనఁ జూడనే యిచ్ఛవొడము. 66

చ. అనవిని చిల్కపల్కు నిటకారయ మేమరుదెంచుటెవ్వరిం
గనుఁగొని మాటలాడనయ ! గట్టిగ దేవరవారితోడనే
మనవియొనర్ప వచ్చితిమిమామదిఁగల్గినదెల్లఁ బైనముం
జనుటయె కర్జమైనఁ జనఁజాలము నీకొలువింతసేయఁగన్. 67

క. ననుమీరడిగిన దంతయు
వినుఁడిఁక వినుపింతుమీకు వేడుకమీఱం
గను మంజువాణియందురు
నను నాచెలియె మృదువాణినాఁబడు నిదియున్. 68

సీ. చిత్రవాహనుఁడనఁ జెలఁగుచుండెడుతేని
వినియుందురాతని వీటనుండి
పలుకుచేడియఁజూడఁ దొలివేల్పు జగమున
కేగుచునున్నార మెలమితోడ
తెక్కలునిమురుచు మక్కువవెలిచాన
చక్కరతినిపించు చక్కఁజేర్చి
తనబిడ్డలుగనెత్తి తడవుగనిన తల్లి
వలెఁ బెంచుచుఁదనంతవారిఁగాఁగ
నొద్దఁగూర్చుండఁబెట్టుక ముద్దుచేతఁ
జనువుమీఱంగ నామెయె చదువుచెప్పి
చక్కఁ దిద్దుకొనియెఁగానఁ జదువులెల్ల
నొనర నచ్చేతిలోనివై యుండుమాకు. 69

సీ. అదియటుండనిండిఁక వేగనరిగి యచటఁ
బల్కుపూబోఁడిఁబోడఁగాంచి పల్కులాడి
మరలిరావలెఁగావున మాకునిపుడ
సెలవొసంగుము పోయివచ్చెదమటన్న. 70

వ. ఆవలంతి చిలుక మేలుబంతుల కాతఁడిట్లనియె. 71

గీ. తొలుతనేలకుడిగ్గుచుఁ ద్రోవలోన
దవ్వులను మనమనుకొన్న దానికితఁడె
తగును జెలియరో యంటివి దారిలోన
నేమిచెప్పుకొంటిరి దేని కేనతగుదు. 72

సీ. అయ్యదిటువంటిదనిచెప్ప ననువుపడినఁ
గొఱఁతవెట్టక యానతీఁగూడుననిన
నలువలంకులుఁ దిలకించి చిలుకకలికి
కలికిపలుకుల వలపులు చిలుకఁబలికె. 73

సీ. మంతనంబున మాటాడు మాటయదియుఁ
బలుకవచ్చునె యౌనుగా మంచితఱియు
నెవరుపెఱవారు లేరుగా యిందులోన
నన్నమనవారలెగద యీయున్నవారు. 74

వ. అనిన నతండు. 75

గీ. కలికిచూపునఁ గొలువెల్ల గలయఁజూచి
నేకతముగోరు నన్నగా నెల్లరేఁగి
చూపుతోడన వడిలేచి చుట్టుచున్న
తోడివారలు దవ్వులఁ దొలఁగిచనిరి. 76

వ. అంత మఱింత చెంతకుంజరగి తేనిమొగంబునన చూపునిలిపి ముద్దులు
గులుకు కలికిపలుకులు వీనులకు విందుగొలుప నాచిలుక యిల్లన నిట్లు
చెప్పందొడంగె.

మ. తొలుతం జెప్పితిఁ జిత్రవాహనుని నీతో నేనిటన్ వానికిన్
కలదో చేఁడె కొమారితె యొక్కరితె యాక్రాల్గంటి నీ నేలలో
పలఁ జిత్రాంగదయంద్రు దానిచెలువా వల్కంబువుబోఁడియుం
బలుకంజాలదనంగ నేటికిచటన్ మాబోంట్లవాక్రువ్వఁగన్. 78

గీ. కలువకంటి సింగారంపు గడలియందుఁ
గ్రాలుతా బేళ్ళఁ జిందంబుమీఁలు మొసలి
కవయు సనఁగ నొప్పారిమీఁగాళ్ళు గొంతుఁ
గన్నుఁగవయును బిక్కలుఁ గరము వెలయు. 79

గీ. వెలఁది కమ్మవిల్తు విరివిల్లు కాఁబోలుఁ
గాకయున్న నేలగలుగునడుము
ముత్తెములను వేర ముద్దులుగుల్కెడు
వ్రేళ్ళసందియాన వాళ్ళు మూఁడు. 80

చ. నిలుకడగన్న క్రొమ్మెఱుఁగు నిక్కపుఁజేఁతలు పూఁకిమొల్లెషన్
మెలఁగుకడానిబొమ్మ నును మేనున గమ్మని తావులీను పు
వ్విలుతుని పూవుములికి తెలివిష్పుచో కాటపుఁ గన్నదోయికిన్
బెళుకిడు తెప్పపాటుగల వేలుపు ముద్దులగుమ్మ యారయన్. 81

సీ. వెండికొండదొరయా వెలఁదుక చనుదోయి
వలమురిమేటి యాకలికిగొంతు
రాయంచపయిదిట్ట యాయింతి నెన్నడ
తమ్ములచుట్టంబు కొమ్మకేలు
వలపులజేఁడు లానెలఁతుక పెన్నెరుల్
చందురుమామ యీచానమోము
పాములయొకిమీఁడు పడఁతుకనూగారు
తెఱగంటిదంట లా తెఱవకన్ను

చిటులువేల్పుల బోంతియై యొప్పుచున్న
కొమరుంబాయంపు ముక్తియుం గూడంగల్గు
మేలుసముకూడెనేని యోనేలజేఁడ
కోరు కోరికలెల్లఁ జేకూఱుటరుదె. 82

గీ. తలిరులింతియొడలి మెత్తదనముకోడి
యొడలు లేనట్టివానికే యీఁచలయ్యెఁ
దొడరి మేనుంగు లెలనాగ నడకకోడి
నడకతప్పిన కొండలకడను జేరె. 83

సీ. వాలుమించును మించువాలును నదలించు
మెలఁతుకకన్దోయి మెఱుఁగుటారు
వింటిబెళ్కును బెళ్కువింటినినదలించు
నాతుకకన్బొమల్ నడుముతీరు
తమ్మికెంపును గెంపుఁదమ్మినినదలించుఁ
బడఁతుకవాతెఱ యడుగుదోయి
మెఱుఁగుబంతిని బంతిమెఱుఁగునునదలించుఁ
గన్నియనెమ్మనుఁజన్నుదోయి
వెలఁది పోయంగబేమని విన్నవింతు
నచ్చరలయందు జక్కులమచ్చెకంటు
లందుఁజలువరాకన్నియలందు నెందు
గనియు వినియునెఱుంగ నీకలికికీడు. 84

ఉ. చందురుమామ తమ్ములును జాపమొగంబునుబోల ముంపఁగాఁ
గందును మోమ్ముఁబాపుకొన గాల్కొనితామరసాటివచ్చె నె
మ్మిందగవేఁడివేల్పు నెఱమెప్పుల నిల్కడలేకకుందు నా
చందురుఁడీసువచ్చుటకుఁ జాలక మాఱుతుఁడయ్యె దాసికిన్. 85

క. ఎలనాగ వాలుగన్నులు
కలువలనుచుఁ జేరు తేఁటిగములనదల్పన్
దెలిచాన నడుమనుంచిన
యలరెడు సంపంగిమొగ్గయన ముక్కమరున్. 86

శా. నేలంగల్గు పులుంగులెల్ల నెపుడున్ జెల్వారఁబల్కంగ నే
నేలా పల్కఁగ నేరనై తినని యెంతేఁ గెంపుకన్నుల్గలుతా
లోలోనందలపోసి నేర్చి నవలాలోఁజేరి కాదంటిరే
నేలా కోయిలపల్కులంద్రు వినువారెల్లం బుపుంబోఁడికిన్ 87

చ. కలువలు లేళ్ళు వాలుగలుఁ గాటుకపిట్టలుఁ దేఁటిచాలుఁ దూ
పులుఁ దెలిదమ్మి తేకులును ముత్తెపుఁజిప్పలు మంచుగ్రోలు పు
ల్గులుననఁ బొప్పు తొమ్మిదియు గుబ్బెతకన్నులకోడెనంచుఁ గ్రే
వలఁజెలువారఁదొమ్మిదుల వ్రాసిరనంగను వీనులొప్పగున్. 88

గీ. అతివచనుపూవుగుత్తుల యుండఁజేరఁ
జానకెమ్మోవి దొండపండానఁ దుమ్మె
దలును జిల్కలుఁగా నలఁదడవునిలిచి
యూరును బలుకులును నయ్యె నతీవకెలమి. 89

ఉ. తుమ్మెదదిమ్ముసంపెగయుఁ దోరపుఁజీకటి చందమామయున్
దమ్ములు రిక్కచాలు మదిఁదాలిచి నెయ్యముఁ దొంటికంటుఁదా
మిమ్ములఁబాసి కూడెనన నింపగుఁ జూపులు ముక్కు కెక్కునన్
గ్రొమ్ముడిమోముగోము జిగిగుబ్బడుకేల్గవ యింతికొరులున్ 90

గీ. చానసద్దంపు జిగిమేని చక్కఁదనము
వెలసితద్దయుఁ దెలుగంటి చెలువెదూఱు
కన్నియుబెళుకుఁ దెలివాలుఁ గన్నుదోయి
చెలఁగి మిక్కిలి తెలుగంటి చెలువెదూఱు. 91

మ. కనుచేఁ బల్ బిగిఁ జిబ్బజక్కవల కెంజూపి లోఁ జంకి వే
డ్కను జేరంజని మోముఁ దమ్మిరుచి యందందోచెన్ నారు వా
మనికిం బోకి-త్రి పుట్టవేఁ జెలి దాయఁగాఁచి వేఁడంగ వ
చ్చిన జాబిల్లియనుంగుకొమ్మలన మించెన్ ముత్తియంపుఁగన్నరుల్. 92

గీ. మల్లెమొగ్గలఁ జిగిఁ బోలుఁ బలుమెఱుంగు
బలుమెఱుంగును బోలుఁ గమ్మమెయితేట
పోలి మెయిఁ దేటలను బోలు వాలునెఱులు
వాలునెఱులను బోలు నప్పడఁతి యూరు. 93

చ. మెలఁతుక చన్నుఁగొండలకు మీఁదను జందపుదిట్టనంతయుఁ గ్
జెలువుగఁ గొల్చి గొంతు వెసఁ జందపు దిట్టతనంబు పూఁగఁగాఁ
బొలుపుగఁ జుట్టువాలు దొరఁ బొందెఁ బిఱుందులు సైపలేక నే
ర్పులవడ వెన్నుఁ జేరె నలపై దలికీల్జడ వింతదోఁపఁగన్. 94

చ. మరుఁడను వేఁటకాఁ డతివ బల్ చనుగొండలయందు ముత్యపుం
న్నరులను బియ్యమూసలఁ బెనంగఁగ మచ్చిడి యందగాండ్ర య
బ్బురమగు డెందపుం బులుగు మొత్తముఁ బట్టుచు నీరు ద్రావఁ ద
గ్గరఁ జనుబొడ్డుడిగ్గియకుఁ గట్టినబంగరుచెట్టు లత్తకుల్. 95

గీ. జవ్వనపుదటిఁ గన్నియచన్నుదోయి
కానుకలిమి దోఁచుకొనియెఁ గాకయున్న
నింతలో గుబ్బలకుఁ గల్మి యెట్టులబ్బె
నేమికతమున నడుమునకు లేమికలిగె. 96

గీ. జవ్వనపుదటిఁ గన్నియచన్నుదోయి
కానుకలిమి దోఁచుకొనియెఁ గాకయున్న
నింతలో గుబ్బలకుఁ గల్మి యెట్టులబ్బె
నేమికతమున నడుమును లేమిగలిగె. 97

సీ. చెలఁగి పలుచాలుఁగేలు మైజిగులఁబోలు
నాసదానిమ్మయు నిగుర్లు నలరు మొదలు
నఖముఁ దుదిలేని వేలుపుఁ గడఁగిగొలిచి
తామునక్లె చనులఁ గొప్పుఁ దఱులఁ బోలె. 98

ఉ. పోలఁగవెన్నుచూపె వరిపొట్టలు సేనుఁగుకేలుమోడ్చెఁ దా
మేలును బొట్టలోన దలపెట్టుకొనెం దలవంచెనంటులున్
దూలుచు లేళ్ళుగడ్డితినెఁ దొయ్యలి పిక్కలఁ జన్నుదోయి మీఁ
గాళుల నిద్దపుందొడలఁ గన్నులఁబోలఁగ జాలమింజుమీ. 99

క. నెలయా మొగంబుజిగి వె
న్నెలయా తెలినవ్వుజవ్వ నెఱబంగరు గి
న్నెలయా చన్నుంగవతి
న్నెలయారె పిఱుందుదోయి నెలఁతకుఁదలఁపన్ 100

గీ. కాలియందెలన్ పాదులఁగలయఁ బెరుగు
నరఁటికంబంబు లెన్నంగ నతివతొడలు
దానియాకువీపు చలువదలఁచిపాదు
కదిసినట్టి తాబేళ్ళు మీఁగాళ్ళుతలఁప. 101

గీ. చెలువ నెమ్మోము చందురుగెలువఁజూచి
యడుగుఁదమ్ములిదియె మంచియదనటంచు
నతని కొమ్మల నీడ్చితెచ్చి తమలెంక
లుగ నొనర్చికొనెనన గోళ్ళొగిఁ జెలంగు. 102

చ. చిలుకలకొల్కి నెన్నడుము సింగపుఁ జెల్వముఁ జూపుఁ జూపు రూ
పులపవమించు మించులకుఁ బోఁడిమిమై జిగినించు నించుమి
క్కిలినగుఁబల్కు పల్కుదురు కెంపులసొంపులు మావు మావు వె
న్నెలఁగని నవ్వునవ్వు జిగివిద్దమెఱుంగు మెఱుంగుఁ జెక్కుళుల్. 103

క. మీలనేలఁజాలు వాలుఁగన్నులజాలు
మిన్ను చెన్నుఁ దన్నుఁ గన్నుగొను
మించుమించుమించు నంచయాన యొసలు
పొగరు పొగరు చిగురు ముగుదకేలు. 104

సీ. వెన్నెలగువ్వల వెలయించుఁజెక్కిళ్ళ
జన్నులునిసువాలుఁ గన్నుదోయి
పుట్టతావులమీఱుఁ బోలఁతుకపొక్కిలి
మేనునుజెలువారు మెఱుఁగుటారు
పసిఁడితిప్పలనేలుఁ బడఁతుకమైపగి
పిఱుఁదులుసిబ్బెంపు బిగువుఁజనులు
కెంపుఁదమ్ములసిరిగెల్చుఁ గన్నియమోవి
కన్నులునునుపారు కలికియడుగు
తార సమాముద్దరాలి రూపమరఁగన్న
నడవిలోఁ గాయగసరుల నారగించి
చెట్టునీడలఁ బవళించునట్టి తపసు
లైనఁ జేరికొల్వారె యింతియడుగుదోయి. 105

చ. చెలువమొ మావిగున్న యలచెల్వపుఁగొమ్మలె చేతు లందపుం
జలిరులె కేలుదోయి నెఱతావులపూవులె గోళ్ళు తేనియల్
గ్రోలఁ కెమ్మపండ్లె గుబ్బగవ లోఁతగుతోఁట్రయె బొడ్డు పండ్లకై
చెలువుగఁ దోఁట్లు వెల్వడిన చీమలబారులె యారు కన్గొనన్. 106

ఉ. తమ్ములుకన్నదోయి బలితమ్ములు మేలిపిఱుందు లెం[illegible] గు
త్తమ్ములు గుబ్బ లేనఁగులతమ్ములు నెన్నడ లెన్న మించు మే
త్తమ్ములు మేను కెంపుసయితమ్ములు చేతులు కమ్మవిల్తు చే
తమ్ములు చూపు వీచులకితమ్ములు పల్కులు ముద్దుగుమ్మకున్. 107

ఉ. అనఘుమోము చక్కఁదనమూతళుకుంజిగి చెక్కుదోయి యొ
వ్వా నిరుపేదకౌను సొగసావెలితక్కు పిసాళిచూపు సం
బానికవాలుగన్బొమకు లాజిగినిద్దపు మేనిసోయగం
బానునసోగపెన్నెరుల యందమయారె యొయారికే తగుఁ. 108

క. అమ్మచ్చకంటి చక్కఁద
నమ్మంతయుఁ జెప్పఁదరమె నాతిపిఱుఁదు నం
దమ్మెన్నఁగ నొకనాఁడా
నెమ్మొగమెన్నంగ నొక్క నెలయౌఁజుమ్మా. 109

గీ. అనుచువెండియు నేమిమోయనఁగఁడంగు
చిలుక నరచేతనేమాన్చి చెలువమీఁద
బలికెనాతండు తాళుమోచిలుకరాయ
వలదు నీమాటకడ్డంబు వత్తునిపుడు. 110

గీ. నన్నుసైరించి నేనిపుడెన్నఁ జొవు
పలుకువిని దానికిని మాఱు పలుకవలయు
నింతదోఁపంగ నాతోడ నింతదనుక
తేటగానీవు పలికినమాటలంకు. 111

క. "వెలిచాన నడుమనుంచిన
యులరేకు సంపంగిమొగ్గ" యని చెప్పితివా
చెలువను నామెయొనర్చెనో
కలుగునొ వేఱొండు తెఱఁగు కలయదిచెప్పుమా. 112

గీ. అనినఁ జిలుక పలుకు నా చెలిచానయె
చేసె నానెలంతఁజెప్ప కింత
వఱకు నున్కిసైపవలయును బయనంపుఁ
దొందర మును చెప్పఁదొఁచదయ్యె. 113

. నలువరాణియుఁ దానుఁగొలువుఁజేసియొక్కనాఁ
డచ్చరల్ చదుదెంచి యాడెదవిఁ
పిమ్మటఁ గొంతసేపమ్ముద్దుగుమ్మల
చక్కఁదనంబులు చాలఁబొగడి
మాటవెంబడి వారిసాటివారలఁజేయఁ
దనకెగా కొరులకుఁదరముగామి
మాటికిఁజెప్పిన మగఁడుఁ దానునుజేయ
రాదు వచ్చుననెడువాదుసల్పి
వారిమీఱువారి నిచేయవచ్చుననెడు
మాటపట్టింపుఁబట్టి యమ్మచ్చెకంటి
యీాచెలినొనర్చి పంతునెగ్గించుకొనియె
నలువగరువంబుదిగజాఱెనాఁటినుండి. 114

. ఈయతివఁబోల నలువకుఁ
జేయంగాఁదగిన నేర్పు చేకఱమినిజం
బోయేలిక చేకుఱనే
నాయన యొందైనఁ జేయఁడామున్నె పుడుణ్. 115

. దారినేతెంచుచుఁ దడవొంఢొరులతోడ
వెలఁదిచక్కదనంబె వేయినోళ్ళఁ
బొగడిమెచ్చుచు నామెసొగసున కెవ్వండో
తగుమగండనియింతతడవుమేము
పరికించుచున్కి నిప్పట్టున మిముఁగాంచి
మీాచెల్వొకనులారఁ జూచిచాల
మదినచ్చెరువుఁబూని మాలోననేఁడుగా
కలికికిఁదగువానిఁ గంటిమనుచు

సంతసము పట్టఁజాలక సరగడిగుచు
నంటిమీఁతఁడ తగునని వింటివిగద
గడియయును మాఁకునిచ్చుటఁ దడయఁదీఱ
దేగివత్తుము మఱచిపోయెదవుసుమ్ము. 116

క. అనివీడ్కొని రాచిల్కలు
వినుత్రోవను మీఁదికెగసి వెసఁజూపునకున్
గనఁబడక సాగిపోయెను
గనుచుండెడి జేనిచూడ్కి కళవళపడఁగన్. 117

వ. అనిన తరువాతికత చెప్పుమని జనమేజయుం డడుగుటయు. 118

సుగంధివృత్తము.

పొన్నగున్న నెక్కి గొల్లపువ్వుబోండ్లతోఁ గుతక
వన్నెమీఱఁ జేతులెత్తి పల్వొక్క చెల్వనన్
జెన్నుమీఱ మ్రొక్కుకున్నఁ జేలలియ్యనందు నాఁ
డన్నపంతు గెల్చుకొన్న యట్టిదిట్టవేలుపా. 119

కందము. గోమూత్రికాబంధము.

దరివిసమిడఁ జనుకొమ్మం
బొరిగొని తెలివొందు పైఁడిపుట్టమురాయా
పొరిఁగసవాడలను గ్రమ్మం
జెరిపిని జెలినందుఁగూడి దిట్టగురాగా. 120

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నియోగ్య నిర్వచన
నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందు
కూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య
పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన
రసికజనమనోరంజనంబను ప్రబంధరత్నంబునఁ
బ్రథమాశ్వాసము.

# రసికజనమనోరంజనము.

## ద్వితీయాశ్వాసము.

---

క. సిరి యెడవాయక యొమ్మున
సిరపుకొనంగొలుచువారి నెల్లర నెమ్మిం
జిరముగ నేలుచు గడలిన్
బరగన్నెలకొన్న వేల్పు వలమురిదాల్పా. 1

వ. అంత వైశంపాయనుండు పైమీఁద నడచినకత జనమేజయున కిట్లని
చెప్పందొడంగె. 2

ఉ. వలపులమేలుకొల్పు తెరువర్లతలంకని కీడు తల్లి గా
డ్పులకును మన్కిపట్టు మరుపూనికి పేఁడని కొనపాటు తా
చిలుకలమేలు జాజికిని జెప్పఁగరాని విసంబు గంపుఁగో
యిలలకు నోముపంట చెలువేమని నామనివచ్చె నచ్చుగన్. 3

గీ. వీఁకవచ్చునామనిజేని రాకకలరి
తొంటిపసపుఁజీరలువిప్పి తోఁపుచీర
లెలమిఁదీఁగె చెల్వలుదాల్చి యొసఁకమొసఁగు
పగిదిఁ బండుటాకులురాలి చిగురులొదవె. 4

సీ. చెట్లకన్నిటికిని జెడిమున్నె పోయిన
పరిలేనితావులు మరలఁగలిగెఁ
జాజికొమ్మకు మున్ను జరగని మరితూపు
లరసిన నొకటియునంటకుండెఁ
గోయిలగమికెల్ల గ్రుడ్డప్పటియునుండి
గల కాకిమూఁకల చెలిమివదలెఁ

బెనుమావికొమ్మకుఁ బెద్దతడవు లేని
కోయిలపల్కుల కొమరుగలిగె
నింత కెన్నఁడు నిలుకడ నెఱుఁగనట్టి
గాలికిమ్మయి నెమ్మది చాలఁగలిగెఁ
జెప్పనొప్పని యామనియొప్పిదంబు
చిలువయొకిమీసకైనను నలువకైన. 5

సీ. పొంకమగుచుఁజను పూవుగుత్తులనొప్పి
కోయిలపల్కుల కొమరుమిగిలి
ముగ్గులుగులుకడు మొగలిరేకులమించి
చెలువంపుఁబొపటఁ జెన్నుమీఱి
వింతవింతలతీఁగె దొంతులసొగసూని
పలుమల్లెమొగ్గల చెలువుదాల్చి
బొట్టుగలకడింది పొలుపున నలరారి
మోవిచిగురుల బల్ఠీవిఁ బడసి
యామునేనుఁగు నడకల నల్లదనరి
కన్నులకుఁ బండువొనరించెఁగాన లచ్చి
యెల్లవారికి సంతస మెదలలోన
వెల్లిగొలిపి యయ్యామని నెల్లతఱిని. 6

గీ. పురుషులేకుండ నక్కానపువ్వుబోఁడి
యులరు కొమరుఁగనిన పల్కులాలకించి
యీడులేకుండ నత్తఱినెల్లపులుఁగు
గములుఁబిల్లలఁ బెట్టంగఁగడఁగెఁ గడఁక. 7

చ. కొలఁకులనాడుచుం బొగడగున్నల డాఁగురుమూఁతలాడుచుం
దొలఁగక చల్లులాడి పువ్వుదుమ్మగఁ జిమ్ముచుఁ దీవెతూఁగుటు

బాగరునఁ జిల్కతేజిమళుపుల్ ద్రమికింపుచుఁ దేటులాడ్వఁగా
జగములమీఁదికిన్వెడలెఁ జక్కెరవిల్తుఁడు మచ్చరంబునన్. 12

వ. అట్టియామనియందు. 13

ఉ. వన్నెగనన్ను మిన్న చెలువమ్మటు వీనులవిందుగాఁగ ము
న్నన్నదివిన్నవించి చిలుకల్దగమిన్ననఁ జన్నమాడియున్
గన్నియరూపు కన్నుఁగవఁ గట్టినయట్టుగ బిట్టుతోఁపఁగాఁ
గన్నులవింటివంట తనకై వడి చూపెను గ్రీడిపై వశిన్. 14

సీ. కనఁ జెట్టయెదుర నిల్చినవారలనునైనఁ
గనియెనేనియు నఱగంటఁజూచుఁ
జెవిఁజొనుపఁ డొరులు చెప్పెడుమాటలఁ
జొనిపెనేనియు నేమిటను చునడుగుఁ
బలుకరించఁడు తనచెలికాండ్రనైనను
బలుకరించిన వెడపలుకుపలుకుఁ
బిలిపించుకొనుడాఁ బలుమాఱుఁదిండికి
నెంతసేపటికిని నేగకుండు
మిన్నుమన్నును గానక మెలఁతమీఁది
కూర్మిఁ బలువింత వలవంతఁ గుందుచుండె
నడుమసిరియెత్తుకొన్నచో మిడిసిపడెడు
ములుచమాపసిఁబోలి యప్పుడమిఱేఁడు. 15

సీ. గట్టువిల్కాని నెక్కటి నోర్చినగండు
చెఱకువిల్తునిమీఁదఁ జెల్లదయ్యె
మింటిమీనును గూలమీటినయుదుటెంతి
కనుమీలమీఁదను గదియదయ్యె
వింటివారలనెల్ల వెఱపించులావన్ను
బొమవిండ్లపైఁ జూపఁ బొసఁగదయ్యె

జగములెల్ల నుగ్గుల్చు పొగరుగ్గనిపిఱుందు
దీవులమీఁదను దివురదయ్యోఁ
జాల్లి ద్రోవది పెండ్లిముందల్లమీఁను
నొక్కయేటునఁ జడసేసియున్ననాఁటి
మగతనంబేమియు నిచటమఱఁచి మీఁను
నెదుటసాగింపలేఁడయ్యో నిపుడుక్రీడి. 16

క. చాలమునుచిల్క చెప్పఁగ
నాలించిన చెలిపిఱుందు నందవుఁజూపున్
నేలకుఁగోలకుఁ దెచ్చెను
వాలాయము జేనిమేనుఁ బలుదొందంబుల్. 17

సీ. ఎన్నితీసినఁ గ్రమ్మఱ నెప్పటట్ల
యూరుచుండెను జల్ తూపులున్నవాని
రెండుమూడమ్ములున్న మఱుండె గెలిచె
నహహా నలువచెయువుల నేమనఁగవచ్చు. 18

ఉ. ఆమనిఁగోయిలల్ చిలుక లామని సేయఁగఁ దాళ లేక లోఁ
దామరకంటి నెన్నుచును దామరలింపఁగరాని కోర్కితో
వేమఱుఁ బంటవిల్లుగాని వేమఱుఁ జేయఁగ నొచ్చికుందు నా
లేమనుజూడ కిప్పుడెటు లేమనువాఁడ నటంచు నిచ్చలుల్. 19

గీ. ఏకంతబున ననబోఁడి నెదనుదలఁప
నేకతంబున ననవిల్తుఁ డేయకుండు
నలరువింటను నన దూపులల్లఁ దొడిగి
యలరువింటను నడయాడు నరదమెక్కి. 20

వ. ఇట్లు చెఱకువిలుకాఁడు పఱపు కలుకుటంపఱ నెఱకలు దూఁటి
నోరువలేక యాకవ్వడి పంతుక తనకన్నులం గట్టినట్లులయినఁ
దనలోఁదానిట్లని పలవింపదొడంగె. 21

చ. కలికిరొ యిప్పుడేమి యలుకాయలుకా పలుకాడవిట్లు న
న్నలమటఁబెట్ట నాయమగునా తగునా తెగునాయిఁకింతటన్
వలపిది యేలుకొమ్ము మగువా తగువా పగవానియట్ల నన్
దలఁపఁగ జాలిచూపవలదా వలదావలఁదాళనేర్తువే. 22

ఉ. నాయనుఁగున్వెలంది తగునాయను నీవెతసైఁచువాఁడ నే
నాయను మీఁదఁ దాళఁగలనాయను నన్నిటులేఁచనాయమా
నాయనుఁ గూర్మిఁదప్ప నగునాయనుఁ జక్కనిగుజ్జుమోవి గ
న్నాయనుఁ గిన్కఁజూప నదనాయను నేఁబగవాఁడనాయనున్. 23

వ. అనిపలికియుం దనలోన. 24

ఉ. దాని మెఱుంగు చెక్కులును దాని చవుల్దులకించు మోవియున్
దాని నిగారపుందొడలు దానికనుంగవ దానిగుబ్బలున్
దాని యొయారపున్నడలు దాని చొకారపుమేని చెల్వముల్
దాని మొగంబునందమును దాని హొయల్లనఁగాంచు టెన్నఁడో. 25

వ. అని యిట్లు. 26

గీ. పుడమియంతయుఁ గలిగియుఁ బాడవుమలల
వంటి పసిఁడిగుట్టలుగల్గి పడఁతిపిఱుఁదు
దీవులను జన్నుహొన్ను బిందియలఁగోరు
ననయమాతఁడు దొరలకుఁ దనివిగలదె. 27

సీ. నెలఁతుకమోవి ప్రేసియలానఁగాఁగోర
నేచవియును నాల్కకెక్కదయ్యెఁ
బడఁతుకమైతావి పసరెఱుంగఁగఁగోర
ముక్కునకేతావి సొక్కదయ్యెఁ
జెలుకలకొల్కి నవ్వులుకులుకినఁగోర
వీనులకేపాట వెలయదయ్యెఁ

గ్రాల్గంటి నెఱసోయగముఁ జూపఁగాఁ గోర
నొంజేడికన్నులకొప్పదయ్యెఁ
పలిరుబోఁడి నెమ్మోయి మెత్తదనముఁ గోర
నొడలికిని బడదయ్యెఁ వేఱొకటిసోఁక
నేమిచెప్పదముఁ గప్పడియింతినొక్క
వాఁడఁ దక్కంగ మఱి యున్న వాసముఱచె. ౨౮

గీ. ఇట్లు నెలఁతమీఁది యొడఁద్రిప్పకొనలేక
యలరుఁదోట కేగనన్ని యచటఁ
జక్కఁబడునటంచుఁ జనియెఁ బూఁదోఁటకుఁ
జెలులుకొందఱవలఁ జేరిరాఁగ. ౨౯

సీ. బలుమల్లెమొగ్గలు పలుచాలువలఁపించుఁ
దుమ్మెదల్ కురులచెల్వమ్ముఁ జూపుఁ
జిగురుటాకులు కేలిచెలువంబు వెలయించు
సేనుఁగుల్నెన్నడ నెన్నఁజేయు
దొండపండులుమోవి నిండుచెల్వముఁ జెప్పు
సంపంగిననముక్కు పెంపునుడువు
నరఁటిచెట్లు తొడలయందమ్ముఁ గాన్పించు
జిలుకలుపలుకుల చెలువుఁ దెలుపుఁ
జానరూపును మఱవంగఁ గావకేగఁ
దెఱవరూపుఁ దక్కఁగ నన్ని మఱచిపోయెఁ
దప్పనే తానొక తెఱంగుఁ దలఁచుకొనఁగ
దయ్యె నొండొక తెఱఁగుఁ దాఁదలఁచునసుట. ౩౦

ఉ. కమ్మని తెమ్మెఁ దెమ్మెరలు గ్రమ్మఁగఁ గమ్మనివింటిపంట పూ
వమ్ములు చిమ్మ జొమ్ములని యామునఁ దుమ్మెదదిమ్ముద్రిమ్మరన్

గొమ్మలనెమ్ములిమ్ములను గూయఁగఁ జెమ్మట గ్రమ్మెతమ్ము లో
క్కమ్మడి దొమ్మిసేయ దొర యుమ్మలికం బువుఁదోటఁ గ్రుమ్మఱున్.

సీ. అదెకొమ్మకాఁబోలునసిడాయుఁగాకున్నఁ
జెట్టుకొమ్మయటంచుఁజెప్పఁదివురుఁ
గలికి కప్రంపుఁ బల్కులనిచేరుఁ గనక
ముద్దుగంబూరంపుముక్కలనును
మోవిచివురటంచుఁ బోవునుగాకున్న
మోవిచెట్టులయాకు మొలకలనును
విరిగుఁబ్బలవెయంచు నరుగునుగాకున్నఁ
బూగుత్తులంచును బోసఁగఁబల్కుఁ
గానలోపల నెల్లెడఁ గానిపించు
నలరుఁదీవెలఁ గోయిలపలుకుగములఁ
బొన్నకాయల మంకెనపూలఁజూచి
చెలిమికాండ్రకుఁ దనగుట్టు తెలియకుండ. ౩౨

వ. అప్పుడొక్క చెలికాఁడు విశారదుండనువాఁ డదియెల్ల నల్లన నల్లంబునం దెల్లంబుగాఁ దెలిసి మెల్లనఁ దనప్రోడతనంబు వెల్లడిగాఁ గవ్వడి యొడలు నెవ్వడిందడవి* యాతనితోడ జాడగా నిట్లనియె. ౩౩

ఉ. దేవరమేనికాఁక చలిదేఱెడు తావులఁగుల్కు కొమ్మలం
దావలి మేలికొమ్మఁగని యారసి యావిరిగుబ్బగుత్తులున్
బ్రోవగుకప్రపుంబలుకు మొత్తములుం బలుమల్లెమొగ్గలున్
మోవిచొకాటపుం జిగురుఁబూనికఁగూర్చినఁ గాకమానునే. ౩౪

గీ. ఇపుడు కాఁకదీఱ నెందైననారసి
గొబ్బుననుగడంగి కూర్మిచిలుక

వెఱయు పంచదార పలుకులు నీకబ్బఁ
జేయవలయు నేమి చెప్పుమయ్య. 35

వ. అనినం గూరిమిచెలికాని నేరుపు మాటలచేత నాతండు చిలుకకుం దనకు నడచిన నుడువులచందంబును దనకెందం బొక్కచక్కెర బొమ్మ యయిందగిలి మక్కువం జిక్కియున్న తెఱంగును నెఱింగించినని తలపోసి తెంపుచేసి యింక నెయ్యునికడం దన యుల్లంబులోని కోరిక చెప్పక తప్పిపుచ్చుట కర్జంబుకాదని యెంచి వెంటవచ్చినవారి నెల్లర నానాపనులు చెప్పి పొగనంపి మంతనంబున సంగడికానితో రాచిలుకలు వచ్చినది మొదలుకొని నేటిదనుకం జరిగినదంతయుం బూసగ్రుచ్చినట్లుగాఁ దెలిపి యిట్లనియె. ౩౬

ఉ. ఇట్టుగనుండె నా చెలిమియెల్ల నిఁకేమని తిట్టుకొందు నాఁ
డట్టులు ప్రేముడిం జిలుక యాచెలిసుద్దులె తెల్పెనోఁ జెవిం
బెట్టక యూరకుంటి నిటుమించినదానిని ద్రవ్వుకొంచు నేఁ
డిట్టులు కన్నువిల్తు విరితూఁపులు నాఁటఁగనుంటి నక్కటా! 37

ఉ. గుట్టునఁ జేడె వీడకుఁగఁ గోరిక లీరికలెత్తి నోరికిం
దొట్టినయంతఁ బంతమున దోసపుసిగ్గొక టడ్డువచ్చినన్
గట్టిగ నోరునొక్కఁ దమిగన్పడనీయక కట్టిపెట్టి యా
పట్టున రాచనీటు గనుపట్టఁగ వట్టిమెఱుంగువెట్టితిన్. ౩౮

ఉ. ఏనపుడంతయున్విని యిట్టటుపల్కక యూరకుంట యే
మో నగుఁబాటుగాఁ దలఁచి ముందఱ నెద్దియుఁ బల్కఁగొంకి నా
యానతిఁబొంది చిల్కచని యవ్వల నెల్లదమైతినంచయో
తా నెదఁ జిన్నవోయెనొకదా యిఁక దానికి నేమిసేయుదున్. 39

క. అనిమిగుల వగలఁ గాగిలెడు
నతఁగుం జెలికానిలోని యలజడి వోవన్

జనువున మాటలు చెప్పుచుఁ
గొనిచనియె విశారదుండు కొండొకయెడకున్. 40

క. అటువెయ్యునిఁగొని చనుచుం
దటుకునఁ జెలికాండ్రకెల్ల దగుపనులెలమిం
దిటవుగనుజెప్పి వారల
నటునిటువడిఁ బంపివేసి యాక్కఱదోఁపన్. 41

వ. ఇంతంతనరాని సంగడికాని వలవంతం దలంచి తల పంకించి మరుని
మీఁదఁగినుక నొడమి. 42

గీ. మూఁడు కన్నులవానితో మొనసిమున్ను
చచ్చిబ్రతికియు వలతేఁడ చలముతోడ
వేయికన్నులదేవర బిడ్డమీఁది
కేమొగంబునవచ్చితివిపుడుమరల. 43

గీ. అనుచు మరుదూఱిముందుచేయుంగ వలయు
కర్జమెదలోనఁ దలపోసి కాంచియొకటి
మదికి సరిపడ్డపిమ్మటఁ బొదలువేడ్క
సరగఁ గ్రీడికిట్లనియె విశారదుండు. 44

సీ. ముచ్చులచేనల్ల పుడమివేలువునిన్న
నావునుగోల్పోయి యారటమునఁ
దనయావు విడిపింపుమనుచు నీయొద్దకుఁ
బరువెత్తుకొనివచ్చి పలుఁదెఱఁగుల
వేఁడిన నాతనివిన్నపంబాలించి
కనికరంబున మదికరఁగఁగఁబాతి
విల్లుదెచ్చుటకును వెడలి పరాకున
నన్నద్రోవదితోడనున్నతతిని

బడకయిలునీవు వడిఁ జొరఁ బాఱుకతన
మున్ను మీలోన మీరు చేకొన్నయట్టి
కట్టుఁబాటున నొక్కయేఁడ కట్టైనీవు
పుడమివలగొని తిరుగంగఁ బూనఁజేసె. 45

క. ఈపండ్రెండు నెలలు నే
నోపిక నీతోడఁదిరిగి యొక్కటనిను మే
నాపడఁతుక యూరారసి
యేపగిదినైన నీకు నింతినిఁగూర్తున్. 46

గీ. ప్రతినకడచను నందాఁకఁ బదిగనీవు
తమక పడకుండ నెట్లైనఁ దాళుకొమ్ము
పిదప నీకోర్కి పండింతు మదినినమ్ము
మనుచు నోడఁబడఁగాఁ జెప్పి యతనిఁగొనుచు. 47

గీ. చనియె రాచనగరికి విశారదుండు
క్రీడి పయనంపు వేడుక క్రేళ్ళుదాఁట
నెప్పు డెపుడంచు నిముసంబె యేఁడుగాఁగ
నుండెఁ జిత్రాంగదయుఁ దనయూరియందు. 48

ఉ. ద్రోవదిపెండ్లియప్పు డొకతూపున మచ్చెపు జంత్రమేసె నం
చావలవీరువారు నటనాడికొనం జెవులార విన్న దాఁ
గావున నాఁటనుండి మదికవ్వడియందునె నిల్పియుంట సం
దై విరివింటికంట యలరమ్ములు చిమ్మెను గొమ్మఁ గ్రొమ్మనన్. 49

గీ. ఇంతితెఱఁగంటి దొరపట్టి నెదను నిలుపఁ
దనకుఁ దెఱగంటితనమబ్బెననఁగ నపుడు
విడిచెనిద్దుర తిండియు నుడిగిపోయెఁ
బ్రొద్దులెంతయుఁ బడఁతికిఁ బొడవులయ్యె. 50

గీ. నిమర లేకుంటఁ జెమ్మట నిండుటయును
వెసను వేల్పుఁదనమును మానిసితనంబు
నెపుడు నెమ్మనఁ గాన్పింప నల్లతఱిని
గాంచె నరమోడ్పు క్రాల్గంటి కన్నుదోయి. 51

సీ. పువ్వులుముడువదు పూబోఁడియయ్యవి
తొవవిందునల్లని తూవులనిరొ
యద్దంబుఁజూడదుముద్దియ దానఁ గ
న్పడుమోము మున్నీటిపాపయనిరొ
కరులుచేముట్టదు విరిబోఁడియయ్యవి
క్రొవ్వారుతుమ్మెదగుంపులనిరొ
చెలులపల్కులు వినదెలనాగయవియెల్లఁ
జిల్కమొత్తంబుల పల్కులనిరొ
యంతకంతకు వలవంతవింతదోఁప
మరుఁడు పూముల్కులడరించి కరమునేఁప
నెడఁదఁ గవ్వడిపయిఁగోర్కి యేపుచూప
సన్నగాలియు నెమ్మని చెన్నుచూప. 52

చ. చెలులను మాటికింగదుముఁ జిల్కలఁ బల్కులు వీసడించు నం
చలఁదఱుముఁ గెమ్మళ్ళనొగిసారెకుఁ బాఱఁగఁదోలు గండుఁగో
యిలపలుకుల్ వినందలకు నేఁచికలంచును గోరువంకలఁ
గలికి మదింగడింది వెతగల్గిన రోఁతలుగావె యన్నియున్. ૫३

గీ. బోటినెమ్మను బంగారవకాటనపుడు
కమ్మవిల్కానిచిచ్చునఁ గరఁగుచున్న
దోయనంగ మైఁజెమ్మట రొప్పమీఱి
వెల్లువగుచును బాఱెను బెల్లుదనరి. 54

సీ. ఆవెల్లత త్రిపి యతఁడొదవెన్నేర్చెక
వెలను వెండ్రుకఁ బెట్లఁ బులక నగునె
యల్ల మానిసిసింగ మక్కఁ జేర్చెక
యించుమవిల్తుని జెదరింపనగునె
యాపజదొరచక్క సౌమ్మోముదార్చెక
కొపము దాయంచలోఁ గొనఁగనగునె
యల్ల జగము చుట్టు మలరించి పోలక
తుమ్మెదపిమ్ములపైఁ గ్రమ్మనగునె
యనుచు నయ్యింతి సగమును నంతకంత
కొగినిలిచినచోట నిలువకుండఁ జెల్ల
దనముపూను వెన్నెలకును దలముడుంచుఁ
దలిరువిల్కాని కొఁకకుఁ దాళలేక. 55

గీ. చిగురుబోఁడికిఁ గోయిలల్ పగవియయ్యెఁ
గొమ్మ కెంతయుఁ దెమ్మెర కాళ్ళయయ్యె
నలరుఁబోఁడికిఁ గిట్టనివయ్యెఁ దేఁట్లుఁ
దమ్మికంటికి రేఁడు దాయయయ్యె. 56

చ. మరునకుఁ దూపు నేనరయ మామవునీవును గానచిట్టిచో
నిరుపురకిట్టి పట్టిపగయేటికిఁ బాటియె యంచుఁ జెప్పి చం
దురునది దేర్చ నాతని నెదుర్కొనఁ దామర చేరెనో యనన్
దరిమెఁగఁ జేర్చెఁ జామ చెయిదామరచెక్కున వెచ్చనూర్చుచున్. 57

ఉ. కన్నులకాటుకంగలిసి కల్కిచనుంగవమీఁద జిందు వా
ల్గన్నుల నీటితుంపరల గారవమెన్నఁగనయ్యె నయ్యెడన్
జెన్నెసలారు తామరల చెల్వుపుఁదేనియలొల్కి యంతటన్
గ్రొన్ననగుత్తులంగదియఁ గోరికనేగెడు తేఁటులో యనన్. 58

ఉ. పుత్తడిచాయ మోమునకు ముక్కున కత్తికిఁ జెక్కుదోయికిన్
బొత్తుగ వెల్లదమ్మి నువుఁబువ్వును జిందము నిగ్గుటద్దమున్
గుత్తగఁ బోల్చి కబ్బముల కూర్పరులాడినమాట చెల్లెనా
నిత్తఱిఁ జానమేను తెలుపెక్కెను బువ్విలుకానికాఁకలన్ 59

ఉ. అప్పుడు ముద్దురాలివిభమారసి సందియమొంది నెచ్చెలుల్
మెప్పొదవంగఁ జేరఁజని మేకొనియించుక పట్టిచూచి కే
ల్నిప్పులమీఁదఁ బెట్టినటు నెట్టనఁదోఁచిన నుల్కిచెంది యా
యొప్పులకుప్పతోడఁ జెలులొక్కట నిట్లనిరమ్మలంబునన్. 60

సీ. వీనుదోయికిఁజాల విందుసేయుచువీణె
మెల్లన కొనగోట మీటవేమి
ముద్దుఁబలుకుల నింపుపుట్టంగ నెప్పుడుఁ
బెంపుడుఁజిల్కలఁ బిలువవేమి
యఱచేతఁజప్పటల్ చఱచి హెచ్చరికతో
నింటినెమ్మళ్ళనాడింపవేమి
చవితిచందురుదూఱు చక్కనినుదుటిపైఁ
దేటకస్తురిబొట్టు దీర్పవేమి
కలికిరాయంచబోదల గారవించి
తీరుగానన్నడల్ తగదిద్దవేమి
మేలిమిపసిండి క్రొంజాయమీఱఁజాలు
మేన నాడెంపుఁ దొడవులుపూనవేమి. 61

గీ. మగువ నీతెఱఁగేమియో మాకుఁజూడ
వింతగాఁదోఁచుచును గడువెఱపు గొలుపు
చున్నదిదె వేఁడుకొనెదము నిన్ను మేము
చెచ్చెరను నీదుమదివంత చెప్పవమ్మ. 62

సీ. ఎంతవేఁడిన మదివంత నిగురుబోఁడి
సిగ్గుపెంపునఁ జప్పనఁ జెప్పలేక
యుల్లమల్లాడఁ దలవంచి యూరకున్న
మఱియు నిల్లని రప్పుడా మగువలెల్ల. ౬౩

సీ. ఎట్టికట్టును మాటోడనిట్టిదనుచుఁ
దెలిచి చెప్పకుండిన నేము పెద్దయొట్ట
బెంచు బాసఁజేసియు నిప్పుడకట మఱుఁగు
వెట్టఁదలఁచుట మిక్కిలి వింతయమ్మ. ౬4

క. మనలో నిట్టిదిగలవా
యని మఱిమఱి మెదలుపఱువ ననుఁగుంజెలితో
మనమునకొన్నది యిచటని
కనికరమొనయంగ మఱువఁగావలెననుచున్. ౬౫

సీ. అల్లద్రోవది పెండిలియప్పుడు క్రీడి
చేసిన కడిందిపనులును వానిగన్న
యతనిచెలువంబుఁ జెవులార నాలకించు
కతనఁ దనడెంద మొక్కట నతనిమీఁద. ౬౬

క. తగులుకొలఁగించి యప్పటి
దగు తన తెఱఁగెల్లఁ దెలిపి యనుఁగుం జెలియం
దగ మణిరేఖం గనుఁగొని
తగులుపడంగను నెలుంగు దానిట్లనియెన్. 67

చ. కలుగునొ లేదొ కన్గవకుఁ గన్నులవిల్తుని నేలఁజాలు నా వే
ల్పులదొరపట్టి చక్కఁదనముంగని పొంగెడునట్టివేడ్కలు లోఁ
దలఁచఁగ నావనెన్నఁగులఁ దక్కవనోములు నోచినట్టి క
న్నులకది పైపయింగలుగునే యదియాసలుగాక చెల్యపీ. 68

క. ఎక్కడిసే నెక్కడి జే
డక్కన ననుగారవించు నతఁడనుకొనియుం
జెక్కడ యీవలపుఁగడలి
నెక్కటి నేనీఁదుచేడ యీవేసటతోన్. 69

ఉ. ఎవ్వరిఁబంపుదానఁ జనియిప్పుడు చెల్వునితోడ నావెతల్
నెవ్వడివిన్నవించి తననేరుపుచూసి మదింగరంచఁగా
నివ్వెలవంత నెక్కరణి నీఁగుదునక్కట చిల్కలైననుం
దవ్వులకేగ కియ్యెడను దాపుననుండిన నన్నుఁగాచుఁగా. 70

క. అనుచుండఁ దలఁపులోనన
చనుదెంచెను జిలుకకవయుఁ జదలుననటకున్
విని తెక్కచప్పుడొక్కట
ననుఁగుం జెలులెల్ల దెప్పలార్పకచూడన్. 71

సీ. చేరవచ్చి చిత్రాంగద చేతిమీఁద
వాలి ముద్దిడి సేమంబువరుసనడిగి
పలుకు వెలఁదుక తమ్మియ్యఁబంచినట్టి
యీగిమ్రాఁకుల క్రొవ్విరులెలమినిచ్చి. 72

చ. నలువ జగంబునందలి వినందగువింతలు కొన్ని తెల్పి యా
వలఁ దమ కూర్మినెచ్చెలిని బాఱఁగనుంగొని యామె మేను మి
క్కిలి వసివాడియుండుటయుఁ గీడ్వడిమోమునఁ దొంటితెల్వి యి
మ్ములఁ దిలకింపరామియును మున్గల సంతసపాటులేమియున్. 73

క. కనిపెట్టి డెందమందున
వనటం దిగులొంది తోడివారలనెలమిన్
వనబోఁడి యట్లు చిక్కట
కును గతమడుగంగ వారు కూరిమిమీఱన్ 74

ఉ. మున్నులమించి మీను నొకముక్కున నిక్కిచి క్రిందు ద్రోవదిగా
గొన్న తెలుంగు జవ్వనులకుం గనునాసలు గొల్పుచూపునుం
గన్నది వేయునోళ్ళ ముకుకల్గొని యాడఁగ నాలకించి యా
యన్నులమిన్న పొంగి మొదమాత్రిపై నెలకొల్పి చెప్పఁగన్. 75

క. కందుచు నెవ్వరికిన్ దోఁదన
డెందంబున కోర్కె వెల్లడింపక లోలో
నందురి యంతంతకు నెయి
యందము చెడ సన్నగిల్లి యలసగమైనన్. 76

ఉ. తత్తఱమొంది దీనికిఁ గతంబెఱిఁగింపఁగదమ్మ యంచు మే
మి త్తఱి వేయిచందముల నీమెను వేఁడిన నెట్టకేలకున్
బిత్తరి యంతయుం దెలిపి జేలతనంబునఁ బల్కులాడి తా
నుత్తలపాటుతో నసము నొక్కటఁ జెక్కొని విరాలుఁడిసన్. 77

క. తనకిమ్మోడఁ గడుఁదోఁడయి
పనిపూనిక డిందికోర్కె పండింత్రుగదా
యని వేచియున్నదిదె మ
న్ననమీ చెలి నప్పగించినారము మీకున్. 78

ఉ. మా బరువంతయుం దొలఁగె మా చెలియస్మిముఁ గూర్చినార మిం
కీబలితంపుఁ గర్జమెటు లీరలుదీర్చెదరోసుఁడీ యనన్
జాబిలి చల్వచూపులను జామనుగన్గొని మంజువాణి గా
రాబము మీఱ నిట్లనెఁ గరమ్మును దేనియలొల్కు పల్కులన్. 79

సీ. మేమిద్దఱము మున్ను మీయొద్ద సెలవొంది
నలువజగమ్మున కలరు వేడ్క
మింటను జనుచుండి మిట్టలు పల్లముల్
చదును నేలలయట్లు మదికిఁ దోఁపఁ

గుప్పముల్ పల్లెలుఁ గుప్పవోసినయట్లు
కనుపింపఁగాఁగను గానఁబడఁగఁ
జెఱువులుమడువులుఁ జిన్న యద్దపుబిళ్ళ
లట్లుచూడ్కికిఁ జాలనందగింప
వేడ్కఁబడుచును నెడనెడ వింతలెల్ల
నొంటొరులతోడఁ జెప్పుకొం చొక్కచోట
నూరిపఱగెడ సింగార మొలుకుచున్న
పూవుఁదోఁటలో నొక్క క్రొమ్మావిక్రింద. 80

సీ. బవిరిగడ్డమువాని బవడంబుఁ గ్రొత్త చెం
దొవడంబుఁ దెగడు కెంద్దోయివాని
తలిరుఁబాయమువాని వలఱేనినిందుక
ల్వలఱేని నగియెడు చెలువువాని
తళుకుఁజెక్కులవాని తమ్ములమీలమొ
త్తమ్ములనగు కన్నుదంటవాని
తేనెమాటలవాని తేఁటులఁగవ్వుజా
తేటలనగుసిగతీరువాని
చెలులతోడను ముచ్చటల్సలుపువాని
కవ్వడినిజూచి యాపోయగంబునకును
నచ్చెరువునొందుచును గ్రిందికల్లడిగ్గి
కంటిమాతనిఁ గన్నులకఱవుతీఱ. 81

సీ. దొరలేనిదొరమోవి దొండపండెన్న నే
చిలుకలకొల్కిలోఁ దలఁపకుండు
పుడమియేలికమేని బుజము తూఁడులఁ జెప్ప
వేయంచయూన కన్నిడకయుండు

వలకేశిమోము వెన్నెలకేశిఁ గొనియాస
నేకల్వకంటి లోనెంచకుండు
నొడయనిపొక్కిలి మఃపువ్రెబెక్కన్ననే
జక్కవచంటిలో స్రుక్కకుండ
నట్టిజెగజెట్టిఁ జేపట్టునట్టిమేలు
పొదలు నిమ్ముద్దరాలికి నొదవెనేని
బడిలముగఁ బడియార్వన్న పసిఁడితోడ
మంచి కెంపునుగూర్చిన మాడ్కియనుచు. ౮౨

క. తలపోసి యతనిఁ గన్గొని
వెలయన్మముఁ దెల్పికొంచు వెలఁదుకనచ్చోఁ
బలుకుల వెంబడిఁ జేర్కొని
చెలువెల్లనుబొగడి మున్న చెప్పినదానన్. ౮౩

క. చెప్పినదంతయు నూఁకొని
యప్పట్టున నాతఁడిట్టునట్టును ననకా
చొప్పు మఱపించి నేరుపు
చొప్పడ వేఱొక్కకతకుఁ జొన్పెనువన్నున్. ౮౪

ఉ. అంతియచాలునంచుఁ దఱుచాడక యత్తఱినూరకుండి నా
యంతనుభోయితిం బయనమై సెలవాయనరొద్దఁబొంది వి
న్పొంతల నల్వవీటికిని ముద్దియ నీమది గొంతిపట్టిపై
నింతగనిల్చియుంట దొక యింతయు నప్పుడు నేనెఱుంగమిన్. ౮౫

క. అనిమఱియు నేమొచెప్పఁగఁ
జనుచిలుకం జెప్పనీక సడలినతాల్మిన్
గనుఁగొనల నీరు కాఱఁగ
ననిమొం జిత్రాంగద గదు నసలుపొంగన్. ౮౬

క. అక్కటికికఱంచుకయు లే
క క్కటికిలికంబుఁబూన నగుఁనాయుల్లం
బక్కట క్రీడికి నదియును
నిక్కము నేఁజేసికొన్న నెఱదోసమొకా. 87

చ. పసితనమేగి జవ్వనము వచ్చినయంతటినుండి నెమ్మదిన్
విసువక కోరుచెల్వుఁడుఁట వేనను నొల్లకయుంట యుద్దియున్
బనదఱుఁగంగ వీనులవినంబడియుం డెగలేక మేనిలో
నునురులు దాల్చెదన్వ్వతలకోరిచి యెంతటిదోసకారినో. 88

క. వానిం గలయఁగ నగునని
మేనెంతో యాసపొంది యున్నాళ్ళుండం
గానేఁటికి నిటులాయెను
వానిఁ గలయలేని దొకట్రబతుకే తలఁపన్ 89

ఉ. ఆసను ద్రెంపలేక యిటులందనిమ్రాఁకుల పండ్లకూరకే
వేసరగొంతుసాఁచినను వీసమువాసియుఁ గూడివచ్చునే
మీసరివారు మెచ్చుకొన మేనుతొలంగెదనమ్మలార నా
యాసలు నేఁటితో విఱువుఁడందఱుఁ గేల్గవమోడ్చి మ్రొక్కెదన్. 90

వ. అనునంత నచ్చిత్తజి చెలికత్తెలు తత్తరపడి యింతంతనరాని యుత్త
లంబున రంతులుసేయుచుఁ బలువురు పలుమాటలాడి యాబోటి
న్మోదలింపఁ జొచ్చిన నచ్చెలుకకలికియుఁ దనలోన. 91

ఉ. కైకొనకుండరాదు మనకన్నులముందఱ నేఁడెపుట్టి తే
పేకడతేఱువారి మనమెందఱఁ జూడము చావనంగ వే
తే కొనితేరఁగావలెనె యేనిఁక నొప్పరికించి లోని యీ
పీఁకనడంపకుండినను వేయెటుపోనెటువచ్చునోకదా. 92

వ. అని తలంచి యామించుబోఁడిం దిలకించి. 93

గీ. ఏల యీలాగుజెందిన యింటిలోనఁ
గుడిపిరాల్పుంచి పనిలేని గొడవయ్యోటి
పైనవేసుక పొగలెదు పడఁతిచిన్న
చాలుఁబడివేలువచ్చె నీచలము విడుప. 94

గీ. తానుబోయిన పిమ్మట దేనికోడ
నైనఁబనియేమి తెంపుసేయంగవలదు
తలఁపఁజనునమ్మ నీయంతదానికిట్టి
వెఱఁగుఁబనులక్కటా యెంతవెఱ్ఱివైవు. 95

ఉ. చానరొ పోలుపొం దెఱుఁగఁజాలక యూరక కుందనేల ని
ద్దీని ననంగఁగొట్టమున నీవలిగుంజను గట్టుమన్న నే
మైనను జెప్పఁగాఁదరమె యాతఁడు నాఁడటు మూఁడుపల్కె నే
మానినదానికింగతము మన్నన విన్నమనాక నాకికన్. 96

గీ. అనుడు నాచిలుకలకొల్కి యవలఁ జిలుక
చెప్పఁబోయెడు సుద్దిని జివరదనుక
వినెడువేడ్క యుప్పొంగఁగ వెచ్చనూర్చి
యీవలావలి చెలులతో నిట్టులనియె. 97

గీ. మదికలంకఁజేసి యిది యనంగాఁదగు
నిదియనఁదగదనెడి యెఱుక లేక
యేమియోపలికితి నింతేకా కుసురులు
విడువఁదలఁప నంత వెఱ్ఱినమ్మ. 98

గీ. అకట నవ్వులాలకూరకే యన్నమాట
నిజముగాఁబట్టి యిపుడింత నెలఁతలార
పట్టిపల్లార్చి నామీఁద వట్టి లేని
పోని వాదువేయఁగఁ బాడియానెమికి. 99

గీ. రవ్వపెట్టక యింకనైన రమణిమీఁద
జాలిమోయించిల్క నేఁడిదియో మేలిపలుకు
చెవిఁ వేయుఁగ నుంకించెఁ జెలియలార
వినఁగ నీరమ్ముఁ జెముక్కాడ వీనులలర. 100

వ. అనుచు నప్పుడప్పుడంతులెల్ల జప్పుడు సేయక యొప్పులకుప్పయగు నప్పులుకుచెలువ యొప్పిదంబుగాఁ జెప్పఁబోవు మెప్పుమాటల నొప్పారెడు నుల్లంబు లుప్పొంగ్ఫారనూరకున్న నాచిలుకకలికి కలికి పలుకుల నాచెలువల చెవులకుఁ జవులు గొలుపుచు గిలుకుపలుంగున నిట్లని చెప్పందొడంగె. 101

సీ. అలప్రాపుఁ దోఁటలో బలుకువెంబడిమున్ను
పాలఁతినీరూపు నేఁ బొగడినపుడు
వలపు డెందములోనఁ గలిగియుఁ గొండంత
యొక్కింతయును వెలికుబ్బనీక
యగ్గలంబుగఁ దొట్టు సిగ్గుకతంబున
దానినంతయు మదిలోనె యడఁచి
కల్లగుట్టొకయింత కాన్పింపఁబై టికి
నౌనుగాదనుమాట యనకయుండె
నువిదరో యంతెకాని వేఱొండుగాదు
వినుము వినుపింతుఁ దరువాత వెఱ్ఱియగుచు
వలపుతలకెక్క నాతఁడు మెలఁగినట్టి
నడత చందమించుక తేటపడఁగ నీకు. 102

ఉ. నిన్నను నల్వపిడుకొని నేనరుదెంచుచుఁ గంటిఁ దోవలోఁ
బెన్నకుఁ జేరువం గమలపిందుగఁ జెన్నగునొక్కకోనయుం
దున్నగుడారముం దటిసిరొప్పెడు మామిడి గున్నక్రింద వే
గన్నులవేల్పుపట్టి చెలికాఁడొకఁడుండఁగఁ గూరుచుండఁగన్. 103

క. కని వారేమనుకొందురో
వినవలెనని వేడ్క పొడమి వెననాలేమా
కునకుండిగి యొకకొమ్మను
బనివడి నేఁగూరుచుంటి బడలికవాయఁగ. 104

వ. అయ్యెడ నాకవ్వడి వెడవిలుకానియలజడిం దెలివిచెడి యిదితగు నిదితగదనియెడి యెఱుకలేక యెదుటఁ గనఁబడు వానినెల్లం దడవి యిట్లని పలవింపదొడంగె. 105

సీ. అలలారయంచ తొయ్యలులార మీరైనఁ
జిత్రాంగదకు నన్నుఁజెప్పఁగలరె
తొగలార మేలిసంపఁగులార మీరైనఁ
జిత్రాంగదకునన్నుఁ జెప్పఁగలరె
పొదలార గండుతుమ్మెదలారమీరైనఁ
జిత్రాంగదకునన్నుఁ జెప్పఁగలరె
విరులార చలువతెమ్మెరలారమీరైనఁ
జిత్రాంగదకునన్నుఁ జెప్పఁగలరె
యెంతవేఁడిన నొకరైన నించుకంత
పలుకరైనను నాతోడఁ బలుకరేమి
నేనుజేసిన తప్పిదమేదియైనఁ
గలదె యెల్లరు నన్నిట్లు చులకసేయ. 106

గీ. నేమమున నేను బండ్రెండు నెలలబట్టి
యిన్నియేళ్ళకుఁజని గ్రుంకులిడినయట్టి
పున్నెమునసైన నాకు నాపువ్వుబోఁడిఁ
గాంచుమేలైన నొకసారి గలుగరాదె. 107

క. అని పెక్కువగలఁదలఁకెడు
ననుఁగుం జెలికాని లోని యలజడితగ్గ

మనమిడెచని చిత్రాంగదఁ
గనుఁగొందము సుమ్మియెల్లి కన్నులుతనియన్. 108

క. అందాఁక నోర్చుకొమ్మని
కందువమాటలను జెల్మికాఁడొకఁడచ్చో
డెందముసందలి కుందున్
డిందింపుచునుండ నపుడ నేనును గడఁకన్. 109

క. నీయెడ యాతనివయి నిటు
లోయింతిరొ తగిలియుంట యొక్కింతయు నే
నాయెడ నెఱుఁగమిచే నీ
చాయలవచ్చితిని నంతెచాలు నటంచున్. 110

క. నమ్ముమిది నేఁట జేపటఁ
గొమ్మా నిన్నెదకిఁగొంచు గొబ్బున జేఁడీ
యిమ్మునకేతెంచి నినున్
నెమ్మిం జేపట్టు నీదునెచ్చెలు లలరన్. 111

సీ. కాన నూఱడియుండుము నేనుబోయి
యిపుడ మీతల్లిదండ్రుల కెలమి మొక్కి
వారినేమంబు లారసి వత్తుమరల
ననుచుదిగ్గున రాచిల్క లరిగెఁజదల. 112

క. చిలుకలటుచన్న పిమ్మటఁ
జెలికత్తియలంతిపురికిఁ జెచ్చెరఁ జెలువన్
బిలుచుకొనిపోయి రూఱడఁ
బలుఁదెఱఁగుల దిటవుగఱపి పాయనికూర్మిన్. 113

వ. అటుతరువాత నడచినకత చెప్పుమని జనమేజయుం డడుగుటయు. 114

మాలినీవృత్తము.

జగము లరయువాఁడా సాధులఁ బ్రోచువాఁడా
నగరుఁ బనులఁ గోండా పూజ్యజిహ్వాగ్రకోండా
నగమొఱుఁగనివేల్పై చిప్పఁబుట్టించువాఁడా
వగలుఁ దొలఁచుమునీంద్రా వాసిగాఁ గొల్లపీంద్రా. 115

కందగర్భిత మదగజవిలసితము.

చిలువదొరపఱపు జెలువునఁ జెలఁగన్
సిలుగుల నడఁచెడు సిరిచెలిమగఁడా
నలువయుఁ గొడుకయి నలువుగ వెలయన్
పలుకులఁబగతుర బిగిచెఱుచుదొరా. 116

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన రసికజనమనోరంజనంబను ప్రబంధరత్నంబునం ద్వితీయాశ్వాసము.

# రసికజనమనోరంజనము.

## తృతీయాశ్వాసము.

క. సిరియుం బలిమియు సేనముఁ
దిరముగ మదినమ్మికొలుచు దిట్టల కెల్లన్
గరము సన్నుతరున నిచ్చుచు
నరయుచు సాదులను బ్రోచు నలకరివేల్పా. 1

వ. వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పం
దొడంగె. నట్లు చెలికత్తియలు పొత్తుగ నత్తెఱవం గొనిచని మనికి
పట్టుచేర్చినఁ జేర్చిన మరుచిచ్చునకుఁ దాళఁజాలక చాల జాలిం
దూలుచు వారల నేమఱించి. 2

సీ. అలమోవి దొండపండనవచ్చు చిల్కల
జవ్వాజివలపులు నసలఁద్రోయు
బుజముతూడులఁజూచిపోరివచ్చునంచలఁ
దుఱుముక్రొమ్మొగిలింతక్రోలఁగఁద్రోల
చనుపూవుబంతులఁ గనివాలుతేఁటుల
ముక్కసంపఁగిమొగ్గ మొనసితఱుము
కయికొమ్మల నదల్పఁగావచ్చు తెమ్మెర
నొకట నూగారు పామెదుగఁజేయు
కలికిరూపును గనిచేరు కమ్మవిల్తు
బలఁగముల నాకలికిరూపె పాఱఁజేయ
బోటివెడలెను బూవులతోఁట కపుడు
చెలుల దిగనాడి యొకఁబాటు చెలువఁగూడి. 3

గీ. అంత నింతులెల్ల నంతయుఁ దలఁపోసి
యింటఁ జెలినిగాన కెల్లచోట్ల
వెదకి తత్తరించి వెలఁదులు త్తలమున
నలరుఁదోఁటఁ జేర నరుగుదెంచి. 4

మ. కలికెలదోఁటలో వలపుగ్రమ్మెడు తమ్మికొలంకువంకఁ జ
క్కని ననదేనె తేటిచిలుకాలువ దావలిమావిక్రేవఁ జ
న్నిన నెలకాలమేటిపసి సిద్ధపుముద్దులరుంగు చెంగటన్
బొనరిన కమ్మచెంగలువ పుష్పాపికిన్నియయొద్ద ముద్దియన్. 5

వ. కని యిట్లనిరి. 6

చ. ఎటువలెనమ్మఁ బాసి యిపుడిచ్చటికొంటిఁ వచ్చితమ్మ నీ
వెటువలెఁ బూవుసేటి పెనువెల్లువ లీఁదితివమ్మ నీదు కా
ళ్ళెటువలె నోర్చెనమ్మ వెలఁదీయిటు పుష్పాపికిన్ని లెక్కలే
డెటువలెఁ దూఁటితమ్మ పొదరిండ్ల నయోతనమ్మ యిక్కటుల్. 7

ఉ. నీచెయిదోయి కెంజిగురు నీనునువాతెఱ దొండపండునున్
నీచనుబూవుగుత్తులును నీచెలువారు బుజంపుఁగొమ్మలున్
జూచినఁ గోయిలల్ చిలుకజోటులుఁ దుమ్మెదచాలుఁ దెమ్మెరల్
హా చెలి యించుకైన నిను నాఁడిపెట్టక నిల్వనిచ్చునే. 8

సీ. ఒకతెటుంగక మరుఁడుండి మండిపడును
గూడిత్రేఁటులు కాఱుకూఁతలఱచు
పదరుచుఁ జిల్కలు వడిఁబండ్లుకొఱుకును
పరువెఱుంగక యంచబారసాఁచు
కదిసికోయిలపిండు కన్నులెఱ్ఱగఁజేయుఁ
బొఁగరున గోర్వంక తెగిరిపడును
మొయిజల్లుమనగాలి మీఁదిమీఁదికివచ్చుఁ
గన్నుగానక నెమ్మిగంతులిడును

గోలతనమున బలుముద్దురాలవగుట
వచ్చితివిగాక యొరులిట్లు వత్తురమ్మ
యించువిలుకాని దడములకిక్కయైన
కారుకోనకు నొంటిమైఁ గలువకంటి. 9

సీ. సారెసారెకువీచు చలువతెమ్మెరకాదు
తియ్యవిల్గలవాని తేరుగాని
యలచెట్లనలరించు నామనిదొరగాఁడు
పచ్చవిల్తుని దళవాయిగాని
పరువులెత్తెడు గొఱవంకగుంపులుగావు
తలిరాకువిలుకాని దండుకాని
తావి గుబుల్కొను తమ్మిమొగ్గలుగావు
కమ్మవిల్తుని తూపుగములుగాని
తేనెలానివెడలు తేఁటిపాటలుగావు
మొనయుమరుని నారిమ్రోఁతగాని
కెలనవిరియు కన్నెగేదంగి పువ్వుగాదు
పూలవిల్తు చేతివాలుగాని. 10

వ. అని చెప్పునప్పు డప్పడంతుక కంతకంతకు వలవంత వింతయయి చూపట్టి నప్పట్టునఁగల వింతలుచూపి వంత మఱపింతమని యెంచి మించుబోండ్లమ్ముద్దరాలిం బూలుగోయుదము రమ్మని తోడుకొని చనుచు నిట్లనిరి. 11

చ. చిలుకలకొల్కి కన్గొనుము చెన్నగుతీవియఁ జిల్కకొట్లచే
నలరుచు దొండపండు దనరారెడు డెందమువోలెఁ జెల్వునిం
గలసిన పంటినొక్కులను గందియు ముద్దులుగుల్కుచున్నయు
గ్గలిచెలువంపుఁ గెంబెదవికైవడిఁ గ్రాలుచునున్న దెంతయుఁ 12

చ. కనుఁగొను ముద్దుగుమ్మ పరఁగ నగుఁగల్వలు విచ్చియుండఁగన్
జనిచని నెమ్మిఁ గొండ్లి యటవల్పఁగఁ జూచు బుష్పఁ జేనిఁ జూల్
గొని పొగ రెక్కి తుమ్మెదలు గుప్పలుకూడి చరింప నవ్వులన్
గనుఁగొని నల్లమబ్బుమచు గ్రక్కున లోఁదలఁపంగఁ జొచ్చెఁ బో. 13

ఉ. అక్కడఁ గోయిలొక్కటి రవంతయుఁ బల్కుటమాని పొక్కఁ చే
మొక్కుచుఁ జెక్కునొక్క గుఱుమాఱుఁగఁ గావనునిల్చి మొక్కుచు
న్నిక్కపు మావిలేఁజిగురు నిప్పువనొప్పుచుఁ దమ్మికంటి శ్రాఁ
జక్కఁగఁ గ్రైకొనం దలఁచిచందము నీనుడి మెచ్చువొందఁగన్. 14

చ. కరువలిపిన్న మెల్లఁ జని కమ్మని తావులు గ్రుమ్మరించు న
బ్బురపుఁ గొలంకుఁ జేరు తనపోక కుసద్దయి నిల్చియున్న యా
సరి బలురక్కసు ల్తలఁకఁ దద్దఁ దలద్దునుమాడి వ్రేల్మిడిన్
విరులనుద్రుంచి కొమ్మకును వ్రేఁగుతొలంచెను గంటివే చెలీ. 15

గీ. అలరుకొమ్మలు చెలువులనల్లఁ బొంది
కొమరుపూపల, గాంచెనో కొమ్మచూడు
మలరుకొమ్మలు చెలువుల నల్ల బొంది
కొమరుపూపలఁ గాంచుట గొప్పయగునె. 16

వ. అని మఱియును. 17

సీ. ఏమన వలతేఁడు ప్రేముడిపుట్టంగఁ
గలసి డెందంబులో మెలఁగునమ్మ
చలువల తేఁడు నిచ్చలు వేలుపుల త్రోవ
విడిచి యావంతయు నడువఁడమ్మ
మొలదోఁటలోని కోయిల మొత్త మేతటి
నోకొ త్తిమాటాడ నోడునమ్మ
జింక త త్తడిరౌతు చెలఁగి యొకప్పుడు
నోకరికంటఁ బడక యుండునమ్మ

తెల్లవాఱుతఁ దవ యుంచలెల్ల విడువ
కెంతదవ్వైన వినువాకఁ కేగునమ్మ
యట్టివారలచే నెగ్గుపుట్టుటెట్లు
వలదు వలవంత యొక యింత వారివలన. 18

ఉ. మొగిళులఁ జూచి సంతసముఁ బూను నెమళ్ళను సంచపించు, సం
పఁగిపువుతావులంగొనెడి షట్పద తుమ్మెదదిమ్ము తెమ్మలం
దగిలికలంచుజాబిలియుఁ దామరచాలుఁ బొసంగిమన్కి యో
ముగుదరో! సాగదేరిఁగొని ముంకుమరుండరుదెంచు నీపయిన్. 19

సీ. నీకంటఁబడినేలనిలుచునే మరుడాలు
నిలువుగ్రుడ్లుపడి తానీరుచొరక
నీమాటవిన్నఁ దాసిలుచునే మరుతేజి
తోఁకత్రెంచుక కానఁదొలఁగిచనక
నీమోముగన్నఁదాసిలుచునే మరుమామ
దిగఁజిక్కి బయలునఁ దిరిగిచెడక
నీచేతఁబడ్డ దానిలుచునేమరుబాకు
వడఁకిమ్రాఁకులనంటిపట్టుకొనక
మిట్టిపాటును నెగరిపాటట్టలంపుఁ
బ్రిమ్మరితనంబుఁ గఱకుఁదనమ్ముమాని
మునిఁగి డాఁగి పఱచి కూలి చనియెనేని
యెంతమండిపడిన మరుఁడేమిసేయు. 20

చ. దరిచెడి కానపాల్పడియె దండులు, తూపులువిచ్చిపోయెఁ దే
రరుదుగ మూలఁబట్టెఁ, జెలువారుసిడంబులు నీటిపాల్పడెన్
విరివిరిపోయె వారియును విన్నిగదాలువు కంటి మంటలన్
మరుఁడునుసిగ్గై, గొందలముమానుము పూవిలుకాని డాడికిన్. 21

వ. ఇట్లు నెచ్చెలులెచ్చరించుచుఁ దోడుకొని చనుచు. 22

జాలజాలగు కాల్వదరిఁ జనఁజాగి జాగిటుచేయ నేటికి
నాడ నాడుకోయిల యిపుడేమఱచెమఱచెనీనుడి నేటికి
జానజానగు తావితావెదఁ జల్లజల్లని బావిఁగందమె
పూనిపూనికలెల్ల దీఱఁగ మొల్లమొల్లపుఁ దావిగొందమె
యలసియలసిగ పూలురులఁజఱియందయందఱుఁగూరుచుందురె
వెలయవెలయనరాని కొలంకు వేఁడివేడిఁదొలంచుకొందురె. 23

సీ. అడఁగుల కెంజాయ లలముపట్టులుచూచి
తలిరాకుపడెనంచుఁ దలఁచివంగి
తనచూపుచాలు పర్విన పూలఁదేంట్లని
చాఁచిన కెంగేలు సరగఁదీసి
తగఁబల్వరుస తెల్పు జిగిపర్వఁగెల
మల్లెమొగ్గలటంచు గిల్లబోయి
యొడలిబంగరునిగ్గు లడరుమ్రాఁకులఁజూచి
సంపెంగననలంచు సరసఁజేరి
యొండొరుల నవ్వుకొంచు నయ్యువిదలెల్ల
విరులుకోయంగఁ జొచ్చిరి వింతమీఱఁ
గలికినడకల నంచల గరువమడఁచి
యందియలు కాళ్ళ గళుగళ్ళు మనుచుమ్రోయ. 24

గీ. చిగురుటాకులు వడిఁద్రుంచెఁ జెలువయొకతె
యపుడ చేతులకసిదీఱునట్లుగాఁగ
మల్లెమొగ్గల వెసఁద్రుంచె మగువయొకతె
యలుకమెయిఁబంటఁ బగపట్టినట్టుగాఁగ. 25

సీ. వడిఁబొన్నవిరిగోసి మొడిఁబెట్టెనొక్కతె
పొక్కిలితో సరిపోల్చుకరణి

వెసఁగోసిసంపంగి విరినిమూర్కొనెనొకర్తు
ముక్కుతోడను సరిపోల్చు కరణి
చిగురుజొంపముద్రుంచి చేతఁదాల్చెనొకర్తు
పాణిఁగేలితో సరిపోల్చు కరణి
మొగలిరేకులుగోట ముట్టిగిల్లెనొకర్తు
మొగిగోళ్ళతో సరిపోల్చుకరణి
దొండపండునుగొఱికె వాతెఱయొకర్తు
పాసఁగఁ గెమ్మోవితో సరిపోల్చుకరణి
తీవెమొయినంటఁ జే యెత్తితిగిచెనొకతె
పూని నెమ్మేనితో సరిపోల్చుకరణి. 26

గీ. వెలఁదులమ్మామిడికిఁ జిగురులు విరులుఁగోయఁ
దూలి నెవ్వఁగఁబొందుచుఁ దోఁటబోటి
యొకటఁ గన్నీరు నించెడు నోయనంగఁ
దాడిమలను నీరుకాఱంగ దొడఁగెనపుడు. 27

వ. ఇట్లు పూలుగోసి యలసి సొలసి యమ్మగువలెల్లం జెమ్మటలఁ దొప్పదోఁగి నెత్తమ్మికొలంకున నీరాడఁగోరుటయు నచ్చిత్రాంగద.

గీ. మేలిమగరాలపట్టుల మెల్లనడచి
మెఱుఁగులీనెడు రతనంపు మెట్లుడిగ్గి
వలపుగాలిపెడు తామరకొలనుఁజేరె
నొక్కనెచ్చెలి కేల్దమ్మి యూఁతగొనుచు. 29

క. క్రొవ్వెదనించుకకనుఁగొని
క్రొవ్వెదనించుకయు విడిచి గుంపుగ నంచల్
దవ్వులమొయిలని పాఱెను
నవ్వులపాలయు కొలఁకుదఱి నవ్వులవలనన్. 30

చ. చెలువలు సొమ్ములు న్విలువచీరలు నొడ్డునఁబెట్టిపావడల్
బలుచనుకట్లుఁగట్టి సరివారలఁజీరుచు నీరుచొచ్చి రా
పొలఁతులకొప్పు ముక్కు మొగముంగని యంచలుఁదేంట్లుజక్కవల్
జళుకున నల్లమబ్బు జిగిసంపెఁగ చందురుఁడంచుఁ దూలఁగన్. 31

సీ. చిలుకలకొల్కుల చేతులునడుగులు
నెఱ్ఱదామరగుంపు నినుమడింప
ముద్దులగుమ్మల మోములుఁజన్నులుఁ
బొందామరలగుంపుఁ బుట్టఁజేయ
కలువకంటుల వాలుఁగన్నులచెన్నులు
నాలుగన్నగమి నిబ్బడిగఁజేయ
క్రొవ్విరిబోఁడుల కురులమొత్తంబులు
నాఁచుతీవెలపెంపునలువరింప
నెలఁత తెల్లను గుములుగానీరు చేరి
యింపుదళుకొత్తఁ దెల్లుగా నీఁదునపుడు
చెలువుమీాఱిన నెత్తమ్మి కొలఁకునకును
గరముపింతగఁ గ్రొత్తసింగారమొదవె. 32

చ. చెలువయొకర్తు కేఁజిగురుఁ జిమ్మనఁగ్రోవి యమర్చి పూవుఁదే
నెలు చెలిమోముదమ్మిపయి నెమ్మనిజిమ్మినఁ గేలుదామరల్
తళుకుమొగంబుచేరువకుఁ దారుచుటొప్పగుఁ బూవునీటికిం
దలఁకకు మేముగల్గనని తమ్ములుబాసట వచ్చునచ్చునన్. 33

గీ. ఒండొరుల కేలుఁదమ్ముల నొక్కమొగిని
నెమ్మొగంబుల పయినీరుచిమ్మటొప్పెఁ
దమ్మిపూఁదేనియను జూపుఁదుమ్మెదలకు
విందుచుతమి నోగిరంబుగఁ బంచునట్లు. 34

గీ. ఇట్లు కోలఁకువెల్వడివచ్చి యింతులెల్లఁ
జమ రవణములు వల్వలుఁదాల్చి పిదపఁ
బువ్వుఁబోఁడిని గై సేసి పూలుదుఱిమి
పొసఁగ మొగమునఁ గస్తురిబొట్టువెట్టి. 39

గీ. మెల్లమెల్లనె యుపరంజిమేడపొంతఁ
బూవుఁదోఁటను గుజ్జుక్రొమ్మావి నీడఁ
జెన్నుమీఱెడు నెలతాలతిన్నెమీఁదఁ
బాలఁతిఁ గూర్చుండఁబెట్టి యాపువ్వుఁబోండ్లు. 40

క. జాణతనపుమాటల వి
న్నాణముచూపి చెలియమదినాటిన కుందుం
బోనడఁచి ప్రొద్దువోవఁగ
వీణియఁగొనివచ్చి ముందుపెట్టిన వేడ్కన్. 41

గీ. తీగెలుబిగించి సుతి కడుఁదిన్నపఱచి
పూని వీణియను బుజంబుపై నిమోపి
కేలునవరించి సారెల వ్రేలునిలిపి
యెలమిమీఱఁ జిత్రాంగద యింపుపుట్ట. 42

సీ. క్రొవ్వాఁడికొనగోళ్ళ గ్రుచ్చితంతులుమీటు
నందంబు మదిజల్లుమనికలంప
మురిపెంబుగాఁబల్కు ముద్దుటెలుంగున
కల్లనఁగోయిల లఱుగుదేర
సారములుకలిపించి సొగసుగాఁబలికించు
వింతకుఱాళ్లెల్ల వెసఁగరంగ
వాయలుగాఁబాడెడు నోఱపై నపాటకుఁ
జేరువమ్రోడులుం జిగురుపట్ట

క. ఒప్పుల కుప్పయనంజను
నప్పడఁతికి నామదిఁగల యలజడియెల్లం
జెప్పికరంచక యేమో
చెప్పితినని నీవసడ్డచేసెదుసుమ్మీ. 49

వ. అనిన నవ్విశారదుండు నవ్వి కప్పడతితోడ. 50

గీ. ఎంత దేవర పనియన్న నింతలోనఁ
బూని పండించుకొనివత్తుఁ బొసఁగఁబలికి
యాపతియెయన్న నెయ్యంబుగానిపించు
నెలనగవునవ్వి తలయట్టి యెగరవైవ. 51

చ. అలయది సన్నగా నెఱిఁగి యాతఁడుసామి హొసాదటంచు రెం
డడుగులు ముందుసాఁగి మొగమల్లన జేనిదెసన్మరల్చి చే
తులువడిమోడ్చి సంతసముదోఁపఁగ నిచ్చట నున్న యట్టిలే
తలఁపుము పోయివత్తునని దారినిసాఁగెను వేగనేఁగఁగన్. 52

సీ. నెలతాల నేల పజ్జలఁగ్రాలుగొజ్జంగి
పువుసీటియేటి వెల్లువలుదాఁటి
కపురంపు టంటికంబపుగుంపునంటిన
తుదిదారిగోరింట పొదలుదూఁటి
యల్లిబిల్లిగ నల్లు మల్లెతీవెలనల్ల
మెలత్రేఁటిమేటి పాటలకునలరి
సురపొన్నగున్నల దరినున్నతిన్నల
పయిపోలి మేలిత్తెనియలుగ్రోలి
తావిచెంగల్వబావుల క్రేవనడిచి
కన్నెగేదంగిపొదరిండ్లు గాంచిమెచ్చి
క్రొత్తజవ్వాజివలపులు గుత్తగాంచి
గుజ్జుమావిసీడల పజ్జచరిగి. 53

యని చెలిపిందుత్రోడ మముముసవ్వలఁ జూడకమున్నె యిట్లు నీ
వనవిని నంతనుండి మదికచ్చెరువయ్యెడు మూకుఁదోయ్యలీ. 58

క. దవ్వులనాతనిఁ గన్గొని
పువ్వారుంబోఁడి యొక్క పొలఁతిఁ బిలిచి యీ
విప్వచ్చు బాపనికినిడ
నెవ్వడినోక గద్దెఁగొంచు నెచ్చెలిరమ్మా. 59

క. అని తనయనుఁగును గనుఁగొని
గొనబునఁ బనివినఁబనిచినఁ గొనకొనిచని చ
య్యన సిగనిగమనుగద్దియఁ
గొని చనువును నెనరునుబెనఁగొన నటననిచెన్. 60

వ. అప్పుడతండు. 61

గీ. అదిగొ 'విప్వచ్చు బాపఁడంచ' నెడునార
యీ మెయొఱఁగి నన్నానవాలిడియె నే మొ
పల్కినటులు నీవీవచ్చుబాపఁడంచు
నువిదమదినెంచి యిట్లని యుండఁబోలు. 62

క. అని సందియంబుదొలఁకఁగఁ
జనియాతఁడు చెంతఁజేరి పరగనడఁకువన్
ననబోఁడి చేయిచూపఁగఁ
గనుసన్నలఁ గూరుచుండె గద్దియమీఁదన్. 63

వ. అంతనప్పుడు. 64

ఉ. త్రోరపుఁబేరులూడ ననదుంగవ్రునల్లలనాడ ముంగురుల్
పారెఁకవీడఁ గ్రొంజెమట చక్కని చెక్కులమీఁదఁగూడ బం
గారవు గిల్కుటందియలు కమ్మనిపాటలు పాడ నెంతయుం
గూరిమి నేలవేల్పు నడుగుంగవకుం జెలిమ్రొక్కెఁగ్రక్కునన్. 65

గీ. త్రొక్కి నిలిచినఁ జిఱునవ్వు మొలకలెత్తెఁ
బొల్తికాంతరవకు మీావు నెలఁడియనుచుఁ
బుడము వేలుపు దీవించి పువ్వుకంపు
చేతిలోనుంచెఁ గూర్మితోఁ జెలువకప్పుడు. 66

ఉ. కన్నులఁ బిన్నకప్పులఁతుఁ గ్రక్కొని కన్నులనొత్తి మన్ననన్
బ్రొన్నరయన్నమున్న నెఱిగొప్పున నప్పుడ నేలవేల్పు గ
న్నన్నలఁదాల్చి కొంకఁగిరు చందముఁ బొందఁగఁ జాలు కేల్పదం
దిన్నఁగ మోడ్చి లోఁ దనివితీఱని కూరిమి మీరమీాఱఁగన్. 67

ఉ. మొంటగు వేక్క డొంటమున మీాఱఁగఁ దమ్ముల కన్నదమ్ములై
దండిగనున్న మీాయడుగుఁదమ్ముల కిమ్ముల మ్రొక్కఁగంటి మీా
యండను జేరి మిమ్ముఁ గొనియాడఁగఁగంటిని మంటి నేఁడు గా
పండువుమాకు మాకొదలు వాసెను మీాదగు కూర్మి చేరిమిన్. 68

గీ. అనిమఱియు నేమి యో యప్పుడన్నుఁగదలఁబి
సిగ్గుచేఁ బల్కఁజాలక చెలులవంకఁ
జూడఁగా నామెయుల్లంబు చొప్పెఱింగి
వారిలోపల మణిరేఖ పలికెనిట్లు. 69

గీ. పెల్లుగాచెడు వేరెండఁ బెంపుతఱిగి
కుందనమువంటి నెమ్మేను కందిపోవ
నెచ్చటెచ్చటఁ ద్రిప్పంగ నిచ్చయిడెనో
కటికితనమూని మీాయుల్ల మిటులుమిమ్ము. 70

క. బడలిక యుడుగఁగఁగొండొక
వడిమీారిచ్చోట నిలిచి పలుకుండోగి మీా
యొడయం డెవ్వఁడో మీారి
య్యెడకు న్విచ్చేసియుంట కెయ్యది కతమో. 71

వ. అనియనుగుణం బొండొకవడి చిఱుముసిపాటున నెడఁదంపలపోసి
యతం డప్పడంతుల కిట్లని చెప్పందొడంగె. 72

ఉ. మావారి యొప్పుఁ జెప్పఁదరమా మనకవ్వాడి యాతఁడారయం
బైదలివేశ్యమీఱ విను మానిక ముందలఁదాల్చుదిట్టదా
గాదిలివేఁటకై యెఱుకకై నడి నిప్పుడువచ్చెఁగాన కే
మావట వెంటవచ్చితిమి యాయనచూడ్కికి విందుసేయుచున్. 73

చ. తపవృలనుండి యేము ముదితా యతఁడొచ్చటి కేగుచుండు వెం
బడిఁబడి వచ్చుటచ్చటికి వానయు నెండయు నొకవేశ్యతో
నడుచుచుఁగాల్చుచున్న కతనం గడు నెయ్యముచూపి నిచ్చలా
తఁడొయొనఁగుంజుమీ తనకుఁదానె మదిన్మముమెచ్చి యన్నియున్. 74

సీ. చెలియరోవిను మేనుజెప్పెదనంతయు
మొదల మావారొకపూర్వికి నెఱపఁ
దనమన్కి వెలువడి తద్దయుఁగోరిక
నందందుఁ గలవాఁకలరసియరసి
యలతుమ్మెదలపాట లాలించియాలించి
సాలయుక వింతలు చూచిచూచి
చెలువంపుఁగోనలు తిలకించితిలకించి
కన్నారఁగొండలు గాంచికాంచి
నెలలుపంద్రెండు పోలుపుగ నేలఁదిరిగి
తనదుపూనిక నెఱవేర్చి చనఁదలంచి
వెండియిచ్చోట నొకపూఁటయుండమదిని
దలఁపుపుట్టిన నాఁగి నేఁ డొలమిత్రోడ. 75

సీ. సరిమాలుమావుల దరిఁగ్రాలుబావుల
విరిచాలుతావుల వేశ్యనొంది

-చ్చోటికిముందుగాఁ బనిచెఁ జొప్పుగనుంగొని రమ్మటంచు న
మ్మేటియు వచ్చెఁగర్జమిట మేలగుపల్కఁక వీనుసోఁకినన్. 81

క. ఇచ్చట కొమ్మలచెలువున
కిచ్చను గడుసంతసిల్లి యీకోనకునే
మచ్చుగవచ్చితిమీఁదగు
మచ్చిక నీయలరుఁగొమ్మ మాదొరకనుచున్. 82

వ. అని చేతిలో నొక పూఁగొమ్మ పట్టుకొని. 83

క. ఇక్కొమ్మపైఁ దలంపెద
నెక్కువగాఁ గల్గియుండు నింతిరొకనిన్
ముక్కంటి యబ్బరంపడు
నిక్కముదాఁచంగనేల నీమానసుమీ. 84

క. అని తెల్పివారివెండియుఁ
గనుఁగొని యోకన్నెలార గారవమునమీ
ననఁబోడిఁ గన్నునుండియు
నెనరును వేడుకయువెఱఁగు నెలకొనెమాకున్. 85

ఉ. ఈమురిపెంపుఁ బల్కులును నీనునుఁబాటల యొప్పిదంబు నీ
మోము చొకాటపుంగనిన ముద్దియలారవినుండు వేయునిం
కేమిటికీవెలంది మదినెంచఁగఁ దామర చూలి రాణియో
యామె యొనర్చినట్టిజవరాలో యనంగను మాకుఁదోఁచెడున్. 86

క. తొయ్యలి ప్రోలెయ్యది పే
రెయ్యది యీచెలువఁదాల్ప నెన్నికఁగనెనో
యియ్యెలనాగం గడుపున
నెయ్యెకిమీఁడుగనెనో యెఱిఁగింపుమమాకున్. 87

వ. అనిన వతని జాణతనంబునకును నేరుపుమాటల పొంకంబునకును
డెందంబున నివ్వెఱపడి. 88

గీ. మేరయొక్కింత చెప్పి మెప్పింతు ననుకొన్న
నెలఁతెనియనప్పుఁ బాలవెల్లి
పలుకుఁ జెలికిమిగులఁ దలమునకలయినచో
నొరులుదాని నరయ నోపువారె. 95

గీ. అట్టియెకిమీనికి ననుంగుఁబట్టియీమె
కనులయెదుర నె కాన్పించు కతనవేఁజ
యీమెచెలువంబు పొగడంగ నేలమాకుఁ
బలుకు వెలఁదుక మెప్పునఁ గలిగెనీమె. 96

ఉ. సడను మీకెరుంగనివి యేవియు లేవటుగాన మీఁదనే
జాడల నెప్పుడెవ్వనిని జవ్వనినెట్టనఁ జెట్టవట్టునో
వేఁడెద నిక్కువంబు వినిపింపుఁడు కల్లలుపల్కరేని నా
తోడునుస్ఁడీ యటంచు మదిఁ గొట్టిలఁబల్కిన నవ్వి యిట్లనున్. 97

క. మేమరయఁగ మీవారము
కామే మమ్మింత వేఁడఁగా లాఁతులమే
లేమా లెస్సగఁజూచిన
మీమెలఁతుక యొక్కటియును మేమొకటియునే. 98

మ. చెలియా సందియమేలనీపడఁతుకం జేపట్టు విప్పచ్చుఁ డి
మ్ములనామాటలు నమ్మియుండు మిటుపైఁ బూబోఁడియుం గ్రీడి తా
మలరుందావియుఁ బోలెనొక్కటయు యొయ్యారంబుగా నుండఁ గ
న్నులనిండం గనువేడ్కయీచెలులకు న్గొన్నాళ్ళకే కల్గెడున్. 99

క. కన్నుల విల్గలవాఁడిం
కన్నులలో మేలుబంతియగు నీనవలా
కన్నుల తూపులుగావే
గన్నులదొరపట్టి గెలువఁగలవాఁడుసుమీ. 100

దప్పులెన్నక మన్నింపఁదగదెయిట్టి
చేతిపనితీర్పఁ దమకెంత సేపుపట్టు. 107

సీ. పఁజేయువిన్నపం బీడేర్చిననుగదా
యేకీడుమాట నాలింపఁదప్పు
నీకుఁగ్రీడిఁ దనపట్టినియ్య నీకొల్పినఁ
గద మెండు నాగుండె కుదిరియుండు
నామేలిమాట నాయమచెవివేయఁ గ
ల్గినఁగదా నెమ్మదివనటమానుఁ
బడఁతియాతని చెట్టఁబట్టఁ గాంచఁగనబ్బు
నాఁడుగాపండువు నాకుమిగుల
ననుచు మణిరేఖమఱియు నెయ్యమునఁబలుకఁ
బడఁతి జేని నెప్పుడు చెట్టవట్టునోయను
తమకమునఁ బల్కితినిగాని తమరుపలుకు
మాట మున్గొంగుబంగారు మూటమాకు. 108

గీ. అనిన నన్నెలవేలుపు కనఁలుమూసి
యపుడు లోనిచూపున నేదో యరయునట్లు
మదినిదలపోసి కనువిచ్చి మగువలార
మేముదపసులమయ్యును మీకుఁగాను. 109

క. తడయక కవ్వడికడకున్
వడిఁబోవఁగ నొప్పుకొన్న వారమువల మా
యొడయఁడును వేచియుండును
బడఁతీపోదుమని సెలవువడయుచునరిగెన్. 110

వ. అంత నక్కడఁ గవ్వడియును. 111

గీ. ఇచటనున్నట్టులేతన్ను నెంచుమనుచుఁ
జెప్పి సంగడి కాఁడెంత సేపొయయ్యెఁ

బోయిరాఁ డాయె నిదె చాలఁ బ్రొద్దువోయె
నచటఁ బోయిన పనియేమొ యక్కలాలు. 112

గీ. అనుచుఁ దలఁచుచు నవ్వులవరుగుఁ బెంచు
నెచ్చెలిమికాని దవ్వుల నెఱ్ఱఁగాంచి
యెదురుచని చెప్పినంత కోర్కెపదను లేక
చనినపని కాయరో పండె యనుచు నడుగ. 113

గీ. ఏనుబోయినపని గాయమేలయగును
బనిని పండించుకొనిరె నేవచ్చినాఁడ
నిన్ను మున్నట్లు వీడ్కొని నేనుగదలి
తోలుతఁ గారుకోనలు దాఁటి తోఁటఁజొచ్చి. 114

క. ఎలజవ్వనముం దొలఁకఁగఁ
దొలుకారుమెఱుంగులట్టి తొడవులుగల యా
బలు సింగారంపు నెలం
తలలోపలఁ గూరుచున్న నాతుకఁ గంటిన్. 115

వ. ఆచక్కెరబొమ్మ చక్కదనమ్ముఁ గించుక వక్కాణించెదఁ జక్కఁగా
వినుము. 116

సీ. బయలరిక్కలచాలు పాఱవైచినయెగ్గు
మలలనెల్లను బట్టువఱచునేగి
పవడంబులను బ్రమానుపడఁగఁ జేసినకీడు
సింగంబునడవిపాల్సేయురవ్వ
చందురులోఁగందు పొందించునారడి
చిగురులఁగ అకుగాఁ జేయుకోడవ
నెత్తమ్ములను లోఁతునీటవైచినరట్టుఁ
బసిఁడికిఁ దావిఁగూర్పనికొఱంత

కలికిగోరులు సిబ్బెంపుగబ్బిగుబ్బ
లలఁతి మోపియు ననమఁగా నలరుమోము
నొనబుచేతులు తెలిగన్ను లొనరుమేను
జేసిన త్తమ్మిచూలి ఘోఁజేసికొనియె. 117

గీ. ఈమ కలిగించియును బువ్వుబోఁడికీడు
కలుగకుండఁగ నొనరించె నలువయాత్ర
తలఁచిచూచిన నేదియో తమ్మిచూలి
బక్కగావింపఁగాఁబోలునిక్కముగను. 118

గీ. నలువ తమ్ములఁ గల్వలఁజెలువుమీాఱఁ
జేసి యవి రేయుఁబవలును జెన్ను లేని
వాటపాడగాంచి యీరెంటి నేటఁగలిపి
కలికికన్నుల ననయంబు వెలుఁగఁజేసె. 119

గీ. నేలపై నంటులుంట నేమేలివింత
యనుచు మదినెంచి వింతసేయఁగఁదలంచి
నలువ యనఁటులపై నేలకలుగఁజేసె
నెలఁత తొడలును మొలయునన్ నెపమువెట్టి. 120

ఉ. మించులఁ గెంపుల న్నులను మేలియనంటులఁగూర్చి నల్వమై
మించును వాతెఱ న్మొగము మేల్తొడలుం దగఁజేసి వానిలో
నించినతళ్కునున్ బిగియు నీలియు నాకును దీసిచూపులున్
బించపుఁ గుబ్బలుం దుఱుము వీఫు నొనర్పఁగఁబోలునింతికిన్. 121

చ. అలతలకట్టు లింతితఱు లన్ను కనుల్నిడుదల్వెలంది చె
న్నులరెడు బొడ్డువట్రుసుడి నాతుకనై కపుఁగొనునున్న బం
తులు ననబోఁడి చన్నుఁగవ దొంతిగవిద్దెలు రూపుపూని యీా
మెలఁత నెపంబునం బుడమిమీాఁదను గ్రుమ్మరుచున్న వారయన్. 122

గీ. నేరకేఁటి యసట మీఁదు నిగ్గుమర్రి
నాతిచెలువంబుఁ జేయుచోఁ దాతకాఁక
మగువనెన్నడు మొలకింప మఱచిపోయె
ముదిమివచ్చినతతి నెల్లు మదలుపలుసు. 123

క. చన్నుఁగవ యుండఁదుఁగను
చన్నుఁగవయుం దలఁగు వట్టివృత్తిగా
నెన్నడుము గసితలఁచితి
నిన్నుఁదుము మునుగనియెఱుంగ మీయసదనుమణీ. 124

గీ. కలిమి కొంచెంతెకన్నను గరముఁగలిగి
జాయిగానుండె బిగిగుబ్బ దోయిమాపు
మొంచు నెత్తమ్మిమొగ్గల నిండియుండి
గొప్ప మొసలిచేసిన మేటికొలఁకుఁబోలి. 125

క. పలువరుసలల్ల మల్లెల
పలువరుసలనంగవచ్చుఁ బైదలి చెలికి
త్తెల వగచూపు తెగలు క
ల్వలవగచూపు తెగలనఁగవచ్చును జేఁజా. 126

గీ. అనిమతియుఁ జెప్పఁబోవఁగ నతఁడుచెప్పు
మాటకడ్డంబువచ్చి యమ్మేటితేఁడు
నిట్టులంబగు తమకంబుపట్టలేక
తనదు సంగడికానితో ననియెనిట్లు 127

చ. పొదలెదు వేడ్క నీవిపుడుపోయిన కర్జముమాటమాని నీ
కొదుఁగనిచేతఁగాని పనియొక్కటి పైనిడుకొంచు నేమియో
చదివితివింతసేపు నీకఁజాలుఁబోగ త్తలు కట్టిపెట్టి యిం
పొదవఁగఁ దొత్తలఁదెల్పు ననున్గృలికైకొన నిచ్చగించుటల్. 128

చ. అను చెలికానిత త్తరము నంతయుఁ గన్గొని తాను జేని వీ
డ్కొని యటుపోవుటల్ మొదలుగన్బ్రతలుండిన పూవుఁదోఁటకుం
జని పలుకాడుటల్తుదిగఁ జక్కఁగనంతయు విన్నవించియొ
య్యన జెలికత్తియల్ పలికినట్టి తెఱంగెఱిఁగించి యిట్లనున్. 129

గీ. నిన్ను వేఁడెద మన్నించి నన్నొకింత
పలుకు చెవిఁ బెట్టి యాకన్నె వలన నీవు
మున్ను గన్న కొమారుని వన్నె మీఱ
నెలమి మామకుఁ బెంపుగ నియ్యవలయు. 130

గీ. ఇంతవట్టును జనవిప్పుడిత్తువేని
కొమ్మ తప్పకిప్పుడు నీదు సొమ్మ సుమ్మ
నేను జెప్పితి నని వెన్క నేరమిడక
యిపుడ ముందుగఁ జక్కఁగ నెంచుకొమ్ము. 131

ఉ. ఏలతలంప వేపలుకు లించుక దేవర యానతిచ్చినం
జాలును నేలతేని సరసం దగ నేలినవారికర్జమున్
పీలుగ మాటవెంబడిని విన్నపమాననఁజేసి వేల్మిడిక్
మేలొనగూర్చి వత్తునను మెచ్చఁగ నిప్పుడ పోయి వచ్చెదన్. 132

వ. అనిన గారవంబున విశారదున కానేల తేఁడిట్లనియె. 133

క. సతమును గోరికలూరఁగ
నతివఁగవయ నెప్పుడెప్పు డనుచుండఁగ నిం
తతడవు జెప్పఁగ నేటికి
బలిమాలఁగ నేఁడు క్రొత్తవాఁడనె నీకున్. 134

చ. పలుకులిఁ కేల నీపనువు పన్నఁగఁ జేసెద నెన్నఁడైన నీ
పలుకున కడ్డమాడుదునె పట్టినొపంగద తేపెపోయి యా
పొలఁతుక కన్నతండ్రికడ ముచ్చటలాడుము మేలు నెంచి నీ
కెలమి నిఁ కేధియిచ్చినను నించుకయేనియు నప్పుదీఱునే. 135

సీ. అనుచుఁ గొనియాడి చెలికానిఁ జనువుమీఱ
మగువపలికిన పలుకులు మఱియుమఱియు
నడిగి విన్న వేవించు నెయ్యంబుమిగుల
వేడ్కపడుచుండెఁ గవ్వడి విసుగులేక. 136

వ. అనినఁ దరువాతికత చెప్పుమని జనమేజయుం డడుగుటయు. 137

నిరోష్ఠ్యకందము. రక్కసితేండ్లఁగలనన్
జక్కడఁచి యలతెఱఁగంట్ల సాఁకెడిదిట్టా
చక్కఁగ నెల్లర సేగిం
జిక్కఁగనియ్యక యరసెడిజేజేరాయా. 138

ఉత్సాహ. చుట్టువాలు కేలఁబూని చూడువిన్నఁజంపి చే
పట్టువాఁడఁ గ్రీడినంచుఁ బన్ని తేరుడిగ్గి వే
పట్టుపట్టి విన్నువాఁకపట్టిమీఁది కేగుచోఁ
జట్టిక్రీడి వెన్కకీడ్వ బాగుమీఱువేలుపా. 139

## గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశ్శోభంధుర కందుకూరి వంశ పయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన రసిక జనమనోరంజనం బను ప్రబంధరత్నము నందుఁ దృతీయాశ్వాసము.

---

# రసికజనమనోరంజనము

## చతుర్థాశ్వాసము

క. సిరిపడఁతి యెడఁదనెప్పుడుఁ
గరమలరఁగ గొల్చువారిఁ గడుఁగూరిమితో
నరయుచు నెల్ల జగమ్ముల
వెరవారఁగ బ్రోచుచుండు వేల్పులవేల్పా. 1

వ. వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పం
దొడంగె నట్లా బూటకంపు నేలవేలుపు సూటిగామాటలాడి నగా
చేడియలన్వీడ్వ్యాని క్రీడికడను స్వేదుకమెయిం జనిన వెనుక నన్ముచ్చె
కంటి తమకంబు హెచ్చిపెచ్చుపెరిగెడి మరుచిచ్చున బ్రేఁగంబొచ్చిన
నెచ్చెలులెల్ల బెల్లుగఁ దల్లడిల్లి యుల్లంబులోని యూరటంబు దీఱ
నూఱడింపుచుండ. 2

క. పడమటిమల కలుగులలో
నడఁగిన యిరులను గడంక నవలికిఁదఱుమన్
వెడలెడి వడువున నడిచెను
బడమటికొండకును బ్రొద్దువడిఁగెంపడరన్. 3

చ. అదనడితప్పి వేఁడివెలుఁగ త్తమిలన్ దడమెత్తుపాముగా
ముదొరవినంపుమంటలనఁ బొల్పగుఁ బడ్మరసంజకావి, పైఁ
గుదిరిన సందెచీఁకటి తగుంబొగయట్లు, చెలంగు నల్లత్రాఁ
చుదడములట్ల చీఁకటులు, చుక్కలొగిం దలమానికంబులౌ. 4

గీ. గొండ్లిసలిపెడి యురవడి గుబ్బలల్లు
జడలగుంపులువీడి యీపుడమి నెల్ల
నలముకొనియె ననంగను నలుపుమిగిలి
కటికిచీఁకటి యెల్లెడఁ గ్రమ్ముకొనియె. 5

చ. అలరెడు రేవెలంది చెలువారఁగఁదాల్చిన కావిరంగుదు
వ్వలువవదల్చి చందురని వావిరిఁబొంగఁగగోరి మల్లెమొ
గ్గలుగల నీలిచీర మెయిఁ గట్టెననంగను జూడఁగొప్పెఁ జు
క్కలగమితోడఁ జీఁకటులు కన్నులపండువుగాఁగ నయ్యెడన్. 6

ఉ. గొంగలుదూఱుచున్నడలి గోడలుదూఁకుచుఁ బొంచిపొంచి బల్
సందడిగాకయుండఁ జెఱుపంగుల వెంబడిఁ దావుఁ జేరుచుం
బందియమంద కాఁడికి నైఁచుచు సాముల మోసపుచ్చుచుం
జెందిరి కోరుకోరికలఁ జేరిబొజుంగులు దొంగలుందగన్. 7

గీ. తమ్ములకు దాయయౌతేఁడు తాజగమ్ము
నందుఁ జొచ్చియుంటకుఁగాను ముందుపంపి
నట్టి తెలిగుడారమనంగ నమరెఁ దూర్పు
దెసను దెలివన్నె కలువలు తెల్వినొంద. 8

ఉ. చుక్కలతేఁడు చీఁకటులసూడు వెలుంగులతేని ఱేడు బల్
జక్కనపుల్గు మొత్తముల సారెకు నేచెడువాఁడు చక్కనౌ
మిక్కిలి కంటిదేవరకు మేల్నగయై తగువాఁడు కల్వలన్
మక్కువఁబ్రోచుతేఁడు మరుమామ కనంబడెఁ దూర్పుకొండపైన్. 9

చ. తఱియను వేఁటకాఁ డిరులదంటను కోయిలగుంపుఁ బట్టఁగాఁ
బఱచి వలన్నిగిడ్చె ననఁ బర్వెను దూర్పునఁ దెల్పు, గోఁజగు
ళ్ళొఱకయి పెట్టినట్టు నెలయింపగుఁ, బడ్డ పులుంగనంగళం
కొఱపగుఁ, గాంచి పర్విడెను నోయనఁగోయిల లేగుఁజీఁకటుల్. 10

చ. కొమరువెలుంగు రేవెలఁది కొప్పనఁజీఁకటి, కొప్పుపూలునా
నమరును జిక్కచాల్, నెలయొయ్యారపు రాగిడిబిళ్ళయట్లగున్,
సమకొనుకందు లోనిడిన నల్లనిఱాయన నొప్పు, రాగిడిన్
జమలిగఁ జుట్టుమల్లెలనఁ జందురుచుట్టును దెల్పుగన్పడెన్. 11

గీ. తమినిరేవెలంది యిఱుగందంబు మేనఁ
దాఁజలువల తేఁడప్పుడు తాల్చెనఁగఁ
దెల్లనయ్యెను జందురుండల్లనల్ల
నెల్ల కడలను వెన్నెల లల్లుకొనియె. 12

సీ. నెఱతావులుచెలంగ నిండారవిరిసిన
మల్లెపూవులతోడ వెల్లివిరిసి
కప్పురపుటనంటి విప్పఁబొరలరాలు
క్రంపుఁబొడితోడఁ గలసిమెలసి
కమ్మవిల్తునిదాయ కాపురంబై తగు
వెలిమలజిగితోడ వియ్యమంది
కటివేల్పునిల్లాలిఁ గసిపెంపుగాంచిన
పాలమున్నీటితో మేలమాడి
మెండికొనియుండె బువినిండ వెండికొండ
కొండపిండులఁ జెండెడు దండిహత్తి
పిండికలకండ వెలిఁదమ్మి దండఁ దెగడి
పండు రేయెండదండులు నిండఁజిగిని. 13

వ. అత్తఱి నాబిత్తరి చెలికత్తెలతోడ నత్తోఁటలోనుండి నిండికొన్న పండు
వెన్నెలతెగల సెగలకుం దాళంజాలక. 14

ఉ. చెందొవవిందు దండడినిఁ జిందఱవందఱ చెందికుందఁగాఁ
జిందురు చిందఁ, గొందలముచెందఁగ డెందము కందుఁడందపుం
గెందలిరుం దగందొడుగఁ, గ్రిందుపడందగు పొందికందొగల్
సందడిచిందఁ దుందుడుకు చందముఁబొంది వెలందివందురున్. 15

ఉ. నెయ్యపుటొజ్జ లోఁగఱపి నిచ్చలునూల్కొలుపంగ నోరె మొ
య్యొయ్యన సన్నగించి మదినొంటిగనల్ల జగంబుచుట్టమున్

నెయ్యమునం దలంపుచును నిల్చినవన్నియు మాసఁగా నతం
డయ్యెడ మ్రోలఁగన్నడె నొయారియు వ్రాలెను గన్నుమాయు మా. 16

వ. ఇట్లాతండు తనకన్నుల మ్రోలనిలిచినట్లయిన మదికలంగి యచ్చెలువ యొక్క నెచ్చెలితో నిట్లనియె. 17

ఉ. వీఁడుగదమ్మ నావలపు వీడేఁడిచేసినవాఁడు, పొన్నపూ
వీడుగదమ్మ లోఁతయిన యాతనిపొక్కిలి కింకనావెతల్
వీడుఁగదమ్మ నన్నిపుడు వేయెదఁజేర్చిన నీతఁడున్న యా
వీడుగదమ్మ నేలఁగల వీడులలోపల మేటి బోటిరో. 18

వ. అని పచ్చవిల్తుని నెఱచిచ్చునం గ్రాఁగుచు మఱియుం బలవింపం జొచ్చిన నెచ్చెలులు చలువపనులు సేయందలంచి. 19

సీ. చేడియయడుగులఁ జిగురాకులుంచిరి
యింతిచన్నులఁబూవుబంతులిడిరి
పొలఁతితొడల నంటిపొరలనంటించిరి
ముగుదపొక్కిటఁ బొన్నపూవులిడిరి
యువిదవాల్గన్నులఁ దొవరేకులద్దిరి
చానకెమ్మోవిఁ బూఁదేనె యిడిరి
తొయ్యలిచేదోయిఁ దూండ్లను బెనఁచిరి
కొమ్మకేల్గవ విరిదమ్మలిడిరి
యతివ యడుగులోనగు వానికవ్విపాటి
కావొ సరియౌనొయని చూచుకరణిఁజెలువ
చెలులు కావించిరొక్కటఁ జలువపనులు
వానివానిని బోలినవానిగూర్చి. 20

వ. అంత నొక్క ప్రోడచేడియ వారలంజూచి 21

సీ. మరుచిచ్చుదరికొని మండెడు నెమ్మేన
వీవనల్చేఁబూని విసరవలదు

కంటికాటుక నీటఁగందైన చెక్కుట
ద్దంబుల గందంబుదార్పవలదు
వలపుచీఁకటిబెంపువాసిన తుఱుముతేఁ
టులసంపెగల్చుట్టఁ దలఁపవలదు
బలువిరాళంపుఁగాఁకలఁ గందు చనునిమ్మ
పండులఁ గప్పురం బలఁదవలదు
దెసల నల్లను బర్వుచు దిటముచెంది
పిక్కటిల్లుచు వెలుఁగొందు చుక్కలదొర
కాయు వేఁడివెన్నెలలంకుఁ గలుకులార
పెట్టవలదు తామరకంటిఁ బెంపుమీఱ. 22

వ. అని యాచిత్రాంగదవంకం దిరిగి. 23

సీ. కైదమ్మి మోముచుక్కలరేని సెగఁగందం
జెక్కునఁజెమ్మలఁ జేర్చెదమ్మ
జారొక్కప్పుచీఁకటిఁ జనుజక్కవలుగుందఁ
జానరో కురులేల జార్చెదమ్మ
నునుముక్కు సంపెఁగ నూగారుతుమ్మెదల్
బడలంగ మోమేల వాంచెదమ్మ
మినుకుకాటుకనీట నునుఁజెక్కుటద్దముల్
మాయఁగన్నీ రేల పఱపెదమ్మ
చేయి దామరచెక్కునఁ దీయవమ్మ
ముంగురుల్ జాఱనీకమ్మ మోము మీఁది
కెత్తవమ్మ కన్నుఁగవ నీరొత్తవమ్మ
పలుకువినవమ్మ లేవమ్మ పసిఁడిబొమ్మ. 24

గీ. గట్టువిలుకానినైనను గడియలోన। గ్రిందుపఱుపంగఁజాలిన క్రీడియంత
వానికిని దుంటవిలుకాని బారిపడఁగ।నీకనినుఁగాచుటొకబరువే నెలంత.

గీ. నేటరేవట నీకమన నేలవేల్పు
మన్ననను జక్కఁబడునన్ని మానువెతల
ననుచు ననబోఁడిఁ గనువేఁడి యంనువలన
నూఱట యొకింతగాన కయువిదమిన్న. 26

వ. తోడి చేడియలతోడ. 27

క. మునుకొని మరుఁడ్కై వడి
నవబోఁడి మెఱుంగుఁ జనుల నడుమని పెకమం
జనకుండ గుఱిగనేయుట
గనవింటికె కన్నులుంపెఁ గాఁబోలుఁజుఁడీ. 28

ఉ. చేతులు తమ్మిత్రాంప్లనుచుఁ జేరినయంచలు కొప్పుజూచి వే
భీతున నల్లమబ్బనుచు వెజ్జనఁ, బంచిన గాలినారు పా
మే తఱుమంగఁ బువ్విలుతుఁడేమిటఁ జామనుగెల్వలేమిఁ ద
ర్వాత నెమళ్ళఁగూర్చెఁ బగవానికొమారుని వారువంబులన్. 29

వ. అనిచెప్పి యప్పుడు చెవులుచిల్లులువడఁ గనుఁగూయు కోయిలలు
మొదలయిన వాసంగూర్చి పేర్చిన కినుక పెంపున నిట్లనియె. 30

సీ. ఒరులపంచలఁజేరి యున్నట్టికోయిలా
యెందుకునీకింత యెరిగ్గిపాటు
నిలువఁజోటునులేక నింగ్రివేలెడు చంద
మామ నీకేల్రదిమ్మరితనంబు
చచ్చిచావనివాని చాఁప్పుననున్నట్టి
మరుఁడనీకేటి కీమండిపాటు
కదిసికొమ్మలపాల బ్రదుకఁగాంచిన తుమ్మె
దా యేల నీకింతయదరిపాటు
మిాకుమునుబోలె నిపుడు మామెలతతోడిఁ
యొక్కమాటనుంటయును మోమోటమియును

లోని చుట్టతికంబును జానుమీఁదు
చూపుచెలికారమును గొంతచూడవలదె. 31

క. కలువలదొర యల్లుఁడవై
కలువలె పూవులుగఁదాల్చి కరములరెడు నీ
కలుకమెయి నక్కటకటా
యళుకొందిన కలువకంటి నలఁచుటతగునే. 32

వ. అని మంచిపూటల నెంతవిన్నవించిన పంచువిల్కానివలన నించు
కంతయు నక్కటికంబుగానక కటకటంబడి పడంతిరయా వెసవిల్తునిట్లు
దూఱందొడంగె. 33

ఉ. ఒజ్జలకాపురంబు మొదలూడఁగ ద్రొబ్బిన రేయిద్రిమ్మరిన్
బజ్జను జేర్చికొంటివఁట ప్రగ్గడగాఁగను గన్నతల్లులన్
విజ్జనపీడనాడిచెడి వేఁబలుగాకులఁ గూడుపుట్టు గు
ల్లిజగమందు నీకుడడమేయఁట యింతులదోసమెట్టిదో. 34

గీ. చేతఁ జెఱకువిల్లొక్కటి చిక్కఁబట్టి
కంటఁబడకుండఁ బూఁదూపుగములు నాటె
దేల నికమీఁదఁ దూపులు నేలఁగలియఁ
బీల్చినీవిల్లు వేళ్ళిడిఁ బిప్పియిడుదు. 35

గీ. తోడఁబుట్టినదనియైనఁ జూడకెపుడు
నీకు తల్లియిల్సరిగూల్చి నీదువగతు
కడనుదలమూనికంబయి గరువపడెదు
నెలను జెలిఁజేసికొంటచేఁ దులువవీవు. 36

గీ. అని మరు మఱియుదూఱుఁగ నతివయొకతె
కంటఁబడకుండు మరునేలకటకులాడ
మింటఁగడుమందు నెల చానమేనుగాఁడ
ననుచుమరలింపఁ జందురుఁగనుచుఁ బలికె. 37

గీ. ఒకటి రెండునాఁడులు చెల్లియున్నవాఁడె
చూడరాదని నినుఁ బెద్దలాడుచుండ
పెద్దవాఁడవై మిన్నంది మెలఁగునిన్ను
జనులకుఁ జూడవచ్చునే చందమామ. 38

గీ. తమ్మికంటియటంచు మాతలిరుఁబోఁడి
పలుకమెయినలంచెదవేమొ యట్టుకాను
కలువకంటియెసుమ్ము మాకలికిమిన్న
కనికరముచూపి కావుమో కలువఱేఁడ. 39

చ. సిరికిని దోఁబుట్టువయి చెన్నుగ వెన్నునకున్ మఱందివై
యరపదివేలములున్న దొర కౌదలసందపు మానికంబవై
మరునకు మేనమామవయి మన్నన నత్రికి ముద్దుపట్టివై
కరమలరారు నీకిటులు కల్గులనేఁచి కలంచఁబాడియే. 40

చ. ఒరులకుఁ జేరదవ్వగుచు నోజ్జలకొంపనుదీసి తమ్ములం
గరము బడల్పడంబఱపి కాంచినతండ్రికిఁ బోటు తెచ్చి వం
కరతనమల్ల చిన్నపుడె కాంచి కరంబుననీవు రేయిత్రి
మ్మరివని పేరుపొంది యిఁక మన్ననఁ జూతువె యాఁడువారలన్. 41

మ. కడలివ్వార్వపు టగ్గితోఁబొడమి వీఁకన్మీఱి వేవెల్గు నె
క్కుడుకాఁకంగడువాఁడిమిన్నిలనెలం గూడందగం జాలి యె
ప్పుడుఁ బెన్పప్పపు గాముకోఁతల విసంపుంజిచ్చుకున్ పైఁచి యా
పుడమిన్మిన్నులుముట్టు నీకుఁ జలువల్ పుట్టంగ నెట్లబ్బెడున్. 42

సీ. నీదువెలుంగులు నెఱకాఁకలోటను
జాలనీరగు నెఱటాలె తెలుపు
నీవడతకరంబు నీతంబు తప్పాట
నువిదఁగోల్పడిన నీయొజ్జ తెలుపు

సీదువెన్నెలగముల్ నెఱవాఁడులౌటను
దలవాల్పు తమ్మిమొత్తములతెలుపు
నీరూపు చూపఱకోరువరాకుంటఁ
గవవిడియేగు జక్కవలతెలుపు
నిట్టినీవలనను మేల్మి యెట్లుగెలుగు
పరగనీరూపు నానాఁట సన్నగించి
పిదపఁ బదియూఱుబ్రయ్యలై పెద్దపాము
నిన్నుమ్రింగిన నెలఁతల నెగులుదీఱు. 43

వ. అని చందురుండూటి యుల్లంబు జల్లన మెల్లన మేనెల్లఁ జిల్లులుఁవోవఁ
బెల్లువీచు చల్లగాడ్పుఁగూర్చి యల్లన నిట్లనియె. 44

గీ. లేడికన్నులుగలది యీలేమమిన్న
లేడి నెక్కుచుఁ దిరిగెడువాఁడవీవు
నిట్టి చుట్టఱికంబుండ నింతి నేచఁ
దగునె తనకీవె యుసురని తలఁచియుండ. 45

చ. జగమునకీవుకీడు గడుసల్పెదువంచును దమ్మిచూలి నె
వ్వగనిను నొక్కమూలఁ బడవైచెను దానపడంగకున్న నిన్
దగమెసవంగఁ బాములకు నాల్కలు రెండొనరించి వానికిన్
జగమున వేయియేఁడులుమనన్ బ్రదుకిచ్చెనుగాదె పయ్యరా. 46

వ. అని యెల్లయెడలఁ బిక్కటిల్లి మిక్కుటంబుగాఁ బెక్కువగలఁ జెవులు
వగుల నఱచుచుండు గండుఁ గోయిలలు లోనగువానింగూర్చి
యిట్లనియె. 47

సీ. కొమ్మలనదలించు కూళపయ్యరపిన్న
చలపట్టినిన్నుఁ బాములు మెసంగ
కాకిమూఁకలలోనఁ గలసిమెలంగుచు
గేరుకోవెల నీదు నోరుపడను

పంజ్లకొలుకుచు నిల్వక యెగసిపడెడు
చిలుకనీబ్రతుకెల్లఁ జెప్పఁగలయ
పురుటింటిబూచులపోల్కి నివ్వెఱగొల్పు
తుమ్మెదానీత్రుళ్ళు తుప్పలెక్క
గంతులిడుచును దెరువర్లఁ గలఁచుచుండు
నెమ్మి నీయాటలెల్లను నేలఁబడను
నీళ్ళు నమలుచు మగువల నెగులుపఱచి
నిక్కరాయంచ నీతిండినీరుగాను. 48

వ. ఇట్లు దూఱుచుండ. 49

ఉ. పిట్టలుగూసెఁ జీఁకటుల పెంపెడఁబాసె మెఱుంగు రిక్కచాల్
బిట్టుగమాసె జక్కవలు వేడుకనొండొరుఁడాసెఁ గల్వతె
ప్పట్టునఁ దెల్వివాసె వెతవాసిన తమ్ములుపొంగి తేంట్లకున్
నెట్టనవిందుచేసె విలునేర్పనమూసె మరుండువేఁకువన్. 50

గీ. వెచ్చకాండ్రమదుల వేడుకడిందంగ
పాఱులలరి పగటిపనులకడర
వడిగఁగాఁపువారు పనిపాటలకుఁబోవ
తూర్పు కొండమీఁదఁ దోఁచెఁ బ్రొద్దు. 51

ఉ. క్రిందటిరేఁడె యట్లరిగి క్రీడిపయింగడువాలుఁగంటికిన్
డెందము చిక్కియుంటయును డీల్పడి పెన్వలవంతనింతిదాఁ
గుందుచునుంటఁ గ్రీడి యిటకుం బనిమీఁదను వచ్చియుంటయున్
గుందునఁ జిత్రవాహునకుం దగఁ దెల్పెను జిల్కలర్మిలిన్. 52

చ. తెలిపినఁగొంతసేపు మదిఁదేఁకువదూలియుఁ దెల్విఁగాంచుచున్
మెలపునఁ గ్రీడియల్లుఁడగు మేలిపుడే యొడఁగూడఁ జేసికో
వలెననియెంచి ప్రగ్గడలఁబంచెను గవ్వడిపాలి కప్పుడే
వలసిన మాటలంగఱపి వారిని వీటికిఁదోడితేరఁగన్. 53

క. తగువారల వెంటంగొని
ప్రగడలుచని క్రీడిఁగాంచి వరుసగఁ బలుకం
దగుపలుకులాడి విందుగ
నగరికి విచ్చేయవేఁడ నగుచునతండున్. 54

క. గారవమునఁ దమ్ముందొర
వారట్టుప్రగ్గడలఁబంచి వాసిగఁ బిలువం
గారాకుండుట తగదని
కూరిమి నేనుంగునెక్కి గొబ్బునఁగదలెన్. 55

గీ. ఆముశేనుఁగుపై నెక్కి యర్జునుండు
రాచనగరికిఁ బోవుచోఁ జూచువారు
వేయికన్నులవేలుపు బిడ్డఁజూడ
వేయికన్నులెవలెనంచు వింతపడిరి. 56

గీ. పొడుపుఁగొండమీఁదఁ బ్రొద్దువెల్గెడునట్లు
వెలుఁగుచతఁడు వీట వెడలునపుడు
మెలఁతుక లపరంజి మేడలపయినుండి
పులరువానగురిసి రతనిమీఁద. 57

గీ. క్రీడివేంచేయుచున్నట్టి జాడ తెలిసి
వడిగఁ దగువారితోఁ జిత్రవాహనుండు
గారుపై నెక్కి యెదురేగి గారవమునఁ
దోడుకొనితెచ్చి విడిదిలోఁ దొరనునిల్పె. 58

గీ. విడిదిచేరినపిమ్మట వేడ్కమీఱ
నేకతపుటిల్లుచొచ్చి వారిరువురింత
మంతనంబున నేమేమొమాటలాడి
యొగుడెంచిరి నవ్వుకొం చివలకపుడు. 59

వ. అంతనంతసంబునఁ జిత్రవాహనుండు తగుపోఁడిమిఁ గ్రీడినివీడుకొని తనయింటికిన్వచ్చి పెద్దబంజెచ్చెరరావించి పెండ్లికిదగిన మంచిమూరుతంబు పెట్టుఁడని కట్టడయిడి యూరుగ్గైసేయఁ జాటంబంచిన. 60

సీ. కస్తురిపన్నీటఁ గలయంపిచల్లించి
గోడలుజవ్వాజి తోడనలికి
ముగ్గులుకట్టాణి ముత్తియంబులఁబెట్టి
నెలతాలతోడఁ దిన్నియలువైచి
డంబైన పగడంపుఁ గంబముల్నాటించి
తెల్లక్రొవ్విరులఁ బందిళ్ళువేసి
తోరంపుఁబచ్చలఁ దోరణంబులుగట్టి
రతనంపుదివ్వెలు జతనుపఱచి
కలయబంగరుపని మేలుకట్లుకట్టి
వాడవాడల హొంబట్టు పడగలెత్తి
తావులమెఱుంగుఁ గురువేళ్ళ దడులుకట్టి
వీడుకైసేసి రెలమినవ్వీటివారు. 61

గీ. పెండ్లిపనులెల్లఁజేయించి పేర్మితోడఁ
జుట్టములనెల్ల రావించిసొబగుమీఱ
విడిదిలోవలసినవన్ని వెసనమర్చి
లగనమిదెడాసెనని తేఁడు తగఁగఁబలుక.

క. తలయంటుకొనఁగఁ దఱియని 62
చెలియొక్కతె క్రీడితోడఁ జిలుకమెలుంగుం
గలకలమనినగు జిలిబిలి
పలుకుల వలపొలయ విన్నపంబొనరింపన్. 63

క. ఇదెవత్తు మీవుపదమని । కదలి యనుఁగుఁ జెల్మికాని కైదండం బెం
పొదవఁగఁగొని వివ్వచ్చుఁడు । కదిసెంజలకంబులాడు గరుడలచవికెన్.

వ. అట్లు కదిసియచ్చట నెచ్చెలిమికానితో ముచ్చటలాడుచుండ. 65

చ. పలుకులలాగు నెమ్మొగము బాగును మీసము సూగు నొక్కపై
యలరుటకోర్తె యుబ్రపడి యప్పటి పాటునఁగా నెఱింగి నె
చ్చెలిగమిఁజేరిచెప్పె మనచెంగటముల్ బుపుదోఁట నేగిమిం
బలికినయల్ల బూటకపు మాటలమూట యితండెయంచటన్. 66

క. తనగుట్టు బయలఁబెట్టక । పనిచేయఁగ నోడయఁడెంత వడిగలవాఁడే
ననబోఁడి గుట్టరయ నీ। యన సింగారించి పంచెనని నగిరిచెలుల్. 67

ఉ. ఆమెడ నింతియోర్తు మదినాఁగకకోర్కులు క్రేళ్ళుదాఁట నే
మోయనఁబోవు నెచ్చెలిని మోవిపయిం జిఱునవ్వు మొల్కలే
పై యిగురొత్త గన్నయిగ నల్లనమూనిచి జాఱుపైఁటఁజం
దోయిఁ దార్చుచుంబలికెఁ దొంగలిఱెప్పల నొప్పులీనఁగన్. 68

గీ. మేలుగూర్చినవారికి మేలెకలుగుఁ
గావునను మనమీజన్నిగట్టు నిపుడు
తోడఁబెండ్లికొడుకుఁజేయఁ దొడరవలయు
మనువుకూర్చినపనికిఁగా మగువలార. 69

గీ. అనిన ముసిముసినగవుల నల్లఁబూని
యొండొరుల మోములనుజూచి యొక్కరొకరు
కన్నుసైగల నేమేమొ యెన్నుకొనిరి
క్రీడియునుగూర్మి సంగడికాఁడునంత. 70

గీ. తేటరతనంపుముక్కలిపీట తెచ్చి। వింతకపురంపుఁ బొడులతోఁ బెట్టినట్టి
ముగ్గులోపల వేయంగబుడమిఱేఁడు।వచ్చికూర్చుండెనద్దానిపై నినపుడు

సీ. కురులు చిక్కులుతీసి క్రొత్తసంపెఁగనూనెఁ
దలయంటెఁ జిలుకలకొలికియోర్తు
పచ్చకప్రము చాయ పసపున మేదించి
నలుగిడెనమ్మను నాతియోర్తు

మంచిగంధపుఁదావి మించిగుబుల్కొన
నటకలితలనిడె నతివయోర్తు
బంగారుబిందెలఁ బన్నీరుగొనివచ్చి
జలకంబులాడించెఁ జెలువయోర్తు
నీరుముమ్మాఱు తలచుట్టు నెఱయఁద్రిప్పి
తడవుమనుమని దీవించెఁ బడఁతియోర్తు
రతనములపీట దొరదిగి రాఁగ నెదుట
నిలిపె బంగరు పావలు నెలఁతయోర్తు. 72

సీ. జిలుఁగుజెంద్రిక వన్నె చేలచెఱంగునఁ
బన్నీరు ల్తడియొత్తెఁ గన్నెయొకతె
గమగమవలపులు కషలుముంచుకొనంగఁ
జూసరుల్ సిగఁజుట్టె బోటియొకతె
పెళపెళలాడు దువ్వలువపింజెలుపెట్టి
వెసఁజేతికందిచ్చె వెలఁదియొకతె
రతనాలపనిమేలి రవణంపుగుంపులు
నెమ్మేనఁగీలించెఁ గొమ్మయొకతె
పొలఁతియొక్కతె జవ్వాజిపూసెమేనఁ
జెలువయొక్కతె పన్నీరుచిలికెఁబయిని
పూసురటివీచెఁ దలిరాకుబోఁడియొకతె
నిలువుటద్దమొక నెలంత నిలిపెమ్రోల. 73

గీ. ముద్దుకస్తురినామంబు దిద్దెనొసటఁ
బెండ్లి పల్లకిలో నెక్కి విడిదివెడలి
యరిగె వియ్యపువారింటి కచటమున్నె
మించుబోండ్లు చిత్రాంగదఁ గొంచుఁబోయి. 74

గీ. చలువనెలజాలు జలకంపుసాలలోన। మేలిమిపసిండిపీటపై మెలఁతనునిచి
తేటపళ్ళెరమునఁ గెంపుదివ్వె పెట్టి। జవ్వనులు పాటపాడి నివ్వాళియియ్య.

ఉ. పయ్యెదజాఱఁ జెక్కుఁగవపై జిఱుచెమ్మటపూరఁ బూనరుల్
కయ్యము గోర లేఁగవును గబ్బిచనుంగవ దూఱ జాఱు కొ
ప్పొయ్యన వీపుఁ జేర వెసనూర్పులు పైపయిఁ గ్రమ్ముదేరఁ దా
నయ్యెడ నింతియోర్తు తలయంటఁ దొడంగెను వాలుఁగంటికిన్. 76

ఉ. పాయని వేడ్కఁ దావి వెలిఁబర్వఁగ సంపఁగినూనెయంటి క
ప్పైవ యిరిగుంపు పెంపుగలువంగల నిద్దపు సోగపెన్నెరుల్
పాయలుతీసి దువ్వి చెలువమ్ముగఁ జిక్కులువాపె నింతియో
ర్తాయెడ లేఁత కెంజిగురుటాకుల గేరెడు కేలుఁదమ్ములన్. 77

గీ. పునుఁగుజవ్వాది మేదించి పెనఁచినట్టి। తావి కుంకుముపొళ్లతో దలిరుబోఁడి
మేననలుఁగులు వెట్టెను మెలఁత యోర్తు। గబ్బిగుబ్బల వ్రేఁగునఁ గౌనువడఁక.

గీ. సోలి సంపఁగినూనెచే సొమ్మసిలిన। పెన్నెరుల నెడుతు మ్మొదపిండునకును
వెసను సేదదేఱగ మందు వేయుకరణి। గురులకటకలియిడె లతకూనయోర్తు

గీ. పసిఁడిబిందెలఁ బన్నీరు వరుసనించి
చెలులు రతనంపుగిండ్లతో జలకమార్ప
నెఱులవెంబడి దిగజాఱు నీరు పొలిచెఁ
గ్రొమ్మొయిలు జోరునను వానగురియునట్లు. 80

చ. తలతడియొత్తె నొక్కచెలి తా బెడఁగుం దెలిపట్టుబట్టచేఁ
గలపము మైసలందె నొకకన్నియ కస్తురిబొట్టువెట్టెఁ దా
వెలఁదుక యోర్తు నెన్నొసట వేసలిఁ బూవులుచేర్చె నింతియో
ర్తెలమి నెలంత యొక్కరితె యింపుగఁ గాటుకతీర్చెఁ గన్నులన్. 81

గీ. విలువరతనంపుఁ దొడవులు వెట్టి మేన
జిలుఁగుబంగరు కెంబట్టు చేలఁ గట్టి

చెలులు గైసేయ నెలమిత్రోఁ జెలువ నపుడు
పెండ్లికూఁతును జేసిరి పేరటాండ్రు. 82

వ. అంతఁ బెండ్లిచావడియందు. 83

క. లగనమిదె పెండ్లికూఁతును। నగుఁ దేనని యొజ్జబాపనయ్యలు చెలులన్
మిగులందొందరపఱుపఁగ। ముగుదలు పఱుగెత్తి రంతిపురికిని నోటకన్.

చ. అడుగుల కెంపుడాల్పుడమి యత్తటి నొత్తక యుండ నెజ్జనో
మడుఁగులు కాళ్ళకుంబఱచు మాడ్కి నిబర్వఁగ నిల్వుటద్దముల్
బడిబడిఁ జెల్మికత్తియలఁ బ్రక్కల నిబ్బడిఁ జేయ సిగ్గుతోఁ
బడఁతుక పెండ్లితిన్నె కడ వచ్చెను నెచ్చెలిపిండు తేరఁగన్. 85

గీ. కలికి నమ్మోము జేపకిఁ గానిపించ
కుండ ముత్తైదువ తెరయొండు పట్ట
వెలసె నయ్యది సింధురేవెల్గునకును
మిగులమాటగు మేటిక్రొమ్మొగిలుకరణి. 86

క. నలుఁగడల వాయిదమ్ములు। చెలఁగంగాఁ బేరటాండ్రు సేసలు చల్లన్.
బలుదీవనలిడఁ బాఱులు। పొలుపుగఁ జనె బెండ్లియరుగు పొంతకు ఱేఁడున్.

క. కొమరాలినప్పుడట నే। మముతో నా నేల ఱేఁడి మాంకన్యాం తు
భ్యమహం సంప్రదదేయని। యమరంగా దారవోసె నల్లన కెలమిన్.

క. తెఱవ లటు మీఁద మెల్లన తెరను వంప
మిగుల సిగ్గున ముగుదయు మొగము వంచె
మగువ చెలువంబుఁ గనఁ గ్రీడి మొగము నెత్తఁ
బచ్చవింటిని మఱఁదును బైకి నెత్తె. 89

గీ. పడఁతి మిన్నలు తెరనల్ల వంచినపుడు
కనులు మిఱుమిట్లుగొనఁ దళుక్కుమనియెఁ జెలువ
బయలఁ గాఱుక్రమ్మిన గొప్ప మొయిలునుండి
మించి వెలువడు క్రొక్కాఱు మెఱుముకరణి. 90

గీ. తొయ్యలి పిసాళి చూపులన్ తూపుగముల
నొంగానాటియుల్ల ముబ్బూఁతలూఁచి
క్రీడిపయిని వ్రేల్మిడి నింపు గెలుపుగాంచి
విరులవిల్తుఁడు కోయని పేర్చియార్చె. 91
చ. సరగునఁ గొమ్మనెమ్మొగము చాయలకుంజని నేదతేటి ని
బ్బరమగు తేనిచూపుగవ పైకొకచోటికి సాఁగఁజూచియుఁ
గురులనుచిమ్మచీఁకటిఁ దగుల్కొనియాడకె దారితప్పి బల్
మురిపెపు నవ్వువెన్నెలవెలుంగున వచ్చుచునుండుఁ గ్రమ్మఱన్. 92
ఉ. వేఱొకచోటికిం గదల వేమఱువెల్వడి యొందుఁబోవఁగా
నేరక క్రమ్మఱన్ మొగమునే వడిఁజేరెడు చూపుమొత్త ము
య్యారపుఁ జన్నుఁగొండలను నవ్వలఁ దవ్వులఁగాంచి వాసిఁ బొం
గారఁగ నానవాలుగొని గంతిడి పాయకనిల్చె నచ్చటన్. 93
వ. అటుపిమ్మట. 94
చ. మురుగులుజాఱఁ జెమ్మటలు ముద్దుమొగంబునఁగాఱ ముత్యపు
న్సరు లొకయోరఁజేరఁ జిఱునవ్వులు మొల్కలు దేర నంటుజొ
ళ్ళిరుదెసలందుఁ జెక్కులపయి న్వడిఁదూఁగుచు డాలువాఱ నా
దొర తలఁబ్రాలువోసె నలతొయ్యలి యాఁదలమీఁద దోయిటన్.
ఉ. కౌనసియాడ ముంగురులు గ్రక్కునఁ జెక్కులమీఁదఁగూడఁ బెం
పూనిన గుబ్బదోయి పయినొక్కట పేరులు త్రొక్కులాడఁ బై
పైని బయింటయాడ నునుబంగరుగాజులు పట్టుపీడ నా
చానయుఁగ్రీడిమీఁదను వెసం దలఁబ్రాలనుబోసె దోయిటన్. 96
క. మదిలోపలఁ గలకూరిమి
నిదె నేఁబయిచేయియగుదు నిదె నోసగుదుఁ
వదలక కనుఁడనుక్రియ వా
రొకుగక తలఁబ్రాలుపోసి రొండొరులపయిఁ. 97

గీ. ఒండొరుల మేనుసోఁకుట నొక్కసారి
కన్నెకును జేనికిని మేను గగురుపొడువఁ
దాళిఁగట్టె నాతఁడు జవరాలిమెడను
నేలవేల్పుల దీవనల్నింగిముట్ట. 98

గీ. అగ్నినెలకొల్పి మఱి వారలందులోన
నేయి వ్రేల్చిరి పిమ్మట నేలఱేఁడు
పట్టి సన్నికల్ ద్రొక్కించెఁ బడఁతిచేత
నంతఁ బేలాలు వ్రేల్చె నయ్యింతిమిన్న. 99

సీ. ఎలుఁగెత్తిపాడెడి యింపైనపాటలు
గండుఁగోయిలపిండు గరువమడఁప
పలుకునప్పుడుతోఁచు పల్వరుసలడాలు
నలువలంకులను వెన్నెలలనింప
పల్లెమందలిదివ్వె బటువైనమగరాల
మెడ పేరులకుఁ గెంపుబెడఁగుగూర్ప
మేనిబంగరునిగ్గు మేలిమిబంగారు
పళ్ళెరంబునకును బసిమిరొయునఁగ
వారిమోముల కెనరామిఁబట్టి నేలను
దిగఁదుడుపుపెట్టుకైవడి మొగములకును
జెలికిఁ జెలువునకై దువ లలరువేడ్కఁ
గప్పురపుటారతులనిచ్చి రొప్పుమీఱ. 100

గీ. మొదటినాఁటితంతు ముగిసినపిమ్మట
బాకెనయును నాగవల్లిమఱియు
వేఱ జరగవలయు వేడుకలెల్లను
వరుసజరిగె నెల్లవారు చెలఁగ. 101

గీ. నాగవల్లియు లోనుగా నడచినంతఁ
పెండ్లినాఁడులు గడువంగఁ బేర్మితోడ
నాలుఘగలను గలుపంగ నపుడుతలఁచి
మేటివేడుక నాలవనాఁటిరేయి. 102

సీ. కమ్మతావులుగ్రమ్ము కపురంపువిడెములు
పసిఁడిపళ్ళెరములఁ బొసఁగనుంచి
కస్తురి జవ్వాజి గందంబుఁ బన్నీరు
రతనంపుగిండుల రమణనుంచి
పటికంపుగోడల పజ్జనిర్వంకల
నిలువుటద్దంబులు నెలవుకొలిపి
పగడంపునునుఁగోళ్ళ పచ్చలపీటపై
వట్టివేళ్ళసురటి పెట్టియుంచి
వెండితబుకులఁబండ్లు వేర్వేరపెట్టి
గొప్పరతనంపుదివ్వెలు కుదురుపఱిచి
మేలిచొక్కపు బంగారుమేడలోని
వింతగదిని సింగారించి రింతులంత. 103

గీ. పడకగదిలోని రతనంపుఁ బసిఁడికోళ్ళ
దోమతెర పట్టెమంచంబు పై నెఱుంగు
టంచ దూదిపాన్పునఁ బవ్వళించియుండె
నతివరాకను మదిఁగోరియల్లుఁడు. 104

వ. అంతకమున్న. 105

చ. కలపములంది నెన్నొసటఁ గస్తురిబొట్టమరించి చేరలన్
గొలువఁగజాల్గు కన్నుఁ గవకుందగఁగాటుకవెట్టి క్రొవ్వెదన్
వలపుగ్రమ్ము పూసరులు వావిరిఁజుట్టి పసిండిపుట్టముం
జెలువుగ గట్టి చెల్వఁగయిసేసిరి సొమ్ములువెట్టి నెచ్చెలుల్. 106

గీ. చెలులు కయిచేసి తరసింప సిగ్గుకతనఁ
బడఁతినెమ్మోమువంచి తానడుఁగకున్న
బుద్ధులనుజెప్పి మఱిమఱి బుజ్జగించి
పూవుఁబోఁడులు బలిమిమైఁ బొదిగిపట్టి. 107

క. ననబోఁడి నొకటలాగుచుఁ
బెలిమిటికడఁ జేర్పఁదివురవింతగనాజ
వ్వాలి తాఁబోక పెనంగినఁ
గనుఁగొని యొకచెల్వ యనియెఁ గన్నులనగుచున్. 108

గీ. ఇచట మాతోడఁ బెనఁగిన నెవ్వరిందుఁ
జూచిమెచ్చుదు రాతఁడచూచిమెచ్చ
బులుపుతీఱంగఁ బడకింటిపొంతఁజేరి
వెనుకతీయక మగనితోఁ బెనఁగరావె. 109

క. అనుటయు సిగ్గును జెలిపైఁ
గినుకయుఁ జిఱునవ్వునొకట గిరికొన నపుడ
న్ననబోఁడి నట్టివైచెను
గనుదోయిం గెంపుదోఁపఁ గ్రొవ్విరిదండన్. 110

గీ. చెలిమికత్తెలు ముందుకు సిగ్గొకింత
వెనుకకున్ద్రోయ మెల్లన వెలఁదినడిచి
పడకయిలుచేరుతఱి మొలబంటిసిగ్గు
ముంచి జాలువాఱుచుఁ దలమున్కయయ్యె. 111

క. మిక్కిలి సిగ్గునమునిఁగిన
యక్కలికింబాన్పుచేర్చి యాచెలువల్దా
మొక్కొక సాకుననడిచిన
నక్కొమ్మయు మోమువంచి యళుకుచు నిలిచెన్. 112

గీ. అంతటను గ్రీడి ముద్దియ నల్లఁజేరి
మేనుచెమరింపఁ గెంగేలు మెల్లఁబట్టి
ముగుద విరిపాన్పుపయికి రాఁదిగిచికొనుచు
వంచుకొనియున్న నెమ్మోము పయికినెత్తి. 113

క. వలపుబయల్పడముద్దిడి
వెలదుఁకతోఁగూడి రేయి వేడుకనుండన్
బెలుచనఁ గొక్కొరొకోయని
వెలుపలఁ దగఁగోళ్ళుకూసె వేఁకువ తెలియన్. 114

గీ. తడవు రేజేనితోడను దనరియుండి
వెడలఁబోయెడుతఱిని రేవెలఁదివిప్పు
కొప్పునందుండి దిగజాఱి కూలినట్టి
విరులబంతి నాఁ దోఁతెంచె వేఁగుఁజుక్క. 115

చ. పగలొనరించుపాటిదొరవచ్చి దెసల్ వెసఁ గ్రమ్మనంచు నె
వ్వగఁదనతేజుగోలుపడి పాఱెడు చుక్కల తేనిఁజూచి లో
దిగులునఁ దెల్విఁబాసినఁ దెల్లపడెం గడురిక్కగుంపులున్
సొగసగునింటిదివ్వెలును జుక్కలతోడనె తెల్విగోల్పడెన్. 116

గీ. జగముచుట్టంబు రాకకుఁ జాలనలరి
పుడమివేల్పులు దీవించునుడువులనఁగఁ
జెవులపండువుసేయుచుఁ జెలఁగఁజొచ్చెఁ
గరముఁ బులుఁగులరొద యెల్ల కడలయందు. 117

గీ. ఇరులవేఁటాడఁ దొలుదొల్తనేసినట్టి
చిచ్చుటమ్మనఁదూర్పునఁజెలఁగెఁ గెంపు
మలలకలుఁగుల దూఱెడు నలుఁగులట్లు
చీఁకటులు కొండబొఱియలు చేరఁబాఱె. 118

గీ. తమ్మిచెలికాఁడు చీఁకట్లఁదఱుమువాఁడు
కలువగుంపులసూడు వేవెలుఁగుఱేఁడు
గాములకు నెకిమీఁడు జక్కవలఱేఁడు
పొడుపుఁగొండను జూపట్టెఁ బ్రొద్దుపొడవ. 119

గీ. అంతకంతకు వింతయొయ్యారమమర
నరమరలులేని వలపుల ననఁగిపెనఁగి
చెల్వుఁడును జెల్వయును గూర్మిచెన్నుమీఱ
హాయిగానుండిరచ్చోట నాఱునెలలు. 120

క. ఈలోపల నాతొయ్యాలి
చూలాలయ్యెను మగండుఁ జుట్టములునెదన్
హాళింబొందఁగఁ దండ్రియుఁ
జాలఁగొలమునిల్పునంచు సంతసపడఁగన్. 121

క. చనుమొనలు నల్లపడియెను
జనఁజన వేవిళ్ళు హెచ్చెఁ జవిమంటిపయిన్
గననయ్యె నెలలునిండినఁ
గనియెనుముద్దుల కొమారుఁ గన్నియయొలమిన్. 122

గీ. పుడమివేల్పులిడిన మంచిముహూర్తమందు
బభ్రువాహనుండనుచును బాగుమీఱఁ
బేరువెట్టిరి యాపసిబిడ్డకెలమిఁ
బెరుగుచుండె నతఁడు తాతయిరవునందె. 123

క. అనివైశంపాయనుఁడిటు
జనమేజయునకుఁ గరంబు సంతసమెదఁగన్
నెనయఁగ జిత్రాంగదకత
వినిపించిన వినియతండు వేడుకఁ బొదలెన్. 124

కందము. ముక్తపదగ్రస్తము.

సిరిఁబ్రామ్మనఁ దాల్చినదొర
దొరలేనిబలిమిఁ బగతురఁదునుము వెరవరీ
వెరవఱినవారిఁ బ్రోచెడు
గరువా, గరువంబులేని కటికులవేల్పా. 125

తోటకవృత్తము.

పొలుపొందిన బీరముపూనిజగం
బులనెల్లను నేఁచుచు మద్దియలా
ర్వలలిం జెఱఁబెట్టిన రావణు నా
దలలెల్లనుద్రుంచిన దండిదొరా. 126

## గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశ్శోబంధుర కందుకూరి వంశ పయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన రసికజనమనోరంజనం బను ప్రబంధరత్నంబు నందుఁ సర్వంబును జతుర్థాశ్వాసము సంపూర్ణము.

# శుద్ధాంధ్రభారతసంగ్రహము.



By

K. VEERESALINGAM

శ్రీపరబ్రహ్మణేనమః

# పీ ఠి క.

చ. సిరియొక యింత చేకుఱుటచేతనె మత్తిలి ముందు కీడుమే
ళ్ళరసెడివాఁ డొకండు గలఁడంచుఁ దలంపక పెక్కుదోసముల్
జరపెడి వారినేన్ దగుదొసంగిడి పిమ్మటఁ బ్రోచువేల్పు దా
సరగున నేలుఁగాత గురుసామిని వేంకట సుబ్బ రాయనిన్.

సీ. ఏవాఁడు జగముల నెల్లను నొక్కటఁ దలఁపులోననె తాను గలుగఁజేయు
నెవ్వాఁడుకనఁబడ కల్లచోటులనుండి యన్నింటినినయంబు నరసిప్రోచు
నెవ్వాని యిచ్చమై నెల్లమైతాల్పులు దివికినేగుదురు బొందిగమిఁ బాసి
యెవ్వఁడు నెఱిఁదప్ప కెపుడునుండెడివారికెన్నఁడుఁదఱుఁగనియెలమిఁగూర్చు
నట్టివేలుపువాకొన నలవిగాని కనికరంబున నెనలేని కలిమి యొసఁగి
రమణఁ గొల్ల వేంకట సుబ్బరాయసెట్టి నతనితమ్మునిగురుసామినరయు గాత.

క. బటువు జగమ్ములఁ గలయ, న్నిటికిని దొరయైన యట్టి నెఱవేలుపు వేం
కటసుబ్బ రాయసెట్టిని, దిటవుగ గురుసామిసెట్టిఁ దిరముగమనుచున్.

సీ ఏవారియింటి పేరిజ్జగంబునఁదొల్లి గుఱ్ఱము వారని కుదిరియుండి
కొల్లగా రోయిఁ గోరు వారలఁదన్ని గడను గొల్లావారుగాఁగ మాఱె
నెవ్వరి కొలమునకెల్ల సింగనసెట్టి మొదటివాఁడయి పేరు మోచియుండె
నెవ్వారి తాత పేరెన్నికకును నెక్కి సుబ్బరాయలుసెట్టి సొబగుమీఱె
మివుల సరివారిలోన గారవముఁగాంచి. యొసఁగినట్టి వేంకయసెట్టి యెవరితండ్రి
యట్టివేంకట సుబ్బరాయలునుదమ్ముఁ, డై నగురుసామిసెట్టియునలరుచుండ్రు.

చ. అడవిమెగంబు లందమగునట్టి పులుంగులు నున్నతోఁటయె
క్కడఁ గనువారివేడ్కకయి కన్నులపండువు గాఁగనుండునే
కడఁ బలువింతలెల్లఁ జనికాంచెడివారికిఁ గాఁగఁగూరుపం
బడిన వెడందసాల చెలువంబగుఁ జూపఱకన్నువిందుగాన్.

ఉ. ఎక్కడఁ గూడి న్యాయములనేవరు తీర్చెడుగొప్పకొల్వు వే
ఱెక్కడసీడులేక తగు నెక్కడఁ బిల్లలకన్ని విద్దెలుం
జక్కఁగ నేర్పి తేటపఱగఁ జాలిన విద్దెలసాలయొప్పుఁ దా
నెక్కడ గొప్పకోట యొకఁడింపగు దండులు నిండియుండఁగన్.

సీ. ఏపేటతూర్పున నెసఁగును సంద్రంబు దాయరాని యగడ్తయో యనంగ
నేప్రోలినుండి తామింతలోఁ బొగబండు లెల్లెడలకు నిచ్చ లేగివచ్చు
నేనేలఁ బొగయోడ లింతకలో దీవి వారినైనను గొనివచ్చినిలుచు
నెచ్చోట నాణెము లచ్చొత్తుచుండెడు జానుమీఱెడు టంకసాలయుండె
రాణిగారికి మాఱుగా రాచఱికము, వెలయఁ జెల్లించు దొర తనకొలువువారి
తోడనెచ్చట నెప్పుడుఁ గూడియుండు, నట్టి చెన్నపట్టణమున కలరువేడ్క.
సీ. ఏనొకపనిమీఁద నేగియున్నపుడు నాకూరిమి నెయ్యుఁడౌ కారుమంచి
సుబ్బరాయలు నాయఁ డబ్బురమగు వాని నెల్లనా కాపీట నెలమిమీఱఁ
జూపుచు నొకనాఁడు సుబ్బరాయలుసెట్టి గారియింటికి నన్ను గారవమునఁ
గొనిపోవదవ్వుగ గురుసామి సెట్టియు నన్నయు నెదురుగా నరుగుదెంచి
మేడమీఁదికిఁ గూరిమి మీఱనన్నుఁ, నెలమిఁ గొనిపోయితమ్ములమ్ములనొసంగి
కరముమరియాదయొనరించిసరసనొక్క. కుర్చిమీఁదఁగూర్చుండనొనర్చియవల
తే. సేమమారసి మఱికొంతసేపు వేడ్క
ముచ్చటలతోడ నచ్చటఁ బ్రొద్దుపుచ్చి
మాటవెంబడిపొందుకొమాళ్ళకతన
గొలఁదిగాఁదెమఁగునఁ జేయఁగోరుటయు.

క. కొల్లావారలు పెల్లగ, నెల్లెడలను బేరువడుట నెన్నెన్నియొ దా
వళ్ళను బలుసత్తరువులుఁ, గొల్లగ నిలుపుటయు నెంచి కొంకని మదితోన్.
తే. నేను నీకొని యిమ్మాడ్కి దీని వ్రాయఁ
బూనినాఁడను దెలుఁగునఁ బొలుపుమీఱ
వారికెప్పుడు మేలునుగోరునట్టి
కందుకూరి వీరేశలింగమనువాఁడ.

---

# శుద్ధాంధ్రభారతసంగ్రహము.

## (అచ్చతెనుఁగు భారతము)

---

## ప్రథమాశ్వాసము

చ. సిరులను గూర్మితో నొసఁగి సేగి యొకించుకయైనఁ జేర నీ
కరయుచు మంచివారి ననయంబును బ్రోచుచుఁ జెడ్డవారలన్
సెరఁగులపాలు సేయుచును సేమము మీఱ జగమ్ము లేలుచుం
దిరముగ నుండినట్టి యలదేవరఁ గొల్చెద నెల్లయప్పుడున్. 1

వ. ఇట్లు జగమ్ములనెల్లం దల్లియుఁ దండ్రియు చేలికయునయి యెల్ల
యెడల నిండియుండు నాదండి వేలుపు నుల్లంబున వెల్లివిరియు నింతం
తనరాని సంతసంబున మంతనంబున నెంతయుం గొనియాడి వేడికొని
యీమేటిదేవరకు నాపయింగల వెలలేని కూరిమి పేరిమిని నేనొన
రింపఁబూనిన యీక్రొత్తపొత్తంబునకు మొదలెట్టెదనిన. 2

తే. మున్ను నైమిశ మనుకాన నున్నయట్టి
తపసు లొకవాఁడు సూతుని తఱిని జేరి
భరతుకొలమునఁ గల రాచవారి కతలఁ
జెప్పుమని వేఁడ నతఁడిట్లు చెప్పఁ దొడఁగె. 3

సీ. సొగసుఁగోటలమీఁది మగతాలసింగముల్
చౌదంతి నిచ్చలు జంకువఱుప
మేటియగడ్తలు వీటిబోటులకును
జిలువచెల్వాలతోడి చెలిమి నొసఁగఁ
బసిఁడిమేడలమీఁద నెసఁగుక్రాల్గంటుల
చెలువ మచ్చరబోంట్లఁ జిన్నపుచ్చఁ
బూవుఁదోఁటలలోని తావులతేనియల్
చిఱుగాలువల వెంటఁ జేలఁదడపఁ

సీ. తానువడుగుందన మూనంగ నట నెల్ల
వారును వినుచుండఁ బ్రతినవట్టి
జాలరిదొరతోడఁ జాల నమ్మికపుట్టఁ
బలుదెఱంగులఁజెప్పి పదిలపఱిచి
సత్యవతినిదెచ్చి సరగునఁ దండ్రికిఁ
బెండిలిగావించి పెంపుమెఱసి
తనచేతిబలిమిని ననిలోనఱేఁడుల
నందఱనోడించి యదిమి వారి
వలనఁ గప్పముల్గొని తండ్రినలరఁజేయ,
సత్యవతితోడికూటమిశంతనుండు
చెలఁగి చిత్రాంగదుండు విచిత్రవీర్యుఁ,
డనఁగనలరారుకొమరులఁగనియెనంత. 15

ఆ. వారు జవ్వనమును బడయకముందఱ,
శంతనుండు మేను జాఱవిడిచెఁ
దండ్రిచావఁ బెద్దతమ్ముని భీష్ముండు,
పుడమి కొడయఁడుగను బూనిచేసె. 16

సుగంధి. పొంగి యేరిఁ బూరికైనఁ బోల్పరుక్కు మీఱఁ జి
త్రాంగదుండు పోరి కెల్ల దండివారిఁ జీరఁ జి
త్రాంగదుండు వేల్పుదిట్ట తాఁకి కయ్యమిచ్చి యా
పొంగడంచి మించి త్రుంచిపోయె వేయు నేటికిన్ 17

తే. అన్న పోయినపిమ్మట నతనితమ్ము,
నావిచిత్రవీర్యుని భీష్ముఁడపుడ తెచ్చి
దొరతనంబిచ్చి వెలయించిపరువమొదవ,
వెలయునతనికిఁ బెండ్లి గావింపనెంచి. 18

ఆ. కాశిఱేఁడు తనదు కన్నియలకుఁ బెండ్లి,
సేయనెంచి యూఁటచెప్పనరిగి
ముగురుకన్నియలను ముంగలనరదంబు,
పయినిఁ బెట్టుకొంచుఁ బయికిఁ బోవ. 19

క. ఎకిమీలెల్లను దాఁకుడు,
నొకఁడు న్మగఁటిమి నెదిర్చి యుక్కుఱివారల్
గకవికలు గాఁగనమ్ముల,
సెక లన్మలమలను మాడ్చి చెదరఁగఁ జేసెన్. 20

వ. మఱియును. 21

ఆ. చుట్టుముట్టినట్టి దిట్టలనందఱ,
నిలిచిపాఱఁదోలి గెలుపుఁ గాంచి
త్రోవలోన సాళ్వుఁ దూలించి మరలించి,
వెలఁదుకలనుగొంచు భీష్ముఁడరిగె. 22

తే. అరిగి యంబ యంబాలిక యంబికయును,
ననెడుమూఁపురలోఁ బెద్దదైనయంబ
తనకు డెందంబుసాళ్వునిఁ దవిలియుంటఁ,
దెలుపనాయింతినటుకంపి తెరువుపట్టె. 23

క. తక్కిన యిరువురఁ దమ్మున,
కొక్కటఁ బెండిలియొనర్ప నొప్పుగ నతఁడా
చక్కెరబొమ్మల తోడనె,
మక్కువతో నెపుడు నుండి మడిసెన్వేగన్. 24

సీ. సంతులేకుండంగఁ జచ్చిన కొడుకును
గని సత్యవతి భీష్ముఁగదియఁబిలిచి
యిల్లాలిఁగైకొని యిల్లునిల్వఁగఁబెట్టి
నేలయేలుమటంచుఁ జాలువఱకు

బతిమాలి చెప్పిన నతఁడించుకయు నొప్ప
కప్పుడవ్యాసుని నొప్పుగులుక
నెదలోనఁ దలఁచిన నేతెంచి యాతఁడు
తల్లికి మ్రొక్కిడిదండసలిచి
యామెపంపున నంబికయందుఁబుట్టు
గ్రుడ్డిధృతరాష్ట్రు రెండవకొమ్మయందు
బొల్లివానినిఁ బాండుని బోనకత్తె,
యందు విదురునిఁ గలిగించె హాళిమీఱ. 25

వ. అంను. 26

సీ. పెద్దవాఁడైన ధృతరాష్ట్రు పెంపుమెఱయఁ
బుడమిఁ బూన్చిన సరితేండ్ల నడఁగఁద్రొక్కి
విదురుమదిబల్మి భీష్ముని వింటిబలిమి
తనకు సాయంబుగా దొరతనము చేసె. 27

తే. అంత గాంధారమనునేల నమరనేలు,
సుబలుఁడనుజేనికూఁతునుసోయగమున
నచ్చరలమించు గాంధారి యనెడుదాని,
భీష్ముఁడాయెకిమీనికిఁ బెండ్లిచేసె. 28

మ. మఱియు న్వేలుపుటేటిపట్టి కరమున్మన్నించి పూఁబోండ్లఁబ
ల్మఱుఁదేరన్ ధృతరాష్ట్రుఁడాంధ్రుఁగను గేల్వ బైందగన్నూర్వరన్
జుఱుకుంజందముమీఱఁ బాండుఁడను మిన్కుల్గాముఁలు న్నేర్చి యం
దఱిలోఁ బేరిమిఁగాంచి మించుటయు నంతంబెండ్లి గావింపఁగన్. 29

క. తలపోసియు వసుదేవుని,
చెలియలి శూరుఁడనువాని చెలువపుఁగూఁతుం
వెలయగఁ బెండ్లిచేసెను,
వెలఁదుకఁ గుంతి యనుదాని భీష్ముఁడు వేడ్కన్. 30

సీ. అదిమును దనతండ్రి యానతి దుర్వాసుఁ
డనుతపసికి నోరె మమరఁబెట్టి
మెప్పించి యతనిచే నెప్పుడు దలఁచిన
నప్పుడ వేలుపు లరుగుదెంచి
బిడ్డలనిచ్చెడు పెనుమెప్పుఁగైకొని
యొకనాఁడు సంద్రంపు టొడ్డునందుఁ
దమ్ములవిందును దలఁచి యాతనివల్లఁ
బుట్టుజోడును జెవిపోఁగులున్న
కొడుకుఁగని వానిఁ బెట్టెత్రోఁ గడలినిడియెఁ
గొట్టుకొనిపోయి యాబొట్టె గట్టుఁజేరఁ
గాఁపొకఁడు వానిఁ గొనిపోయి కర్ణుఁడంచు
గహిని బేరుంచి తనచాన రాధకిచ్చె. 31

తే. మాద్రియనుదానినావెన్కమఱియుఁ బాండుఁ,
డాలుగాఁగొనియిద్దఱనలరఁజేసి
దెసలనెల్లను దనవాఁడిమొనఁగగెల్చి,
యన్నచేనన్నెచేయించెజన్నములను. 32

సీ. అటులుండి యొక్కనాఁడాండ్రనుదనతోఁడఁ
గొనివేఁటతమిమీఱఁగొంతదవ్వు
కానలోపలనేగి కానక మెకములఁ
గూడిపొందెడునట్టి లేడి నిఱ్ఱి
నొకకోల నేలపై నొఱఁగింప మగజింక
జడదారిరూపును సరగఁదాల్చి
యీవు నీయాలితో నెప్పుడుకలసెదో
యప్పుడ మావలె నయ్యెదంచుఁ

దిట్టి చచ్చిన దిగులొంది దిటముపూని,
యింటివంకకు మరలక యెఱుక మెఱసి
తపసితనమూని కొన్నాళ్ళు తాళియుండి
సంతు లేమికి నెంతయు వంతనొంది. 33

ఆ. కుంతిఁ జేరఁబిలిచి గొబ్బునదనకోర్కి,
తేటపఱచి వేఁడ బోటిమెట్ట
కేల కొప్పుకొనియుఁ గెలసి యుధిష్ఠిరుఁ,
డనెడి కొడుకుఁబడసె నజ్జమునికి. 34

శా. ఆచోటన్ ధృతరాష్ట్రుకొయ్యాలియు నొయ్యన్ వేఁకటిందాల్చి ము
న్నే చూలాలయి కుంతిపట్టిఁగని తానెంతో మదిం బొంగుటల్
చూచాయన్విని యోర్వలేక పగతోఁ జొక్కొంది లోఁగుంది యో
మ్మాచెన్నారు నెలంత గ్రుద్దుకొనెఁ బాడై చూలొగిన్ జాఱఁగన్.

వ. అట్లాకొమ్మ యొమ్ము కరమ్ము వమ్మగునట్లుఁగా నోరమ్మగాఁ గ్రుమ్ముకొన్న నెత్తుచెడి క్రొత్తనెత్తురులం జొత్తిల్లి తుత్తునియలయిపడ్డ కండమొత్తమ్ములనెత్తి క్రొత్తకడవలలోనం బెట్టించి వ్యాసుండు నూఱువురఁగొడుకులనొక్క కూఁతును బుట్టించె. నందుఁ బెద్ద వాఁడు దుర్యోధనుండును రెండవవాఁడు దుశ్శాసనుండును వారి చెల్లెలు దుస్సలయు ననంబరఁగి పెరుఁగుచుండిరంతనిచ్చట. 36

క. అట దుర్యోధనుఁ డొదవిన
దిటముగు నానాఁడె గాలిదేవరవలనన్
దటుకున భీమునిఁగనియెను
నిటఁగుంతియు మగఁడు పనుప నెంతయు నెలమిన్. 37

క. ఆపిమ్మట వేలుపుదొర
నాపోవక మగఁడు వేఁడ నానఁతియాఁగా

నాపగిది సర్జునుండను
పాపనిఁగని మించెఁగొంతి బలియుని మిగులన్. 38

క. పెనిమిటి సెలవొసఁగంగాఁ
దననవతియు నేర్పినపుడ దామాద్రియునుం
గనె వేలుపు వెజ్జుల కొ
య్యనవకులుండు సహదేవ్వుఁడనియెడి కవలన్. 39

ఆ. ఇట్లు నేలఁతలందు నేవురు కొడుకులఁ
బడసి సంతసమునఁ బ్రబలియుండి
యేకతంబ మాద్రియెక్కడు పోయగం
బొక్కనాఁడు చూచి యోర్వరాక. 40

క. వెలుపన్న దాయల నెందఱు
గెలిచియుఁ దనలోని దాయ గెలువఁగలేకా
బలియుఁడు పాండుఁడు మడిసెను
వలపున నిల్లాలితోడ వడిఁ గలయుటచేన్. 41

తే. అంతమాద్రియు మగనితో నగ్గిసొచ్చె
గొంతిపాటులు వెంటరాఁగొండవిడిచి
కొడుకులను వెంటఁగొని బావకడకువచ్చె
నెల్లవారికిఁ దముఁజూచి యుల్లమవియ. 42

ఉ. కుంతియు బిడ్డలం గొనుచుఁ గూరిమి పెన్మిటిఁ బాసివచ్చుచో
వింతగఁ జూడవచ్చి రలవీటను గల్గినవారలెల్లఁదా
మెంతయు వంతతోఁబనివి నేడ్చుచు నాధృతరాష్ట్రుఁడాలునుం
గుంతిని వెంటఁబెట్టుకొని కుఱ్ఱలఁదోడ్కొనిపోయి రింటికిన్. 43

వ. అంత ధృతరాష్ట్రుండు. 44

క. తనబిడ్డలు పుటి తన త
మ్ముని బిడ్డలు నంచు వేఱుపూనిక మదిలో

నను బూనక కొడుకులక
న్నను ప్రేముడి మీఱఁబెంచె నలి నేపురనున్. 45

సీ. దుర్యోధనుండును దోడివారును దమ్ముఁ
గుఱ్ఱలుఁ బాండుని కొడుకు గమియు
నల్లారుముద్దుగా నాటపాటలఁ బ్రొద్దు
పుచ్చెడు తఱిగాడ్పు ముద్దు పట్టి
బలిమి నందఱమించి పలుచెఱంగుల నొంచి
పలువుర నొక్కటఁ బట్టికొట్టుఁ
జెట్ల నెక్కినవారిఁ జెట్లూఁచి పడవైచు
నిలిచి పొల్చినవారినీటముంచు
నిట్లువడముడి కడగండ్ల నెపుడుఁగుడువ
నీరసంబెత్తి తాళఁగా నేరకపుడు
తనదు మామను శకునిని దగవునడిగి
తొడరిదుర్యోధనుఁడు చేసెదుండగముల. 46

సీ. నిడు తీవియలఁగట్టి నిదురించు తఱిసేటఁ
బడఁద్రోయ మేల్కనివెడలివచ్చె
విసముతోడనుజేర్చి వెసఁగూడు వెట్టింప
నారగింపఁదడవ యరిగిపోయెఁ
బందుకొన్నప్పుడు పాములఁ గఱపింపఁ
గీడొకింతయు లేక కెడపెవాని
దుర్యోధనుఁడు సేయు దొసఁగులు మఱియును
వడముడిఁ జెందకవమ్ములయ్యె
నంత మనుమలఁ జదివింప నద నటంచు
నెఱిఁగి భీష్ముఁడు కృపునొద్ద నెల్లచదువు

లమరఁ జెప్పించె మొదలనాకొమరులకును
బిదపద్రోణుఁడునాఁ జనుచదువులయ్య. 47

తే. నేలవేలుపు కృపుబావ చాలవలఁతి,
తనకొమారు నశ్వత్థామగానుచువచ్చి
వీఁడు సేరిన నా నేలవేల్పునొద్ద,
వెనుక విలువిద్దెఁ గఱపించె మనుమలకును. 48

సి. కవ్వడి తనకోర్కెఁ గనువడిఁ దీర్చెద
నని బాసయిచ్చిన నలరి ద్రోణుఁ
డతని కెక్కువచెప్పెనామీఁదనొకనాఁడు
రాకొమారులనేర్పరమణఁ గనఁగ
మిన్నేటికొమరుండు మున్నుగ వారికి
విన్నవించినవారు వేడ్కతోడఁ
గొలువుండి చూడంగ వెలయించి రెల్లరుఁ
దమతమ నేర్పు చందమ్ములెల్ల
నందు దుర్యోధనుఁడు భీముఁడు గరితాఁకి
గుదెలఁబోరవారిని ద్రోణుకొమరుఁడుడిపె
నర్జునుండును విన్నాణ మమరఁ జూపి
మారు లేకుండ నొక్కఁడు మలయుచుండె. 49

క. అక్కడ కప్పుడు కర్ణుం,
డుక్కునఁ జనుదెంచి క్రీడి నొక్కటఁ దాఁకన్
బెక్కు దెఱంగులఁ బోరిరి,
యొక్కొకరికి వ్రటపడక యోరిమిపేర్మిన్. 50

క. పోరెడియప్పుడు కర్ణుని,
బీరంబున కెదను మెచ్చి వే యంగము నాఁ

బ్బేరైన నేల నతనికిఁ,
దోరం బగుకూర్మి నిచ్చి దుర్యోధనుఁడున్. 51

వ. అతనితోడి చెలిమి కలిమి ననిలోనం దన పినతండ్రికొడుకుల నాతండు గెలువఁగలం డను గట్టి నమ్మికమ్మిన నాతనిం దనయొద్దఁ బెట్టుకొని సంతసించుచుండెనంత. 52

క. తనవలనఁ జదువుగఱచిన,
యనిసేసెడు రాచవారి నందఱ ద్రోణుం
డును జేరఁ బిలిచి ద్రుపదునిఁ,
దనకడకును బట్టి తెండు తడయక యనుడున్. 53

సీ. అందఱు నరదంబు లాయితంబుగఁ జేసి
వెలువడి ద్రుపదుని వీడు చేరి
కోటలు పడద్రొబ్బి క్రొత్తడంబులుగ్రొచ్చి
యూరెల్ల దల్లడమొందఁ జేయ
ద్రుపదుఁడు విని వచ్చి దుర్యోధనుఁడు లోను
గాఁగల మగలను గదసి తాఁకి
వాలంప గుంపుల వానలు గురియించి
చిందఱ వందఱ జేసి దండు
నెల్లచోటులఁ దానయై యేపు చూప,
వెఱచఱచి పాఱి రందఱు వీఁకచెడుచు
నంత విఱ్ఱవీఁ గాతని నడ్డగించి,
త్రోడ భీముఁడు గుదెఁబూని తోడుసూప. 54

క. తననేర్పు మెఱయఁ దూపులఁ,
గనలునఁ బరఁగించి ద్రుపదుగరువంబడఁగన్
జని పట్టి కట్టి తెచ్చెను,
గనువారలు డెందములను గళవళ పడఁగన్. 55

ఆ. అల్లుపట్టి తెచ్చి యాతని నొజ్జల,
కాళ్ళమీఁద వేయఁ గనికరమున
నుల్లసంబు లాడి యొసఁగయనిఁ బొమ్మని,
క్రీడి ద్రోణుఁడు గొనియాడి మెచ్చె. 56

చ. ద్రుపదుఁడు వొంటికంటనను ద్రోణుఁడు తన్నటు చిన్నపుచ్చఁగా
దపసితనంబు పూని కడుఁదాలిమి వేల్పులఁ గొల్చి ద్రోణున
చ్చపుబవరంబునం గెడపఁ జాలు కొమారుని దిట్టయైన వే
లుపుదొరపట్టి బాలయి వెలుంగుకొమారితఁ గాంచెఁ జిచ్చునన్. 57

క. కని యిటు దృష్టద్యుమ్నుం
డనుచుఁ గొమారునికిఁ గృష్ణయని కూఁతునకుం
దనరఁగఁ బేళ్లిడి ప్రోలికిఁ
జని ద్రుపదుఁడు వింతసంతసంబున నుండెన్. 58

వ. అంతనిచ్చట. 59

తే. విద్దెచేతను గానముచేఁ బెద్దయైన
జముని కొమరుని రాచటికముగఁ దనకు
సాయముగఁ జేసికొనితానుసంతసంబు
నొందుచుండెను ధృతరాష్ట్రుఁడుద్ది లేక. 60

ఉ. అప్పుడు తమ్ముఁ డెల్లకడలందును బోరుల గెల్పుఁ గాంచుచుం
జెప్పెడి దేమి పేరుగల చిక్కనిఱేఁడుల నోర్చి వారిచేఁ
గప్పము లెంతయుంబలిమిఁ గైకొని యన్నకుఁ దెచ్చియిచ్చుచున్
గొప్పతనంబు వాసియును గూర్పఁగ నోరువలేక యాసునన్. 61

సీ. మంతనంబున మేనమామను శకునిని
దుస్ససేనునిఁ గర్ణుఁ దోడితెచ్చి
దుర్యోధనుఁడు వాసితోడను దలపోసి
యాకటిపులఁ బట్టి యయ్యుకడకుఁ

జని కన్నులనునీరు జాఱఁగ నురపిల్లి
యొట్టకేలకు తేనియొఱుక చెఱిచి
పాండునికొడుకుల వారణావత మనునూర
నుంచెదునట్టు లొప్పుకొనఁగఁ
జేసి వచ్చినవారలఁ జేరఁబిలిచి,
తల్లితోఁగూడి యేవురుఁ దరలునట్లు
నేర్పుతోఁజెప్పి ధృతరాష్ట్రుఁ డేర్పడంగఁ,
బుచ్చెమేలెంచకప్పుడాప్రోలికరుగ. 62

సీ. దుర్యోధనుం డంతఁ దొడరి పురోచనుఁ
డనువాని రావించి యతనితోడ
మంతనంబునఁ గొంత మాటాడి మునుచని
లక్కయి ల్లొక్కటి చక్కఁగాను
వారణావతమున వడిఁగట్టి గొంతియుఁ
గొడుకులు నందుండి కూర్కియుండు
తఱినిప్పుముట్టించి తడయకరమ్మని
చెప్పి పుచ్చినవాఁడుఁ జెలఁగి యరిగి
లక్కయిల్లుకట్టి చక్కఁగఁ గై సేసి
యునుపఁ గుంతిబిడ్డ లుండిరందు
నంత విదురుఁ డిచట నంతయుఁ బరికించి
కీ లెఱింగి సరగఁ గీడుతొలఁగ. 63

ఉ. ఉప్పరవాని నొక్కరుని నొంటి యుధిష్ఠిరు పాలికంప నా
చొప్పెఱిఁగించి వాఁడు కడు సూటిగ నేలసొరంగ మొండు నే
ర్పొప్పఁగఁ ద్రవ్వెచూపుటయు నోయనభీముఁడు తల్లినన్నునుం
దప్పక తమ్ముల న్వీలికిఁదార్చి సొరంగముదారి దవ్వఁగన్. 64

క. పనిచి పురోచనుఁడును జెం,
తను గొడుకు లయిదుగు రెఱుకతయు నిద్రింపం
గని లక్కయింటి కగ్గిని,
గసలునఁ దగిలించిపోయెఁ గడునడురేయిన్. 65

క. ఆరాతిరి యాయిల్లటు,
ఘోరముగాఁ గాలిపోవఁ గూరిన వగతో
నూరను గలవారెల్లను,
జేరువఁ జనుదెంచి కాంచి చిడిముడిపడుచున్. 66

క. కొంతియుఁ గొడుకులుఁ దెగిరని,
యెంతయు వగఁబొంది యేగి రిండ్లకు నచ్చో
నంతయు దృతరాష్ట్రుఁడు విని,
యింతం దనరాని కస్తి నెదలోఁ బొందెన్. 67

ఆ. గాడ్పుపట్టి యచటఁ గన్నతల్లిని దోడఁ,
బుట్టువులను మీఁదఁ బెట్టుకొంచు
ముండులనక పెద్ద గండులనక యేగెఁ,
గాఱుకానలందుఁ గరము దవ్వు. 68

ఆ. రేయి వారు పడెడి రాయిడిఁ బాపంగ,
నెంచియపుడు వెలుఁగుఁ బంచెదయ్య
మనఁగఁ బ్రొద్దుపొడిచె నావల నాఱ్వురు,
నెండ యెక్కుదాఁక నేగి యేగి. 69

క. కడుబడలి యెండతాఁకున,
వడగొట్టిన బిట్టుసోలి వారలుపడఁగా
వడముడి నీళులకొఱకుం
గడుదవ్వుగఁ బోయి మరలి కదిసెనులోనన్. 70

తే. ప్రొద్దువాలినఁ గెంజాయ పొదలిపిదపఁ
గాఱుచీఁకట్లు మింటను గ్రమ్ముకొనియె
రేవెలందుక దాల్చిన కావికోక
విడిచి నల్లని చీరను దొడిగె ననఁగ. 71

క. ఆచీఁకటిలో నీళుల
మోచుకొనుచు వచ్చి చెట్టు మొదటనుగూర్కం
జూచియు వారల లేపక
కాచుకొని యుతంబు నిలిచెఁ గడుఁ గడిమిమెయిన్. 72

సీ. అప్పు డక్కానలో నెప్పుడునుండు హి
డింబుఁడన్ రక్కసుఁ డిమ్మునుండి
వారలఁ గని పొంగి వడివడిఁ జెలియలిఁ
బనిచె హిడింబను వారిఁ బట్టి
వంటకుఁ దేనాపె వడముడిఁ దిలకించి
వలపున మోమోటపడుచు నిలువ
నేజామునకుఁ జెల్లెలి తెరమికి నల్గి
పయనమై మఱి తానె వచ్చినిగుడ
భీముఁ డాతని దవ్వుగాఁబిఱిఁది కీడ్చి,
దొమ్మికయ్యమ్ములో వానిఁ గ్రుమ్మిచంపి
యన్నపనుపఁగఁ దల్లియు నవుననంగఁ,
బెండ్లియాడె హిడింబను బేర్మితోడ. 73

తే. దానితోఁ గూడి కొన్నాళ్ళు కానలందుఁ
బగలు వలరాచపనులను మిగులఁ బెనఁగఁ
బుట్టెఁదగ ఘటోత్కచుఁ డనుపట్టియొకఁడు
వాఁడితనమును జిత్తులు బలిమిగలిగి. 74

చ. తలఁచినయప్పుడెల్ల నిముదాకొన వచ్చెదనంచుఁ జెప్పి యా
బలియుఁడు తల్లిఁదోడుకొని వారల వీడ్కొని యేగెనిచ్చమై
వెలువడి యేకచక్రమను పేరిట యూరికిఁ బోయి రన్నయున్
నలువురుతమ్ములు న్వారపునం దమతల్లిని గొంచుఁగాల్నడన్. 75
వ. అట్లుపోయి. 76
తే. నేలవేల్పుల వేసంబు లోలిఁ దాల్చి,
యొక్కబాఁపనియింటనునుండియూరఁ
దిరిప మెత్తుచుఁ బ్రాముస్క లరసికఱచు,
చుండిరేవురు సైదోడులొజ్జలొద్ద. 77
సీ. ఆకుప్పమున బకుఁ డనురక్కసుఁడొకండు
కాఁపురంబుండి యక్కడనున్న
వారి నేప్రొద్దు నిల్వరుసను నొక్కని
బండెఁడు కూటినిఁ బసుల రెంటిఁ
దడవులనుండి సాపడుచుండు నట్లుండ
నొకనాఁడు పొలదిండికోరెముగను
బోవలసిన వంతు పొందుగా వారున్న
పుడమివేలుపుపాలఁ బడిన నతఁడు
మిన్నువిఱిగి పడిన చెన్నున నేమియుఁ
దోఁపకాలుఁ దానుఁ దోడివారుఁ
గూడి యొక్కపెట్ట గొంతెత్తి యేడ్వంగఁ
జొచ్చె గొప్పముప్పు వచ్చెననుచు. 78
క. అయేడుపు విని గొంతియు
డాయంగాఁ బోయి యడిగి డగ్గుత్తికతో
నాయింటి పాఱుఁ డెఱుఁగం
జేయుడు వడి భీముఁ జీరి చెప్పిన నతఁడున్. 79

క. ఒడ లుప్పొంగఁగ రక్కసుఁ
గడ తేర్చెద నంచుఁ బలుకఁగా నాపాఱుల్
కుడువంగఁ బెట్టిరోరెము
వడముడికిన్మంచి పిండివంటలతోడన్. 80

చ. అటువలె నారగించి కఱవాఱఁగ సత్త్వపట్టి లేచి మి
క్కుటముగఁ దొంటి వంటకమె కూర్చినబండిని నెక్కి రక్కసుం
దటుకునఁ జేరి మాఱుకొని తన్నియుఁ గ్రుమ్మియు నెట్టకేలకుం
బెటపెట నెమ్ముకల్విఱిచి పీఁచమడంచెను నొక్కవేల్మిడిన్. 81

సీ. అమ్మాడ్కి బకుఁ జంపి యందఱ నలరించి
నెమ్మదినుండంగ నెమ్మి మీఱ
బసచేసి యున్నట్టి పాఱునియింటికి
జన్నిగ ట్టొక్కఁడు సరగవచ్చి
ద్రుపదుండు తనకూఁతు ద్రోవదిఁ గొనఁగోరు
రాచకొమాళ్ళెల్ల రావలెనని
చాటింప నాలించి జగములోఁ గలరాచ
వారెల్ల నచటికి వరుసగాను
బోవుచున్నారు నేనును బోదునటకు,
నీవి మిక్కిలి బాఁపల కిత్తురంచు
విన్నవాఁడను గావున వేడ్కతోడ,
ననుచుఁ జెప్పిన నలరారి యవుడకదలి. 82

చ. బసదిగియున్న పాఱుతను బాఱుని వీడ్కొని గొంతి బిడ్డలున్
వెసఁ జని యొక్కటన్ ద్రుపదువీటికిఁ బోయెడుదారి వ్యాసుతోఁ
బొసఁగఁగ మాటలాడి వడిఁ బోవుచు వేలుపుటేటి చెంతనా
నిసితటిఁ గ్రీడి చేకొఱవి నెయ్యమునం గొనిత్రోవ చూపఁగన్. 83

ఆ. ఏగుచున్నయప్పు డింతితో నంగార,
పర్ణుఁ డనెడు వేల్పుపాటకాఁడు
తిరుగులాడుచుండి దిటవుగ నర్జునుఁ,
దాఁకి తూపు లొడలు దవులనేసె. 84

క. ఏసినఁ గవ్వడి వడివడి,
నీసుమెయిం జిచ్చుఱమ్ము నేర్తెఱ వైవన్
గాసిలి యరదముఁ గోల్పడి,
యోసరి యంగారపర్ణుఁ డుడిగిన కడిమిన్. 85

తే. కదలివచ్చి యుధిష్ఠిరుకాళ్ళ వ్రాలి
ధౌమ్యుఁ డనునొజ్జ నొడఁగూర్చి తగవునెఱపి
చిచ్చుఱమ్మును గవ్వడిచేతఁ బడసి
యింతిఁ దోడ్కొని తనయిచ్చ నేగెనంత. 86

సీ. పాండుని కొమరులు నిండువేడుకతోడ
ద్రుపదుపీటనుజేరి యుపముమెయిని
గుమ్మరవానింట నిమ్ముగా దిగియుండి
యెకిమీండ్లు గుమిగొన నేగియున్న
రచ్చతావునకేగి రచ్చట ఱేఁడులు
మిన్నంటఁ గట్టిన మీనునీడ
క్రింది నీళులఁజూచి ముందఱ మోపెట్టి
యున్నవింటిని జేత నొనరఁ దాల్చి
నింగి మచ్చెంబు నేయంగ నేర్పుమెఱసి
యెత్త లేరైరి యొకకొంద ఱెత్తియేయఁ
జాలకుండిరి కొందఱు చాలువఱకు
నేసికొట్ట నోపక విడి రాస లెదల. 87

క. అప్పుడు కవ్వడి పాఱుని,
యొప్పునఁ జనుదెంచి నిలిచి యొకచే వింటిం
జప్పున మోపిడి యేసెను,
నప్పుడ మచ్చియపుజంత్ర మఱతెగి పడఁగన్. 88

తే. దానిఁ గన్గొని దొరలెల్ల నాన వూని
ద్రుపదు నడఁగింపఁ దొడరినఁదోడుచూపి
కర్ణు నర్జునుఁ డోడించెఁ గడిమి మెఱసి
భీముఁడోడించి శల్యుని బెగడువఱిచె. 89

తే. అంత సిగ్గున దొరలెల్ల నరిగి రిండ్ల,
కవల ద్రోవది నర్జునుఁ డరదమునను
బెట్టుకొనివచ్చి తల్లితోబిచ్చ మొకటి,
తెచ్చితినటన్నఁగలదూపుదెలియకామె. 90

క. ఏవురునుం గైకొనుఁ డని,
యావల ద్రోవదిని జూచి యలజడిపడఁగా
నావడి వ్యాసుం డచటికి,
వేవచ్చి తెఱంగు చెప్పి వెంటనె వారిన్. 91

క. ద్రుపదునికడకుం గొనిచని
యపురూపపుఁ గతలుచెప్పి యైదుగురకు నొ
క్కపడఁతి ద్రోవది నియ్యఁగ,
నపుడె యొడంబడిచి యేగెనతఁడుతనంతన్ 92

ఉ. అంతట మంచి మూర్తమున నందఱు నెయ్యురఁ జుట్టపక్కముల్
వింతగఁ జూడ రాఁగఁ గనువింపుగ నాద్రుపదుండు కూఁతునున్
సంతస మారఁదెచ్చి వరుసం జముపట్టికి గొప్పపట్టికిన్
వంతునఁ గ్రీడికి న్గవలవారికిఁ బెండ్లిచేసె వేడుకన్. 93

సీ. పెండ్లి నడచిన వెనుకను గొన్నాళ్ళు
పాండుని కొడుకులు పదిలముగను
ద్రుపదుని ప్రోలనే కోడాఁకఁడియుండ
నాలించి ధృతరాష్ట్రుఁ డలరి మదిని
కొడుకులు మఱఁదియుఁ గూడిచెప్పినయట్టి
చెనఁటిమాటలఁ బెడచెవులఁ బెట్టి
విదురుండు ద్రోణుండు భీష్ముండుఁ గఱపిన
హితవును విని చాల నెఱుకమీఱ
విదురు నెలమిని ద్రుపదుని వీటి కంచి,
పాండుకొమరుల రప్పించి వారికపుడ
సగము నేలకు దొరతన మొగినొసంగి,
ఖాండవ ప్రస్థమున నుండఁగాను బనిచె. 94

ఉ. అప్పుడు కృష్ణుఁ డాఖికను నచ్చటికిం జని వేల్పుఱేనితోఁ
జెప్పుడు విశ్వకర్మః బనిచె న్నగరొక్కటిఁ గట్ట నాతఁ డా
చొప్పునఁ బంపఁగాఁబనుట సూటి యెలర్పఁగ విశ్వకర్మ తా
నొప్పుల కెల్ల మన్కియయి యుండెడు వీటినిగట్టె దాలికిన్. 95

వ. ఇంద్రప్రస్థం బను పేరువెట్టి నెట్టన గాఢ్పుపట్టియన్న కిచ్చిన నచ్చోలు
వున కచ్చెరువడి యాతండు తమ్ములుం దానును నొక్క మంచినాఁ
డందుఁజొచ్చి తక్కుంగల నేల యేలికలెల్లఁ దన కరిగాఁపులుగా
నుండ నిండువేడుకత్తోడ నేల యేలుచుండె నంత నొక్కనాఁడు. 96

క. వేలుపుఁ దపసియుఁ దగ నా,
ప్రోలికిఁ జనుదెంచి కాంచి ద్రోవదితోడం
బోలఁగ నొకయోఁ డొకఁడుగ,
నోలిని నుండంగఁ బనిచి యొండొకకడకున్ 97

సీ. ఏగిన నానని వేఁపురు నొక్కొక్క
యేఁటను గూడుట కియ్యకొనుచు
నొకరితో నుండ వేఱొకరు చూచిన నేల
నొకయేఁడు వలగొన నొక్కకట్టు
చేకొనియుండంగ వేసవ నొకనాఁడు
పుడమివేల్పొక్కఁడు వడిగ వచ్చి
తనయావు నొకదొంగ కొనిపోవుచున్నాఁడు
విడిపింప రమ్మని విన్నవింప
విల్లునమ్ములుఁ గైకొన నల్ల బోయి,
యన్నతో నున్నద్రోవది నపుడు చూచి
పుడమిఁ దిరుగంగ నివ్వచ్చు నెడము సేయఁ,
కపుడె వెల్వడెనెవ్వరేమన్న వినక. 98

ఆ. నేలవేల్పు మొదవు నిముసంబులోఁ దెచ్చి,
యిచ్చి పుడమిలోని యేళ్ళఁ గ్రుంక
వెఱలియొక్కనాఁడు విన్నేటిలో మున్గి,
యొద్దుతఱిని వేల్వ నున్నతఱిని. 99

క. వలపున నాతనిఁ గొని చని,
చిలువ వెలందుక యులూచి చెచ్చరఁ దనదౌ
నెలవునఁ జేరిచి క్రీడిం,
గలయ నిరావంతుఁ డనెడు కంతువు పుట్టెన్. 100

క. ఆవెనుక న్మణలూరిని,
జేవమెయిం జేరి క్రీడి చిత్రాంగదనున్
వావిరిఁ బెండ్లాడి పడసె,
నోవక మఱి బభ్రువాహనుం డనుకొడుకున్. 101

సీ. అచ్చోటఁ గొన్నాళ్ళు విచ్చలవిడినుండి
మామను సేవ్యోని సేమముఁగను
ద్వారకకును బోయి దగ్గఱ రైవత
కంబనుకొండను గడిసి యచట
నంతంతఁ గృష్ణుఁడు నింపువేడుకతోడ
నచ్చటి కరిగి వివ్వచ్చుతోడ
మాటాడి యేగి యామఱునాఁడు తనవీటి
వానిని బంపుగ పేరుపెట్టి
తోడుకొనివచ్చి యటమున్న దొంగకావి,
తాల్పు వేసంబు నచ్చోటఁదాల్చియున్న
క్రీడి కందఱు మ్రొక్కించి వేడుకలర
నతని నింటికిఁ గొనిపోయి యవల నునిచి. 102

క. తనచెలియ లగు సుభద్రను
బనిచెను సన్యాసియొద్దఁ బనిసేయంగా
నెనరున నర్జునుమది యా,
ననఁబోఁడిం దగులు కొఱఁగి నగరున నొకచోన్. 103

తే. కోరికలుజాతిపాలఁతుల కూర్మితీఱె,
జగములోఁబోడలగు కొందుసాజనురయఁ
గోరికలుమీఱపాలఁతులకూర్మిఁగోరి,
యక్కజంబుగఁదాబోడయయ్యెఁగ్రీడి. 104

సీ. ఉవిదపై దవిలిన యుల్లంబుతోఁ గ్రీడి
కనువిందుగాఁ బనుల్ గొనుచునుండ
మాతనంబునఁగృష్ణుఁడంతయుఁదలిదండ్రు
లకుజెప్పియొప్పించియొకటఁబెండ్లి

పనులెల్లసాగించి పండువు పేర్వెట్టి
బలరాము నొకదీవి పజ్జకంపి
పెండిలిగావించి వెలఁదిని మఱఁదిని
నడురేయితన తేరువడిగనిచ్చి
యంపవారును దేరెక్కి యరుగుచుండ,
నూరి కావలివారెల్ల నొకటఁ దాఁకి
యార్చి పేర్చినఁ గవ్వడి యోర్చి వారిఁ,
దెరలఁగాఁ జేసెనుసుభద్ర తేరుగడప. 105

చ. అటువలెఁ గ్రీడి మాఱుకొని యాపటిఁరూపరఁజేసి చేడియం
దటుకున వెంటఁబెట్టుకొని దారిని సాగి యనంబు పర్వఁగా
దిటమున నూరుచేరి తన దిట్టతనంబును నెల్లవారు మి
క్కుటముగఁ జెప్పుకోఁగఁ బెనుకూరిమిఁ దొయ్యలితోడ నుండఁగన్.

క. కొడుకభిమన్యుండనఁగను,
బొడమె సుభద్రకును దండ్రిఁ బోలెడుగూపుం
గడిమియుఁ బ్రోడతనంబును,
వడియును బీరంబుగలిగి బలువిలుకాఁడై. 107

వ. మఱియు నప్పాండుని కొమాళ్ళకేవురకు న్వరుసగాఁ గొడుకులేవురు.

క. ప్రతివింధ్యుఁడుశ్రుతసోముఁడు,
శ్రుతకీర్తియు ననఁగ మొదలసారిదినివెనుకన్
జతగ శతానీకుండును,
శ్రుతసేనుఁడుఁ బుట్టిరపుడు ద్రోవదియందున్. 109

సీ. కవ్వడియొకనాఁడు దవ్వులయడవికి
వెన్నునితోఁగూఁడి వేఁటకరిగి
నేలవేలుపురూపుఁ దాలిచియచ్చోట
వెసమెలంగెడి వేఁడివేల్పుఁజూచి

మున్నొకయెకిమీఁకు జన్నంబుగావించి
మిగుల నేతిని వేల్వఁ జెగులువొడమి
తన్నుఁ గాఱించుట విన్నవించినవిని
తగుమందు ఖాండవమగుట తెలిసి
యగ్నివేల్పుచే గాండివ మనెడువిల్లు,
పడసివేల్పురాయనితోఁట వడిగఁజొచ్చి
కాల్పనాతనిఁ బురికొల్పఁగడఁగిచిచ్చు
తోఁటలోఁజొచ్చి మంటలు తోరముగను. 110

క. కాలువఁ దొడరినఁ గనలున
వేలుపుదొర యడ్డుసొచ్చి వెనమబ్బులచేఁ
జాలఁగ వానలు గురిసినఁ
దూలక యవ్వానిఁ గ్రీడి దొలఁగఁగఁజేసెన్. 111

క. దానికిఁగాజేజేదొర
పూనికొని దురంబొనర్ప ములుకులు పెక్కుల్
మేనన్నాటించి కలఁచి
జానుచెడంజేసి క్రీడిసరగం బఱపెన్. 112

చ. మయుఁడనువాని నయ్యెడను మంటలుబిట్టుగఁ జుట్టుముట్టినన్
మొయివడఁకంగ వచ్చివగమీఱఁగఁ గ్రీడి మఱుంగుసొచ్చినన్
గుయివినిజాలిపుట్టి యెదఁగూరిమి మీఱఁగఁ గాచెనాతనిన్
మయుఁడును దానికల్లమున మల్లడినొందెడు సంతసంబునన్. 113

క. సెలవుంగొని చనియెను న
వ్వలఁదగ నా వేడివేల్పు వడిఁదనియంగా
నలరుందోఁటను గాలిచి
యెలమిని దెవులెల్లఁబాసి యిచ్చఁజనియెన్. 114

వ. అంత నొక్కనాఁడు. 115

క. పాండుని పెద్దకొమారుని
యండను గతివేల్పుతోడ నచ్చోటను గూ
ర్చుండినకవ్వడి కిట్లని
దండముగావించి మయుఁడు తద్దయు నెమ్మిన్. 116
క. నెసరున నుసులుఱులు నిలిపిన
కనికరవుంగనికి నొకటి కైకొనిచేయం
గను నేర్తు నని యొసను నే
నొనరఁగ నాచేతనైనదొక్కటి నీకున్. 117
తే. చేయువిచ్చగించినవాఁడఁజెలఁగినన్నుఁ
బనుపుఁ డెద్దియైనను నొక్కపసిఁడియొనర్చ
నేను రేద్రిమ్మరులలోన నెక్కుడైన
నేర్పుగలవాఁడనింపులపొందికఁగట్ట. 118
వ. అనవుడు నతండు. 119
క. అపురూపమైనయోలగ
మిపు డొనరింపంగవలయు నీవని వేడ్కం
గపురంపువీడియం బిడి
యపుడంపిన సంతసించి యాతఁడు వేగన్. 120
చ. బలుపగడంపుఁ గంబములు బంగరుదూలములందమైన చ
ల్వల దొరతాయరంగులును బచ్చల యచ్చపుఁ దోరణంబులుఁ
వలుద సుపాణి ముత్తెపు వన్నెల సోరణగండ్లు మంచి కెం
పుల నెలకట్టులుం గలిగి పొల్పగునట్లుగఁజేసెఁ గొల్వొగిన్. 121
క. మఱియుం గేళాకూళులుఁ
దఱుచగు క్రొవ్విరులఁ బండ్లఁదగు పూఁదోఁటల్
వఱలెడు డిగ్గియలుం బలు
దెఱఁగులుగల యాటపట్లు తేటగనొప్పన్. 122

తే. అట్లు కొలువుపట్టి రాజముపట్టికి
నొసఁగనేల వేల్పు లొక్కమొగిని
దీవెనలనొసంగ దేవేరితోఁగూడి
కొలువుపొచ్చి జమునికొమరుఁడుండ. 123

ఉ. హొత్తులఁగత్తలానులను నందపురోహితిఁబోండ్ల జాషువా
మొత్తము దెచ్చియిచ్చి సతమున్మదిమెచ్చుచుఁ గొల్చుచుండు నుర్
క్రొత్తగ నాల్గుసంద్రములకున్ నడుమంగల రాచసింగముల్
మొత్తములై యుటంగొలువులోపల నొప్పెడు నేలవాలుపున్. 124

వ. అట్లుండ నొక్కనాఁడు. 125

శా. ఏలా వేఁడివెలుంగు నేలకును నిట్లేతెంచుచున్నాఁడు నేఁ
డో లేఁబాయపు బిడ్డలారకనుఁగం చొక్కక్కచో మానుసుల్
గేలుందోయి తెమల్చిగుంపులయి యోలింజూడరా నింగియుం
గ్రాలన్నారదుఁ డేగుదెంచెఁ గడువేడ్కం గవ్వడింజూడఁగన్. 126

తే. వచ్చి రాచపాడినిగూర్చి పలుకులాడి;
చనఁగ సమకట్టియున్నచో జమునిపట్టి
కొలువునకుఁ దోడుకొనిపోయి కూర్మిఁజూప!
నారివేరంపుఁ దపసియునవియె నిట్లు: 127

క. వినుమిట్టిది మున్నెన్నఁడుఁ
గనుగొనలేదెందు నీజగమ్మున నెపుడున్
వినియు నెఱుఁగ మానుసులం
దును నిది యపురూపమనుచుఁ దోఁచెడునాకున్. 128

ఆ. అనుచుఁజాల దానిచందంబు గొనియాడి,
పుడమిఱేండ్ల నెల్లఁ బోరగెల్చి
కూర్చుసొమ్ములనని యొనర్చెడుజన్నంబు,
వడిగనీవు చేయవలయునంచు. 129

క. పాండుఁడు నీతోఁ జెప్పఁగ,
నిండుమదిన్నన్నుఁ బుచ్చె నీకడకనుచున్
దండిగఁ జెప్పి యొడఁబఱిచి,
యొండుకడకుఁబోయెఁ దపసియొయ్యననింగిన్. 130

క. అంతయుధిష్ఠిరుఁడప్పుడె,
మంతనమున, గృష్ణుతోడ మాటాడి వెసం
జెంతకు నర్జును భీముని,
సంతసమునఁ బిల్చి యిపుడచని వెన్నునితోన్. 131

క. ఆలమున జరాసంధునిఁ,
గూల్చి రండనుచుఁ బనుపఁగొబ్బునఁ జని యా
ప్రోలికి వాసిన్మారొకని,
యోలింబరిమార్చి భీముఁడొక్కఁడుఁ గడిమిన్. 132

తే. అట్లుకలన జరాసంధునమరఁద్రుంచి,
యతనికొడుకైన సహదేవునందు దొరత
నమ్మఁబూనిచి ముగ్గురు నెమ్మివచ్చి,
గొంతితొలిపట్టికిని జెప్పిరంతవట్టు. 133

క. నలువురుతమ్ములు వడిఁజని,
నలుగడలుంగెల్చి మేలినగలును గుఱ్ఱం
బులు నేనుంగులు రొక్కము,
వలువలునుందెచ్చి యొసఁగ వలనుగతేఁడున్. 134

ఉ. జన్నమొనర్చి వెన్నునకుఁ జక్కఁగఁ దమ్ముల మియ్యఁ బోవఁగాఁ
గన్నుల నిప్పులొల్కఁ గని కాఱులు ప్రేలుచు నెల్లవారలుం
బన్నమునొందఁ గృష్ణు శిశుపాలుఁడు తిట్టినసల్గియప్పుడే
వెన్నుఁడు చుట్టుకైదువున ప్రేల్మిడి ద్రుంచెనుఁ వానికుత్తుకన్. 135

క. అంతయుఁ గని దుర్యోధనుఁ,
డెంతయు మది వనటఁగొంది యీసునవారిన్
వంతలఁ దగిలించి సిరిఁ గొన,
మంతనమున మామతోడ మఱిమఱిచెప్పెన్. 136

క. అతఁడును నల్లునిఁ గొనిచని,
ధృతరాష్ట్రున కెఱుకపఱిచితిన్నఁ గదౌరరమా
నతిఁగొని జూదంబునకున్,
గౌతుకకపిలిపించె నటకు గొంతికొమాళ్ళన్. 137

తే. పిలుచుకొనివచ్చినట్టియావిదురువలన,
నంతయు నెఱింగియును భీమునన్న కడఁగి
శకునితో నాడిపుడమినిసరకుగములఁ,
దమ్ములను దన్ను వరుసగాఁ దవిలియొడ్డి. 138

తే. ఓడిపిమ్మట ద్రోవదినొడ్డి యోటు,
వడెయుధిష్ఠిరుఁ డప్పుడు వగపుతోడఁ
బ్రాతిగామిని ధృతరాష్ట్రిపట్టిపంచి,
కొలువునకుఁగృష్ణ రప్పించెఁ గూళగాన. 139

సీ. అపుడు దుశ్శాసనుఁ డాయింతిఁ గొల్వులో
దలపట్టియీడ్చి తులువయగుచు
నన్నపంపునఁ గట్టుకొన్నబట్టయు విప్పఁ
గని భీముఁ డెంతయుఁ గసలు వోకమి
చివ్వనాతనిపొట్టఁ జీలిచి నెత్తురు
ద్రావెదనంచును బ్రతినపట్టి
తొడమీఁదఁ గూర్చుండఁ దొయ్యలిఁ జేసన్నఁ
బిలిచిన గాంధారిపెద్దకొడుకుఁ

బెనఁకువను రోఁకటను దొఁకల్ పిఱుగఁగొట్టి
యెపమకాలను దల్చఁదన్ని యెలమిఁ గాంతు
ననుచుఁ బెనుబాసచేసిన నంతయు విని
ద్రోవదినిబిల్చి ధృతరాష్ట్రుఁడీవి నెఱపి. 140

క. దొరతనమెల్లను మరలం,
గరమక్కటికమునవిచ్చి కలుపుకొని యుధి
ష్ఠిరు నంచినఁ దనవీటికి,
నరిగెందమ్ములను నాలి నాతఁడు గొనుచున్. 141

క. అదిగని దుర్యోధనుఁడపు,
డెదలోనంగుంది మామ నేకతమునకుం
గదియించి కొన్నినాళ్ళకు,
నదనారసిచెప్పి తండ్రి యానతిగొనుచున్. 142

ఆ. ప్రాతిగామినంచి పాండుకొమాళ్ళను,
నటకు మరలవచ్చునట్లుచేసి
కత్తిపెద్దయన్నఁ గడువడిఁ బురికొల్పి,
నెత్తమాడునట్లు మెత్తపఱిచి. 143

సీ. జూదాన నోడినచో దొరతనమెల్ల
విడిచి పండ్రెండేఁడు లడవినుండి
యామీఁద నొక్కయేఁడమరంగ నెవరికిఁ
గానరాకుండంగఁ గడపవలయు
నీలోన నెవ్వరి కేనియుఁ గనిపింప
మరల నెప్పటియట్ల జరపవలయు
ననిచెప్పియొప్పించి యాడినశకుని యు
ధిష్ఠిరునోడించె దిట్టయగుచు

నంతనాతఁడు తమ్ములఁ దలఁపఁగొనుచు,
నూరివారంబులునుజేరి యొకటఁ గుండఁ
జిన్నవోయిన మోముల వన్నెదఱఁగి,
కట్టుబట్టలతోడనే కానకేగె. 144

క. కొమరులగనియు సుభద్రయు
వెడలిరి ద్వారకకు నిచట వీరలతివతో
నడవులఁ గాయలుఁ గసరులుఁ
గుడుచుచుఁ గ్రుమ్మరుచునుండఁ గొంకక యొకనాఁ. 145

ఆ. తెరువు నడ్డగించి తెగువను బోనీక,
బకుని తమ్ముఁడైన బల్లిదుండు
కినుక మీఱవచ్చి కిమ్మీరుఁడనువాఁడు,
నిక్క వానిభీముఁడుక్కడంచె. 146

వ. అంత నా పాండునికొమాళ్ళు. 147

సీ. కడుఁ దపసులు చెప్పుకతలనాలించుచుఁ
గామ్యకంబనియెడి కాననుండఁ
కృష్ణుఁడేతెంచి యేగినవెన్క వ్యాసుని
పంపునఁగవ్వడి పట్టుతోడ
నింద్రకీలంబన నెసఁగెడి మలనుండి
మొఱకురూపునఁ బందినేసినట్టి
ముక్కంటితోఁ బోరి మిక్కిలి మెప్పించి
పాశుపతంబనఁ బరఁగునమ్ము
గట్టువిల్లునిచేఁ బొంది క్రాలుచుండ
వేల్పుదొరవచ్చి వివ్వచ్చు వెంటఁ గొనుచుఁ
దనదు వీటికిఁ జనియుండఁ దనివిదీఱఁ
గొడుకుతోఁ గొన్నియేఁడులు గూడియుండి. 148

క. పౌలోమకాలకేయులఁ,
బోలనివాతకవచులను బోలదిండ్లననిన్
వాలమ్ములఁ జంపించెను,
వేలకొలఁది మండగీల వివ్వచ్చునిచేన్. 149

వ. ఆలోన నొక్కనాఁడు. 150

తే. ఊర్వసి యనంగ నచ్చరయొర్తు క్రీడి,
చక్కఁదనమును గన్గొనిచాలవలచి
కూడ వేఁడుడు నతఁడొప్పుకొనక కసరఁ,
బేడిగానుండఁ దిట్టెవాక్రీడినాపె. 151

వ. అంతనిచ్చట. 152

ఉత్సాహ. కడమ పాండుకొమరు లచటఁ గదలి ద్వైతమనెడికా
ఆడవిఁజేరి కొన్నినాళు లందునుండి పిమ్మటన్
వెడలిగంధమాదనంబు పేర, బరఁగుకొండకున్
నడచియందు నెమ్మినుండి నాతి కృష్ణపంపునన్. 153

వ. భీముండుచని. 154

క. జక్కులరక్కసులందల,
లొక్కమ్మడి డొల్లనేసియుగ్మలి మదికి
న్మక్కువ గలిగిన పూవుల,
నక్కఱతోఁ దెచ్చియిచ్చె నక్కజమొదవన్. 155

తరువోజ. పాఱుని వేసంబు బాగుగాఁదాల్చి పాండునికొమరుల పజ్జనుండి
వీఁకఁడితనమున వెలయుజటాఁడను పేరిటిపొలదిండి భీముఁడు వేఁడ్క
మీఱఁగ వేఁటతమినిఁబోయియుండ వెల్లననందఱ మీఁదనిడుకొని
పాఱినవడముడి పఱతెంచివానిఁ బరిమార్చియందఱి బన్నమువాపె,

సీ. అంతటవిపినుండి యజ్జునుండరుదెంచి
యన్నకునంతయు విన్నవించి

సుకముగానుండంగ నొకనాఁడు ద్రౌపది
ప్రాలుగావలెనంచుఁ జాలవేఁడ
మరల భీముఁడుపోయి మణిమంతుఁ గడతేర్చి
యలరులఁ గొనివచ్చియతివకిచ్చె
నామీఁద నొక్కనాఁడడవిని దిరుగుచు
వడముడి యొక్కచోఁ బాముగాఁగ
దారిఁబడియున్న నహుషునినోరఁజిక్కి,
వెడలలేకున్నఁ బాండునిపెద్దకొడుకు
పాముకడకేగి యడిగినవానికెల్ల,
బదులుచెప్పఁగ నది భీమువదలిపెట్టె. 157

సీ. అట్లుండఁ జూపోపక చట దుర్యోధనుఁ
డేకతంబునఁ గర్ణుఁడెచ్చరింప
మామ యౌనని పలుమాఱును బలుకంగఁ
బసులఁ గాపాడు నెపంబువెట్టి
మొనలడంబముతోడఁ జనుదెంచి పాండుని
కొడుకులుదిగియున్న నెళవునకును
బజ్జగుడారంబు పన్నించి వారిని
వెక్కిరింపఁగ విఱ్ఱవీఁగుచుండఁ
జిత్రసేనుఁడనెడి జేజేలదిట్టఁడు,
వచ్చితాఁకి కర్ణుఁ బాఱఁద్రోలి
దొరనుబట్టి త్రాళ్ళతోఁగట్టికొనిపోవఁ,
జెదరి వెఱచిపఱచి సిగ్గుదోఁప. 158

వ. అతనిమూఁకలు. 159

ఉ. సోలియుధిష్ఠిరున్మఱువుసొచ్చినఁ దమ్ములఁ బంపవారునుం
జాలముసేయకేగి నిముసంబునఁ గూడఁగ ముట్టి తూపులం

గూలఁగనేయు మూఁకలనుగోయని యాఁతిచినిల్వలేక యా
వేలుపుఁబోఁడ నింగికిని వేచనఁ జూచుచుఁ గ్రీడిప్రోడయై. 160

క. అమ్ములగూఁడ డొనరించియు,
నెమ్ములుపడఁ జిత్రసేను నేసిన వెఱచే
నిమ్ముల దుర్యోధనుడై,
ళమ్మునఁ గవ్వడికినిచ్చి లలిఁబఃవినియెన్. 161

ఆ. కట్లుత్రోడనపుడు గాంధారిపట్టిని,
గాడ్పుపట్టి యన్నకడకుఁ దేఁగఁ
గనికరమున మేని కట్లెల్లవిప్పించి,
వడిగహితవుచెప్పి విడిచిపుచ్చె. 162

ఆ. ధౌమ్యునింట నునిచి తగనన్నదమ్ములు,
పండ్లుదేరనడవి పట్లకరుగఁ
గ్రొత్తపెండ్లిచేసికొనుచు నాదారిని
సైంధవుండు చనుచు సరగవ్రాల. 163

చ. నిలుకడఁగన్న క్రొమ్మెఱుఁగు నీటున మేనునుదాల్చి యిచ్చమై
మెలఁగెడు గుజ్జుమావివలె మేలిమిచేఁతలుపూని మెత్తనై
చెలఁగు పసిండి బొమ్మవలెఁ జేరువగుమ్మరుచున్న ద్రోవదిం
గలయఁగఁజూచి పూవిలుతు కమ్మనిములుకులనొచ్చి క్రచ్చుఱన్. 164

క. కదియంజని మిక్కిలి ద్రో,
వది బతిమాలియును దెన్నువడయక బలిమిం
దుద కౌఁగిలిని దేరను
బదిలముగాఁ బెట్టుకొంచుఁ బఱచెంగానన్. 165

సీ. ధౌమ్యుఁడఱచుచు వెంటను దవిలివానిఁ
దిట్టుచును బోవనంతలోదిట్టయగుచు

భీముఁడరుదెంచి సైంధవు వేగముట్టి
గడియలోఁ బట్టి తలపట్టి గాసిపట్టి. 166

క. అన్నకడకీడ్చి తెచ్చినఁ,
జెన్నఱితల రేవులుగను జెఱఁగొఱుగంగా
విన్ననయి యున్న సైంధవుఁ
గ్రన్నన విడిపించిపుచ్చెఁగాంచి యతండున్. 167

తే. అవల నొకనాఁడు తమ్ములుఁగవలు నేగి
విషపునీటిని వలదన్న వినక త్రావి
పడిననల్వురగుదెదారిపలుకులకును
నొప్పమార్వల్కి బ్రతికించి మెప్పులొందె. 168

వ. అట్లెండలం బడలియు వానలం దడిసియు వెడిదంబులగు నిడుములు నొందరియు జడియక యడవిలోనుండఁ బండ్రెండేండ్లు నిండిన నాఁదండి మగలు తమతోడఁ గూడనున్నవారి నందఱ నాయాయెడలకుం బంచి మించినవేడుక నించుకయుఁ దమజాడలెవ్వరు నెఱుంగకుండ దండి తనంబునఁ గాఱడవులంబడి నడచి నడచి కడకొక్కయెడ నేకతంబు నందగిన వేసంబులు వేసికొని బయలుదేఱి విరటునూరుచేరి యాచేరువం దమకత్తుల మొత్తమ్ములను నమ్ములను విండులను నొక్క కట్టగాఁగట్టి వానిచుట్టును బీనుంగుత్రోలొకటిఁ జుట్టఁబెట్టి యప్పట్టుననున్న జమ్మిచెట్టుపయిం బెట్టి. 169

సీ. కంకుఁడు నాఁగను గతలుసెప్పంగ యు
ధిష్ఠిరుఁడాతేసి దెననునిలిచె
వలలుండనంగను వంటలవాఁడయి
వడముడియచ్చోటఁ బనికినమరె ]
నచట బృహన్నలయనుపేరఁ గవ్వడి
నెలఁతల కాటలు నేర్పఁ జేరె

సందెదామగ్రంథి యనఁగను నకులుండు
గుఱ్ఱాలఁ బరికింపఁ గొలువుకుదిరె
నాలఁగానఁ దంత్రీపాలుఁడనెడుపేర
నక్కడన సహదేవుఁడు నమరియుండె
మాలినియనంగ ద్రోవదిపూలుముడువ
నోడయనివెలందుక సుధేష్ణయొద్దనుండె. 170

ఆ. జెట్టిపట్లుపట్టి సింగంబుతో నైనఁ
బులులతోడనైనఁ బోరి గెలిచి
దొరకు సతినియనుఁగుఁ దొయ్యాలులకు వేడ్క
సలుపుచుండు నొకఁడు వలలుఁడెపుడు. 171

సీ. అట్లు కొన్నాళ్లేగ నప్పుసుధేష్ణను
గన సింహబలుఁడట కొనరవచ్చి
మాలినిఁ దిలకించి మదినామె సొగసెంచి
మాటికెదఁదలంచి మరులుమించి
యక్కకునెఱిఁగించి యిక్కకుఁ జనుదెంచి
పాన్పున మేనుంచి వనరుచుండ
మాలిచేఁ దమ్మునికికిఁ గల్లును
రాణిగారంపిన రమణిఁగొనుచుఁ
గృష్ణయేగిననాతఁడు కెరలిపడుచుఁ
దన్నుఁ బట్టంగ వచ్చినఁ దలిరుఁబోఁడి
కొలువుకూటంబు దెసఁబాఱఁగూడవచ్చి
సింహబలుఁ డింతికొప్పును జేతఁబట్టె. 172

క. ఈడిచి యొకరక్కసుచే
నీడిగ్గిలం ద్రోయఁబడుచు నింటికిఁ జనియెం

జేసియుచే నంతయు రేయి
వాఁడిమగఁడు భీముఁ డెఱిఁగి పాయనికినుకన్. 173

మత్తకోకిల. ఆఁడురూపును దాల్చి ద్రోవదియట్లు చీఁకటిఁ గన్నియల్
గూడి పాటలు నేర్చు గేముఁ గోరి యూరకయుండఁగా
నాఁడు సింహబలుండు వచ్చి, తనంతఁ గేలెని జాఁప మా
టాడ కక్కున వానిఁ జంపి తనుమాడి చేసెను ముద్దగాన్. 174

సీ. అల్లుముద్దగఁ జేసి యట వైచిపోయిన
దమ్ములు నూర్వురుఁ దరలివచ్చి
చచ్చియున్నకై చాల సేవెడిచి
పీనుంగుపైఁ గృష్ణఁ బెట్టికట్టి
కొనిపోవుచుండఁగ నాయి డెమ్మాలిని
బానసంబున గాచ్చుపట్టి వినఁగ
వారును గాటికి వచ్చెడునంతకు
వడముడి యటకేగి బడలువడఁగ
నందఱను ద్రుంచి ద్రోవదినల్లఁ బంచి
మాఱుత్రోవనువంటిల్లు మరలఁజొచ్చె
ఏటికేతెంచుమాలిని వెలయఁజూచి
ప్రోలివారెల్ల వెఱచిరి బూతమనుచు. 175

ఉ. అంతయు నాలకించి యట నా ధృతరాష్ట్రునిపట్టి యిచ్చ బం
గొంతికొమాళ్ళు నిల్తురని కొంతతలంచి సుశర్మనంచి యా
వంతయు జాగుసేయ కట నావులఁ బట్టఁగఁ బంచి తానునున్
మంతురులాలమం చెదిరి మార్కొనఁగల్గినవారితో వడిన్. 176

క. మఱునాఁడు వెడలి విరటుని,
పఱగడ మొదవులను బట్టవడచక్కికిఁ గ్ర

చ్చుఱఁ బఱతెంచెను గొల్లలు,
వెఱపెల్లునఁబఱచి విరటువీడు సొరంగన్ 177

క. అంతకుమున్న సుశర్ముఁడు,
పంతము లాడుచునువచ్చి పలకడఁబసులన్
వింతగఁబట్టిన విరటుఁడు,
చెంతలనున్నట్టి తనదు చేరువతోడన్. 178

క. చనితాఁకి యోడిపోయిన,
నెనరేది సుశర్మయపుడు నెఱమగఁటిమినా
తనిఁ దనతేరికిఁగట్టిన,
వనట న్వొడిపించె రేయి వడముడి యతనిన్. 179

సీ. విరటుండు నెయ్యురు వీటనులేనప్పు
డిచట దుర్యోధనుఁ డేగుదెంచి
పసులఁ బట్టెనటంచుఁ బసులవారలు చెప్ప
విని పిన్నగావున విరటుకొమరుఁ
డుత్తరుండింటను నువిదలముందఱ
బీరముల్ వల్కుచు వెడలికృష్ణ
వంపునఁబేడి వార్వములఁ దోలఁగొనుచు
వడివచ్చి మూఁకలఁ బగఱఁజూచి
వెఱచి దిగఁలొంది యరదంబు వెనుకవంక,
త్రిప్పుమన్ననుగవ్వడిత్రిప్పకున్న
బెగ్గలంబునఁ దేరిని డిగ్గనుఱికి,
పాఱఁజొచ్చినఁగ్రీడియుఁ బఱుగువాఱి. 180

తే. అతనిఁ గొనివచ్చి యరదంబు నందుఁ బెట్టి
తాను గ్రీడియౌటెఱిఁగించి తాల్మిఁగొలిపి

యతని నరదంబు నడపంగ నానతిచ్చి
యమ్ముగలను విండ్లు పెట్టిన జమ్మికడకు 181

క. చని వలసినవానిఁగై,
కొని తక్కటివాని నందె గుట్టుగనిడి చ
య్యనఁ జని గాండీవంబున;
గొనయము నెక్కించి మించి ఘోరముగాఁగన్. 182

క. ములుకులు వఱపిన మూఁకలు,
నలుదెసలం బాయవిచ్చి నాననుబఱవన్
బలుమానును లోఁగిఁ దాఁకిరి,
చిలుకుల వానలు గురియుచుఁ జేవయెలర్చన్. 183

క. తఱిఁదాఁటకుండఁగవ్వడి,
యెఱిఁగించుకొనియెను దన్నునిచ్చట ననికొం
దఱు పలికినఁ దఱికడచుట,
యెఱిగించెను భీష్ముఁడప్పు డెల్లరువినఁగన్. 184

వ. అంత నర్జునుండు. 185

తే. పసుల మరలించి కావలిపరినిగ్రమించి,
వెనుకఁ జనుచున్న తేనిని వెంబడించి
కదిసి యోడించి పెఱవారిఁ గండడంచి,
పొలికలనన్నత్రు లేటులు వెలువరించి. 186

సీ. తమ్మునితలద్రుంచి తత్తడులనుగొంచి
బలియునిఁగర్ణునిఁ బరవఁజేసి
ద్రోణుని నొప్పించి ద్రోణుకొమారునిఁ
జేరాడకుండంగఁ జిక్కువఱిచెఁ
గృపుని నమ్ములముంచి కినుకమైభీష్ముని
యరదంబుపై సోలి యొఱగఁజేసి

దొరను గేరడమాడి దురమున దడములఁ
బీనుఁగు పెంటలుగా నొనర్చి
మఱియునందఱ నోలించి మఱచిపోక,
తెచ్చెనుత్తరబొమ్మపొత్తికలకొఱకుఁ
బేరుగలవారి తలచీర లారఁగోసి,
తనివిదీఱంగ ననిచేసి వెనుకమరలె. 187

గీ. అంతఁ దెలిసి యుస్సురనుచు దుర్యోధనుఁ,
డపుడె భీష్మపలుకులాలకించి
సిగ్గుఁబాటుతోడఁ జేరువతోఁగూడి,
యింటికడకు నడచె నెఱుకగలిగి. 188

క. అప్పుడు కవ్వడి జమ్మిని,
నెప్పటివలె విల్లునమ్ము లిడి యుత్తరునిన్
మెప్పుగఁ దేరను నిడి తా,
నొప్పుగ నొగలెక్కి చనియె నూరికి నెలమిన్. 189

క. ఈలోన నట యుధిష్ఠిరుఁ,
డాలములో గెలుపుగొన్న యల విరటునితోఁ
బోలఁగ జూదం బాడుచు,
నాలములోఁ బేడిగెలిచె నని వ్రేటుపడెన్. 190

క. అమ్మఱునాఁ డందఱు నొక,
యిమ్మునఁ దగఁగూడి తొంటి యేపున నుండన్
నెమ్మిని విరటున కుత్తరుఁ,
డిమ్ముల నెఱిఁగించె వారి నెల్లను వరుసన్. 191

క. ఎఱిఁగింప యుధిష్ఠిరునకు,
నెఱిఁగి విరాటుండు లేచి యెల్లరఁ దప్పుల్

మఱవంగ వేఁడుకొనియెం,
దెఱఁగుపడం బలికి కూర్మి దెల్లము గాఁగన్. 192

తే. చుట్టముల నెల్ల రావించి జోటిమిన్న,
నుత్తరయనెడి తనకూఁతునొసఁగి పెండ్లి
చేసె నభిమన్యునకు వేడ్క చెన్నుమీఱ,
నెంతయును జూచువారలు సంతసిల్ల. 193

వ. అనిన విని తరువాతి కత నెఱిఁగింపు మనుటయు. 194

క. కలువలవిందును బ్రొద్దును,
మలల నంద్రముల నేళ్ళ మఱి యెప్పుడమిన్
వెలుఁగును జీఁకటిఁ జుక్కల,
నెలమినిఁ గలిగించి ప్రోచి యేలెడి సామీ. 195

మాలిని. జగముల మొకిమీఁడా సాదులం బ్రోచుఱేఁడా
పగ యెఱుఁగనివాఁడా పల్వలం ద్రుంచు ప్రోడా
వగ లొదవనివాఁడా వంతసంద్రంపుటోడా
నెగు లడఁచెడివాఁడా నేలకు న్సంగడీఁడా. 196

గద్య. ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచననైషధ కావ్యరచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరివంశ పయఃపారావారరాకాకైరవమిత్రసుబ్రహ్మణ్యామాత్యపుత్రసకలసుజనవిధేయ వీరేశలింగనామధేయ ప్రణీతంబైన యచ్చతెనుఁగు భారతమునందుఁ బ్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము

క. మొదలుం దుదియు నెఱుంగక,
వదిలముగా నెపుడు నుండి పాడుగొనంబుల్
వెదకినను లేక మేలే,
యొదవించుచు జగము లేలుచుండెడి వేల్పా. 1

వ. శౌనకుండు లోనుగాఁగల జడదారిఱేండ్లకా సూతుం డిట్లనియె. 2

క. విరటుఁడు కృష్ణుఁడు మొదలగు,
దొరలెల్లను గూడి యుండి దుర్యోధను తుం
టరితనము నగ్గడించుచు,
నరుగుగ నొకరాయబారి నచటికిఁ బంపన్. 3

తే. అందఱును నెంచి యచ్చోటి కరిగి యతఁడు
తెలుపవలసినపలుకులఁ దెలియఁ గఱపి
ద్రుపదు నొజ్జను బంపిరి తొడరి సగము
పుడమి జముపట్టికిని నియ్య నడుగుకొఱకు. 4

తే. అంత నిటఁ గ్రీడి వెన్నునియింటికరిగి
పోరఁ దనతేరునడపంగఁ గోరుకొనియె
నాఁడె దుర్యోధనుఁడువచ్చి నాఁడెమైన
బంట్లఁ బదివేవురను దానుఁ బడసిచనియె. 5

క. నేలఁ గలదొరలలోపలఁ
జాలఁగ దుర్యోధనునకు సాయము చూపం
బాలుపడిరి పెఱవారలు
పోలఁగ జముపట్టిఁ జేరి పొలిచిరి కడిమిన్. 6

చ. ద్రుపదునియొజ్జ యేగియటఁ ద్రోవకురా ధృతరాష్ట్రితోడఁ గొం
త పొసఁగ మాటలాడి తనదారిని వచ్చిన గ్రుడ్డిఱేఁడును

న్నిపము ద్రోలంగఁ బంపెఁ దననేరమి గన్పడ నూరిపోసి నీ
విపుడ యుధిష్ఠిరుం గదిసి యీయనిమానువు మంచుసంజయున్. 7

సీ. ఆతండు చనుదెంచి యందఱకును మ్రొక్కి
కొల్వులోపలనున్నగొంతికొడుకుఁ
గదిసియందఱు వినఁ గరముఁదీపులుగాఁగఁ
బెనఁకువ మానఁగఁబెక్కువగలఁ
దేనిమాటలఁ దెల్పి తిన్నని తెన్నున
నడవంగ జముపట్టెఁ దడవు వేఁడి
చదురెల్ల గాన్పించి చక్కని బదులుమా
టలఁ బాండుకొమరుని వలనఁబడసి
వారి వీడ్కొని ధృతరాష్ట్రు పజ్జకేగి,
యెల్లచందమ్ము లాతని కెఱుకపఱిచి
యలుకపుట్టించితగవు మైఁబలుకవలయు,
నుడువులెల్ల నుదిటముగా నుడివిచనియె 8

సీ. అంత యుధిష్ఠిరుఁ డరసి యిచ్చటనుండి
వెన్నని ధృతరాష్ట్రు వీటికంప
నాతని రావించి యనియె నిక్కెక్కడి
నీవేగి సగపాలు నేలలోన
మాకియ్య జేనిత్తో మఱిమఱిచెప్పుము
వినఁ డేని యామీఁద వినుము తెలియ
నేపురకును మాకు నేను ప్రోల్లైనను
గడ కిచ్చునట్లుగఁ గడఁకఁ బలుకు
మట్లు చేసినన్నైనఁ బోరనెడుమాటఁ
దక్క కూడి బ్రదుకుదుము తఱుచు లేల

యనిన పిమ్మట భీముండు నతసితమ్ము
లవల ద్రోవది మదిఁ జెప్పిరతనితోడ. 9

ఉ. ఆవలఁగృష్ణుఁడేగి మరియాదమెయిన్ ధృతరాష్ట్రుఁ జూచి యా
క్రేవల ద్రోణునిం గృపునిఁ గేల్గవమోడిచి పల్కరించి య
త్రావున నున్న భీష్మునిని దద్దయుఁ గూరిమి గారవించి య
చ్చో వెరవారఁ గొల్వునను జూపఱ డెందములుం గరంగఁగన్. 10

చ. చనువును బల్మిఁజూపి పలుచందములం దగఁజెప్పి యంతతోఁ
దనియక యొద్దనున్న జడదారులచేతను జేతనైన లా
గునఁ బలికించి యెందునను గోరిక చేకుఱకున్న నోలగం
బున ధృతరాష్ట్రపట్టిపయిఁ బూనినకిన్కను బల్కు లాడినన్. 11

క. వడిఁ గర్ణుని దుశ్శాసను
చెడుగఱపులు నమ్మి కృష్ణుఁ జేప్పడఁ గట్టం
గడఁగిన దుర్యోధనుఁ డెద
జడియఁగఁ దనరూపు చూపి చనెఁ గృష్ణుండున్. 12

ఆ. అట్లు కొలువు విడుచునప్పుడు వెన్నుండు
బవరమరుగు దెంచెఁ బదిలమనుచుఁ
బలికి వచ్చి కుంతి బసకేగి మాటాడి
విదురు నింటఁ గుడిచి వెడలెవీడు. 13

వ. అట్లు బయల్వెడలి కొన్నినాళ్లకు. 14

చ. విరటుని యూరుచేరి యట వేవురముందర గొంతిపట్టికిన్
సరగున నంతయుం దెలిపి జాగొనరింపక గొప్పదండుతో
దురమున కాయితం బగుట తొల్తటి కర్జముగాఁగఁ జెప్పి యు
బ్బురముగ వాఁడిసూదిమొన మోపినయంతయు నేలనీయఁగన్. 15

క. ధృతరాష్ట్రుని కొడు కొప్పమి
కతలుగ నెఱిఁగించి మిగులఁ గయ్యంబునకున్

హితవుగఁ బురికొల్పినఁ దగ
నతఁ డప్పుడె ప్రమదమువట్టి నందఱుఁ జూడన్. 16

క. పడవాలుగాఁగ నొసరించి
వెడలి కురుక్షేత్రమునెడ వేరిటి చోటన్
విడియించి మూఁక నెల్లను
గను సంతోసమున నుండెఁ గల నొసరింన్ప. 17

సీ. వెన్నుండు నడచిన వెంటనె యచ్చట
దుర్యోధనుండును దోసు నూప
వచ్చినజేఁడుల హెచ్చరికను జేసి
గమికి నెల్లను మొనగానిఁ గాఁగ
భీష్ముని నొసరించి ప్రేరేఁచి మొనలును
దమ్ములు నెయ్యురుఁ దవిలి రాఁగఁ
గదలి కురుక్షేత్ర మదనుతప్పక చేరి
విడియించె దళముల వేఱుచోటఁ
గర్ణుఁ డంతకుమున్నె పెక్కుంద్రు వినఁగ,
భీష్ముఁడుసుఱులువిడిచినపిదపఁగాని
తాను బోరికి రానని తగని బాస,
చేసికొనె మాటపట్టింపు చేత వీట. 18

క. దళవాయి యైనభీష్ముఁడు,
కలనికిఁ బురికొల్పి మొనలఁ గడుబీరమునన్
దలపడఁ బంచెను జోదుల,
కెలమియుమగఁటిమి చలంబునెసకంబెసఁగన్. 19

ఉ. అయ్యెడఁ బాండుపెద్దకొడు కందఱు నం దరుదంచఁ గాల్నడన్
జయ్యన భీష్మపాలికిఁ గనం జని వేలుపుటేటిపట్టిచే

గయ్యముసేయ నానతిని గైకొని దీవెన లంది ద్రోణుని
నెయ్యపు మామకోల్యుఁ గృపుఁగని వీడ్కొనివచ్చెఁ గ్రమ్మఱన్.

క. చిందమ్ములమ్రోఁతలు మి,
న్నంది యెసఁగ భీష్ముదండు లాలపువేడ్కం
గ్రందుగ నడచెను బయిపయి,
ముందఱఁబాండుసుకొమాళ్ళమూఁకలమీఁదన్. 21

సీ. నొగలెక్కి కృష్ణుండు తగుమాడ్కి నిగుడంగఁ
దెల్లనివాఱ్వముల్ తేజరిల్ల
జేజే లొసంగిన చిందంబు నొత్తుచు
నరదఁబుపైఁ గ్రీడి యరుగుదెంచి
యిరువాఁగుఁజూచి తానెంతయు మదిలోన
నక్కటికము పుట్టియయినవారి
వేయఁజేతులురాక విల్లునమ్ములుఁ
దేరనుబడవైచి దిగులుత్తోఁపఁ
గూలఁబడినఁజూచి గొబ్బునవెన్నుండు,
పాడిఁగలపి పోరఁబగలనోంచి
గెలుపుఁగొంట యేలికలకెల్లఁ దగవని,
మదికినాటఁజెప్పి మఱఁదినపుడు. 22

క. దురమునకుంబురికొల్పినఁ,
బరువడి సందియము వాసివాసి యెసంగం
గురిసెను నమ్ములవానల,
గరువంబఱి పగఱపైఁజు గలఁగంబడఁగన్. 23

సీ. మూర్తురమొత్తముల్ మూర్కొనిపోరిన
నందఱికయ్యంబు జరగెనపుడు

ద్రోవదికొడుకులు తోడుగ నభిమన్యుఁ
డసరి యొప్పనివారి కడఁకఁ జెఱిచెఁ
కృపుఁడు నశ్వత్థామ కేడించి మూఁకల
పైఁబడి తమలావు బయలుపఱిచి
యుత్తరుండేగి శల్యునిమీఁదఁ బోటొగ్గి
చూపటె నాతనిసూపుగముల
నంతభీష్ముండుగవిసివాలంపగములఁ
దెలుచఁబరఁగించిమూఁకల బెగడుపఱిచి
యెల్లెడలఁ దానయైపొల్చి యేపుచూప,
విరిగిసురిఁగిరిపగవారిబిరుదుమగలు. 24

క. ఆలోనఁ బ్రొద్దుగ్రుంకిన,
నాలముసాలించి నాఁటి కందఱు పేళ్ళన్
జాలమునేయక చేరిరి,
చాలఁగ విన్నటికొడుకు సారెఁ బొగడుచున్. 25

ఉ. రెండవనాటిపోరునను రెండవ ప్రొద్దుకొమారు పోలికన్
నండిమగండు క్రీడి తన ప్రాణనుజూపెఁ గరంబుఁ బుచ్చె భీ
ముండును భానుమంతు జముప్రోలికి ద్రోవదితోడఁబుట్టువుం
గండునఁదాఁకి ద్రోణుఁడును గచ్చుటఁ బొఱఁగఁజేసె నీసునన్. 26

సీ. మూఁడవనాఁడును మొగ్గరంబులుకన్ని
యిరువాఁగు నొండొంటిబెరసితాఁక
దుర్యోధనుఁడు భీముతోఁ దలపడిపోరి
మేనెఱుంగక తేరిమీఁద సోలె
మూఁడుజాములయప్డు డీడఁబోవక భీష్ముఁ
డుక్కునఁ బెక్కురఁ జక్కడంచి

యెక్కడఁజూచిన నెమ్ములదిమ్ములుఁ
గంపలకొండలు నిండియుండ
నెత్తుటేఱులు పఱపింప నిలువలేక,
బెండువడి క్రీడిఁజుణిఁగిన వెన్నుఁడదరి
చుట్టువాలునుజేఁబూని దిట్టయగుచు,
నరదమును డిగ్గి భీష్ముపై నరుగుచుండ. 27

క. కవ్వడియువచ్చి వెన్నుని,
నెవ్వడిఁ గౌఁగిటను బట్టినిలిపి వెనుకకున్
దవ్వులఁ గొనిచని భీష్ముని,
గ్రొవ్వడఁగించెను గడంగి కూటువచెదరన్. 28

క. నాలవనాఁటి పెనంకువ,
వాలుమగఁడు శల్యుకొడుకు పలుకయు వాలుం
గ్రాలఁగ ధృష్టద్యుమ్నుని,
పైలిఁగవిసి తెగటాఱెఁబరి పడలువడన్. 29

పంచచామరము. ఘటోత్కచుండు జిత్తులెల్లగానిపించి మూఁకపైఁ
దటాలునన్మెఱుంగు లీను తళ్కుటంప గుంపులన్
దిటంబు మీఱ నేసియేసి దిట్టలైన వారినిన్
హాటాహుటిం గలంగి పాఱనూకె నుక్కడంగఁగన్.

ఉ. ఏనవనాఁటి కయ్యమున నెంతయు వాఁడిమి చూపెద్రోణుఁడా
పూనికిఁజూచి మాఱుకొని పోరెను భీముఁడు చేవయేర్పడన్
మానకలక్ష్మణుండు నభిమన్యుఁడునుంబలమగ్గలింపఁగా
నేనుఁగు నేనుఁగుం బెనఁగు నేపునఁబోరిరి చూపఱెన్నఁగన్. 31

క. అఱవనాఁడల వడముడి,
మాఱుకొని గుదియవిసరుచు మాఘంతులతో

సీఱుగగొరులఁ గెడపెను,
బీఱువడుచు దాయులెల్ల బెదరంబెదరన్. 3

క. అని ద్రోణుఁడు ధృష్టద్యు
మ్నునిఁ గనలునఁ దారసించి మొనలుతలంకన్
దనసింగిణి వాలమ్ములఁ
దనువులు నాటంగ సేయ నాతఁడుపఱచెన్. 3

తే. ద్రుపదుకొమరుఁడు రారాజుదొడరి తేరు,
నుగ్గుచేసిన వెన్నిచ్చి సిగ్గువిడిచి
చేకితానుఁడుఁ గృపుఁడును జేవమీఱఁ,
బోరి రేడవనాఁడాలపోతులట్లు. 3

సీ. వసలెత్తువేడ్క సునాభుండు మొదలగు
గాంధారికొడుకులఁ గపిసిభీముఁ
డుద్దవిడిని వారిఁ బెద్దనిద్దురఁబుచ్చి
పేనుంగులను జేసెఁ బీనుఁగులను
మఱి యలంబుసుఁడను మానిసిదిండియు
రావంతు మాఱ్కొని లావుచూపి
పెద్దతడవునకుఁ బిద్దించె నాతనిఁ
గవ్వడియొంతయుఁ గ స్తిచెంద
మఱిఘటోత్కచుఁడుమాఱ్కొని ద్రోణుండు,
మొదలుగలుగువారిమురువడంచి
యలఁతిమూఁకనెల్ల నలుఁగులపాల్సేసె,
నవలినాఁడు వేల్పులబ్బపడఁగ. 35

క. ఎనిమిదవనాఁటి రాతిరి,
చనువున దుర్యోధనుండు చనిభీష్ముసితోఁ

దనగోడు మొఱ్ఱవెట్టినఁ,
గనఁబఱచెద నెల్లినాఁడు గండని నతఁడున్. 36

తే. తొమ్మిదవనాఁటిప్రొద్దునఁ బొంగలించు,
సంతసంబులుమోములఁజౌకళింపఁ
గదలియిరువాఁగునుంబాలికలనఁబొలిచి,
రెత్తికోలునఁబడవాళ్ళు హెచ్చరింప. 37

సీ. అప్పుడుకోల్తలచేసి యభిమన్యుఁడడరిన
నరిగియలంబసుఁడడ్డపడియె
వివ్వచ్చుఁడరుదెంచి వీఁకఁజూపినఁ బాఱు
దొరలకు ద్రోణుండుతోడు చూపె
బాసటయగుచు దుశ్శాసనుఁడు శకుని
వెంటరా భీష్ముండువేఁడి చూపి
వాఁడినారసములఁగ్రీడిని నొప్పించి
వెన్నునినంపఱ బెగడుపఱిచి
రావుతులఁద్రుంచి పొలియించి మావతులను
నరదములవారి నొంచి కాల్వురనడంచి
కడిమిచూపిన దళములు గలఁగఁబాఱ
లేట మొగములుపడి రెల్ల మేటిమగలు. 38

క. చేయునదిలేక కవ్వడి,
యాయమ్ములనాఁటియున్న యమ్ములవెతతోఁ
బాయుపడు మోనలఁ బిలుచుచు,
నోయనదూపులను నేయుచుండెనుభీష్మున్. 39

శా. అచ్చొప్పంతయుఁ జూచి కృష్ణుఁడెదలో నారాటముంజెంది వి
వ్వచ్చుండెంతయు నొచ్చియుంట నొగలన్వార్వంపుఁ బగ్గంబులన్

మెచ్చుల్లుల్కఁగఁ గట్టి తేరు డిగి యామిన్నేటిపట్టుం బొరిం
బుచ్చంగా నడత్రెంచెఁ గేల బలితంపుఁ జుట్టువాలొప్పఁగన్. 40

క. త్రోడనెపఱతెంచి వడిం
క్రీడియునిరుగేలఁ బట్టి కృష్ణుని మరలం
దోడుకొనిపోయి తేరున
వేడుకఁ గూర్చుండఁబెట్టి వేఁడుచుఁబలికెన్. 41

క. తియ్యనిమాటల వెన్నుని
నియ్యకొనంజేసి వెడలి యారవమెసఁగం
గయ్యమునకు డాసెనపుడె
యొయ్యనఁ బ్రొద్దత్తమిల్లె నుడిగెదురంబుల్. 42

తే. నాఁటిబవరంబుఁగని మదినాటుకొన్న
యుమ్మలమ్మునఁనింకఁ గయ్యమ్ముమాని
కానలకు నేగుదునటంచుఁగెడఁకఁబలుకు
నలయుధిష్ఠిరు నూఱార్చియనుపుమీఱ. 43

క. వెన్నుండారే యాతని
విన్నేటికొమారుడకట విప్వచ్చునితోఁ
దిన్నఁగఁగొని చనియాయన
సన్నగ నడిగించెః జావుచందముఁ దెలుపన్. 44

ఉ. అందున కాతఁడిట్టనియె నాఁడుఁదనంబును దొల్త్రఁదాల్చి యా
పొందికఁబాసి వెన్కమగపోడిమిఁ దాల్చియున్న వారిపై
నెందును నేయకుందునని నోఁ బ్రతినందగఁ బట్టినాఁడ మీ
యందుశిఖండి యట్టిఁడగు టాతని ముందిడికొంచు నాపయిన్. 45

క. నేనేయనితఱిఁ గవ్వడి
నోనేసినఁ గూలువాఁడ నునుఁదూపులచేఁ
బూనియటుచేయుఁ డంచును
నానతియిడి పంచె మంతనంబున వారిన్. 46

క. మఱునాఁ డెప్పటియట్టుల
యఱిముఱిఁ బఱతెంచి దండులాలము సేయం
దరలుడు శిఖండి మున్నిడి
పఱతెంచెను గ్రీడి భీష్ముపయికిఁ గడంకన్. 47

తే. అడ్డుపడి దుస్ససేనుఁడు హామికలరఁ
బెక్కుమాఱులు కవ్వడి బెగ్గడిలఁగఁ
బోరిపాఱె శిఖండియుఁ బొంగిపోయఁ
జొచ్చివివ్వచ్చుప్రాపునఁ జొరవమిగుల. 48

క. కొడుకుంబంచెను ద్రోణుఁడు
వడిఁగ్రీడికి నడ్డుపడఁగ బరవసమునఁ గ
వ్వడి తెఱపిఁజేసి యమ్ముల
బడలించె శిఖండివెనుక నదిగొని భీష్మున్. 49

తే. తేరుసమసియు భీష్ముండు దిటవుచెడక
విరటుతమ్ముశతానీకుఁ బిలుకుమార్చె
నంత వివ్వచ్చుఁడలుగులనక్కజముగఁ
బొదివిపడవైచె నాతనిఁ బుడమిమీఁద. 50

తే. నేలఁబడియున్న భీష్మునిపాలికేగి
యంపసెజ్జయుఁ దలగడ యతనికపుడు
క్రీడిసేర్పుమైఁ గలిగించి వాఁడితూపు
నేలలోనాటి దగమాన్చె నీరుదీసి. 51

క. మనుమలు మొదలగువారలు
తనచుట్టును బలసియుండఁ దనరెడు నాభీ
ష్మునిపాలికిఁ గర్ణుండును
జనుదెంచికరంబు వేఁడెన్ సైరణచూపన్. 52

క. వినువాఁక కొడుకు కూలిన,
వనరుచు దుర్యోధనుండు వడి నెలవునకుం
జని యామునుపటివాఁడొగి
మొనగానిఁగ జేసె ద్రోణుమూఁకలకెల్లన్. 53

క. తన్నటువలె దళవాయిఁగ,
మన్ననసొనరింప నలరి మక్కువద్రోణుం
డెన్న యుధిష్ఠిరు ననిలో
నన్నికొసఁగెదను బట్టినలువురుఁజూడన్. 54

క. అని బాసయిచ్చె దుర్యో
ధనునకు నాతండు మదిసిఁదద్దయు నుబ్బన్
విని యర్జునుఁడన్నకుఁ జె
ప్పెను దిటవుగ దాననతఁడు వెరువకయుండెన్. 55

త్రోటకము.

మొనలెల్లను వీఁగఁగ ముల్కులు పె,
ల్చునఁగ్రుచ్చుచు ద్రోణుఁడు సాత్యకిను
క్కునమార్కొని తూపులు గోరముగా,
నవినేసెను ద్రోపది యన్నపయిన్. 56

తే. శల్యుఁడునుభీముఁడునుదాకిసరకుసేయ
కొండొరులనొంచిమించుచునొకరికొకరు
నెత్రుపఱదలు వాఱంగనెట్టికొంచుఁ,
బూచుమోదుగులట్లులు పొలిచిరపుడు. 57

సీ. కర్ణునికొమరుండు గండునవృషసేనుఁ
డడరి మూఁకలనెల్లఁ బొడవడంపఁ
దొడఁగిననకులుని కొడుకు శతానీకుఁ
డెడసొచ్చి బలుతూపు లొడలనించె

ద్రుపదుఁడు విరటుండుఁ దోడుచూపఁగఁ గొంతి
తొలిపట్టి ద్రోణునితోడఁ బెనఁగి
వ్యాఘ్రదత్తుఁడు మొదలైనవారిని గోలు
పోయి ద్రోణునిచేతఁ బోరఁ దాను
బట్టువడనున్నతఱిని విష్వచ్ఛుఁడడరి,
యంపవానలు గురియించు చఱుగుదెంచి
యల్లయొజ్జలవేఁడిమి యెల్లనుడిపెఁ,
బ్రొద్దువాలెనునంతలోఁ బొదలెనిరులు. 58

ఉ. రెండవనాఁటి వేకువను గ్రీడి యుధిష్ఠిరుతోడఁ జెప్పి త
న్నొండెడ నాలమునం జలుప నూరకపిల్చు సుశర్మదండుతోఁ
గండునఁ బోరఁబోయి కడఁకం దనలావును జేవఁ జూపి బల్
కొండలపిండు మెండునను గూలిచెఁ బల్వురమేలి జోదులన్. 59

క. మఱియు న్సంశప్తకులును,
బిఱుసనక పెనంగఁజూచి వెఱఁగందకయే
డెఱ విష్వచ్ఛుఁడు తనయం,
పఱపాలుగఁజేసె వేలవంతునవారిన్. 60

సీ. ద్రోణుఁడు మిక్కిలి రోసంబుమీఱంగ
సత్యజిత్తును జముసరసకంచి
దూదితిట్టలమీఁదఁ దొడరుచిచ్చునుబోలె
మొనలపై వడిఁజూపి కనుపుగొట్టి
సూర్యదత్తునిఁ జంపి సూరెలవారులఁ
బలుచక్కియలకును బాఱఁద్రోలి
మాఱులేకుండంగ మలయుచుండఁగ భీము
డన్నయుఁగవలును మున్నగాఁగ

శంఖమును గూడితాఁకిన నవలఁ గృపుడు
కర్ణుఁడును శల్యుఁడును లోనుఁగాఁగలట్టి
వారలెల్లను సడ్డఁబు వచ్చిపోరఁ
జాపికలన నెల్లఁ బీనుంగుఁబ్రోవు లయ్యె. 61

మ. భగదత్తుండును సుప్రతీకమను చెల్వంబైన యేనుంగుతోఁ
దగ భీముం దలపడ్డ జిచ్చువడి యాతం డెల్గునూషంగ నా
జగజెట్టి న్మొనసెల్లమాఱుకొని యాసం బోర నాయందఱుం
వెఱఁగొందన్ భగదత్తుఁ జేసె నటుపై విష్వచ్చుఁ జేపారఁగన్. 62

క. చనుదెంచి వాఁడితూపుల
ననువులు వాటించి ద్రొడ్డయమ్మున భగద
త్తునిఁ బుడమింబడ నేసెను
బెనఁగాడి యేనుంగుతోడఁ బీనుంగునుగాఁ. 63

సీ. అది చూచి శకునియు నాతనిబలగంబుఁ
జోరవమై నర్జునుఁ జుట్టుముట్ట
బలునారసంబులఁ బలువురఁ బొలించి
శకుని నాతఁడు పాఱిచనఁగఁజేసి
యార్పులు సెలఁగంగ నరుదెంచి తాఁకిన
సంశప్తకుల వెఱచఱవ నొంచి
నడుముడితోడుత వచ్చి కర్ణునిఁ దాఁకిఁ
పోలియించె నతనితమ్ములను మువ్వుర
దేరు డిగివచ్చి భీముండు తెఱపి గాంచి
కర్ణుచుట్టాల వేవురఁగం డడంచె
నింతలో ద్రోణుఁడును తేఁడు నేగుదెంచి
కర్ణుఁగాచిరి కవ్వడి కడఁకనుండి. 64

ఆ. అంతఁ బ్రొద్దుగ్రుంకె నప్పుడ యిరువాఁగు
నెలవుపట్లకేగి నిదురపోయి
మరల నెప్పటట్ల మఱునాఁడు చనుదెంచి
కలనికాయితమయి నిలిచి రందు. 65

సీ. సంశప్తకులు క్రీడి జగడంబునకుఁ బిల్చి
దవ్వుగఁ గొనిపోయి తడవు పెనఁగి
రీలోన ద్రోణుండు నిచ్చటఁ దమ్మిమొ
గ్గరమును బన్నించి కడిమి మెఱయ
పడముడి లోనైన వారెల్ల దానిని
జింపంగ నేమియుఁ జేతఁగాక
యభిమన్యు వేఁడిన నాతండు గండున
ద్రోణునిఁ దూపులఁ ద్రాణ చెఱచి
మోహరంబును జొచ్చి యమ్మొనలనెల్ల
జిక్కువఱచుచుఁ బెక్కురనుక్కడంచి
నేలకును గోలకును దెచ్చెనేర్పుమెఱసి
పగఱజోదుల నెల్లను బలియుఁడగుచు. 66

మ. మఱియుం బోవక తాఁకినట్టి కృపునిన్మాఁజేసి దుర్యోధనుఁ
నెఱఁకల్ దూఱఁగఁగొట్టి ద్రోణకొడుకున్బిట్టేసి దుశ్శాసనుం
బఱవంజేసివెసన్ బృహద్బలుని చేవం బాపి యాకర్ణుని
గాఱవోవంగను జేసి శల్యుకడిమిం గోల్పుచ్చె బీరంబునన్. 67

క. ఈలో నభిమన్యునకును
నాలములోఁ దోడుసూప నరిగెడి భీముఁ
మేలిమగలఁ బోనీయక
చాలిక నెదిరించి యాఁపె సైంధవుఁ డోకఁడున్. 68

సీ. ఇంతలో నభిమన్యుఁ డేపున వృషసేను
నుక్కున మార్కొని యొల్లఁబోవఁ
జేసినఁ దేజీలు చివ్వకు దవ్వుగఁ
దేరీడ్చుకొని పోయెఁ దీవరముగ
బిరుదుమగలు వేనవేలుగఁ జనుదెంచి
మంటలోపలఁ బడి మ్రందునట్టి
మిడుతగుంపులమాడ్కి మీఁదిమీఁదికి వచ్చి
పరగ నాతనిచేత సమసిరొకట
మాటలేటికిఁ బగవారి మేటిమగల
లోన నొకఁడైన లేఁడయ్యెఁ బూని వెదక
సూదిమొన మోఁపదగునంతచోటనయిన
గాయములు లేని నెమ్మేనుగలుగువాఁడు. 69

వ. వెండియు నభిమన్యుండు. 70

క. రారాజుకొడుకు లక్ష్మణుఁ
బోరం బరిమార్చి పేర్చి పోరిగొని నొకబల్
నారసమునను బృహద్బలు
దోరించెను వారిబారి దొరలగ్గింపన్. 71

క. నెత్తురులఁ దొప్పఁదోఁగియు
మొత్తములై పాఱు తనదు మొనకాండ్రవెతన్
మొత్తనఁగని దుర్యోధనుఁ
డత్తఱిఁ జెయివీచె నంతటాతనిఁబొదువన్. 72

సీ. వెఱ పెల్లునను బాఱు వితమునఁ గర్ణుండు
వెనుకఁబ్రక్కకువచ్చి విల్లు తునిమె
ద్రోణుఁడీలోపల దోరించెఁ దేజీలఁ
ద్రుంచెఁ గృపుఁడు తేరుదోలువానిఁ

గడఁగి యశ్వత్థామ కరవాలు నుఱుమాడె
నాఁటె శల్యుఁడు మేన నారసముల
మఱిచేయఁగల దండిమగలెల్ల దొమ్మిని
బయిఁబడి యలయింపఁ బాలుపడిరి
యేమిచెప్పఁగ నభిమన్యుఁ డేపు చెడక
మేను నెత్తుటఁ జొత్తిల్లి మింటి కెగసి
దుస్ససేనుని కొమరునిఁ దొడరి వాని
గీటడంచియు నతనిచేఁ గెడసెఁ దాను. 73

ఆ. అంతఁ బ్రొద్దుగ్రుంక నాలంబు చాలించి
మొనలఁ దివిచికొంచు మొగమునందు
విన్నఁదనము తోఁప వెనవీటికిని బోయె
జమునిపట్టి కొందలమున మునిఁగి. 74

క. కవ్వడియు వచ్చి కొమరుఁడు
చివ్వనుగడతేఱుటన్న చెప్పఁగ వినిలో
నెవ్వగఁ బొగులుచు నడలెను
నెవ్వారాఁపినను నాఁగ కెలుఁగెత్తి వడిన్. 75

ఉ. అంతటఁ గొంత సేపటికి నాతఁడు నెంజిలివాసి యిట్లనుం
బంతముచూడుఁ డెల్లి పరిమార్చెద సైంధవు నేరుగాచినన్
బొంతలఁ బ్రొద్దుగ్రుంకుటకు మున్నుగ నందఱుఁ జూచుచుండ నే
నంతయుఁ జేయలేనియెడ నగ్గిని చొచ్చెద గాండివంబుతోన్. 76

క. అని ప్రతినవట్టెనంతయు
విని మదిలో సైంధవుండు వెఱపై కొనఁగాఁ
జని దుర్యోధనునకుఁ దెలి
పిననాతఁడు దిటము చెప్పి వెఱపుడిగించెన్. 77

వ. అట్లారేయి కడచిన. 78

సీ. బండి మొగ్గరమును బన్నించి మఱునాఁడు
ప్రొద్దున ద్రోణుండు మొగమునందుఁ
దానిల్చి యవ్వల దవ్వుల సైంధవు
జోదులనడుమను జుణుఁగఁబెట్టి
యాయితంబయి యుండ నర్జునుఁ డన్నను
గాపాడ సాత్యకిఁ గావలిగను
బెట్టి యొడ్డను డాసి బిట్టేసి తాటిపం
డులుఁబోలెఁ దల లెన్నొ డొల్లనేసి
దున్నసేను నొంచి ద్రోణుని వడిమించి,
మొగ్గరంబుసొచ్చి మొనలద్రవ్వి
కినుక యినుమడించి కృతవర్మఁదూలించి,
చని శ్రుతాయుధునినిఁ జక్కడంచె. 79

క. ఈనడుమద్రుపదు కొమరుఁడు,
ద్రోణునితోఁ బోరిపోరి త్రోలఁగిన నలుఁగుల్
మేనన్నించుచు సాత్యకి,
నోనేసెం ద్రోణునపుడు నూర్వురు మెచ్చన్. 80

ఉ. కవ్వడియంత సైంధవునిఁ గానఁగఁ బోవుచునుండఁద్రోవలో
నెవ్వడి నడ్డుసొచ్చి వడి నీల్గిరి విందుఁడు వానితమ్ముఁడున్
జివ్వకుఁ గత్తిళంబలఁగఁజేరి సుయోధనుఁ డాలమిచ్చి మై
నొవ్వగఁ బాతెఁ గ్రీడియును నూల్కొనిసైంధవు డాసెనీసునన్. 81

తే. అపుడు కృపుఁడు నశ్వత్థామ యల్ల సైంధ
వుఁడును బ్రొద్దు కొడుకును శల్యుఁడు మొదలగు
వన్నిరువు రొక్కపెట్టను బన్నివచ్చి

ఉ. అందఱు కన్నిరూపులయి యాతఁడు పోరఁగఁ జుట్టుముట్టి యా
సందునఁ గాలిమూఁకలును జాలఁగ బోరొనరించి రయ్యెడన్
మ్రందెడు నేనికల్ సమయుమావులుఁ గూలెడు కాలిబంటులున్
గుందెడి మేలిమానుసులుఁ గ్రుంగెడు తేరులు నయ్యె నెయ్యెడన్. 83

క. అదియెల్ల గని యుధిష్ఠిరుఁ,
డెదలోఁ దలఁకొంది యప్పుడే సాత్యకినిం
గదలఁగఁబంచెను గ్రీడికి,
నదనున సాయంబుచేయ నచటికి నెమ్మిన్. 84

తే. ఇంతలో యుధిష్ఠిరుఁ బోజనేగి ద్రోణు,
నొకటమార్కొనిచేప్పడియోడిపాఱె
నపుడలంబసుఁడామున నడరి తాఁకి,
మ్రందెనుఘటోత్కచునిచేతమఱియునచట. 85

సీ. సాత్యకి ద్రోణుని సరకు సేయక దాఁటి
జలసంధుఁడనువానిఁ జక్కడంచి
దారిని సాగిసుదర్శను బొలియించి
దుశ్శాసనునితోడఁ దొడరె రెండు
తడవలాతనినొంచి తడయక చనుదెంచి
వడిఁ గ్రీడియొద్దకు వచ్చి చేరె
నచ్చట ద్రోణుండు మచ్చరంబున క్షత్ర
వర్మలోనుగఁగలవారిఁద్రుంచె
నన్నపంపున భీముండునరుగుదెంచి,
ద్రోణునిమెఱుంగుటమ్ములఁ దూలఁ బుచ్చి
యడ్డపడువారినెల్లఁ గ్రొవ్వఱఁగఁజేసి,
కవ్వడిని జేరఁజనుచుండెఁగడిమిమెఱసి. 86

మ. చనుచున్ భీముఁడు త్రోవలో బలిమిమైఁ జక్కాడె శత్రుంజయుం
డును లోనౌ ధృతరాష్ట్రపుత్రులను నెంతో కిన్కఁ గర్ణుండు భీ
ము ననిన్ లోఁగొని తిండిపోతనుచు నేమో యుల్లసంబాడి పు
చ్చిన విప్వచ్చుఁడువచ్చి పోతర మడంచెం గర్ణవాలంబునన్. 87

ఇంద్రవజ్రము.

భూరిశ్రవుస్సాత్యకిని పోరిడయ్యెన్,
గోరంబుగాసాత్యకిఁగూల్చి నేలన్
దోరింపఁజేయెత్తుడు దొడ్డయమ్మున్,
సారించివివ్వచ్చుఁడు జానుమీఱన్. 88

తే. త్రుంచెభూరిశ్రవునిచేయి త్రుళ్ళిపడఁగ,
నంతఁగృష్ణునితమ్ముండునంతసమున
లేచి యడిదంబుఫూని చేసాఁచియతని,
తలనుదునుమాడె నెల్లరువలదనంగ. 89

తే. మరలఁగర్ణుండుసాత్యకిమాఱుకొంచు,
వేలుపులుమెచ్చునట్లుగఁ బెనఁగితడవు
పొలిచియాతని దాడికినిలువలేక,
పాఱిపోయెను బగవారు మీఱినవ్వ. 90

సీ. పదపడిసాత్యకి వడముడియును దోడ
నరుదేర నలుకమై నర్జునుండు
సైంధవుదెసకును జాఁగి వేగముపోవ
రారాజుపంపున రాధకొడుకు
కవ్వడికడ్డంబుగా వచ్చి పోరాడి
మొదలునోచ్చిన సిగ్గువిడిచిపాఱెఁ
గృపుఁడు నశ్వత్థామ వృషసేనుఁడును శల్యుఁ
డడరి పోరిరి క్రీడియాననంగ

వెన్నుఁడొనరించు చీఁకటి కన్నెఱింగి,
క్రీడి సైంధవు తలద్రుంచి కీడుతలఁగఁ
బాశుపదమున నద్దానిఁ బడఁగవైచెఁ,
దండ్రితొడమీఁద నంతనీ రెండవచ్చె. 91

ఉ. అప్పుడె కృష్ణుఁగూడి చని యర్జునుఁడన్నకు మ్రొక్కి సైంధవుం
డొప్పమిచేసి రూపఱుట యుబ్బునఁ జెప్పె నతండుపొంగఁ గాఁ
దప్పను ద్రోణుమీఁద విడితాధృతరాష్ట్రునిపట్టి యచ్చటం
జెప్పెడిదేమి రేయి యనిసేయఁగఁ బంచెను మేటిజోదులన్. 92

చ. ద్రుపదునివంకవారలను ద్రుంపక మైమఱు వృద్ధనంచు నే
నపసను ద్రోణుఁడుం బ్రతినవట్టె నటుండఁగఁ జంపె గాలినే
లువు కొమరుండు దుష్ప్రహుఁడు లోనగు నాధృతరాష్ట్రు బిడ్డలన్
గృపుఁడును గర్ణునిం బదరెఁ గిన్కను రజ్జులువల్కుచుండఁగాన్. 93

క. ఈలోనశ్వత్థామయు,
నాలములో రక్కసి దొర నంజనపర్వుం
గూలిచె నప్పుడె భీముఁడు,
వాలమ్ములు మేనగ్రుచ్చి బాహ్లికు ద్రుంచెన్. 94

తే. సాత్యకియుసోమదత్తుండుచలముమీఱ,
నొండొరులతోడఁబోరాడుచుండనందు
వెన్నుతమ్ముఁడుమిక్కిలి బీరమునను,
సోమదత్తునితలద్రుంచె సూడు మిగుల. 95

క. అదిగని యందలి ద్రోణుఁడు,
మొదలగువారలు కడంగి ముట్టుకొనంగా
నెదిరించి నిలిచి రిందున,
బొదువంగల జోదులెల్లఁ బొంగెడుమదితోన్. 96

తే. అపుడు కర్ణుఁడు సహదేవు నదిమిపట్టి,
వింటికోపునఁబొడుచుచు విడిచిపుచ్చె
నెక్కుడైనట్టి పగవారి నెపుడునీవు,
తలపడకుమంచుఁదులువ మాటలనుబలికి. 97

సీ. కర్ణునివలె చెడుకఱపుల సాత్యకి
నొంపఁగ దుర్యోధనుండు దలఁచి
పలువురనొక్కటఁ బయిఁబడఁగాఁ బంచెఁ
జేరి మున్నభిమన్యుఁజేసినట్ల
మఱి ఘటోత్కచుఁడప్డు మగఁటిమి నెదిరించి
చంపె నలంబుసు జటునికొడుకు
నంత హలాయుధుఁ డడరి వేఁడిమి చూప
వానినిఁ బొలియించి నాఁడిచూపి
యాహిడింబకొమరుఁ డందఱఁ గలపంగఁ,
గర్ణుఁ డపుడు వాసిగండడంచె
వేల్పుఱేఁడు తనకు వెలయ నిచ్చినయట్టి,
సత్తిచేత నెడఁదజలదరింప. 98

చ. విరటుఁడు వచ్చి తాఁకినను వీసరపోని కడంక ద్రోణుఁడె
ల్లరుఁ గన నాతనిం దునిమి లావునఁ బైఁబడు కాలిమూఁకలన్
బోరిగొనుచొక్కచో ద్రుపదుఁ బోరనపూపడఁగించె నంతటన్
విరియఁగఁ దామరల్ సరిగ వేఁడివెలుంగునుదోఁచెఁ దూర్పునన్. 99

వ. అప్పుడు. 100

సీ. వచ్చి యుధిష్ఠిరు వంకవారెల్లను
దపుఁదాఁక ద్రోణుండు తాల్మిచెడక
యందఱ నోసేయ నర్జునుఁ డరుదెంచి
చేవమైఁ బోరె జేజేలు మెచ్చ

నప్పుడశ్వత్థామ యనుగారు చచ్చుట
నెపముగా భీముండు నేర్పుమెఱయ
ద్రోణునికడకేగి ద్రోరె నశ్వత్థామ
యని చెప్పి విన(డయ్యె నతనిపలుకు
లంత( జెప్పె యుధిష్ఠిరు( డళుకు దక్కి,
పోర నిప్పుడశ్వత్థామ పొలిసెననుచు
నమ్మి ద్రోణుండు తేరిపై సొమ్మసిల్లి,
విల్లునమ్ములు( గ్రిందను విడిచిపడియె. 101

క. వీను(గువలె( బడి యుండిన
వానిందలద్రుంచి వైచె వాలుననలుకన్
మానక ధృష్టద్యుమ్నుడు
తానే యాతనినిజంప( దగువాడనుచున్. 102

సీ. ఎవరు చెప్పిన విన కేచి ధృష్టద్యుమ్ను(
డటుతండ్రి( బఱచుట యాలకించి
కినుక నశ్వత్థామ చనుదెంచి యాకూళ
నిప్పుడె కని పొలియింతు ననుచు(
బలుకుచు దళముల పై దూపు లడరించి
నారాయణంబను పేరుగలుగు
గోరంపుటమ్మును గొబ్బున విడిచిన(
బలు(పుర నది నేలపాలుచేసె
దాని వేడిమి కెవ్వరు( దాళలేక,
కల(తనొందంగ వెన్నుండు కనికరమున
పడమడిని దేరుడిగ(బంచి యుడిపెదాని,
వాడియంతయు(దననేర్పువ న్నెకెక్క. 103

క. అమ్ములు మఱియుం బఱపుచు
దమ్మయి యవియెల్లఁ బోవ వగఁగూరినడెం
దమ్మున నశ్వత్థామయుఁ
గ్రమ్మఱెఁ జేయునది లేక గరువంబడఁగన్. 104

ఆ. అంతఁ బ్రొద్దుగ్రుంక నాలంబు చాలించి
యులరిగొంతికొడుకు లరిగి రిండ్ల
కలుక ద్రోణుచావుఁ దలఁచి దుర్యోధనుఁ
డడలు చిల్లునేరెనపుడ వెడలి. 105

క. అమ్మఱునటినాఁడొక్కటఁ
దమ్ములయు దొరలయు నెదుటదళవాయినిగా
నమ్మిన కర్ణుని నొనరిచి
క్రమ్మఱ దుర్యోధనుండు కలనికి వెడలెన్. 106

క. పదియాఱవనాఁ డటువలెఁ
బొదలుచు నిరువాఁగుఁ దాఁకి పోరాడంగా
నదమదముచేసె వడముడి
యదనారసి క్షేమధూర్తి యను నెకిమీనిన్. 107

క. వడముడి యశ్వత్థామయుఁ
దడవు పెనఁగి సొమ్మసిలిరి తగ నిరువురు న
ప్పుడ కర్ణుడును నకులునిఁ
గడఁక యుడిపి తేరు చదిపి కాలుబ్రపేలెన్. 108

తే. దుస్ససేనుండు సహదేవుతోడఁ బెనఁగి
సొమ్మవోయెనుదనవారలుమ్మలింపఁ
గృపునిఁ దాఁకి ధృష్టద్యుమ్నుఁడపుడుపోరి
యోడిపాఱెనునవ్వంగఁదోడివారు. 109

ఆ. తొడరి జమునికొడుకు దుర్యోధనుఁడుఁ దాఁకి
పెద్దతడవుకడిమిఁ బెనఁగనందుఁ
దేరుగోలుపోయి రారాజు మైనొవ్వ
నొల్లఁబోయెఁ జెలులయుల్ల మెరియ. 110

ఉ. కవ్వడి కర్ణునిం దొడరి గాటముగా బడలించి తూపులన్
దవ్వఁగఁ జొప్పె నాతనినిఁ దక్కినజోదులు నడ్డుసొచ్చి పెం
గ్రొవ్వడఁగించె వారి నెలగోలున నంతటఁ బ్రొద్దుగ్రుంకుటన్
జివ్వను మాని మానుగను జేరిరి యిర్వురు పీడుపట్టులన్. 111

క. మఱునాఁటిపోర శల్యుని
మఱిమఱిబలిమాలి కడకు మైకొన నతనిన్
గఱువయగు కర్ణునరదము
నెఱిఁ దోలఁగఁ బంచి తేఁడు నేరుపుతోడన్. 112

సీ. నొగలెక్కి శల్యుండు తగఁ గర్ణుఁ బేర్కొని
మది కలంగఁగ బీసమాటలాడి
కాకిమీఁదను బెట్టి కాఱు లాతనిఁ బల్కి
కతలు పెక్కులు చెప్పి కడఁకఁ జెఱిచె
నంతటఁ గర్ణుండు కొంతతాలిమి దాల్చి
పొంత యుధిష్ఠిరుఁ బొంగడంచి
ద్రుపదునికొడుకులఁ దొడరి పెక్కండ్రను
వాలమ్ములడరించి నేలఁగలిపెఁ
జొచ్చి భీముఁడు కర్ణుండు చూచుచుండ
వానికొడుకును నలసత్యసేనుఁ దాఁకి
దొడ్డ నారసమునఁ దలఁదునిమి పైఁ చెఁ
బగఱమూఁకలు గుండియల్ పగిలిపఱవ. 113

క. దురమునఁ గర్ణుండు యుధి
ష్ఠిరు నొప్పించి వెఱ గందుచెడి పాఱెడు నా
ద్దొరను వెనుదవిలి పెక్కులు
పరుసంబులు వలికి సిగ్గుపాటొనరించెన్. 114

సీ. అన్న బన్నము చూచి యలుకమైభీముండు
కర్ణుని మార్కొని కడఁకచూపి
క్రొవ్వాఁడితూపెద గుఱిచేసి యేసిన
నరచచ్చి తేరిపై నతఁడు వడియె
నప్పుడు వడముడి యతనిమీఁదికిదాఁటి
నాలుకకోయంగ వాలు వెఱికి
తగవు గాదనిచెప్పి తనమామ శల్యుఁడు
మరలింప నాపని మానివచ్చె
మఱియు దుర్యోధనునితమ్ము లఱువులడర
వచ్చి శ్రుతవర్మ మొదలైనవారుతన్ను
నొక్కపెట్టన తాఁకిన నుక్కుమీఱ
వారినందఱ జమునిల్లుసేరఁబనిచె. 115

స్రగ్విణి. వీఁకసంశప్తకుల్వేనవేల్కవ్వడిన్
దాఁకవాల్దూపులాతండు మైనించుచున్
మూఁకలంజావఁగామోదెదొండంబులం
దేఁకువల్వోడిమొందేనియుఁబాఱఁగన్. 116

తే. కృపుఁడుచంపె సుకేతుని ద్రుపదుకొడుకు
నతనిమూఁకలు మ్రాన్పడి వెతపడంగఁ
దివిరి దుర్యోధనునిఁ దాఁకి తేరు చదిపి
మురియడంచె ధృష్టద్యుమ్నుఁ డురువడించి. 117

ఆ. క్రీడిమీఁదఁ గవిసి కినుక నశ్వత్థామ
పెనఁగెఁగొంతసేపు బెట్టిదముగ
నేచి క్రీడితునిమె నేనుంగుతోఁ గూడ
నపుడు దండధారుఁడనెడు జేని. 118

సీ. మలయధ్వజుండన నలరారు నెకిమీఁడు
బలిమి నశ్వత్థామ పయిని గవిసి
వేల్పులు పొగడెడు విత్తమునఁ బోరాడి
రూపుమాసె నతని తూపుగములఁ
గర్ణుండు క్రుపకుని గట్టిమొనలముట్టి
తల్లడిల్లగఁ జేసి నెల్లవారి
దుర్యోధనుఁడు భీముతోడను ననిఁజేసి
వెన్నిచ్చి పాఱెను వెఱపు గదిరి
క్రీడి సంశప్తకుల నోర్చి కెలసియార్చి
యెదురుకొన్నయశ్వత్థామ యేపుమాపి
వచ్చుచుయుధిష్ఠిరుఁడు చాలబన్నమొంది
కవలఁ గొనియింటికేగినకతనువినియె. 119

క. విని కర్ణుని పూరొర్కానఁగాఁ
జనకమెప్రక్కకుఁ దొలంగిచని వెన్నునితో
మనికికిఁ బోయెను మిగులఁగ
ననినొచ్చిన యన్నసేమ మారయుకొఱకున్. 120

వ. అయ్యుధిష్ఠిరుండును. 121

క. వచ్చినవారిం గనుఁగొని
చచ్చెనుగా కర్ణుఁడంచు సంతోసముతో
ముచ్చటపడి యడిగినవి
వ్వచ్చుఁడు కలరూపు చెప్పె వనట పెరుఁగఁగా. 122

ఆ. దాన నోడలుమండి తమ్ముఁడంచును జూడ
కాఁదరానిమాటలాడెవతనిఁ
గవ్వడియును నలిగి కరవాలు ఝళిపించెఁ
బట్టి తలనుగోయువాఁడనంచు. 123

వ. అప్పుడు. 124

ఉ. వెన్నుఁడు వారినిద్దఱను వేఁడిమివోవఁగ బుజ్జగించిలో
నున్న కడిందికిన్కనొక యొప్పున మానిచి క్రీడి నప్పుడే
యన్నకు మ్రొక్కఁబంచి తనయండలి తప్పును సైఁప వేఁడుమం
చన్నను దెల్పి తెచ్చుకొని యన్నను గవ్వడి వేఁడెనెంతయున్. 125

తే. అతని వేఁడికోలున నల్ల మపుడెకరఁగి
చెలఁగి తమ్మునిఁ గౌఁగిటఁజేర్చియెత్తి
యాలమున గెల్వదీవించి యరుగఁబంచెఁ
గర్ణుమీఁదికి జముపట్టి కత్తినపుడ. 126

క. ఈనడుమున భీముండును
మానుగఁ బోరాడియాడి మామను శకునిన్
బీనుఁగువలెఁ బడనేసెను
మేనెఱుఁగక తేరిమీఁద మించినకడిమిన్. 127

సీ. వడముడి లోనగువారలత్తోఁ బోరు
కర్ణునిఁ గవ్వడి కదియ వచ్చి
భీమునకును నన్నసేమ మెఱింగించి
గాంధారికొడుకులఁ గడఁగి తాఁకి
పదువుర నొగి నేలపాలుగఁ గావించి
వృషసేనుమీఁదికి వేగ వెడలి
తండ్రి కర్ణుఁడు చూడఁ దలఁద్రుంచి యాతనిఁ
బట్టపగటిప్రొద్దువలె వెలింగె

దుస్ససేనుని భీముండు తొడరితాఁకి
నేలఁ బడవైచి ఱొమ్మునఁగాలుమోపి
పయిని గూరుండి పొట్టను వ్రచ్చికినుక
నెత్రు ద్రావెను నెల్లరునిలిచిచూడ.

తే. అంత దుర్యోధనునిచెంత కరుగుదెంచి 128
హితవు గఱపె నశ్వత్థామ యెఱుక మెఱయఁ
గర్ణుఁడర్జునుఁ బరిమార్పఁ గలఁడటంచు
వెఱ్ఱియని తెల్పియుఁ కేఁబొందు వేఁడుమనుచు. 129

క. దానికి నాతం డీకొన
కొనని యా మంచిమాట లాలింపక బల్
పూనికఁ బరిఁ బురికొల్పెను
మానక మార్తురదడంబుమాఱుకొనంగన్. 130

మహాస్రగ్ధర.

ఒగి విర్వచ్ఛందుఁ గర్ణుం డొకరినొకరి తామోర్వి మించంగనానం
దగఁబోరాటంబు సల్పం దఱుఁగని బలిమిం దద్దయున్మేలుచేయై
పగవాని న్గ్నెంచిచాలం బడలుపఱచి క్రొవ్వాఁడితూపుల్మెఱుంగుల్
నిగుడంగా మేన నెల్లన్నెఱఁకులు దవులన్నేర్పుతోఁ గ్రీడినాటెన్.

క. అది గని దుర్యోధనుఁడవు
డెదిరింపఁగఁ జేయివీచె నెల్లరఁ గ్రీడిన్
సదమదము చేసెఁ బలువుర
నెదిరింపఁగఁ జన్నవారి నీసున నతఁడున్. 132

తే. వేలుపులతేఁడు తనకియ్య వెలయుదానిఁ
బెక్కునాళులనుండియుమిక్కిలిగను
గొలుచుచుండెడుదానిఁ బెంజిలువతూపు
నర్జునునిమీఁద నాకర్ణుఁడలుకనేసె. 133

తే. చెడియె నది శల్యుమోసంబుచేత నవలఁ
గృష్ణునేర్పుచేతను నొక్కకీడు గ్రీడి
కొదవకుండంగ నేమంకు నదియుఁ గ్రీడి
బొమిడికంబునుగూలిచెఁ బుడమిమీఁద. 134

ఆ. అంతఁ దనివినక యప్పాఁపతూపును
నేలనుండిలేచి నిగిడి మగుడఁ
గ్రీడివంక మరల గీటడఁచెను దాని
నెన్నుఁ డనుషఁ గ్రీడి వెరపుమీఱ. 135

క. అమ్మాడ్కిఁ బాఁపఱమ్మది
వమ్మయి చనఁ గర్ణుఁడెదను వనటనుబొందెన్
బిమ్మటఁ గవ్వడి యాతని
నమ్ములసోనలను ముంచి యళుకొందించెన్. 136

మ. ఒడలెల్లం గడునెత్తురుల్ దొరుగఁగా నుక్కెక్కి పోరాడుచోఁ
బుడమిం గ్రుంగెను దేరుదానిఁబయికిం బొల్పొందఁగా నెత్తుచోఁ
గడిమిం గర్ణుని కత్తుకందునిమెఁ గిన్కం గ్రీడి వాల్దూపులన్
గడఁక న్వెన్నుఁడు పంపఁ బాడిఁ దలఁపంగా లేక పెంపేదఁగన్. 137

ఆ. కొడుకుచావుఁ జూచి వెడలిపోయెనో నాఁగఁ
బ్రొద్దుజాఱెనంతఁ బొంగిమదిని
పాండుకొమరు లెల్ల నిండుల కేగిరి
వనట మొదల నెదుటివారు చనఁగ. 138

క. మలుచటినాఁడలశల్యుని
దళవాయినిగాఁగఁ జేసి దండులతోడన్
వెలువడి దుర్యోధనుఁడటఁ
బొలికలనికి నడచెఁ గడఁక పొలుపొందఁగన్. 139

క. ఆరేయి కృపుఁడు హితవుగ
రారాజును జేరిఁ జెప్పి రహి నిపుడైనన్
జేరి యుధిష్ఠిరు పొందును
గోరు మను చతఁ డతని పలుకులు వినఁడయ్యెన్. 140

సీ. శల్యుండు తేరెక్కి చనుదెంచి బీరంబు
గూపుదాల్చినమాడ్కి నేపుచూపి
యేనుంగులను నల్లబీనుంగులను జేసి
వారువంబుల నేలపాలొనర్చి
యరదంబులను గరం బఱవఱ లొనరించి
కాలిబంటుల జముప్రోలికంచి
పెక్కుతెఱంగుల నుక్కుచూపుచునుండ
వడముడి వడివడి వచ్చి తాఁకి
గుదియ చేకొని పెద్దయు నుదుటుమీఱఁ
బోరి యాతని క్రేళ్ళుడిఁ దేరిమీఁద
నొఱగఁజేసినఁ గృపుఁడప్పు డొద్దనుండి
తనదు తేరిపై నిడుకొని చనియెనతని. 141

తే. కర్ణుకొడుకుల మువ్వుర గండడంచె
నకులుఁ డప్పుడు కుతుకల్ నఱికివైచి
సురథుఁడనువాని మార్కొని సొంపుచెఱిచి
తలనుదునిమె నశ్వత్థామ మలికిగముల. 142

ఉ. ఆవల శల్యునిం గవిసి యార్చి యుధిష్ఠిరుఁ జేపుచూపియుం
జేవచెడం బడల్పడియుఁ జెచ్చెరఁ దేరున సోలి యంతలో
నే వడిఁ దెల్వి నొంది తనయేటును బోటును జూపి శల్యునిన్
మావులఁ జంపి తేరు నుఱుమాడి కలంచెను వాఁడితూపులన్. 143

క. కని యపు డశ్వత్థామయుఁ
దనతేరున శల్యునిచి దవ్వగఁ గొనిపో
యెను మఱియొక యరదంబును
గొనిశల్యుఁడు మరలివచ్చి ఘోరముగాఁగన్. 144

క. కయ్యంబొనరిచి క్రీడిని
డయ్యంగాఁజేసి భీము డాసి కలంచెన్
జయ్యన యుధిష్ఠిరుఁ డదరి
వెయ్యేటికి సత్తిచేత వెసఁదలఁద్రుంచెన్. 145

తే. శల్యుఁ డీల్గిన నవ్వగ జాలఁగనలి
చుట్టు ముట్టిరి యాదిట్ట చుట్ట లెల్ల
వడముడియుఁ గ్రీడి సాత్యకి యడరి వారి
రూపుమాపిరి రారాజు రోసిచూడ. 146

ఆ. దుర్విషహుండు మొదలు దుర్యోధనుని తమ్ము
లను గడంకఁదాఁకి లావుమెఱయ
నొక్కఁడైన మిగులకుండంగ నందఱ
భీముఁ డపుడు వెదకి పిలుకుమార్చె. 147

క. శకునికొమారు నులూకుని
యొకపోటము లేక చంపె నొనలు దలంకన్
జికిలి మెఱుఁగు నారసమున
నొకయేటునను సహదేవుఁ డుముగని కడిమిన్. 148

ఆ. కొడుకుపడిన శకుని మిడుకుచు నడతెంచి
వారువములదండు బలసిరాఁగ
నకులుఁ బొదివి వాఁడినారసమ్ములు గ్రుచ్చి
తండకుఁ దాన పెద్దనిద్దురవోయె. 149

సీ. భీష్ముఁడు లోనైన పేరెన్నికను గన్న
మగఁటిమి గలవారు మ్రందుటయును
గర్ణుఁడు మొదలుగాఁగలుగు సంగడికాండ్రు
పేరులేకుండంగ బిద్దుటయును
దుస్ససేనుఁడు మొదల్ తోడునీడగనుండు
తమ్ములందఱుఁ జోరవమ్మగుటయు
శల్యుఁడు మున్నుగా సాయంబుచూపిన
దొరలెల్లనుసుఱులు తొఱఁగుటయును
జూచిదుర్యోధనుఁడు వెఱసొచ్చి నొచ్చి
బడలిద్వైపాయనంబను మడుఁగుచొచ్చి
యెవ్వరు నెఱుంగకుండంగ నేకతంబ
నీరిలో డాఁగియుండెను నిలువరముగ. 150

క. అప్పుడు పాండునికొడుకులు
తప్పక పగవారినెల్లఁ దలలుదఱిగి తా
మెప్పట్టున దొరఁ గావక
యప్పుడ వెదకంగఁ జొచ్చిరందును నిందున్. 151

తే. ఒకటఁ గృపుఁడు నశ్వత్థామయుఁ గృతవర్మ
తప్పిచనిజేఁడు మడువులో దాగియుంట
యెఱిఁగి మువ్వురు నచ్చోటి కేగి తమ్ముఁ
దెలిపికొని మాటలాడిరి తెలివిదప్పి. 152

క. వడముడికిని నంజుడు దె
చ్చెడు మెగముల వేటకాఱు చెచ్చెర దానిం
బొడగని వచ్చి యుధిష్ఠిరు
కడఁ జెప్పిరి తామువిన్న కన్నవియెల్లన్. 153

సీ. తమ్ములుఁ గృష్ణుండుఁ దక్కటిదొరలును
దెగి వెంటరాఁగ యుధిష్ఠిరుండు
మడుపుకడకు వచ్చి మఱిమఱి యెమ్మెలు
చిల్లులువోవంగఁ బ్రెల్లుగాను
రోఁతమాటలు వల్క రోసంబు మదిఁబుట్టి
దుర్యోధనుఁడు తాను దోడులేక
యొంటరియై యుంటయును వారు పలువుర
త్రోడ్పాటుననుబల్మితోడరియుంట
చెప్పియొక్కఁడొక్కఁడెతన్నుఁజేరిపోర
నందఱనురూపుమాపెదనంచుఁబలుకఁ
దగినతేరునువాలును మొగి నొసంగి
యొక్కనినెపోరుసలుపంగనిక్కవముగ. 154

క. పనిచెద ననుచు యుధిష్ఠిరుఁ
డనఁగా నమ్మాటబలిమి నందఱు చూడం
గను మడుపు వెడలివచ్చెను
దనచేతను గుదియ యొప్పఁ దగ రారాజున్. 155

క. అప్పుడు వెన్నుఁడు భీముని
నొప్పఁగఁ బురికొల్పఁ బోరి కొగి బలరాముం
డప్పుడవచ్చి పెనంగెడి
చొప్పును నిర్వ్వరచలంబుఁ జూడఁగ నిలిచెన్. 156

తే. అప్పుడెల్లరు మడుపును నల్ల విడిచి
పాలికలని కేగుదెంచిరి పోలుపుమీఱ
గుదియలను గేల నంకించి యుఱుటుపొదల
గాడ్పుపట్టియు రారాజు గదిసిరంత. 157

చ. వెనుకకుఁ బోవుచు న్మగుడ పీఁకమెయిం బఱతెంచి తాఁకుచుం
గనుఁగవ నిప్పుకల్ సెదరఁ గన్గొనుచుం గుదెలొక్క పెట్టునన్
గసలునఁ ద్రిప్పి యొండొరులఁ గండలురాలఁగఁ గొట్టుచున్ జలం
బున నడగొండలట్ల కడుఁబోరిరి నెత్తుటఁ దొప్పఁదోఁగియున్. 158

వ. ఇట్లిమ్మొఱటిమగలు మిగులఁ దెగువ మెయిం బెనంగుచు గుదియలు ఘూనిమేనులుసించుచు నొంచుచు నొండొరుల మించుచు నాయంబులు పగిలి గాయంబులనుండి పెల్లుగం దొరుంగు క్రొన్నెత్తురుల వెల్లువలు కొండలనుండి వెలువడిన సెలయేళ్ల మొత్తమ్ములఁ బురుడింప నొండొరువులకు వట్రపడక కడిమి చూపుచుండ దుర్యోధనుండు తన నేరిమి పేరిమిని వడముడి బెడిదంపు గుదియపెల్లం దప్పించుకొనుచుననుచు వేడుకత్తోడఁ దన ప్రోడతనంబు చూపఁ గడంగిన నెఱింగి కఱివేలుపుపంపునం గవ్వడి వడముడికి సైఁగజేసిన నాసన్న కన్నెఱిఁగినవాఁడై యాతండు కయ్యంపుఁబాడిఁ దొఱంగి. 159

క. బెడిదంబగు గుదెపెట్టునఁ
దొడలు విఱుగఁ గొట్టెక్రిందదొడిఁబఁడబుడమిం
బడియుండిన దుర్యోధనుఁ
గడఁకందలదన్ని నెడమకాలనలుకతోఁ. 160

ఆ. అట్లు పాడి విడిచి యాతనిఁ దన్నుట
చూచి యలుకవొడమిచూడ్కులందు
నిప్పులురుల లేచి యప్పుడ బలరాముఁ
డడరి భీముఁ జంపఁగడఁగుటయును. 161

క. వెన్నుం డడ్డముగాఁ జని
యన్నను మరలించి తెచ్చి యాతనికినుకం
దిన్ననిమాటల మానిచి
మున్నత్తో నన్ననంచె మనికిం జేరన్ 162

క. తొడలు విఱిగి నేలఁ బడియుండి రారాజు
నోరి దురద దీఱఁ జీరి కృష్ణు
నెల్ల వారువినఁగఁ బెల్లుగఁ బెక్కులు
కానిమాట లాడె మేనువడఁక. 163

క. అంతటను వీడుపట్లకు
గొంతికొమాళ్లెల్లఁ గృష్ణుఁ గొని చని రెలమిన్
గంతునవెన్నుఁడుకరిపురి
కెంతయుగాంధారినూఱడింపఁగఁ జనియెన్. 164

క. చని పనిదీఱిచిక్రమ్మఱఁ
జనుదెంచినఁ గృష్ణుఁడపుడ జముపట్టిని నా
తనితమ్ముల సాత్యకినిం
గొని మోఘవతియను నేటికుఱఁగటి కరిగెన్. 165

సీ. కృపుఁడు నశ్వత్థామ కృతవర్మయునుగూడి
పడియున్న యొడయనిపాలికరిగి
కన్నీరు మున్నీరుగా మీఁదఁబడి యేడ్చి
యెలుఁగులు రాల్పడ నెట్టకేల
కాతని నూరార్చి రందు నశ్వత్థామ
యెకిమీఁనిఁగనుఁగొని యిట్టులనియె
నీరేయి యేనేగి యెల్లినఁ బాండుని
కొడుకులఁ జుట్టాలమడియఁజూచి
తలలు గొనివచ్చి యేలిక దగ్గఱకును
దెచ్చి చూపెద నాతండ్రిఁదెఱఁగుమాలి
తలను గోసిన తులువను దప్పకుండఁ
జంపువాఁడధృష్టద్యుమ్ను జంపుమాని. 166

క. అని వీడ్కొని చని తెరువునఁ
జనువునఁ గృపుఁ డట్లుచేయఁ జనదని చెప్పన్
వినకొక్కఁడుఁ దగువెరవును
దనలోఁ దలపోయుచుండెఁ దఱిమ్రానికడన్. 167

ఆ. అపుడు గూబయొకటి యచ్చటి కరుదెంచి
యాదమఱచి చెట్టుమీఁదఁ గూర్కి
యున్నకాకిగములనొక్కటఁ బొలియించె
మెడలుగొఱికి గోళ్ళనొడలు పెఱికి. 168

క. అదియంతయుఁ గన్నులఁ గని
యిదియేతగువెర వటంచు నెంచియుడిదముం
గుదురుగఁ గేలం దాలిచి
కదలెను నడిరేయి తనదు కర్జము నడుపన్. 169

చ. చని కృతవర్మనుం గృపునిఁ జక్కఁగ గుమ్మములందుఁ బెట్టి తాఁ
గనికరమేది కైదువయుఁ గ్రాల గుడారము దూఱి లోపలన్
బెనుపఱి మేనులన్మఱచి నిద్దురఁ జెందెడునట్టి జోదులం
గనుఁగొని యద్ది కానిపనిగా మది నెంచక యీసుపెంపునన్. 170

తే. తొడరి నిదురించువారి నొంతుకలుకోయఁ
దొడఁగె బాపఁడయ్యును బచ్చి తురకవోలె
నవ్వు డల్ల యశ్వత్థామ యలుక యొకటె
పెద్దగాఁ జూచుకొనిపాడి పేరుమఱచి. 171

క. మొదలనె దృష్టద్యుమ్నునిఁ
దుదముట్టించుటయు కాక త్రోరపుఁ ద్రాటన్
బ్రదికినపుడె మెడఁగోసెను
నెదమీఁదను గూరుచుండి యేమఱి కూర్కన్. 172

సీ. అశ్వత్థామ వెల్వడి యుత్తమౌజునిఁ బట్టి
రొక్కట్రేటునవానియసుఊగొనియె
గాలిబంట్లను హాత్రిగముల మావులఁ ద్రుంచి
మడువులు గట్టించె నొడలి నల్లఁ
గడచి యచ్చోటును గని శిఖండిని దాఁకి
ద్రౌపది బిడ్డలతోడ నతనిఁ
బొదివి గీటడఁగించి పిదప నేపుగఁజంపె
ద్రౌపదికొడుకులఁ దూపుగముల
నంతఁ బగవారిపరి జముచెంతకరిగి
వీఁడు సద్దడఁగుటఁ జాల వేడ్క నొంది
కదలి మామను గృతవర్మఁగలసికొంచు
నరిగెఁ గూడియశ్వత్థామదొరనుజూడ. 173

క. కస కుట్టూపిరిత్రోడను
గనులం దేలగిలవైచి కాటియఁబడు నా
తని చెవులవేసె నంతయు
వనల్లెనుబాసి మేనువదలెను తేఁకున్. 174

సీ. మఱునాఁడు వేకువమానిసియొక్కండు
రోజుఁచుఁ బఱతెంచి బొమ్మువోఁది
కొనుచు యుధిష్ఠిరుఁ గని కాళ్ళపయిఁ వ్రాలి
యేడ్చుచు నడురేయి నిల్లుచొచ్చి
యొకఁడు నశ్వత్థామ యోర్చి దృష్టద్యుమ్నుఁ
దమ్ములఁబరమార్చియుమ్మలింప
ద్రౌపదికొడుకుల నేపురఁ బొలియించి
తక్కటివారలతలలుద్రుంచి

పోయెనని కన్నులను నీరుపొరలఁజెప్ప
సొలసి యాతఁడుడెందంబుగలఁగివ్రాల
గ్రేవనున్నట్టివారలు లేవ నెత్తి
యూఱడింపఁగఁదేఱి నిట్టూర్పువిడిచి. 175

క. తనతోఁ గ్రీడిని వెన్నునిఁ
గొని యశ్వత్థామునడఁప గోరి వెడలఁగా
విని యాతఁ డోడల జూడిద
ననువునఁ జూసికొని తపసియ ట్లయ్యె వెఱన్. 176

ఆ. వారలతనిఁ గదియవచ్చిన భీతుని| బ్రహ్మశిరము నాఁగఁ బరఁగుతూపు
విడిచిపెట్టనదియెవిశ్వచ్చుఁడును నేసె| నొకటినొకటిరెండునొనరఁదాఁకి.

క. మింటి కెగసి రెండును బెను
మంటలు వెడలంగఁ బేర్చినుఱిమఱిజగముల్
వెంటనె కాల్పఁగఁ జొచ్చిన
దంటయగుచువ్యాసుఁడుడిపెఁదగనా నెగులున్. 178

క. వ్యాసునిపంపున నిరువురు,
నీసులు విడనాడి తూపు లెవరివి వారా
వ్యాసుని యెదురనె యుడిపిరి,
రోసమునం ద్రుపదుకూఁతురున్ వడముడితోన్. 179

క. అలఁతం గొడుకులకొఱకుం,
బలవించుచు ద్రోణుకొడుకుఁ బరిమార్చి మదిం
గలయుమ్మలికము వాపఁగఁ,
బలుదెఱఁగుల వేఁడ నతఁడు పరుగునఁ జనియెన్. 180

క. మఱియాయశ్వత్థామయె,
పఱపిన యామేటితూపు పడఁతుల కడుపుల్

పఱియలుగఁ జేయఁజొచ్చినఁ,
గఱివేల్పుత్తరకడుపును గాచెం బెరిమన్. 181

క. నిసువులు నిద్దురవోవఁగ,
నుసుఱులు గొన్నట్టి కూళ నోడించి తలన్
బసలీను మానికముఁగొని,
యొసఁగిరి భీముఁడును గ్రీడి యొగి ద్రోవదికిన్. 182

తే. దానఁద్రోవది యెంతయుఁ దనివిసనియె
నట్లు తలదాల్చు మానికమదియుఁ బోవఁ
బెంపుదఱిఁగి యశ్వత్థామజంపు మాని
యపుడె కానలపాలయ్యెఁ దపసియగుచు. 183

వ. అనినవిని యవ్వాలి కత నెఱింగింపు మనుటయు. 184

క. ఎన్నికయిడ రాకుండఁగ
నన్నియె జగములను జేసి యెంతో నెనరుతో
నన్నింటిని గాపాడుచు
నెన్నండున మఱపులేక యేలెడుదంటా. 185

మణిగణనికరము.

తలఁచుట వలననె తగఁ బలుజగముల్
గలుగఁగ నొనరుచు కడిందియొడయఁడా
మెల పునఁ గొలఁదికి మిగులు జగములన్
నెలవుకొనబయలనిలుపు బలియుఁడా. 186

గద్య. ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్రనిరోష్ఠ్య
నిర్వచన నైషధ కావ్యరచనా చాతురీధురంధర సద్యశోబంధుర
కందుకూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యా
మాత్యపుత్ర సకల సుజనవిధేయ వీరేశలింగనామధేయ ప్రణీతం
బైన యచ్చతెనుఁగు. భారతమునందు ద్వితీయాశ్వాసము.

# తృ తీ యా శ్వా స ము

క. తలఁపులచేతను మఱియుం
బలుకులచే నందరానివాఁడ వయి జగ
మ్ముల నెల్లెడ లోపలను
న్వెలుపలను న్నిండియుండి వెలిఁగెదు వేల్పా. 1

వ. శౌనకుండు మొదలుగాఁగల తపసుల కాసూతుం డవ్వలికత నిట్లు
చెప్పందొడంగె. 2

సీ. కొడుకులు చుట్టముల్ పుడమియేలికలును
ప్రెగడలు మొదలుగాఁ బేరుగలుగు
వారెల్లఁగూలిన వగఁగూరి ధృతరాష్ట్రుఁ
డసలుచు సెజ్జపైఁ బడికరంబు
సొమ్మవోయియు లేచి జొటజొటఁ గన్నీరు
వఱదలుగట్టంగ వనరుచుండ
విదురుఁడు వ్యాసుండు వెనుక సంజయుఁడును
నెంజిలి దీఱిచి నెమ్మదిగను
బొలికలనిఁజూడరమ్మని పలుకుటయును
గొంతియును నాలుఁగొడంద్రుఁ గూడిరాఁగ
వచ్చెనంత యుధిష్ఠిరుఁ డచ్చెరువుగఁ
దమ్ములను దోడుకొని పెదతండ్రిఁ గదిసె. 3

ఆ. కదిసి తండ్రికెఱఁగి గాంధారికిని మ్రొక్కి
తక్కఁగలుగువారిఁదగఁగఁగాంచి
తియ్యమాటలాడి నెయ్యంబుఁ గడుఁజూపి
కట్టియున్న వారి కనలు మాన్పె. 4

తే. ఆఁపుకొన్నను నాఁగక యంతకంత
కడరి మదిఁ బొంగి పొరలెడునలుక కతన
జముని పట్టినిడిట్టంగఁ జలముపూని
నట్టిగాంధారి నోదార్చె వ్యాసుఁడపుడు. 5

క. వడముడియును గాంధారికిఁ
గడుఁదీపులు పుట్టునట్టుగా మఱుమాటల్
నొడివి యడంకువ నాయమ
యెడఁదం గలయట్టి కినుక నెల్లను నుడిపెన్. 6

ఉ. అత్తఱి నామెయానతిని నన్నయుఁ దమ్ములు ద్రోవదింగడుం
బత్తిని వెంటఁబెట్టుకొని పాండుకొమారులు తల్లి పాలికిం
గుత్తుకబంటి నెవ్వగలఁ గూరి చనంగఁ గొమాళ్ళ నెల్లఁ దా
నెత్తికవుంగిలించుకొని యేడ్చె నొకించుకసేపు గొంతియున్. 7

క. అటుపిమ్మట నడుగులఁబడి
పొటపొటఁ గన్నీరుజాఱి బుగ్గలుతడియన్
గటకటఁబడు కోడలి మి
క్కుటముగ నూరార్చి దయ నాపె కుందుడిగించెన్. 8

సీ. అంతవారందఱు నడలెల్ల విడనాడి
సరగ నెయ్యంపు ముచ్చటలు నెఱపి
చుట్టపక్కంబులు చుట్టును నడ జేర
వెసలి యందఱు నొక్క పెట్టగాఁగ
ధృతరాష్ట్రు కడఁజేరి తెఱవలు నెయ్యురు
బంటులు వెను వెంటనంటి రాఁగ
నెల్లవారును గూడి యల్లన నాలంపు
నేలకు నడిచిరి చాలఁ దాల్మి

నెదురఁ బీనుంగులయియున్న యేనుఁగులను
తఱుచు తప్పించుకొనుచును తఱినిగాలి
తిట్టలయియున్న వార్వంపు టట్టగములఁ
ద్రోచికొంచును జని రందుఁ ద్రోవఁగనక. 9

క. అప్పుడు గాంధారి యనిం
గుప్పలుగాఁ గూలిపడిన కొడుకులు మొదలౌ
గొప్పవలంతులఁ గనుఁగొని
దెప్పరముగ నిట్లుపెక్కు దెఱఁగులనేడ్చెన్. 10

సీ. పలుమానికపుఁగోళ్ల పసిఁడి మంచము మీఁద
నంచపాన్పునఁ బవ్వళించు నీవు
కటకటా యిటువంటి కటికినేలఁ బరుండ
నోర్చితివెట్లు దుర్యోధనుండ
వేనవేలెప్పుడు వెనుకముందులఁ జేరి
కొలువుసేయుచు నుండ నలరునీవు
దాయలుబ్బఁగ నక్కటా యొంటిఁ బడియుండఁ
జాలితివెట్లు దుశ్శాసనుండ
యెండకన్నును వానకన్నెఱుఁగ కెపుడుఁ
గడముపడకుండు సుకములఁ గాంచుమీరు
వానకును నెండకును నెట్లు వరుసనైఁచి
యుందకున్నారు నాముద్దు పట్టిలార. 11

క. పలువురు జోదులు పయిఁబడి
కలనం దగవేది మేనఁ గఱకు ములుకులన్
జలమున నడరించి నినుం
బొలియించిరె నానలేక పోరి నభిమన్యా. 12

తరల. పరఁగ నాఁడటు జూదమొక్కటి పన్ని యాడి యుధిష్ఠిరున్
సరగ లోఁగొని యన్నియుం గొనఁజాలి యక్కట యిప్పుడీ
దురవుజూదమునందు నేరుపుత్రోఁచ కూకర యోడి మ
చ్చరము హెచ్చఁగ మాద్రిపట్టి కొసంగితే శకునీ యొకల్. 13

సీ. దుస్సల నిమ్మాడ్కి దొసఁగులపా ల్సేసి
చనితివే మముఁబాసి సైంధవుండ
నినునమ్మి దుర్యోధనునకుఁగా నసువులు
తొఱఁగితే ద్రోణుండ త్రోడువచ్చి
యొజ్జలంచునునైన నొక్కింతమోమోట
మెన్నక కెడపిరే నిన్ను నేఁడు
మఱచెనొకో మేనమామ మనుమాటయు
శల్యుండనినుఁజంపు జమునిపట్టి
తండ్రిపోయిన బిడ్డలఁ దగఁగఁ బెంచి
చదువుసాములు చెప్పించి సాకినట్టి
నిన్నుఁబడసేయఁ జేయాడెనె యకటకట
పాండుని కొమాళ్ళకోయి భీష్ముండయిట్లు. 14

వ. మఱియు నప్పాలికలనియందు. 15

సీ. మడిసినమగలపైఁ బడి సొమ్మసిలి లేచి
యార్పులు మిన్నుముట్ట నఱచువారుఁ
బొలిసిన చెలికాండ్రఁ దిలకించి కస్త్రిమైఁ
బుడమిమీఁదను బడి పొరలువారుఁ
గన్నబిడ్డలమేను గాకులు పొడువంగఁ
గనలేక యెద మోఁదుకొనెడువారుఁ
జాఁవకట్టుగఁబడ్డ సైదోడులను గాంచి
యెడఁద వ్రయ్యలువాఱ నేడ్చువారు

నగుచువగచెడు మగువల యడలు టులివు
పుడమియును నాకసంబును ముంచుకొనియె
నేమిచెప్పను నదిగన్న నెట్టిరాతి
గుండెవారికి వగ పుట్టకుండ దపుడు. 16

తే. అప్పుడెంతయుగాంధారియలుకవొడమి
యిట్టికీడులుమూఁడుట కెల్లఁగుదురు
వెన్నుఁడేయని యాతని తెన్నుదిరిగి
యిట్టులనితిట్టెఁగడుఁబెద్దయెలుఁగుతోడ. 17

క. నేఁటికి ముప్పదియాఱవ । యేఁటను నొండొరులనెదిరి యీతీరున నే
యోటరుదుఁరు నీవారలు । గీటడఁగెద వీవు నట్ల కీడ్పడి యొంటిన్.

ఆ. వినులారవినియువెన్నుఁడాపలుకుల । కించుకయుఁ దలంక కిట్టు లనియె
మునుపె తిట్టిరిట్లు కినుకను జడదారు । లిప్పుడిందుఁ గ్రొత్తయేమిగలదు.

క. ఐనను నన్నారక యిటు । కానక తిట్టుటను నీదు గరితతనం బో
చాన కొఱఁతపడుఁ గాకే । మేనియు మేలొదవఁగలదె యిందున నీకున్.

క. అనినంతట ధృతరాష్ట్రుం । డనిలోనం జచ్చినట్టి యలతేండ్లకు నె
ల్లను నగ్గియియ్యజముకొడు । కునుబని చిననాతఁడపుడెకొద లేకుండన్.

సీ. సొదలను బేర్పించి సొరిదినందఱ కగ్గి
యిప్పించి యామీఁద నెల్లవారుఁ
దనవెంట బారులై చనుదేర జముపట్టి
వినువాఁక కడకేగి మునిఁగి యంను
దుర్యోధనుండును దుశ్శాసనుండును
లోనైన వారికిఁ దానుఁదండ్రి
నువ్వులు నీళ్ళును నవ్వగ నొకచోట
వదలుచు నుండంగ వచ్చి కుంతి

కన్నుఁగవ నీరుకాఱంగఁ గదిసి యచట
నెల్లరు వినంగఁ గర్ణుండు తొల్లి తనకుఁ
బ్రొద్దువలనను గలుగుట పొసఁగఁ దెలిపి
యతనికిని నీళ్ళు విడువఁగ నతివవేఁడె. 22

ఉ. అప్పుడు గొంతిపెద్దకొడు కందఱముందఱ నన్నకై కడుం
దెప్పరమైన నెవ్వఁగలఁ దేలి వితాకునఁ దల్లిదూఱుచుం
జెప్పెడి దేమి కర్ణునకుఁ జేసెను నూవుల నీళ్ళపోఁతయుం
దప్పక కర్ణునిం దడవి తక్కినవారును గుంది రెంతయున్. 23

తే. పిదప మిన్నేటిగట్టునఁ బెద్దదైన
గుడ్డయిల్లొండు గట్టించి గొంతికొడుకు
బందుగులుఁ జెలుల్ మొదలైనవారితోడ
మూఁడు నెలలందు నిలిచెనుమురిపమెసలి 24

సీ. అచ్చోటి కొక్కనాఁ డయ్యుధిష్ఠిరుఁ జూడఁ
గోరి వ్యాసుండును నారదుండు
కణ్వుండు లోనుగాఁ గలిగిన జడదారు
లరుదేర నెదురుగా నరిగివారిఁ
గొనివచ్చి మరియాద లొనరించి యందఱ
నొగిఁబీఁటలను గూరుచుండఁబెట్టి
యడుగులఁబడి లేచి యందఱసేమంబు
లారసి వేర్వేఱ యవుడు జముని
పట్టిచేదోయి జోడించి యిట్టులనియె,
నేను జచ్చిన వారికి నీళ్ళువదలు
నప్పు డమ్మ కర్ణుండు నా కన్న యంచుఁ,
జెప్పె నప్పటినుండియునొవ్వుదఱిఁగి. 25

క. ఉల్లం బెంతయు నడలెడుఁ
దల్లియె నాకిట్టివెతను దారిచె నకటా
బల్లిదు నన్నను జంపుక
యెల్లర మొగములను నింక నే నెటుచూతుర్. 26

తే. బవరమున నాఁడు కర్ణుని బండికల్లు
పుడమిలోపలఁ గ్రుంకుట పోలఁగంటి
దానికిఁ గతంబు నారద యానతీవె
యనుడు వేలుపుఁదపసి యిట్లనుచుఁజెప్పె. 27

సీ. చిన్ననాఁ డతఁడు తల్లిచే విడువంబడి
యడుగుఁ బుట్టువునింట నలరుచుండి
విలువిద్దె గఱచుచు వింటనమ్ములు గూర్చి
వెరవుమై నొకనాఁడు విడుచుచుండ
వాలుఁదూపొక్కటి నేలవేలుపు దూడ
కునుదాఁకి యది నేలఁ గూలుటయును
నలిగి పాఱుఁడతని యరదంబు పుడమిలో
దిగఁబడుఁగాకని తిట్టి చనియె
మఱియు బాపఁడ నని బొంకిమట్టుమీఱ
భార్గవునియొద్దవిలువిద్దెఁబడసికడకు
గాలు దొలిచిన పురుగుచేఁ గల్లదెలిసి
తిట్టుఁబడెఁబోరునెడవిద్దె తెలివివోవ. 28

క. అని యంతయు వాక్రుచ్చిన
విని మోమున విన్నఁదనము గ్రేలుచునుండన్
గనుఁగవ నీరొలుకఁగఁ గ
ర్ణునిఁ దడవితడవి యుధిష్ఠిరుండును వంతన్. 29

సీ. చెప్పక కర్ణుని చొప్పను దాఁచిన
తనతల్లి నేమియు ననఁగ లేక
యింక ముందు పుడమిలో నేకతమెప్పుడు
తలిరుఁబోఁడులవద్ద దాఁగకుండఁ
గాకయంచును నల్క గడలుకొనఁగ దిట్టి
కాయగూరలు దించుఁ గానలందుఁ
దానుండునని లేవఁ దమ్ములు ద్రోవది
పెక్కువగలఁ దెల్ప బెడచెవులను
బెట్టి పట్టిన పట్టును విడువకుండె
నంత జడదారు లందఱు ననువుమీఱఁ
బలుతెఱంగుల నాయముల్ పలికి మదికి
హత్తనూఱిపోసినఁగొంత మెత్తనయ్యె. 30

క. జడదారిదొరల నుడువుల
నెడఁదం గల కలఁక తొలఁగి యాకొనెఁగడకున్
బుడమిం గైకొనియేలఁగ,
నడవుల కేగెడితలంపు లడుగంటంగన్. 31

చ. తపసులు చుట్టముల్ చెలులుఁ దమ్ములునుం బెదతండ్రి తోడ రా
నపుడ యుధిష్ఠిరుండు తగ నచ్చటువెల్వడి వీడుచేర న
చ్చపుఁ దెలివిం జనెం బజలు సంతసమారఁగ భీమునన్న తా
నెపు డరుదెంచు మమ్ము నెపుడేలు నటంచును గాచియుండఁగన్.

వ. మఱియు నంతకుమునుగలన యయ్యూరివార లంతయువిని యంతం
తనరాని సంతసంబున. 32

సీ. కమ్మకస్తురినీటఁ గలయంపి చల్లించి
ముత్యాలముగ్గులు మొగి నమర్చి
యుపరంజికంబాల నరఁటిచెట్లను గట్టి
క్రొమ్మావిదోరణా లిమ్ముపఱిచి

కఱువేళ్ల పందిళ్లు గొమరొప్ప వేయించి
సరిగంచుచందువాల్ జతనుపఱిచి
నెత్తావిగల పూవుటెత్తులు గట్టించి
యగరువత్తులతావి పొగలువెట్టి
ప్రోలు గై సేసి రంతటఁబ్రోలుపుమీఱ
వెన్నుఁడును దమ్ములిల్లాలు వెంటరాఁగఁ
బుడమివేల్పులు దీవెన లిడుచునడవ
వేడ్కతో యుధిష్ఠిరుఁ డల్లవీడు సొచ్చె. 34

క. చివురుంబోఁడులు మేడల
చివరల నందముగ నిల్చి చేతులనిండం
బువులుగురియంగ దొరయును
దవుమాడ్కిని దెరువుదాఁటి దఱిసెం గొలువున్. 35

క. ముత్తైదువలు నివాళుల
నత్తఱిఁ బాటలను బాడి యలరుచు నియ్యం
జొత్తెంచెఁ గొలువుఁ గూటము
తత్తరమునఁ గొంతికొడుకు తద్దయు నెలమిన్. 36

తే. వెదకి యవ్వీటిజోస్యులు వెట్టినట్టి
మంచిమూర్తంబునందును మించు వేడ్క
దొరతనంబును బూనెను సరసనున్న
తపను లొక్కటదీవింపఁదనరి తేఁడు. 37

ఉ. అమ్మొయిఁ బూనఁ దెమ్మెరలు నల్లనఁ బల్మఱు వీచె వేలుపుం
గొమ్మలు క్రమ్మరించి రొగిఁ గ్రొన్ననమొత్తము నేలవేల్పులో
క్కుమ్మడి సేసఁబ్రాలు పయి నూరక చల్లిరి కాఁపు లెల్లరున్
నెమ్మదులందు సంతసము నిల్పి రతం డట్లు నేలఁ దాల్చుటన్. 38

క. కాఁపులకెల్లను నేమము
లేపట్టునఁ గొఱఁతవడక యెలమి యొసంగన్
గాపాడుచు నందఱు నొక
రూపునఁ జూచుచు యుధిష్ఠిరుం డరసెఁబ్రజన్. 39

తే. ఇట్లు కొన్నాళ్లు నేలను నేలుచుండి
డొందమూఱటఁ జెందక యుండుచుండఁ
గలఁకవోఁ గృష్ణుఁగనిపాడిగఱపవేఁడ
నతఁడు కొనిపోయె భీష్ముని యండకతని. 40

ఉ. తమ్ముల వెంటఁగొం చరిగి తాతను గన్గొని తేఁడు మ్రొక్కఁదా
నమ్ములపాన్పునందు వెతలందుచు నుండియు వెన్నుమన్ననన్
నెమ్మదిఁ జెంది మన్మలకు నెట్టన దీవెనలిచ్చి యోలిమై
నిమ్ములఁ జెప్పెఁబాఁడికత లిట్లని భీష్ముఁడు భీము నన్నకున్. 41

క. కాఁపుల నొప్పింపక తా
నేపట్టున రవ్వపడక యెల్లరు మెచ్చం
గాఁపులవలనను బన్నుల
నొప్పికతోఁ గొనఁగ వలయు నొడయం డెపుడున్. 42

క. పుడమిఁ దనకంటె బలియునిఁ
దొడరిన నెగ్గగును గాన దొరయగువాఁడా
యొడయనితోడను బొందై
యొడఁగూర్పఁగవలయుఁజాల నుపమయొసంగన్. 43

క. దండుల నని లేనప్పుడున్,
మెండుగ నుంచుకొను చెవుడు మెలఁకువతోఁ దా
నుండంగావలె నెకిమీఁ,
డొండు దొరతనంపువింత లొప్పఁగఁగనుచున్. 44

క. మ్రుచ్చులవెత లేకుండఁగ,
నిచ్చలుఁ బరికించి యొండు నెఱి చెడకుండన్
హెచ్చఁగఁ గాఁపుల మేలును,
నచ్చుపడం బుడమియేలి కారయ వలయున్. 45

క. కలిమియుఁ జదువును జాలం,
గలిగినచో మిడిసిపడక కడు నడఁకువతో
మెలఁగం జను నెల్లరకును,
దలకూడును బేరుఁ బెంపుఁ దద్దయు దానన్. 46

క. చాలఁగఁగీడగునపుడును, దాలిమియే పూనవలయుఁదప్పక దానన్
మేలిమి చెందును మానిసి, నేలంగలవారిలోన నెగులర యడఁగన్

క. నవ్వులకు నైననుం దగ, దెవ్వానికిని నొప్పి నించుకేనియుఁ జేయన్
గవ్వలయాటల నైనను, గ్రొవ్వున దబ్బఱలనాడఁ గూడదుసుమ్మీ.

క. కలదానిలోన చాగము,
సలుపుచు నిచ్చలును బీదసాదల నరయన్
వలయును దనచేత నయిన,
గొలఁదిని నొరులకును మేలుగూర్పఁగ వలయున్. 49

క. ఒరు లొనరించినమేలును,
గరువంబున మఱవరాదు కలలో నైనన్
దొరపడి చీటికిమాటికిఁ,
బొరయం దగ దలుక దానఁ బొదువును జేటుల్. 50

క. ఒరులేవి తనకుఁజేయఁగ, నరయన్మదిఁ గోరుచుండు నయ్యవిచే తా
నొరులకుఁజేయఁగ వలయును, దిరముగఁదా మేలుపొందఁదివిరెడునేనిన్

తే. మఱియుమిగిలినవాయంపుఁదెఱఁగులెల్ల,
మదికినాటంగఁదెలిపెన్నుమనుమనికిని
భీష్ముఁడప్పుడచ్చోటికి వేడ్కమీఱఁ
దపసితేఁడులువచ్చి రాతనిని జూడ. 52

తరల. అచటివారలచేత గౌరవమంది యాజకదారులున్
ముచటదీఱఁగ నందు వెన్నసి మోడ్పుఁగన్నులఁ జూచి వేఁ
డుచును దద్దయుఁ బ్రొద్దుపుచ్చి కడుం గడుం జముపట్టితో
నెచటనుం గనరాని నాయము లెల్లఁ జెప్పిరి కూరిమిన్. 53

తే. పిదప భీష్ముండుమనుమనివెరవుమీఱఁ,
బున్నెములజాడలను చెల్పిబుజ్జగించి
ప్రోలికంచెను వ్యాసుపంపునను నంత,
నుండి పదియేను నాళ్లత్తఁ డూరనుండి. 54

ఉ. ఆవలఁ దోడఁబుట్టువులు నందలిపెద్దలు నూరిపాటులున్
బావయుఁ జుట్టముల్ గొలుచువారలునుం బెదతండ్రితల్లియుం
బ్రోవులుగట్టి వెంబడిసి బోరనరాఁగ యుధిష్ఠిరుండు న
త్తావున కేగుదెంచెఁ దనతాతను గ్రమ్మఱఁ జూచువేడుకన్. 55

క. ఏతెంచి జోతచేయుడు
నాతండును మోడ్పుఁగన్ను లరతెఱచి వడిం
జేతుల నిమురుచు మనుమని
నాతఱి దీవించి యిట్టులనె ధృతరాష్ట్రిన్. 56

క. కొడుకులశోకము మది వగ
గుడువకు మించుకయు నీదు కొనవల నెల్లం
గడువడి నుడుపు యుధిష్ఠిరః
డడలక యీతని నె నమ్మమన్నిటికింకన్. 57

ఆ. అనుచుఁ జెప్పి పిదప నందఱి సేమంబు,
లరసి కనులు మొగిచి యబ్బురముగ
మొదలుఁదుదియు లేని మొనవేల్పుమదినిల్పి,
విన్న వాఁకకొడుకువిడిచెనునుఱు. 58

ఆ. కొంతసేపు తాత కొఱకును జముపట్టి, కనుల నీరుసించి కళవళించి
వెనుకఁ బెద్దవారి పనుపున నతనికి, నగ్గిపనులు దీర్చె నడలుతోడ. 59

మ. వెనుకన్ భీమునియన్న తాతకును దావిన్నేటిలో నూవులన్
వనటంబొందుచు నీళ్లతో వదలి యానాఁడేటినిం దాఁటి త్రో
వను నన్నుం దనతాతఁ జంపుటకుఁగా వంతం గడుం బొంది కా
ననునుండం జనువాఁడనంచుఁ బలుకన్ వ్యాసుండునుం గృష్ణుఁడున్.

తే. పలుదెఱంగులఁ దాల్మిమాటలనుగఱపి,
యింటికియుధిష్ఠిరుని దెచ్చి రెట్టకేల
కంతవ్యాసుండు జముపట్టె ననువుమీఱ,
వారువపుజన్న మొనరింప నేఱుపఱిచె. 61

క. పోరున దాయల నటువలె, దోరించిన దోసమెల్లఁ దొలఁగును నీకున్
వారువపు జన్నమున నని, ప్రేరేప యుధిష్ఠిరుండు వెతదిగఁ ద్రావెన్

వనమయూరము. కవ్వడిని గుఱ్ఱమును గావఁగను బంచెన్
నెవ్వడిని జన్నమును నివ్వటిలఁ జేయన్,
నవ్వుచును వెన్నునిని నాయముగ వేఁడెన్
దవ్వగనుజోపి వగతాలిమిని దాల్చెన్. 63

మత్తకోకిల. అన్నపంపునఁ గ్రీడి విల్లును నమ్ములుం దనరారఁగన్
దిన్నఁగా నల మావుపోయిన తెన్నునం జనుచుండఁగా
మున్నుగా నరుదెంచి జక్కులవి మోఁది పట్టు త్రిగర్తులం
జిన్నపోరున గెల్చి చెచ్చెరఁ జేరె నొండు విలాతికిన్.

శా. అంతం దత్తడి పోయిపోయి గరువం బారంగఁ బ్రాగ్జ్యోతిషం
బెంతో వైళమ చేరెఁ జేరుటయు నప్డే వజ్రదంతుండు దా
సంతోసంబున వచ్చి పట్టుకొనియెం జక్కం జలం బొప్పఁగాఁ
గొంతం గవ్వడి వచ్చి తాఁకెనతనిం జోటోగ్గి వాల్దాపులన్. 65

క. భగదత్తుని కొమరునితోఁ,
దగఁ బోరాటంబు సల్పి తనదుమగఁటిమిన్
బొగడఁగ జేజేల్ గవ్వడి,
తెగువం గొరును నడంచి తెరలిచె నతనిన్. 66

తే. అప్పుడు జన్నంబు చూడరానతనిఁ బిలిచి,
వారువము వెంట నచ్చోటువాసి క్రీడి
చేరె లాఁటివిలాతిని సింధువనెడు,
పేరఁ బరఁగెడుదానినిఁ బెంపుమిగుల. 67

క. అయ్యెడ నచ్చటివారలు,
కయ్యమునకుఁ గ్రీడిఁ గవిసి కడుబీరమునన్
డయ్యఁగఁ బోరి తొలంగిరి,
నెయ్యురతోఁ గూడి కడకు నివ్వెఱ గదురన్. 68

క. తనతండ్రిఁ జంపినాతఁడు
చనుదెంచె ననంగ గుండె జల్లనవినిగ్ర
క్కున నుసురులు విడిచెను నిం
టనె సైంధవునికొమరుఁడు దిటం బెడలంగన్. 69

తే. అతనికొడుకును నెత్తికొం చచటి కపుడు
వచ్చి దుస్సల వివ్వచ్చు పజ్జ నిలిచి
బుడుత నాతని కాళ్లపైఁ బడఁగవైచి
కన్నులను నీరు కాల్వలుగట్ట ననియె. 70

తే. అన్నయీతఁడు నీమేనయల్లుబిడ్డఁ
డితనిఁ గనికరింపుము నెమ్మియెదఁదలిర్ప
వీనితండ్రియు నీరాక విని కలంగి
మ్రాఁది యూపిరి మీఁదనె మిడిసి విడిచె. 71

క. అన నక్కటికంబెదలోఁ
బెనఁగొనఁ జెల్లెలిని నెత్తి బిగికవుఁగింటం
బెనఁచి కడుం గారవమునఁ
దనుపుచు నూరార్చి మంచితనమున ననియెన్. 72

క. అమ్మా నీవేమియు డెం। దమ్మున సంకురక వీనిఁ దగఁ గొంచును నీ
విమ్ములనింటికిఁ నరుగుము। కొమ్మా నేఁబోయివత్తుఁ గొఱఁతెన్న సుమా.

క. అనివారువంబు వెంటను। జనఁగా నదియు మణలూరు చక్కికి నతనిం
గొనిపోయెఁ గ్రీడిరాకను। విని యెంతయు సంతసించి వేడుకతోడన్.

వ. కవ్వడికిం జిత్రాంగదవలనం గలిగి యెవ్వరుం దనకు సాటి రాకుండ నింతు మగంటిమి నవ్వీడేలుచుండు బభ్రువాహనుండు. 75

తే. ఎదురుగా వచ్చి కాళ్లకు నెరఁగి లేచి
యోరనిలుచుండ నాతని దారిఁగనక
చిన్నపుచ్చిన నలుకయు సిగ్గు గదురఁ
దండ్రితోఁ నాల మొనరింపఁ దలఁచి పిలిచి. 76

క. పన్నికొనివచ్చి దండుల। నన్నిటితోడను నెదిర్చి యాలము చేసెన్
వెన్నీక బభ్రువాహనుఁ। డెన్నియొ వాలమ్ము లతనియెద నాఁటంగన్.

సీ. చెచ్చెరఁ దనమీఁదఁ జిచ్చులమ్మును నేయ
నీటితూపున దాని నోటువఱిచి
చలము డింపక పూని మలయలుఁగును నేయ
మగఱాతి వాల్కోలమరలఁ జేసి
మానని కినుకతో మబ్బుముల్కి నిగుడ్చ
గాలితూపున దానిఁ గ్రమ్మఱించి
చిఱువిసంబును గ్రక్కు చిలువకోలను దార్ప
గరుడితూపున దానిఁ గండడంచి

వేలుపులు మెచ్చఁ బోరాడి వెనుకఁ గ్రీడి
బభ్రువాహనుఁడూపునఁ బడియె నేల
నంతఁ జిత్రాంగదయువచ్చి యడలఁ దొడఁగెఁ
గొడుకుఁ దూఱుచు మగనిపైఁబడి కడంగి. 78

తే. క్రన్ననవులూచి పాఁపజగమ్ము నుండి,
మంచిగొనివచ్చియిచ్చిన నందముగను
లేచికూర్చుండెఁ గవ్వడిచూచియెల్ల
వారుమరలఁజచ్చినవాఁడు బ్రదికెననుచు. 79

ఆ. తలఁచి సంతసిలిరి తర్వాతఁ గొడుకును । దండ్రికాళ్ళఁ బ్రాలితడవుఁ లేచి
తప్పుసైపవేఁడఁ దటుకునఁ నక్కునఁ । గదియు జేర్చి పట్టి గారవించె.

చ. అటుపిదపం గొమారు నల రారఁగ పీడ్కొని యొంపుచోడికిం
దటుకునఁ బోయి కానలను దత్తడితోడను జొచ్చి యేఱులన్
దిటమున దాఁటి యొండకును దెమ్మరకు నోర్చుచుఁ గ్రీడి కొన్ని నా
ళ్ళటునిటు నూరకే తిరుగులాడుచు గుఱ్ఱమువెంటఁ బిమ్మటన్. 81

క. చొచ్చి జరాసంధుసుప్రో,
లచ్చట నాతని మనుమని నాలములో వి
వ్వచ్చుఁడు లోఁగొని కానుక,
లచ్చుపడం బుచ్చుకొనియె నాతనివలనన్. 82

తే. పిదప గాంధార మనునేలఁ బేర్మితోఁ దఁ,
గ్రీడిజన్నపుగుఱ్ఱంబుతోడఁ జొచ్చి
గోర మగుపోర నచ్చటివారి నోర్చి,
వారికడసొమ్ముఁగొని వెన్కవంకమరలె. 83

ఆ. అంతఁ గ్రీడిరాక నటమున్నె వెన్నుండు,
జమునిపట్టితోడ నమరఁదెల్పె

సంతసంబు మీఱఁ జనుదెంచెఁ గ్రీడియు,
నూరుసేరఁజాల నోడమిఁ గొనుచు. 84

ఉ. తమ్మునిరాకకు న్మదిని దద్దయు సంతస మంది యక్కునన్
నెమ్మిని గారవించి తగు నేమముతోడను మావుజన్నముల్
నెమ్మదిఁ జేయఁగాఁ దివిరి నేలను గల్గిన జన్ని గట్లకున్
సొమ్మును గొల్లగా నొసఁగి చొచ్చి యుధిష్ఠిరుఁడల్ల జన్నమున్ 85

క. ఎల్లరు మెచ్చఁగ నొనరిచి, యుల్లము తల్లడము దీఱి యొజ్జల సీవిం
బెల్లగు మన్ననలఁ దనిపి, యెల్లరఁ దగవీడుకొల్పి యెలమింబొందెన్.

తే. రహిని గాంధారికిని ధృతరాష్ట్రునకును,
బనులు సేయుచు వారలఁ బ్రాఁతిఁబడసి
కాఁపులెల్లను దన్నిష్టుఁ గన్నతండ్రి,
వడువునను జూడ జముపట్టి పుడమినేలె. 87

సీ. తెల్లవాఱఁదడవ యల్లనఁ బాండుకొ
మారులు సేమంబులారయంగఁ
గొంతియుఁ గోడండ్రుఁ గూరిమితో వచ్చి
పలుమాఱు నిచ్చలుఁ బనులుసేయఁ
గొలువుకు కాండ్రెల్ల నలసట యెఱుఁగక
కెలనఁగాచుక యుండి కొలువుసేయ
నారగించినవెన్క నరుదెంచి పాఱులు
కదలక వేడుకకతలు సెప్పఁ
గొడుకు లెల్లను బోయిన కొఱఁత యించు,
కేనిఁగానరాకుండంగ నెసఁగుచుండె
దానుధృతరాష్ట్రుఁడల్ల గాంధారిఁగూడి,
జమునికొమరుండు తగినట్లు జరుపుకతన. 88

క. బీదకు సాదకు బాపల, కాదట దానిచ్చుచుండు రాముడు సత్కృ
గాదనక కానుపీసము, ప్రోదిగఁ గొడుకియ్యఁ బంధువులఁ బబ్బములన్.

సీ. ఈమాడ్కిఁ గొన్నిరేయిం డ్లేఁటను గొఱంత
లేకుండ నచట మేలిమిగనుండి
యొకనాఁడు ధృతరాష్ట్రుఁ డొంటిగ వచ్చిన
జముపట్టి నొద్దకుఁ జక్కఁబిలిచి
యెవ్వరు వినకుండ నేకతంబునఁ జెప్పె
నాతండ్రి నీవిల్లు నడుపుచుండఁ
గొడుకులు గలనాఁటి వడుపునకంటెను
జాల మేలుగఁ బ్రొద్దు జరుగునాకు
నిచటి సుగములనెల్లను నిచ్చుతీఱఁ,
గుడిచినాఁడను నేంస్లను గడచెఁ జాల
నింకఁబెఱజగమ్మునను గోరుటిలవు నాకు,
నడవికినిబోయి యుండఁగ నానతిమ్ము. 90

తే. అనిపగుండెలుబ్రద్దలై యతఁడుకొంత,
వడివితాకునఁ బెదవులుడఁపుకొనుచుఁ
బలుకఁగా లేకయెట్టకేనిలుఁగుతెచ్చు,
కొనియుధిష్ఠిరుఁ డలతండ్రికనియెనిట్లు. 91

క. మీరడవులకుం జనఁగా,
నేరను నేనుండ నిచట నేనునుమీతో
గారవమున వచ్చెద నిదె,
యారలు ననుఁ గూడఁ గొంచు నేగుఁడు వెంటన్. 92

క. పోవలదని పలుదెఱఁగులు, గా విన్నపమును నొనర్చి కాళులమీఁదన్
లేవక పడఁగావ్యాసుఁడు, తా వచ్చి యుధిష్ఠిరుఁ గని తగనిట్లనియెన్.

తే. అరయ నీతండు పెద్దవాఁడైనవాఁడు,
బలసి పుడమిపైఁ బెక్కేండ్లు బ్రతుకఁబోఁడు
కానలో నుంట యేయింకఁ గరము లెస్స,
యితని నంపుమి యొండాడ కిపుడు తేఁడ. 94

క. అని యెట్లో యొప్పించిన, వినియందఱు నేఁగి వచ్చి వెలవెలవోవన్
జనుదెంచి కుంతి యడవికిఁ బనివడి తా బావవెంటఁ బయనం బయ్యెన్

క. మానుపఁ జాలక యామెయు, గానకు గాంధారితోడఁ గలఁగక పంపం
గా నోడఁబడిరి కొమాళ్ళును, మేనులు వడఁకంగ నోరు మెదలుపకోర్మిన్

సీ. అప్పుడు ధృతరాష్ట్రుఁ డనిలోన మున్నట్లు
చచ్చినవారికై చాగములను
జేయంగఁ గోరినఁ జెప్ప నలవిగాని
రొక్కంబును యుధిష్ఠిరుం డొసంగ
విచ్చలవిడి నేలవేల్పులకును నిచ్చి
చెప్పి యెల్లనవద్ద సెలవువడసి
నారచీరలు గట్టి నాతిగాంధారియు
సంజయుండును గొంతి సరస విదురుఁ
డరుగుదేరంగ వెల్వడి యడవి కేగెఁ,
జాలదవ్వుగ నాతని సాగ నంపి
తానుఁ దమ్ములు వీడ్కొని తల్లి నచట,
వీడు చేరెను జముపట్టి వెనుకవచ్చి. 97

మానిని. తల్లియు నాధృతరాష్ట్రుఁడుఁ గానకుఁ దద్దయు వేడుకతోఁ జనఁగా
నుల్లము పల్లటిలంగను గుందుచు నొక్కటనుండి యుధిష్ఠిరుఁడున్
బెల్లుగ వారలఁ జూచెదు కోరిక వేగిర పెట్టఁగఁ దమ్ములతో
సిల్లట వెల్వడి వారల రోయుచు నేగెను నందఱు నున్నెడకున్

తే. ఇట్లు జను దారిలో నొక్కయెడను విదురుఁ,
డుండె వెఱ్ఱివాఁడును బోలె నొప్పుదఱిగి
యతనిఁ గనియుదెనినుఁ జూడ నరుగుదెంచి,
నాఁడనంచు యుధిష్ఠిరుఁ డాడునంత. 99

తే. బదులు పల్కక యొక చెట్టు మొదలఁ జేరి
మోఁదు చూచుచు నప్పుడ మేను విడిచె
నతనికొఱకయి కొంతసే పచట నుండి
వనట జముపట్టి చనెఁ దనవారిఁ జూడ. 100

క. చని విదురుని చావెల్లరు,
వినఁగాఁ జెప్పినను వారు వెత హెచ్చంగాఁ
బనవి రతనిని దలంచుచు,
మునుకొని జముపట్టి యాత్రముం జెందంగన్. 101

తే. వగపు లుడిగిన పిమ్మటఁ దగినకరణి,
దద్దయును వేడ్కతో నాఁటిప్రొద్దు గడపి
రెల్లవారలు జడదారు లేగుదెంచి
పున్నియపుఁగత లోపిక పూని చెప్ప. 102

క. ఈ కరణిని నొక నెలయట, నీకొని జముపట్టి నిలువ నెల్లరు నెలమిం
జేకొని కొఱంత యేమియు, లేకుండఁగ నుండిరంచు లియ్యముగాఁగన్.

తే. అట్టులుండంగ నొక్కనాఁ డరుగుదెంచి,
వ్యాసుఁ డొకరేయి యచ్చటవారితోడఁ
గడపిమఱునాఁడు ప్రొద్దునఁ గదియఁ బిలిచి,
చీకు జేనికి హితవును జెప్పి చనియె. 104

తే. సాగి వ్యాసుఁ డచ్చటినుండి చనక మున్నె,
యతని యానతిఁ దలఁబూని జతనమునను

అంత ధృతరాష్ట్రుఁ డెంతయు మంతనమునఁ
జెంతకును భీమునన్నను జేరఁ జీరి. 105

చ. పోలు తెఱఁగున నొక్కింత బుద్ధిగఱపి,
నేర్పు మాటల నాతని నేలయేల
నొయ్యొ వీటికిఁ బోవంగ నియ్యకొలిపి,
యంచెఁ దమ్ములతోఁ గూడ నతని మరల. 106

క. వచ్చి యుధిష్ఠిరుఁ డొప్పుగ,
నిచ్చటఁ గొన్నాళ్ళు నేలయేలుచు నుండన్
వచ్చి యొకనాఁడు నారదుఁ,
డచ్చుపడం జెప్పె నంగలార్చుచు నిటులన్. 107

సీ. ఒడయండ నీవట్లు నడ తెంచినంతట
నీతండ్రి కుంతిని నెలఁతఁ గొనుచు
వేల్పుటేటికిఁ బొంత వెలయుకానను జేరి
యాకుటింటను నెమ్మి యలర నుండి
మఱఁదలుఁ దెఱవయు మటి వెంటఁబడి రాఁగ
నడవిలో నొకయెడ నడచుచుండఁ
గాఱుచిచ్చెల్లెడఁ గ్రమ్మి మంటలు నింగి
ముట్టంగ నట్లైన లట్టికవియ
నాఁడువారును జీకును నయినకతనఁ,
బోవఁగాలేక మువ్వురుఁ బొలిసిరందు
నేను నచ్చటివారిచే దీనివించు,
నరిగి చూచితిఁ బీనుంగు లైనవారి. 108

తే. కాలుగలవాఁడు గావునఁ గమరిపోక
సంజయుం డొక్కకొండను సరగ నెక్కి

వేనుఱును ధృతరాష్ట్రుచే వేఁడఁబడుచు
ననుజులను గాచుకొనియెఁ జానొక్కరుండు. 109

క. అని చెప్పుడు నేలంబడి,
కనుఁగొలఁకులనుండి నీరు కాలువపాఱం
గను నేడ్చెఁ దల్లిఁ దండ్రిని,
బెనుఁగొంతున, దలఁచి వేర్వేఱకడుఁగ్. 110

తే. వార లిద్దఱికొఱకు గాంధారికొఱకు,
మిక్కిలిగ నమ్మలించియమ్మేటిఱేఁడు
నారదుం డూఱడించిన గారవమున,
డెందమున నొక్కయించుకకుందువాసె. 111

క. ధృతరాష్ట్రునకును గొంతికి, వెత గాంధారికిని వేఱువేఱుగ నగ్నుల్
జతనుపఱిచి నూవులతో, జతనంబున నీళ్ళు విడిచి చాగము లిచ్చెన్.

సీ. బవరంబు నడచి యిప్పటికిని బదునెన్మి
దేఁడులు గడచె నొక్కింతలోన
మఱి పదియేడేండ్లు మాఱుగ జముపట్టి
పుడమినేలెను వగలెడఁద బలియ
ముప్పదియేనేండ్లు ముగిసిన నొకనాఁడు
వెన్నునిఁ జూచెడు వేడ్కతోడ
ద్వారక కల్లవిశ్వామిత్రుఁడును నార
దుండును గణ్వుఁడుఁ దొడఁగి వచ్చి
యూరిబయలనునడయాడుచుండఁజూచి,
దుడుకుఁదనమున వెన్నునికొడుకులెల్ల
జాంబవతికిని బుట్టిన సాంబునకును,
నాఁడు వేసంబు నమరించి యాగడమున. 113

తే. కడుపుతో నున్నలాగునఁగానఁబడఁగఁ,
బుట్టములుచాలఁ బొట్టకుఁజుట్టఁబెట్టి
పలువురును గూడిచుట్టుగుంపులుగనపుడు,
నవ్వుచునువాడవాడలఁ గ్రొవ్వమీఱి. 114

క. తిరుగుచు నా జడదారుల, సరసకుఁ గొనిపోయి వాని సాగిలఁబడఁగా
వెరవున నొనరిచి కడుఁబో, తరమున నిట్లనిరి కన్నుఁదమ్ముల నగుచున్

మధ్యాక్కర. జడదారులార యీకొమ్మ సరిగాను దొమ్మిదినెలల
కడుపుతోనున్నది దీని కడుపునఁ గూఁతు రొదవునో
కొడుకు పుట్టునో చెప్పుఁడయ్య కోరిక లొదఁగూడ నన్న
నొడలు మిక్కిలిమండి వార లొయ్యన నిట్లని పలుక. 116

తే. మీకొలంబున కెల్లను మిత్తియైన,
పెద్దరా రొక్కఁ డీపెకు వేగఁ బుట్టుఁ
బొండు మామాట తప్పదు పొండనంగ,
వెడలి రింటికి మోములు వెల్లవాఱ. 117

క. వారందఱు వగచుచు నిలు,
సేరం జని సాంబు కట్టుచీరను విప్పం
గా రాయొక టూడిపడెన్,
వారలయుల్లంబు లెల్ల వ్రక్కలుగాఁగన్. 118

క. పొడగని దానింగొని చని,
వడివడిఁ బొడుముగ నొనర్చి వదలక దానిం
గడలిం గలిపిరి యంతటఁ,
బొడవడఁగెడు నంచు నెంచి పూనికి మీఱన్. 119

సీ. అట్టులు వారలఁ దిట్టినతపసుల
నోరట్టిదో కాని నుసుపుమీఱ

నామజుసటినాఁడె యాచోటనెల్లను
బెల్లుగాఁ గ్రొవ్వాఁడి ఱెల్లుమొలిచె
నొకనాఁడు బలరాముఁ డుద్ధవుండును బోయి
కోరిక ల్వీడనాడి చేరి రడవి
వెన్నంటు మిగిలిన వీటివారల నెల్ల
జాతరసేయంగ సంభ్రమునకు
వెంటఁ గొనిపోయె వారిలో వేనవేలు,
కల్లుద్రావుట మైకము గప్పి మిగుల
నొడలు తెలియక తూలుచు నొకరి నొకరు,
తిట్టుకొంచునునూరక కొట్టుకొంచు. 120

ఆ. అన్నలనక తమ్ములనకుండ నొండొరుల్,
తప్పఁద్రాగి కాళ్ళఁదాఁచుకొనుచుఁ
జెంత ఱెల్లు పెఱికి చేతులకొలఁదిని,
గొట్టుకొనఁ దొడఁగిరి కొందఱందు. 121

ఉ. వారిని జూచి వారు తెగువం గలయుంబడి రెండుపాయలై
నోరికొలంది నొండొరుల నూఱులు కాఱులు వ్రేలుకొంచు నె
వ్వారిని జీరికింగొనక వాఁడితనంబునఁ బోరియొడ్డునం
గోరముగాఁగ నేలపయిఁ గూలుచు నీల్గిరి ఱెల్లుదెబ్బలన్. 122

క. కృతవర్మయు సాత్యకియుం, బ్రతుకుల కేమియును నాసపడ కెప్పటివో
కతలపుడు ద్రవ్వుకొంచును, వితగాఁబోరాడియాడివిడిచిరి యుసురుల్.

క. నెఱిఁ బ్రద్యుమ్నుఁడు సాంబుఁడు,
మఱియుం గలయట్టిమేటిమగల తెగలునుం
గొఱమాలిన యాలంబునఁ,
మఱివోయిరి లేనిపోని పట్టింపులచేన్.

క. పోరను జావఁగ మిగిలిన,
వారువముల నేనుఁగులను వరుసను గొనుచున్
ద్వారక కేగెను వెన్నుఁడు,
దోరినవారినిఁ దలంచి క్రొక్కుటపడుచున్. 125

వసంతతిలకము. వెన్నుండు చుట్టములు వేలకొలంది చావన్
గన్నారఁ గాంచి వెతఁ గవ్వడిఁ జూచుకోర్కిన్
బన్నంబు నొందియును బంచెను నాఁడె పోవం
జెన్నార దారకునిఁ జెచ్చెరఁ గ్రీడిఁ దేరన్. 126

ఆ. ఇట్టు లతనిఁ బంపి యేమియుఁ దోఁచక,
కొంతతడవు లోనఁ గుందుచుండి
కడకు నిల్లువెడలి కానల కొక్కట,
నన్నమున్న పోయినట్ల తాను. 127

కమలవిలసితము.

చని యడవులకును సరగను నన్నన్,
గనుఁగొని జరగినఁ కతఁ దెలుపంగన్
విని యతఁడు నపుడె విడిచెను మేనిన్,
వనటను మఱిమఱి పనువుచువారిన్. 128

తే. అన్నపోయినపిమ్మట వెన్నుఁడడవిఁ,
దిరుగుచెందుఁగాల్నిలువకదిగులుత్రోడఁ
జెట్టుమొదలికిమేనును జేరవైచి
యొడలు వడఁకంగఁ దద్దయునడలుచుండె.

తే. కాలు గదలుట దవ్వులఁ గాంచియొక్క
బోయ యది యొక్కమెకమని బుద్ధిఁదలఁచి
వింటఁ బలుతూపు గూరిచి వేసెనతనిఁ
జెల్లె వెన్నుండు నాదెబ్బచేత నపుడు. 130

సీ. వెన్నునిచే నన్ను మున్ను పంపఁగఁబడి
దారకుఁ డరుదెంచి తగినయట్లు
పాండుసికొడుకుల దండకుఁ జని వారి
కందఱకును జోత లమరఁ జేసి
ద్వారకలోఁ గృష్ణు బలఁగంబు మడియుట
యెల్లను వగచుచు నెఱుకపఱిచి
వెన్నుండు సరగను నిన్నుఁజూడఁగఁగోరి
నన్నుఁబంచెనని యర్జునునకుఁ జెప్ప
నపుడ పయనమై విన్వచ్చుఁ డన్నయొద్ద
సెలవు గైకొని ద్వారక చేరియందుఁ
గృష్ణుఁ గానక వందురి కీడుమీఁది
కీడుగా వసుదేవుఁడు కెడయఁ జూచి
యతనికిని నగ్నికర్జంబు లపుడ తీర్చి. 131

క. అడవులఁబడి కవ్వడి వడి,
నడలుచుఁ జెలికానికొఱకు నందును నిందుౝ
దడఁబడ నడుగులు దడవుచుఁ,
బొడగనెఁ బీనుంగు జెట్టుమొదలనునొకచోన్. 132

తే. అట్లు కని మొదల్నఱికిన యరఁటివోలె,
నేలఁబడి గోలుగోలునఁ జాల నేడ్చి
తన్ను దఱివార లూరార్పఁ దాల్మిపూని,
కడకుఁ బీనుంగుపైఁబడికౌఁగిలించి. 133

తే. లేచివెనుకటి నెయ్యముల్చెప్పికొనుచు
నడుగులొకకొన్నివార్తోనడచిమోలఁ
గాంచి బలరాము పీనుంగుఁ గదిసి దాని
వగపు సంద్రంబులోపల మిగులమునిఁగి. 134

తే. తాలిమియె తెప్పగా దాని దాఁటి యచట
చిదుగు లెల్లను నేఱించి సొదలుపేర్చి
పీనుఁగులరెంటి నందుంచి పెట్టి చిచ్చు
తిన్నఁగా వారి నిద్దఱ మన్నునేసె. 135

సీ. చేసి యచ్చటనుండి చెచ్చెర వెల్వడి
మరల ద్వారకఁ జేరి మఱుఁగువెట్ట
కందఱితోఁ గృష్ణుఁ డన్నయు సమయుట
చిన్న మొగముతోడఁ జెప్పివైచి
యావీటఁ గలవారి నందఱఁ దోకొని
మేలిసరకు లెల్లఁ బోలఁగొనుచు
గుఱ్ఱంబులను నేనుఁగుల నావులను వెంట
నడపించుకొని క్రీడి కడలిగట్టు
చేరె నంతట నేమని చెప్పవాఁడ
నప్పు డంగద లొంటిరా వనెడునట్టి
సామెత నిజంబుగా నుప్పు సంద్రమునను,
మునిఁగిపోయెను ద్వారక మొదలుముట్టి. 136

ఉ. అక్కడనుండి క్రీడి తగ నందఱిఁ దోడ్కొని వచ్చు దారిలోఁ
దెక్కలికాండ్రు బోయ లొగిఁ దెన్నున కడ్డమువచ్చి కవ్వడిం
జిక్కఁగఁజేసి కైదువులు చేకొని వెండియుఁ గూడవచ్చువా
చక్కెరబోండ్ల సొమ్ములను జాలఁగ దోఁచుకపోయి రొక్కటన్.

ఆ. మగనిచావు క్రీడి మొగమున రుక్మిణి,
మొదలుగాఁగఁ గలుగు ముద్దరాండ్రు
సొరది నాకించి సొదపేర్చుకొని చొచ్చి,
కాలి చచ్చి రొండు క్రచ్చులుడిగి. 138

తే. సత్య మొదలైన తక్కినచాన లెల్ల
గోరికలఁ గోసి యడవి సూకులను మేసి
యిచటి సుగముల నెడఁబాసి యొసఁగఁ దలఁచి
యపుడ సుడవుల పాలైరి యడలుతోడ. 139

క. తక్కిన వారలఁ దోడ్కొని,
మిక్కిలి వెసనంబుతోడ మే నదరంగా
నెక్కుడు పయనంబులఁ దన,
యిక్కకు నరుదెంచి చేరె నెల్లరతోడన్. 140

క. అచ్చటికి వ్యాసుఁ డప్పుడు,
వచ్చినఁ గనలేక మొగము వంచుకొనుచు వి
వ్వచ్చుఁడు పలుకం జాలక,
వెచ్చన నూర్చుచును జెమట వెల్లువగట్టన్. 141

తే. కాళ్ళపయి వ్రాలి సేద్చుచుఁ గదలకున్న,
లేవఁగా నెత్తి మదిలోనఁ జేవపూన
నూఱు తెఱఁగుల నాతని నూఱడించి,
యిప్పగిదిఁ గుందఁ గతమేమొ చెప్పుమనియె 142

మ. అసనం గన్నుల నీరునించుచును నేయంబొప్ప నన్నెప్పుడుం
దనయుల్లో కనుఁగొంచుఁ బోర నసుఁ బెద్దంజేసి తామావులం
జవఁగాఁ దోలుటకైన నొప్పుకొని నన్ పైదోడుకన్నం గడుం
బనిగాఁ బ్రోచిన కృష్ణుఁ డిప్డు మడిసెం బల్కుల్ మఱింకేటికిన్.

క. బలరాముండును దక్కం,
గల వెన్నునివంకవారుఁ గడతేఱిరి మొ
క్కలముగ నొండొరువులతోఁ,
జలమునఁ బోరాడి కల్లు చవిగొని యుంటన్. 144

తే. కడను ద్వారకమునిఁగెనుగడలిలోనఁ,
జొచ్చినేవెన్నునిల్లాండ్రఁదెచ్చుచుండ
బోయ లెదిరించి యాపువ్వుఁబోండ్ల నగలు
దోచుకొనిపోయిరంతఁబదొద్దవెట్టి. 145

తే. అనుచుఁ దెల్పిన వ్యాసుండు ననుప్ర మీఱి,
నిఁకమీఁద నీజగమున నీర లుంట
తగవు కాదని క్రీడితోఁ దటిమి చెప్పి,
తానుదనదారిఁబోయెన తపసిఱేఁడు 146

లయగ్రాహి. అంతనదియంతయునువింతగను నర్జునుఁడు
గొంతికొలిపట్టికినిజెంతఁజనిచెప్పన్
వంతమెయి నేలఁబడి కొంతవడి వందురఁగఁ
బొంతఁ దగువారతని నెంతయును దేర్పన్
దొంతరగఁ బైకుబుకు వింతవగ తెల్లనొక
గంతునను బోనుడిపి యింతిఁ గొని వేగన్
సంతసముతోఁ దమరు పంతముగ నేవు రిఁక
రంతువడ కేగుటకు నంతటను నెంచెన్. 147

తే. అనుచుఁ దలపోసి తమ్ములనాలిఁబిలిచి,
మనముమనువులు చాలింపమంచిదింక
నడవులకు వత్తురేయని యడుగవారు,
మంచిదనియియ్యకొనిరియమ్మాటలకును. 148

ఉ. అంతట నూరివారలను నందఱఁ బిల్వఁగ నంపి వారితో
నెంతయు నెమ్మిమీఱఁ దమ యిప్పటిపూనికి యెల్లఁ జెప్పి యా
వంతయు వంతనొంద కెదనాదట నుండఁగ నానతిచ్చి యొ
క్కింతయుఁ గొంకుమాలి చన నెంచిరి యేవురు నన్నదమ్ములున్.

తే. కృపుని రావించి తగఁ బరీక్షితుని నతని,
కొప్పగించి కరమ్మును గొప్పచేసి
పుడమి నేలంగ నభిమన్యుకొడుకు నిలిపి,
జన్నిగట్ల కొనర్చిరి చాగములను. 150

క. బావండొక్కఁడు కవ్వడి, దాపునకు న్వచ్చి విల్లు తడయక నీవీ
తేపకడనే విడువు మన, నా పగిదిని గాండివంబు నతఁ డిడెఁ గడలిన్.

సీ. రాచటీకంబున రహిఁ బరీక్షితుఁ బెట్టి
ప్రోలివారల వీడుకోలు వడసి
చిత్రాంగదను బిడ్డ చెంతకుఁ బంపించి
వడి నులూచిని దండ్రికడకుఁ బంపి
ద్రోవదిఁ దమతోడఁ దోడ్కొని పయనమై
పోరిఁ బాండుకొమరు లేవురును గదలి
కానలఁ బడి మెల్లఁగాఁ జనుచుండంగ
వేపియొక్కటి వారివెంటఁ బడియె
నంత దగయు నాఁకలి చూడ కరుగ వారు
కాలుకానలలోపలగంట్లుముండ్లు
గాళ్ళఁ దవులంగ బడలిక గదిరి మిగుల,
వెనుకఁబడిపోలి ద్రోవదివిడిచె మేను. 152

సీ. బడలిక కడలు తోడ్పడ వెక్కరాలేక
సహదేవుఁ డొకచోటఁ జచ్చిపడియెఁ
దమ్ముఁడు చావంగఁ దడఁబడి కాళ్ళాడ
కొకచోట నకులుండు నొఱగి కూలి
మూపురపాటును బోవుచుఁ దిలకించి
మొదవ్రయ్యఁ గవ్వడి మొకుర నీల్గెఁ

దమ్ముల నాలిని దలఁచుచు దగదొట్టి
భీముండు నొకచోట బిద్దవ్రాలె
నిట్లు తమ్ములు నలువురు నిగురుఁబోఁడి
సమసి పడినను దా నేమి సరకుగొనక
పోవుచుండెనుజముపట్టిపోవదయ్యెఁ,
గుక్కయొక్కటియునువెంటఁగూడముట్టి 153

తే. కుక్క వెంబడిఁ జనుదేరఁ గొంతదవ్వ,
వెడల జముపట్టి కెదురనువేల్పుఱేఁడు
త్తేరి నొకదానిఁ గొనివచ్చి తెరువుసందు,
నిలిపి యాతనితోడను బలికె నిట్లు. 154

క. ఎకిమీఁడ యిదిగో నరదము,
నొకదానిని నీకుఁగాను నోయన నిటకున్
గికురింపక కొనివచ్చితి,
సుకముగ నిదియెక్కి రమ్ము సులువుగనాతోన్. 155

వ. అనిననావేలుపుఱేని కానేలఱేఁడెంతయు నొదుంగుపాటునఁ జేతులు
జోడించి జోతచేసి యిట్లనియె. 156

తే. నన్నుఁ గనిపెట్టుకొని వచ్చుచున్న దిద్ది,
చాల దవ్వులనుండియు జాగిలంబు
దీనిఁ గూడ నాతోడ నీతేరిమీఁదఁ,
దెచ్చుటకు నానతిమ్ము నే వచ్చువాఁడ. 157

ఆ. అనిన వేల్పురాయఁ డల్లన నిట్లనెఁ,
గుక్కయేడ వేల్పుటిక్కయేడ
దీనిఁ దేరిమీఁదఁ దెచ్చుట తగ దన్న,
నింత నవ్వి యొడయఁ డిట్టులనియె. 158

సీ. తమ్ములు నిల్లాలుఁ దారెల్లననుఁ బాయఁ
దానొక్కటియు వెంటఁదవిలియుండి
ననునమ్ముకొని వెంటఁ జనుదెంచినట్టియీ
పేసిని నడవిలో విడువఁ జాల
నను నెప్డుఁ గనిపెట్టుకొని యున్న వారిని
నడవుల పాల్చేసి యరిగి నేను
సుగ మొందుచుండుట తగవౌనె నేనును
దప్పక యీకానఁ దపసి నగుచు
నుండి దీనినరయుచుందు నోరెమిడుచుఁ,
బిదప నిన్ను మెప్పించి నే వెనుకవత్తు
వేట్పుటిమ్మన కిప్పండో వేల్పు ఱేఁడ,
యరదమునుగొంచుఁగ్రమ్మఱనరుగుమీావు. 159

క. అని మోమోడక పలికిన,
విస్మయచ్చోరుపడియెఁ గరము వేలుపుఱేఁడ
ల్లన నప్పుడె జాగిలమును,
దనరూపును బాసి జమువితంబును దాల్చెన్. 160

తే. జాడ జముపట్టి తగవును జూడఁగోరి,
యట్లుచేసిన గుడెదాలు పలరె మదిని
వేల్పు ఱేఁడును నోడయుని వెంటఁగొంచు,
దేరిపై నెక్కియప్పుడెదివికిఁజనియె 161

ఆ. ఇట్టు బొందితోడనే వేల్పుజగమున,
కేగి నారదుండు నెల్ల వేల్పు
లోలసి తన్నుఁజుట్టి యుండంగనోడయుండు,
పలుకులాడుచుండిపలికెనడుమ. 162

క. నాపై దోడుల బిడ్డల,
వేసాయము చూపవచ్చి బిద్దిన దొరలన్
వాసిం గనుఁగొన నాకిపు,
డాస పొడమెఁ జూపరయ్య నందఱ నిచటన్. 163

చ. అనవుడు మంచిదంచు నపుడాతనిఁ దోడ్కొనిపోయి యొక్కచోఁ
బెనుపగు గద్దియన్ సుగము పెల్లుగఁ జెందు సుయోధనుం దగం
గనుఁగొనుమంచుఁ జూపిరది కన్గొని యాతఁడు డెందమందుఁ దాఁ
గినుకయు నీసునుం బడియెఁ గ్రేవను నారదుఁ డుండిచూడఁగన్. 164

ఉ. పుట్టిననాఁటఁగోలె నొకపున్నముఁ జేసి యెఱుంగనట్టి యీ
కట్టెఁడి యిందు హాయిఁ గనఁగాఁ గతమేమొకో నాకు నారదా
గట్టిగ దెల్పు మం చడిగి గండున మాన్కొని పోరిలోపలన్
గిట్టుటయే యనం దనివినిం గనఁడయ్యె నతం డొకింతయున్. 165

తే. అవలఁ దమ్ముల నెయ్యుర నయినవారిఁ
జూప జము పట్టి వేఁడినఁ జూడుమంచుఁ
గరము దవ్వుగఁ గొనిపోయి కానిపించి
రొక్కచోటను నలమట నొందువారి. 166

క. అదిగని యేవయుఁ గనలును,
మదిలోఁ బొదలంగఁ జూచి మఱిమఱి పగవుం
గదురఁగఁ బొగిలెను దమ్ముల,
కదలని బెడఁదఁ దలంచి కలఁతం బడుచున్. 167

సీ. ఇటు కొంతవడిపొక్కి యిట్లని జముపట్టి
యిదియేమి నారద యింతగోర
మిట్టిదే పరికింప నీవేల్పుజగమున
జరపెడు తగవుల చంద మెల్ల

నింతవఱకుఁ జూడ కేనేమొ యనుకొంటి
తెలిసిపోయెను మీాదు తెఱఁగు నేఁడు
పొడగంటి నేఁడు మా పుడమిలో నెన్నఁడు
విని కని యెఱుఁగని వింతలిచట
పున్నెమెట్టిదొ యెఱుఁగని ములుచలకును
సుగముల నొసంగి యెప్పుడుఁ దగవు గలిగి
మెలఁగువారికి దొసఁగులు గలుగఁజేయఁ
దగ వగునె యింక నో వేల్పు తపసిఱేఁడ. 168

క. అని వేలుపు టోడయని పైఁ,
గనలించుకవోడమి యతఁడు కావలసినవా
రిని జూపుటకయి తనతో,
బనిచినవాని మరలంగఁ బంచె వెనుకకున్. 169

తే. వాఁడు వడిఁబోయి జముపట్టి పలుకులెల్ల
వేల్పు ఱేనికిఁ దిన్నఁగా విన్నవించె
నపుడ పరువెత్తుకొనివచ్చి యతనిఁగాంచి
యచటఁ దెఱగంటి సామియిట్లనియె దొరకు. 170

సీ. కొలదిపున్నెముచేసికొన్నవా రదిమున్ను పొందుచుసుగ మొందుచుండురిందుఁ
బదపడి యదిదీఱఁ బలువెతల్ గుడుతురట్లొట దుర్యోధనుం డట్టు లుండెఁ
జెడ్డపనులను గొంచెముగాఁగఁ జేసిన వారు తొల్తను వెతపడుదు రిచటఁ
గావున నీతమ్ము లీవెత లందిరి ముందువీరలు సుక మొందఁ గలరు
కుంద కేమియు దీనికి డెందమందు । నీవు నొక కల్లమాటను నెపముపెట్టి
పలికి యొజ్జల నవిఁ గోలుపడితి కాన । వలసె నీకును నీవారియలఁతఁ జూడ.

ఆ. అనుచుఁ దెలియఁ జెప్పి యాయనఁగని నీవు
మొదల నేటియందు మునుఁగుమనిన
మిన్నువాఁక లోనఁ గ్రన్ననఁ గ్రుంకిడి
తనరియతఁడు వేల్పుతనము పూనె. 172

తే. అపుడెయాఁకలియునుడప్పియతని కుడిగి। వింతగానల్క ప్రేముడివిడిచిపోయె
మఱియుఁగల్గినతొల్లింటికఱత లెడలి । కలఁకలేనట్టియొకవింత తెలివియొదవె.

క. అంతటఁ దోఁ బుట్టువులును। వింతియుఁ దలియునుదండ్రియుయెల్లయనుఁగుల్
వెంతలఁ బొలిచిరి తమతమ । వింతగు గద్దియలమీఁద వేడుకగాఁగన్. 174

తే. వారిఁగనుఁగొంచు సంతసమారనందు । నెన్నినాళులు నెలమక్కలెసఁగుమింట
నన్నినాళ్ళను సుగముల నందుచుండు।జముని కొమరుండు వేలుపుజగమునందు.

క. అని పాండుని కొడుకుల కత । కొనసుట్టఁగ విటు శౌనకుండును మునుగాఁ
గను గల జడదారులకును । వినిపించిన పిదప ననియె వెస సూతుండున్ 176

తే. దీనివ్రాసినఁ జదివినఁ దెలియవినిన । వారలెల్లను దగు నడవడిని నేర్చి
దానిచేతను సిరులనుదద్దఁదనరి । యిందు నందును బెనుసుగ మొందుచుంద్రు.

క. తెక్కకు వెక్కసమగుచును,
బిక్కటిలు జగమ్ము లెల్లఁ బెల్లుగ నీలో
నొక్కయెడ న్నరసులవలె,
నిక్కగొని వెలుంగ నెపుడు నెనఁగెడు వేల్పా. 178

తోదకము. నేలను నింగిని నీట మెకాలన్
మేలిపులుంగుల మీలను వర్సన్
జాల నొనర్చి యొసంగుచు నోరెం
బోలిన గాచుచు నుండెడుదంటా.

గద్య. ఇది శ్రీమదాపస్తంబసూత్రలోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధకావ్యరచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర సకలసుజనవిధేయ వీరేశలింగ నామధేయ ప్రణీతంబైన యచ్చతెనుఁగు భారతమునందుఁ సర్వంబును దృతీయాశ్వాసము.

---

# శుద్ధాంధ్రోత్తరరామాయణము.



By

**K. VEERESALINGAM**

# శుద్ధాంధ్రోత్తరరామాయణము.

## ప్రథమాశ్వాసము.

గీ. రక్కసులఁ జేని తలలెల్లఁ జక్కుచేసి
పుడమికూఁతును గైకొని వెడలియుల్లు
గాలికొమరుండు లోనుగాఁగలుగువారుఁ
దమ్ముఁడునుదోడఁజనుదేర నెమ్మిమీఱ. 1

చ. అరదములెక్కి యక్కరణి నందఱుఁ గ్రందుగ వెంట నంటఁగా
పరగున నందినాఁ బరఁగుచల్లనిపల్లియఁ జేరువారిలో
భరతుఁడు ముందుగా నెదురువచ్చి యడంకువఁగాళ్లవ్రాలి తా
నరుదుగ వెంటఁ బెట్టుకొని యన్నను బల్లియకిచ్చఁదెచ్చినన్. 2

సీ. నారచీరలువిప్పి నాఁడెంపువలిపెంపుఁ
బట్టుపుట్టంబులు బిట్టుకట్టి
యడవిక్రొవ్విరుల్బూడ్చి యందంపుఁజెందమ్మి
లరుదుఁగానుతిమినవరులుదాల్చి
వెడవెడముడివడ్డజడలు చిక్కులువాపి
సిరిమీఱునునుజాలుసిగ లమర్చి
యెఱమట్టినిడుపట్టె లెడలెంచి నుదురులఁ
బదనుకస్తురిబొట్లు కుదురుపఱిచి
మేలిరతనంపురవణముల్ గీలుకొల్పి
తారుకై సేసికొని యెల్లవారుఁ బొగడఁ
దమ్ములిల్లాలు బంటులుఁదానుఁదరలి
యొప్పుమీఱంగరాముఁడయోధ్యకరిగె. 3

ఉ. అంతకుమున్న వారలటు లచ్చటకుంజనుదెంచుచున్నలా
గంతయు వేగవేగరుతె యాగక బాగుగ విన్నవించినన్
సంతసమంది ప్రెగ్గడలు సందడిసేయుచు నూరివారలన్
గంతునఁబిల్వనంపి సరగంజని ప్రోల్గయి సేయఁ బంచినన్. 4

సీ. కమ్మకస్తురినీటఁ గలయంపి చల్లించి
జిగితేటపన్నీట జగతులలికి
యాణిముత్యంబుల నమరించి ముగ్గులు
పందిళ్ళు కురువేళ్ళఁ బొందుపఱచి
జాళువాపనిమేలిమేలుక ట్లలరించి
పచ్చలదోరణాల్ బలియఁజేసి
పసిఁడికంబముల నబ్రంపుటంటులునిల్పి
కప్రంపుఁబొగ లెల్లకడలనించి
విడుకై సేసి తామును వేలకాలది
విలువసొమ్ములుదాల్చి చలువవలువ
లందఱునుగట్టియుండఁ బ్రోలందమొంది
కరముకన్నులపండువుగాఁగనుండె. 5

వ. అంత. 6

మ. పదియార్వన్నెకడానిమేడలపయిం బాలిండ్లపొంగార నె
మ్మదిలోఁ గోరికలూరఁ గ్రొమ్ముడులు పైపై జార లేజవ్వనుల్
కదియవ్వచ్చుచు నున్న రాకొమరువంకం జూడ లోఁదాల్మియుం
జెదరంబాఱఁగ మీఁదఁజల్లి రల్లరుల్ చేసిందఁ గీలింపుచున్. 7

గీ. వేల్పులాతండు తమదాయబింకమడఁప,
వేల్పుభ్రామఁకుల నెత్తావి విరులుగోసి
యలరిపయిఁజల్లు పెల్లుననలరువాన
తెఱవలందందుఁగురియింపఁ దెరువుఁదాఁటి. 8

సీ. తామెల్ల నోచిననోములు పండె నేఁ
టికటంచు వీటివారొకట నుబ్బ
నన్నినాళ్ళకు నిన్ను నిటఁగంటిరా కన్న
తండ్రీయని యనుంగుఁదల్లి యలర
నేలుమెల్లపుడు నీనేల నీవేయని
వెనదీవనెలు నేలవేల్పులొసఁగఁ
బుత్తడిపళ్ళెరంబులు పూని ముత్తైదు
వలు పాటపాడి సివ్వాళులియ్య
నిల్లుచొత్తెంచి తల్లుల కెల్ల మ్రొక్కి
తక్కుగలవారినందఱఁ దగినయట్లు
గారవముచేసి యతఁడెల్లవారు మేలు
మేలని పొగడఁగా నేలయేలుచుండి. 9

వ. ఒక్కనాఁడు. 10

మ. ఒకచోట న్మగటాలడాలడరి యెంతో యెండఁ గాయంగ నే
ఱొకచో ముత్యపుఁగ్గు వెన్నెలల చెల్వొప్పంగ నామీఁద నొం
డొకచోఁ గెంపులచాయతిన్నియలు వేయుకా సంజకెంజాయ పో
లికగా నొక్కెడఁ గప్పుటాగమి యిరుల్మింపంగ నాకొల్వునన్. 11

సీ. చెలువంబుగా నాడువెలయాంధ్రబంగారు
చిలుగజ్జియలమ్రోఁత చెవులఁదనుప
విరిబోఁడు లిరుగ్రేవ వింజామరులు వేయ
వెడలుచల్లనిగాలి విందుగొలుప
రహిమీఱఁదాల్చిన రతనంపుపనిసొంపు
తొడవులతళతళల్ కడలనిండఁ
బగడాలకంబాలపజ్జ ముద్దియల
కెంబట్టుపఱపులు డంబుసూపఁ

గొలువనేతెంచు వారెల్ల గుములుగూడి
యదరొదవుదాఁక నందంద యొదిగియుండి
యడుగుదోయికి మ్రొక్కుచు నవలనిలువఁ
బసిఁడిగద్దియఁ గొలువుండె బలియుఁడతఁడు. 12

ఉ. అప్పుడు కుప్పతిప్పలుగ నాతఁడు జూతమటంచు నెంచి వే
యొప్పులకుప్పలౌతపసు లుక్కున నక్కడ కేగుదెంచినం
దప్పకచూచిలేచి తనదండను సజ్జకదారిపిండుకుం
జొప్పడు పెద్దగద్దియలు చుట్టును బెట్టఁగఁబంచి వేడుకన్. 13

గీ. ఎదురుగానేగి తోడ్తెచ్చి యెల్లవారిఁ,
దగినచోటులఁ గూర్చుండఁ దగవుసలిపి
రెండుచేతులు జోడించినిండుమదిని,
నెంతయుఁబొగడ్తలొనరించియిట్టులనియె. 14

క. నేమమెమీకున్ మీకడ,
గోమునఁగలచదువులెల్లఁ గొనువడుగులకున్
నేమమె మొకములాయిడి,
మీమీ నెలవులను లేక మేలొదవెడునే. 15

క. ఎవ్వరుఁ జేయరుగా మీ,
కెవ్వెతలును మంచినీటియెద్దడి యెపుడున్
రవ్వంతయు లేదుగదా,
పువ్వులుకలదగవే సతమును గోనలలోన్. 16

గీ. తెరువుగన లేక దొసఁగులఁ దేలుమాకు,
దారిచూపెడుతలఁపున దపసులార
తలవనితలంపుగా వచ్చి పొలుచుకతనఁ,
గంటిమిమ్మందఱఁ గనులకఱవుదీఱ. 17

గీ. అనినఁ దేనెమాట లానని నొచ్చుచు,
నొండొరుల మొగంబు లోరఁగిచూచి
యొక్కమాటగాఁగ నున్న వారందఱు,
దిట్టతనముమీఱ నిట్టులనిరి. 18

గీ. అడుగవలసి యడిగి తంతియకాక నీ,
వెఱుఁగనిదియుఁ గలదె యెందు నెపుడు
నై ననిప్పుడదియె మానోటఁబలికింప,
వేడుకయ్యె నేని వినుము తెలియ. 19

క. మీకడకంటనె చూచినఁ,
గాకలుగున్ సేమమిజ్జగముల ననమముం
జేకొని ప్రోచుచు నింతగ,
మాకయ్యది యడుగనేల మఱిమఱిచెపుమా. 20

క. జగములకెల్లం దొందర,
యగురావణుఁ డీల్గెఁగాదె యనిలోనీచే
నిఁక నెవ్వరిచేఁదొందర,
లగుఁదగ మాబోంట్లకెల్ల నప్పటికరణిన్. 21

సీ. ఎప్పుడుఁగంటిపై ఱెప్పవాల్చుట లేని
జేజేల కిపుడుగా చేటుదప్పె
నయినవారిని బాసి యడవులఁ గూపెట్టు
తపసుల కిపుడుగా తాల్మిగలిగె
బిచ్చకానిచెలిమి యచ్చుపడ్డట్టి జ
క్కులదొర కిపుడుగా కలిమిగలిగె
గాలిబ్రతుకుఁజెంది కలుగులఁబడి యుండు
చిలువల కిపుడుగా తెలివిగలిగె

తేఁచియొకచోట నిలకడలేకతిరుగు,
చలువతెమ్మెర కిపుడుగా బలిమిగలిగె
నిపుడునీపేరు చెప్పఁగొంచెల్లజగము,
లిట్లు మనఁగల్గె రక్కసుఁడీల్గుకతన. 22

ఉ. ఎందఱి వానిచుట్టముల నెందఱి సంగడికాండ్రఁ బోరిలో
జందఱవందఱల్వొరపి చెండిణవించుక సేపులోన వా
రందఱ నోర్వఁగాఁదరమె మానలుమోముల వేల్పుకైన నీ
వందఱమించి తెవ్వరిఁక నొగ్గరునీసరి ముజ్జగంబులన్. 23

శా. అవ్వారందఱు నొక్కయెత్తు సరిగా నాయింద్రజిత్తొక్కఁడుం
జివ్వ న్వేఱొకయెత్తు చూడ నతనిం జెండాడెనీతమ్ముఁడిం
కెవ్వాఁడట్టుగ నోపునమ్మగతనం బెందైన మున్గంటిమే
నవ్వల్ గావుసుమయ్య మాపలుకులన్న న్నమ్మదిన్నమ్ముమా. 24

వ. అనిన రాకొమరుండిట్లనియె. 25

చ. ఎటువలె నింద్రజిత్తునకు నింతగ నెక్కుడుబల్మికల్గెఁదా
నెటువలె వేల్పుఱేని నని నెక్కటి నోర్చెఁ దండ్రికంటె మి
క్కుటముగ బీర మెట్లొదవెఁ గూరిమిమీఱఁగ నానతీయవే
తటుకున వానిపుట్టువుఁ దండ్రికొలంబు తెఱంగురంగుగన్. 26

గీ. మొదటినుండియురావణుపుట్టుకయును,
ముజ్జగంబులునాతండుబ్రోడయగుచు
గెల్చినతెఱంగుఁదొలివేల్పుఁగొల్చివలయు,
మెప్పులొందినయొప్పును జెప్పవలయు. 27

గీ. అనినఁ గొలువువారి యానతిఁగైకొని,
కడఁగి వారిలో నగస్త్యుఁడంతఁ
జెలువుగులుకు కలికిపలుకులు చెవులకుఁ,
జవులు పలుమఱు వెదచల్లఁబలికె. 28

సీ. వినవయ్య జడదారి వెలయుఁ బులస్త్యుండు
మొదటివేలుపునకు ముద్దుపట్టి
మచ్చరంబునఁ గాల్చి మరునకు లోఁగాక
యీసను దిగనాడియలరువాఁడు
నిక్కంబుతప్పక యెక్కుడు తెలివిని
నీరసంబెఱుఁగక యెసఁగువాఁడు
తొలివేల్పుముక్కంటి వలమురిదాల్పుల
నిచ్చలు మదిలోన నిల్పువాఁడు
వల్లమాలినపూనికతో నిల్లువెడలి,
చలువగాలిపెసు వలిమలకెలన నలరు
చెలువుగులికెడు తృణబిందు నెలవుచేరి,
తపసితన మూనియున్నంతఁ దార సిల్లి. 29

చ. అలరులకొమ్మలో మరునియమ్ములొ బంగరు కీలుబొమ్మలో
వలపులదీవులో తొవలబావులొ చక్కనిగుజ్జుమావులో
తొలకరిమించులో యనఁగఁ దూకొని యచ్చరలేమలచ్చటన్
బెళుకుఁగనుంగవల్ తళుకుఁబెన్దొడలుం దగ సందడింపుచున్. ౩౦

సీ. ఒకచోటనునుఁబాట లొకతేటగాఁ బాడు
దురు నల్లజాలెల్లఁ గరగిపాఱ
నొకయోర వగమీఱ మొకమోరగ నొనర్తు
రలమి దట్టంపువెన్నెలలుగాయ
నొకచాయఁ గసుకాయలకు డాయవత్తు రొ
య్యారంపునడకల హావుసునిండ
నొకదండపరిమండ లోడినిండఁగూర్తురు
కమ్మనితావులు గ్రమ్ముకొనఁగ

బిలుతురొక చక్కి నెచ్చెలిపిండునిక్కి,
కలికిపలుకులఁ జిలుకలుకలఁగిచూడ
నడుతురొక క్రేవసాలపుగానడిమిత్రోవఁ,
గదియునరుదెంచియుంచలుకాళ్ళఁబెనఁగ. 31

సీ. జొనుపుమరుతూపులన వాఁడిచూపులలర
మదికలంగఁగఁ గందువమాట లాడఁ
జూడ్కి మిఱుమిట్లుగొనఁ జెంతఁ జొరవమెలఁగఁ
గలయఁదిలకించి జడదారికళవళించి. 32

చ. అటునిటుమ్రోల వేల్పుజవరాండ్రు మెలంగుట లెంచిచూడఁగా
నెటులునుదాను గైకొనిన యిప్పటిపూన్కికి నడ్డువాటుగాఁ
దటుకున నుల్లమం దెఱఁగి తాళఁగఁజాలక వారినందఱిన్
దిటమునఁ జేరఁజీరి వెనుతియ్యనితియ్యని తేటమాటలన్. 33

శా. ఏలావేయును గొమ్మలార వినుఁడీ యీమీఁద నీతోఁటలో
వాలారుంగనుదోయివిచ్చి మరియేవాల్గంటి నన్ జూచునో
యీ లేజవ్వని యిప్పుడేయిచటఁ జూలాలౌనటం చాడినం
జాలుంజాలునటంచు నాటవలపుల్ పాలించి వారందఱున్. 34

క. వచ్చినదారినె పదరే
యిచ్చటఁ దలలెత్తిచూడ కెచ్చటికైనన్
మెచ్చఁగవలదా త్రోవనె,
వచ్చినపనియయ్యె నంచుఁ బకబకనగుచున్. 35

క. ఇంతటితో సరిపెట్టెను
గొంతతలలు తపవి చూచుకొంటిమి బళిరే
యెంతటినోములు నోఁచితి
మింతిరో మనతొంటిమేననే యని చనుచున్. 36

చ. వడివడిఁ బాఱుతెంచి యొకపైదలి యూర్పులుపుచ్చి నవ్వినన్
బడఁతుక యొార్తు చాలిపురె నవ్వకు మంతయు తేపెగట్టిగాఁ
గొడుకులతల్లి వొకు వొకరించెను నాఁటికి దాఁచుకొమ్మనా
నుడికె నెలంతయుం గడుపులుబ్బఁగ నవ్విరి కొమ్మలందఱున్. ౩7

క. ఒక్కతె చనుమొనకస్తురి
నిక్కఁ గనఁగవచ్చుచెలికి నిలుమని మ్రొక్కన్
విక్కుచుఁ గొమరుని గనుమని
చక్కనదీవించె వీపుచఱచుచు దానిన్. 38

గీ. ఇట్లు మేలంబులాడుచు నింతులెల్ల
నెడగలుగఁ బోయి రంతట నిచటఁ బూలు
గోయఁ దృణబిందుగారాపుఁ గూఁతు రనుఁగుఁ
జెలియతోఁగూడి పూఁదోఁట మెలఁగుచుండి. 39

క. మునుపటు బెట్టిదముగ నా,
యన వాక్రుచ్చుటలు విన్న యదిగాదటుగా
వున వెఱపన్నది యెఱుఁగక,
వెనుకయు ముందుం దెలియక విచ్చలవిడిగన్. 40

సీ. వేసవిసంపంగివిరులనెత్తావికిఁ
దెమ్మరల్ దరిచేరఁ దేంట్లుపాఱఁ
జక్కనినెమ్మోముజాబిల్లి జిగికిని
నెలఱాల్గరంగఁ గల్వలు చెలంగఁ
దనమేనిజవ్వాజితావికిఁ బునుఁగుపి
ల్లులు డాయరా చిల్క లులికికూయ
నలువైన క్రొవ్వాద నల్లమబ్బునకును
నెగసియంచలువీడ నెమ్మలాడ

విరులుద్రుంచుచుఁ దేవియల్ వెదకికొనుచుఁ
బండ్లు రాల్చుచుఁ గెందమ్మితూండ్లుఁగొనుచుఁ
జాన సింగారములతోఁటలోనఁ దోడి
చెలియ నెడఁబాసి యొకకొంతసేపుతిరిగె. 41

క. బోటింగానక యూవిరి,
దోఁటం దిరిగితిరిగి యెటుఁదోచక యొంటిన్
మాటికెలుఁగెత్తిచీరుచు,
మేటితపసిఁగాంచె నొక్కమిట్టను నెదురన్. 42

ఉ. చెక్కులు తెల్లవాఱెఁ గడుచిన్నియొయారపుఁగొను మీఱెఁ జ
న్మొక్కల నల్పుసేరె జిగిపూఁపనిగారపుఁ జన్నుదోయి పెం
పెక్కువ తేరె దట్టమయి యంతయు నారలరారె నూరువుల్
మిక్కిలి యూరె నత్తపసిమిన్నఁ గనుంగొనినంత నింతికిన్. 43

గీ. అక్కరణిఁదానుజాలింతరాలితనము,
పూనుటకుఁజాలమదిలోనఁబొగిలిముగుద
దానికిఁ గతంబుపరికించికానలేక,
యచటిమందులనయ్యోఁగాకంచునెంచి. 44

సీ. ఇంక నేమందు నట్టివానింటఁ బుట్టి,
నేఁడు పేరు పెద్దటీకంబు నీటఁగలిపి
వట్టినట్టులుపడ నొడికట్టుకొంటిఁ,
గటకటా యిదినావంటిఁ కన్నెకగునె. 45

క. మిక్కిలి కటికితనంబున,
నక్కటికము లేక నుదుట నాకట్టిఁడివే
ల్పిక్కరణి మూడుబంతుల,
నక్కట నావంటిదానికా వ్రాయుట తాన్. 46

క. ఇది విన్నయమ్మలక్కలు,
మొదలంగానిత్తురె యిఁకమీఁదఁటనన్నున్
మది నేర మెంచుఁ దండ్రియుఁ,
బదుగురిలో వట్టిరవ్వపాలై తీఁగదా. 47

క. చెలులున్ బుగ్గలు పొడుతురు,
నలుగురిలో నవ్వుఁబాట్లు నాకని మఱియుం
దలిపొంది తండ్రికడకా
చెలువ తుదకు గుండెఱాయి చేసికొని చనెన్. 48

క. అటువంచినతల యెత్తక,
బొటబొటఁ గన్నీరు గాఱ బొటవ్రేల్నేలం
జిటుకునవ్రాయుచు మేనో
క్కటగడగడవడఁకఁ దండ్రికడనిలుచున్నన్. 49

గీ. కొంతవడికిని దలయెత్తికూఁతు నెదుటఁ,
జిన్నవోయినమోముతోనున్నదాని
నట్టె తిలకించి యుల్లమిట్టట్టులూఁగ,
డెందమున నింతసందియం బంది పలికె. 50

క. పువ్వుంబోఁడిరొ యెవ్వని,
కవ్వల నే యొగ్గొనర్చి తందఱలోనన్
రవ్వగ నోర్వం జాలక,
యెవ్వఁడు ని న్నిట్టు తిట్టె నించుకలోనన్. 51

క. నాముందఱ నీ కీవెఱ,
పేమీ నన్నుఁగన్నతల్లి యిప్పు డిచట నీ
వేమియుఁ గొఱంత వెట్టక,
చామా యిఁకఁ దెల్పవమ్మ జరిగినదెల్లన్. 52

గీ. బ్రతికినంతతనకు వరు వన్నదియె లేక,
దల్లిదండ్రు లెపుడుఁ దలలువంపఁ
బుట్టరానియాఁడుపుట్టుకుఁ బుట్టియుఁ
గానిచేఁత కేల కడఁగితమ్మ. 53

క. మునుపటి తెలివెల్లను జ,
వ్వనిరో యిపుడెందుఁ బోయె వగచెదు నిన్నే
మన నెన్నటికిం దఱుఁగని,
పెనురట్టుసి మాకుఁ దెచ్చిపెట్టితి వనినన్. 54

చ. వెలవెలవోయి యచ్చెలువ వేమఱు వెల్వడి జాలువాఱుక
న్గలువలవేఁడిపిటఁ గనుకందిన కాళ్ళకు సేదదీర్చుచుం
బలుకులవిన్నఁబాటోదవ మైఁ జెమరింప నెలుంగు రాల్పడం
బలికెఁ దమంత రాచిఱుకబారులు చేరువఁ బాఱు తేరఁగన్. 55

శా. తండ్రీ కొండొకదోస మే నెఱుఁగఁజూ తప్పెన్న మీయాన పె
క్కండ్రుత్రోవను బూలు గోసిగొని యేగం జూచి దొందంబులో
వేండ్రంబౌతమి పెల్లిదం బడఁవ కే వే పోయి యాతోఁట ని
ల్లాండ్రం దెల్లను వాసిగన్న చెలిత్రో నందంద నేఁ గుమ్మరన్. 56

గీ. ఏకతంబునఁ జెరలాడ నేకతంబొ,
కాని యట నాకుఁ జెలి చెంత లేనితఱిని
నిట్టిమా లేవ్వమెఁగాని యింతకన్న,
వే తెఱుంగను మీయాన వేయునేల. 57

గీ. అనిన లోఁపలి చూపున నరసి నిజము,
కన్నఁగవ మ్రోలఁ గట్టినకరణిఁ దోఁపఁ
జానయెడఁ దప్పులేమికి సంతసించి,
కూఁతుఁ గనిపల్కెఁ గూరిమి కొనలుసాఁగ. 58

క. అమ్మా యూరక నీపై,
నిమ్మాడ్కిన్ లేనిపోనియీ నేరము నేఁ
జిమ్ముట తప్పగుఁ బట్టక,
యుమ్మలికము మాని యుండు ముల్లములోనన్. 59

క. తనుఁ గనుదానికిఁ గడుపా,
ననుచుఁ బులస్త్యుండు పలికె నది యింత కెఱుం
గనికతమున నీ వాతనిఁ,
గనుఁగొంటివి గానఁ జూలు గలిగె న్నీకున్. 60

క. ఇంతటిపని కేఁ గలుగఁగ,
వంతలఁదలకంగ నేల వలవదు నీ కా
వంతయుఁ గొఱంత లే దిఁకఁ,
జెంతకు రమ్మంచుఁ గూఁతుఁ జేరఁగఁబిలిచెన్. 61

గీ. పిలిచి తొడమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనియు,
తండు బుగ్గలుముద్దిడినిండుతమిని
గొప్ప దువ్వుచుఁ బయిచీరకొంగు తీసి,
కనులనీ రొత్తి తడవుగఁ గౌఁగిలించి. 62

చ. చనవున లేవ నెత్తి యెలజవ్వనికే లొకచేతఁ బూని గొ
బ్బునఁ దనవెంటఁ బెట్టుకొని పోయి పులస్త్యునిఁ గాంచిమ్రొక్కి యా
యనకు వెలందిఁ జూపి తగ నప్పటికట్టడి నింతి చూలుదా
ల్చిన దగు లేర్పడం బలికి చేతులు రెండునుఁ జేర్చి యిట్లనున్. 63

గీ. తపసినై యున్న ముక్కంటి కపుడు కొలువు,
గట్టురాకన్న చేసినకరణినిపుడు
తపసినై యున్న మిమ్ము నీతలిరుఁబోఁడి,
నమ్మికొలుచును బెండ్లికమ్ము దీని. 64

క. ఎండల బడలినయప్పుడు,
మెం డాఁకలి గొన్నయపుడు మీాకొక్రప్పై
యుండి తనయండ నిడుకొని,
పండు లోసంగులతకూనబడలికలడఁగన్. 65

గీ. అనుచుఁ జేతిలోఁ జెయివెట్టి యప్పగించి,
యతఁడు గైకొన్నపిమ్మటనల్లునొద్ద
సెలవు గైకొని కూఁతునునిలువఁబనిచి,
లేచితనయింటకేగెనా రాచతపసి. 66

క. అది మొదలుగ నాకన్నియ,
పదిలముగా మగనికూర్మి పడయంగఁ దలం
పెదలోఁ బాదలఁగ నాతని,
మదిలోపలమెలఁగుచుం డెమఱపెఱుఁగనిదై. 67

సీ. ఎపుడుఁ బ్రొద్దున లేచి యేట మునిఁగి యింటి
కేతెంచునంతలో నెదురువచ్చి
యడుగుఁగెందమ్ములు కడుగుకొనఁ బసిండి
చెంబున నీ రంది చెంతనునిచి
పఱుగునఁ దనునుపైటచెఱంగున
నడుగులతడి యొత్తి యంతలోన
నుతికినతెల్లదోవతులు పింజెలు వెట్టి
చని చేతి కందిచ్చి సరస నొక్క
పీఁట వెట్టి కూర్చున్నచోఁ బెరట నున్న
పువ్వు లొకపళ్ళెరంబునఁ బోసి యొసఁగి
వార్చి యాతండు లోనికి వచ్చునంత
పిండివంటలతోఁగూడ వండి పెట్టు. 68

గీ. ఆరగించెడుతఱి నొకయోర నిలిచి,
విసరు వీవన చేఁబూని వెనుకఁబూల
పాను పొక్కిటి సవరించి పవ్వళింపఁ,
దొడలపై నిడుకొని మెల్ల నడుగులొత్తు. 69

క. నడిరేయియైనఁ బలువురు,
బడిబడి నడతెంచి రేని వారికి సరిగాఁ
గుడువంగఁబెట్టు నప్పుడ,
మడికట్టుచు వంటచేసి మరియాదమెయిన్. 70

గీ. అదనుతప్ప కుండఁగ నోరె మమరుచుటకు
నింటితీర్పనఁ దను మఱపించుటకును
దపసియంతవాఁడును జొక్కిఁ దలిరుఁబోండ్ల
యుచ్చకంబులఁ బడనివా రెవ్వ రింక. 71

వ. అట్లు. 72

గీ. కూర్మి మగఁడు కన్నులఁ గప్పుకొనఁగనుండి
యంతకంతకు వేవిళ్ళువింతమీఱఁ
జాలఁ గసిగాటులుగఁ దిండిసలుపఁ జాగె
నెలలునిండ నీళ్ళాటప్రొద్దులునుడాసె. 73

క. ముగుద యొకమంచినాఁటను
మగవానిం గనియె మగఁడు మదినుప్పొంగన్
మగవానిఁ గన్నతండ్రియు,
మగువం గన్నట్టితల్లి మక్కువపడరే. 74

సీ. ఏతొందరయు లేక యెలమిత్రోఁ జుట్టముల్
నిండువేడుకఁ జెంద రెండుతలలు
కుదురుగా నేర్పడి పదినాఁడులునుజన్న
మఱునాఁడు పురిటినీళ్ళరసిపోసి

యిరువదొక్కటవనాఁ డెదఁ దలపోసి
పెద్దలు పెట్టినయొకమూర్తంబునందు
సరువెంచి తపసియు విరిబోఁడియును బార
సాలపీఁటలమీఁద సంతసమునఁ.
గూరుచుండఁ దండ్రి కొమరున కప్పుడు,
విశ్రవసుఁ డనంగఁ బేరు వెట్టి
నాఱవనెల నోరె మమరంగ ముట్టించి
వడుగు నేఁడులేడు గడవఁ జేసె. 75

చ. పితరునిమాడ్కి విశ్రవుఁడు పిన్నటనుండియు మెండుదండియై
జతనము హెచ్చ మచ్చరముఁ జంపి వడిం జడదారిదారిఁ దా
నతివల మాని మాని తను నందఱు నందరుదందిచూడఁగా
సతమును గానలోన రెయిసైతము నీతమునిండ నుండఁగన్. 76

క. పుడమి భరద్వాజుం డను
జడదారి యొకండు తనదు చక్కనికూఁతున్
వడి దేవవర్ణి యనియెడు
పడఁతుకఁ దోడుకొని వచ్చిపలికెం బెరిమన్. 77

సీ. చెలువకన్నులడాలు చెంగల్వవిరిచాలు
నినుమడింపఁగఁజాలు నింపునింపుఁ
గొమ్మపొక్కిలి పెంపుకమ్మతావులనింపు
పొన్నక్రొన్ననసొంపు పొలుపుఁదెలుపు
మగువపన్నులతీరు మల్లెమొగ్గలపేరు
లోఁగఁగూర్పఁగను గోరునోరవునెఱపుఁ
జానచక్కనిముక్కు సంపంగిపువ్వుటెక్కు
దాపునఁ జెయిచిక్కు నేపుఁజూపు

నువిదచేతులుపూదండలొసఁగుచుండు
నింతినెమ్మోమువిరిదమ్మినెలమిఁగూర్చఁ
బూఁజనల్పెడుతఱియందుఁబూనిమీఁకు
గట్టిగాననబోఁడిఁ జేపట్టవలయు. 78

మ. అన నెమ్మోమునఁ బిన్ననవ్వొలయ నొయ్యారంబుగా లేచి యా
యన వెంటంగొని తల్లిదండ్రులను డాయంబోయి కాన్పించి వ
చ్చినకర్జంబు కరంబు వీనులలరం జెల్వంబుగా విన్నపం
బొనరింపన్మది నుబ్బి మైకొనిరి వారొండాడఁగా లాఁతులే. 79

ఉ. అంత నొకింత మంతనమునందుఁ గొమారు తలంపెఱింగి వా
రెంతయు సంతసంబడర నింతిఁగొనం దమడెందమందు నొ
క్కింతయు నడ్డులేమి యెఱిఁగించిన మేలనివారు, దారునుఁ
వింతగ వియ్యమొందఁ గనువిందుగ నందఱు నందుఁ బొందుగన్. 80

సీ. తమ్ములమ్ములనంది తరువాత నిరువురు
బట్టలొండొరులకుఁ గట్టఁబెట్టి
పెండ్లిపనులుచేసి పెద్దలరావించి
తమవారితోఁగూడి తరలివెళ్ళి
వియ్యపువా రిడ్డవిడిదిలోపల దిగి
నాల్గు నాఁడులతంతు నడపి మఱియు
నలుకపానుపు మొదలైనవేడుకలెల్ల
జరగవలసినట్లు జరగ నలరి
నాగవల్లియైన నాఁటిరేయూరేగి
యొప్పగింతలైన యుప్పొడగవు
తగవు లరణములును దగినయట్టులొసంగి
పెండ్లికూఁతువారు బిడ్డనిచ్చి. 81

గీ. అంపకము సేయఁ బైనమై యపుడు కదలి
పెండ్లికూఁతుతోఁ గూడ నా పెండ్లికొమరు
నొక్క పాలకి నెక్కించి యుబ్బుమీఱ
నింటికేతెంచెను బులస్త్యుఁ డింపుమెఱసి. 82

క. పిల్లదిపెద్దదియైనం
దల్లియుఁ దండ్రియును వచ్చి తమముచ్చట పెం
పెల్లను దీఱఁగఁ గొమరెకుఁ
గొల్లగ సొమ్ములిడి కోర్కె కొనసాఁగంగన్. 83

క. పెనిమిటిపెండ్లాముల మం
తనమున నొకటిగ నొనర్చి తలిదండ్రులు వే
డ్కను దమయింటికిఁ బోయిన
వెనుకంజూలేరుపడియె వెలఁదికినిచటన్. 84

క. అన్ననబోఁడికడుపునం
బున్నమచందురునివంటి బుడుతఁడు వొడమెన్
గ్రొన్నెల దాలుపునాలికి
మున్నలకొమరుండు నెమ్మిఁ బుట్టిన పగిదిన్. 85

ఉ. ముద్దులమూటగట్టునలబొట్టియపుట్టుకయప్డు వేలుపుం
బెద్ద పులుంగుతత్తడిని మేదుకమీఱఁగ నెక్కివచ్చి వీఁ
డద్దెసలేలు నేలికలయందొకఁడై మఱి రొక్కపుందొరా
నద్దిర వీనిపున్నెమని యానతి యిచ్చి చనెం దనంతటన్. 86

చ. వడుగొనరించి యామొదలు ప్రాఁజదువుల్ చదివించి తండ్రి నే
ర్పడరఁ దనంతవానిగను నన్నిట దిద్దిన నాఱితేఱుటన్
విడువనిపూన్కిఁ గాలిబొటవ్రేలొకయించుక నేలమోపి న
ట్టడివిని నొంటిమైఁ దపసియై యతఁడుండెను దండ్రిపోలికన్. 87

క. వేయేఁడులు నీరానియు
వేయేఁడులు గాలిఁ గ్రోలి విడువక యాపై
వేయేండ్లోగిర మొల్లక
యాయడవిని దమ్మిచూలి నతఁడు తలంపన్. 88

ఉ. నిద్దపుఁబండువెన్నెలల నింపెడుసొంపగు ప్రక్కప్రక్కలన్
ముద్దుమెఱుంగుఁదీవియలఁ బోలినబంగరు రంగుచాఱలం
దద్దయుమించునంచపయిఁ దామరచూలి కరంబుడంబుగా
నొద్దకువచ్చి యచ్చెరువునొంది కనుంగొని నింగి సిట్లనున్. 89

క. ఎమ్ములుదక్కఁగ నొక్కటి
నెమ్మేనం గానరాదు నిలువెల్ల జెదల్
గ్రమ్మెను మెచ్చితిఁ వాల్మికిఁ
గొమ్మాయిదె కోర్కులిత్తుఁ గూరిమి కుఱ్ఱా. 90

క. అని తనకమండలంబున
నునిచిన తెలినీరు మీఁద నొకయించుక చ
ల్లిన నెప్పటిమైజిగితోఁ
గనుపట్టియచటు వెలువడి కడునర్మిలితోన్. 91

మ. పెనులిబ్బిం గనుఁగొన్న పేదపగిదిం బెల్లుబ్బి కేల్దోయి మో
డ్చినిరాబారి కడానిబొజ్జగల జేజేమిన్న నగ్గించి యి
ట్లనియెం గూరిమిమీఱ నియ్యఁగదవయ్యా వేఁడెదన్నిమ్ముఁ జి
క్కనిబల్మిన్ దెసమేలుమేలుఁ బెనుగొక్కెంబుండుబండాలమున్. 92

చ. పనిగ సతమ్ము మిమ్మొక నెపమ్మున నెమ్మది నెమ్మి నమ్మినం
గనికరమూని వాని ముడికానిని నైనను గాతురన్న ము
మ్మనుమని నన్ను మిన్నకయ మన్ననఁ దిన్ననఁజేయు టబ్రమే
యనవుడు నన్ని నీవడిగినట్టు లొసంగితినంచు వెండియున్. 93

క. మెండుపరికించి నేర్పున
దండిమగని వల్లెత్రాడు తాల్పరినిజమున్
గొండలపిండులచెక్కులు
చెండంగలవేల్పుతేనిఁ జేవదలిర్పన్. 94

క. పొడమించి వారివరుసగఁ
బడమరదక్కినము తూర్పువై పులకు న్మొ
న్నెడయలనుగాఁగఁ జేసియుఁ
గడమకడనఁ గెవ్వఁడేలఁగలఁడనియుండన్. 95

గీ. తగినవాఁడవు దొరకితి తలఁపనేఁడు
నాదుమదినంత యంతయునడచెసిపుడు
గట్టువిల్కానితోఁ జెల్మికదలకుండు
పుష్పకంబనుత్తేరిది పుచ్చుకొమ్ము. 96

చ. చలువయు వెట్టయున్ వలయుచందముల న్నమకూర్చు ముజ్జగం
బులు దిరుగంగ నింగిపయిఁ బోవఁగవచ్చును దీనినెక్కి యు
క్కొలఁదులు తెల్పఁజెల్ప మఱిక్రొత్త లొసంగితి నీకు నింక జ
క్కులు కొలువంగ నీకొలువుకూటములోఁ గడుఁబేర్మిఁగాంచుమా.
వ. అని యొసంగి మఱియును. 98

క. కనికరమునఁ గనికరమును
మనుమని మనుమని యటు పలుమాఱును దీవిం
చినలువ యిచ్చను జనియెం
దనమనికికి నార మంచితనమని పొడగన్. 99

ఉ. అంచవాలుమాయిజోదు చనినంతటఁ దండ్రిని జేరఁబోయి లో
నుంచినకూర్మి మ్రొక్కులిడి యుబ్బుచు లిబ్బులఱేఁడు కాంచి దీ
వించినతండ్రిఁజూచి తమరిచ్చిన యానతి నల్వఁ గొల్చి మీ
పంచినమెప్పులం బడసివచ్చియు నొక్కటి వేఁడ నోడితిన్. 100

క. పెఱవారెవ్వారలకుం
దఱియంగాఁ దగముకానితా వొక్కటి నే
నెఱి నుండుటకున్ వేఁడఁగఁ
మఱచితిఁ జోటొండుచూపి మన్నింపఁగదే. 101

క. అన ననుఁగుఁబట్టి మొగము
ల్లనఁగని కడుబుజ్జగించి లలినాతఁడిదం
గనికర మిగురొత్తంగా
వినిపించెద నిలువనెలవు వినుమని పలికెన్. 102

గీ. ఉప్పరం బంటుతరఁగలయొప్పుతోడ
బిలువరతనంపుగుంపుల పెంపుతోడ
జడుపెఱుంగని గొప్ప మొసళ్ళతోడ
నుప్పుసీటిసంద్రము కరంబొప్పునందు. 103

ఉ. జాలులయందు నందములచాలగు వేలుపుటేటి దీటునం
గ్రాలెడుతావిప్రోవులను గమ్మనికస్తురి తావికై వడిన్
జేలలలోనఁ జీనిపనిచీరతెఱంగునఁ బూల జాపిపూ
ప్రోలిక లంక పొంకమునఁ బొల్పగుదీవుల మేలుబంతియై. 104

సీ. పలుకోటకొమ్మల మలఁచినసింగముల్
దెసయేనుఁగులనెల్ల దిగులుపఱుప
నగరియుప్పరిగలమగటాలజగడాలు
విన్నేటిసీటితో వియ్యమంద
పీటసీటుగఁ గ్రాలువెలిడాలుగమిగాలి
వేల్పు జంటలకును వేడ్కలొసఁగ
విరిదోఁట నెత్తావి విన్నంటివేల్పు ప్రమాఁ
కులకెల్ల గొల్లగా వలపులియ్య

గలికెపడగంపుసోరణగండ్లు రేలు
త్రోవలవిందున కేగంగఁ ద్రోవనూప
వీడు త్రోలివేల్పుగములకై విశ్వకర్మ
లంకయనుపేరఁజేసె నాలంకయందు. 105

క. వెన్నునికి వెఱచి పాఱిరి
మున్నట నున్నట్టివారు మున్నను నిపుడా
సన్నయఱింగితి గావున
నన్నా నీవేగియుండు మచ్చట నెమ్మిన్. 106

క. క్రిందిజగమ్మున నిలిచిరి
యందలి రేద్రిమ్మరిండ్లు నచ్చట నీ కే
త్రొందరయుఁ గలుగనేరదు
పందడిచూపంగ లేరు జంకక పగరున్. 107

చ. అని సెలవియ్య నప్పలుకు లాదలఁ దాల్చికుబేరుఁ డప్పుడే
చనిచని లంకఁ జేరి పలుచందములం దను గారవంబుతో
ననయము వేల్పుపిండు గొనియాడఁగ నేలుచునుండ పుష్పకం
బొనరఁగ నెక్కివచ్చి కనుచుండును నిచ్చలుఁ దల్లిదండ్రులన్. 108

క. అని రారాజు తెఱంగిటు
వినిపింపఁగ రాముఁడలరి వింతగ మదిఁ దోఁ
చిన నచ్చెరువంది యగ
స్త్యునిఁగని యిట్లనియె వేడ్క దుడుకొనరింపన్. 109

ఉ. ఓజడదారిరాయ యిపుడుల్లము పెల్లుడుకం దొడంగె రా
రాజుకు మున్నులంకను దిరంబుగఁ గైకొని సోఁకుమూఁక లెం
తేజిగిమీఱ నేలునటులీ రిటుపల్కుట విన్ననుండి, నే
నీజగమందు రక్కసులనెల్ల బులస్త్యుకొలంబు వారిఁగన్. 110

ఉ. వింనుముందు, వెండి యొకవింతగ రావణుకన్న మున్ను లం
కందగఁ జెక్కరక్కసులు గ్రాలిరంటిరి వారివేళ్ళ నా
యందఱివంగడంబు మును పాకటివేల్పున కోడి డాఁగుటల్
సందియమాఱఁ దెల్పఁగదె సాఁగిలి మ్రొక్కెదనీకు నావ్రతున్. 111

పంచచామరము.

అగస్త్యుఁడంత జెల్వుగుల్క సందమొల్కు పల్కులం
బొగడ్తఁజేసి వాసి రామువోము గోము మీఱఁగా
జగాపిగార పోరచూపు జాలువాఱఁ జూచి డం
బుగా నెలుంగు కంగుమంచు మ్రోఁగ వేగనిట్లనున్. 112

మ. తొలుత న్వెన్నునిబొడ్డుదమ్మి నెలమిం దొల్వేల్పు తాఁబుట్టి యు
వ్వల మున్నీరొనరించి దానిఁ గొని కాపాడంగ మేదాల్పులం
గలిగింపం దరువాత వారలతనిన్ సంతోస మారంగ వా
వలనం గల్గినకర్జ మేమి వినిపింపం జెల్లు నా నాతఁడున్. 113

క. మిమ్మొందఱఁ గలిగించితి
నిమ్ములు నిన్నీరుప్రోవ నిప్పుడ చని మీ
రెమ్మెకులమమ్మ దలఁపుచు
నెమ్మెయిఁ గాచెదరొ చూతమిందఱిబలముల్. 114

క. అనిపనిచిన వల్లెయని
పనివిని మున్నీరు గాచుపని పూని కడుం
గనుకలిగియుండి యాఁకలి
గొనిడప్పికి నిలువలేక క్రోలుద మనుచున్. 115

క. తలపోసి యంతఁబొంతను
నలుమోముల వేల్పుఁ గాంచి నక్కుచుఁ దమలో
వెలవెలఁబాఱుచు మిక్కిలి
యలసియు నీరానఁగొంకి యడఁకువతోఁపన్. 116

క. సాకెదమని యొకకొందఱు
మైకొనిరిఁక మెక్కెదమని మఱికొందఱు పె
ల్లాఁకలి కోర్వక పలికిరి
యాకొని నెత్తమ్మిచూలి యుల్లంబలరన్. 117

క. మెక్కెదమనువారందఱు
జక్కులును బరాకులేక సాకెదమనువా
రక్కజముగ సోఁకుడులును
నిక్కముగా నౌదురంచు నెట్టనఁబలికెన్. 118

గీ. పెక్కురమ్మాడ్కి జక్కులురక్కసులును
బొడమిపుడమినిబోఁగడికనడసిరడరి
వారిలోపలనెంతయు వాసికనిరి
హేతియుఁబ్రహేతియు ననంగ నిరువురండు. 119

క. నెమ్మదిఁబ్రహేతిముద్దుల
గుమ్మలకూటములు రోసి కోర్కుల నెల్లం
ద్రమ్మి తెగఁగోసి మిక్కిలి
ముమ్మర మగునీసు వాసి పొలుపుగనుండెన్. 120

ఉ. రెండవనిబ్బరంపురెయిద్రిమ్మరి తేఁడలహేతి దండిమై
పెండిలి యయ్యె నొయ్య భయపేరిటిముద్దులగుమ్మఁ గొమ్మరే
యొండను నవ్వు నవ్వు పసనింపగు దానిని నల్వయానతిన్
వెండియు డెందమందు మగబిడ్డలకై గలకూర్మి పేరిమిన్. 121

క. ఆయిరువురకుం బుట్టెను
దీయనివిల్కానిత్రోడ దీటై యని వెన్
దీయని విద్యుత్కేశుఁడు
సోయగమున కింతు లెల్ల, సొగయుచునుండన్. 122

గీ. తల్లిదండ్రులకన్నులు చల్లఁబడఁగ
విద్దెములు చేసె గొన్నాళ్ళు వెనుకవెనుకఁ
దప్పటడుగులు పెట్టుచుఁ దడవు నడచెఁ
బిదప జిగిబిలిగలుకులఁ బిలువనేర్చె. 123

క. అట్టుముద్దులు గురియుచు నలరఁ జిన్ని
తనము మెల్లనజాతిజవ్వనము మొలిచెఁ
జిన్నపాయంపుమేనికి వన్నెయొసఁగి
కుందనంబును నెత్తావిపొందినట్లు. 124

గీ. వెడఁదకొమ్మన నొకవింతవీఁకయొదవె
నగుమొగంబున నొకవింతజిగిదొలంకె
మీఁపకట్టున నొకవింతమిసిమిత్రోఁచె
హేంతిపట్టికి జవ్వనమింపు మెఱయ. 125

క. అప్పగిదిముద్దుకొమరుని
యొప్పునకుం దగినయట్టియొయ్యారిని దాఁ
దప్పక పెండిలిసేయఁగ
నప్పుడుతలపోసి హేంతియందఱు మెచ్చన్. 126

సీ. కవజక్కవలఁబోలి తోవపెక్కువలనేలి
చన్నులు కన్నులుచెన్నుమీఱ
జిగిహొన్నువలెమించి తగమిన్నుఁదులకించి
మేనును గౌనును జానుమీఱ
సిరులసొంపునుమీఱి తరగగుంపును దూఱి
కురులును దరులును గొమరుమీఱ
నరఁటాకుఁగని నవ్వి మరుబాకులను రువ్వి
వీపునుజూపును వింతమీఱఁ

జిలుకపలుకులుఁ జెలువంబు గులుకుచెవులుఁ
నళుకుతొడలును నొయ్యార మొలుకునడలు
మొలకనగవును జిగిమోవి గలిగి యలరు
వెలఁది సంధ్యకూఁతును దెచ్చి పెండ్లిచేసె. 127

శా. ఆవాల్గంటియు మున్ను విన్నసిగదయ్యంబు న్మది న్నియ్యముల్
దైవారన్ వినువాఁక పెండ్లియగుచందానందగం బెండ్లియై
వేవేగం దొలిచూలు దాల్చి కొమరున్ వేకొండుచోఁ గాంచి యా
క్రేవం గవ్వపుఁగొండదండ నిడి యేగెం బెన్మిటిం గూడగన్. 128

గీ. తగుదు రెంతటిపనికైన నదగవుఁదలఁప
రించుకయుబొంకఁగొంకరుమంచివాని
దలఁపుపడిరేనియేమైనఁగలయజూతు
రహహయెంతటిజెంతలియ్యాఁడువారు. 129

క. పసిపాపఁ డేడ్వఁజొచ్చెను
దెస లెల్లనుమాఱుమ్రోయ దిగ్గనమెకముల్
వెసనులికి లేచి వెఱపున
మసలకనలు దెసలఁబాఱ మఱిమఱియచటన్. 130

వ. అప్పుడు. 131

సీ. మొనలకైదువుతోడ మురిపంపుటిరిగుంపు
మఱపింపుకత్తుకయొఱపుతోడ
తలవాఁక జిగితోడఁ దెలిమబ్బు వెలిఁద్రొబ్బు
తెలిగిబ్బతత్తడిపాలుపుతోడ
పాపపేరులతోడఁ బగడాలజగడాల
నగఁజాలుజడల సోయగముతోడ
పునుకపళ్ళెముతోడ మినుముట్టఁ గనుపట్టు
పెనుగట్టు వింటియొప్పిదముతోడ

చిన్నిక్రొన్నెలవెన్నెల చెన్నుతోడఁ
బేసికన్నులచిన్నెలవాసితోడ
గట్టుదొరపట్టితోఁ గూడి గట్టువిల్తుఁ
డపుడు తఱిగట్టుదరికి వయ్యాళివెడలె. 132

గీ. మింట విచ్చేసి యచ్చేసికంటివేల్పు
చెంత నొకవింతరొదయింతచెవులుసోఁక
నిలిచి యాలించి గాలించి నిసువునొకని
ప్రేమాలఁదిలకించిపరికించిజాలిగాంచి. 133

మ. కదియంబోవుచు నున్నవేళ మలరాగారాబపుంబట్టి ప
య్యెదకొంగించుక యొరజాఱ వలచే నిట్టట్టుగా నొత్తుచున్
మదిలో నక్కటికంబు పిక్కటిలఁ గానవ్వచ్చి యాబిడ్డయం
గద మాన్పందగు నంచుఁ బల్కుటయు నాక్రాల్గంటిపైఁ గూరిమిన్.

క. జవరాలిజాలిమాటలు
జవదాఁటక చావులేక చనుబ్రతుకు దెసల్
బవరముల గెల్చుబలిమియు
దివిఁద్రిమ్మరువీడుఁ దల్లిదిను సగునీడున్. 135

గీ. ఒసఁగి యేనుమోములసామి యూరకున్నఁ
గాంచిరాణియు నెనలేనికనికరమున
జవ్వనంబును బీరంబుఁజక్కఁదనముఁ
గలిగియప్పుడయొప్పఁగ గారవించె. 136

క. దేవరయును దేవేరియుఁ
గావలసినకోర్కెలెల్ల గారాబముతో
దీవించి వేఁడలేఁడని
వేవేగ నొసంగబిడ్డ వేడుకఁ జెందెన్. 137

గీ. అడవిఁగని పాఱవై చినవైన బ్రతుకుఁ
దల్లికడుపుచల్లయ్యొకింత తగ్గదేని
యింటబంగరుకొట్లలోఁ బడినవైనఁ
జచ్చుఁదల్లికడుపుచల్ల చాలదేని. 138

గీ. అట్లు పసిపాప యప్పుడె యబ్బురముగ
నింపుపరువంబుఁ గైకొని నిలిచి కెలనఁ
జూపనెలదాల్పుఁ గని కూర్మి మ్రొక్కి యతని
చెలువకుజోహారు లొనరించి చేరికొలిచి. 139

ఉ. వారలమానతి న్మిగులవన్నియు వాసియుఁ గాంచి వారిగై
వారము చేసి వీడుకొని వారొనరించి యొసంగినట్టియా
యూరను రక్కసుండు గమునుక్కునఁ గాపుర ముండి తద్దయుఁ
బీరముతోఁ సుకేశుఁ డనుపేరను గారవ మందె నంకులన్. 140

క. ఆతనినోయగముం గని
చేతులగరువంబుఁ జూచి చెలఁగుచు నిటకన్
వే తగగ్రామణి యనువే
ల్పే తెంచి సుకేశుఁ గాంచియెంతయు వేడ్కన్. 141

సీ. అందంపునును జెక్కు లద్దంపుమించులు
మించులు నిద్దంపుమేనిజిగులు
కాటుక పెన్నెరుల్ తేఁటిమొత్తమ్ములు
తమ్ములు తెలివాలుతళుకుఁగనులు
నిండైనచిఱునవ్వు పండువెన్నెలనిగ్గు
నెలనిగ్గుచక్కని నెమ్మొగంబు
వన్నెబంగరుగిండ్లు వలిగబ్బిగుబ్బలు
గుబ్బలుల్ పిఱుఁదులగొనబుహొయలు

చెప్పనొప్పని యప్పొల్తియొప్పిదంబు
నట్టితనకూఁతుఁ జిన్నప్రాయంపుదాని
నందములకెల్ల నందమై యలరుదానిఁ
దేవవతి నాఁగఁ జనుదానిఁ దెచ్చియిచ్చె. 142

క. అరమరలు లేనికూర్మిలఁ
గరమరుదుగఁ గలసి మెలసి కలికియు మగఁడున్
సిరివిరిబోఁడిని వెన్నునిఁ
బురుడింపుచు నరిదినెయ్యమునఁ బెనఁగొనుచున్. 143

గీ. కొన్ని యేఁడులు పోఁడిమినున్నపిదప,
మాల్యవంతుఁడును సుమాలిమాలియనఁగ
బలిమియును లావు బీరంబుఁ గలకొడుకులు
మువ్వురవ్వారిబోఁడికిఁ బుట్టిరెలమి. 144

క. ఆమువ్వురుఁ దండ్రిపలెం
దాము ను బెనుమెప్పులందఁ దపము సొనరింపం
గామదిఁ దలఁచి యిలువెడలి
యామునఁ గవిసి మంచుకొండయండకుఁ గడిమిన్. 145

చ. చనిదిట మారఁ జెట్లనునుచాయల డాయక బట్టబైల నె
క్కొనుపడగాలిఁ గ్రోలి మదిఁ గొంకక యొంటికాలునం
బనుపడ నిల్చిపోల్చి నలువం దమయాదపు డెందమందు వే
డ్కొను దలపోయుచుం దబుసు గాసిలిచేసిరి వారు మువ్వురున్. 146

క. జగములను దబుసు వేఁడిమిఁ
బొగలెగసెను మింటమంట మొత్తము పర్వెన్
వగలంబొగిలిరి వేల్పులు
బెగడొందెను జాలవేల్పుఁబెద్దయు మదిలోన్. 147

ఉ. దానికిఁ దాళఁజాలక వెతందెఱఁగంటులు దద్దరిల్లి లో
నూనిననివ్వెఱంగఁదలి యుండనిబాడిరి తమ్మిచూలికిం
బానలు దీఱ రక్కసులఁగ్రల్లదనంబులు విన్నవింపఁగాఁ
బూని కడంకఁదోఁప నటమున్న యతండును నిండువేడుకన్. 148

ఉ. అంచవహామమాయి నెక్కి తెలియందపు టెక్కలడాలు నల్గడల్
ముంచుకొనంగఁ గెంపుజిగు ముక్కుమెఱుంగులు చౌకళించి మే
ల్గాంచిన జాళువాబొమిడికంబులడంబగు మానికంపుఁగ్రొ
మ్మించులతోడ మాఱ్మలయ మింటనువచ్చెను వారిజజుఁడున్. 149

క. విచ్చేసి వారిమేనులు
మచ్చికతోఁ గేలనిమిరి మదితాల్మికి లో
నచ్చెరువందుచు దీవన
లిచ్చి కనికరంబు దోఁపనిట్లని పలికెన్. 150

ఉ. రక్కసులార చేరువకు రండిదె వచ్చితి మిమ్ముఁ జేరఁగా
నిక్కరణి న్వెతల్ గుడువ నేటికి మీకిఁక లెండు తాల్మికి
న్నిక్కముగాఁగ డెందమున నేఁగడు మెచ్చితి మీపయిం గరం
బక్కటికంబు పుట్టె నిపు డారసి కోరుఁడు కోర్కు లిచ్చెదన్. 151

క. అని పలుకులవెలఁదుక చ
క్కనిమేలిమియుం దెరవళిఁ గైకొననియొలుం
గున, దొలివేల్పావతి యి
చ్చిన విని వడి లేచి వచ్చి చిడిముడితోడన్. 152

చ. అలవలకేల నల్వ యొడ లంటినవెంటనె యట్టె తొంటియా
యలసట వాసివాసిగని యారెయిద్రిమ్మరు లొక్కయుమ్మడిం
బలుకులఁ దేనియల్ దొలుకఁబాఱఁగఁ గేల్గవ దోయిలించి యి
చ్చలఁదొలివేలుపుఁ బొగడఁజాఁగిరి కన్నులు విచ్చి యచ్చటన్. 153

క. జగములఁ బుట్టింపను మతి
నెగడింపను గినుకఁ బూని నీల్గింపను మే
లుగఁ దగు నెఱప్రోడవు నీ
వెగదా నెత్తమ్మిచూలి వేలుపుఁ బెద్దా. 154

క. జత లేనిసిరులఁ దగి నీ
మతకము తెలియంగ లేక మైదాల్పు లోకుల్
సతమని నమ్మి కరమ్మును
వెతలం బడి పొరలు చుండ్రు వెఱ్ఱులపగిదిన్. 155

శా. ఎందు న్నీసరి పోల్పఁగాఁ దగినవేల్పెన్నంగ నొండొక్కఁ డీ
యందంబైన జగంబులోపలఁ గలండా పేర్కొన న్నెమ్మి మి
మ్మిం దోరంబుగ నమ్మి వేఁడుకొనుటల్ ముంగొంగుబంగారుగా
ముందు న్వింకుము నేఁడు మా కది నిజంబుం జేసి తీ వియ్యెడన్.

క. మాపైఁ గనికర మొలయఁగ
మాపూన్కికి మెచ్చి మమ్ము మన్నింపంగా
నోపెదవేని న్వేఁడెద
మాపయి మామేలును దమయక్కటికంబున్. 157

క. కడదొరలను బవరంబుల
నొడువం గలబల్మి మాకు నొండొరులపయిన్
విడువనికూర్మియు సిరులును
నెడపక వేలుపులవేల్ప యిప్పింపగదే. 158

గీ. అనుచుఁ గొనియాడి తను వేఁడఁ గనికరమునఁ
గోరికలనిచ్చి లలిమెచ్చికూర్మి పేర్మిఁ

దడవు దీవించి మించినతమ్మిచూలి
కదలివినుదారిఁ దనవారిఁగలసిచనియె. 159

వ. అంత. 160

ఉ. వేలుపుఁబెద్ద తా నిడినవిప్పగు మెప్పులనొప్పుమీఱి త
త్వేలుపుఁబెద్ద లొక్కమొగి విక్కుచు నిక్కుచుఁ గండక్రొవ్వనన్
వేలుపుఁబెద్దలం గెలిచి వీరిని వారినిబోలె వారలన్
గేలి యొనర్చి పేర్చి పెనుకిన్కనుయిం జెఱఁ బెట్టి రింతులన్. 161

క. పొడిచిరి పెక్కుర జక్కుల,
జడదారులఁ గాళ్ళ రాచి చమరిరి నేలన్
గడతేర్చిరి చిలువల నొక,
కడకుం బెచ్చి పొగ రెచ్చి కలఁచిరి జగముల్.

గీ. వారు పెట్టెడిరట్టడిఁ బడఁగ లేక
యిండ్లు వాంకిండ్లు విడనాడి మొదల నోడి
కన్నకన్నవారల నెల్లఁ గాళ్ళు వట్టి
వట్టియనదలై వేల్పులు కట్టువడిరి. 163

సీ. ఒకవాడమొకమోడకొకవేల్పుఁ గొట్టింతు
రొకవంకజముతెంకనొడిసిచఱతు
రొకచక్కిపొగరెక్కియొడయండ్లఁబట్టింతు
రొకచాయఁదొగదాయనొదుగనడఁతు
రొకదారిజడదారి నొఱపులఁబెట్టింతు
రొకచెంతనెలనింతయుక్కడంతు
రొకమేల వినుచూలి నూరక కట్టింతు
రొకదండ జము నుండ నోలిఁ బంతు

రొక్కయిక్కను జక్కుల యుద్బంతు
రొక్కగీమునఁ బాముల నుక్కు మిగులఁ
బెక్కులాగుల సేగులఁ బెట్టుచుండ్రు
రక్కసులు ముప్పురును గ్రొవ్వు పిక్కటిలఁగ. 164

సీ. నీళ్ళుమోవఁగలోఁగె నెఱిమాలి నెల దాల్పు
కనుమూయుటఁడిగె పేగనుల వేల్పు
బిచ్చకానిని జేరె వచ్చి జక్కులతేఁడు
పిచ్చుకుంటై పోయె బెగడి జముఁడు
రేలు ద్రిమ్మరుచుండెఁ దూఱిరక్కసుఁ డెప్డు
వంటయిండ్ల నడంగెవచ్చిచిచ్చు
వంకల కిరవయ్యె వలగొని నీటితేఁ
డొకమూలఁ బడియుండె నొకఁడు గాలి
తక్కగలవేల్పు లెల్లను దల్లడమున
బయలు పట్టి తురుగునట్టిబ్రతుకు గనుటె
కాక నోరి కోరె మొకింత లేక మనిరి
యకట చెప్పెడి దేమి యాయాగడంబు. 165

క. ఇక్కరణి న్మువ్వురు వా
రక్కసులుం గండకావరంబున నేరిన్
లెక్క మొనర్పక యుండిరి
యెక్కడఁ గనుఁగొన్నను దమ రె యగుచుఁ గడిమిన్. 166

గీ. అంత నొకనాఁడు వేడుక లనఁగి పెనఁగఁ
బెద్దకొలువుండి ముప్పురుఁ బెం పెసంగ
వేల్పుటగసాలిఁ బిలిపించి వెరవుమీఱ
వలయుమరియాద లొనరించి వాని కనిరి. 167

క. ఓయీ వేల్పుల కందఱు,
కాయాకొలఁదుల నెదఱింగియందపు నెలవుల్
సేయుటవలనను నీవే,
రేయెడలను వన్నెకెక్కి యెంతయు నలమెన్. 168

ఉ. కావున మాకునుం బసిఁడిగట్టున నైనను వెండికొండపై
నావల నైన మంచుమల నైనను గవ్వపుఁగొండ నైననున్
నీవెర వంతయు న్నెఱసి నిక్కపుఁజక్కనిమానికంబులన్
తీవి యెలర్పఁ గూర్చి యిపుడే యొడగూర్పుము పైఁడి మేడలన్.

క. అనినన్ జేతులు మోడిచి
యను వొప్పఁగ వారిమోములందునె చూడ్కుల్
పెనఁచి యడంకువతో నిటు
పనితెల్పఁ గెఱిగించె నతఁడు వారలతోడన్ 170

గీ. జమునికడయందుఁ బొలుపొందుసంద్రమందు
నెసఁగునొకదీవి పెనుతీవియెల్ల మెఱసి
పుడమియందును నెందును బుట్టరాని
మానికమ్ముల నిమ్ముల మలఁచి తెచ్చి. 171

ఉ. వేలుపుతేనియానతిని వింతగఁ జేసితి నీఁడొకండు త్రా
ల్వేలుపులార మున్ను గడువేడ్కఁ ద్రికూటముఁ నాఁగఁ బేరునన్
గ్రాలెడుకొండకొమ్మునను నా తెలివెల్లను వెల్లడింపఁగా
నేలినవారి కయ్యదియె యిమ్మగుసిమ్మని నాకుఁ దోఁచెడున్. 172

సీ. ఏవీటికిని నాల్గుకేవ్రలందును జుట్టి
సంద్ర మగడ్తయై చవులు నింపు
నేయూరిపెనుకోటఁ బాయక బురుజుల
నేపున వేల్పులు కాపు గాతు

రేప్రోల వరువాత నెల్లరనిద్దుర
మిన్నేటియలుకడు మేలుకొలుపు
నెందలిరతనాలు చింది పడఁ గడలి
తావలంబయ్యె రతనములకును
నెచటియెలఁదోఁటగమి తావి యొసఁగి మింట
వేల్పుటాండ్రకు మగలకు వేడ్క లొసఁగు
నెచటిపయ్యెర లడతేరి యెల్లయప్పుడు
చెల్వలయుఁ జెల్వలయు సెజ్జ చెమటలార్చు 173

వ. అట్టిసింగారంబులకుం బుట్టినిల్లును గలుములకాఁటపట్టును బీదసాదల కుంబసిండి కోటారును బెద్దలకుం బట్టుగొమ్మయు నయి లంక చె న్నలరుచున్నది. 174

ఉ. లంకను జేరి మారుర నలంతులఁ బాఱఁగఁదోలి నెయ్యరం
బొంకముగాఁగఁ గల్మొ లిడి ప్రోచుచు మీసరిసాటివారిలో
నంకిలిలేఁగొప్పతన మందఁగలారని వేల్పువడ్రవాఁ
డింకను గొన్నిపల్కు లెద కింపుగ మంతనమందుఁ బల్కెనన్. 175

ఉ. సంతస మంది మందటను సామి హసాదని పెద్దయెల్లునన్
వింతగఁ బల్కుచుం బసిఁడిబెత్తములెత్తి యదల్చి మూఁక నం
తంతఁ దొలంగఁదోలి పణిహారులు సూరెల దారి చేయఁగాఁ
జెంతలఁ జేరి యొండొరులఁ జీరుచు దండులు వెంబడింపఁగన్. 176

గీ. కదలి పొలదిండ్లయార్పు లాకసము ముట్ట
లంకఁ జేరిరి మువురుఁ గలంకఁదేఱి
యంత వారలబీరంబు నలవు బలిమి
యరసి నర్మదయు నెడునచ్చర నెలంత. 177

క. పుప్పిలుతుని వాలారుం
గ్రొవ్విరితూపులొ యనంగఁ గొమరారెడు లే
జవ్వనులం దనకూఁతుల
మువ్వురఁ గొనివచ్చి యిచ్చె ముగురికినెలమిన్. 178

వ. అందు మాల్యవంతుండు సుందరి యనుతనవెలందియందు వజ్రముష్టియు విరూపాక్షుండును దుర్ముఖుండును సుప్తఘ్నుండును యజ్ఞకోపుండును నున్మత్తుండును మత్తుండును ననునేడుగురుకొడుకులను నిల యనుకూఁతుం గనియె సుమాలికిఁ గేతుమతి యనుప్రోయాలి యందుఁ బ్రహస్తుండును నకంపనుండును వికటుండును శకటముఖుండును ధూమ్రాక్షుండును దండుండును సుపార్శ్వుండును సంహ్రాదియుఁ బ్రఘసుండును భాసకర్ణుండునునను పదుగురుకొడుకులును బకయుఁ బుష్పోత్కటయుఁ గైకసియుఁ గుంభినసయు నను నలువురుకూఁతులునుం గలిగిరి మాలివసుధ యనుతనవాల్గంటియందు నలుండును హరుండును సంపాతియు నను నలుగురుకొమాళ్ళఁ గాంచె వారె విభీషణునకుం బ్రెగ్గడలై వెగ్గలంపు టగ్గలికలం జెన్నుమీఱిరి.

గీ. ఇట్లు తామరతంపరై యేపుఁ జెంది
జగములం దెందు నెవ్వారి సరకుగొనక
విఱ్ఱవీఁగుచుఁ గొడుకుల వెంటఁ గొనుచు
ముజ్జగంబులుఁ గలఁచి రాపాలసుదిండ్లు. 180

ఉ. వారలరాయిడి న్నొగిలి వాంచినవెల్లలనిమోముఁ దమ్ములం
గూరిన నెవ్వగం గదలి కోరిక లీరిక లెత్త వేల్పు లె
వ్వారలఁ జేరువార మిఁక వాసిగ నుండఁగ నెద్దితావిఁకె
వ్వారికి విన్నవింపుదుము వారలయాఱడి యంచు నెంచుచున్. 181

క. ఆరసి కర్జముఁ గని యి
బ్బారిని నలమలవిలుగలవాఁడడఁపంగా
నేరుచు నని పొంగి వడిం
జేరి రొకట వెండికొండచెంగటి కెలమిన్. 182

వ. అటువలె వెండికొండఁ దఱియం జని మేలిమిగద్దెమీఁదన
చ్చోటఁ గొలువుండి వేడుకలఁ జొక్కెడు మిక్కిలికంటిదేవరం
బొటపొలఁ గన్నులం దొరఁగి ముమ్మరమైచను నీటిజాలుతో
నటమటమారఁ గాంచి మది నళ్కుచు నెయ్యముచుం బునంగొనన్.

గీ. ఒదుఁగువాటున నిలుచుండి యొక్క పెట్టఁ
జేతులు మొగిడ్చి జోహారుఁ జేసి నిలిచి
వేల్పు లెకిమీఁదు మున్నుగా వేల్పులెల్ల
నెలుఁగు కుత్తుకఁ దగులంగ నిట్టు లనిరి. 184

గీ. ఏనుమోములవేలుపా యిదె జోహారు
ఆవముగుబ్బలియల్లుఁడ యిదె జోహారు
ఇంచువిలు కానిపగవాఁడ యిదె జోహారు
ఎక్కుడుకనులదేవరా యిదె జోహారు. 185

చ. ఉడుగనికిప్పుత్రోఁ గదలి యొక్కట నెక్కడ గన్నఁదామయై
కడఁక సుకేశుబిడ్డలు జగంబుల నేపఁగఁ దల్లడిల్లి యి
య్యెడలను ముజ్జగంబులను నేలెడుదేవర వీవటంచు నీ
యడుగులు పట్టి వచ్చితిమియారసి మా మొఱలాలకింప వే. 186

క. కాల్చిరి జన్నపుసాలలు
కూల్చిరి దేవళము లెల్లగోడలతోడన్
బీల్చిరి మానిసినెత్తురు
రాల్చిరి మేలికలతలలు రవణంబులతోడన్. 187

ఉ. ఏమనిచెప్పువార మలయీర స మప్పాలదిండ్లబారిచే
నేమును బోవఁగా నెఱతు మెక్కుడు జన్నపుఁబొల్లు గ్రైకొనం
దాముగ గుట్టుమీఱి జడదారులు మానిరిముక్కుపట్టఁగన్
బ్రేముడి బొట్టియల్ విడిచిపెట్టిరి యొజ్జలమోము చూడఁగన్. 188

క. మేమే జేజేదొరలము,
మేమే జగములనునెల్ల మిన్నల మనుచున్
బాము లిడం దొరఁకొని రా,
బాములు కడ తేర్చి మమ్ము బ్రతికింపఁగదే. 189

క. అని మ్రొక్కి తన్ను వేఁడిన
వినుసిగరాయండు వారి విన్నప మెల్లన్
విని కనికర మెదఁ బొదలఁగఁ
గనుఁగొనలం బిన్ననవ్వు గదురఁగఁ బలికెన్. 190

క. మీముందటి నిజ మాడెద
మోమోటలు కట్టిపెట్టి మొఱకుల వారిన్
నే మడఁపనోప వెన్నని
సేమంబునఁ గానఁబొందుఁ జేకుఱుఁ గోర్కుల్. 191

క. వెన్నుఁడు దక్కఁగ నొండొకఁ
డెన్నఁడు గెడపంగఁజాలఁ డీరక్కసులం
దిన్నఁగ మీ రిపు డాతం
డున్నెడ కరుగుండు నెమ్మి యుల్లము గదురన్. 192

క. ఆకైవడి మలవిల్తుఁడు
మూఁకగఁ దను వేఁడు వేల్పులతో ననఁగా
నేకడఁ గొలిచెడివారలఁ
జేకొని కాపాడ మీకె చెల్లు నటంచున్. 193

క. ముక్కంటి స్వేడ్కాని వా
రొక్కట వెలిగొండ వెడలి యొండొరుఁ గనుమన్
మిక్కిలి పొంగి చెలంగెడి
యక్కడిపాల్కడలిఁ గాంచి యం దొకదీవిన్. 194

క. కడలికిఁ దోడవనఁగాఁ గడు
బెడఁగగునొకవీడు చూచి పెంపుగ దానిన్
దడ వబ్బురపడి చూచుచు
నెడనెడఁ గలవింత లెల్ల నేర్పడఁ దమలోన్. 195

గీ. చెప్పి మెచ్చుచు నొక్కింతసేపు మసలి
యొక్కచక్కని జక్కనిచెక్కడంపుఁ
బనులఁ జెలువొందుపొగడొందుపసిఁడికోటఁ
గనులవిందుగఁ బొడగాంచి కనఁ దలంచి. 196

గీ. చొచ్చి యచ్చంపుఁబచ్చలమెచ్చు హెచ్చు
కట్టడపుఁద్రోవ క్రేవల బిట్టు నడిచి
యవల మగరాలజిగి చాల నలమ నలరు
తళుకు లీనెడు వెన్నుని నెలవుచేరి. 197

సీ. పొంగారుబంగారురంగుకంబంబులఁ
జలువచప్పరములు చెలువునింప
సరిమించుసిరిగంచు వరిగంచుటందంపుఁ
జందువామినమిసల్ చౌకళింప
వగఁద్రాలుపగడాల మొగరాలగుంపుల
కెంపులు క్రేవలఁ గ్రేళ్ళుదాఁట
మెఱుఁగూని దొరలేని నెఱమానికపుఁబెద్ద
గద్దెలనిగ్గులు గండుమిగుల

వెన్నుఁ బొడగనుకడఁకను వేడు కార
నిలువఁ దీఱక యూఱక నెట్టికొనుచు
వెంటఁ దనవారిఁ గొని పాఱువేల్పు ఱేఁడు
వేయికన్నులు చాలక వెఱఁగు చెందె. 198

చ. జిగిమగఱాలనేలసయిఁ జెట్టులుఁ బట్టులుఁ దీర్చి కూర్చి సొం
పుగ నమరించినట్టి నునుఁబుత్తడికంబపుఁగుంపుమీఁదిపెన్
బగడఁపుదూలపుంగములపై దెలిముత్తెపుఁ బాలగచ్చుతో
నిగనిగలాడఁ బోఁడిమిని నెట్టనఁగట్టిన మేడలోపలన్. 199

క. వెన్నుం డుండుట విని చని
క్రన్ననఁ జూడఁ దఱియానొ కాదో యని యం
తన్నిలిచి మొక్కి కలికిని
విన్నప మొనరింపు మనుచు వేఁడిరి వేల్పుల్. 200

వ. అదియునుం జని. 201

సీ. మొనపంటఁగొన యంటికొను మంచు లచ్చికిఁ
దెలియాకుమడుపు లందిచ్చువాని
సిరిగంద మదె చించెఁ జేర రమ్మని నేల
గుబ్బెతచెక్కిలి గొట్టువాని
తనుఁజూచి తఱివేచి చనవొప్పఁ గనుగీటు
సీత్తోఁ జెలువవ్వు నెఱపువాని
నెవరందొ మువ్వురందు హెచ్చుకూరిమి నాకుఁ
జెప్పుకొండని నవ్వి చెలఁగువాని
బచ్చివలపుగ ముచ్చటల్ పలుకువాని
వెన్నుఁ గని మ్రొక్కి వాకిట వేల్పు లెల్ల

సాఖి నిలుచున్నవా రని చనవుకతన
మనవిచేసిన రమ్మను మనుచుఁ బలికె. 202

క. అరుదెమ్మని సెల విచ్చిన
నరిగి సరగను బణిహారు లావేల్పులతోఁ
దారవా రిట మిముఁ దోడ్కొని
యరుదేరఁగ మమ్ముఁబుచ్చి రనుచుం దెలుపన్. 203

గీ. వార లాదటఁ జనుదెంచి వరుసతోడ
వెన్నునకుఁ బెక్కు తెఱఁగుల వేఱువేఱ
మ్రొక్కు లిడి పొగడ్తలు దెసల్ మ్రోయఁ జేసి
విన్నవించిరి తమపడ్డవెతల నిట్లు. 204

చ. పొగరున రక్కసీంద్రుఁ డగమూఁపురుఁ బ్రోవుగఁ గూడి దాడిమై
జగములు గాసిచేసెదరు చావకమానెడుమేను పూనుటన్
మిగులఁగ వంతల న్నొగిలి మీకడ కిట్లరుదేరఁగల్గె మా
మొగు లడఁగించి ప్రోవఁగదవే యిదె వేఁడెద మెల్లవారమున్. 205

సీ. నెఱమగంటిమి మాని నీళ్ళుమోవఁగ లోఁగి
వెలియైనమలవిల్తు బలిమియెంత
మాఱువేసము పూని మఱి సీరుమాఱిన
పచ్చదుప్పటివానిబలిమియెంత
ముదిమదివోయి ప్రాఁజదువులు గోల్పడి
తలకొట్టఁబడుతాతబలిమియెంత
గోడపలుపడి కోడికూఁతకూసినయట్టి
యలవేల్పురాయని బలిమియెంత
నిదురయన్నది యెన్నఁడు వదలి తిరుగు
లాఁతి తెఱగంటిదంటలచేతిబలిమి

యెంచ నరియెంత మా కని యించుకైన
తెక్కసేయరు మాటలు పెక్కులేల. 206

గీ. ఏమిచెప్పుకొనుదుము మాసామి నీకు
వారు పఱచెదునో అపుల వసరునప్పు
డెంకొ దోసంబుచేయువా రిట్టివేల్పు
బ్రదుకఁ జెందుదురనియెంతుమెదలలోన. 207

గీ. ఇచ్చ మానుసులను జూడ ముచ్చటగును,
జావుగలిగినవారలచంద మరసి
నేలొకొ తాను గలిగింపఁ జాలఁడయ్యెఁ
జావు మాకని నలువపై నేవవొడము. 208

సీ. బెడిదంబుగాఁ గేల నడిదంబు పూనిన
మేటిరక్కసులకుఁ జేటు మూఁడు
బిగివింటి నొగినంటి తెగనిండఁ దీసిన
బిరుసుదండుల కేండ్లు వేయు నిండుఁ
బులుఁగుల తడి నెక్కి పోలికలనికి నేగ
నొప్పనివారలయుసులు లేగు
నెదలోనఁ గన లూని యించుకచూచినఁ
గానివారలపిండు గండడంగు
బటువుకైదువు తనరార దిటముమీఱ,
బంటులను గాచుపని పూని వచ్చితేని
తలఁక కెవ్వాఁడు చివ్వకు నిలుచువాఁడు
జాలమేలను గైగొమ్ము సరగమమ్ము. 209

క. అని విన్నఁదనము తోఁపఁగ,
మనవి యొనర్పంగ వారి మన్ననతోడం
గనుఁగొని వెన్నుం డిట్లని,
కనికరమున నానతిచ్చెఁ గరఁగినమదితోన్. 210

చ. ఎఱుఁగుదుఁ రక్కసు ల్నలువయిచ్చినమెచ్చుల నొప్పుమీఱి పల్
తెఱఁగుల మిమ్ము నొంచుటయుఁ దీఱనిదూఱడి క్రొర్వ్వలేక యం
దఱు మలపెట్టుఁ గొల్చుటయు నన్నన నాతఁడు మిమ్ముఁ బుచ్చె నే
నెఱుఁగుదు వేల్పులార చనుఁ డిండ్లకు వారలరూపు మాపెదన్.

క. అమ్ములవానలు గురియుచు,
నెమ్ములు విఱుగంగ మొత్తియెవ రడ్డయినన్
నమ్మఁడు జముకడ కనిచెద.
నిమ్ములనుండుండు మీర లెల్లరునింకన్. 212

గీ. అట్టికరమును గనికరముట్టిపడెను,
వెన్నుపలుకులు వీనులవిందుగాలుప
నెదలఁ బొదలెడునుదిలల వదలికదలి,
యిమ్ములకు నేగి రిమ్ముల నెల్లవారు. 213

గీ. అట్లుజేజేలు తమయిండ్లకరిగినంత,
నంతయును వేగరులు తెల్ప నాలకించి
మాల్యవంతుఁడుతమ్ములమంతనమునఁ,
బిలువగానంపియొరులకుఁదెలియకుండ. 214

గీ. తగవుదోఁపంగ నిట్లనెఁదమ్ములార,
వినరుగా నేటిప్రొద్దాక వింతవింటి
వెఱచి మొన్న నీనడుమను వేల్పులేమొ,
గట్టువిల్కానియొద్దకు నట్టెయేగి. 215

క. కని వేనవేల తెఱఁగుల,
గనికం మెసఁబుట్ట నోటికసితీఱంగా
మనయాగడంబు లెల్లను,
మనవి యొనర్చుచు నటుపయి మమువీఁబంట్లన్. 216

క. నిలువంగనీయ రెందును,
బలియురు రక్కసులు వారిబారికి మమ్ముం
దొలఁగించి యేలకుండినఁ,
గలరేయొండైన మాకు గాదిలిచుట్టల్. 217

చ. అని మొఱవెట్టఁ జొచ్చిరట యాపయి నొదలయూచి యాతఁడున్
గని కర ముప్పతిల్ల గడకంటనుగన్గొని వారిఁగూల్పఁగా
వినుఁడిదె యున్నరూపు వినిపించెద నోపను నేను వెన్నునిం
గనుఁడతఁడయ్యె నేసి మిముఁగావఁగ జాలినవాఁడు పోఁడిమిన్. 218

గీ. అనుచు నానతియిడెనఁట యాపలుకులు,
చెవిని వేసికొని పసిండిచేలవానిఁ
గానఁగాబోయి మ్రొక్కులు వేనవేలు,
సలిపిపిన్నవించిరఁటపై చందమునను. 219

మత్తకోకిల. అంతటం గరివేల్పు వారలయందుఁ బ్రేముడిమీఱఁగా
నెఁతకై నను నేను గల్గఁగ నేల నొవ్వఁగ మీకిఁకన్
బ్రుంతు రక్కసిజేండ్ల ముప్పురదొడ్డకూపుల వ్రేల్మిడిన్
వంతలేటికిఁ బొండుగీములవంక నందఱు నెమ్మితోన్. 220

క. అనివీడుకొల్ప వెల్వడి,
కనుసైగలు చేసికొంచుఁ గైదండలతోఁ
బెనుసందడి సేయుచు వే,
చనిరఁట యావేల్పులెదల సంతసమారన్. 221

ఉ. వేల్పులపాలివాఁడు కఱివేల్పుతఁ డిచ్చినబాస తప్పునే
తెల్పెదనెట్టులైన నసిదీఱుచు వారలప్రాప్తియెల్లఁ దో
ల్వేల్పులమంచు నెవ్వరినివిక్కుచు లెక్కయొనర్ప కక్కటా
సల్పితిమట్టివాని కెకసక్కెము క్రొవ్వినఁ జేటుమూఁడదే. 222

క. తనబలిమి యెదిరిబలిమియుఁ
గనుఁగొనఁగా లేక త్రుళ్ళిగాఁవరమున నొ
ప్పనివేరము పూనితిమిటు,
మనపౌగరులె యింతచేసె మఱియేమిటికిన్. 223

# అభాగ్యోపాఖ్యానము.

హాస్యప్రబంధము



By

K. VEERESALINGAM

# అభాగ్యోపాఖ్యానము.

## హాస్యప్రబంధము.

క. శ్రీరమణీహృల్లోలా । కారుణ్యలతాలవాల కాంచనచేలా
ఘోరాహవజయశీలా । శ్రీరాజమహేంద్రవరపురీగోపాలా 1

వ. భవదీయకరుణాకటాక్ష వీక్షాసమాసాదిత సరసకవిత్వ పటుత్వంబు
బెంపున నేఁగల్పింపంబూనిన హాస్యరసప్రధానంబగు నభాగ్యోపా
ఖ్యానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 2

క. అడవులలోఁగడునిడుములు
గుడుచుచుధర్మాత్మజుండు కొందలపడఁగన్
వడిఁ బరిహాసకుఁడొకఁడ
య్యెడకనుజనుదెంచి మ్రొక్కి యీకథచెప్పెన్. 3

గీ. వింధ్యధాత్రీధరప్రాంత వంధ్యభూమి
జలములేనట్టియొకపాడు కొలనుదరిని
దండకారణ్యమధ్యంబుఁ దనరఁజేయుఁ
బాపసదనంబు వ్యాఘ్రాఖ్యపట్టణంబు. 4

క. ఆపురము లచ్చియప్పకుఁ
గాపురము జగంబులందుఁ గలపురములలోఁ
గాపురము పాపసమితికి
దాపురము మహాపుర మలదానవతతికిన్. 5

క. అన్నగరంబునఁ గరమ
భ్యున్నతివహియించుకుజనపుంగవకోటి
ల్యోన్నతి కోడుటఁ గాదే
పన్నగకులమెల్లఁజేరెఁ బాతాళంబున్. 6

సీ. కెఁజమూలినింటనె విడియించి దానిచేఁ
దిట్లునుదన్నులుఁ దినెడువారు
తల్లిపోయిననాఁడు దానింటనేయుండి
పనియున్నదిదెవత్తు ననెడివారు
కన్నెఱికముచేయు కార్యంబునకుఁ బూర్వు
లార్జించు మాన్యమ్ములమ్మువారు
భోగకాంతలుగాక పొరుగువారల భార్య
లనుజేరి సౌఖ్యంబుగనెడువారు
విలువసారాయిసీసాలకొలఁదిఁద్రావి
యొడలు దెలియక వీధులఁబడెడువారు
నగుచుమర్యాదలనుగాంతు రనవరతము
బ్రాహ్మణోత్తములాదివ్యపట్టణమున 7

చ. కురుబలముం గనుంగొనుచుఁ గోటితురంగ జవంబుతోడ ను
త్తరుఁ డరదంబుడిగ్గి పురితట్టునఁ బాఱియుఁ గ్రీడిప్రేరణన్
మరలఁగఁ బోరికేగుటకు నవ్వుచునుందురు పోటుబంటులై
పిఱికితనంబునం బురిని బేరువహించినరాజపుంగవుల్. 8

గీ. బియ్యమున వడ్లు బెడ్డలు పెక్కుగలిపి
నేతిలో నంటిపండ్లను నెరయబిసికి
తప్పుతూనికతూచుచుఁ దక్కువగను
గొలుచుచును గోమటులు సొమ్ముఁగూర్చుకొంద్రు. 9

గీ కూటసాక్ష్యంబు బ్రాహ్మణగురులవలన
బాగుగా నేర్చుకొని పాటుపడుటమఱచి
జూదములదొంగతనముల శూరులగుచు
శోభఁగాంతురు పురిలోనశూద్రజనులు. 10

చ. తనపలుముండ్లవాఁడిమిని దప్పక వానవువజ్రమున్ జయిం
ప నతిదృఢంపుమట్టలను మైమఱునొవ్వఁగనేగి ముండ్లచే
ననిఁ గుళిశంబు గెల్చి తనకడ్డగువేల్పులకండలొల్చి తా
నొనరెననంగ బ్రహ్మజెముడొప్పగు నెజ్జిసిఖండ్లగుంపుతోన్ 11

చ. పురిఁ దగుఁ జుట్టునుంగదిసి భూరిభయంకరలీల దట్టమై
పెరిఁగినగచ్చపెః బొదలు పెట్టనికోటగ లోసియాతచాల్
బురుజులుగాఁగ, దాపునను బొల్చినతుమ్మలు పెద్దముండ్లతో
నురియలుదూసి సద్భటులు స్రుక్కక కావలిగాచుతీరుగాః. 12

సీ. మార్దవం బన్యాయమార్గవాక్కులయంద
సాహసంబాహారసమయమంద
ప్రజ్ఞయంతయును దంభములుకొట్టుట యంద
[illegible] బంటుతనము వంటయింటిదరుంద
మితభాషణము శాస్త్రతతులచర్చలయంద
కలిమి పురంధ్రులకౌనులంద
నిలుకడ నెలఁతల నేత్రయుగ్మమునంద
ధైర్యంబు పెద్దలతరుముటంద
వడి లతాంగుల వంకరనడలయంద
శాంతియెంతయు దుష్కర్మసహనమంద
కాని మఱియెందు వెదకినఁ గానరాద
నంగఁ దద్దయు నాపట్టణము వెలుంగు. 13

గీ. తివిరిపాపపుంజంబు మూర్తీభవించి
వచ్చిగుమిగూడి ప్రోల్చెరఁబాఱుకరణిఁ
బందిగున్నలు చెరలాడు సందులందు
దున్నపోతులకై వడిఁ జెన్నమీఱి. 14

గీ. చేఁనిల్చిన వంటయిల్ చేరినిల్చు
గానవచ్చినఁ బరువెత్తి కానసొచ్చు
డంబుమీఱిన భటసమూహంబుతోడ
సాటియౌదురె మానవకోటినెవరు. 15

గీ. పీటఁగల్గినఘోటకకోటితోడ
నిలిచిప్రాఁకంగనేరక నీరుసొచ్చు
వెఱచి తాఁబేటిగుంపులు వేయునేల
పురినిబుట్టిన నుక్కైనఁబుచ్చిపోవు. 16

చ. దనుజులు మర్త్యులందునిమి త్తతనుమాంసము మెక్కిపోవఁగా
నెనసి పురంబునల్గడల నెమ్ములరాసులు భూధరంబుల
ట్లనుపమలీలనుండఁ బ్రమథావళితోడ మనోజవైరి యా
మనికికి వెండికొండయని మాటికివచ్చుఁ బరిభ్రమింపుచున్. 17

ఉ. కొంపలమీఁదితుక్కెగరఁగొట్టుకుపోవఁగఁ దూముకాల్వలోఁ
గంపునుగూడి త్రోఁటలనుగల్గిన కుక్కపొగాకుచెట్లబల్
గుంపులవాసనంగలిగి కుప్పలు నిప్పులు రాల వేఁడిత్రో
ముంపుచు వాయువుల్ పొలయు ముక్కునవెంట్రుకలెల్లమాఁడగన్. 18

ఉ. అంగనలూర మెల్లఁ జనునప్పుడు కూడెదమంచు లేళ్ళుఁ జి
వ్వంగుఁలుజేరి యోటుపడువారినిఁ గెల్చినవారుబ్రింగఁగాఁ
బొంగుచుఁ బన్నిదంబడఁచి పోవఁగఁజాలక లేడులోడేఁజి
వ్వంగులు గెల్చెఁ గానియెడ వానికి లేళ్ళను జంపనేటికిన్. 19

ఉ. ఆపురమేలు రాక్షసమహాకులవారధిబాడబుండు, కా
శీపురనాథవిష్ణుసరసీరుహసంభవపాదభక్త సం
తాపకరుండు, పుణ్యవసుధాధర వజ్రధరుండు, ప్రోల్లస
త్పాపధనంజయానిలుఁడు, దానవుఁ డొక్కఁ డభాగ్యనాముఁడై. 20

సీ. వానిముష్కీ ర్తితో వాసిచెందఁగఁ బూని
కుందుచుఁ జీఁకట్లు గుహలనడఁగె
వానిమైబిగిత్రోడ వాదులాడఁగఁబూని
ఖడ్గమృగంబులు కానడాగె
వానిచాపలముత్రోఁ బ్రతిఁబొందఁగాఁ బూని
వానరజాలంబు వనముదూరె
వానిమాంద్యముతో సమానంబురాఁబూని
దున్నలు బురదలోఁ దొగ్గఁదొడఁగె
వానిక్రౌర్యంబుతో దినుసూనఁబూనిఁ
జడసి వ్యాఘ్రంబు లడవిలోఁ నంచరించె
వానికంఠస్వరంబుతో వాదుపూని
పొరలె గార్దభబృందంబు బూదిలోన. 21

క. నిరతము శంభునిపూజలు
కరమొనరుచుచుండు పక్ష్కికంఠుఁడు సరియే
పరమాధమగుణుఁడగునీ
హరదూషణపరున కవని వ్యభిచారమునన్. 22

క. వదలక వారలసమ్మతి
ముదమున దినమొకని బకుఁడుపొలియించెను వీఁ
డదరక బలవంతంబుగఁ
బదుగుర నూర్వోరదినంబుఁ బట్టివధించున్. 23

క. ధీరహితుండై తగియు న
ధీరహితుండై ధరిత్రి దీనత నేలన్
క్రూరాగ్రేసరుఁ డావిబు
ధారాతి తనదుచరిత్ర మతిచిత్రముగాన్. 24

ఉ. అతనికిఁ బొట్టకోసినను నక్షరమొక్కటిలేదు ; కాగడన్
వెతకినఁ జెల్విలేదు ; దయ వీసమునుం గలనైన లేదు ; ప్రో
న్నతనయవిద్య లేదు పదునాల్గుపుటంబులు పెట్టికాల్చినన్ ;
జతురత వాతపెట్టినను సత్యముజిహ్వకు రాదొకప్పుడున్. 25

వ. అతం డొక్కనాఁడు 26

సీ. ఒకదిక్కననుగుక్కలొకక్రుక్కగాఁగూయ
నొకచెంతబలుకుంతలొలసియార్వ
నొకమూలఖరజాల మురుతీలనోండ్రింప
నొకచోట గుడిసేటియువతులడల
నొకదండముదిముండ లొకదండుగాఁగూడ
నొకవంకబలుకుంక లొదిగియుండ
నొకపొంతఁగడముంత లొకదొంతరగనుండ
నొకక్రేవమధుసేవ లొనరఁజేయఁ
వెంటపోగులుఁ జీవుళ్ళుఁ బేడకుప్పఁ
లలుకుగుడ్డలుఁ గోడియీఁకలునుదనర
డంబుమీఱిన శునకాసనంబునందుఁ
గొలువులోఁ జచ్చినట్టులు కూరుచుండె. 27

ఉ. ఆగతిఁ గొల్వులోన దనుజాధముఁడుండి గులామునొక్కనిన్
వేగమపిల్చి వేఁటపయి వేడుకనాకిపుడుద్భవిల్లె వే
వేగమ వేఁటకాండ్ర మనవేపులఁ దోడ్కొనిరమ్ము నావుడున్
సాగి యతండు చచ్చిచెడి చాలఁగఁ జెప్పినరీతిఁ జేసినన్ 28

గీ. ముడ్డియెండియున్న మొద్దుగుఱ్ఱముమీఁదఁ
గదలకుండనెక్కి కాళ్ళునేలఁ
దగులగూరుచుండి తక్కినవారలు
వెనుకఁజేరితోల వెడలెనతఁడు. 29

వ. అట్లుమిడిమిడియొండెం గాళ్ళుగాల నెత్తిమాడఁ బురంబువెడలి. 30

చ. మలమున మూఁగునీఁగల క్రమంబునఁ బీనుఁగు చుట్టుఁ జేరున
క్కలగతిఁ బుల్లెపైఁ గవియు కాకులకై వడి వేఁటకాండ్రఁ గు
క్కలు సరదార్లు నల్గడలఁ గ్రమ్మ రయంబున నేగుదేరఁగా
వెడలె నతండు కాకములు వేపులు నక్కలుఁ గూయుచుండఁగన్. 31

వ. అంత 32

చ. దనుజునిఁ జూడ సూత్కృతర దారుణనేత్ర యొకర్తు ముందుగా
నెనసిన మొండిగోడపయి నెక్కినముద్దియమొత్తువచ్చి తా
వెనుకకుఁ ద్రోచె నందునను వెన్కకు నెమ్ములు రాలఁగూలి మా
నిని వెసమూర్ఛపోయె వడి నెచ్చెలు లేడిచి రొక్కపెట్టునన్. 33

ఉ. ఏతశిరోజ యొక్కరిత వే దనుజుం గనగోడ యెక్కి యు
ర్వీతలమందు జాఱిపడి రింగున దొర్లుచు దైత్యుఁ జేరె ని
ర్భీతమనోబ్జయై కలన బీరమునం దనుగెల్వఁ జాలు బం
ధ్రాతుల డించి తన్నుఁ గొని గ్రక్కునఁ బొమ్మని వేఁడవచ్చెనాన్. 34

ఉ. బాడిదచెట్టు శుష్కకుచభాగ యొకర్తు నరాశనాధమున్
జూడఁగ నెక్కఁ దన్మహిజసూనచయం బొగి నెండుకాయలం
గూడి సుపర్వవైరిపయి గుంపులుగాఁ బడు పెంపు వొల్చెఁ బె
న్వేఁడిమి మింట దైత్యుపయి వేలుపులుల్కలు రాల్చిరోయనన్. 35

చ. అటుచని యూరబైటఁ గలయం జరియించుచు నొక్కతావునన్
బెటుకున ముందుగాఁ జెవులపిల్లిని గన్గొని కుక్క గుంపులన్
బటుమతి దానిపైఁ గవియఁ బంపగ నవ్వియు నేగి క్రమ్మఱన్
దటుకున వచ్చెఁ గాట్లుపడి తత్పురికుక్కల ధైర్యమేమనన్. 36

ఉ. అవ్వల నూరఁ బందియొక టడ్డమువచ్చినఁ దద్భటావళుల్
చివ్వకు నీటెలం గొనుచు శీఘ్రము పర్విడఁ బంది వారలన్

దవ్వులఁజూచి లో బెదరి దారుణభంగిని ఘుర్ఘురింపఁగా
నెవ్వడిఁ బాఱిరాభటులు నిల్వక దానికిలొంగ కుక్కలన్. 37

గీ. పందిఁబొడువంగ వచ్చినభటచయంబు
బెండువడిపంద ఠోడనే బెదరియుఱికె
శశముఁ బట్టంగవచ్చిన సారమేయ
వితతి శశకంబుతోడనే వెనుకఁ దిరిగె. 38

వ. ఇట్లు భటశ్వానంబులు బెదరి చెదరిన రాక్షసాధ్యక్షుండు రూఢపీఠు
ఁడుండయి కుక్కుర మర్కటమార్జాల శశకాద్య నేకాక్షుద్రమృగ
కులంబులఁ బొలియించి మృగయావినోదంబు సలుపుచుండనొక్కచో
నొకతరుక్షువు వీక్షించి తురంగంబు భయాకులాంతరంగంబయి యికి
లించుచు నపరాహ్ణసమయంబున సరోవర సమీపంబున బురదనేల
నతనిం గూలవైచి చనిన యనంతరంబ యింతకుమున్న విట్చారం
బుచేఁ దలుమంబడి యచ్చట డాఁగియున్న భృత్యుండొక్కరుండు
చనుదెంచి లేవనెత్తిన. 39

గీ. బురద తుడిచికొనుచుఁ బొక్కుచుఁ జనుదెంచి
యతని గ్రుచ్చియెత్తి యాదరించి
పందిచేతఁబడక పఱచివచ్చినయట్టి
పౌరుషంబుకొంత ప్రస్తుతించె. 40

వ. అట్లు నేదతేఱి తీరస్థితవటమహీరుహచ్ఛాయం జేరి భృత్యసహితం
బుగా నందు విశ్రమించియున్న యవసరంబున. 41

చ. శునకమురోదనంబుగతి సూకరనాదముభంగి గార్దభ
స్వనమువిధంబునన్ ప్రబలసైరిభరావము పోల్కి దవ్వులన్
వినఁబడె రాక్షసాధమునివీనుల కెంతయు విందుసేయుచున్
ఘనవినదంబు భూమిధరగహ్వరజాలము మాఱుమ్రోయఁగన్. 42

శా. ఆనాదం బతఁడాలకించి మది నాహా యంచు భావించి చి
త్తానందంబున భృత్యునింబిలిచి నీవాచప్పుడే తెంచుసు
స్థానంబారసి వేగ మాధ్వని ప్రభూతంబౌటకుం గారణం
బానందంబునఁ జేరఁబోయి కనిరమ్మా యెవ్వరట్లార్చిరో. 43

క. ఆనాదము విన్నంతనె
మానసమున కెన్నరాని మమతజనించెన్
శ్వానని నాదమె యొకఖర
యానని నాదంబొ వేగ నారసి చెపుమా. 44

చ. అనవిని భృత్యుఁ డాక్షణమ యానతిఁగై కొని గట్టుడిగ్గి కా
ళ్ళను బెనుముండ్లు గ్రుచ్చుకొనలాగు గ్రుమ్మొగ్గుచు వేగ లేచుచున్
జనిచని డొంకముండ్లమెయి సర్వముఁ జీరుకుపోవ నోర్చుచున్
బొనుపడుచున్న పాడుగుడిపొంతను మొద్దగుచాపరాతిపైన్. 45

మ. కనియెన్ దానవదూత సూక్ష్మనయనన్ గాలాంతకాకార ని
ర్ధనజీవన్ ఖరవాణిఁ గీశనసువక్త్రిన్ రక్తవర్ణాలకన్
గనదుద్యద్వసుధాధరాంచితవలగ్నన్ భూరినీలాధరన్
ఘనదేహన్ లసదుష్ట్రియాన విలసత్కాంతాకదంబాధమన్. 46

చ. కనుఁగొని దైత్యుచెంగటికిఁ గ్రమ్మఱవచ్చి యతండువల్కె నో
దనుజకులావతంసమ ముదంబున నీవటు నన్నుఁ బంపఁగా
ఘనమగుముండ్లచెట్లనక కంకరరాళ్ళన కెంతదూరమో
చనిచని పాడుదేవళముచక్కిని నేను మహోత్కృతంబుగన్. 47

సీ. పొడలుగల్గిన యట్టి భూరిబాహాయుగంబు
జిగికొండచిల్వలయుగముగాఁగ
నేత్రాంతములనుండి నెవ్వడిఁ బఱతెంచు
కన్నీళ్ళు సెలయేటిగములుగాఁగ

కర్ణరంధ్రములు ఘనవక్త్రబిలమును
రమణీయతరగహ్వరములుగాఁగ
గాత్రమంతట నిక్కుఘనరోమసంఘంబు
ధాత్రీరుహములబృందంబుగాఁగఁ
గుఱుచలౌయెఱ్ఱవెంట్రుకగుంపులడరి
యడవిదహియించునట్టి దావాగ్నిగాఁగ
గొప్పపర్వతముకరణిఁ గూరుచున్న
పొలఁతిఁగంటిఁ బురాకృతపుణ్యముననుు. 48

వ. తదీయరూపాతిశయంబులు వివరించెద నాకర్ణింపుము. 49

చ. చెడుగులనేఱి యొక్కగుమిచేసి విధాతృఁడు గార్దభంబులన్
బుడమి సృజింపవానిమెయి భూరికురూపము బాలమిం బదం
పడి యొనరిలొట్టియల వానికిమిక్కిలి కఃస్వరంబు చే
పడమి నొనర్చె నేర్పుమెయిభామను రెండును గల్గియుండఁగన్. 50

చ. పవలునునుండు పెద్దమము పాడుగుణంబులు రూపుదాల్చి యీ
భువనములోనఁ గ్రమ్మరఁగఁబుట్టిన భీకరవిగ్రహంబు బాం
ధవనిచయంబు నేచ వసుధాస్థలిగల్గుపిశాచభామ తా
భువిఁ జరియించుసంపదలముద్దియయక్క నెలంతయెంతయున్. 51

ఉ. చారునగంబులన్, ధనువు, సంపెగపూవును, గెంపుఁగూర్చి, సిం
గారపుఁ జన్నులన్, బొమలు, ఘ్రాణము, వాతెఱఁజేసి, బ్రహ్మతా
వారక వానికర్కశత, వంకరఁ, బచ్చన, రక్తకాంతిఁ బెం
పారఁగఁదీసిచేసె, మెయి, యారును గన్నులుఁ, గుంతలంబులున్. 52

చ. ఘనతరమధ్యభారమునఁ గంపమునొందెడు నూచకాళ్ళు పెం
పొనరఁ బిఱుందులుం ఘనతనొందినఁ దాళఁగలేవటంచుఁదా
వనరుహగర్భుఁ డెంతయును వంతమదిం దలపోసి సూక్ష్మలో
చనకుఁ బిఱుందులు న్మిగుల్పపైకముగానొనరించె నేర్పునన్. 53

గీ. కొమ్మగాదది మేటిపెద్దమ్మగాని
బాలగాదది యముచేతికోలగాని
కన్నెగాదది బలిసినదున్నగాని
నారిగాదది జనులకుమారిగాని. 54

గీ. అట్టి కన్నియయును నీవు ననఁగి పెనఁగి
కనరు లేనట్టిమమతలఁ గలసి లేని
యెందునీతచెట్టుపయిఁ గోరిందతీఁగె
యల్లుకొనురీతిగాదె యోయమరవైరి. 55

చ. అనిచెలికాఁడు తెల్పుటయు నాకుణ మారజనీచరేంద్రుఁడున్
మనమున సంతసంబడర మానిసిఁజూడఁగ మిత్రువెంటనే
చనియెను ద్రోవలోఁగలుగుసర్వమహీం జలతావిశేషముల్
గనుఁగొనుచున్ మృగావళులఁగాంచుచు డొంకలముండ్లఁజూచుచున్

చ. కనుఁగొను సంగడీఁడఁ యదె గట్టుకఁజేరువ గచ్చతీఁగ మిం
చినతమి గట్టిగా ముసిఁడిచెట్టును జుట్టకయుండె మేలు మేల్
దనుజకులాగ్రగణ్య నిను దారుణలీలఁ గవుంగిలించి యా
వనితయు నట్టులే మిగులవంతలఁబెట్టి కలంచు మీఁదటన్. 57

క. చూడుమదె గార్దభాంగన
తాడనమొనరించెఁ దనదుధవుని వయస్యా
చేడియ నిన్ను నుసరసం
బాడెడునపు డిట్లుతన్ను నమరవిరోధీ. 58

క. ఇటు లన్యోన్యంబును ము
చ్చటలాడుచు నేగియేగి చామను గుడిచెం
గటఁ గని మేనువడంకఁగ
నటమటత్రో నిర్జరారి యనియెను దనలోన్. 59

ఉ. దీనిని నేనువేఁడినను దిట్టునొ కొట్టునొ లోనికేగునో
మానినిఁ బల్మిబట్టుటయు మంచిదిగాదని యూరకుండి నే
నూనశరార్తి నెక్కరణి నుక్కడు నేవిధినైన నిప్పుడీ
చానను గూడువాఁడనని జప్పుడుసేయక మెల్లమెల్లఁగాన్. 60

చ. వెనుకకువచ్చి చేయొడిసి వేగనుబట్టిన లేచిదానవున్
గనుఁగొని కొమ్మ తానెడమకాలున ముందరిపండ్లు రాలఁ దా
చినఁదగనోర్చి నెచ్చెలియుభీయున వెండియుగౌఁగిలింపఁజూ
చినఁ జెలి భీతి గర్భగుడిచేరెను దల్పులువైచి గొబ్బునన్. 61

ఉ. అంతట దైత్యుఁడుం దలుపులల్లనగుద్దుచు నిన్నుఁగూడ కొ
క్కింతయుఁ దాళలేననుచు నేడ్చుచులబ్బున మొత్తుకొంచు ని
న్నింతయుఁగూలి పైఁబడినయట్లు వితాకునఁగూరుమండ నా
చెంతకుఁ దార్పకత్తెయొకచేడియ వచ్చె మెలంతనారయన్. 62

గీ. వచ్చి గుడిచెంతఁగూర్చున్న వారిఁగాంచి
మీరు రక్తవర్ణాలక సైరిభాంగి
మర్కటానన పర్వతమధ్యభార
వనితనెందైనఁ గంటిరేయనుచునడుగ. 63

ఉ. దానవభర్తవల్కు వనితా వినుమిచ్చటి కేను వేటకై
సేనలఁగూడివచ్చి గుడిచెంగట నేడ్చుచునున్న దాని నీ
వానతియిడ్డలక్షణములన్నియుఁ గల్గినదాని నొక్కకీ
శాననఁగాంచి కేలొకటనంటిన నీగుడిమాటె నివ్వెఱన్. 64

ఉ. ఆకనుదోయిసూక్ష్మతయు నాచనుతిత్తులమార్దవంబు నా
మైకఠినత్వసంపదయు మానిని నేఁగనుఁగొన్నయంత నే
నూకరగాత్రిపై మనసుపొచ్చెను నిక్కువమొట్టులైన నా
కాకపివక్త్రిఁగూరిచి రయంబున నేలుము నీకుమ్రొక్కెదన్ 65

ఉ. ఎయ్యదియూరు దీనివిభుఁడెవ్వఁడు పుట్టినవంశమెద్ది పే
రెయ్యది యొంటిగా నిచటి కేటికివచ్చె నిటేస్వఁగారణం
బెయ్యది నాకుఁజెప్పఁగదవే కలరూపు కిటీంద్రయాన నీ
వెయ్యదిగోరినన్ సరగనిచ్చెద దానినినన్నుఁగూర్చినన్. 66

చ. అన నదివల్కె నోజనవరా ఖరగామినిరీతిఁ జెప్పెద
న్వినుము సుబుద్ధినాఁబరఁగునీయమభర్తయతండు రూపునన్
మనసిజుగెల్చునైనఁజెలి పల్లవసంగతి మెప్పుకోరు గ్ర
క్కునఁ బొరుగింటిపుల్లనగుకూరయుఁ దారుచిగాదె యేరికిన్. 67

ఉ. నిన్నటిరాత్రి యీమె యొకనీచభుజంగునిఁ గూడుచున్నచోఁ
గ్రన్ననవచ్చి వల్లభుఁడు కన్గొని కోపముతోఁడవీఁడు నేఁ
డిన్నడిరేయి యొంటి మనయిల్లుచొరంగ నిమిత్తమేమిరో
యున్నది యున్నయట్లు చెపుమూరకదాపక యన్నవిన్ననై. 68

గీ. బొంకుటకుఁజేతఁగాక యీఅంకులాడి
నోర గుటకలు మ్రింగుచు నూరకున్నఁ
గాంచి కోపించి యొకపెద్దకఱ్ఱఁగొని
వీపుబద్దలుగాఁగొట్టె వెలఁదినతఁడు. 69

ఉ. కొట్టిన మొత్తుకొంచు వడిగ్రుడ్డుల నీరొగిఁగ్రుక్కుకొంచుఁ బెన్
ఱట్టులఁ బెట్టివీధిఁబడి త్రాగతనంబునఁ బాఱివచ్చి యీ
కట్టిఁడిఱంకులాడి తనకాపురమూడుటకోర్చి దేవళం
బిట్టులుదూఱెఁ గన్గొనఁగ నిట్టివెయౌఁగద జారిణీగతుల్. 70

వ. అనికురంగగమన సవిస్తరంబుగా నామెఱుంగుబోఁడికెఱుంగఁ జెప్పిం
గించి తలుపుచేరి యిట్లని పిలువందొడంగె. 71

ఉ. డాయనుభీతిఁబొంద మగఁడా యనుఁ, దల్పులు తీయరాదె రం
డాయనుఁ, బల్కవేమి చెపుడాయను, సొమ్ములువెట్టు ఱంకు ముం

డాయను వేగరావె మొఱడాయను లోవలఁజేరి యేడ్వఁగా
డాయను సిగ్గుఁబూనుటెపుడాయను నెచ్చెలి మాటిమాటికిన్. 72

తే. గొంతుపగులంగ వినువారి కెంతొ చెవులు
తడకలునుగట్ట నాలుకపిడచవాఱ
నెంతయార్చినఁ జెవిఁజొరనీకయుండె
దున్నపోతుపై వర్షంబు తొరఁగినట్లు. 73

చ. తడిసిననుల్కఁ జిక్కఁగతిఁ దామ్రశిరోరుహ యంతకంతకుం
గడుబిగియంగఁజూచి తటకాపడి గుండెనుఱాఁపడ్డ వే
నడవఁగలేక గోతిదరినక్కఁ దెఱంగునఁ గాచియున్నయా
చెడుదనుజుండు నెత్తికిఁ గఁ జేతులువచ్చెనటంచు రోఁజుచున్. 74

ఆ. కొంతసేపు పాడుగుడిచెంతఁ గూర్చుండి
రోదనంబుచేసి రోసి కూర్కి
తలుపుతీయుజాడఁ గలనైనఁ గానక
విసిగి దూతిఁగొంచు వెడలెగుడిని. 75

చ. అటువలె దేవళంబపుడె యాయమతోడను దానవేంద్రుఁ డు
త్కటమగుకిన్కతో వెడలి గార్దభ గామినిమీఁది ప్రేమచేఁ
దటుకునఁ బాయలేక మదిఁ దాలిమిఁ దాలిచి పొంతనిల్చి మి
క్కటమగుదీనభావమునఁ గూర్మిబయల్పడ దూతి కిట్లనున్. 76

క. ఓసీ ననునీవిపుడీ । కాసరనిభగాత్రితోడఁ గలిపెదవేనిఁ
గాసులవేరిచ్చెద నీ । యాసకుఁదగినట్టికొక్క మటులుండంగన్ 77

తే. అనిన నదియెంతపనియని యపుడెబయలు
దేఱి దేవాలయంబును జేరఁబోయి
మెల్లగా మిత్రురాలిని మేలమొప్పఁ
బిలిచినంతనె యాజెంత తలుపుతీసె. 78

క. తలుపునుదీసినవెనుకను
బలుకులు చెవిలోనఁ గొన్ని బహురమ్యముగా
నలునొప్పఁగఁజెప్పిన విని
యలఖరవాణియు విచారమంతయుఁదీఱన్. 79

క. చెలికత్తియతో గుసగుసఁ
బలుమాఱునుమాటలాడి బహుధనమును సొ
మ్ములు వలువలునన్ రాక్షస
కులబాడబుఁ డియ్యనొప్పుకొన్న సువార్తన్. 80

ఉ. తిన్నఁగ విన్నపిమ్మటను దీయనిమాటలు చెప్పి వానితోఁ
గొన్నివికారచేష్టలను గూడుట కుబ్బున సమ్మతించె నా
చెన్నఁటిదూతియు న్మరల శీఘ్రముగా దనుజాధమాధమున్
దెన్నునఁగాంచి సర్వమునుదెల్పి సురాలయబాహ్యభూమికిన్. 81

తే. తోడుకొనివచ్చి గుడిలోన దూఱుమనుచు
సైగచేసిన వాఁడును వేగఁజొచ్చి
తలుపు లోపలబిగియించి తగినయంత
గబ్బిలపుపెంటగమ్మునఁ గంపుకొట్టె. 82

తే. ఉక్కలోనావెతో సౌఖ్యమొందుచుండె
మిగులఁ దనలోనగుటకలు మ్రింగుకొనుచుఁ
జేతు లొండొంటితోఁజేర్చి దూతికయును
గడపముందటఁ గావలికాచుచుండె. 83

తే. ఈకథానాయికయయినయిగురుఁబోడి
మగఁడుకొట్టినపీధులుమాఱుమ్రోయఁ
బెద్దపెట్టున నేడ్చుచు వీడువెడలి
పోయి యొందునుగనరాకమాయమయిన. 84

సీ. ఏసూతిలోపల నేగికూలెనో యందు
భయపడి మగఁడును బంధువులును
వీధివీధులవెంట వెదకుచుఁ బఱతెంచి
జాడలఁబట్టి యాపాడుగుడిని
జేరియచ్చోటను జిడుముపొక్కులు గోకు
కొందుచు గడపలోఁ గూరుచున్న
దూతికఁబొడగాంచి దుర్మార్గురాలైన
యీలంజెముదిముండమూలముననె
మనకు నిన్నిపాటులువచ్చెననుచుఁ బలికి
యందఱునుజేరి యాదూతినంటఁగట్టి
నెమక సున్నములోనికి నెమకలేక
యుండదంచిరి పిడిగుద్దులొకటఁబఱపి. 85

గీ. అటుపిదప నర్ధచంద్రప్రహారములను
దానియబ్బతోడను జెప్పకోనుబంచి
వెనుక దేవాలయముతల్పు వేసియుంట
కాంచిలోపలనెవ్వరో కలరటంచు. 86

క. ఊహించి తలపులొక్కట
బాహాబలమొప్పగుంజ పగిలినమీఁదఁ
సాహసమున లోఁజొరఁబడి
దేహంబంతయుఁజెమర్ప దిగులునమూలన్. 87

గీ. ఒదిగివడఁకుచున్న యుష్ట్రియానను రాతి
సాధమునిని జూచి యలుకతోడ
వీసెగుద్దులొకట వేనవేల్ కురిపించి
కొప్పు జుట్టుఁబట్టి గుంజియార్చి. 88

గీ. వెలుపలికిఁదీసికొనివచ్చి వీపుమీఁద
ముఖముమీఁదను మెడమీఁదముక్కుమీఁద
మిఱుగుగుద్దులవానలు మచ్చుచూపి
పిండిపెట్టె నభాగ్యుని నిండుగాను. 89

గీ. దెబ్బలకుఁదాళఁజాలక దితిజవరుఁడు
తిరుగఁబడి బండతనమునఁ దెగువచేసి
వారితోడను బోరాడ వడిఁగడంగ
వారలందఱు నాగ్రహోదార్యవృత్తి. 90

చ. తటుకునఁ జుట్టుముట్టి పదతాడనకూర్పరఘట్టనంబులన్
జిటిపొటిమొట్టికాయలను జేరలనిండిన చెంపకాయలన్
బటుతరముష్టిఘాతములఁ బల్మఱునువ్వదచల్లి దేహమం
తట రుధిరమ్ము గ్రమ్మఁగఁజిదైత్యుని నెత్తురువానిఁ జేసినన్. 91

ఉ. తాళఁగలేక సొమ్మసిలి దానవుఁ డల్లనమూర్ఛవోవఁగా
బాలికబంధువుల్లని యభాగ్యుఁడు చచ్చెనటంచు నెంచి యా
భీలతఁ జాపలోపలనుబెట్టి యభాగ్యునిఁజుట్టికట్టి దే
వాలయపూర్వభాగమునయందలిగోతను వైచిపోక్రటన్. 92

క. వైచి పురంబు తలారులు
చూచిన మోసంబువచ్చుఁ జూడకయుండన్
వేచనవలె ననిగొబ్బున
నాచంచలహృదయుఁ గొంచు నరిగిరిపురికిన్ 93

వ. అంత నిచ్చట. 94

గీ. విట్టురంబుతఱుమ వెఱచిపర్విడివచ్చి
గోతియంకుదాఁగి కూరుచుండి
పందిగుంపులచట బయులనుదిరుగుచు
సునికిఁజేసి పయికిఁజనఁగనోడి. 95

క. భటులిరువురు గర్తమునం
దటునిటువీక్షించుచుండి యదటునఁ దమపై
నటు దయ్యమువలె శవమొ
క్కటిపడినన్మూర్ఛపొంది ఘటికాద్వయికిన్. 96

క. తెలివొంది కనులువిప్పుడు
నలశవముం గదలఁజొచ్చె నాశూరులకున్
గిళవళ మినుమడికాఁగను
బెళపెళయని చాపచుట్ట బిట్టుగ మ్రోయన్. 97

ఉ. అంతట నాభటద్వితయ మాత్మఁదలంకుచుఁ బైకిఁబోయినన్
గంతునవచ్చి ఘుర్ఘురము గ్రక్కునఁజంపునొ క్రిందనుండినన్
సంతసమార దయ్యమిది చంపునొ యక్కట యేమిబుద్ధి యం
చెంతయుఁ జింతనొంది పనియేమియుఁ దోఁచకయుండ నంతలోన్. 98

సీ. చాపలోనుండి "ఘనులార! చావకుండ
బంధములువిప్పినన్నింత బ్రతుకఁజేయుఁ"
డనెడువాక్యంబు వినవైననానవాలు
పట్టి తమరాజుస్వరమాట వడినెఱింగి. 99

గీ. కట్లు విప్పితీయఁ గాయంబునిండను
గాయములు చెలంగఁ గనులువిచ్చి
దైత్యనాథుఁడపుడు తనప్రాణభృత్యుల
యాననములఁజూచె దీనవృత్తి. 100

క. అన్యోన్యముఖాలోకన
ధన్యత్వముఁ జెంది భటులు దనుజేంద్రుండున్
నవ్యస్తభయభ్రాంతత
నన్యోన్యక్షేమవార్తలారసి రల్లన్. 101

క. ఆరసి తమకోదవినయూ
ఘోరాపదలెల్లఁ బాసి కుట్టూపితితో
ధారుణిలోఁ గ్రమ్మఱఁదా
మీరీతినెమ్మలఁగఁ గనుట కెలమింగనుచుఁ. 102

గీ. రాజు తమచెంతనున్న ధైర్యంబుకతన
బయలఁ దిరిగెడుకిటులకు భయముపడక
విభునితోఁగూడి యోగోయి వెడలఁజూడ
లేచుటకు రాజుకాలెత్త లేకపోయె. 103

క. ఆసైరిభాస్యబంధులు
చేసినయుపచారమహిమచేతను జరణం
బాసమయంబున దనుజా
గ్రేసరునకు వశముగాక కీలుతొలంగెన్. 104

క. అదిగని సందేహింపక
సదుపాయధురీణులైన సద్భటవర్యుల్
ముదమున బైకెక్కినృపున్
సదమలగతి నీడ్చిరతఁడు శ్రమచేమూల్గన్. 105

శా. ఎంతో కష్టమునీఁద దైత్యవిభుఁ బైకీడ్చి యామీఁదటన్
వంతు ల్వొంబడి మోవనెంచి యదియుం భారంబుగాఁదోఁచినన్
స్వాంతంబు ల్బలియింపఁ జింతిలి మహోపాయంబుఁ గన్పెట్టియ
త్యంతంబు న్మదిసంతసిల్లి గుడిచెంతంజేరి యొక్కమ్మడిన్. 106

క. పందిరిగడలనురెంటిన్
సందిటఁ గొనివచ్చికట్టి సద్వాహనమున్
సుందరగతిఁ జేసి మహా
నందముతో రాజు సందు నయమొప్పారన్ 107

క. శయినింపఁజేసి యిద్దఱు
దయతోడ న్మాపుపైసిఁ దద్వాహనమున్
గయికొని పరమపదంబున
కయి చేర్చుమహానుభావుకరణిని నృపునిన్. 108

వ. వహియించిమృగయావినోదమహోత్సవంబు నిర్వర్తించి పునఃపుర
ప్రవేశంబుచేయ నవధరించు నవనీధవపుంగవుం బురవీధుల నూరే
గించు మహావైభవంబపూర్వంబై యుండె నాసమయంబున. 109

సీ. అత్యద్భుతంబైన యావాహనంబును
వీక్షించికుక్కురవితతి మొఱుఁగ
వీధివెంటనుబోవు విధవాంగనలుచూచి
శవమని వెనుకకు సరగఁఁరుగఁ
బయటనుండిబాధచే వడిమూల్గుటాలించి
తమచుట్టమని ఘూకతతులుచేరఁ
గ్రొత్తగా శవవాహకులువచ్చి రెందుండి
యని ప్రాంతవాహకు లడుగుచుండ
శ్వాననినదంబు మాగధస్తవముగాఁగ
విధవలభయస్వరములు దీవెనలుగాఁగ
ఘూకఘూంకారములు వాద్యఘోషములుగ
నగరుచొత్తెంచెనాతఁడునడిమిరేయి. 110

వ. ఇట్లు పరమరహస్యంబుగా నంతఃపురప్రవేశంబుచేసి. 111

ఉ. మంచముమీఁద దేహమిడి మూల్గుచు మూల్గుచు బాధనొందుచున్
జంచలదృష్టిఁజూచుచును జారుల కెవ్వఁడునిట్టిపాటులే
మించుగసంభవించునని మించువెతన్మదిలోఁదలంచుచున్
బంచత యింతకంటె బహుభంగుల మేలనుచున్వెతంబడెన్. 112

గీ. వైద్యులను బిల్వనంపించి వారిచేత
నౌషధంబులుచేయించి యక్కజముగ
బాధకుసహింపలేక యభాగ్యనృపుఁడు
మందుపట్టింపక శరీరమందొకింత. 113

క. వరుసగ మొలయునుదలయును
శిరమును గరములుఁనువాచి చెప్పంగఁ గవీ
శ్వరులెవ్వారును నొల్లని
మరుదశమావస్థ నతఁడు మానక చెందెన్. 114

క. ధరణి నభాగ్యమహాసుర
చరితము విన్నట్టిపుణ్యచరితుల కెల్లన్
బరవనితారతిచెడునని
పరిహాసకుఁ డానతిచ్చెఁ బాండుసుతునకున్. 115

క. ధరణీజనమందారా
సురమునిగణనుతవిహార సుగుణాధారా
పరిభావితరిపువీరా
దురితనిచయఘనసమీర దుఃఖవిదారా. 116

మాలిని. అనుపమగుణసాంద్రా యాదవాంభోధిచంద్రా
జనఘననుతిపాత్రా సజ్జనాంభోజమిత్రా
వనధికృతవిహారా వల్లవీచిత్తచోరా
దనుజచయవిరామా దర్పితారాతిభీమా.

గ ద్య ము.

ఇది శ్రీమత్సకలసుకవిజనవిధేయ కందుకూరి వీరేశలింగ
నామధేయ కల్పితంబయిన యభాగ్యోపాఖ్యానంబను
హాస్యప్రబంధంబునందు సర్వంబును
నేకాశ్వాసము.

# పథికవిలాసము.



By

**K. VEERESALINGAM**

# పథిక విలాసము.

సీ. ఆప్తవర్గముఁబాసి, యమితదూరంబున
నతిచింతఁగూరి, మాంద్యంబుమీఱ
నలసయానముచూపు నల 'షెల్డు' దరినుండొ
జెరలాడు 'పో' నదిచెంతనుండొ
నామీఁదఁ 'గారింతియా' దేశముప్కర
గ్రామ్యాధముఁడుకృపారహితుఁడగుచు
నిలువనీడయు లేని నిఱుపేదపథికునిఁ
జొరనీక యిలు మూయుచోటనుండొ
నరవర్జితంబయి నభమువాలినదాఁక
నొక్కటే బయలుగాఁ బిక్కటిల్లి
యున్న 'కాంపానియా' యూషరక్షేత్రంబు
విసుగుపుట్టించెడు దెసనునొండె
నెచట నేదేశమీక్షింపనేనుదిరుగ
మనసునావెంటరాక, యోయనుజ! యెపుడు
వెడలుకొలఁదిని దీర్ఘమౌప్రేమపాశ
మీడ్చుకొంచతివ్యధనునీయెడకె మరలు. 1

గీ. అట్టియాదిమసఖుఁ డైనయట్టిభ్రాతఁ
జేరిశాశ్వతసుఖము కై సేయుఁగాక!
అంగరక్షకులై తద్గృహంబుచుట్టు
నుండి దేవతల్ కాచుచుండ్రుగాక! 2

చ. పగలొగిఁ బాటుపడ్డశ్రమ పాయఁగ హాయిగ విశ్రమింపఁ, గ్రం
దుగఁ జలిమంటఁ గ్రాఁగ, నతిథుల్ మునిమాపున నెందుఁ బోదురో

తగ నిటుపేద లార్తులును దామెటకేగి సుఖింతురో, యెటన్
జనిపరదేశి యాదరణఁ దేలునో, యాయిలు ధన్యమయ్యెడున్. 3

సీ. ఎచ్చోటను గుటుంబమెల్లను సుఖముగాఁ
జుట్టునుజేరి కూర్చుండి తాము
కడువేడ్కఁ జెప్పెడు నడుచుచునుండెడు
సరసవినోదవాక్సరణి కేని
హాస్యచేష్టల కేని యలరి నవ్వుచునుండ
వ్యసనంబు గలిగించునట్టికథను
వినిజాలిచేతను వెచ్చనూర్పుచునొండె
భుజియింపసిగ్గును బొందునతిథి
నారగింపంగఁబ్రార్థించి యందువలనఁ
గడుఁబరోపకారసుఖంబుఁగఱచుచొండె
పుష్కలముగ శుద్ధపదార్థములనువిందు
లిడుచురచ్చటియావిందులెసఁగుఁగాత. 4

క. అటువంటిసుఖంబుల నేఁ
గటగట కననోచనైతిఁ గష్టపువిధిచేన్ ;
బటుతరకష్టంబులఁ బ్రది
ప్పటలంబడిచెల్లె నాదుప్రాయంబెల్లన్. 5

చ. ధరణిసినింగినిన్ గలయఁ దార్చెడుచక్రముభంగి, దవ్వుగా
నిరవుననుండినన్ను నెలయించి చనంజన దూరమేగుచున్
గరమునునన్ను, జూపుననెనవ్వుచుఁ, బర్విడుభాగ్యదేవతన్
బరువడి వెంబడింపనిటు పాల్పడితిన్ గడలేనిత్రిమ్మటన్. 6

క. నాపాలిభాగ్య మిలలో
నేపట్టుననిల్లు నాదియిది యనకుండన్

బాపురె! నన్నేకాకిఁగ
నీపగిదినిద్రిప్పుచున్న దెల్ల విలాతుల్. 7

ఉ. ఇప్పుడుసైత 'మాల్వ్సి' శిఖరీంద్రవివిక్తపదంబుఁజేరి, యొ
క్కప్పుడు గాలివానలకు నందనియున్నతమైనచోట నే
నొప్పుగఁకూరుచుండి, వగఁ బొందుచుఁ గాలము నెట్లొ నెట్టుచున్
దప్పకచూచెదన్ దిగువత్తట్టున నూర్లకొలంది దేశముల్. 8

క. సరసులుఁ గాంతారంబులుఁ
బురములును బయళ్ళుదిశలఁబొలయుచు దృగ్గో
చరమగుని వెభూపాలుర
గురువైభవ మల్పతరపుగోపునిస్థితియున్. 9

ఉ. ఎల్లెడసృష్టివింత లిటు లీక్షణపర్వ మొనర్చుచుండఁ, జిం
తిల్లఁగనౌనె గర్వితమతిన్ బలువింతలలోఁ గృతఘ్నతన్?
పెల్లుగ నెల్లవారి మదివేడ్కలు నించెడు మేలు నక్కటా!
చెల్లునె పాండితీకుశలచిత్తము పేర్మియొనర్ప? జెప్పుఁడీ. 10

ఉ. విక్కుచుఁ బైకిఁ దార్కికకువిద్య నటించినఁదా నటింపని,
మ్మిక్కడ మర్త్యకీటమున కీచిఱువస్తువులే ఘనంబులౌ;
మిక్కిలి సర్వమానవుల మేలునుఁజూచి ప్రమోద మొందున
య్యకటికంపుగుండె కల యట్టిజనుండె మహాత్ముఁడెంతయున్ 11

సీ. విత్తంబుతోడను విభవంబుతో నొప్పి
కరముఁ బ్రకాశించుపురములార!
అవ్వారిగాఁబంట లల్లవసంతుండు
కలిగింప నలరారుపొలములార!
పనిపూనిపవనుండు పడవలనడపంగ
సరసత్వమున మీఱుసరసులార!

వ్రాలు వ్రాచినకొండవ్రాళ్ళను బనిచేయఁ
కరము వంగినయట్టికాపులార!
మేదినీభాగ మెల్లను నాదెగాన
మీర లెల్ల సృష్టికినంశహారి నైన
నానిమిత్తంబ యరియర్పణంబుగాఁగ
మేలివస్తువుల్ కూర్పుఁడు మీవియెల్ల. 21

మ. ఘనలోభాత్మకుఁ డొంటిగాఁ దనధనాగారంబుదర్శించి, యో
లినిగూర్చుండి ధనంబుఁబల్మఱును దా లెక్కించిలెక్కించి, యా
ధనముల్ కుప్పలుకుప్పలై కడుఁ బ్రమోదంబియ్య, నుప్పొంగు; నా
వెనుకన్ గన్గొని వెచ్చనూర్చు మఱియున్ విత్తంబు లేకున్కికిన్. 13

మ. అటులేపుట్టెడు మన్మనంబునను వ్యత్యస్తంబులౌవృత్తు; లు
త్కటహర్షంబగు దేవుఁడీవరులకున్ గల్గించుమేళ్ళంగనన్ ;
కట! మర్త్యుండిటుఁబొందఁ గల్గుఘనసౌఖ్యం బింతెగాయంచు, నొ
క్కట నిట్టూర్పులుపుట్టుఁ ; బల్మఱును శోకంబుల్ కడుంగల్గెడున్.

శా. వేదారుల్ చనువాశలున్ నిగురకున్ వేఁజొన్ని, శ్రాంతాస్మదీ
యోదారాత్మ—సమస్తమర్త్యులు సుఖంబొందంగ వీక్షించి—స
మ్మోదంబందఁగఁ గాంచు నిత్యసుఖసంపూర్ణప్రవేశం బొకం
డీదేశంబుల నెందునేనిఁ గనఁగా నే వేమఱున్ గోరుదున్ 15

క. గ్రక్కున నట్టిప్రదేశం
బెక్కడఁగానంగవచ్చు నీభూమిపయిన్?
చక్కఁగఁ జూపెడువారెవ
రక్కట! యందఱు నెఱింగినట్లె నటింపన్! 16

చ. అనయము శీతమండలమునందు వడంకుచు నుండుమర్త్యుఁడున్
దనదెజగంబులో సుఖపదం బనిచాటును సాహసంబునన్ ;

ఘనమగు గాలివానలను గంపిలుస్వీయసముద్ర సంపదల్,
తినినగ్రాగి త్రుళ్ళుతనదీర్ఘనిశల్, స్తుతియించు నెంతయున్. 17

చ. కరము నిరక్షుభూమిని వగర్చు దిగంబరకృష్ణదేహుఁడున్
వరుసగ సంస్తుతించుఁ దనబంగరువాలుకఁ, ద్రాటికల్లునున్;
తిరుగుచు వేఁడియెండలను, దేలుచు నక్షత్రరంగమండలిన్,
స్మరణమొనర్చు వేల్పులఁగృతజ్ఞతఁ దానటుగన్న మేళ్ళకున్. 18

క. మనమెటఁదిగిగిన, నిటులుం
డును గద దేశాభిమానినుడువుపాగడ్తల్?
తన ప్రథమోత్తరదేశం
బనయంబును స్వస్థలంబునందే యుండున్. 19

సీ. అయినను దేశంబులన్నియు నొకవేళ
నొండొంటితో మనమొకటఁబోల్చి
వానివానికిఁగల్గు భాగ్యవైభవముల
నిపుణంబుగఁ బరిగణింతుమేని
దేశాభిమానులు తివిరిస్తుతించిన
న్యాయంపుబుద్ధితో నరసిచూడ
సర్వమానవులకు సమభాగముగ మేలు
పంచి యీఁబడినట్లు పలుకవలయు;
కళలచేనొండెనుస్వభావకలననొండె
వివిధముగనియ్యఁబడినవేత్వేఱుమేళ్ళు
వివిధదేశస్థ మానవవితతులకును
సౌఖ్యసంపదలెల్లను సమముజేయు. 20

చ. ప్రకృతియు నెల్లరందు సమభావకృపల్ గలతల్లియయ్యునున్,
సకలసుఖంబులిచ్చుఁ గడుశ్రద్ధ మెయిం బనిచేయువారికిన్;

ప్రకటముగాఁగ 'నాన్ణా' నదిప్రక్క శిలాతలమందుఁబోలెఁ గ
ర్షకునకుఁ గ్రాసమీఁబడియెఁ జక్కఁగ 'నైద్ర' పురీనగంబులన్. 21

గీ. శిలలతోఁ నిండి పర్వతశిఖరసమితి
కరముఁ గఠినంబుగాఁ బాడకట్టుచున్నఁ
బరఁగ, నీపర్వతముల లవాటుకతన
హంసతూలికాతల్పంబులగు నుజ్జూవె. 22

మ. ధనవాణిజ్యములున్ బ్రతిష్ఠయును, స్వాతంత్ర్యంబు, సంతుష్టియున్-
కన, నానావిధముల్ మనుష్యకృతసత్కార్యోదితానందముల్,
వినుమశ్లైనఁ, బరస్పరంబు నివివిద్వేషించి, యొండొండెత
క్కినవానిన్ బరిమార్పఁగాఁ గడఁగుమాడ్కిన్ దామువూపట్టెడున్.

మ. ధనముల్ స్వేచ్ఛయురాజ్యమేలుకడ, హృత్సంతుష్టి నిష్టంబగుల్;
ఘనవాణిజ్యము చాలనిల్పెడునెడల్, శాయున్ బ్రతిష్ఠాప్తి; కా
వున, నొక్కొక్కప్రభుత్వ మొక్కొకసుఖంబుం గాంచ నభ్యాసముం
గని, యద్దానికె జీవనంబలవడంగాఁజేసి, మార్చుందగల్. 24

మ. ప్రతిరాష్ట్రంబున నిష్టసౌఖ్యము లతివ్యాప్తింగడున్ జెంది, త
త్ప్రతిసౌఖ్యంబును వింతయైనయొకబాధం బెచ్చునందాఁక, మూ
ర్ఖతతోఁ నొక్కొకరాజ్య మొకప్రియసౌఖ్యంబే మదిల్ నిల్పి, త
ద్వ్యతిరిక్తాఖిలసౌఖ్యమూలక సుఖోపాయంబులన్ దన్నెడుల్. 25

క. ఈసత్యంబుల నింకను, భాసిల్లెడుసూక్ష్మ దృష్టిఁ బ్రబలపరీక్షల్
చేసి, పరిచూతమిచ్చటి, యీసీమలలోపల నవి యెటువర్తిలునో. 26

ఉ. అందులకై యొకింతతడ వావలనుంచి మదీయచింతలన్,
క్రిందటిలోయ ఛాయఁగలిగించుచు, గాలికినుస్సురంచు, నా
ముందటివంకఁ దానెపడి మొల్చిన దిక్కులుగుల్మమట్లు, నే
నిందుమనుష్యకోటికయి యించుకకుందుచుఁ గూరుచుండెదన్. 27

క. అదెకుడివై పునదవ్వుల
ముదమొప్పఁగ 'నాల్ప్స్' మిన్ను ముట్టినచోటన్
బొదలెడు 'నిటలీ' దేశం
బదిర! వసంతంబుఁబోలె నతిశయశోభన్. 28

ఉ. తెల్లగ మధ్యమధ్య నొకదేవగృహాగ్రము జీర్ణమౌచు భా
సిల్లి మహత్త్వగౌరవవిశేషముఁ జూపఁగఁ, గొండనెత్తముల్
పెల్లుగ నేటవాలగుట లేచి వనంబుపయిన్ వనంబు రం
జిల్లి నగంబుప్రక్కఁగయినేసెడు, నాటకరంగరమ్యతన్. 29

గీ. బహుళసృష్టివిశేషసౌభాగ్యసమితి
స్వాంతమును దృప్తిఁబొందింపఁజాలునేని
సత్యముగనల్ల 'యిటలి' దేశంబుజనులె
యెల్లవారలలో, ధన్యులెంచిచూడ. 30

సీ. గర్వించిపైని నిక్కఁగఁ గల్గునవియొండె
నడఁకువనిల వ్రాలునట్టివొండె
నేయేఫలావళు లెల్లవిధంబుల
దేశంబులందును దేజరిలునొ
వంతువెంబడిఁబూచి పలుకాలములను మాఱు
హాయనం బెల్లఁగై సేయుచుండి
యేయేప్రసూనంబు లీక్షణోత్సవముగ
నష్టదేశంబుల నుద్భవిలునొ
పూచినశింపనే పొడచూపి ననకాఱు
నను మాత్రముండు జీవనముకలిగి
యేయేసువాసన లెలమితో నుత్తర
దిక్కును సేవించి మ్రొక్కుచునొ

యట్టివెల్లనునిచట వేయుంగఁబడుచు
నుండి, యిదెస్వస్థలంబుగనొప్పుకొనుచుఁ
దోఁటవారలవలసను దోహదంబు
నడుగకయె, తాముపెంపొందియతిశయిల్లు. 31

గీ. కలకలను నవ్వునీభూమి కాంతమీఁద
వింతవలపులు కలయంగ విసరుకొఱకు
నబ్ధిఁబోడము గంధవహవిహంగమములు
చల్లనగుతమతెక్కలఁజూచునెపుడు. 32

చ. అయినను, దుచ్ఛమింద్రియచయంబె యొసంగెడుసౌఖ్య మెన్నఁ; న
క్షయముగ నుర్విఁ డింద్రియసుఖంబె యెఱింగినదెల్ల నిచ్చటన్
ప్రియతరసుందరాకృతిని బెంపగు నిచ్చటఁ జేలుఁ దోఁటలున్;
క్షయమునుబొందుచుండు నెనుగంగన కొక్కమనుష్యుఁడే యిటుల్.

చ. నరునిప్రవర్తనంబులఁ గనంబడు నిందు విరుద్ధదోషముల్—
పరమవిధేయుఁ డయ్యు, గరువంపడు; నిర్ధనుఁడయ్యు, భోగియౌ;
నరయ గభీరుఁడయ్యుఁ, గడువ్యర్థుఁడు; కల్లరి, భక్తుఁడయ్యునున్;
వెరవులు పన్నుఁగ్రొత్తయఘవృద్ధులు చేయుఁదపంబులందునున్. 34

మ. మును వేంచేసినభాగ్యదేవత యిటుల్ మున్ దాదిగంబెట్టి పో
యినకీడుల్ సకలంబుచేరి చెఱిచెన్ హీనంబుగాఁ జిత్తముల్;
ఘనవాణిజ్యము రాజ్యమందచిగమో కాలంబుక్రిందల్ గడున్
బెనుపుంబొందిన యష్టు వీరిపయియొప్పెల్ సర్వభాగ్యంబులున్. 35

మ. వరవాణిజ్యముపంపునన్ వడిగ లేవన్ నేర్చె సౌధావళుల్;
చిరజీర్ణస్థితగోపురాళి మరలన్ లేచెన్ నభం బంటఁగా;
నురుచిత్రాకృతులొప్పెసృష్టిఁగలవస్త్రౌఘప్రభల్ మీఱుచున్;
నరరూపంబులు దాలిచెన్ గనులఁజూనన్ బాలరాళ్ళన్నియున్. 36

మ. నడిచెన్, హెచ్చుగ దక్షిణానిలముకన్నం జంచలంబై, వడి
న్వడి వాణిజ్యము వేఱుతీరములకున్ నౌకాళితో నంతటన్;
కడకుం బోరులు లేనియూళ్ళు, భటశూన్య ప్రభూత్తంసముల్,
కడవంగా సిరి తెచ్చిపెట్టినది యెల్లం బోయె నిశ్శేషమై. 37

క. వినియోగింపనినేర్పునఁ
బనిమించినవెనుకఁ దొంటిబలు పదియెల్లన్
ఘనమైనయుబ్బుజబ్బని
జనులావలఁ గనుఁగొనంగఁ జాలిరి తుదకున్. 38

ఉ. ఐనను విత్తలోపము, మహత్తరపూర్వదశా వశిష్ట ని
ర్మాణములైనశిల్పముల, రమ్యముగా నిటఁ దీర్పఁగాఁబడెన్;
వీనినిబట్టి దుర్బలమనీషయు దీర్ఘవినష్టచిత్తమున్
గ్లానియు లేక సత్ప్రతిఫలంబును గాంచినయట్లు గన్పడున్ 39

ఉ. రాగిలిచూడ వచ్చునిట—రక్తము చిందనివై భవంబునన్
ఆగనిచిత్రలేఖనజయంబులు, గుఱ్ఱపుదండు పండువుల్,
బాగగుదేవతా భజనభవ్య వివాహమహోత్సవంబులున్
జోగిరొయి యమ్మవారో ప్రతిసూనవనంబున నుండు నిచ్చటన్. 40

ఉ. బాలురయాట లెంతయును బాలురఁ దన్పెడునట్లు, యిట్టియా
లీలలు వీరిఁ దన్పు నవలీలను జింతల నెల్లఁ బాపుచున్;
చాలఁగ దీర్ఘసేవవలనన్ దలయెత్తక గొప్పకోర్కులు
న్మ్రాలములై కరంబిపుడు పుంస్త్వవిహీనముఁ జేసెఁ జిత్తమున్. 41

క. అల్పసుఖోద్దేశంబులు । పొల్పుగ నావెనుక వచ్చి భూరిత్వరతో
బల్పొందిమదిన్ వారల । నల్పానందైకతోషితాత్ములఁ జేసెన్. 42

సీ. మున్ను ‘సీజరులు’ ప్రభుత్వంబుచేసిన
సుందరసువిశాల మందిరములఁ

గాలంబుచేతను గూలి రూపముమాఱి
బీటలువాఱఁ గంపిల్లుచోటఁ
బాడుగోడలలోన పీడక యుచ్చోటఁ
జచ్చినపూర్వుల సరకుగొనక
నిలువంగనీడను నెమకుకొనెఁ గాపు
బీదకుటీరంబు వేయునొకటి
వేసినరుఁడేల మున్నట్టిపెద్దయిల్లు
కట్టవలసెనో యనుచు నక్కజము పడుచుఁ
దనదుగుడిసెనుమందస్మితంబుతోడఁ
గనుచుఁదానె ఘనుఁడనంచు గర్వపడును. 43

చ. చనుమిటనుండి నీవిఁకను స్వాంతమ ! యెచ్చటఁ గర్కశస్థలిన్
ఘనతరమర్త్యు లుద్భవము గాంతురొ, యెచ్చట వెల్లనైన 'స్విస్'
జనులు ప్రభంజనాహతనిశాంతము లొప్పఁగ రూక్షభూమి బ
ల్మిని లఘుభుక్తిఁగాంచఁ బెకలింతురొ యచ్చటుఁ జూత మింకిటన్.

చ. మనుజుని, నుక్కు-సద్భటుని, మంజుకృపాణముఁ-దక్కు, నుగ్రవం
ధ్యనగములిచ్చు వియ్యొడఁ దదన్యఫలంబుల, గొడ్డుకొండలన్
దనర నలంకరింపవిటఁ దాము వసంతసుమంబు లేవియున్;
ఘనముగ నేఁచు నిందుఁ జలికాలము మాధవమానమందునున్. 45

క. మలయానిలుఁ డెన్నండును
వలపున వరియింపఁ డిచటి బలుగుబ్బలులన్
బలుమలు నుల్కలురాలును;
గలుషమహావాతములను గావిరి గప్పున్ 46

ఉ. ఇక్కడఁగూడ భూస్థితికిఁ దృష్టి ప్రతిక్రియఁ జేసి, దానిదై
నిక్కుదురాగ్రహం బుడిపి, స్వీయమహత్త్వముఁ జూపఁ గల్గెడున్;

తక్కువ యయ్యె వేడుకలు, తద్దకుటీరము పేదదయ్యె, నల్
ప్రక్కలఁ గాంచుఁ గాఁపు తనభాగ్యమె యెల్లర భాగ్యమాటిటన్. 47

చ. తనదుకుటీర నైచ్యమును దద్దయు గేలియొనర్పఁ, జెంగటన్
గనుఁగొనఁ దొందు సౌధములు గర్వమునందల మెత్తుచుండఁగాఁ;
తనదగు శాకపాకకలితంబగు భోజన మేవగింపఁగాఁ
గనుఁగొనఁ దొందు విందు ధనికప్రభులున్నతితోడఁ జేయఁగన్. 48

గీ. మూఢతలఁ గిష్టములయందుఁ బుట్టి పెరిఁగి
యతఁడు శాంతస్వభావుఁడై యలరు కతనఁ
గోర్కెలెల్ల నాతనికి సంకుచతఁగాంచి
యతని సద్దేశమునకును సర్వఁ జేయు. 49

క. వేకువ, నుత్సాహముతోఁ
గైకొని లఘునిద్ర, మేలుకాంచి, సుతీక్ష్ణా
స్తోకసమీరముఁ బీల్చుచుఁ
బ్రాకటగతితోడఁ బాట బాడుచు, నడుచున్. 50

ఉ. గాలమునైన వైచు నుదకంబునఁ జేఁపలఁ బట్ట నోర్పునన్;
జాలఁగ దుర్గమస్థలిని నాగలినైనను నీడ్చుఁ దెంపునన్;
వాలినమంచుజాడలనుబట్టి గుహాంగనిపెట్టి, లోపలన్
గ్రాలి పెనంగుకాననమృగంబును నైనను నీడ్చుఁ బైటికిన్ 51

చ. పనులవి యెల్లఁ దీర్చుకొనివచ్చి నిశందనయిల్లు చేరుచున్
దనదుకుటీర మందిరమునన్ గృహరాజనఁ గూరుచుండి, వే
డ్కను జలిమంటఁ గ్రాఁగుచుఁ దగంజిఱునవ్వును బూని, చుట్టును
గనుఁగొను మంటచే మెఱసి క్రాలెడుబిడ్డలతళ్కుఁ జూపులన్. 52

చ. అతని ప్రియాంగనామణి గృహస్థితపాత్రసమృద్ధి కొందుచుం
గుతుకముఁ బల్లపై శుచిగఁ గూర్చును భోజనభాజనంబులన్;

అతిథిరొకండు కూడ నెపుడైన నటం జని పెక్కు లందవుం
గతలను జెప్పి, రాత్రిపడకన్ సమకూర్చినయప్పుఁ దీర్చెడున్. 53

క. తనదేశంబునఁగలిగిన
వనములు తోఁటల్లోనంగు ప్రతిసౌఖ్యంబున్
ఘనముగ నాతనిహృదయం
బునను స్వదేశాభిమానమును ముద్రించున్. 54

చ. అతనికి నింటిచుట్టు నుదయం బగుచెట్లలు కూడ నింతయున్
వెత యిడకల్పభుక్తి యొదవించునుఖం బధికం బొనర్చెడున్;
అతనికిఁ బ్రాణతుల్యము నిజార్హమనోహార సత్కుటీరమే;
యతనికిఁ బ్రాణతుల్యము మహాపవనాహతిఁ బ్రోచుకొండయున్. 55

చ. వెఱపును గొల్పుశబ్దమున భీతిలినప్పుడు తల్లిఱొమ్ముఁ దా
మఱిమఱి యంటి పట్టుకొనుమాణవకుండును బోలెఁ గొండయే
శృతిమతి ప్రేమయుచున్ వెతలునప్పుడు వాత్యలు వీచు నప్పుడున్
మఱిమఱి పాయకుండుఁ గడుమక్కువతోడ నతండు స్వాశ్రమల్. 56

గీ. ఔరా! యివికావెవంధ్యములైనరాష్ట్రి
తతులలోఁగల్గు మోహానత్వంబులెల్ల ?
వారికల్పంబులయియుండువలసినవియు
వారియాశలు హెచ్చుగాఁ బాఱకుండు. 57

ఉ. వారలదెంత శ్లాఘనకుఁ బాత్రులొ యంతయె పొందఁగా దగున్;
వారల వాంఛలెట్లొ యటె వారిసుఖంబులుఁ గొంచెమే యగున్;
వారలయుల్లమందుఁ బ్రభవంబయి వర్ధిలు ప్రత్యభీష్టముల్
సారసుఖాస్పదం బగును జక్కఁగఁ జేకుఱినప్పు డెంతయున్. 58

. మొదల నెవలోనఁగాంక్షలు మొలవఁజేసి
పిదపఁదత్కాంక్షితంబులవేగఁదీర్చు

ప్రతిమనోహరవిద్యయుఁ బాటిపోవు
నట్టిమూర్ఖదేశంబులయందునుండి. 59

మ. వెగటై యింద్రియభోగముల్ ముదమిడన్ వీఁకన్న చో, దుస్సహం
బగుశూన్యాత్మను నింపఁగా నెఱుఁగ రత్యంతోచ్చహర్షంబుతోఁ;
మొగినాత్మన్ జ్వలియింపఁజేసి తనువుం బొంగించి హృత్కంప మొ
ప్పఁ గనానందముఁగూర్చు జ్ఞానమహిమల్ స్వప్నార్థముల్ వారికిన్. 60

క. వారలమాఱునిజీవన । మారయఁగా రాఁజుచుండునగ్నిని బోలున్;
గూరుకుచెందదు లేమిని; । నూరకకడుఁ బ్రజ్వరిల్ల నుత్కటవాంఛన్.

చ. అతిఘనహర్షముల్ గన ననర్హులువారలు; వత్సరంబునం
దతుల మహోత్సవంబొకటి హర్షమువారిగఁ గూర్చునప్పుడున్
గుతుకము మూర్ఖచిత్తమున నూల్కొని భగ్నమండుఁ, దోడనే
యతిమధుపానమత్తత నదంతయు బ్రుంగి యడంగునంతకున్. 62

సీ. మఱి వారిసుఖములు మాత్రమె కావు సు
మ్మిటు మోటుగాఁ బాఱునట్టివెల్ల,
వారలనీతులు వారిసుఖములట్ల
నీచంబులయి యుండు నిశ్చయముగ
నాగరికత హెచ్చ నాగనకతమునఁ
దండ్రి మొదల్కొని తనయువఱకు,
నాచారములు మార్పునందక యభివృద్ధిఁ
గన కేకరీతినె తనరుచుండుఁ
గామమునఁనొండె మిత్రత్వగరిమనొండె
రమ్యముగఁబర్వునిశితానురాగవిశిఖ
తతులు వారలకఠినచిత్తములమీఁదఁ
దాఁకిపడు మొక్కవోయివ్యర్థంబుగాఁగ. 63

సీ. అయినఁ దీక్ష్ణతరంబులయియుండుయోగ్యతల్
కొన్ని యన్వారిహృత్కుధరసీమ
గూటిలోఁగూర్చుండు క్రూరగృధ్రములట్టు
లొండెడఁ గాలూనియుండవచ్చుఁ
గాని చిత్తోన్నతి గలవారిజీవయా
త్రలయందు విహరణంబలరఁ జేసి
దారి స్నిగ్ధంబు హృద్యముఁజేయు మృదువులౌ
ఘనసీతులన్నియుఁ గాలుకొనక
సాధుపక్షులకై వడి జాలదవ్వ
చెదరి, పక్షంబులనువిప్పి బెదరిపఱచుఁ
గరము ననుకూలమగునట్టి గగనసీమ
మించు వేడుకతో విహరించుకొఱకు. 64

క. ఇటనుండి తిరిగెదమహో
త్కటమృదువృత్తానుకూల గగనస్థలికిన్;
పటుభాసురనిజరాజ్యము
నటఁజూపెదు "ఫ్రాన్సు" దేశమదె రమ్యముగన్. 65

క. మిగులన్ సాంఘికసుఖములఁ । దగిలి ప్రమోదించుదేశతల్లజమా! పె
ల్లుగ నీలో నీవలరుట । జగమెల్లను హర్షమియ్యఁజాలును నీకున్. 66

ఉ. మెల్లగ్రమ్మాయ 'లోయరు' సమీపమునన్ సురపొన్ననీడలన్
జల్లనిగాలి నీటివలనన్ బరిశుద్ధతఁ గాంచి వీవఁగాఁ
బిల్లనగ్రోవి నేను శ్రుతిపీడినరాగముతోడ నూఁదుచో
నల్లన నెన్నిసార్లు మును పాడరు త్రుళ్ళుచు నీదుగాయకుల్ ? 67

చ. పలుమఱు నష్టనాదువెడపాట తడంబడి మేటిరాగముల్
గలయఁగ వెక్కిరించుచును నర్తకునేర్పును గాసి చేసినన్

బలువిడి గ్రామమంతయును నాట్యమహాద్భుతశక్తి మెచ్చుచున్
జెలుచ దివార్థ మాటయును విస్మృతిచెంది యొనర్చె నృత్యమున్.

చ. వయసునుబట్టి భేదము లవంబును గల్గక—వృద్ధవారలున్
రయముమెయి న్నిజార్భకుల నాట్యమొనర్పఁగఁ జెచ్చి రుబ్బునన్;
ప్రియమున సంగరాభినయవిద్యను బ్రౌఢిమఁ గన్నతాతయున్
జయజయ యంచు గంతులిడె షష్టివయః పటుభారమగ్నతన్. 69

ఉ. చింతలులేని ధన్యమగుజీవనముం బ్రకటించు నీక్షితుల్;
వింతగ వ్యర్థకృత్యముల వీరిప్రపంచము పోవు నిత్యమున్;
స్వాంతమునందు గౌరవము వాంఛ యొనర్పుట నెల్లవారలున్;
సంతతమానసప్రియము సల్పెడువిద్యలె మెండు వీరికిన్. 70

ఉ. పాత్రతఁబట్టి వచ్చుస్తుతిపాఠము లొండె, ననర్హనిష్ఫల
స్తోత్రములొండె, గౌరవము చొప్పడ నిచ్చలుఁ జెల్లునిచ్చటన్;
చిత్రముగాఁ బరస్పరము చేతికిఁ జేతికి మాఱుచుండి, స
ర్వత్ర చరించు గౌరవము వర్తకపున్సరకై యమూల్యతన్. 71

చ. జరగు సభాళినుండి యది సైన్యనివేశకుటీర పాళికిన్;
స్థిరమతి నభ్యసింతురు స్తుతిప్రియతం గడు నెల్లవారు, న
క్షరసుఖులట్లు కన్పడుచుఁ, గన్పడు నట్లగునంత కెంతయుం
బరులను దన్పుచుం దనిసి, మన్నన నిత్తురు తాము గైకొనన్. 72

ఉ. ఈసుకుమారవిద్య ముదమెంతగ వీరికిఁ గల్గఁ జేసినన్
దోసము లుద్భవిల్లుటకుఁ దోరముగా నెడ మిచ్చు వీరిలో;
వేసర కన్యసంస్తుతికె ప్రీతివహించి, సదా తదర్థమే
యాసలుసల్పుచుంటఁగృశమాచు మనోబల మంతయుం జెడున్. 73

చ. బలమఱి యాత్మయిట్లు సుఖభావముఁ దాఁ దనలోనఁ గానమిన్
జెలిమిని నమ్మియుండుఁ బరచిత్తమునే స్వసుఖార్థ మిందు ని

చ్చులు; నటుగాన వ్యర్థమగు చక్కనిటక్కుల దంభమిచ్చటన్
బలువ లోసంగు తుచ్ఛమగు ప్రస్తుతికే దగఁగాంచు నెంతయున్. 74

ఉ. ఇచ్చట వ్యర్థదంభము రహిన్ ముఖభంగవికారవేషమున్
గ్రచ్చుటఁ బూని, రాగిసరిగం దనగొంగడి కంచుఁ గూర్చెదుర్
బిచ్చపుగర్వ మిచ్చటను బేర్పడ నేఁటికి నొక్కవిందుకై
వెచ్చ మొనర్చి, మోస మొదవించుకొనుం దననిత్యభుక్తికిన్. 75

క. చంచలలోకాచారము
పంచినయెడ కెల్లఁబోవు స్వాంతం బెపుడున్
గొంచెంబైన గణింపదు
మించుగఁ దనయంతరాత్మ మెచ్చెడువిలువన్. 76

క. పరుగిడెడుబుద్ధియిప్పుడు
మరిభిన్నమనస్కులైన మనుజులపైకిన్;
వరవారధిగర్భమునం
దురవుగ 'హాలండు' దేశమున్నట్టియెడన్. 77

చ. విపులమహార్ణవుం డడరి పృథ్వికిఁ జేరగిలంగఁ బడ్డచోఁ
జపలతఁ బైఁబడన్ నిగుడుసాగరవీచుల నడ్డగింపఁగా
నిపుడు మహోన్నతాసదృశ కృత్రిమదుర్గము లేవఁదీయుచో
ర్పుపసను నిల్చియున్నటులె ప్రోలను దోఁచెద రద్ధరాప్రజల్. 78

ఉ. ఆపయి నల్లనల్ల ననయంబును రక్షణకుడ్యసంచయం
బేపుగ వృద్ధినొందుచుఁ, గుయింగడుఁ బెట్టుజలంబులోనికిన్
జాఁపుచు దీర్ఘబాహుల, వెసంగొని రాజ్యమొకింత, వేలఁ దా
నోపిక నాక్రమించుకొనుచున్నటు లిప్పుడు నాకుఁ దోఁచెడున్. 79

సీ. బలిమి నిర్బంధింపఁబడినయట్టిసముద్రుఁ
డురుకుడ్యపఙ్క్తిపై నుండి నిక్కి,

మెల్లగాఁ బ్రవహించుమేలైన కాల్వలఁ
బచ్చఁగ్రొవ్విరులయుపత్యకలను,
గన్నెరుగున్నలఁ జెన్నగుగట్టుల
వడి తగ్గి చనుయానపాత్రములను,
జనసంకులంబులౌ సంతకూటంబులఁ
గృషికర్మమున నొప్పుక్షేత్రములను,
దనదురాజ్యంబునుండి యుదారలీలఁ
గోరివిడిపింపఁబడినట్టి క్రొత్తసృష్టి
స్థలజలమయప్రపంచంబు-చెలువుమీఱ
దిగువఁతట్టున నగుచుండఁ దేఱిచూచు. 80

చ. అటువలె నబ్ధిభంగముల కంతట లోఁబడి దేశమెప్పుడున్
దటుకునఁ దన్నివాసులను దద్దయుఁ బాటుపడంగఁ జేసెడుఁ;
బటుగతిరాజ్యమేలుఁ బ్రతిమానసమందును గర్మశీల మ
చ్చట; మఱి కర్మశీలతయు సంధిలఁజేయు ధనప్రియత్వమున్. 81

ఉ. కావున, నిందఁగానఁబడుఁ గల్మినిగల్గెడి యెల్లమేళ్ళునున్
గేవలవిత్తవృద్ధి కలిగించెడుకీడులతోడఁ బూర్తిగన్;
భావములందు వారలతివాంఛ యొనర్చుధనంబు వారికిన్
వావిరిఁగూర్చు సౌఖ్యమును, వస్తుసమృద్ధియు, శోభయున్, గళల్.

మ. కనిన& సూక్ష్మముగాఁగ, వారలకడం గాపట్యముల్ వంచనం
బును గానంబడు; విక్రయింపఁబడు నాభూమిన్ స్వతంత్రత్వముల్;
కనకాత్యద్భుతశక్తి ముందుపఱచున్ స్వాతంత్ర్యమెల్లన్ వడిన్;
ధనహీనుండది విక్రయించుఁ గొనునద్దానిన్ ధనాఢ్యుం డొగిన్. 83

చ. ఇదియు మనుష్యపీడకుల కిల్లును దాసుల కాటపట్టునై
పొదలుటచే, నభాగ్యులిటఁ బొల్పరునీచపుఁజావు వేఁడుచున్,

ఉ. ఇంతియకాదు సుమ్ము చెడుగెల్ల; నిసర్గజబంధముల్ చెడన్,
జింతిలి ధర్మమున్ యశము స్నేహము స్వప్రభుతన్ దొలంగుటన్,
వింతధనవ్యవస్థల జనించినకృత్రిమ బంధజాలముల్
సంతతమున్ బలంపడి బలాత్కృతి నొంకు ననిష్టసత్కృతిన్. 95

క. కావున, నస్వవిధేయత । తావీనికిమాత్ర మొప్పుడు దాస్యముచేయున్;
ప్రావీణ్యంబడుగంటును; । నేవారికిఁ దెలియకేప్పునిట యోగ్యతయున్.

సీ. కాలమిూకై వడిఁ గడవంగ, గడనంగఁ
దనమనోజ్ఞతలెల్లఁ దరలవిడిచి,
నిలుపుదు రెచ్చోటఁ గులపతులు త్రముల్
దేశాభిమానాగ్ని తేజమెసఁగ,
శ్రమపడిరెచ్చోట రాజులుకీర్తికై
కవులెందువ్రాసిరి ఖ్యాతికొరకు,
నట్టిపండితులకుఁ బుట్టినయిల్లును
నాయుధపాణుల కాటపట్టు,
నైనయిూదేశ మొకటనత్యాశచేత
సర్వ దుర్వాసనలకును స్థానమగును ;
పండితులు వీరభటులును బార్థివులును
సత్కృతినిబొందకేఁకముందుచత్తురిందు. 97

చ. కొలిచెద నంచునో ఘనులఁ, గోరిన్నపాళి నుతింతు నంచునో,
తలఁపఁగ బోకుఁడేనిటు స్వతంత్రతచేనగుకీడు లెన్ను చో;
తొలఁగఁదోలుఁ డిట్టిదగుతుచ్ఛపువాంఛ మదాత్మనుండి, నా
తలఁపును బాయకుండెడి యథార్థనమర్థతలార ! దప్పగన్. 98

సీ. ఉరుశోభ నలరారు నోస్వతంత్రత్వమా !
యల్లరిమూఁకల యాగ్రహమునఁ,

క్రూరమహీపాలకుపితాసి నొక్కట
బాధలుపడ నలవడితివీవు;
గర్వసంయుత తిరస్కారంబుచేనొండె,
జెలిమిఁ బెంచుకృపార్కచేతనొండె,
సమరీతిఁ జేటొందుకుణభంగురంబైన
యలరుఁ బోలెడుదాన వైననీవు,
సతతమును మాఱుచుండు దేశంబునందు
నీవికాసముల్ స్థిరముగా నిలుచుఁగాత!
వానిని సురక్షితముగఁ గాపాడుకొఱకె
యొకటనేను నిరోధించుచున్నవాఁడ. 99

క. ఆలోచించెడువారలె, పాలింపఁగ వలయుఁ బొటుపడువారల నం
చీలోకానుభవం బది, వాలాయముఁ దెలుపుసరిగఁ బ్రతిదేశమునన్.

చ. క్షితిని స్వతంత్రతాగరిమ చేయఁగజాలుప్రయత్నమంతయున్
హితముగ నెల్లవారలపయిన్ నగుభారముఁ బూన్చులేకదా?
అతిఘనవృద్ధి నొక్కతెగ యందలమించి యతిక్రమించినన్,
హతమొనరించు దానిద్విగుణం బగుభారము క్రిందివారలన్. 101

గీ. మించికొందఱు మాత్రమె కాంచునపుడు
దాని స్వాతంత్ర్యముంచును దలఁచువారు
సత్యమర్థించుదానికి సర్వమునకు
నుర్వి నెంతయంధులుగాఁగ నున్నవారు!

సీ. స్వాధికారంబును వ్యాపింపఁజేయంగ 102
రాజాధికారంబు హ్రాస్వపఱిచి,
ప్రతిపక్షనాయకుల్ ప్రముఖులై సింహాస
నముఁ జుట్టుకొనఁగఁ బెనంగునపుడుఁ,

దాము మాత్రంబె స్వతంత్రులై యుండుచో
నొక్కపక్షమువార లొకటఁజేరి,
యదియ స్వాతంత్రతయంచును బిలువంగ
ననుమతించుటఁ గనుంగొనినయపుడు,
వేగ నాసన్నమగుచున్న పెనువిపత్తు,
గురుతరోద్రేకమును బురికొల్పినపుడు,
దక్క నాయాత్మశాంతతఁ దాల్చియుండుఁ;
దగదుపోరికిశత్రులుదాల్చి లేవ. 103

మ. సమకూర్పుం బ్రతిధర్మదాతయు నిజేచ్ఛన్ నూత్నశిక్షాస్మృతుల్;
నమలున్ బీదలఁజట్టముల్; ధనయుతుల్ శాసింత్రుచట్టంబులన్
స్వామహీన్ దాసులవిల్చుపొంకె శబరుల్ సంచారముల్చేయుదే
శములన్ దాసులనుండి సంపద యథేచ్ఛన్ గొల్లకొట్టంబడున్. 104

మ. భయకారుణ్య నయోగ్రకోపములు పైపైఁబొంగి, గొప్పస్థితిన్
బయలంబెట్టుచు, నుబ్బియున్నమనసుల్ బాహాటమున్ జేయ, ని
ర్దయులౌ నీమనుష్యులన్విడిచి పర్వంజూతు దేశాభిమా
నియు భీరుండును గొంతకొంతయగుచున్ బృథ్వీపతిం జేరఁగన్. 105

చ. ధర నధికారకాంక్ష తొలుతన్ నృపభూతినెదిర్చి, యాగతిన్
సరగున గౌరవంబు జననస్థలమంచెకలంచి, రాజ్యమున్
జరప మనస్సుపై ద్విగుణశక్తిని గల్మికి నిచ్చినట్టియా
పరమనికృష్టకాలమును, భ్రాత శపింపుము నీవునావలెన్. 106

చ. కనమె నిరర్థలోహమునకై యుపయుక్తజనుల్ 'బ్రిటానియా'
జనబహుళాబ్ధితీరముల సత్వరివర్తమొనర్పఁగా బడన్?
అనిమొనఁ గల్గుతజ్జయములన్నియు, దీపములాఱునప్డు భ
గ్గనగడుమండి మగ్గుగతి, గొబ్బునినాశముఁగూర్పఁ గానమే? 107

మ. కనమే సంపద స్వీయవైభవ మహోత్కర్షాభిరక్షార్థమై
తనభృత్యాళికి నిండ్లుగట్ట విజనత్వంబుం గడుంగూర్చి, రొమ్
య్యన వెన్కం జెలువల్లియల్ చెదరి యుండంగన్న క్షేత్రంబులన్
జనశూన్యంబగు వంధ్యదంభమున విశ్రాంతింపగం జేయంగనే! 108

క. కనమే మానమకటా యొక,
ఘనుఁడు వినోదంబుకొఱకుఁగా నిడువాజ్ఞన్
జనసంచారము సతతముం,
గని మునుకలకలను నవ్వుగ్రామముకూలన్? 109

సీ. ఆజ్ఞానువర్తియై యలరెడుపుత్రుండు
నత్యంతజీర్ణాంగుఁడైనపితయు,
వినయశాలినియౌచు వెలసెడుమాతయు
ఘనలజ్జగలయట్టి కన్యకయును,
నడవినిబ్రవహించు 'నాస్విగో' నది యొందు
స్వీయకచ్ఛములవ్యాపింపఁజేయు,
నెట 'నయగ్రా' నది ఘటియించు బధిరతఁ
బిడుగులవంటి చప్పుడులచేత,
నట్టి పశ్చిమజలధికి నవలనున్న,
దేశముల నివాసార్థమై తిరుగఁగనమె
స్వస్థలంబుల విడిచి నిర్బంధమునను,
మెలఁగుశోచనీయకుటుంబములనుమనము? 110

చ. తవిలిమనుష్యుతో మృగముతానెట రాజ్యముపాలుగోరునో,
మొఱ్ఱచునా యెట్టి 'యిండియనుఁ' డెచ్చటఁ జావుగఁజేరెన్ శరంబు, న
య్యా విరళకాననాంతరములందు భయంకరమైన త్రోవలం
దెవఁడయినన్ సకృత్పథికుఁడిప్పుడుకూడనటుం జరించుచోన్. 111

సీ. అచ్చోటనెంతయు నావర్తమయములౌ
వాత్యా లోకసమునఁ బర్వుచుండఁ,
దనచుట్టు నెల్లెడఁ ద్రాసకరంబులౌ
మృగముల యూర్పులు నిగుడుచుండ,
దీర్ఘ చింతాక్రాంత దేశబహిష్కృతుం
డతిదుఃఖభారంబుకతన వంగి,
నిస్తులభీతిచే నిలువంగ నొల్లక
సత్యహీనుండౌటఁ జనఁగలేక,
యెచట 'నింగ్లాండు' మహిమలు హెచ్చివెలుఁగు
నచటికిసి దీర్ఘదృష్టుల నల్లఁ బఱపి
తొడరి నాయభిప్రాయంబుత్రోడఁదనదు
మనసు నేకీభవింపంగఁ జుమ్మ్ర. 112

చ. హృదయమునందెలోన వసియించెడుసౌఖ్యము బైలఁగాంచ, నే
వెదకుటయెల్ల వ్యర్థమగువేసట యయ్యె బహుప్రయాసతన్;
వదలి సుఖంబు విశ్రమముఁ, బైఁ బ్రతిరాజ్యము నిచ్చసౌఖ్యమున్
వెదకఁగ దేశదేశములవెంబడి నేటికి సంచరించితిన్? 113

ఉ. త్రాసము లెల్ల రాజ్యముల రాజ్యముచేయుచునున్న, దుష్టమా
శాసనజాల మొండెఁ జెడు తన్మ్రపతు లొండెను బాధ పెట్టినన్
శాసనముల్ నృపాలురు నొసంగనుమాన్పను జాలుభాగ మా
హా! సరిచూడ, నెంతయసదా! జనచేతము లొందునంతలోన్. 114

ఉ. తెల్లముగా ధరిత్రిఁ బ్రతిదేశమునన్ మనమాత్మనమ్మదం
బుల్లములోనె కన్గొనును మొండె సృజింపుదు మొండె నెప్పుడున్;
పెల్లుగ మోహయుక్షోభముల వేదన నొందక గూఢరీతితో
మెల్లఁగఁ బాఱుచుండు: బుడమిన్ గృహసౌఖ్య రసప్రవాహముల్.

ఉ. ఎత్తినగండ్రగొడ్డలియు, హింస యొనర్చెడు చుట్టువాలునున్,
రిత్తగు 'ల్యూకు' లోహపుఁగిరీటము, 'డామియు' నిన్నపాన్పునన్,
బొత్తిగ నెప్పుడున్ ధనవిభుత్వవిదూరులపొంతఁ బోక, జల్
సొత్తుగ వారికి న్నిడుచు శుద్ధమనస్కృత బుద్ధిభక్తియున్. 116

ఆ. వె. హూణకవులపోక లోకయింత తెలుపంగఁ
వెలుఁగువారికొఱకుఁ దేటగాను
'గోల్డుస్మిత్తు' ను కవిగూర్చినయట్టి యీ
పత్రికచరిత మేను వ్రాసినాఁడ.

క. ఒకభాషలోని సరసత
నొకభాషకుఁ దెచ్చు టెంతయును దుస్సాధ్యం
బకటా! నా కది శక్యమె?
సకలకవులు నాయశక్తి క్షమియింపఁదగున్.

# జాన్ గిల్పిన్

గీ. లండ ననియెడుపట్టణ మొండుగలదు,
దాన, గణ్యతయుఁ బ్రసిద్ధితద్దగలిగి,
యుద్ధవేళనె పనిచేయుయోధవరుఁడు,
జానుగిల్పిను వసియించు సంతతమును. 1

గీ. అతనిప్రియకాంత యొకనాఁడు పతికినినియె :—
"మనవివాహంబు నడచినదినమునుండి
యిరువదేండులు గడచియు, నింతవఱకుఁ
బండు గొక్కటియును జేసి యుండమెపుడు." 2

గీ. "మనదుపెండిలి నడచినదినము రేపు;
రెండుగుఱ్ఱాలఁ బూన్చిన బండినెక్కి,
వేగ నెడ్మాంటనున నుండుబెల్లునకును,
నందఱముఁగూడిపోవుదమందుకొఱకు. 3

గీ. "నాదుసోదరియును, దానినందనుండు,
నేను బిడ్డలుమూవురు, నెమ్మదిగను
బండిలోనుండెదము; మీరుబండివెనుక,
వారువము నెక్కితగ నేగు దేరవలయు." 4

గీ. ఇంతి కాతఁడు వేగంబ యిట్టులనియె :—
"మెలఁతలం దొక్కతెనె నేను మెచ్చుకొందు
నదియుఁ బ్రాణనాయిక నిన్నెయగునుజుమ్ము:
కనుక, నల్లె కావింతము మనము రేపు" 5

గీ. "గొప్పనారబట్టల వర్తకుండ నంచు,
జగమెఱుంగునుగాదె యోమగువ! నన్ను;
ప్రాణమిత్రుఁడుమనపట్టువర్తకుండు,
తనదుగుఱ్ఱంబు, నెరువిచ్చుఁజనఁగనాకు." 6

గీ. భార్యయిట్లనె—"బాగుగఁ బలికితీవు;
ద్రాక్షసారాయి ప్రియమౌట దానికొఱకు,
రంగుగలదిగాను, గడుశుభ్రంబుగాను
నున్నమనపెకొంపోవుద మొంటుదక్క." 7

గీ. దానికపరిమితానందమూని, యాతఁ,
డట్టిసంతోషసమయంబునందుఁగూడఁ,
బ్రియవధూమణితామితవ్యయమునంచె,
పెద్దతివిలియుంటకు ముద్దుపెట్టుకొనియె. 8

గీ. తెల్లవాఱెను, బండియు నల్లవచ్చెఁ,
గాని, యెల్లరు గర్వముఁగలదటంచుఁ
దనుఁదలఁతురంచు, గుమ్మముదరికిదానిఁ,
దీసికొనిరాకయుండంగఁ జెఱవపనిచె. 9

గీ. అంతుచే, మూఁడుగుమ్మములంతమూర,
మునవెయూఁగెనుశకటంబు, పోయియుటకు
నొకరినొక్కరుమించఁగనొక్కసారి,
యాఱుగురునందుఁజొచ్చిరియాత్రముగను. 10

గీ. చబుకుకదలెను; జక్రముల్ సరగఁదిరిగె;
బండిలోనివారానందభరితులయిరి;
కలగలమటంచు దిగువను శిలలు మొరసె,
నడుగుతట్టునకును వెఱ్ఱికొఁడరినట్లు. 11

గీ. జానుగిల్పిను గుఱ్ఱపుసరసకరిగి,
వేలుజాలును గరమున వేగ బట్టి,
స్వారిసేయంగఁబైకెక్కె సంభ్రమమున;
కానిశీఘ్రంబదిగి యొనుగ్రమ్మఱంగ. 12

గీ. తనదుపయనంబుసాగింపఁదలఁచియతఁడు,
వారువపుఁబల్లమునొకింతచేరతడవ,
వెనుకవంకకు దలద్రిప్పి కనియెనపుడ,
మూవుర, సరకుఁగొనలోనఁబోవువారి. 13

గీ. కాలయాపనమగుటకుఁజాలచింత,
గదిరియును, సొమ్ముచనుటంతకన్నఁదన్నుఁ
జింతనొందించునని తనచిత్తమందు,
నెఱుఁగుఁగాపున, దిగివచ్చెనింటికతఁడు. 14

గీ. చాలసేపటిదాఁకను, సరకుఁగొనెడు,
వారిమదికిఁ గుదురదయ్యె బేర మపుడు;
బ్రాతుసారాయిమఱచియెతరలిరంచు,
నరచుచునుమేడదిగివచ్చెనబలయోర్తు. 15

గీ. "అయ్యయో! యెంతమఱపయ్యె! నయిన నేమి ?
లెమ్ము నాకడకది; సాధకమ్ముచేయు
నపుడు కత్తినివేసెడు నట్టినడుము
పటక యున్నదిలే" యని పలికె నతఁడు. 16

గీ. శ్రద్ధ కలదయి యాతనిచాన, తనకుఁ,
బ్రాణపద మైనసారాయి పట్టుటకును
రాతిజాడీల రెంటి జాగ్రత్తచేసి
భద్రముగ దానివానిలోపలనుబోసె. 17

గీ. ఉండె బుడ్డిబుడ్డికి నొక్క యుంగ్రపుఁజెవి,
దానిలోనుండి తనపటకాను దూర్చి,
రెండుప్రక్కలఁ దూఁకంబు నిడియుండఁ
బ్రక్క కొక్కటి వ్రేలాడఁబడఁగఁ గట్టె. 18

గీ. అంతయును గానరాకుండ, నడుగుమొదలు,
శిరసువఱకునువలువఁగ్రై నేసికొనఁగ

నుదికివెచ్చినపొడుగంగి నొక్కదాని,
నెత్తిదానిఁ జక్కఁగ ధరియించుకొనియె. 19

గీ. అవలఁ జూలుకై నతనపూర్వహాయము నెక్కి,
తిరిగిపయనంబుసాఁగించె దిగువనున్న
రాళ్ళపై గుఱ్ఱ మధికజాగ్రత్తతోడఁ,
గడుమెలంకువ మెల్లఁగా నడుచుచుండ. 20

గీ. బాగుగా నాడకట్టినపాదములకు
శీఘ్రమే మంచిమార్గంబు చిక్కఁగాన,
హెచ్చు దాఁటులువేయుంగఁ జొచ్చె హాయము
రాపిడిని నాతఁడెంతయు వంతనొంద. 21

గీ. అందుచే, జానటంచునుననుచెనతఁడు,
స్పష్టముగ మెల్ల నదియెల్ల వ్యర్థమయ్యె
పగ్గమును గళ్ళెమునుగల్గి పనికిరాక,
యల్ల దాఁటులె వడిబఁరుగయ్యెఁగాన. 22

గీ. తిన్నఁగాఁ గూరుచుండ లేకున్న వాఁడు,
గాన, దానిపై నడ్డముగాఁగ వంగి
రెండుచేతులతో నేకరీతిగాను,
బలముకొలఁదిని జూలును బట్టుకొనియె. 23

గీ. తొల్లి యెన్నఁడు నారీతిఁ దురగ మద్ది,
యూఁది పట్టుకోఁబడ్డదికాదుగానఁ
దనదుపీపుపై నెద్దియొ క్కనోయటంచు,
జడిసిమతిమతియద్భుతపడుచునుండె. 24

గీ. దూరముగఁ బోయెగిల్పిను, దూరముగను
బోయెజుట్టును టోపి బోడితలగ;
నతఁడు బయలుదేఱెడియప్పు డాత్మయందు
నింతపని సంభవించునం చెరుఁగఁడయ్యె. 25

గీ. గాలివీవంగఁ జొచ్చెను, గదలఁ దొడఁగె
నంగియును బెద్దధ్వజపటమట్లు మిగుల;
కొక్కెములును గుండీలును గూడనూడి
తుదకుఁ బైనుండి యంగియుఁ దొలఁగిపోయె. 26

గీ. పయిని జెప్పినరీతిని బ్రక్క కొకటి
వ్రేలునట్టుగఁ గట్టినవింతయైన
బుడ్లు రెండును జనులెల్ల బ్రోవుగూడి
చోద్యపడిచూడఁ దగియుండె సూటిగాను. 27

గీ. కుక్క లఱచెను, వీథిలోఁ గుఱ్ఱవాండ్రు
పెద్దకేకలువైచిరి, పెద్దవారు
తమగవాక్షములనుజేరి తెగినయట్లు,
లయ్యోనంచును గట్టిగా నఱచిరొకట. 28

గీ. ఒక్కవడిఁ బోయె జాన్గిల్పినొక్కరుండ—
"బుడ్లు కట్టుకొనియె! పందెమును వహించె!
లక్షసేయు!" నటంచును దత్క్షణంబ
మతనికీర్తి వ్యాపించెను నన్నికడల. 29

గీ. వాయువేగంబుతోఁ జేర వచ్చినపుడు,
వీథికావలివారలు వింతగాను
నిమిషమాత్రంబులోపల గమిడినెట్లు,
తెఱచిరోచూడఁజిత్రంబుమరియుఁగరము. 30

గీ. పొగలువెడలెడుతనతలమిగులఁగుంచి,
బోరగిలఁబండుకొనిక్రిందఁబోవునపుడు
మున్ను వెనుకను గట్టినబుడ్లురెండు,
నొక్కదెబ్బను బగిలెను వ్రక్కలుగను. 31

గీ. కాంచుటకు నెంతయునుజాలిగదురునట్లు,
తెరువునిండనుసారాయిదిగువఁగాఱె;

మున్నుకట్త్రోఁగడుఁగొట్టియున్నకతన,
హాయముప్రక్కలఁబోఁగ లేచెనందుచేత. 32

గీ. త్రోలునడికట్టుబిగియింపుతోడ, నింక
బరువు మోచునట్టులె కానఁబడియె నతఁడు,
నడుమునను వ్రేలుజాడీలమెడల, నెల్ల
వారునిప్పుడుఁ జూడంగవచ్చుఁ గాన. 33

గీ. అంతబిగిని, నెడ్మాంటనునందు నుండు,
వాషనుప్రదేశమునకును వచ్చుదాఁక,
నాతఁ డైస్లింగుటనుగుండ నాడెనిట్టి,
నాటకంబును సంతతానందమునను. 34

గీ. పథముపొడుగున రస మిరుప్రక్కలందుఁ
గలయఁ గలయంపి చల్లె నక్కడ నతండు;
అలుకుగుడ్డ నొండెను, బాతులాటయందుఁ
బాచికల నొండె, దొరలించుపగిది తోఁప. 35

గీ. అప్పు డెడ్మాంట నను గ్రామమందు నుండి,
యతనిప్రియభార్యయు వసారయందు నిలిచి
కాంచె హృదయేశ్వరునివంకఁ గన్నులార,
నట్లు స్వారిచేయుట కెంతొ యబ్బపడుచు. 36

గీ. "ఆఁగు మాఁగుము; గృహ మిదె; యరుగ వలను;
భోజనపువేళ యయ్యె; మేము నలసితిమి"
యంచు నందఱు నొకపెట్ట నఱచి రపుడు—
"నేను నెల్లతి" ననియెను జాను నంత. 37

గీ. కాని, గుఱ్ఱంబు రవ్వంతయైన నచట
నిలువ నిష్టంబు పడకుండె; నేలనిలుచు
దానియజమానుఁ డామడదవ్వు నందు
వేరనెడి చోఁ గలిగియుండ వేఱెయిల్లు. 38

గీ. బలముగలయట్టి నెఱవింటివానిచేత
విడువఁబడినట్టి బాణంబువిధముగాఁగఁ
బఱచె నశ్వంబు, దానిపైఁ బఱచెనతఁడు—
కథయు సగమయ్యె నాకు నిక్కడకుఁ జూడ. 39

గీ. తనకుమిత్రుఁ డౌపట్టువర్తకునియింటి
వెలుపలఁదుదకుఁదురగంబునిలుచుదాఁక
దవ్వుగాఁబోయె గిల్పిను, తనకొకింత
యిష్టమేనియు లేకుండ నింతలోన. 40

గీ. తనకుఁపొరుగువాఁ డావేషమునను వచ్చు
టద్భుతంపడి చూచి, పొగాకుగొట్ట
మచటఁ బడవైచి, గుమ్మంబునండ కరిగి
తొలుతనీరీతి నాతనిఁ బలుకరించె 41

గీ. "వార్తలేమిటి? యేమిటి? వడిగఁజెప్పు;
చెప్పు నీవర్తమానంబు శీఘ్రముగను
వట్టితలతోడ నేటికి వచ్చితీవు?
కదలి యిచటకు రానేల మొదల నీవు?" 42

గీ. అవసరోచిత మైనట్టిహాస్యమందు
మిగులఁ బ్రియుఁ డౌటఁ దననేర్పు మెఱసి యతఁడు
ముఖవికాసంబు నటియించి, మురువుదోఁపఁ
బట్టువర్తకుతోడుతఁ బలికె నిట్లు. 43

గీ. "వారువం బిటు రాఁగోర, వచ్చితేను;
చక్కఁగా జ్యోతిషము చెప్పఁజాలితేని
నాకృతకశిఖ కుళ్ళాయినన్నుఁజేరు;
తెన్నునడుమను నవిపడియున్న విపుడు" 44

గీ. ఆత్మసఖుఁడు కుతూహలాయత్తుఁ డగుచు
నుంట కెంతయు నలరారి, యొక్కమాట

మైన మాటుగాఁ బల్కక, యప్పుడ తనదు
భవనమును జొచ్చి యాఁపట్టువర్తకుండు. 45

గీ. కల్లజట్టు టోపియుఁ గొంచునల్లవచ్చె
మందిరమునుండి ; రెండునునందముగనె
యుండె—జట్టది వ్రేలాడుచుండె వెనుక
కరముఁగుళ్ళాయి చెడ్డదికాకయుండె. 46

గీ. వానిరెంటిని బైకెత్తి పట్టిచూపి
తనచమత్కారమును దోఁప ననియెనిట్లు—
'కనఁగ నాతల నీతలకంటె రెట్టి
గాన సరిపెట్టుకొనవలె వీని నీవు.' 47

గీ. నీకు నెమ్మోమునందును నెలవుకొన్న
దుమ్ము నించుక దయచేసితుడువనిమ్ము ;
నిండ నీ వాఁకలిసి గొనియుండవచ్చు ;
నిప్పుడిటనిల్చిభుజియించియేగుమవల.' 48

గీ. అందుమీఁదను జానిట్లు లనియె—"నేఁడు
నావివాహదినము ; వేరునందు నేను,
భార్య యెడ్మాంటనున, పింకుఁ బరఁగఁగొన్న
లోకమెల్లను మముఁజూచిలోన నగరె ?" 49

గీ. వాని నాలించి తనతేజివంక మరలి
యనియె—'నే నిప్డు గుడువంగఁ జనఁగవలయు;
నీవు నీయిష్టమునుబట్టి యిటకు వచ్చి
తట్ల నాయిష్టమునుబట్టి యరుగు మరల." 50

గీ. అహహా ! దురదృష్టవాక్యంబు ! వ్యర్థదంభ !
మంకునకుఁదోడనే తగినట్టులయ్యె—
నంచు ముచ్చటించుచునుండ నఱచెనొక్క
ఖరము సంగీతసరణిని గట్టిగాను. 51

గీ. అందుపై సింహగర్జనం బాలకించి
నట్టులికిలించుచును లేచి, యడరి పట్టఁ
బగ్గములు లేక, యొక్కటఁ బరుగువాఱెఁ
దొంటికై వడినేయల్లతురగమపుడు. ౫౨
గీ. దూరముగఁబోయెగిల్పిను, దూరముగను
బోయెమాయజుట్టుఁబెనుకుళ్ళాయిమిగుల;
తొంటికంటెను నీసారి తొలఁగెనెగ
నవియు, మిక్కిలిపెద్దవియాటకతన. ౫౩
గీ. ఊరువాఁటి పయికిఁ జాలదూరముగను
దనకుపెనిమి పఱగడఁ జనఁగఁ జూచి
నప్పు డాతనిభార్యయు నాత్రముగను
బంగరువరాను నొకదానిఁ బైకిఁ దీసి. ౫౪
గీ. బెల్లునకుఁ దమ్ముఁ గొనివచ్చి విడిచినట్టి
బండికుఱ్ఱనిఁ గన్గొని పలికె నిట్లు—
'సుఖముగా నాదునాధునిసొంపుచెడక
నిలిపితెచ్చితేనియు నది నీదిసుమ్ము. ౫౫
గీ. వాఁడును దురంగమునునెక్కి వడివెనుకకుఁ
గ్రమ్మఱఁగవచ్చు జానును గలిసికొంచుఁ
గళ్ళెమును బట్టుకొంటచేఁ గడలకుండ
నిలుప యత్నించె దానిని నిమిషమునను. ౫౬
గీ. సంతసంబున నాలాగె సలుపుఁగాని
యైన, ననుకొన్నయట్టు చేయంగలేక,
భీతవాహమును మఱింత బెదరఁగొట్టి
మఱియు వేగంబుగాదానిఁబఱవఁజేసె. 57
గీ. దవ్వుగను నేగెగిల్పిను, దవ్వుగాను
జాంఘికుఁడు నేగె వెన్నంటి జానుతోడ ;

బండికుఱ్ఱనిగుఱ్ఱంబు బండియొక్క-
చక్రములబాధపోకకు సంతసించె. 58

గీ. పథికు లార్గురు, త్రోవలోఁ బరుగువాఱు
జాను, నాతనివెనుకను సత్వరముగఁ
దఱుముకొని పోవుకుఱ్ఱని, దవులఁ గాంచి
దొంగయని యెంచి యార్చి రందఱును నిట్లు— 59

గీ. 'తస్కరుఁడ ! యాగు మాగుము దారిదొంగ !'
యొక్కరుఁడు నందు నూరక యుండ రైరి
దారిపట్టుక పోయెడువార లెల్లఁ
దప్పకుండఁగఁ జేరి రాతఱుముటందు. 60

గీ. పట్నఁ గొనువారు 'మునుపటివలె నెజాను
పందియము వాఱుచున్నట్టు డెందమందుఁ
దలచుటను, వీధి కడ్డగుతలుపు లపుడ
తీయఁబడియెను జనుటకుఁ దెఱపిగాఁగ. 61

గీ. అట్లుచేని యీపందెము నతఁడె గెల్చెఁ
దానెముందుగఁబురిచొచ్చెఁగాననిపుడు
ఎందునాగఁడయ్యెను బూర్వమెక్కినట్టి
తిన్నెచెంతనె క్రమ్మఱదిగినదాఁక. 62

గీ. నృపుఁడ ! చిరజీవివిగఁగమ్ము నీవు ; జాన !
నీవునట్లెకమ్మంచు వర్ణింతమిపుడు ;
వెండియును నాతఁడిటుస్వారివెడలునపుడు
కనుటకును నేనుచటకుఁ జనుదుఁగాక ! 63

గీ. కౌప రనియెడియింగ్లీషుకవివరుండు
హాస్యకృతిగాఁగమును చేసినట్టిదీనిఁ
దేటగీతులతోడను తెనుఁగునందుఁ
గందుకూరి వీరేశలింగము రచించె. 64

# నై తి దీ పి క.



By

**K. VEERESALINGAM**

# నీతిదీపిక.

దేవుఁడు.

ఆ. శ్రీలొసంగ నాదుచిత్తంబులోపల
భక్తితోడ నిలిపి ప్రస్తుతింతు,
నిఖిలలోకవంద్యు నిత్యుని బరమేశు
నాశ్రితజనశరణ్యు నగ్రగణ్యు. 1

ఆ. తెల్లవారలేచి దినమెల్ల గావించు
పనులలోనఁ గానిపనులు కొన్ని
కలుగుఁ గాన, వానిఁ గరుణతో సైరింప
దేవుఁ గొలువవలయు దినమునందు. 2

తే. పనులఁ జాలించి, నిద్రింపఁ జనెడునపుడు
మనసులో నీశ్వరుని వేఁడుకొనఁగవలయు,
నొడలెఱుంగక నిదిరించుచున్నయపుడు
మనకు నొకకీడు రాకుండ మనుచుకొఱకు. 3

తే. మనకు మేలైనయపుడెల్ల, మఱచిపోక
దైవమును జాలభక్తితోఁ దలఁపవలయు;
నతనిదయచేత నేకదా యట్టిశుభము
లొదవు మనకని గట్టిగా మది నెఱింగి. 4

తే. కీడు మూఁడినవాఁడును వేఁడుకొనుము
నీవు, భగవంతు దృఢముగా భావమందు
నట్టియాపద నడఁగింప, నతఁడె తక్క
మఱియొకండు సమర్థుఁడు మహిని లేఁడు.

తనవారు.

తే. తొలుత నెన్నెన్నొవ్రతములు సలిపి, గర్భ
మందు నవమాసములు మోసి, యవలఁ గాంచి

పెంచి, పెద్దవానిగఁజేసి మంచిసట్టి
తల్లిఋణమింపుకయుఁ దీర్పఁదరమె మనకు? 6

తే. విద్యయును బుద్ధి చెప్పించి, వెలయఁజేసి
కాయమొక్కింతనొచ్చినఁ గలఁతపడుచుఁ
దగుచికిత్సలఁ జేయించి, తెగులుమాన్పి
మనల నింతవారిగఁ జేసె జనకుఁ డరసి. 7

తే. ఒకగర్భవాసంబున నుద్భవించి,
యొక్కతల్లిపాలఁబెరిగి, యొక్కశయ్యఁ
బండుకొని యుండి, పయిఁ బ్రక్కఁ బడుచు నుండు
సోదరులు పరస్పరమైత్రి నుండవలయు. 8

తే. చేయవలెఁ దల్లిదండ్రులు చెప్పుపనిని
మాఱువల్కక పుత్రుండు, మనినదనుకఁ
జుట్టములనెల్ల బ్రేమతోఁజూడవలయుఁ
జేతనైనంతసాయంబుఁజేయు చెపుడు. 9

మంచిబాలుఁడు.

ఆ. ప్రొద్దుపొడువకుండ నిద్దురమేల్కని
సమయకృత్యములను జక్కఁబెట్టి
పుస్తకములఁ గొనుచుఁ బొరుగుపిల్లలఁగూడి,
బడికిఁబోవు మంచిబాలకుండు. 10

తే. భోజనముచేయునప్పుడు బుద్ధిగలిగి
లేనివస్తువులెమ్మని లేనిపోని
యాగడముచేసి యలఁచక, వేగముగను
గలకొలందినిభుజియించికదలిపోవు. 11

తే. తానుబడియందుజదివినదానినెపుడు
మఱచిపోవక, వల్లించుమరలమరలఁ

బు స్తకంబులఁ జింపక, పొదుపుగాను
వాడుకొనుచుండుఁదనతోడివారు మెచ్చ. 12

తే. తనకుదీక్షకయైనట్టితఱిని దినము,
సెలవులిచ్చినదినములఁ జింతనంబు
సేయుచును, నాటపాటల చేతఁ బోక
కరము ప్రాఁత పాఠంబులగట్టిచేయు. 13

తే. చెడ్డబిడ్డలతోఁ జెల్మి చేయఁబోఁడు;
తల్లిదండ్రులమాటల దాఁటకుండు
గురుని దైవంబుగానెంచి కొలువుసేయుఁ;
జూడమనసైన, నల్లరిజాడ; జనఁడు 14

విద్య.

ఆ. విద్యవలన మిగుల వినయంబు గలుగును;
విద్యచేతఁ దెలివి విస్తరిల్లు;
విద్యచేతఁగరము వెలయును యోగ్యత;
విద్య లేనివాఁడు వింతపశువు. 15

ఆ. ధనముతఱిఁగిపోవు దానంబుచేసిన,
విద్య దానమునను వృద్ధినొందు;
విత్తమరసిచూడ విద్యాధనముతోడ
నీడ నంగఁ దగునె యించుకైన? 16

ఆ. చదువువేళ నీకు సందేహమేదేని
తోఁచెనేని, మదినిదాఁచుకొనక,
గురునియొద్దకరిగి, గొబ్బుననడుగుము;
సిగ్గుపడియె దేని, చెడుదువీవ. 17

ఆ. మురుగులుంగరములు ముత్యంపుసరులును
బురుషుని గయుసేయు భూషణములె?

యరనిమేషమునకు నన్నియునశియించు;
విద్యయొకటె యెప్పుడువిడనిసొడవు. 18

తే. రాజుతన దేశముననెగౌరవముగాంచుఁ;
బండితుఁడో, యెల్లయెడగౌరవమ్ముపడయుఁ;
జనుపునకు రాజ్యమైనను జాలదనఁగ,
విద్యతోసాటి మఱియేదివిశ్వమునను ? 19

అ డఁ కు వ.

ఆ. ఎంతకలిమిగలుగు, నంతయడంకువఁ
గలిగియుండవలయు, గర్వపడక;
యన్నిగుణములుండి, యడఁకువ లేకున్న
నిష్ఫలంబులవియు నిశ్చయముగ. 20

తే. చదువునకుఁదోడువినయంబు గుదిరియుంట
పసిఁడికినివాసియబ్బిన భాతియగును
విద్యగలిగియు నడఁకువ వెలయకుంట
యమరతరువునుగచ్చచెట్టలముకొనుట. 21

ఆ. అడఁగిమడఁగియుండునాతనిగుణములు,
కొలఁదివైన, మిగుల గొప్పవగును;
విఱ్ఱవీఁగుచుండువీఱిఁడిగుణములు,
గొప్పవైన, మిగులఁగొలఁదివగును. 22

తే. క్రిందుమీఁదును గానక కెవలిపడెడు
నరునిసుగుణములెయవగుణంబులగును;
జెప్పనేటికి? వానికిఁ జెడుగుణములె
కలిగియున్న, నిఁకెట్టుగాఁదలఁపఁబడునో. 23

గ ర్వ ము

తే. కలిమి భువిలోన నీకెంతకలిగియున్న,
గర్వపడకుము నేనెకా ఘనుఁడననుచు

నెంతసిరియుండు, నంతకు నేనుమడుఁగు
లడఁగియుండు; నీకయశ్రేయస్కరంబు. 24

తే. తన్నుఁదాగొప్పవానిఁగ, దలచునట్టి
కాని, చెప్పుకొనెడునట్టికాని, నరునిఁ
బరిహాసింతురు, చాటునఁబ్రజలుమిగులఁ;
గనుక, నాత్మప్రశంసయెయనుచితంబు. 25

తే. మనకు లేనివిద్యయుఁ గొప్పతనము, మనకు
గలదటంచునటించినఁ గల్ల తెలిసి
ప్రజలుమనలనవ్వుదురుచప్పటలుగొట్టి
యువిలవము లేనిసరుకంటెనలుసుచేసి. 26

తృప్తి.

తే. తనకుఁగలమేలుతోడనె తనివిపొంద,
మోదమొదవును; మఱిచాల లేదటంచు
మనసులోపలచింతతో వనరుచున్న,
సౌఖ్యమెడఁబాయు, నిచ్చలుశ్రమముగకురు. 27

తే. సౌఖ్యమబ్బెడునంచు, దేశమ్ములెల్లఁ
దిరుగఁబనిలేదు; మదిలోనఁదృప్తియొకటి
కలిగెనేనియు, నింటనె కలుగుసుఖము;
తుష్టిలేదేని, సౌఖ్యంబు దొరకదెందు. 28

తే. ఇంతచదివితిఁజాలదె? యింకనేల?
యనుచుఁదనకున్నవిద్యతోమనుజుఁడెపుడుఁ
దృప్తినొందుచునుండుట, తెలివిలేమి;
బ్రతికినన్నాళ్ళు, విద్యను బడయవలయు. 29

ధైర్యము.

తే. ఆపదలువచ్చినపు డధైర్యంబువడిన,
నంతకంతకు మఱిచింత యతిశయిల్లుఁ;

గొంచెమైనను దానిచేఁ గూడిరాదు;
కాన, నట్టిచో ధైర్యంబె పూనవలయు. 30

తే. ఎంతజాగ్రత్తతో నున్న, నెన్నఁడేని
నొక్కసమయంబున విపత్తులొదవకుండ
వట్టిపట్టులఁ, గీడు పోఁగొట్టుకొనెడు
వెరవు రోయంగఁ జనుఁగాని, వెఱవఁదగదు. 31

సత్యము.

తే. తండ్రి దండించు, గృహమునఁ దల్లి తిట్టు
గురుఁడు పాఠశాలకుఁ బోవఁ గోపపడును,
తోడిబాలురు దూషింత్రు తులువ యనుచుఁ,
గానఁ గూడదు బాలుండు కల్లలాడ. 32

ఆ. పాఠశాలలందు బాలురు కొందఱు
తప్పుచేసి, దానిఁ గప్పిపుచ్చ
బొంకుచుందు రదియుఁ బూర్వపు దానితోఁ
గలియ, రెండు కావె కానిపనులు? 33

ఆ. ఎప్పుడైనఁ గల్ల నించుక పలికిన,
నమ్మ రెన్నఁడితరనరులు వానిఁ;
దఱచు నీతిహాని, దబ్బఱలాడెడు
చెడుగుమాట వేఱ చెప్పనేల? 34

ఆ. ప్రాణహానియైన, బంధుహానియునైన,
విత్తహానియైన, వినుము కడకు
మానహానియైన మఱియేమియైనను,
బొంకకుండువాఁడె పుణ్యతముఁడు. 35

జీవహింస.

ఆ. చీమ మొదలుగలుగు చిన్నజంతువులకు
హింసచేయుచుండ్రు హీనమతులు;

తమ్ముమించువారు తమకట్లుచేసిన,
నెట్టులుండునొక్కొ యెఱుఁగలేరు. 36

ఆ. అల్పజంతువులకు హానిఁజేయుచునున్న;
నంతకంతకదియె స్వాంతమునకు
బట్టువడుచుఁబిదపఁ జెట్టలనరులకుఁ
జేయుబుద్ధిపుట్టఁ జేటుమూఁడు. 37

ఆ. దోమ మొదలుపెద్దసామజంబువఱకుఁ
గలుగుజంతువులక కారణంబ,
బాధసేయకుండవలయును సతతంబు;
హింసకూడదనెడియెఱుకగలిగి. 38

ఆ. ప్రాణికోటియెడలఁ మాయనిదయగల్గు
వారియందు, దైవమారయంగఁ
గరమనుగ్రహంబు గలిగియుండునుఁ గాన,
హింససేయఁగూడ దించుకైన. 39

సర్వజనసమాదరము.

ఆ. గొప్పవారలైనఁ, గొంచెపువారైన
నన్నదమ్ములగుదు రరసిచూడ
దైవ మొకనివలనఁ దారందఱునుగల్గి
రొక్కపుడమియందెయుండుకతన. 40

ఆ. కాన, భేదబుద్ధి గల్పించుకొనిత్రుళ్ళి
పడక, యెపుడు లేనివారిఁ గన్న
నాదరింప వలయు సోదరభావంబు
తోడఁ, జేతనైనతోడుసూపి. 41

తే. అవనిలోపల, నధికార మబ్బెనేని
క్రిందివారల నెప్పుడుఁగినియఁదగదు ;

దానిచేఁ, దనదౌష్ట్యంబె కానఁగును;
గాని, వచ్చులాభము లేశమైన లేదు. 42

తే. కొలువుకుదిరినవానిని, గార్యమొందఁ
గనుచునుండినఁ జేసెడికనిని వాఁడు
తనమనఃపూర్తితోఁ జేయు ; దానఁ, గనియు
మేలుగానుండు గసరెడువేళకన్న. 43

ఆ. ప్రేమఁ జూడఁబడినభృత్యుండు, సత్యంబు
స్వామిభక్తిఁ గలిగి, పలుకుఁ బనులు
ప్రభువుమీఁది ప్రేమఁ, బ్రాణంబులనునిచ్చు
సరకుగొనక, కొన్నిసమయములను. 44

పా టు ప డు ట.

ఆ. ధరణిని సకలంబు దైవంబుసృజియించి,
పాటుపడెడువాని పాలుచేసెఁ ;
బాటు పడినచోట, ఫలియించునన్నియుఁ
బాటువడకయున్న, ఫలముగలదె ? 45

ఆ. తగినపాటుదేహదార్ఢ్యంబు వెలయించుఁ ;
దగినపాటు మేనితెగులు మాన్చుఁ ;
దగినపాటు కలిమిఁ దప్పక కలిగించుఁ ;
బాటుపడుటతోడసాటిగలదె ? 46

ఆ. పాటులేక దేహపాటవం బడఁగును ;
పాటులేకసౌఖ్యపదవి తగ్గుఁ ;
బాటులేకయొడల బహురోగములుచేరుఁ
బాటులేనిసౌఖ్య పాటులేదు. 47

ఆ. ఇల్లుజరిగియుండ, నింతటిసిరు లుండ
భృత్యులింతమంది బెరసియుండ

నేనుబనులఁజేయ నేల ? యనకొకింత
కాయకష్టమెప్పుడుఁ జేయవలయు. 48

ఆ. కష్టపడుట మంచికార్యంబటంచును
గానిపనులయందుఁ గష్టపడకు ;
హానికరము కరమునతికాయకష్టంబుఁ
బుడమిలవముఁగష్టపడమిఁబోలె. 49

శ రీ రా రో గ్య ము.

తే. అన్నిటికి ముఖ్య మాత్మదేహంబునందుఁ
గొఱఁతరాకుండఁగా పాడుకొనుచునుంట ;
తాను దిన్నఁగాఁదిరిగెడుతఱినిగాదె
సర్వధర్మములును జేయశక్తుఁడగుట. 50

తే. మానవుండు దేహారోగ్యమూనుకొఱకుఁ
బ్రతిదినంబు నెనిమిదైనఁ, బదియునైన
గంటలవఱకు, మేనికిఁగాని, మదికిఁ
గానితగినంతపనిగల్గి క్రాలవలయు. 51

తే. ప్రాలుమాలక, స్నానంబుఁబ్రత్యహంబుఁ
జేయుచును, మేనిమురికెల్లఁబాయునట్లు
కాయమంతయు శుభ్రముగాఁగఁదోము
కొనఁగవలయు, నారోగ్యంబుగోరువారు. 52

తే. అట్లుపనిఁజేయువిమ్మట, ననుదినంబు
కొంతసేపైన, నుత్సాహ మింతగలుగు
వేడుకలఁబ్రొద్దుపుచ్చుచు, వెనుక, రాత్రి
యేడెనిమిదిగంటలునిద్రఁగూడవలయు. 53

తే. ప్రతిదినంబును, దాఁ జల్లపాటువేళ,
బయలఁ దప్పకయొకగంటవఱకునైనఁ

దిరుగవలయును, దేహంబుదృఢతగాంచి
యెపుడుఁదరుగంగసత్వంబునిచ్చుకొఱకు. 54

ఆ. కల్మషోదకంబు గలిగించువ్యాధిని;
నిర్మలోదకంబు నిలుపుదానిఁ,
దెలిసివడియఁగట్టుజలమె గ్రోలఁగఁదగు,
సౌఖ్యమందఁదలఁచు జనుఁడువినుఁడు. 55

తే. మితముతప్పిభుజించుట మేరగాదు;
మిగులఁగుడిచిన, నొడలికిఁదెగులుగలుగుఁ
దనకడుపు నిండినను బంచదారనైన,
విషముభంగినిదలపోసి, విడువవలయు. 56

ఆ. రేయిపగలు మంచివాయువు వచ్చెడు
మార్గములనుగలిగి, మందిరంబు,
పజ్జఁదెమ్మ లేక, పరిశుభ్రమైయుండ
వలయునిత్యమును నివాసమునకు. 57

స్వతంత్ర జీవనము

తే. అన్నవస్త్రాదులకు నైన, నధికమైన
భోగభాగ్యంబులకునైన భూమిమీఁద
నొరులనేనమ్ముకొనియెప్డునుండరాదు;
తనదుచేతుల నమ్మంగఁజనునుగాని. 58

తే. పెద్దలార్జించి, లోపలఁబెట్టిచన్న
ధనము ధాన్యంబుఁజోరులు తఱియెఱింగి,
తస్కరించినఁ, బోవునుదాఁచుకొన్న;
నవలవ్యర్థునిగతియేమియగునొకనుడు. 59

తే. పూర్వులుగడించిచనుమాన్యములునుమడులు,
పండకుండును; రాజులుపన్నుచాలఁ

గట్టుదురువానిమీఁద; దాకట్టువడున;
నప్పుడురిక్తుని బ్రతుకేమియగునొ చెప్పుఁడు. 60

తే. తాతముత్తాత లెంతెంత ధనముకూడఁ
బెట్టి, పెట్టెలు నిండంగఁ బెట్టియున్నఁ
గష్టపడి తామున్యాయమార్గమునఁ బడయు
స్వార్జితంబాకగవ్వతోసమముగాదు. 61

తే. కాన, మానవుఁ డెప్పుడు గష్టపడుచు,
వలయువిద్యల గళలను, బాల్యముననె
చక్కఁగా నేర్చియితరులసాయమాస
పడక, తనయొంతజీవింపఁగడఁగవలయు. 62

ధ న ము

తే. న్యాయమార్గంబుతప్పకయర్థమెపుడు
మనుజుఁడార్జించుచుండంగఁజనును; దానఁ
బాత్రులకుదానమొసరింపవలయుఁగొంత,
యనుభవింపంగవలయుఁ దాననవరతము. 63

తే. తానుజేసినధర్మంబెతన్నుఁగాచు
ననుటలెస్సగాహృదయంబునందెఱింగి,
త్యాగమొనరింపవలయుఁ; దానేగుతఱిని
తనదిచిల్లిగవ్వయువెంటఁజనదుగాన. 64

ఆ. దానమియ్యలేక, తానునుదినలేక,
ధనముభూమిలోన దాఁచిపెట్టి,
చెడుగులుబ్ధు, దానిఁ గడకుదొంగలపాలో
నేలపాలో, చేయునిజముగాను. 65

తే. ఆయమునకన్న నెన్నఁడునధికమైన
వ్యయముచేయంగఁగూడదు; యాచకునకు

దనకుఁగలదానిలోనె యీఁదగునుగాని,
దాతనః, యప్పుఁగొనియియ్యఁదగవుగాదు. 66

తే. ఇంటివారలువృద్ధులు గ్రుడ్డివారు
లోనుగాఁబాటుపడశక్తి లేనివారి
కియ్యవలెఁగాని, యితరులకిచ్చి దాన
మహిని వెలయింపరాదుసోమరితనంబు. 67

తే. మనముగడియించుదానిలో, మఱచిపోక
నిలువచేయంగఁదగుఁగొంత నేర్పుమెరసి
వార్ధకంబున, రోగముల్ వచ్చునపుడు,
గడనఁజేసెడుసామర్థ్యముడుగుఁగాన. 68

ముఖస్తుతి

తే. ఇంద్రుఁడవునీవు చంద్రుఁడవీవటంచు,
దాపునను జేరియొనరించు స్తవమునకును
కాయముప్పొంగి విశ్వాసంబుఁగానలేక,
చేతిసొమ్మెల్లఁ బోవిడి చెడవుసుమ్మ? 69

ఆ. సరసఁ జేరి, నిన్ను సంస్తవమొనరించు
వారలెల్ల సఖులుగారునీకుఁ;
గష్టకాలమందుఁ గాచువాఁడొక్కఁడె,
నిక్కమైనసఖుఁడు నీకుఁదలఁప. 70

తే. ధనముగలిగినయన్నాళ్ళు, దానిలాగ
వెంటఁదిరుగుచునుందురు, విహితులట్లు;
ధనముపోయినమఱునాఁడు దలఁపవారు
తొంగిచూడరునీయిల్లుదూరమునను. 71

## పనిఁబనుచుట

ఆ. ఆజ్ఞచేసినట్టు లన్యులఁ బనిచినఁ,
జెప్పుపనిని వారు చేయకుంద్రు;
చేసిరేని, దానిఁ జెడఁగొట్టుదురు చాల,
హృదయమం దసూయ పొడలుఁ గనుక. 72

ఆ. పరుల కేఁపునట్లు పనిచేయఁ బనిచినఁ
జెప్పఁదడవ దానిఁ జేయుచుంద్రు;
చేయుపనియుఁ జాల శ్రేష్ఠంబుగా నుండు,
మనసు కుదిరి చేయు మహిమ కతన. 73

తే. చెలిమి మైఁ జేఁదు మేపింపఁ జెల్లుఁగాని,
బలిమి మైఁ బాలు ద్రావింపఁ బాటుగాదు
కాన, మంచితనముననే కార్యమెపుడుఁ
దీర్పనగుఁ; గాని పనిగాదు తీవ్రపడిన. 74

## చౌర్యము

ఆ. ముచ్చిలంగ, రాజు మున్ముందు దండించి,
దండుగ గొనుఁ దొంటిధనముఁ గూడ
నిరుగుపొరుగువార లెప్పుడు నిందింత్రు;
పరమునందుఁ జాల బాధ తొడరు. 75

తే. ఎవ్వరును జూడరని మున మెన్నుకొన్నఁ
బాప మది యెప్పుడైనను బయలఁబడును;
గాని, దొంగతనంబు దాఁగదు నిజంబు;
దీని నింతయు లెస్సగాఁ దెలియవలయు. 76

ఆ. ఎవరుఁ జూడకున్న, నీశ్వరుఁడైనను
మనము సేయుకాని పనులఁ గనఁడె?

కాన, దొంగతనముఁ గావింపనెందైన
శిక్షతప్పకుంట సిద్ధమరయ. 77

ఆ. ఒరులమాయచేసి సిరిఁగొంతు ననుకొంట
వెఱ్ఱితనముగాని వేఱుగాదు;
దాన, ముప్పుతనకె తప్పకఘటిల్లుఁ;
బరులఁ జెఱచువాఁడు బాగుపడునె? 78

### ప రో ప కా ర ము.

తే. కడుపెకైలాసమనియెంచి గాసిపడక
శ్రమమునకునైన నోరిచి, శక్తికొలఁదిఁ
బరులకుపకారమొనరింపఁ బాటుపడుదు
రాఁకలియుడప్పి పాటింపకలఘుమతులు 79

### వి వి ధ ధ ర్మ ము లు.

తే. భూమిమీఁదను మనమిట్లు పుట్టుటెల్ల
భోజనంబునకేయని, మూఢమతులు
తిండియేలోకమనియుందు రొండుచింతఁ
దక్క, ధర్మమునందైనఁ దలఁపులేక. 80

ఆ. మంచివాఁడుపుడమి మాటాడుమెల్లగాఁ
బలువయెపుడుగొంతుపగులనఱచు;
ముఱికికాల్వలెపుడు మ్రోగినలాగున
నదులుసేయుచున్నె రొదలనెందు? 81

తే. భాగ్యహీనులనైన, సేవకులనైనఁ
బరుషవాక్యంబులాడుటపాడిగాదు;
దానఁ, బెట్టినపెట్టెల్లఁ గానఁజేరు;
వదనఁ జేసినమేలును బడటఁ గలియు. 82

తే. ఎక్కటివారిని మర్యాద నెలమిఁజేసి,
తానుమర్యాదబడయంగఁదగునునరుఁడు;
వారి నటుతాను గౌరవ పఱుపకున్నఁ
దనకు గారవమబ్బఁదు ; తథ్యమిదియె 83

ఆ. మంచికార్యమునకు, మానక యెప్పుడు
యత్నమాచరించు టర్హమగును ;
మొదలఁగాకయున్న, బెదరకమరిచేయ
వలయుఁ; గానిపదుమవదలఁదగదు. 84

ఆ. చెడ్డకార్యమునకుఁ జేరరాదెప్పుడు ;
చేరేనేసిమేటిచేటు వచ్చు ;
హీనకృత్యమందు నెఱుఁగకచొచ్చినఁ
దెలిసినపుడెవిడిచి తొలఁగవలయు. 85

ఆ. అల్పబుద్ధులెప్పు డన్యులతప్పుల
వెదకుచుందు ; రల్పవిషయములను
గొప్పగాఁగనెంచి, కోపంబువహియింతు ;
రలుకవిడువకుందు రనవరతము. 86

ఆ. అలఘుబుద్ధులెప్పుడ న్యులగుణముల
నభినుతింతురెఱిఁగి ; యవగుణములఁ
దడవకుందు ; రలుకఁదడవుగఁబూనరు ;
సైరణను వహింతురుసంతతమును. 87

ఆ. తనకుఁజేయుమేలు మనమునఁగుక్కయు
నెఱిఁగిసతముస్వామియిల్లుగాచు ;
మేలుమఱచునేని, మేదినిమనుజుండు
కుక్కకన్నఁగొంతతక్కువరయ. 88

తే. తప్పుచేసితి నేనియు, నొప్పుకొనుము ;
గురునిముంగలఁగల్పించుకొనుచువచ్చి
మాయమాటలఁజెప్పుట మానుకొమ్ము ;
దాననోజ్జలునీయెడదయఁదలంచు. 89

ఆ. పిలచియొకరు మనయభిప్రాయ మడిగినఁ
బక్షపాతబుద్ధిఁబొఱదోలి
మనసునందుఁగలదె, మాటుపెట్టక తెల్ప
వలయు, నొకనికెగ్గు గలుగుచున్న. 90

ఆ. సూక్ష్మమంచు నెంచి చులుకసేయఁగ రాదు ;
సూక్ష్మములె, వినుండు, స్థూలమగును
జలకణములు గలిసి, జలరాసి కాలేదె ?
చిన్నవాసినేల చేయివిడువ ? 91

ఆ. మహినినాఱు నెలలు సహవాస మొనరింప
వారువీరలగుదు రారయంగఁ ;
గాన, జనుఁడుమంచివానితోడనె
చెలిమినెల్లతఱిని జేయవలయు. 92

తే. మున్నె, వాగ్దాన మొనరింపకున్నయపుడె
పదిగఁదలపోసిమఱిచేయవలయుఁజుమ్ము
చేసి చెల్లింప లేకుంటసిగ్గుపాటు
చేయఁ గలిగియుఁ జేయమి హేయమరయ 93

తే. తిన్నగా మాటలాడంగఁ దెలియనట్టి
వాఁడెవండైన, నినుదప్పఁబలికెనేనిఁ
దప్పుగాఁ బట్టుకొనుచును, దాని నీవు
పట్టికల్లార్చి, కోపంబుపడకు మెప్పుడు. 94

ఆ. ఒక్కకాలమందు నొక్కపనినె చేసి
యయ్యది కడముట్టనె నవెనుక

మాఱుపనికిఁదాను మరలంగఁదగుఁగాని
పెక్కుపనులకొకట నెక్కరాదు. 95

ఆ. పెద్దవారలైనఁ బిన్నవారైనను
జెప్పునట్టిపలుకుఁ జెవిని జొనిపి,
యుక్తియుక్తమైన, నొయ్యన గ్రహియింపు;
కానిదైనఁ గొనకపూనుమీవు 96

తే. పలికిబొంకనిజిహ్వయుఁ బాడిగలుగు
వర్తనముఁ బాపమెఱుఁగనిభావములును
బురుషునకు నెంకుజారనిభూషణములు
కాని, విలువబట్టలు గావు, కావునగలు. 97

ఆ. తెల్లవార లేచి, దినమెల్ల మనచేయు
కర్మచయములోనఁ గర్మసాక్షి
ప్రతిదినంబు మంచిపనులఁ గొన్నిటిఁ
జూచి, యేగునట్టుగఁ జరియింపవలయు. 98

ఆ. పరులు నీకు నెట్లు వాంఛింతువో చేయ
బరుల కట్లు చేయవలయు నీవు;
సర్వశాస్త్రములను జర్చింపఁ దేలెడు
సారమైనధర్మసరణి యిదియె. 99

తే. మేనుక్షణభంగురంబౌట, మానసమున
నుంచి, రేపుచేసెద నని యుంటమాన
వలయుఁ సద్ధర్మములనేఁడె సలుపవలయు
నెల్లిమనముందుమోలేమొ యెఱుఁగరాదు. 100

తే. గీ. ఇందుఁగలపాఠశాలలయందుఁ జదువు
దిగువతరగతిబాలుర తెలివి కొఱకు
నీతిదీపికయను నూఱు గీతములను
కందుకూరి వీరేశలింగము రచించె.

# సరస్వతీనారదవిలాపము.

రంగము—దండకారణ్యము

(వీణలుదాల్చి దుఃఖించుచు సరస్వతీ నారదులు వేరువేరుగా
ప్రవేశించుచున్నారు)

సర—(నిట్టూర్పువిడిచి తనలో)

క. ఈపాపులకతనమున నా
రూపెల్లను మాఱిపోయెఁ; గ్రూరాత్ములకున్
జేపడితి; మోసపోయితి;
నేపగిదిం బ్రతుకుఁ గందు నింక నే నకటా?

క. దాయ లలంకారమిషన్
గాయం బాపాదమస్తకంబును బొడువన్
గాయపడి మామకాంగని
కాయము నొచ్చెడును దేలుకఱచినభంగిన్. (అని విలపించుచున్నది.)

నార—(తనలో)

క. కటకట! సంగీతంబున
కెటువంటియవస్థ పట్టె నీదేశములో!
పటుతరమోదం బెవరికి
ఘటియింపదు నేఁడు నాదుగానం బుర్విన్.

క. కటువులె యీహారికీర్తన
లటమటమున విటుల కొక్కయరకాసునకున్
దటుకున మానము యమ్మెడు
కుటిలాలక లఱచుబూతుకూఁతలకంటెన్?

(ఆలకించి)

గీ. వినఁబడెడు స్త్రీవిలాప మీవిపినమందు ?
అహాహా ! యెవ్వరి దొక్కొ యీయార్తరవము
శ్రావ్యతర మయ్యెడును గానరసముకంటె
ఎవ్వరయియిందు రోంటి నిట్లేడ్చువారు ?
(ముందువంకఁజూచి)

ఉ. అక్కట ! యీమె మజ్జననియైనసరస్వతియట్ల యున్నదే !
తక్కరు లైన నిమ్మధురతాగుణ ముందునె రోదనధ్వనిన్ ?
చక్కనిపాటకున్ సొగసి సర్వ మదేమొకచుట్టి యీడెటుల్
గ్రక్కునఁ బోయి నే నడిగి కన్గొనువాఁడ విచారహేతువున్.
(చేరువకుఁబోయి)

క. ఓతల్లీ ! యిదె మ్రొక్కెద
నీతనయుఁడ నారదుండ; నిక్కము చెపుమా
చేతోవ్యథతో నీ కిటు
నాతల్లి యరణ్యరోదనం బేమిటికిన్ ?
సర—(తలయెత్తి చూచి)

క. తనయా ! నావలెనే యీ
వనమున కీ విప్పుడేల వచ్చితివయ్యా ?
నిను నిటఁ గనినంతనె నా
మనమునఁ గలకలఁక కొంత మానెం జుమ్మీ.

క. నారోదనమునకుం గల, కారణ మడిగితివి గానఁ గలతెఱఁ గెల్లన్
గూరిమిపుత్రుఁడ చెప్పెద, గారవమునఁ దెల్పుదాన ఘనమతివినుమా.

మ. రమణీయోక్తులచేత నర్థగుణసారస్యంబు గల్పించుచుం
దమి నాయంగచయంబునన్ సహజసౌందర్యంబు పెంపొందఁ గొం
చె మలంకారము లుంచి తొల్లిటికవుల్ చేష్టాచమత్కారభా
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలము ననుం గాపాడి రర్హక్రియన్.

సీ. అటు సుఖయింపుచుండఁగ మదాస్యమునందు నిరర్థకంబులై
పటపటలాడుశబ్దముల బల్మిని బెట్టి, రసంబు నెట్టి, యు
త్కటికములే కలంకరణకై తవముం గొని మేను కుట్టి, యి
ప్పటిఘను లార్ద్రి పెట్టుపరు ప్రాణము తీసి ననుం గలంచుచున్.

క. తెలియదు సు మ్మిప్పుడు నా
కలుకిలయర్థంబు నాకె భావములేమిన్;
వెలభూషలుగా కివి సం
కెల లయి కదు నాకుమేనికిన్ వెత నిచ్చున్.

నార—క. ఓహో! యెటు చెఱిచిరి నీ
దేహముచెలు వెల్ల జడులు తెక్కలిదగలన్!
దేహరుచి గవ్వపేరుల
బాహులభూసల సుకారిభామలు పోలెన్.

క. సుందరబహురసపుష్టి న, మందానందంబు బుధులమది కిడ దేనిన్
ఛందోబద్ధం బగుపద, బృందాటోపంబు తాఁ గవిత్వం బగునే?

క. రసములె కావే ప్రాణము, లసమానకవిత్వకాంత కవనీస్థలిలో?
రసహీన మైనకవితకుఁ, బొసఁగించునలంకృతి శవమున కిడుతొడవౌ.

క. విను ఛందోబద్ధం బను,
ఘనకారణముననె బ్రతుకుఁ గన నగు నేసిన్,
తను వది వదలి వెసం జ
క్కనిమృతి నొందుటయె లెస్స కవితాసతికిన్.

క. కవితాసతి జీవకళల్, శ్రవణోత్సవభాషణంబు సలిపెడున ట్లుం
డవలెంగాక యొకప్పుడు, శవములె న్నిద్రితవలెఁ జనదుండంగన్.

సర—క. అవు నది నిజమే యైనను,
భువిలోఁ బ్రాణంబులేనిబొందియె యివు డీ

నవమేధావులచేతఁ,
వివిధంబుగఁ బొగడఁబడెడు! విధి నేమందున్?

సీ. దయమాలి తుదముట్టఁ దలకట్లు నిగిడించి
ధీరుఁడై నన్ను బాధించు నొకఁడు
పాదంబులోపలఁ బాదంబు లిమిడించి
వీరుఁడై నన్ను నొప్పించు నొకఁడు
ప్రాసంబుపై బెక్కుప్రాసంబు లడరించి
పోటుబంటైననన్నుఁబొడుచునొకఁడు
బెండుపల్కులుగూర్చి నిండించి నగలంచు
దిట్టయై చెవులు వేధించు నొకఁడు
ఖడ్గచక్రాదిరూపముల్ గానిపించి,
వర్ణములుమార్చిననుఁ జిక్కుపఱచునొకఁడు
కుమతు లొడలెల్ల విఱిచిప్రాణములుతీయ
నొడలిపసలేకశుష్కించియున్నదాన.

శా. ప్రాణంబు ల్కడఁ బట్టియుంటఁ దెలియన్ రావెందు మద్వాక్యముల్
త్రాణల్వాయుట మాఱి యెవ్వరికిఁ బోల్పన్రాదు మద్రూపముల్
ప్రాణాపాయము కల్గ కుండ నెటకైనన్ నన్నుఁ గొంపోయి సం
త్రాణం బీవొనరింపు మింతటను బుత్రా! మాతృరక్షార్థివై.

గీ. అన్న నీమోమునను దోఁచె విన్నఁదనము
కారణం బేమి నీదుదుఃఖంబునకును!
పడుచుఁదనమున రాదుగా వార్ధకంబు
నాకుఁ బోలెను నీకును? నోకుమార!

నార—క. అమ్మా యేమని చెప్పుదు?
నిమ్మహి నామోము చూడ రిపు లెవ్వారున్,

నమ్మనము వేశ్యలమాటలె
కమ్మలు సుమ్మా రసికులకర్ణంబులకున్.

క. భగవన్నామామృతమే
వెగటయ్యెను భక్తిపరులవీనులకెల్లన్
జగమున నిపు డోకపడుపు
న్నగుపపదంబె యమృతోపమానం బయ్యెన్.

గీ. ఇట్టిదురవస్థఁ జూచి యెందేనిఁ బోవఁ
దలఁచి వచ్చితి హృదయఖేదంబుతోడ
జనని! సంగీతసాహిత్యుల్ కనులు నీకు;
భరతఖండంబునను రెంటిఁ బొరలు గ్రమ్మె.

గీ. పాట యెల్లను వెలయాండ్రపాలు చేసి,
జనని! తలమున్కదుఃఖాబ్ధి మునిఁగియున్నఁ,
దల్లివాంఛ దీర్చుట పుత్రధర్మ మగుట
వీపునను మోచి కొనిపోదు వేగ రమ్మ.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)



# స్త్రీ పునర్వివాహ సభా నాటకము

## ప్ర థ మా ం క ము

ప్రథమరంగము:—రాజమహేంద్రనగరము ; వీరభద్రుఁడుగారి గృహము.

(వీరభద్రుఁడుగారు చావడిలోఁ గూర్చుండి దైవప్రార్థనము చేయుచుండఁగా మిత్రుఁడయినజగన్నాథముగారు ప్రవేశించి కూరుచున్నారు.)

వీర:—(చేతులుజోడించి, అర్ధనిమీలిత నేత్రుఁడై)

ద్విపద. శ్రీకరగుణజాల ! శ్రితజనపాల !
శోకాబ్దివాతూల ! సుజనౌఘలోల !
కారుణ్యమయశీల ! ఘనధీవిశాల !
క్రూరజనాభీల ! కుతుకాలవాల !
సర్వజ్ఞ ! సర్వేశ ! సర్వకారుణ్య !
సర్వశక్త్యాత్మక ! సర్వనియంత !
త్రికరణశుద్ధిగా దేవాదిదేవ !
సకలార్తిహార ! నిన్నుఁజాలఁ బ్రార్థింతు ;
నిది సుఖదాయక మిది దుఃఖబహుళ
మిది పరిత్యాజ్య మియ్యది గ్రాహ్య మనుచు
మానవు లెల్లను మనసులోఁ దెలిసి
పూనికతో సత్యము నె యనుష్ఠింప
వలయునంచును బుద్ధి వారికందఱకుఁ
గలుగునట్లుగ వేగఁ గరుణింపవయ్య !

(ఈశ్వర ప్రార్థనమయిన తరువాత కన్నులు తెఱచి మిత్రుని వంకఁజూచి) నీవు వచ్చి యెంతసే పయినది ?

జగ:—ఇప్పుడే వచ్చినాను.

క. ఓయీ నీవిటు ప్రార్థన, చేయుట చూడంగ నేడు చిత్తంబున నీ
వేయదియోఘనకార్యముఁ, జేయఁగఁ దలపెట్టినట్టిచిహ్నము దోఁచెన్

గీ. నీకుసంకల్ప మించుక నెయ్యెనకును,
జెప్పఁదగునేని మఱి నీవు చేయఁ బూను
కార్యము తెలుఁగు నద్దానఁ గలుగుమేలు,
వినఁగ వేఁడెదిఁజెప్పుము వేగనాకు.

వీర:—సీ. వినవయ్య చెప్పెద విస్పష్టముగ నీకు
మన దేశమందలిమగువలందు
వైధవ్యదశ నొందువారలదురవస్థ
గనుఁగొన్న నెంతటికఠినునకును
హృదయంబు నీరయియెంతయుదుఃఖంబు
పుట్టును వారిలో ముఖ్యముగను
బాల్యకాలమునందె పతిహీన లయినట్టి
యబలలదుర్దశ లాత్మలోన
దలఁచుమాత్రన దేహంబు జలదరించి,
వారియాపదవారింపవలయున నెడు
బుద్ధి పుట్టకపోవదు భూమిలోన,
మానవశరీర మెత్తినవానికెల్ల.

క. అటు లయ్యెను వారలగతి,
దటుకున వారించువెరవు దలఁపక పెద్దల్
కటకట యనాథయువతుల,
నటమటఁ బెట్టంగఁ జూచు టాశ్చర్యమకా.

గీ. దీర్ఘకాలమునుండి యీదేశమందు,
స్త్రీలకుఁ బునర్వివాహంబు చేయునట్టి

మంచివాడుక పోయినమహిమచేత,
నకట యాచారమె ప్రధాన మనెడువారు

ఉ. బాలవితంతు సంతతి వివాహములేక యథేష్టలీలలన్
జాలఁగ సంచరించుటను సంభవ మయ్యెడుకీడు లైనఁ దా
మేల యెఱుంగలేరు ? పతిహీనలబాధలఁ జూడ వారికిఁ
జాలి యొకింత పుట్టదె ? నిజంబుగ వారివి ఱాతిగుండెలే ?

జగ:—గీ. భర్తృహీనలకయిడుందఫలముగలదె?,
దైవమీరీతిఁబతిలేనితరుణిమణుల
దుఃఖపడుఁడనిమూఁడుబంతులనువ్రాయు
దానిఁదప్పింపనెవ్వరితరముచెపుము.

వీర:—గీ. అయ్యయో ! సర్వకారుణ్యుఁ డయినయట్టి
యీశ్వరుఁడు స్త్రీల దుఃఖంబు నెనయుకొఱకె
యవనిమీఁదను సృజియించె నందుమేని
దైవదూషణమగుఁ గాదె తప్పకుండ ?

క. కరుణానిధి యగుదైవము,
ధరణీస్థలి దేనినైనఁ దఱుగనివెతలఁ
బొరసెడుకొఱత సృజించునె ?,
దురితం బగు నతనిమీఁద దోషము మోపన్.

జగ:—ఆ. సతుల కట్టిగతులు సంప్రాప్తమగుటకుఁ,
గారణంబతండుగాకయున్న
వేఱుహేతు వేది వివరింతువో నీవు,
వినెదఁ జెప్పవయ్య విశదముగను

వీర:—ఆ. నిఖిలసృష్టియందు సుఖపడఁగోరుట,
సర్వజంతువులకుసహజగుణము;

వరుస నీశ్వరుండు ప్రతిజీవికిని నిచ్చె,
సౌఖ్యమునకు వలయుసాధనములు.

సీ. జంతువులకు నెల్ల సకలావయవములు
పటుసౌఖ్య మిడుటకె పనికివచ్చు
విశ్వంబులోఁగల వివిధవస్తువులును
జంతుసౌఖ్యమునకె సాయపడును
దుఃఖంబు వేగంబ తొలఁగుటకు సుఖంబు
చిరకాలముంటకు సృష్టిలోన
నెక్కడఁజూచిన నెన్నికకును మించి
ఘనసాధనమ్ములు గానఁబడెడుఁ
గాన దైవంబు జంతుసంతాన మెపుడు,
సుఖముపొంద నుద్దేశించె సుస్థిరముగ
నేదియో లోపమునఁ దక్క నించుకేని,
బాధ గలుగ దెప్పుడునుస్వభావముగను.

సీ. తక్కినజంతుజాతముఁబోలె నొకతన
సుఖమును మాత్రము చూచుకొక
సామాన్యముగ సర్వజనులసౌఖ్యంబును
మదినుంచి పనిఁజేయు మానవుండు
మనుజసామాన్యంపుమంచిఁ జూడకయున్న
నెవనికి సుఖ మబ్బ దవనియందు
కాఁబట్టి పలువురఘనసౌఖ్యమున గూర్చి
చేయు శాసనములె జెల్లు నెందు
నొకని కేమైనమనుజబాహుళ్యమునకు,
మేలుగలిగించువిధులెందు మెప్పఁజెందు

నంతయునుజూడనందఱుననవరతము,
ధరనుసుఖులయియుండుటదై వమతము.

జగ:—క. జనులెల్లవారు సుఖులయి
మనవలయు నటంచు దైవమతమగు నేనిన్
మనవారిలోన నిందఱు
వనితలు వెత నొందనేల వైధవ్యముచేఁ.

వీర:—గీ. ఉర్విజనులకుస్వాతంత్ర్యముండుకతన
మనసువచ్చినగతిమంచిపనినిగాని
చెడ్డపనిఁగాని వారలు చేయఁగలరు
దానిచే వచ్చె నిక్కట్టు తరుణులకును.

క. వేదాంతు లేమిచెప్పిన। మేదిని స్వాతంత్ర్య ముండు మిగులఁగ మనకం
చేదేశజనుల నడిగిన। నాదటఁ జెప్పుదురు వార లనుభవగరిమన్.

జగ:—గీ. నరులకే స్వతంత్రతయున్న ధరణిలోన
గొప్పయుద్యోగమును జేయగోరువారి
కేల యాపని కారాదు తెలికగను?
మంత్రిపద మొంద నాకును మనసుగలదు.

వీర:—సీ. నీకొక్కనికె గాక నఖిలమానవులకు
స్వాతంత్ర్యమెప్పుడుఁజాలగలదు
నీకు మంత్రిపదంబు నీకుం డుటకుఁగూడఁ
బరమస్వతంత్రుండుధరణిపతియు
నదిగాక నీవలె యత్నంబు చేయువా
రెందఱో యాపనికుఁందురరయ
వారలకును నుండు స్వాతంత్ర్య మిటనీదు
యత్నంబుచెడునట్టులడ్డుపడగ

కావున జనుండు తలపెట్టుకార్య మెల్ల
గాకపోవచ్చు నందుచే గట్టిగాను
మనకు స్వాతంత్ర్య మెందు లే దనఁగఁ దగు నె
మనసె మనము స్వతంత్రుల మనుచుఁ జాట.

జగ:—గీ. భువిని జనులు యుక్తాయుక్తములను దెలిసి
తగవు నడపంగను స్వతంత్రు లగుచునుండ
నాదినుండి పునర్వివాహ మతివలకు
లోకమందెల్ల నేటికి లేకపోయె ?

వీర:—సీ. కూపకూర్మముమాడ్కిఁగూర్చుండియొకచోట
జగమెల్ల హిందుదేశంబె యనుచు
దలఁచియుండువుసీవుకలనైననిప్పటి
భూగోళశాస్త్రంబుముట్టకుంట
నవనీతలం బెల్ల నైదు ఖండములుగ
భాగింపఁబడియుండుఁ బ్రస్తుతమున
నట్టిఖండంబులయందు నొక్కటియైన
యాసియాఖండంబునందు నున్న
దేశములఁబదియాఱింటఁదెలిసిచూడ
హిందుదేశంబునొక్కటినింతెసుమ్ము
స్త్రీలకుఁబునర్వివాహంబుచేయునట్టి
యిట్టియాచారమిటఁదక్క నెందు లేదు

సీ. ఈదేశమునసైత మితరమతస్థులౌ
మ్లేచ్ఛ మహమ్మదీయులప్రశంస
యటు లుంచినను గొల్లలాదిగాఁ గలహిందు
జనులలోపలఁగూడ వనితలకును

మాఱు పెండిలి చేయుమంచియాచారంబు
పెంపొంది యున్నది తెంపు లేక
పెద్దపట్టణముల ద్విజు లెక్కువగ నున్న
సంఖ్యయందును హీనజాతివారె
మిగుల హెచ్చుగ నుందురు మెట్టుమీఁద
ద్విజులలోఁ గూడ మనహిందు దేశమందు
యువతులకును బూర్వము పుణ్యయుగములందుఁ
బరిణయము గ్రమ్మఱను జేయబడుచునుండె.

ఓయీ ఈయొక్క ప్రశ్నమునకు న్యాయమయిన ప్రత్యుత్తరమును జెప్పుము. ప్రపంచములోని సమస్తదేశములయందును సమస్తమతములవారికిని సర్వకాలములయందును మేలు నిచ్చుచున్న యీయాచారము, ఒక్క మనహిందూదేశమునందు మాత్రము కొన్నిజాతులవారికిఁ గొంతకాలమునుండి కీడును కలుగఁజేయునది యగునా.

జగ:—అవును నీవు చెప్పినదిన్యాయముగానే యగుపడుచున్నది. ఈవిషయమయి వయిభోనువారమునాఁడు సభ జరగఁబోవునుగదా ? అప్పుడుపోయి వాది ప్రతివాదుల వాదమును సావధానముగా విందము.

వీర:—ఈలోపల మనము న్యాయపక్షమును గెలిపింపవలయునని యీశ్వరుని ప్రార్థించిపిమ్మట పోదము.

( ఉభయులును. )

ఆనందభైరవిరాగము - రూపకతాళము.

పల్లవి

కరుణింపుము రా-ఓ- దురితాపహరా :

అనుపల్లవి

కరుణాకర ! నీచరణానతులన్.

చరణములు

౧. దురహంకృతి నెవ్వరు బొంకులకున్
జొరకుండఁగ నీవరచాతురిచే—కరుణింపుము

౨. జనసంఘపుమేలునకై నరు లె
ల్లను దిన్ననిత్రోవను బూనఁగ వే—కరుణింపుము

౩. ఇదిసత్పథ మియ్యదిదుష్పథమం
చెదనెల్లరు నొప్పిదముగొనఁగా—కరుణింపుము

౪. అనుమానము నెల్లను మాని సతం
బును సత్యము నోర్పునఁగై కొనగా—కరుణింపుము

౫. గతిగానక దుస్థితిఁ గుందెడియా
పతిహీనల సంతత వత్సలతన్—కరుణింపుము

జగ:—భోజనమునకు ప్రొద్దెక్కుచున్నది. నే నిప్పుడు సెలవు పుచ్చుకొందునా?

వీర—మంచిది. గౌరీనాథముగారు మిత్రులతోఁగూడ నేటిమధ్యాహ్నము మాయింటికి వచ్చెద మన్నారు. వారియిల్లు మీయింటికి వెళ్ళెడిత్రోవలోనేగనుక, సాధ్యమయినంతశీఘ్రముగా రమ్మని మనవిచేసి మఱివెళ్లుము.

జగ:—మంచిది ముందుగా వెళ్ళునప్పుడే ఆయనతోఁ జెప్పి ముఖ్యముగాఁ బంపెదను. (అని యిద్దఱువెళ్ళుచున్నారు.)



# కామడీ ఆఫ్ ఎఱ్ఱర్సు.

## ప్రథమాంకము.

---

### 1. ప్రదేశము—ప్రభు మందిరమునందలి చావడి.

(ప్రభువు, వర్తకుఁడు, కారాగృహాధిపతి ఉద్యోగస్థులు ఇః
సేవకులు ప్రవేశించినమీఁదట.

ఏజియన్—నరపాల! యరుదెమ్ము ననుశిక్షసేయ,
మరణదండమున మాను నావెతలు.
ప్రభు—వర్తక! మఱియేమిపలుకకుమింక
వార్తలకొఱకుఁగానకట! మాలంక
ధర్మశాస్త్రంబుల తగవేదఁగాను,
గూర్మిఁ, బాక్షికబుద్ధిఁ గూరను నేను.
వేయేల? మాదీవిబేరులఁ బట్టి,
న్యాయమార్గమునంటె నడచెడునట్టి
వారి, మీచట్టాలఁ బరఁగించుకొన్న
క్రూరశిక్షలకును గుఱిసేయ మున్న,—
ప్రాణదానమునకు బదులుగానొసఁగఁ
బాణిని బంగారువస లేమిఁ బొసఁగ,—
మీరాజు, దయమాలి, మీఱిమావారిఁ,
గ్రూరుఁడై, చంపినకొఱగామి, నోరి!
పుట్టినవైరంబు, గట్టిమచ్చరము:
నెట్టును మీమీఁద నెప్పుడుఁగరము,
జాలిపుట్టఁగ నీవు, జడినిప్పులొలుకు
క్రాలెడుమావేఁడికలుకఁ జూపులకు.

ఏల ? యన్నను...మాకు, నెప్పుడుఁజివ్వకును
జాలఁ గాల్దిప్పినచ్చటివారలకును,
అప్పగిదిని నైన నధిక వైరంబు
నప్పటినుండియు, నొప్పసంఘంబు
చేరి, యిచ్చోటమావారలచేత,
మేరమై నచ్చట మీవారిచేత,
ఇఁక ముందువాణిజ్య మొకరిత్రోనొకరు,
ఒకరిపట్టణముల నొనరఁగానొకరు,
కావింపకుండంగఁ గట్టుదిట్టములు
వావిరిఁబుట్టింపఁబడె ననేకములు.
వినుమంత యే కాదు; వెలయమీ దేశ
మునను జన్మించినజనుఁడు మా దేశ
మందు సంతలఁగాని యంగళ్ళఁగాని
కందోయి కొక్కింత కననయ్యెనేని,
మాసీమ మనుజుండు మఱియెవ్వఁడేని,
మీసీమ నెందైన మెలఁగునయేని,
హాయిగానుండుటకు నదనున, నొక్క
వేయివరాల నర్పించినఁదక్క
జీవంబు లప్పుడ చెచ్చెరఁబోను;
ఆవానిసొమ్మెల్ల నధిపుపాలౌను.
ఇక్కడనీయొద్ద నెనఁగుసొమ్మెల్ల
నెక్కువవెలఁగట్టి యిచ్చిన, నల్ల
నూఱువరాలకె న్యూనంబు కానఁ
దీఱదు జీవము తెగక, నీయాన

ఏజి—ఓా! మేలు! నాకిడియ ప్రసాదమరయ;
నీమాటయెల్లను నెఱవేఱునేని,
యీాదినమ్మునఁ గ్రుంకునినునితోఁగూడ
నాదుకష్టంబులు నాశంబునొందు.
ప్రభు—అవునోయివర్తక! యడిగెద నొకటిఁ,
జనిబుట్టఁదెల్పుము సంగ్రహంబుగను,
మీాదేశమునుబాసి మెలఁగంగనేల
మాదేశమునకేల మఱివచ్చితిపుడు ?
ఏజి—వచియింపరాని నాబహుళదుర్దశల
వచియింపుమనుకంటె భారంబునొకటిఁ,
బూనుపఁగారాదు పొసఁగవామీాఁద;
ఐననులోకంబు లన్నియునాదు
దురవస్థలెల్ల నాదోషంబువలన
దొరలక, విధిచేతఁ దొడరినవాటఁ
దెలిసికొంటకు, నాదు స్థిరవిచారంబు
సెలవిచ్చునంతయుఁ జెప్పెదనిపుడు:
సరకాజియాలోన జన్మించినాఁడ;
పరిణయమయినాఁడఁ బడఁతుకనొర్తు;
ననుఁ జేసికొనకున్న, నన్నులమిన్న
జననుత యైనట్టిసౌఖ్యంబుఁ గాంచు;
దైవంబు మాయెడ దయమాలకున్న
నావలిననుగాంచు వాతిసౌఖ్యంబు ;
ఆనందముననుంటి నామెతో నేను;
నానాఁటవర్థిల్లె నాకల్మిమిగుల,

పరదేశమున నామపనులను జూచు
మరియాదగల పేరిమరణంబుదాఁక,
ఎపిడామినసునకు నేఁజేసినట్టి
యపరిమిత సముద్రయాత్రలవల్ల.
తెరువుననొకమూల దిగఁబెట్టిచన్న
సరకులనైనను జాగ్రత్తసేయు
ఘనుఁ డాతఁ డెలనాగ కౌఁగిలినుండి,
నను సమాకర్షించెఁ దనదేశమునకు;
ఆఱుమాసములైన నరుగకమున్న
తీఱనివిరహంపుఁ దీవ్రవేదనను,
చిక్కిసగంబయి చక్కెరబోఁడి
గ్రక్కునఁ బయనంపుఁగార్యముల్నడపి,
నేమంబుతోవచ్చి, చెచ్చెరఁదాను
మే మున్నసీమను మేరమైఁజేరె:
చిరకాలమచట వసింపకమున్న
తరుణియిద్దఱ ముద్దుతనయులఁగాంచె;
చిత్రంబు! చూడ నాచిఱుతవారెంత
మాత్రము భేదమన్మాటయు లేక
పేరులచేఁదక్క వీఁడువాఁడంచు
నారయరాకుండ నలరారిరంత;
అనిమిషముననె యాసత్రమందె
మానినిబీదది మఱియొకర్తు కనియె,
నాదారిమగవారి నమడబిడ్డలను
భేదమేమియులేక విలసిల్లువారి:
నే, వారిజనకులు నిరుపేదలౌటఁ,

గావలెననుకొని, కవలపిల్లలను
బెంచితి, నాముద్దుబిడ్డలవద్ద
వంచనలేక సేవలు సేయుకొఱకు.
అట్టిబాలురు కల్గనాత్మనుప్పొంగి,
గట్టిగానింటికిఁ, గాంతాలలామ,
ప్రతిదినంబునునన్నుఁ బయనంబుచేసి,
వెతఁ బెట్టజొచ్చెను వెడలుదమంచు;
ఇష్టంబులేకయే యే నియ్యకొంటిఁ,
గష్టపడవలసి, కటకటా ! వేగ.
యానపాత్రంబెక్కి, యామహదూర
మానేలవిడిచి మే మరుగకమున్న,
యెప్పుడుగాలిని నెదరింప నోడు
నుప్పుసంద్రము మానుముప్పును జూపె ;
జీవింతుమనునాశ, శీఘ్రంబుగానె,
మావారివిడిపోయె; మఱియేలయన్న,
భగవంతుఁడిచ్చిన ప్రభను మాయింప
నిగిడినమేఘము ల్నిమిషనిమిషము,
బెదరి చెదరిన మాహృదయంబులందు
నుదయింపఁజేసె సద్యోమృత్యుభీతి.
నామట్టునకు నేను సామోదముననె
యీమృతి కైన నీకొంచుఁగాని
ముందువచ్చెడు నట్టిముప్పును దలఁచి
కుందెడునాలినిఁ, గులసతిఁజూచి
వివరంబు తెలియక వేడుకకొఱకుఁ

గవకూడి యేడ్చెడు కవలపిల్లలను,
గాంచిన, మనస్సెల్లఁగరఁగిపాఱుటయు,
వంచనలేకుండవారికి నాకుఁ
దగినరక్షణముగలుగు నుపాయంబు
నొగిరోయవలసెను నొనరంగ నాకు;
ఇతరమార్గము లప్పుడేవియు లేని
కతమున, నీరీతిఁ గావింపఁబడియె—
పడవవారెల్లరుఁ బ్రాణార్తు లగుచు,
మడిసెడునోడను మా కొప్పగించి,
ప్రక్కఁ గట్టినచిన్న పడవలమీఁదఁ
గ్రక్కునఁ బాఱినఁ, గార్యంబుతప్పి,
గాలివానలు పట్టుకాలంబు కొఱకుఁ
జాలుట కుంచిన చాపకొయ్యకును,
పెద్దవారల నాదుపెండ్లాముకట్టె
నిద్దఱఁ బ్రేమతోనిడి యొక్కచివర:
చిన్నవారల నొక్కచివరను నేను
దిన్నఁగాఁగట్టితిఁ దీఱనికూర్మి :
ఈలీల బాలురనేర్పాటుచేసి,
యాలియు నేనును, హాళిగలట్టి
సుతులమీఁదనుమాదుచూడ్కులునిగుడఁ,
గొతుకక యొక్కొక్క కొనఁగట్టుకొంచుఁ,
దేలి, ప్రవాహంబువాలునుబట్టి
లీలఁబోయితిమి కోరి తునకేసి,
అంతట భాస్కరుఁడైత్తోతెంచి,

వింతగాఁ జీఁకట్లవిరియుంగఁజేసె ;
నీరధియంతయు నిశ్చలంబయ్యె,
దూరంబునందుండి కోరింతు వొకటి,
యెపిడారసు వొకటి, యెదురఁగాన్పించె.
నప్పుడునావలు రెండు; అవిరాకముంద—
పలుకంగఁజాల నీపయిని మఱేమి,
తెలియుండు శేషంబు దీనినిబట్టి.

ప్రభు—నడుమఁ దెంపకుమిట్లు ; నుడువు మీ మీఁదఁ
గడముట్టవృద్ధుండ ! కథయెల్ల నాకు ;
చాలనోరిమి నిన్ను క్షమియింపకున్న,
జాలినైనను బొందఁజాలుదు మేము.

ఏజి—దైవంబెయిటుమమ్ముఁ దాఁజేసెనేని
నేవానిననవచ్చు నిర్దయుఁడంచు;
ఎట్టన—నోడలట్లీరేనుక్రోసు
లెట్టయెదురనుండ గట్టొందుతాఁకి,
నడిమికి రెండయ్యెవడి నూఁతకోల;
యెడఁబాసిచెఱియొక్క—కడనుబోవలనె.
ఇట్టియక్రమమైనయెడఁబాటునందు;
గుట్టుగానిద్దఱకు, సమంబుగాఁగ,
సంతోషమింతయు, సంతాపమింతయు
వంతుగలయఁగూర్చె భాగ్యదేవతయు
పాపమాయబలయు, భారహీనతను
త్రోపుడుపడనట్టి దుఃఖంబుతోడఁ,
బెనుగాలికిని మహావేగంబుగాను

గొనిపోవఁబడితిని ; కోరింతునీవు
బెస్తలాముఁవ్వుర వెలిఁ దాగ్చినట్టు
వాస్తవంబుగ దృష్టిపథమునఁదోఁచె.
కడకు మేమును నొక్కపడవమీఁదికిని
విడువ కెక్కించుకోఁబడితిమి వేగ,
మమ్ముట్లుగాచుట మఱిభాగ్యమంచు
నమ్మి, సహాయంబొనర్చిరి వారు;
దైవికంబుగ వారినావ, కరంబు
నావేళ మెల్లఁగాఁ బోవకయున్నఁ,
బట్టినచేపలఁ బాఱువై వంగ
నెట్టునువచ్చు; కాఁబట్టి వారపుడ
యింటికై మరలిరి ; యిట్లునాసుఖము
మంటఁగలియుటెల్ల వింటిరిగాదె ?
నాకష్టకథలెల్ల నలువురిముందు
వాకొనుచుంటకు నాకు దైవంబు,
వేయేల ? యీరీతి విశ్వంబులోన
నాయు వెక్కువపోసె నక్కటా ! యిపుడు.
ప్రభు——వారికై నీవు విచారించెదిపుడు,
వారికినీకు నీవఱకును నేమి
పొసఁగెనో దయచేసి పూర్ణంబుగాఁగ
వెస వినిపింపవే వివరంబుగాను.
ఏజి——నాచిన్నకొమరుండు నాప్రాణసముఁడు
పాపము ! ప్రేమతోఁ బదునెన్మిదేండ్ల
ప్రాయంబునప్పుడు, భ్రాతను వెదక
నోయనమతిపుట్టి, సాయంబుకొఱకు,
(తనరీతినే సోదరునిఁగోలుపోయి

మనమునఁ బేరును మఱవక యున్న)
సేవకుఁ దనతోడ శీఘ్రంబ పనుపఁ
దా వేఁడికొనె నన్ను దయపుట్టునట్టు;
అల్లపుత్రునిఁ జూడ నభిలాష మెంతొ
యుల్లంబులోఁ గల్గియును బ్రేమకతన
నీపుత్రకునిఁ గూడ నెడఁబాయ లేక,
యేపగిదినొ కడకీకొంటి నేను,
వారలవిరహంబు నోరువ లేక
సారెకుఁ గుందుచు సద్మంబు వెడలి,
గ్రీసు దేశమ్మున, గాసిలియైదు
వేసవికాలము ల్వాసఁ బుచ్చినాఁడ;
ఏసియాఖండంబు నెల్లను వెదకి,
మాసీమ కేగుచు మఱి యెపిసనుకుఁ
జనుదెంచినాఁడ, నెందునువారిఁగందు
ననునాశ లేక, యైనను నేస్థలంబు
నారయకుండంగ నావలఁబోవ
నేరక యెల్లెడ నెమకుచువచ్చి
కాని, యిచ్చోట నాకథయిట్లుముగిసె;
నేను జేసినయీప్రయాణంబు లెల్లఁ
గాయంబుఁగావంగఁ గలిగిననైన,
హాయిగా మరణంబు నంది సుఖింతు.
ప్రభు——మ్రందుమంచును విధి వ్రాయంగనుడుట,
మందభాగ్యుండవై మనువ ర్తకుండ!
హృదయంబునందెంత యిష్టమైయున్నఁ
దుదిమహీవరులకు దుర్లంఘ్యములగు

మాశాస్త్రములకును, మారాజ్యమునకు,
మాశపథములకు, మాగణ్యతకును
వ్యతిరిక్తమేమియు నయియుండకున్న,
మదిలోననమ్ముము, మఱినీకు మేము
తప్పక యుపకారదానంబు సేయ
నిప్పుడు వలసినదే; యటానుగాని,
మరణశిక్షనునీకు మాన్పలేకున్న,
జరిగినతీరుపు జార్పరాకున్నఁ,
జేతనయిన మేలుఁ జేసెదనీకు
నీతఱిమఱియేది న్యాయమైనఁగాని:
కాఁబట్టి నే నేఁడు గడువిత్తునీకు,
వేఁబోయిసాయంబె వెదకికొంచీవు
ప్రాణంబునెట్లైన రక్షించుకొమ్ము;
త్రాణమై నిచటమిత్రచయంబు నొకట
వేఁడియైనను, బదుళ్వేఁడియునైనఁ,
గూడఁబెట్టుముసొమ్ము, నేఁడెట్టులైన,
నటులైన బ్రదుకుదు వట్లుగాకున్నఁ,
బటుగతి జీవము ల్పాయంగ వలయు.
కారాగృహాధ్యక్ష! కావలినుంచు
ఘోరముగ నితనిఁగొనిపోయినీవు.

కారా — దేవ! యాలాగునఁగావింతు నేను.
దేవ! యాలాగునఁ గావింతు నేను.

ఏజి — అసహాయుఁడొచు, నిరాశను జెంది
వెసఁబోయెను బెహారివెతలిన్మడింప.

(అందఱు నిష్క్రమించిరి.)

2. ప్రదేశము.—ఒకబహిరంగస్థలము

(సరకాజియా ఆంటిఫోలసు, డ్రోమియో, ఒకవర్తకుడు ప్రవేశింతురు.)

వర్త.—ఎపిడామినమువాడనేననఁబోకు;
నృపతి, యట్లన్నచోఁ, నీసొత్తుఁగొనును.
సరకాజియానుండి చనుదెంచినట్టి
వరవర్తకుఁ డొకండు పట్టుకోఁబడియె,
నీపురంబుననేఁడె, యిటవచ్చెఁగాన;
పాపమాతఁడు, తనప్రాణముల్గాచి
కొనధనమీలేమిఁ, గోల్పోవుఁజుమ్మి
తనదుజీవంబును, తరణియాప్రొద్దు
చరమాద్రిసరసకు జరగకమున్న,
పురిరాజశాసనమునుబట్టి యకట!
ఇదెకొమ్ము నావద్ద నిచ్చినసొమ్ము,
పదిలంబుగా భద్రపఱచికొమ్మీవు.

స. ఆం.—కొనిపొమ్ము, డ్రోమియో! మనముండుసత్ర
మునకునుదీనిని, మోసంబులేక
కనిపట్టియుండు మక్కడనీవు, నేను
జనుదెంచువఱకును జాగ్రత్తగాఁగ.
జాములో భోజనసమయమౌఁ గానఁ
నీమధ్య, నేఁబోయి యీవీటఁగలుగు
వారలనడవళ్ళు వర్తకసరణి,
చారుగృహంబులసొగసు, వీక్షించి,
చనుదెంచి నిదురింతు సత్రంబులోన.
వినుము మార్గాయాసమునఁజేసి, నేను

బడలియున్నాఁడను, బలమెల్ల నుడిగి:
కడుపడిఁగదలు మిక్కడనుండినీవు.

స. ద్రో—నీమాటలనుబట్టి, నినుబట్టికొందు
రీమంచివేళనె యేగుమువేగ
(నిష్క్రమించెను.)

స. ఆం—చనవుకతంబున, సందేహపడక
యనయంబు హాస్యోక్తులను వచియించి,
నవ్వించి యలరించు, నామదియందు
నెవ్వగలేమైన నెలకొన్నయపుడు,
దయచేసి, యిఁకఁగొంతతడవునాతోడఁ
బ్రియమార నటునిటు వీటనుదిరిగి,
సత్రంబునకువచ్చి, సరసభోజనము
మిత్రుఁడ! నాయింట మీరుచేసెదరె?

వర్త—విందునకునునన్నుఁబిలిచినేఁడొక్క
యిందలివర్తకుఁ డేగకయున్న
నెన్నియో కార్యంబులిటఁ జెడుఁగాన
నన్ను నీవేళను మన్నింపవలయు.
ఐదుగంటలకును నంగడివీథి
కాదరమునవచ్చి, యామీఁద నిన్ను,
సాయంతనము నిద్రసమయంబుదాఁకఁ,
బాయకయుండెదఁ, బంపుమునన్ను,

స. ఆం—మంచిది. సెలవిమ్ము! మఱి నేనపోయి
యించుక తిరిగెద నిందుమనందు.

వర్త—ఇచ్చవచ్చినయట్టు లెల్లెడఁదిరిగి
ముచ్చటదీఱంగఁ బురమునుజూడు

సం. ఆం—ఉదకబిందువొకటి, యుదధిలోఁబడిన
యుదరబిందువు నొంటు వెదకిపైఁదీయ
గడలిలోపలఁజొచ్చి, కానక తాను
సడఁగినవడువున, నన్ను నుఁదల్లి
సరయుదుననివచ్చి యందందతిరిగి,
దురదృష్టమున నేనె తూలుచున్నాఁడ.
(ఎపి—డ్రోమియో వచ్చుచున్నాడు.)
వడినింతవేగంబ వచ్చితివేమి ?
ఎ. డ్రో—వేగమాయిది: చాలజాగయ్యెనిష్టు
వడవడి డ్రోమియో వచ్చుచున్నాడు
మాగి దింపఁగఁబడె మాంసపుఁగూర :
ఆవల గడియారముడిచెఁ బండ్రెండు,
దేవిగా రొక్కటితీసిరి నన్ను.
అన్నంబు చల్లాఱె ; నందుచేవార
లున్నారు కాఁకగా ; నన్నుమట్లయ్యె
దేవరవారు మందిరము చేరమిని ;
దేవర రాకైరి తినబుద్ధిలేమి ;
తినబుద్ధిలేదయ్యె దిట్టంబుగాను
ఘుసులెచ్చుటనొ విందుఁ గైకొనఁబోలు.
మీకేమి ? మీకొఱ కాఁకలిత్రోడఁ
జీకాకుపడి మేము చెడుచుంటి మింట.
స. ఆం—ఈపాటిచాలించు మీప్రసంగంబు,
నేపట్టునను, నమ్మ యేనునీచేత
నిచ్చినద్రవ్యంబు నిప్పుడు పెట్టి
వచ్చినాఁడవొచెప్పు వాస్తవముగను,

ఎ. ద్రో—గుఱ్ఱపుపిల్లంబుకుట్టినందునకు,
కుఱ్ఱవాని కొసంగుకొఱ కిచ్చినట్టి
నాలుగణాలునా ? నావద్ద లేవు ;
ఏల ? వానికపుడెయిచ్చి పుచ్చితిని.
స. ఆ.—ఉల్లాసముగ లేను, నుల్ల మందిపుడు;
కొల్లగ ముద్దులుగుడువక, యింక
సొమ్మొక నునిచితో సమ్మతిం జెప్ప :
నమ్మితివేలాగు నరునినొక్కరుని,
నూరకిం గడుక్రొత్తవారమై యుండ,
నారీతిసొమ్మెల్ల నటం బెట్టిరాంగ !
ఎ. ద్రో—హాస్యోక్తులా యిప్పుడాడుచున్నారు ?
హాస్యమావల భోజనావసరమున,
నాడుకొవచ్చును ; అమ్మగారయ్యం
దోడిత్తేం బనిచెప్ప నీడవచ్చితిని.
కొనిపోవకున్న, నాపనియౌనునిజము;
ననుగొట్టుం, దమదోషమునం జేసియమ్మ.
కడుపె నాకునుబోతె గడియూరమాచు,
కడి కింటికిని, దూత కార్యంబులేక,
నినుం గొట్టవలయును, నిక్కంబుగాంగ,
ననితోంచుచున్నది యాత్మలోనాకు.
స. ఆం—రా, ద్రోమియో ! యిటు రా; హాస్యమునకు,
భద్రము : నీకిదవసరంబు గాదు ;
దాంచుకొమ్మివియెల్లం, దఱివచ్చుదాంక !
నీచేతికిచ్చిన నెఱధనమేది ?
ఎ. ద్రో—నాచేతికా? మీరునాకెందుకొఱకు,
తోంచక ధనమియ్యందొలుతనువలసె!

స. ఆం.——తస్కరశ్రేష్ఠుఁడ దయచేయుమిటకుఁ;
మస్కరిచేష్టల మఱికట్టిపెట్టి,
నీబాధ్యతనునెల్ల, నేఁ జేమిచేసి,
రోబాలిశుఁడ! వచ్చితో చెప్పునాను.

ఎ. ద్రో.——నాదుబాధ్యతయెల్ల నడువీధినుండి
యాదటమిముభోజనార్థంబు బసకుఁ
గొనిపోవుటయె; ఆవలనట నీకొఱకుఁ
గనిపెట్టియుం దమ్మగారు, సోదరియు.

స. ఆం.——స్థాయిగఁ దెల్పుము దైవంబు నెదుర,
నీయొద్ద నుంచిన వేయివరాల
నేసురక్షితమైనయిక్కను బెట్టి
నాసరసకువచ్చినాఁడవో నిజము;
లేకున్న, మదినెమ్మి లేనప్పుడిట్లు,
నాకడ మేలముల్నడపించు చున్న
నీతలప్రక్కలు నేఁ జేయుదిపుడు.
చేతిధనం బేమిచేసితో చెపుమ.

ఎ. ద్రో.—వెదకినను, వరాలు వేయివారొద్ద
నొదవనేరవు; కాని యున్నవి వేయి
దెబ్బలు, తలమీఁద దేవరవారు,
జబ్బలమీఁద నిచ్చులు నమ్మగారు,
కొట్టినవన్నియుఁ గొన్నితక్కువగ ;
గట్టిగా నవియెల్లఁ గ్రమ్మఱ నేను
నేలినవారి కర్పించుదు నేని,
దాళంగలే రేమొ తరువాత మీరు.

స.ఆం—ఆ! యమ్మదెబ్బలా? యీయెడనీకు
నేయమ్మకలదురా? హీనసేవకుడ!
ఎ.ద్రో—దేవరభార్య; మందిరమునుజేర
నీవువచ్చెడుదాఁక, నిలయంబులోన
నన్నుంబుతినక, మిమ్మరసితెమ్మంచు
నన్నుఁబంచినయట్టినాతి; మాయమ్మ.
స. ఆం—ఎగతాళిచేసెదే? యీరీతినీవు
మొగముముందఱ నన్నుఁ, దగుభీతిలేక;
ఇదిగొ కన్గొనుము నిన్నేమిచేసెదనొ;
పదరకు నెఱదొంగ! పట్టుముపట్టు.
(అనికొట్టుచున్నాఁడు.)
ఎ. ద్రో.—ఆ! యిదియేమియయ్యా? చాలుఁజాలు;
చేయితీయుము ! పాఱిపోయెద నేను.
(నిష్క్రమించును.)
స. ఆం-నాపనికాఁజేసి, నడిపించెధనము
పాపాత్ముఁ డేదొమాయోపాయ మరసి.
విను చుందు మెపుడు నీ వీ డెల్లకాల
మును మోసములకెల్లఁ బుట్టినిల్లంచు;
అట్టికన్నులుగప్పు నైంద్రజాలికులు,
పట్టిమతులుమార్చుపటుమాంత్రికులును,
నంగవైకల్యంబు లవలీలఁజేయు
పొంగెడుదయ్యాలపోతులు, మఱియుఁ
బలుకులఁబందిళ్ళు వైచిక్రుంగింపఁ
గలవారు, లోలోనఁగగ్గ బ్రాముపారు
దురితంబులిట్టివి జరిపించువారు

పురినిండఁగలరఁట పుట్టపుట్టలుగ.
ఇదియెల్ల వాస్తవమే యయ్యెనేని,
దుది లేనిచేటు పాటొందవెనునాకు.
ఇప్పుడేపోయెద, నీబానిసీని
జప్పున నెమకంగ, సత్రంబునకును;
సొక్కంబునకు నేఁడు తెక్కలువచ్చు
నొక్కయంచును భయమొదవెడునాకు.
(నిష్క్రమించును)

---

## ద్వితీయాంకము.

### 1. ప్రదేశము—బహిరంగస్థలము.

(ఏడ్రియానా, లూసియానా ప్రవేశించుచున్నారు.)

ఏడ్రియానా—పెనిమిటి యొండెను బెనిమిటికొఱకుఁ
బనిచెప్పిత్వరచేసి పంపినయట్టి
భటుఁ డొండె రారైరి, పడఁతి! యీవఱకు:
ఇటుచూడు నిజముగా నిపుడు రెండయ్యె,
లూసియానా—ఒకవేళ నెవఁడైననొక వర్తకుండు
పికవాణి! యాతనివిందుకు నేఁడు
పిలిచియుండఁగవచ్చు; విపణియందుండి
కలిసిమిత్రునివెంటఁ గ్రన్ననబోయె ;
భుజియింతమిప్పుడు పుష్కలంబుగను.
త్యజియించియోరెంబు, తడఁబడనేల ?

పురుషులు ధరలోనఁ బరమస్వతంత్రు
లరయంగఁ గాలంబె యధిపతివారి
కదిచూచి, పోవుదు రదెంతు రెంచు:
మదిలోనవగవగ మఱియోర్చుకొమ్ము.
స్త్రీ.— మొగవారికిస్వతంత్ర మొగినుండ నేల
మగువలకంటె మఱి హెచ్చుగాను ?
లూసి.— వారలపనియెల్ల వాడవాడలనె
యూరిలో నెప్పుడు నుండునుగాన.
స్త్రీ.— ఈరీతివిభునెడ నే జేసినపుడు
క్రూరముగానన్నుఁ గోపించుఁజుమ్మీ.
లూధ.— నీ మనోరయమును నిలిపివేయుటకుఁ
గామిని ! యాతండు కళ్ళెమంచెఱుఁగు
స్త్రీ.— చూడఁగనటువంటిసుదతులు లేరు.
గాడిద లోఁబడుఁ గళ్ళెంబునకును.
లూసి.— ప్రమారణమ్ములు గల్గు స్వాతంత్ర్యమునకు
బహువుగ నిక్కినపక్షంబునందు
అవనిని, జలమున, నాకాశమందు,
భువనేశ్వరునిచేతఁ బుట్టింపబడిన.

# స్త్రీ వి ద్య.

(1873 వ సంవత్సరమునందు స్త్రీ విద్యావిషయమునఁ బద్యరూపమున మూఁడు త్తరములు పురుషార్థప్రదాయినీపత్రికకు వ్రాయఁబడి యందుఁ బ్రకటింపఁబడినవి. గ్రంథ నిదర్శనములతోఁ గూడియుండిన మొదటిలేఖ యిప్పుడు దొరకినదికాదు. బ్రహ్మశ్రీ తోలేటి సుబ్బారావుగారు ప్రచురించిన కవి చరిత్రములో నుండిన రెండవలేఖలోని కొన్ని పద్యములును, మూఁడవ లేఖయు నిందు బ్రకటింపఁబడుచున్నవి )

శా. శ్రీమార్తాండమరీచిరోచియనఁగాఁ జెన్నై దివాంధావళిం
బ్రామంగ్రాల్ పురుషార్థదాయినిపతీ! పద్యాళి సంజీవనీ
శ్యామాలోకము కెల్ల విద్యవలదం చష్టావధాన్యాహ్వయుల్
తా మీమాంసము వెల్లడించుటలు మోదంబొప్ప వీక్షించితే ?

క. దానిం గనుఁగొని తోఁచినఁ,
వానిం బ్రత్యుత్తరముల వరున నొసఁగెదఁ
గాన మనముల ననూయలు,
మానుఁడు మఱికీడుమేళ్ళు మది నారయుచోన్.

క. మొదటనె పూర్వులు చెప్పిన
యది యనుగర్వంబుమానుఁ" డని నేనేమో
పదరి యనినాఁడ నంచును,
జదు రేర్పడఁ బల్కినారు చక్కని నుడులన్.

గీ. సరి! "పురాణమిత్యేవన సాధుసర్వ"
మనుచుఁ దొల్లి యొమాళవికాగ్నిమిత్ర
మనెడు నాటకరాజంబునందుఁ గాళి
దాసు పల్కుట వినరొకో ధన్యులార.

చ. మునుపటివారు చెప్పినది మొక్కలపున్నది పూనిసర్వముం
గొనఁ జనదంచు నామతముకూడ లవంబును గాదు, కాని యెం
దును మనబుద్ధికూడఁ గదుఁగూరిచి యారయుచుంట ముఖ్యమై
చనును హితాహితంబులపసల్ గని దుష్కృత ముజ్జగింపఁగన్.

క. ప్రతిభావంతులు మిక్కిలి,
మతిమంతులుఁ గలరు మిగుల మనపూర్వులలో
సతతము వాదము సల్పిరి;
యతులితవాగ్గరిమఁ గొన్నియంశంబులలోన్.

*　　　*　　　*　　　*

మ. అయిన న్మద్దియవిద్దియంగుఱిఁచి యెందైనం దగం దొంటియా
నయవేదుల్ తగదంచు వాదములు పూనం గంటిమే మీావలెన్ ?
దయమీాఱంగను జెప్పుఁ డయ్య! యలసిద్ధాంతంబు లెందైన మీా
నయనానందముచేసెనేమొ వినఁగన్గౌతూహలంబయ్యెడున్.

*　　　*　　　*　　　*

ఉ. "వారణయాన లెల్లరును బాటల నేర్తురు గాని వారిలో
నారయ వానియర్థ మొకరైనను నేర్చినవారె" యంచు మీా
రూరక వాదులాడెద రయో! మనపాటలయర్థ మంగనల్
నేరరె? యిట్లు మీా రనిన, నిక్కములోకము తానెఱుంగదే?

గీ. పాటలాధరల్ పాడెడుపాటలందుఁ
దప్పిదంబులు కుప్పలై యొప్పుఁగాన
వానియర్థముఁ దెలియరు వా రటంచుఁ
జెప్పనొప్పునె? యొప్పులకుప్పలార.

*　　　*　　　*　　　*

ఉ. వింతగ వాద మేల యవివేకులపోలిక; స్త్రీలవిద్య సి
ద్ధాంతమె చేసినారు మనతజ్ఞులు పూర్వులు; వేద మొక్కటే

యింతులు చూడఁ గూడ దని రింతె; పురాణచయంబు స్త్రీలకై
యెంతయుఁ జేయుటల్ స్మృతులు నెల్లపురాణము లొత్తి చెప్పవే?

* * * *

గీ. భవ్యపురుషార్థదాయినీపత్రికాధి,
నాథులార! యుమారంగనాయకాఖ్యు
లార! ప్రచురింత్రుపత్రికయందుఁదీని
ననుచు వేఁడుమిత్రుండు—శతావధాని.

స్త్రీ వి ద్య.

తే. పరమపురుషార్థదాయినీపత్రికాధి,
నాథులార! సువిద్యాసనాథులార!
సరగ మీపత్రికను నాదుజాబుకింత,
తా వొసంగెదరే మిత్రభావమునను?

మత్తేభవిక్రీడిత కందగర్భసీసము.

సీ. వినయ మొప్పారఁగ విన్నవించెద నిదే
న్యాయంబుగాఁజూచి మీరెదఁ గడు
సదయలీలం దగ సారసాననలవి
ద్యాసంవివాదంబులో సరళిగ
విజయ మెవ్వారికి వీఁకమైఁ గలిగెనో
సామాన్యధీమైనసుధీమదేభ
నిచయముల్ మెచ్చఁగ నీతితో నుడువుఁడీ
జల్పాకులై సజ్జను లొప్పసంగ
వెలఁదులకు విద్య గూడదు కలుగు నఘము
దాన నిజముగా నని యనఁ దా రెలమిని
దలపడినను నార్యులుచెప్పుపలుకులనె వ
లయునుగనబఱుపన్ మాకులక్ష్యములుగ.

గర్భ మత్తేభము.

మ. నయ మొప్పారఁగ విన్నవించెద నిదే న్యాయంబుగాఁజూచి మీ
దయలీలం దగ సారసాననలవిద్యాసంవివాదంబులో
జయ మెవ్వారికి వీఁకమైఁ గలిగెనో సామాన్యధీమైసుధీ
చయముల్ మెచ్చఁగ నీతిత్రో నుడువుఁడీ జల్పాకులై సజ్జనుల్.

గర్భ కందము.

క. వెలఁదులకు విద్య గూడదు,
కలుగు నఘము దాన నిజముగా నని యనఁ దా
రెలమిని దలపడినను నా
ర్యులు చెప్పుపలుకులనెవలయును గనఁబఱపన్.

క. మొదటనె పూర్వులు చెప్పిన,
యది యనుగర్వంబు మానుఁ డని నే ననలే
దది వారే కల్పించిన
యది యని నే నన్నయట్టు లనెదరు కంటే.

తే. వీరియర్థంబుచేసెడివెరవునకును
జాల మెచ్చంగఁ జనుఁ గాని మేల వీరు
నాదుపద్యంబులో నుండునట్టిదానిఁ
"బదరి" యనుమాట నడఁచిరో పలుకవలయు.

తే. పద్యములనెందు నేనొక్క-పదమునణఁచి,
యర్థమొనరింపఁబూనినఁనందుఁగలుగు
నర్థమెల్లను జెడి పోయి యంతతోడ,
నాగకమెచట లేనియపార్థమొదవు.

ఆ. ఈమహానుభావుఁ డెఱుఁగనివారికి
"బొంకవచ్చునఘము పొందదధిప"
యనుచువింతయర్థమును జెప్పఁగాఁబోలుఁ
బూర్వపదచయంబుఁబోవనడఁచి.

క. పోలఁగ నా వెనుకటిప
ద్యాళివలన నంతకుమును పటువ్రాసినయా
"వాలాయ" పదమునర్థము
నేలీల నెఱింగినారో యీనవరసికుల్ ?

క. ఈవాదములో నెందును
నావంతయు వాక్యసంచయార్థవిమర్శల్
కావలె నన్నుంగలిగెనె
కేవలయుక్తిప్రయుక్తికృత్యము దక్కన్.

తే. "ఎంచఁగనహాల్యతారయుఁబంచకన్య
లందు నిర్వురు" కారఁట! యల్లదాని
కర్థమునునేఁ "గటాక్షింప" నగునఁటసరి
యేఁగటాక్షింపగా నేలయిపుడుమరల.

తే. తొంటియష్టావధానులెతొల్లి "యింక
హాల్యతారలు పంచకన్యల నిరువుర
టనుచువినలేదె" యనినారలర్థమేమొ,
యచటవారెకటాక్షింతురడుగరాదె ?

సీ. ఏనె నామాటలకెఱుఁగనం టర్థంబు
తన్నుఁ దా నెఱిఁగినఁ దలఁపఁ డిట్లు
రామకృష్ణాచార్యరచితపద్యాళిని
దాను వ్రాసినయట్టివానిఁ గాఁగ
నెంచునే తా నొడ లెఱిఁగనే నిందుకు
దృష్టాంతముగఁ జూఁడు డెల్లవారు
నీయన "నేనె కల్పించుచుఁ జదు రేర్ప
డఁబలికితినఁట" యంచుఁబొసఁగంగ

"నేను వ్రాసినశ్లోకంబులోనవిద్య,
యనెడుమాటయువెదుకఁగాఁజనునటంచు
జాలఁ బల్కిరి వెదుకఁగా నేల దాన,
నడఁగియున్నదిచూపెద" ననిరొ లేదొ.

తే. తుదనుగలయట్టియాచార్యపదముఁజూచి,
తానునాచార్యుఁడేయౌటఁదలఁచియేమొ
యెంచె నీన్నృసింహాచార్యుఁ డెంతవాఁడు,
రామకృష్ణమాచార్యుఁగారమణఁదన్ను.

సుగంధివృత్తము.

వారు మున్నుదాహరించి వ్రాసినట్టి శ్లోకమం
దార చూపినారు విద్య యన్పదంబు వింతగా
నారయంగ నేల నింక నట్లు సందియంబు వో
నేరు పొప్పఁ బూడియున్ననిగ్గు వెల్లగింపఁగాన్.

చిత్రపదవృత్త

కొమ్మలవిద్యకు స్వాతం, త్ర్యంబునకుం దగు సంబం
ధంబు త్రిదండికి సంసా, రంబునకుం గలమాడ్కిన్.

అచ్చతెనుఁగు సీసము.

సీ. ముద్దియవిద్దియ మున్నున్న దంటకుఁ
గబ్బముల్ పెక్కు తార్కాణగాఁగఁ
జూపితిఁ గాదన నోపెద రేనియుఁ
జేతనై నంతయుఁ జేయవలయుఁ
గా కది పోనాడికన్నెలపాటలఁ
దప్పిదంబులు గొప్ప కుప్ప లనుచు
నిప్పటివాదున కేమియుఁ బొసగని
చప్పిడిసుద్దులఁ జదువుఁ జేల

చదువ కుండినయంతనె చానలెల్ల,
అంకుటాం బ్రౌఢురని మున్నుఅంతునేసి
యన్నవా రెవ్వరో వారి నడుగవలయు,
నేను విద్దెచే వెలిచవి మానునంటి.

సీ. తెలివలు చదివిన ధీమతు లయ్యెద
రఁట కాని వంటక మారగింప
బల మేపు రాదఁట బాగుబా గోరెంబు
గుడువక యుండినయెడల బలము
తప్పక క్షీణించుఁ దథ్యంబు మామత
మదియె ముమ్మాటికి నార్యులార
చర్చించి చూడ నష్ట + అ + వకారాకార
ధానుల తెలుఁ గేమొ కాని తలఁప
మఱియుఁదనదేహమే తాను మఱచియుండు
నున్మదాగ్రణికి సృగాల మొక్కదీపి
దీపి యొకసృగాలంబునై తోఁపకున్న
దానిఁబాటిబట్టుటె వెఱ్ఱితనముగాక.

ఉ. ఏమిటి కీవృథాచలము లీవఱ కన్నియు నయ్యె నింకఁ గా
లామృత మాదిగా మిగిలె నందునుఁ గ్గాదన నేల చూపెదన్
కామిని కక్షరాభ్యసనకార్యము గల్గు దాని గాంచి తా
రీ మఱి పూర్వనాగరికు లేమని యుందురొ చూత విూ పయిన్.

తే. అక్షరాభ్యాసయోగంబు నతివలకును
నల్లజ్యోతిషమాధవీయంబునందుఁ
గలుగఁగా జెప్పెఁ గావున నెలమిమీఱ
దానినీక్రిందనిదిగో యుదాహరింతు.

జ్యోతిషమాధవీయమునందు వృద్ధవశిష్ఠ వచనము.

"శ్లో. ఉదగ్గతేభాస్వతి పష్ఠమే, బ్దే మాసేచయుగ్మే దివసేతథైవ
పిత్రాక్షరస్వీకరణంచ స్త్రీణాం, సరస్వతీప్రార్థనపూర్వ మాదౌ"

కందము గోమూత్రికా బంధము

క. వారిఁగ వీరిఁగఁ గాని నను
వారలు మఱిఁగూయఁదగదు వాదము పోలన్
గోరిన వీఁకఁ గడు నిలను
గారవ మగుఁ గూడ దసదుగాఁ దలపోయన్.

తే. భవ్యపురుషార్థదాయినీపత్రికాధి
నాధులార! యుమారంగనాయకాఖ్యు
లార! ప్రచురింత్రు పత్రికయందుదీని
ననుచు వేఁడెదుత్రొంటి-శతావధాని.

---

# చెన్నపురి బ్రహ్మోపాసనామందిర ప్రతిష్టాపనము.

(౧౮౭౫వ సం॥ జనవరి ౧. తా॥ గురువారము.)

బ్రాహ్మపద్య చంద్రిక.

ఉ. శ్రీకరుఁ డైనయీశ్వరుఁడు శ్రేయములం దయచేసి కూరిమిం
గైకొని ప్రోచుఁగాత గుణగణ్యులఁ బుణ్యుల సత్యశీలురన్
బ్రాకటభక్తియుక్తులను బ్రాహ్మసమాజమతావలంబులన్
లోకచయోపకారులఁ బ్రలోభవిదూరుల ధర్మచారులన్. 1

చ. మును మనహిందుదేశమున మూఢత మిక్కిలిపర్వి యెల్లెడన్
జనములు విగ్రహంబులనె చాలఁగఁ బూజలు సల్పుచుండఁగాఁ
గని యదిమాన్పఁగోరి బహుకష్టములం బడి త్రొల్త రామమో
హను లిలమీఁద బ్రహ్మమత మల్లన స్థాపన చేసె దక్షుఁడై. 2

చ. అటువలె నొక్కయీశ్వరుని యర్చన మానసికంబుగా భువిన్
బటుమతిఁ జేయుపద్ధతిని భాసిల నేఁబదియేండ్లక్రిందటన్
ఘటనయొనర్చి దేశమునఁ గల్గుజనంబుల కెల్ల జాటి యీ
దట నొనరించె నాతఁడు మతంబున కెల్ల మహోపకారమున్. 3

మ. ఘనుఁ డాతండు దివంబుఁ జేర వెనుకం గాపాడి యద్దానిఁ బొం
దెను సత్కీర్తి మనీషులెల్ల బొగడన్ దేవేంద్రనాథుం డహో
వినుతిం జెందదె యాదిబ్రహ్మమతమన్ పేరన్ జగంబందు నీ
యన స్థాపించినసత్సమాజ మిపుడొయ్య న్సర్వసమ్మాన్యమై. 4

ఉ. ఈయన పండితోత్తముల నేపునఁ బంచెను వారణాసికిన్
బోయి సమస్తవేదచయమ్ముం బఠియింపఁగ వారు వచ్చి యా
మ్నాయములం బరీక్షగ విమర్శ యొనర్పఁగ నందు దోషముల్
పాయక కొన్ని కన్పడియెఁ బాసెను వానిప్రమాణభావమున్. 5

చ. వెనుకను బ్రాహ్మధర్మ మనుపేరను గ్రంథ మొకండుచేసె నీ
యనఘుఁడె తా శ్రుతిస్మృతులయందలివాక్యము లేర్చి కూర్చి యీ
యన ఘనకీర్తిఁ గాంచి ముద మారఁగఁ గేశవచంద్రసేనులున్
ఘనతరభక్తి జేరెను ఘనంబుగ బ్రాహ్మసమాజము న్వడిన్. 6

చ. ఇతఁడు ప్రసంగము ల్వలుప నెల్లర రంజిలఁ జేయ దక్షుఁడై
ప్రతిభమెయిం జగంబునను బ్రాహ్మసమాజము వన్నెకెక్క నం
చితగతిఁ జేసి శ్లాఘ్యతను జెంది సమాజముకార్యదర్శియై
యతులితసాహసంబున సహాయులఁ గూడి త్యజించె వర్ణమున్. 7

ఉ. కేశవచంద్రసేను లిటు కేవలధైర్యముతోడ వర్ణమున్
పాశము ద్రెంచి యాదిమపుబ్రాహ్మసమాజమువారు తన్నుఁ గ్రూ
రాశయులై వడి న్విడువ నంతటవీడియు వారినెయ్యపుం
బాశము హిందూదేశపుసమాజము స్థాపన చేసె వేఱుగన్. 8

శా. హిందూదేశపుబ్రాహ్మసంఘమును స్థాపించెంగదా యింతకున్
ముందే కేశవచంద్రసేను తెలమి న్మున్నొక్కపర్యాయ మొ
ప్పం దా నీపురి కేగుదెంచి యిచటం బచ్చప్పవిద్యాలయం
బందుం బ్రహ్మమతంబుఁ గూరిచి యుపన్యాసంబు చేసెం దగన్. 9

శా. ఈలీలన్ మృదుమాధురీ మహిమతో నెన్నో యుపన్యాసముల్
లీలం జేసిన నాలకించి మది హాళిం జెంది శ్రీరాజగో
పాలాచార్యులులోనుగాఁ గలఘనుల్ బ్రహ్మంబు సేవింపఁగాఁ
బోల న్వేదసమాజము న్నిలిపి రీప్రోలందు సద్భక్తితోన్. 10

ఉ. ఈతఁడె తత్త్వబోధినిని నిప్పురమందున ద్రావిడంబులో
నాతరువాతఁ బూన్కిమెయి నాంధ్రమునం బ్రచురించి చాలఁ బ్ర
ఖ్యాతి వహించె ద్రావిడులయందలిమూర్ఖత పోవునట్లు స
ద్ధేతువు లిచ్చి పుస్తకము లెన్నియొ తా రచియించె దక్షతన్.

ఉ. ఈయనకు న్సహాయుఁడయి యెంతయు నిశ్చలభక్తితోడ సు
బ్రాయలుసెట్టి పాటుపడి వన్నెకుఁ దెచ్చె సమాజ మెంతయున్
బోయినఁ గొంతకాల మిటు పుణ్యశరీరులు వీర లిర్వురున్
గాయములం దొఱంగిరి యొకంటసమాజముపెంపు తూలఁగన్. 12

ఉ. ఈగతి వీర లిద్దఱును నీశ్వరుసన్నిధిఁ జేరఁ బిమ్మటన్
వేగమ తాను శ్రీధరులు వేదసమాజముకార్యదర్శియై
బాగుగఁ గార్యనిర్వహణభారముఁ గైకొని బ్రాహ్మధర్మమున్
లోగశ ద్రావిడంబునఁ దెలుంగుననున్ రచియించెఁ దేటగన్. 13

ఉ. బ్రహ్మమునే భజింపుచును వచ్చుట దక్షిణహిందుదేశపున్
బ్రాహ్మసమాజ మంచు నవనామము దీనికిఁ బెట్టి యిచ్చటన్
బ్రహ్మమతంబు శ్రీధరులు వ్యాపన మించుక చేసి యింతలో
బ్రహ్మపదంబుఁ జేరెఁ దరువాత సమాజము చెందె క్షీణతన్. 14

చ. తగినసహాయతం గనక తద్దయు క్షీణత నొందుచుండఁగా
మగుడనిభక్తితోఁ గడఁగి మన్నవబుచ్చయపంతు లెంతయున్
దగుపని చేసి తా నొక విధంబున నిల్పె సమాజ మియ్యెడం
బెగువను దేశముల్ తిరిగి తెచ్చిధనంబును సుస్థిరంబుగన్. 15

చ. నిలిపెను బ్రహ్మమందిరము నిత్యుని సర్మలు నీశుఁ గొల్వఁగా
సలిపెను సాయ మీపనికిఁ జాలఁగఁ దా శివనాథశాస్త్రియున్
వెలయునుగాక చెన్నపురిపేరను జెన్నగునీపురంబునన్
సలలితభక్తి నొక్కఁడగుసామిని గొల్చెడుపుణ్య మీపయున్. 61

---

# శ్రీ విక్టోరియా జూబిలీ నవరత్నములు

క. శ్రీకరుఁ డగుపరమేశుఁడు
ప్రాకటకరుణాప్రపూర్ణభావముతోడన్
జేకొని ప్రోచుత గుణర
త్నాకర విక్టోరియామహారాజ్ఞి మణిన్. 1

సీ. ఏసాధ్వి తాఁ బదునెన్మిదివందల
పందొమ్మిదవయేటఁ బ్రభవ మొందె
నేరాణి పూజ్యయై తారాజ్యము వహించెఁ
బందొమ్మిదవయేటఁ బ్రజలువొగడ
నేతల్లి గృహిణియై యేవురుకూఁతులఁ
దనయుల నలువురఁ గనియె నెలమి
నేమాత యేఁబదియేండ్లనుండియు భూమిఁ
బాలించుచున్నది ప్రౌఢలీల
నేసతి దశాబ్దములక్రింద హిందుదేశ
చక్రవర్తినిపట్టంబు సంగ్రహించె

సట్టివిక్టోరియా రాజ్ఞి నాదిదేవుఁ
డాయురారోగ్యములనిచ్చి యరయుఁగాత. 2

సీ. బాల్యకాలమునందె బహుభాషలను నేర్చి
యతులవిఖ్యాతి యేయమ్మగాంచె
వృక్షశాస్త్రమునందు వివిధప్రకృతిశాస్త్ర
వితతి నేయమ్మ ప్రవీణ యయ్యె
సంగీతసాహిత్యసరసచిత్రవిలేఖ
నానులఁ బ్రౌఢ యేయమ్మ యయ్యె
దేశచరిత్రలఁ బేశలధర్మార్థ
శాస్త్రాళి నేయమ్మ జాణ యయ్యె
కుట్టుపనియందు నేయమ్మ కుశలయగుచుఁ
గొడుకుబిడ్డలకిచ్చుఁ దాఁగుట్టినవియొ
యిన్నివిద్యలఁ బాండిత్య మిట్లుపడసి
యున్నయాయమ్మధీబల మెన్నదరమె. 3

ఉ. ఏయమ రాణియయ్యు స్వమహీస్థలి బీదలయాకుటీండ్లకుఁ
బోయి ధనౌషధంబులును బుట్టములున్నిడు పేదవారికిన్
గేయముగాఁగ నిచ్చితగ క్షేమములారసి వచ్చుచుండునో
యాయమసద్గుణాళిఁ గొనియాడఁ గలండె సహస్రవక్త్రుఁడున్. 4

సీ. ఈకుటుంబిని రాజ్యమేలుచు నున్నట్టి
పంచాశదుత్తమాబ్దములలోన
భరతఖండమునకు బహుబాధలు తొలంగి
సకలసౌఖ్యంబులు సంఘటిల్లె
ధూమనౌకలకల్మిఁ దురగయానసమంబె
యయ్యె ద్వీపాంతరయాన మిపుడు

తంత్రీముఖంబున దవ్వులవార్తలు
క్షణములో శ్రవణయోగ్యంబు లయ్యె
ధూమశకటబలంబున దూరదేశ
యాత్ర లత్యల్పకాలసాధ్యంబు లయ్యె
నహహా పొగడంగఁదరమె రాజాధిరాజ్ఞి
యైనవిక్టోరియారాజ్యయాత్రమహిమ. 5

సీ. నదులకాల్వలుపాఱం బెదచౌడిపట్రలు
కలమధాన్యము పండుపొలము లయ్యె
బెబ్బులులకుఁ జోరవితతికిఁ దావులౌ
వనవాటములు పెద్దబాటలయ్యె
దుష్ప్రభుత్వముపోయి తుల్యమాన్యాయంబె
యెల్లవారికిఁ గల్గె నెల్లయెడల
విద్యాలవములేని వివిధజాతులవారి
కమలవిద్యాప్రభావములు గలిగె
గఱవులకుఁజూడఁగాఁ బెద్దకఱవువచ్చె
నరబలు ల్సహగమనముల్ నాశమయ్యె
స్థానికప్రభుత్వ మొకింతజనుల కొదవె
మేలు! విక్టోరియా రాజ్యకాలముననుు. 6

క. మున్నెన్నఁడు లభియింపని
సన్నుతసత్పాలనంబు సమకొనుచుండన్
మిన్నంది యెల్లయెడలను
జెన్నారెదె రాజభక్తి సేతువువఱకున్. 7

సీ. సత్రముల్ మీఁపేర సమకొల్ప నొకచోట
విద్యాలయములుంచ వేఱొకచోట

పట్టణభవనముల్ గట్టింప నొకచోట
వృత్తిశాలలు నిల్ప వేఱుచోట
జనమహోద్యానముల్ స్థాపింప నొకచోటఁ
జెనుబావులను ద్రవ్వ వేఱుచోట
నీటియంత్రంబుల నెలకొల్ప నొకచోట
బీదగృహములుంచ వేఱుచోట
పట్టణములందు మీపేరు పాదుకొల్ప
యత్నములు సాగుచున్న వీయవనియందు
నేఁబదేఁడులు రాజ్య మీరేలి రన్న
సంతసమున విక్టోరియాసాధ్వి నేఁడు. 8

సీ. ఏమూలఁ జూచిన నింపైన పందిళ్లు
నేతట్టునను గన్నఁగేతనములు
నేవంక వీక్షింపఁ బూవులతోరణా
లేపట్టునను గన్న దీపచయము
లేకడఁ దిలకింప నాకాశబాణంబు
లేసట్టునను గన్న గానములును
బట్టణంబులు మొదల్ పల్లెలవరకును
వెల్లిగొనుచు నున్న వెల్లమొదల
నఖిలజనమనోహారిణి వైననిన్ను
స్థిరతరాయురారోగ్యసుస్థితుల నిచ్చి
యీశ్వరుండేలుఁగావుత నెలమిత్రోత
రాజ్ఞి విక్టోరియాదేవి! ప్రమద మెనఁగ. 9

---

# శ్రీరిపన్ ప్రభు స్వాగతము

ఉ. శ్రీమహనీయసత్కృపను జీమ మొదల్ ద్విరదంబుదాఁకఁ దా
నీమహిఁ గల్గుజంతువుల నెల్ల సతంబు సమానదృష్టితోఁ
బ్రేమను బ్రోచు నీశ్వరుఁడు విశ్వసురుండు రిపన్ప్రభూత్తమున్
క్షేమ చిరాయురున్నతులఁ జెన్నువహింపఁగఁజేసి ప్రోచుతన్.

సీ. ఎలమిఁతో నెవ్వఁ డీహిందువులకు స్థాని
కస్వపరిపాలన మియ్యఁ గట్టుచేసె
నాంగ్లేయు లపరాధులైనను శిక్షింప
నెవఁడిచ్చె నధికార మిచటిప్రజకు
పరదేశముననుండి సరకులు తెప్పింప
కిచటివృత్తు లెవఁడు వృద్ధిపఱిచె
నుప్పుమీఁదను పన్ను నొకకొంత తగ్గించి
యెవఁడు బీదలకష్ట మింకఁజేసె!
నెవఁడు వృత్తాంతపత్రికకిచ్చె స్వేచ్ఛ
నెవఁడుయత్నించె విద్యాభివృద్ధికూర్పు
నట్టిఘనుఁడు రిపన్ప్రభు వరుగుదెంచు
నేఁడు మనరాజధానికి నెలఁతలార.

ఉ. కావున నిట్టిగొప్పయుపకారము లెన్నియొ చేసినట్టియా
ధీవిభవున్ నృపప్రతినిధిన్ మన మెల్లను గాంతలార! సం
భావనచేసి మంగళముపాడి కృతజ్ఞతఁ జూపఁ జెల్లు మే
మ్మావరపాలకున్ మనకు నంపినవారలయందుఁ గూరిమిన్.

నాదనామక్రియ రాగము—చాపుతాళము

పల్లవి—మంగళమ్-మహీపాలచంద్రా! మంగళమ్

అనుపల్లవి—మంగళమ్ కరుణాంత ♦ రంగ దుర్జనభంగ
రంగదఖిలమహా ♦ రాజసంసేవితా. మంగళమ్.

చరణములు-1. శ్రీరిపన్ ప్రభునకు ♦ ధీరునకు నతని
దారకు విమలవి ♦ చారకు ఘనసుకు
మారున కతనికు ♦ మారునకును మిత్ర
వారమునకు బంధు ♦ వర్గంబునకు నిల. మంగళమ్.

2. అవని శ్రీవిక్టోరి ♦ యా మహారాజ్ఞికి
యువరాజున కతని ♦ యువతికి సుతలకు
సువివేకులకు రాణి ♦ సుతులకు సుతలకు
సవినయులగు వారి ♦ సతులకుఁ బతులకు. మంగళమ్.

3. ఈమహాప్రభువరు ♦ నిచటకుఁ బంపిన
ధీమంతులగుమంత్రి ♦ తిలకుల కచ్చటి
శ్రీమహాసభకును ♦ చెలఁగ నీదేశపు
క్షేమముచూచెడు ♦ స్థిరపుణ్యమతులకు. మంగళమ్.

---

## కులాచారసంస్కార పూర్వనాగరిక పంచరత్నములు

సీ. పరులసొమ్ము హరింపఁ బన్నినకర్మలు
వెలయవంచును విలపించునొకఁడు
జనులమూఢులఁజేయ నొనరించుకృపిఎల్లఁ
జెడిపోయెడునటంచు నడలునొకఁడు
వలదు విద్యయటంచుఁ బశువుఁజేయఁగనెంచు
వనితచదువునంచు వగచునొకఁడు
తలగొటిగించి వెతలఁబెట్టఁగఁదలంచు
నింతి సుఖంచునంచేడ్చు నొకఁడు
పసితనంబుననే పెండ్లి పొసఁగకున్నఁ
గూఁతు నెట్లమ్ముకొనునంచుఁ గుందునొకఁడు

వీరు పూర్వనాగరికులా పెద్దలిపుడు
దుష్కులాచార రక్షణోద్యోగులకట. 1

సీ. మగఁడుపోయిన భామ మరలఁ బెండ్లాడుచో
సొత్తుదక్కదటంచు సోలునొకఁడు
పతిపోయినయువతి పరిణీతయైనచోఁ
బనికత్తె లేదంచు వనరునొకఁడు
ధవుఁబాయుకాంత యుద్వాహంబునాడుచో
జారత్వమెట్లంచు సణగునొకఁడు
భర్తృహీనాంగన భర్తఁగైకొన్నచో
వ్రతములడఁగునంచుఁ గొతుకునొకఁడు
మృతపతికసాధ్విగా శిశుమేధయాగ
మూలదక్షిణపోనంచు మూల్గునొకఁడు
వీరుపూర్వనాగరికులా పెద్దలిపుడు
దుష్కులాచారరక్షణోద్యోగులకట ! 2

సీ. నీరజాక్షి చదువునేర్చుచో నరమాంస
విక్రయంబెట్లంచు వెఱచునొకఁడు
మానవతి విదుషియైనచో వెట్టినో
ములు పట్టుటెట్లంచుఁ బొక్కునొకఁడు
కమలాస్య సద్విద్యకఱచుచో ననుదేవు
నిగ్గనెంచుటెట్లంచుఁబొగులునొకఁడు
పికవాణి పాండితి మొరయుచో దెబ్బలు
పడుటయెట్లంచును బనువునొకఁడు
హంసయానవిద్యావతి యయ్యెనేని
ప్రతిమలనుగొల్చుటెట్లంచుఁ బదరునొకఁడు

వీరు పూర్వనాగరికులౌ పెద్దలిపుడు
దుష్కులాచారరక్షణోద్యోగులకట! 3

సీ. తరవాణిమున్నుగాఁ ద్రాగి శ్రాద్ధముపెట్టి
నిష్ఠాపరులమంచు నిక్కువారు
సంధ్యవార్చక చద్దిసాపాటుగావించి
కర్మిష్ఠులమటంచుఁ గవియువారు
కల్లుసంద్రములాది పేళ్లెన్నొవల్లించి
శాస్త్రవేత్తలమంచుఁ జాటువారు
కల్లుకంపడఁగంగఁ బెల్లుచుట్టలుత్రాగి
యూహితాగ్నులమంచు నడరువారు
న్యాయసభలయందుఁ దప్పుసాక్ష్యంబులిచ్చి
శిష్టజనవరిష్ఠులమంచుఁ జెలఁగువారు
వీరు పూర్వనాగరికులౌ పెద్దలిపుడు
దుష్కులాచారరక్షణోద్యోగు లకట! 4

సీ. బాలరండలకాశపడి చెడి విధవల
పెండ్లిండ్లు వలదంచుఁ బ్రేలువారు
రాళ్లఁగొల్చుచుఁదూలి బ్రహ్మంబుసేవించు
వారె భ్రష్టులటంచు వదరువారు
కన్నకూఁతుల నమ్మఁగాఁగోరి బాల్యవి
వాహముల్ మేలంచు వాగువారు
చాటునఁగల్లుత్రాగి చనుదెంచి తేయాకు
నీ రానువారి నిందించువారు
స్త్రీలవంచించి మించిబాధింపనెంచి
యబలలకువిద్య కీడంచునఱచువారు
వీరుపూర్వనాగరికులౌ పెద్దలిపుడు
దుష్కులాచారరక్షణోద్యోగు లకట! 5

# దైవప్రార్థన

ఉ. శ్రీకరుఁ డాద్యుఁ డవ్యయుఁ డశేషచరాచరకారణుండు సు
శ్లోకుఁ డతీంద్రియుండు పరిశుద్ధుఁ డనంతుఁడు మోక్షదాత లో
కైక సమర్చనీయుఁ డతఁ డెవ్వఁడొ యాపరమేశ్వరుండు తా
మా కనయంబుఁ బ్రేమమెయి మంగళముల్ సమకూర్చుఁ గావుతన్.

సీ. అక్ష్యాదిబాహ్యేంద్రియాగోచరుండయి
యాత్మస్వరూపుఁడై యలరువాఁడు
సచరాచరం బైనసర్వసృష్టికి నాది
కారణుండయి చాలఁ గ్రాలువాఁడు
దుష్టశిక్షణమును శిష్టరక్షణమును
నాత్మకృత్యములుగ నమరువాఁడు
సర్వజ్ఞుఁడై యుండి జనులెందుఁ గావించు
సుకృతదుష్కృతములఁ జూచువాఁడు
నిత్యుఁడీశ్వరుఁ డభవుండు నిర్మలుండు
మాదుపత్రికారత్నంబు నాదరమునఁ
బ్రబలఁగాఁజేసి యెల్లెడవాసికెక్క
నించుకంతదయ ననుగ్రహించుఁగాత.

క. పాపమిది పుణ్యమిదియని
యోపికఁ దెలియంగఁగోరు యోగ్యుల కెపుడుం
బ్రాపై చూపెడుదేవర
మాపత్రికఁ జదువువారి మనుచుం గృపతోన్.

సీ. ఎవ్వనియిచ్ఛమై నెల్లజగమ్ములుఁ
గలుగుచు వెలయుచుఁ బొలియుచుండు

ఎవ్వనికట్టసి నేప్రొద్దువిడువక
విచ్చునతికన్నులు వ్రేలుచుండు
ఎవ్వనిగానముల నెంతవలంతులుఁ
గడముట్టఁదెలియంగఁ గానకుండు
ఎవ్వని శాసన మించుకైనను మీఱి
మీఱక సంద్రముల్ మించినిలుచు
ఎవ్వఁడాకసంబున నేల నెల్లనీళ్ళ
ములఁగుపులుఁగుల మొగములమీలగముల
ఎగసరోరంబుఁ గలిగించి నెగడఁజేయు
నట్టిదేవర మమ్ముఁ జేపట్టుఁగాత.

పంచచామరము.

తలంచుచుందు మెప్డు మాకుతప్పులెల్ల లోఁగొనన్
జెలంగి తప్పువారిఁ ద్రోక్క చెడ్డవారిఁ ద్రుంచుచుం
దలంకు లేక మించి మంచివారియందె నిచ్చలున్
మెలంగుచుండువారి మంచుమేటి వేలుపుం దగన్.

మణిగణనికరము.

తుదమొదలొదవనిదొరఁ గొలుతుము మా
మొదలను బొదలెడు నెలమికలిమి మైఁ
గొదవలఁ దడవగ కొడుకులనువలెఁ
బదిలముగ నరసి పలుసిరులొసఁగన్.

ఉ. ఎవ్వఁడు జంతుసంతతుల నెంతయు బ్రేమనుగాచుచుండుఁ దా
నెవ్వఁడు నైజతేజమున నెల్లెడఁ బెల్లుగనిండియుండు దా
నెవ్వఁడు సాధుసంఘముల కెప్పుడు భుక్తిని ముక్తినిచ్చుఁ దా
నెవ్వఁడు నిర్వికల్పుఁ డలయీశ్వరుఁ గొల్చెద మిష్టసిద్ధికిన్.

క. చేసితి మఘంబులెన్నియొ । చేసితి ముద్ధతులతోడి స్నేహము నెన్నన్
దోసములు లేవె మాకడ । గాసిలనీక మమునేలు కారుణ్యనిధీ.

సీ. తనకృపారసవృష్టి దాసులతాపంబు
లణఁగించి నిగడింపు ఘనుఁడెవండు
తనదివ్యతేజంబునకు భక్తజనతమో
నిచయంబు మాయించునినుఁ డెవండు
తనశీతలాలోకమునఁ గువలయమును
వెలయించుచల్లని వేలుపెవఁడు
తనజగద్వ్యాపకత్వంబుమై లోకాళిఁ
బాలించు నలజగత్ప్రాణుఁడెవఁడు
అట్టిపరమేశ్వరుండు దయాసముద్రుఁ
డాదరాయత్తచిత్తుఁడై హర్షమెసఁగ
మాదువిన్నపమాలించి మఱచిపోక
మమ్ముననిశమ్మునుభృశమ్మునుచుఁగాత.

---

## హితబోధ

ఉ. కారణయుక్తమానటులు కావ్యవిమర్శనమాచరింపఁగా
నోరువలేక కూళకవియొక్కఁడు నోరికివచ్చినట్లు దాఁ
గారణహీనమైనవెడకాఱు లటంచును వానిఁ బ్రేలు ని
ష్కారణమాత్మదోషములు చాల బయల్పడె నన్నచింతచేఁ.

క. తనపుస్తకమే సత్కృతి । యనుకొని గుణదోషములను నారయువారిన్
వినరానికాఱు లఱచెడి । జనకంటకు మించునట్టిజడుఁ డిలఁగలఁడే ?

చ. కతిపయమిత్రసత్తములఁ గాంచి కడుం బొగడించుకొంటనే
యతులితసత్ప్రబంధ మగు నాచెడుపొత్తక మెన్నఁడేనియున్ ?
నుతు లొకలక్షమానుసులు నోరికి వచ్చినరీతిఁ జేసినన్
క్షితిశశకం బొకప్పుడును సింహము గాఁగలదే గుణప్రథన్ ?

అవంతీ ప్రెస్ - రాజమండ్రి.